శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy)**


సంపుటము ౧౭. విభవనామసంవత్సరము. చైత్ర వైశాఖమాసములు. సంచిక ౧





కాకినాడ

కొత్తపల్లి సూర్యారావుచేఁ బరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా { పోస్టేజివ్యయముతో సాంవత్సరమునకు రు. ౩. } { విడిసంచిక రు ౦-౮-౦

## ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరు వారు,
పిఠాపురసంస్థానాధీశులు [illegible]

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు జమీందారు [illegible]
శ్రీరాణీ వత్సవాయ వేంకట సుభద్రయ్యమ్మ జగపతిబహద్దరు గారు [illegible]
కీ. శే. శ్రీబొబ్బిలి మహారాజావారు

## ఆంధ్ర సాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

### అధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు బి.ఏ., బి.ఎల్.

### కార్యదర్శులు.

దర్భా వేంకటశివరామరాజుగారు బి.ఏ., బి.ఎల్.
కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం.ఏ., బి.ఎల్.

### కార్యనిర్వాహకసభాసభ్యులు

దివాన్ బహదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారు
(కోశాధ్యక్షులు.)

శ్రీ త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారు.
కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారు.
అనంతపంతుల రామలింగస్వామిగారు
దుగ్గిరాల వేంకటసూర్యప్రకాశరావుగారు బి. ఏ.
తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు
అకిశెట్టి వెంకట్రామయ్యగారు
కోట వేంకటసుబ్బారావు నాయుడుగారు
డాక్టరు వేమూరి రామకృష్ణారావుగారు ఎం. ఏ. ఎల్. టి. PH. D
ఓలేటి వేంకటరామశాస్త్రిగారు
పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు
పిళ్లారిసెట్టి రంగబ్రహ్మారావు నాయుడుగారు

# విషయసూచిక.



# పరిషత్ప్రయోజనములు.

---

తెలుఁగుభాషను, వాఙ్మయమును, అభివృద్ధి నొందించుటయు, ఆవిషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసంగుటయు నీపరిషత్తుయొక్క ప్రయోజనములు ఈపని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యీక్రిందఁ వ్రాయఁబడుచున్నవి —

1 తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచును లక్ష్యసహితముగ నర్థమును వివరించుచు సర్వాంకషమగు నిఘంటువొకటి రచించి ప్రకటించుట,

11 తెలుఁగుభాషకు సజాతీయేతర భాషలతోఁగల సాదృశ్యములను సామ్యములను నిరూపించుచు నొకవ్యాకరణమును రచించి ప్రకటించుట,

111 ఆధునిక శాస్త్ర గ్రంథరచనమునకు ప్రయోగింపఁదగిన సాంకేతికపదములను నిర్ణయించి వివరించు నొకశబ్దకోశమును సిద్ధముచేయుట,

1V ఆంధ్రదేశప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహ మొసంగుటయు, [illegible]లయి వానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారములసాహాయ్యమున సమగ్రముగాఁ దెలుఁగుదేశముయొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్ర మొకటి రచించి ప్రకటించుటయు,

V సర్వవిషయములను గుఱించి చేయఁదగు గ్రంథరచనకుఁ బ్రోత్సాహము నొసంగుట,

V1 ఆంధ్రభాషలోని మంచిగ్రంథములఁ బండితపరిష్కారము చేయించి నిర్దుష్టముగఁ బ్రకటించుట,

V11 తెలుఁగుభాషను వాఙ్మయమును సంబంధించిన [illegible] పత్రికను బ్రకటించుట,

V111 తెలుఁగువాఙ్మయమునకు సంబంధించిన విషయములను [illegible] చర్చించుటకుఁగాను సాంవత్సరికసభల నేర్పాటుచేయుట,

1X తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలఁ గావించి సాహిత్యోపాధులను, సాహిత్యపట్టములను, యోగ్యతాపత్రికలను, నొసంగుట,

X ఒక పుస్తకభాండాగారమును స్థాపించి సాగించుట ఇందుఁ బ్రాధాన్యముగా తెలుఁగు గ్రంథము లుండవలయును, ప్రాంత[illegible]లుగూడ నుండవలయును,

X1 తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికి సహాయకములగు నన్ని కార్యములను జేయుట

---

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

సంపుటము ౧౭ { విభవనామసంవత్సరము చైత్ర వైశాఖమాసములు. } సంచిక ౧

## తెలుఁగుపొలుపు.

—♦ కాశీభట్ట కృష్ణరాయశాస్త్రిగారు. ♦—

---

తెలుఁగనుపదము విన్నను గన్నను బ్ర॥శ్రీ॥ రావుసాహెబు గిడుగు రామమూర్తిపంతులుగారు నాస్మృతికి వత్తురు. వారివాదము నెఱుంగనివా రుండరు. ఇందు నాప్రార్థనమును బొందుపఱుతును. శ్రీ సీతాపతిరావుపంతులు గారు శిష్టసమితిసమక్షమున విస్మృతవాదమును బునరుజ్జీవింపఁజేయ నున్నా రని పత్రికాముఖమునఁ దెలిసితిని. నేను నీవిషయమున నుడుతబత్తిపగిది స్వల్ప వాక్యరచనామూలమున నాయభిప్రాయము తెలుపుదును.

ఊహము వెల్వఁడుటకు ముందు గ్రామ్యనిర్వచనము చేయుదము. శ్రీ పంతులుగారివాదము గ్రామ్యాంధ్ర మని తలంపవలదు. వ్యావహారికాంధ్రము విషయము వారివాదము. అయినను బాడితమండలిలో వాదోపవాదములు జరుగుచునేయున్నవి. ఉద్యమము సాగుచు వేయున్నది. ఇఁక వాదమర్యాదయే వివాదాస్పద మయ్యెను. కావున గ్రామ్యము నెఱుంగ నితరము విదిత మగును. 'వస్తాడు, తెస్తాడు' ఇత్యాదులు శ్రీవారికిని గ్రాహ్యములు గావని నాతో వా రన్నట్లు జ్ఞాపక మగుచున్నది. సరి యగునో కాదో విచారింతము. భాషా విషయమున గ్రామ్య మనియొకభాగముగల్గునా? అగుచో విచార్యముకాదా?

గ్రామ్యము:—భాషను, రసమున, వేషమున, సంఘకల్పితముల నన్నింట నీగ్రామ్యత్వము భాగమై యుండును. దాని గ్రహింపఁదగునా? శిష్టులు గ్రహింపవలదు. ఔచిత్యము ననుసరించి గ్రామ్యమును గ్రహింపవచ్చును. అట్లని

యన్నితావులను గ్రహింపరాదు. కావున నింద్యగ్రామ్యము ననింద్యగ్రామ్యమును నాఁగలదు. నింద్యగ్రామ్యమును దానిసే కొంచెము సంస్కరించి యనింద్యగ్రామ్యముగఁ జేయవలయును. శిష్టవ్యవహృత మయినదానిని గ్రహింపఁదగును. అట్లగుటఁ జింతామణికర్త గ్రామ్యశాసనమును గావించెను.

సూ॥ అనియమాత్ గ్రామ్యం హి యత్త్వపభ్రంశః॥

పైసూత్రము నేకవాక్యముగఁ గొందఱును రెండువాక్యములుగఁ గొందఱును బండితు లర్థముచేసిరి. ఏకశ్లోకమే యగుట నెట్లు చేసెఁ జెల్లును గాక. రెండువాక్యములుగ నన్వయము చేయుట సౌలభ్యము. చింతామణియంతట నిట్లే సంగ్రహముగఁ జిన్నచిన్నవాక్యములు గలవు. కావున మొదట 'అనియమాత్' అనుదానివ్యాఖ్యాన మరయుదము. నియమపదమున కర్థము విచారింతము. సంస్కారార్థము నియమ మని చింతామణియే చెప్పెను. నియమం టువు లరయ నేల? లౌకికార్థ మగునేర్పాటు, కట్టుపాటు, మొద లయినరీతి గ్రహింప వలను గా దని 'సంస్కారార్థో నియమః' అనువాక్యన్యాసమే చెప్పుచున్నది. అన్యార్థ మపార్థ మగును. సంస్కార మనఁగా శబ్దశుద్ధి యని వ్యాఖ్యాత లర్థముచేసిరి. సంస్క్రియ యన లెస్సచేయుట యగుట శబ్దశుద్ధి యనుట గ్రాహ్యము కావచ్చును గదా? పూర్వమునుండియు 'సంస్కార' పదము సమ్యక్కృతియం దుపయుక్త మగుట నిర్వివాదముగ 'శబ్దశుద్ధి' యని యర్థము సేయవచ్చును. 'సంస్కారార్థ' అనునప్పుడు 'సంస్కారప్రయోజన' మని యర్థము. సంస్కారవంత మనుట యని యందురు. సంస్కారార్థ మనఁగా సంస్కారవంత మని యర్థము సేయఁదగదు. సంస్కారవంతము శబ్దాదిక మగును గాని సంస్కారప్రయోజనవంతము నియమ మని యర్థ మగును. బహువ్రీహిసమాసముగాని తద్ధితముగాదు. ఇఁక నర్థము సేయవచ్చును.

వ్యా॥ అనియమాత్ నియమాభావాత్ గ్రామ్యం, గ్రామ్య మితి పారిభాషికం పదం, నకేవలం గ్రామీణభాషిత మితి, యత్పద మసంస్కృతం నియమరహితం, తత్ గ్రామ్యం భవతీతి మూలే 'గ్రామ్యశబ్దార్థనిర్వచనపూర్వకానియమా' దితి పదప్రయోగాత్ జ్ఞాయత ఏవ. తదేవ శిష్టహృదయమ్. పామరవ్యవహారైకప్రసిద్ధం గ్రామ్య ముచ్యత ఇతి ప్రతాపరుద్రీయస్యా ప్యేవ మేవ హ్యేకపదప్రయోగాత్. పామరైకగమ్యం రమ్యం నఖలు అతః గ్రామ్య మేవ స్యాత్, మూర్ఖాద్యాదీనా మాశయో ఽప్యేషఏవ. లోకమాత్రప్రయుక్తం గ్రామ్య

మితి లోకే ఏవ యత్ప్రయుక్తం సదా నశాస్త్రే తద్గ్రామ్య మితి చ శిష్టోదితం భవతి. హి ప్రసిద్ధౌ హేతౌ వా. అత ఏవ కారికావళ్యుక్తమ్ "పామరాదిప్రయుక్తం య త్త ద్గ్రామ్య మభిధీయతే", ఇతి ఆదిశబ్దేన భ్రాంత్యాదయః జ్ఞాతవ్యా ఇతి వ్యాఖ్యాత మపి 'గిత్రిశీర్షే శిరఃక పీత్యాది, పారకాదమాశ్చ గృహ్యంతే. పామరప్రయుక్తం సర్వం గ్రామ్యం నభవతి కింతు సర్వం గ్రామ్యం పామరాదిప్రయుక్త మేవ. పామరప్రయుక్తస్య గ్రామ్యస్య కథంగ్రాహ్యత్వం భవేత్ నియమా దితి ధ్వన్యతే తస్మాత్ యావ న్నియమః తావ న్నగ్రాహ్యః, నియమస్య కార్యం న స్మరణ మేవ న నిషేధమాత్రం గ్రాహ్యతాసంపాదనం భవతీతి పిండితోర్థః॥ అ। వ్యా। పా। ౮॥

ఇట్లు వ్యాఖ్యాత మగును. ఇఁక నపభ్రంశపద మాలోచింపఁదగును. గ్రామ్యమే యపభ్రంశమా ? వేఱా ? చింతామణికర్త్రభిప్రాయము పిమ్మట నరయుదము. ఇతరాంధ్రవైయాకరణుల యభిప్రాయము నిట నవలోకింతము.

శ్లో॥ సమ్మూలవత్త్వా ద్రూఢత్వా ద్గృహీతత్వాచ్చ సాధుభిః।
నాపభ్రంశత్వ మేవస్యా న్నియమాభావత స్తు తత్॥

అని యథర్వణకారికావళి చెప్పుచు "పామరాదిప్రయుక్తం య త్త ద్గ్రామ్య మి త్యభిధీయతే" గ్రామ్యమును గుఱించి యుఁ జెప్పెను. అపభ్రంశము గ్రామ్యము నొక్కటి యను నాశయ మున్నట్లు తోఁపదు. అపభ్రంశమునకు 'నియమాభావతస్తు తత్' అనియు గ్రామ్యమునకు 'పామరాదిప్రయుక్తం' అనియు సూత్రద్వైవిధ్య మంట నాయూహము సరియగునేమో? ఆంధ్రభాషాభూషణుఁడు గ్రామ్యమును మాత్రమె పేర్కొనెను. ఇట్లే మఱికొందఱును వాడిరి. చింతామణి వ్యాఖ్యాతలు పేర్కొన్నను జింతామణిమాట లనియే స్మరించును. కారికావళి యట్టిది గాక యించుమించు స్వతంత్రవ్యాకరణ మగును. అన్నింటికంటె నథర్వణునిశాసన ముపాదేయ మగును. చింతామణి యనియమమువలన గ్రామ్యమగుఁగదా యని చెప్ప నియమాభావమువలన నపభ్రంశమని యథర్వణుఁడు చెప్పెను. ఇద్దఱును భిన్నించినట్లు తెలియుచున్నది గ్రామ్యాపభ్రంశముల నెత్తి చర్చించినవా రాంధ్రులలో వీరే. అన్యోన్యవిరుద్ధనిర్వచనములును వీరియందే యున్నవి. కావున విమర్శింపఁదగును.

అపభ్రంశ మన నేమి?:— నియమాభావమువలన నపభ్రంశత్వ మగు ననిరి. మఱియు

శ్లో॥ చండాలయవనాదీనా మపభ్రంశః ప్రయుజ్యతే
నాటకాదావపభ్రంశ విన్యాసస్యా సహిష్ణవః
అన్యే చండాలనారీణాం మాగధ్యాది ప్రయుంజతే।
ఇత్యాది గలదు. అపభ్రంశత్వమును గణించి ప్రాచ్యులిట్లు వివచించిరి.
"ఆభీరాదిగిరః కావ్యే ష్వపభ్రంశ ఇతి స్మృతాః
శాస్త్రేషు సంస్కృతా దన్య దపభ్రంశత యోదితమ్" (కావ్యా)

ఇత్యాది వాక్యము లరయ గ్రామ్యము నపభ్రంశము నొక్కటి యని యనుటవలనిది యగును. అపభ్రంశ మని ప్రత్యేకముగ నొకభాషకు నామము గా నుండి క్రమక్రమముగ సంస్కృతేతరభాషల కెల్ల నీనామము వచ్చినట్లు తెలియుచున్నది. నాటకముల నీయపభ్రంశము చండాలయవనాదుల కుప యోగ్య మని పాత్రభాషౌచిత్యముగ నార్యు లనిరి. ఆంగ్లపరిశోధకులుం గూడ నపభ్రంశవిషయమున నాయన్నట్లే యనిరి. ఆరయుడు-

The next and the last stage of the secondary prakrits was that known as 'Literary Apabhramsa, 'Apabhramsa' meaning 'Corrupt' or 'decayed' was the title given by Indian grammarians after the prakrits had begun to recieve literary culture to the true vernaculars on which these polished literary dialects were founded

Empire of India, VII Chap Languages.

ఆంగ్లాభిప్రాయము యథాక్షరముగ నాకుం బ్రమాణము గాకున్నను గొంతదాకఁ నుపాదేయ మగుట నుల్లేఖించితిని. ఇంకను గలదు. ఆర్యపికు లరయవచ్చును ఆంధ్రవిదు లాంధ్రసర్వస్వ మనుమాసపత్త్రికలో 'మనదేశ భాషలు' అనుపేరివ్యాస మరయుడు మక్కికి మక్కిగ నాంగ్లానువాదము గలదు. పర్యవసన్న మే మన నపభ్రంశము గ్రాంథికేతర మనవలసివచ్చుచు న్నది. అయినను బ్రత్యేకముగ నొకభాషగ నుండుటచే గ్రామ్యమువంటిది కాదన వలయును. కావ్యప్రకాశికాకర్త యపభ్రంశము నెత్తక గ్రామ్యము నెత్తెను. గల్లాదిశబ్దము లుదాహరించెను. నాటకాదుల నపభ్రంశ ముపయోగింప నిష్ట పడక యర్ధమాగధ్యాదులఁ బ్రయోగించిరి. మఱియుఁ జక్కగ నీభాషాలక్ష ణమును నిర్వచింపలేము. హాజ్మయ మరయ నీయపభ్రంశము సార్థకముగ దు ష్టశబ్దములకుఁ బేరైయున్నట్లు తెలియుదుము పతంజలిముని యభిప్రాయము నిది యె. కావ్యప్రకాశికాకారుని యభిప్రాయముగొంచెము భిన్నించినట్లున్నది. గ్రా

మ్యాపభ్రంశము లొక్కటి యనుకొనెను. అట్లనరాదు. శబ్దముల వైవిధ్యము నరసి గ్రాహ్యాగ్రాహ్యముల నిర్ణయించునది యని భాషాభిప్రాయము. పాణిన్యాచార్యులవారి యభిప్రాయము శబ్దసురూపత దేశభేదము నున్నగునానిఁ దెల్పవలయు ననియు నుచిత వాటిఁగి గ్రహింపవలయు ననియు నై యున్నట్లు తెలియును

ఇది యీ శ్లోకమునఁ జింతామణి యే లనినదియో స్పష్టము కా లేదు. వ్యాఖ్యాత లందఱు నొక్కటి యనిరి. కాని బ్ర॥ శ్రీ॥ పారనంది రామశాస్త్రిగారు "గ్రామ్యశబ్దమున కపభ్రంశము" అని యనిరి. గ్రామ్యమార్గమనియు శాబ్దమనియుఁ జెప్పిన సందర్భమున వాక్రుచ్చిరి కాని చిన్తామణియాశయమది యగునో కాదో? చింతామణికాలమునకు సంస్కృతేతరభాషలకు నపభ్రంశత్వము సిద్ధమైనది. ఆంధ్రాదిభాషల కెల్ల నపభ్రంశత్వమనివార్యముగ సిద్ధింపఁ దన్నివారణము చేసెను.

మూ॥ యత్త్వపభ్రంశః॥ యత్ । తు । అపభ్రంశః । యత్ యస్మాత్ కారణాత్ అపభ్రంశః । అపభ్రంశ ఇతిసం నియమాభావాదేవ స్యాత్ । తు । అపితు సనవియమ్యత ఏవా తయే వానియమా దితి నఞ్ప్రయోగః కృతః పూర్వే గ్రామ్యపక్షే త్రిలింగభాషాయాః సన్నయాదికాలేషు గౌరవమ్ నసురూఢం చ చింతామణినాప్యుక్తమ్ స్వస్థానవేషభాషాభిమతా ఇతి నైకృతకావ్యాదిచేతి చ అద్యాపి కేషువి ద్విప్రగృహేషు త్రిలింగభాషాం పితృదినేషు నోచ్చరే దితి ధారణాస్తి. మను గృహే స్వైరమేవ .. ఆంధ్రవ్యాక॥ పా॥ ర॥

ఇట్లు వ్యాఖ్యాతమై యుంట నరయవచ్చును. అపభ్రంశ మిద మిత్థమని తేలకున్నను నాంధ్రాదిసంస్కృతేతరభాషలకు నపభ్రంశభాషలని పేరు గలదని యనవచ్చును.

అథర్వణునియభిప్రాయము నొకింత విమర్శింతము. సమ్మానవత్త్వము, రూఢము, సాధుగృహీతము నగుటచే నాంధ్రంబునకు నపభ్రంశత్వము లేదని నొక్కి చెప్పెను. నియమము లేమి యపభ్రంశత్వ మని నిశ్చయించెను. దీనిం బట్టి చూడ నథర్వణునినాఁటికి నాంధ్రభాషకు నపభ్రంశత్వము సాంస్కృతికులచే నాపాదితమై యుండె ననియుఁ దన్నివారణమె కార్య మనియుఁ దెలియు. అపభ్రంశము నియమాభావమువలనన కాదు. మూలరూఢాదులును గారణములు. నియమము లేకున్నను సమ్మానము, సురూఢము, సాధుగృహీతము న

గుచో నది యపభ్రంశము గానేరదు. మఱియు నియమరహితముగ నాంధ్రము లేదుకదా? అని తనయభిప్రాయము వివరించెను. కాని యధర్వణునిమతమున నపభ్రంశము, గ్రామ్యము నొక్కటికాదు. అదియే భాషానేతల యభిప్రాయము. జాతి, భేదమును బట్టి వచ్చినయొకభాషకుం బేరు గాని వ్యాకరణాభావమును బట్టి వచ్చినభాషకుం గాదు. అయినను నపభ్రంశమునకు వ్యాకరణాభావము సంభవించుచు నుండెను ప్రాకృతపైశాచికాదిభాషలకు వ్యాకృతు లున్నను మధ్యకాలమువారు గీర్వాణేతరమూలయు నపభ్రంశమని యొక్క సులభసూత్రమును నిర్మించిరి

అధర్వణాభిప్రాయమే ప్రాచీనసమ్మతమై యున్నది. ఆంధ్రభాషకు నపభ్రంశత్వ మున్నదా లేదా యనునది విమర్శ్యముగాదు. కాని వారిసూత్రముల నన్వయించుకొనుట మనపని. కావున నధర్వణునిమతమున నపభ్రంశము గ్రామ్యము గాదు. చింతామణినన్నియమతమునను గూడం గాకున్నను ననియమము వలనగ్రామ్య మని యది యపభ్రంశము కదా యని యనెను, కావున నిరువురు స్థూలదృష్టిని భిన్నించినట్లున్నను సూక్ష్మదృష్టిని భిన్నించనివారే యగుదురు.

అపభ్రంశము:—శబ్దార్థమును బట్టి యాలోచించుట శాస్త్రమర్యాద గాకున్నను నదియును బ్రబల మగుచో నమర్యాద గాదు. అపభ్రంశ మనునది పారిభాషికపదము. కొన్నిజాతిభాషలకు వైయాకరణు లిడిననామము. ఆజాతి వారు తమభాషను జాతినామముతోం బిలిచికొని యుండవచ్చును. ఏనాది యెఱుకులు మున్నగువారు నానాసాంకర్యముగ మాటలాడినట్లు చాండాలాదులు ప్రాకృతములను వాడి యపభ్రంశమును గావించిరి. అన్నిభాషలు నొక యొకమూలమునుండి భ్రంశమైనవియే అయినను గొన్నిరూపములై వర్తిల్లును. మఱి కొన్ని యంతరించును. గ్రామ్య మపభ్రంశ మని యనం జనము [illegible]లుచున్నది.

వ్యాకరణాభావము నపభ్రంశత్వమునకుం గారణ మని కారికాభిప్రాయము. అగుచో వ్యాకరణము గలదెల్ల నపభ్రంశము కాదను నభిప్రాయము లబ్ధము కాదని యెఱుంగవలయును. అప్రసిద్ధాదులును నపభ్రంశత్వమునకు హేతువులు. ఇంకను దర్కము హెచ్చగును. పూర్వపూర్వాభిప్రాయము లరయ నపభ్రంశము నియమితజాతిభాష యని తెలియంబడును. కాని గ్రామ్య మపభ్రంశ మని తెలియంబడదు. కాలక్రమమున గ్రామ్యము నపభ్రంశ మొక్కటి యని

వాడఁబడెను. కాని విమర్శింప నపభ్రంశము ప్రత్యేకభాషగను గ్రామ్యము ప్రత్యేకభాగముగను భాషైకదేశముగను నిశ్చయింపఁబడును. అష్టభాషావిభాగమునను గాని షడ్భాషావిభాగమునను గాని గ్రామ్య మని లేదు. అపభ్రంశమే కలదు. అది భాషాసాహచర్యమున నున్నది కాని భాషాంతర్భాగసాహచర్యమున లేదు. కావున నపభ్రంశ మన గ్రామ్యము గాదు. గ్రామ్యస్వరూపము తెలియవలయును.

గ్రామ్యము :—పూర్వులు దీని నేభావమునఁ బిలిచిరో పరికించి సిద్ధాంతమునకు వత్తము. రామాయణమున వాల్మీకి "అగ్రామ్యవత్పద" మ్మని ప్రయోగించెను. అపశబ్ద మని యర్థము. పతంజలిప్రభృతిశాబ్దికులు నపశబ్దమునుజాల గర్హించిరి. గోశబ్దమునకు గావీ, గో, ణీ, యిత్యాది లపశబ్దములు గల వని పతంజలి తనభాష్యమునఁ జూపెను. ఇవి యన్నియు నపభ్రంశము లని యనెను.

అపశబ్దమును, నపభ్రంశమును, గ్రామ్యమును నేఁటి కేకార్థబోధకము లయినవి. సూక్ష్మముగ నరయ నట్లై యగును గాని యపభ్రంశముమాత్రము గ్రామ్యమువంటిది గాదు. అపశబ్దమును గ్రామ్యము గాదు. ఇఁక గ్రామ్యమన నపశబ్దము నపార్థము నపభ్రంశము నగును. ఆలంకారికులు నిట్లే యనిరి. మన కిప్పుడు శాబ్దము ప్రధానము గావున శాబ్దగ్రామ్యమును వివరింతము.

స్వగణము, శ్వగణము, కాఁగూడ దనియు వర్ణత్వప్రాప్తదోషమును మఱియు స్వరాదివికారజదోషమును శాబ్దికులు ప్రదర్శించిరి. ఆలంకారికులు విశేషముగఁ జెప్పిరి. దాడి చెప్పినదాని నరయుఁడు. శ్లో॥ శబ్దేఽపి గ్రామ్యతాస్త్యేవ సా సభ్యేతరకీర్తనాత్ । యథా యకారాదిపదం పత్యుత్సవనిరూపణే । పదబంధానువృత్త్యా వా వాక్యార్థత్వేనవా పునః। దుప్రతీతికరం గ్రామ్యం యథా యాభవతః ప్రియా । ఇత్యాదిశాసనము గలదు. 'యాభ' అనుస్థలమున నపార్థ మిచ్చు పదయోజన ముంట శబ్దగ్రామ్య మనెను. గల్లాదులు గ్రామ్యము లనియు ననిరి. అహోబలుఁడు గల్లాదిశబ్దములు ప్రాకృతవ్యాకరణనిష్పన్నము లయ్యు గీర్వాణమధ్యస్థము గామి గ్రామ్యం బే యనియనెను. అరయనరయ శబ్దయోజనము నన్యభాషాప్రయోగము గ్రామ్య మని యాలంకారికులమత మైనట్లు బోధపడును. అపశబ్ద మని శాబ్దికుల మతము.

వ్యాకరణదుష్ట మగుచో "చ్యుతసంస్కార" మని యందురు. పామరవ్యవహారైకప్రసిద్ధము గ్రామ్య మనియు ననిరి. కావ్యదోషములలో గ్రామ్య

మొకదానిఁ జెప్పిరి. కావున గ్రామ్యము దోషమే యనఁదగును. కాని యాంధ్రులు గ్రామ్యనిర్వచన మెట్లుగావించిరో, వినియున్నారు కదా? నియమరహితము, లక్షణవిరుద్ధము మున్నగునవి గ్రామ్యలక్షణము లని యనిరి. గ్రామ్యపద మని పదదోషములఁ జెప్పిరి. ఇట్లుండ భాషైకదేశ మగుటను విచారింతము.

ఆంధ్రభాష:— సూ॥ తజ్జా సమాచ దేశ్యా గ్రామ్యా చేయం చతుర్ధా భవతి। ప్రకృతిద్వయజా తజ్జా తుల్యాతు సమా ప్రవాహినీ దేశ్యా॥

చింతామణిసూత్రము గలదు. గ్రామ్యము నొకభాగముగఁ జెప్పెను. కాని దోషప్రకరణముగఁ జెప్పలేదు. ఆంధ్రు లందఱు నీనాల్గువిధముల విభాగమునకు సమ్మతించిన వారలే కదా? ఇఁక గ్రామ్య మెట్లు తొలఁగింతుము? తజ్జమును, సమమును, దేశ్యమును నెట్లు గ్రామ్య మని సమ్మతించితిమో గ్రామ్యమును నట్లే సమ్మతింపవలయును ఇది శాసనాభిప్రాయము. అగుచో నిషిద్ధపద మేది యని ప్రశ్నింతురేని యాలంకారికులఁ బ్రశ్నింపుఁడు. వైయాకరణుని ధర్మము భాషాస్వరూపనిరూపణము, ప్రకృతిప్రత్యయవిభాగరూపలక్షణలక్ష్యము మున్నగునవి. అది లెస్సగఁ జేయఁబడెను. శాస్త్రకర్తలు విధించుట నిషేధించుట యను రెండపనులు సేయుదురు నిషేధమునుబట్టి పదముల సాధుత్వాసాధుత్వములను గ్రహింతుము. తరువాత దేశమునుబట్టి యెట్లు మాఱునో యట్లు మాఱితీఱును. శబ్దములు లౌకికము లనియు వైదికములనియు రెండువిధములుగ సంస్కృతవ్యాకరణమునఁ జెప్పుటవలనను రెండును బ్రయోగ్యములై ‘ఛందసి, యని విధింప లౌకికంబున నివారితమయ్యెను. కర్ణేభిః, అని వేదమున నుండ లోకమునఁ గూడఁ గర్ణేభి, యని ప్రయోగింపఁ గాదు. వ్యాకరణసాంప్రదాయ మట్లున్నది. వ్యాఖ్యాతలు స్పష్టపఱచి కొన్నిదోషపదములను జూపుదురు. అష్టాధ్యాయిలోఁగాని ప్రాతిశాఖ్యలలోఁగాని దోషప్రకరణ మని లేదు. మఱియు భాషాభాగములనుఒప్పుచు దోషమును జెప్పుటేల? తజ్జాదులు గ్రాహ్యము లైనట్లు గ్రాహ్య మే యని యన్వయము చేయవలసి వచ్చునేమో? చింతామణ్యభిప్రాయ మది యగునా కాదా తరచిచూతము. “అనియమా ద్గ్రామ్యంహి అనుస్థలమున” గ్రామ్యం అని నపుంసకలింగములోను “గ్రామ్యా” అని తజ్జాదిసందర్భమునను బ్రయోగించెను. ఈ రెండుపదములు సమానార్థకములా కాక పారిభాషికములా భిన్నార్థకములా యనునది విమర్శము. (సశేషము)

# పెద్దనకావ్యరచనానైపుణి.

—— కేతవరపు వేంకటశాస్త్రిగారు ——

గతసంవత్సరమున నీయాంధ్రసాహిత్యపరిషత్సభావేశమున గ్రంథవిమర్శనపద్ధతి యనువ్యాసమును వ్రాసి చదివితిని. అందుఁ బెద్దనకవి మనుచరిత్రమును విమర్శించి నావ్యాసమున కుదాహరణము గావించితిని. ఆవ్యాస మతిదీర్ఘ మగుటచే నందుఁ గొన్నియంశములు విడువవలసి వచ్చెను. ఆవిడిచినయంశములనే నేఁడు పెద్దనకావ్యరచనానైపుణి యనుశీర్షికతో నొకవ్యాసమును రచించితిని.

కొందఱు విమర్శకులు మనుచరిత్రమున మొదటి మూఁడాశ్వాసములందలి కవిత్వము మాత్రమే మిక్కిలి రసవంతమై యున్న దనియు, నుత్తరాశ్వాసములందలి కవిత్వము మొదటిభాగమం దున్నకవిత్వమంత రసవంతమై యుండలే దనియుఁ గావుననే చదువరులు మనుచరిత్రమున మొదటిమూఁడాశ్వాసములను మాత్రమే చదివి విడుతు రనియుఁ దమయభిప్రాయమును వెల్లడించి యున్నారు. ఆవిమర్శకుల యభిప్రాయము యుక్తియుక్తము కా దని సోదాహరణముగా నిరూపించుటయే నావ్యాసముయొక్క ముఖ్యోద్దేశము.

పెద్దన కాంధ్రకవితాపితామహుఁ డనుబిరుదము కలదు. ఆబిరుద మిప్పటి బిరుదములవలె నాశ్రయణసామర్థ్యమువలన సంపాదింపఁబడినది కాదు. తనకవితాసామర్థ్యమునఁ గృష్ణరాయలను, దదాస్థానపండితులను మెప్పించి యాబిరుదాలంకారమును సత్కృతిగా నొందియున్నాఁడు. మనుచరిత్రమును బరిశీలనదృష్టితోఁ జదివినవారి కాకవీంద్రున కాబిరుదము మిక్కిలి తగియున్న దని తోఁపక మానదు. సృష్టియందుఁ జతుర్ముఖునివలెఁ బెద్దనకవి కవితాసృష్టియందుఁ దనయనుపమేయచాతురీవిశేషమును బ్రతిచోటను వెలయించినాఁడు. ఏవంకఁ గాంచినను గమలాసనుని సృష్టి యభినవమై యద్భుతాంశయుతమై కానవచ్చినభంగిఁ బెద్దనకవితారచనలు ప్రతిస్థలమందును బ్రతివర్ణనమునందును, నభినవరీతుల నొంది సరసజనహృదయంగమములై యున్న వనుటకు సందియము లేదు. ఇట్టికవితాధురంధరుఁ డగుటంబట్టియే యాయాంధ్రభోజుని సభాసీమను, నక్కవిదిగ్గజములసమక్షమున నట్టిగొప్పబిరుదము నొందఁగల్గెను. ఇఁక నీయంశమును వదలి ప్రకృత మనుసరించెదను.

పెద్దనకవీంద్రుఁడు మనుచరిత్రమునందు మొదటియాశ్వాసత్రయమునందువలెనే తక్కినయాశ్వాసములందుఁ గూడ వర్ణనములందును, గల్పనాచాతుర్యమునందును రసపోషణమందును దననిరుపమానశక్తిని వ్యక్తపఱిచియున్నాఁడు. అట్లయిన మొదటిభాగమును జదివినట్లు తక్కిన మూఁడాశ్వాసములను బాఠకులేల చదువర”ని యడుగుదురేని వినుఁడు. లోకము భిన్నరుచులు గలది. ఒక్కొకరి కొక్కొకరస మిష్ట మగును, కొందఱు శృంగారము సర్వరసశ్రేష్ఠ మందురు. కొందఱు వీర మందురు. కొందఱు శాంత మందురు. ఎవ్వరి కేరసము ప్రియమై యుండునో వారు తద్రసగుంఫితము లగుపద్యములను సర్వదా పారాయణము చేయుదురు అట్టివారు తదితరరసమయము లగుపద్యములను బాటింపరు. కొందఱు శృంగారరసమయపద్యములను జదివి హాయిహాయి యందురు. కొందఱు గరుణరసప్రధానము లగుపద్యములను జదివి యానందింతురు. మఱికొందఱు శాంతరసాభివ్యంజకము లగుపద్యములను గంఠస్థముగాఁ జేసికొని వర్తింతురు. ఇది పాఠకులకు నైసర్గికధర్మము. ఇట్టిపాఠకులు నానారసప్రచుర మయినను గావ్యమందు దన కింపయినభాగము చదివి తక్కినది వదలివేసినచో నంతమాత్రమున నది రసహీన మని సిద్ధాంతము చేయవచ్చునా? శాంతరసాభిలాషునకు శృంగారమయపద్యములు వెగటు పించినంతమాత్రమున నవి రసహీనము లనవచ్చునా? గ్రంథకర్త తనకావ్యమునందుఁ బలురసములు చొప్పించి వర్ణించియుండును. మఱియుఁ గవి తనకావ్య మంతయు రసవంతమై యుండుటకే యత్నించును గాని యొక్కచోఁ దనప్రకర్షమును జూపి తక్కినభాగమును వదలివేయఁడు. అట్లు చేయుట కవి ధర్మము కాదు. కావున నొకరసవత్తరకావ్యమునం దుత్కర్షాపకర్షములు చదువరుల రుచిభేదమునుబట్టియే గల్గుచున్నవి. కాని కవీంద్రుని ప్రయత్నలోపమునుబట్టి కాదు. వయస్సునుబట్టి కొందఱికవిత యించుక మార్పు చెందినఁ జెందవచ్చును. కాని కూలంకషప్రజ్ఞావంతులును సమర్థులు నగుకవిపుంగవులకవిత్వమున కట్టిమార్పు కలుగ జాల దని నాయభిప్రాయము. పెద్దనకవి మొదటియాశ్వాసములలో శాంతశృంగారములకు ద్వంద్వయుద్ధము కల్పించి తుదకు శాంతమునకు జయము కల్పించినాఁడు. ఉత్తరాశ్వాసములం దిట్టియుద్ధము కల్పింపలేదు. కాని శృంగారశాంతములను వేఱువేఱుగాఁ జక్కగా వర్ణించినాఁడు. అంతేకాక వీరభయానకాదిరసములను గూడఁ జక్కగాఁ బ్రవహింపఁజేసియున్నాఁడు. ఈవీరరసాదివర్ణ

నములు రుచిదోషమునఁ జేసి కొందఱు విముఖు లయినచో నది పెద్దనగారి దోష మగునా? ఆవర్ణనములను గొన్ని యుదాహరించెదను.

స్వారోచియౌవనారంభమును దెలుపు నీపద్యమును దిలకింపుఁడు.

స్రగ్ధర— గ్రుద్దన్ గోత్రాచలంబుల్ గులగులలయిపో గోతముల్ గ్రుమ్మలీలన్
ఖడ్గిం జెండాడు న్రూకుల్ గవుగిటికొలఁదుల్ కత్తి నొక్కొక్కఘాతం
బ్రోద్దామప్రౌఢి వాతాద్భుతగతిఁ బఱచన్ భూమిజవ్వాడఁగా ని
ట్లద్దేవీనందనుం డత్యనుపమబలుఁడై యౌవనారంభవేళన్.

ఈపద్యమునం దెట్టిలోపమును లేదు. యౌవనారంభమునందు స్వారోచి వీరకృత్యము లింకు వర్ణింపఁబడినవి. ఈపద్యము వరూథినీశృంగారచేష్టావర్ణనముతోఁ బోల్చి రసహీన మనవచ్చునా? అది కొందఱకు రుచించును, ఇది కొందఱకు రుచించును ఇందుఁ బెద్దనకవితాశక్తిలోప మేది?

కవి యొకచో వర్షమును వర్ణించినాఁడు. ఆవర్ణనము చదువునపు డచ్చముగాఁ జదువరులకు వర్షము గురియుచున్నట్లే తోఁచునుగదా?

కం. కరకాచిటపటరవభీ, కరమై పెళపెళ నినాదఘనమై ఝుంఝూ
మరుదుజ్ఝితబిలమంద్ర, స్వరమై యక్కొండ నొక్కవర్షము గురిసెన్.

మఱియు నిక్కవి వరాహవర్ణనమును మిక్కిలి నైసర్గికముగాఁ జేసియున్నాఁడు.

సీ. కంమూత్రిక్కైరాయుఁ గర్కశంబగు తుంటెఁ బీటనెట్టినమ్రూతి పెల్లగిల్ల
చెవిదార్చి విని చేను చిటుకన్న నొకసారి సెలవిపెంపరలాఁడు జిట్టలెల్ల మొ,

చిత్రపటమునందువలె వరాహము లీపద్యమం దెట్లు ప్రతిబింబించుచున్నవోఁ చూడుఁడు. మఱియు నీపద్యము సరసపదయుతమై వ్యర్థపదరహితమై యొకపదమును దొలగించుటకుఁ గాని లేక చొప్పించుటకుఁ గాని యవకాశము లేక యొప్పిదమై యున్నది. ఇది శృంగారరసాభిలాషులకు రుచింపకపోవుగాక, సంతతము మృగయాసక్తిగల వీరుల కెట్లుహృదయంగమ మగునో చెప్పవలయునా? ఇట్లె శునకవర్ణనముగూడ మిక్కిలి సరసముగా నున్నది.

సీ ఇవి కఁరపాశంబు లింతమున్నిన మీఁదఁబడి దిశాకరినైన గెడపఁజాలు
నివి మింటఁ బఱమపక్షీంద్రుఁ జూపిన నీడబడి వాలునందాఁకఁ బఱవఁజాలు
నివి గాలికనిన మూకవరాహదనుజేంద్రునైన జుట్టొంటిలో నాఁగఁజాలు
నివి కాటుకొల్పిన వృద్ధకూర్మమువీఁపుఁజిప్పైన నెఱచిక్కైఁ జింపఁజాలు

గీ. పనఁగ ఘుర్ఘురగళగర్తజనితభూరి, భూభృదురుబిలభరితభౌభౌభయంక
రార్భటీదీర్ణదిగ్భిత్తు లగుచుఁ జెలఁగె, సరిపెనలఁబట్టి తెచ్చిన జాగిలములు.

వందలకొలఁది ద్రవ్యంబు వెచ్చించుచుఁ దమప్రాణములకంటెఁ గూడ నెక్కుడుగఁ జూచి పెంచుచుఁ దత్సహాయమున వేఁటాడు వేఁటకాని కీపద్య మెంతహృదయంగమముగా నుండునో చెప్పవలయునా ? ఇది శాంతరసమయ పద్యాభిలాషికి వెగటనిపించినచోఁ బెద్దనకవి లోపమగునా ?

వేఁటకై చొపఁబడిన యరణ్యవర్ణన మెంతసరసముగా నున్నదో యెంత స్వభావసిద్ధముగా నున్నదో పరిశీలింపుఁడు.

మ. చకితైణాహుతిదావ మావళితపుచ్ఛస్వల్పగచ్ఛత్తర
క్షుక మద్రిగ్రహయూథభల్లుకము వక్షోభాగనిక్షిప్తశిం
భకవల్గత్ప్లవగీకదంబము స్ఫురదాంభఃప్రోద్ధితక్రోడనా
యక మాభీలముఖద్విపిస్థపుటితం బయ్యెన్ వనం బత్తఱిన్.

ఇది చదివినంతమాత్రమునఁ జొపఁబడినవనస్వరూపము చదువరుల హృదయదర్పణములందుఁ బ్రతిఫలింపక మానునా ? ఈ పద్యము తపోనిష్ఠా గరిష్ఠుఁ డగుయతికి వెగటుగా నున్నను, దఱచుగా నాఁటము సల్పు నృపుల హృదయముల కెంతరంజకముగా నుండునో చెప్పవలయునా ? మఱియు మృగయావిధానమును మృగములస్వభావములను, వేఁటాడుకీతులను గవి యిందుఁ జక్కగా వర్ణించెను. ఆకాలపువీరుల మృగయాప్రోత్సాహమును గను నించియె పెద్దనకవి మూలగ్రంథములో లేనివేఁట నిందుఁ గల్పించి సరసముగా వర్ణించినాఁడు. దీనిని శుద్ధశ్రోత్రియుఁ డిష్టపడకపోయినను నీరపుంగవులు మె చ్చుకొనక మానరు.

సీ. విసుమానములుగాఁగ వసకోడఁ బెనవెట్టి నెట్టెంబుగాఁ ద్రిప్పి చుట్టినాఁడు
బుడికందెనచాయ బైసిమాలినమేనమెదడుగందపుఁబూఁత మెత్తినాఁడు

మిక్కిలినిపుణు డయినఁ జిత్రకారుఁడు రెండుమూఁడుప్రధానరేఖల గీసి సులభముగా రూపము నేర్పఱిచినట్లు పెద్దనగారు రాక్షసుని వికృతాకార ము నిందుఁ జక్కఁగా వర్ణించి ప్రతిరూప మేర్పఱిచినారు.

మఱియుఁ బెద్దనకవి ధీరత్వము నెంతచక్కఁగా వర్ణించెనో గమనింపుఁడు.

సీ. బుద్ధీంద్రియక్షోభములకుఁ బెట్టనికోట విపదంబురాశిమద్యేకృతి కోడ
ఖలదురాలాపమార్గణవజ్రకవచంబు రణమహీస్థలికి శ్రీరామరక్ష.

ఇట్టిచక్కనివర్ణనములు చతుర్థాశ్వాసమునం దెన్నియో కలవు. ఇంకఁ బంచమషష్ఠాశ్వాసములలోఁ గూడ నెన్నియో వర్ణనములు గలవు. ఈచంద్రికావర్ణనము నెంతసరసముగాఁ జిత్రించెనో తిలకింపుఁడు.

సీ. కలయ వెల్లువగట్టి జలజలప్రవహించు శశికాంతవాంతనిర్ఝరముజలము
మలయానిలముచే దుమారంబు రేఁగుసౌగంధికంబురజంబు కఱకుదుమ్ము

ఈవర్ణనమం దెట్టిలోప మయినను గలదా? ఇందుఁ జంద్రుని గచ్ఛపవివానిగా నిరూపించి గచ్చునకు గావలసినపరికరము లన్నిటిని సరిపుచ్చి మంచిలోకజ్ఞానమును వెలిపుచ్చినాఁడు. మఱియు నితఁడు తూర్పు తెలవాఱుటయు నరుణోదయ మగుటయు, పద్మములు వికసించుటయు మంచిగుఱుటయు మొదలగునంశములను గల్పనాచాతుర్యముచేఁ గారణోపపత్తిని గూర్చుచు నెంత యింపుగా వర్ణించెనో చూడుడు.

సీ. తనుఁ బాసి శశిదవ్వ చనిన నెవ్వగఁ బోలెఁ దొలివిన్ను జవరాలు వెలుకఁబాఱెఁ
బ్రథమాద్రిసభయందుఁ బఱచిన కెంబట్టు జముకాణ మనఁగఁ రాగముజనించె

ఇట్టివర్ణనము లెన్నియోగలవు. ఏవిషయముల నాలోచింప వర్ణనములపట్ల గృతికర్త యెచ్చటను లోపమును జూపలేదు. కావ్యమం దంతటను సరసవర్ణనములే గలవు. రుచిభేదములనుబట్టి పాఠకులు విపరీతులయినఁ గవి యేమి చేయఁగలఁడు?

కల్పనాచాతుర్యమునందుఁ గూడఁ బెద్దనకవి యుత్తరాశ్వాసములందుఁ బక్షపాతము చూపలేదు. కల్పన లత్యంతాద్భుతావహము లయి యున్నవి. ఒకచిన్నపద్యమును జూపెదను.

క. తలచూపె నప్పు డఖిలా, శల దట్టపుటిరులు చిలువజవరాలు నభ
స్థలమండపకోపరిస్థ, మల నిడిన సితాండపటలిమాడ్కిం జుక్కల్.

చీఁకటియనెడి చిలువనెలఁత యాకాశమనెడి చావడియొక్క మీఁది భాగమునందుఁ బెట్టిన గ్రుడ్లవలెఁ జుక్కలు ప్రకాశించె నని భావము. ఈకల్పన యెంతస్వాభావసిద్ధముగా నున్నదో చిత్తగింపుఁడు. మఱియు సూర్యాస్తమయ చంద్రోదయముల నొకపద్యమందు వర్ణించెను.

గీ. సాంధ్యనటనచండచండీశపదహతి, దరణిచక్ర మొఱిగి శరధిఁగ్రుంగ
దోరగల్లు వడియె భూర్ధేతరభాగ, చక్రమునఁగ నపుడు శశియుఁ దోఁచె

సాయంసమయమున శివుఁడు నాట్యమాడుట ప్రసిద్ధము సూర్య

చంద్రులు భూమియనెడి రథమునకుఁ జక్రము లని పురాణము. నాట్యమాడు శివునిపదఘట్టనములచే భూరథముయొక్క యొకచక్ర మగుసూర్యుఁడు సముద్రమునఁ బడిపోఁగా దానిరెండవచక్ర మగుచంద్రుఁడు, ఒత్తిగిలఁబడెనేమో యన్నట్లుదయించె నని భావము.

సామాన్యముగా బండిఁ దిరుగఁబడినప్పు డొకచక్రము క్రిందగుటయు రెండవది మీఁదికిఁ దేలివచ్చుటయుఁ గలదు. అదేవిధముగాఁ గాలచక్ర మను నిరుసున నంటిపెట్టికొన్న సూర్యచంద్రచక్రములలో నొకటి సముద్రములోఁ గూలఁగా రెండవచక్రము మీఁదికిఁ దేలివచ్చెనని భావము. సూర్యుఁ డస్తమించెను. చంద్రుఁ డుదయించె నని ఫలితార్థము. ఈ చిన్నపద్యమునందుఁ గవి యెంతకల్పనము నెంతచక్కగా నిమిడ్చెనో చూడుఁడు. ఇట్టికల్పనములు గలపద్యము లెన్నియో గలవు. కాని గ్రంథవిస్తరభీతిచే నింకనుదాహరింపఁ దలఁచి కొనలేదు. ఉత్తరభాగమునందు స్వరోచి వేటయు, రాక్షసవధయు, నిందీవరుని శాపవిమోచనమును, మనోరమపెండ్లియు, సఖీశాపవిముక్తియు వారల వివాహము, స్వరోచితపస్సు, దశావతారకీర్తనము మొదలగున వెన్నియో గలవు. కవి వానియన్నింటియందును దనచాతుర్యమును జూపించియున్నాఁడు. కావునఁ బెద్దన కావ్యమునందంతట నెచ్చట నట్టిలోపము లేదనియుఁ జనువారల రుచిభేదమును బట్టియె యట్టి యభిప్రాయము కలుగుచున్న దనియు మఱి యొకసారి చెప్పి పెద్దనకవి భక్తిప్రపూరితపద్యము నొకదానిని వ్రాసి విరమించెదను.

మ. పరతత్త్వం బగునీకు మోడ్పుఁగరముల్ పద్మాక్షు [illegible]
బురుషార్థస్థితినొప్పు నిన్నుఁ గరుణాంభోధిన్ భవార్తిన్ జక్రిన్
శరణార్థిన్ ననుఁ గావఁగాఁ దగుఁ బ్రధానవ్యక్త కాలాత్మ యీ
శ్వర భూతంబుల కీవె కర్తవను బ్రోవ న్హర్తవున్ సాక్షివిన్.

# చాటుపద్యములు.

— వడ్డాది సుబ్బరాయుఁడుగారు —

శ్రీమన్నన్నయ రాజమహేంద్రమున వేసెన్ బంచమామ్నాయస
న్నామంబుంగృతిమొల్క దెల్గునకు, నేనాఁ, డయ్యె వేయేండ్లు; గో
దామాహాత్మ్యమొ, భూమిసారమొ, యటన్ దద్వృక్షమూలాన, నె
ర్వేమిన్ లేకయె, ప్రస్ఫురద్రసములై యుప్పొంగ ఫలించుఁ గృతుల్.

క. మెలఁకువరా, వేఁబోకను, దొలుదొలుతం దలఁచు కలపుఁ, దొలితొలి పలుకున్,
వెలివానిఁ గాక, తన్నుం, దెలిపిన లోవానిఁ జెంద, దీనన లోదప్రన్ —

క. లోవెలిగనులన్, వేసువ, దేవా! లోగన్ను మున్ను తెఱవంబడు; మే
లావహిల దాన నినుఁగని, పావనుఁ, బైకనులఁ గందుఁ బాపజగంబున్.

తే. గీ. కలము నడిపితి కడుదవ్వ కాలజలధి, దీరమదిగో సమీపించె దిగెడుదీవి
గాలియొడుకుచు కెక్కుడీసుట్టుచుండు, గాసివడకుండ దరిఁ జేర్పు కర్ణధార!

ఉ. మేనుల పేరినావలు, సమీరగభీరజలప్రపూరితం
బౌనవకాశపుంగడలి సంక్షిప్తకరంబులు ఘోషణుల్ గఁ, జు
క్కానుగఁ దన్న నోగతి, ప్రయాణము నాత్మలతోడ సల్పెదం;
గానిఁ, యసత్పదంబులకుఁ గర్ణముఁ ద్రిప్పినఁ, ముప్పవాటిలున్.

ఉ. ఏగతి గన్నెరాకునకు గీనియ నంటి కడానిడాలునం
బాగయి వ్రేలుగూఁ, డెపుడో పక్షివిధంబున లోనికీటకం
బేగిన తెక్క లేరుపడి, యేపురూపునఁ గానవచ్చు; నా
లాగుననే సుమీ యొడ, లిలం దను జీవుఁడు వాసిపోయినన్.

మ కలలోఁ గైనిడుకొన్న కంకణము, మేల్కాంచం గనన్ రాక చిం
తిలి, తోడ్తోఁ దెలివొంది, స్వప్నమని భ్రాంతింబాయుఁ బ్రాజ్ఞుండు, కే
వలసత్యంబుగ నెంచి, యూరకడలుం బాలుండు, తద్రీతి జ్ఞా
నులయజ్ఞానులచర్య దోఁచు, హితబంధుశ్రీవియోగంబునన్.

క. దేవుఁడు సర్వజ్ఞతతోఁ, గావించెను సృష్టి చిత్రకల్పనమున ను
చ్చావచముగ; జీవులు త, ద్భావానుగుణంబుగాఁ బ్రవర్తిల్లు టొప్పున్.

ఆ. వె. అల్పజీవులకు ననంతసంతానంబు, గొప్పజీవులకును గొలఁదిసంతు;
నీఁగ కానుపెంత? యేనుఁగ కాన్పెంత? యేలో సృష్టినెల్ల నిట్లె తోఁచు.

క. గాయముఁ జేయకె జంతుని, గాయము కాయముల క్షతజకణములు వెడల్
దీయఁగలరె? తన్నిపుణత, యూయురె? యెటువడసె మశకముష్ట్రుణమటుల్?

ఉ. స్థావరతిర్యగాత్మకము సర్వమహీవలయంబు నేలుకో,
నీవు సృజించి యూర్ధ్వశిరునిం గను మానవు జ్ఞానవంతు, దు
ష్టావళిముఖ్యముల్ తలను దాల్చ తదాజ్ఞకు, దోమ లిప్పుడిం
గావు విధేయముల్, వినముఁ గ్రక్కుతదుద్ధతి మాన్పు మీశ్వరా!

మ. పవలుఙ్ రేయిడి తీవు దేవ! ఘనిసల్పక్, విశ్రమింపఁ, గృపా
ర్ణవ! నీ యీయుపకారకం బయినయేర్పాటాఱడిం బోవఁగాఁ
శ్రవణాసహ్యముగా శరీర మెరియక్ సంగీతముం బాడుచున్
నోవఁ గుట్టుం, జెడఁ గూరు, కీమశకసందోహంబు మాయింపవే.

ఉ. మానవరక్త మానుటలు, మాపట నెపుడ సంచరించుటల్
గానఁగఁ దోఁచు రెండవయుగంబున దండకకాననంబునం
భానుకులేశుబాణహతి మ్రగ్గినదానవులైరి రాక్షసేం
ద్రానను దోమ లంచు, నిఁక రక్షకుఁ డేయవతార మెత్తునో?

శా. ఆత్రేతాయుగ మంతరించెనుతఱిం బ్రాప్తించె ఘోరాజి, వి
శ్వత్రాసంబుగ; నందు నింద్రజితుఁడున్ సౌమిత్రియుం బోరఁగాఁ,
బత్రుల్ శాత్రవు గాత్ర ముచ్చి చనుచోఁ, బ్రాణంగముల్ వచ్చుచోఁ,
జిత్రాస్త్రావళుల యొడ వాన దలపించెన్, రాముఁ డస్వాంతమున్.

ఉ. కాలపుక్షేత్రమందుఁ బడి, గర్భమునందు దినక్రమంబునం
జాలుబలెం బెరుంగు మనుజుం డొనరించిన మేలుఁ గీడు, నే
పోలికఁ వారికిం దెలియ ముందుగ, నీసుఁడు దక్క నెవ్వరుం
జాలరు సూ, తమంత నవి సంభవమై గన వచ్చునంతకున్.

మ. పరికింపం బరమాద్భుతాజకృతరూపగ్రాహియంత్రంబు సూ
శిర; మద్దంబులు చతురాదులట, సృష్టిం గన్న వస్తున్నిటిన్,
మరి కానున్నవి, విన్నవాది, గుణకర్మస్ఫూర్తి బహ్వర్థముల్
పరమాణ్వాకృతి నంటిపై నగపడున్ స్వప్నాన ధ్యానంబునన్.

తే.గీ. లేని దున్నట్టు, లున్నది లేనియట్లు, కాని దౌనట్టు, లౌనది కానియట్లు
లున్న దున్నట్టు, లిఁకఁ దోఁచు నెన్నొగతులఁ, గల నిజంబును గా దంత
కల్లగాదు.

క. తీవలను, జెట్టులందును, బూవులుఁ గాయలును, రెంటఁ, బుట్టువనుండన్
స్థావరములబలె, జంగమ, జీవులయం దట్లు గనము, చిత్రము సృష్టిన్.

ఉ. మంచిగుణాలు గల్గినకుమారులమూలమునన్ సుఖంబులన్
గాంచుట, చెడ్డవాండ్రకతనం గడుఁ గష్టము లొందుచుంట, గ
న్పించు మనుష్యులందుఁ; బృథివీజములన్ విపరీతరీతిఁ బ్రా
ప్తించుట తోఁచు నిర్దెఱఁగుబిడ్డలచే నవి, గన్నవారికిన్.

ఉ. అన్నము వస్త్రముల్ గృహము నందము చందము పెండ్లి గిండ్లి యం
చెన్నియొ యైహికంబులకు, నింకను మీఁదటివానికోస, మె
న్నెన్నియొ బాములం బడుదు మే మనిశంబు, శుకంబులార! మీ
పున్నెమ దేమొ, యన్ని శ్రమముం గనకుండనె మీకుఁ జేకుఱున్.

ఆ. వె. నల్లి పక్కఁ జేరు, బల్లి దీపముఁ జేరుఁ, బిల్లి చల్లయిల్లుఁ, బిట్ట చెట్టుఁ;
బిల్ల తల్లిఁ జేరు, బీద దాతను జేరు, దిక్కు లేనిపక్షి దేవుఁ జేరు.

గీ. అవసరమున జందె మడుమాలఁ దగుల్ప, శిష్టులకును జెవులు చిలుకకొయ్య
లట్లె లేకరులకు నవి కలందానులు, సోమపులకుఁ గర్మసూచకములు.

క. శివునిజటాజూటంబున, దివిజాపగ చొచ్చె నంద్రు ధీమంతులు, త
ద్వివర మిది, వ్యోమకేశుఁడు, భవుఁ, డభ్రంబాపమున కుపాశ్రయముగదా.

మ. జయలక్ష్మీక్షితి భారతుల్ ప్రియత నశ్రాంతస్వయంగ్రాహత
న్మయసౌఖ్యామృతసాగరోర్మిచయసమ్యక్ఖేలనవ్యాపృతా
శయుఁ గావించిన కృష్ణరాయనిబిడౌజఃకాంతివైదుష్యధు
ర్యయశస్సాంద్రుఁడు, పాలితద్రవిడకర్ణాటాంధ్రుఁ డింద్రుం డిలన్.

క. దివిఁ బెనుదివె యొకఁ డాఱిన, దివియలు కోటానఁగోట్లు దృష్టంబులగున్;
భువిరారా జొకఁ డీల్గిన, రవుతులుఁ బడవాళ్ళు బంట్లు, రాజుల వేల్.

# తారకమాల.

—— మంచెళ్ళ కృష్ణకవిప్రణీతము ——

ఉ. శ్రీలలనాసమేతుఁ డతసీసుమభాసుఁడు నందసూనుఁ డు
ద్వేలదయాలవాలుఁ డరివీరకృతాంతుఁ డనంతకీర్తి యా
భీలమహావిపద్గహనబృందదవానలుఁ డాసురారి గో
పాలుఁడు కృష్ణమూర్తి మనపాలఁ గలండు విచారమేలనన్. ౧

ఉ. బాలుఁడు మానిలోకపరిపాలుఁడు సేవకకల్పవల్లికా
జాలుఁడు సర్వసద్గుణవిశాలుఁడు పాలితశక్రముఖ్యది
క్పాలుఁడు ధేనుకాసురవిఘాలుఁడు గోవ్రజగోపగోపికా, పాలుఁడు కృ. ౨

ఉ. నీలఘనాభనీలుఁడు వినిర్మలవేదవధూటికాశిఖా
జాలసమగ్రకుంకుమరసస్ఫుటచిహ్నితపాదలిప్తనం
దాలయచత్వరప్రవిమలాంచితగోష్ఠకరీషపుంజజంబాలుఁడు కృ. ౩

ఉ. చేలములూడ, గోపికలు చేరి భజింప మనోహరాకృతిన్
లాలితవేణుగానకలనాకలనాదము సొంపు నింపుచున్
హేళిసుతాప్రతీరజమహీరుహపాళిఁ జరించు దేవకీబాలుఁడు కృ. ౪

ఉ. మౌళిమయూరపింఛములమాలిక నాసికమౌక్తికంబుఁ గం
గేలమణీలసన్మురళి కింకిణులంఘ్రులఁ బిక్కటిల్ల గో
పాలవధూజనావళులఁ బళ్లుఁగూడి చరించురాజగోపాలుఁడు... ౫

ఉ. పాలిడవచ్చునద్దనుజపాలవధూమణిఁ బాలు గ్రోలుచుం
గాలునిప్రోలికిం బనిచి గాఢకృపారసదృష్టి నందగో
పాలునిమంద సమ్మదము పాలుగఁ జేసిన యట్టిబాలగోపాలుఁడు... ౬

చ. జలరుహసంభవాదిసురసంఘము లైన నెఱుంగరాని య
జ్జలరుహవాసినీవిభుఁడు సత్కృప యాదవసంతతీసుధా
జలనిధిపూర్ణచంద్రుఁడన సంభవమై తగుదేవకీతపఃఫలసిద్ధి. . ౭

ఉ. మానుషవేషధారి యసమానకళానిధి యాదవాన్వయాం
భోనిధినీరజాహితుఁడు నైజకుమారమణీవిభుండు శ
క్రానిలపావకార్చితనిజాంఘ్రితలుండు ద్విషత్సమాత్తమో। భానుఁడు... ౮

ఉ. పన్నగదైత్యభంజనుఁ డపారకృపామతి సంతతాగతా
సన్నజనామరద్రుమము చారుమయూరకలాపహారి ప్ర
మన్నవపుష్మల చనుఁడు మన్మథమన్మథమూర్తి పాలితాపన్నుఁడు... ౯

ఉ. శ్రీనిలయుండు నవ్యసరసీరుహనేత్రుఁడు వేణుగానవి
ద్యానిపుణుండు నిర్భరదయాపరిపూర్ణుఁడు నందభామినీ
సూనుఁడు పాపసంహననసువ్రతనిష్ఠుఁడు నీలమేఘశోభానిధి... ౧౦

ఉ. వెన్నుఁడు భక్తవత్సలుఁడు వేద్యుఁ డనంతుఁ డనంతశాయి యా
పన్నశరణ్యుఁ డీశుఁడు విపద్వనపుంజదవానలుండు వి
ద్వన్నుతకీర్తిశాలి సురవంద్యపదాబ్జుఁ డమేయభాగ్యసంపన్నుఁడు... ౧౧

ఉ. ధీరుఁడు నిత్యపాలితసుధీజనవారుఁడు సింధునాథగం
భీరుఁడు భక్తదుర్జనభీతివిదారుఁడు గోపికాంగనా
జారుఁడు కంసముఖ్యమదశాత్రవభంజనబాహుశక్తిదుర్వారుఁడు... ౧౨

ఉ. మారుఁడు నందగోపకకుమారుఁడు నిష్కపటాంగతుంగశృం
గారుఁడు యోగిముఖ్యహృదగారుఁడు ఖండితబాణదైత్యదో
స్సారుఁడు సర్వదేవపరిపాలుఁడు సంతతకాంతకాంత్యకూపారుఁడు... ౧౩

ఉ. సారసమూహరక్షణవిచారుఁడు పాదసరోజభక్తమం
దారుఁడు హారహీరశరనీరదపారదచారుకీర్తివి
స్తారుఁడు దివ్యభాస్వదవతారుఁడు నిర్గతదుస్తరోగ్రభూభారుఁడు... ౧౪

చ. వరదుఁడు లోకపాలకుఁడు వర్ణితకోటిసురేంద్రవైభవా
కరుఁడు సమస్తనిర్జరనికాయకిరీటమణిచ్ఛటాప్రభో
త్కరసమలంకృతాంచితపదద్వయుఁ డాశ్రితహితుండు కౌస్తుభాభరణుఁడు.

చ. హరి కరుణాపయోధి నరకాసురవైరి మునీంద్రపద్మభా
స్కరుఁడు మురారి మాధవుఁడు సర్వమనోబ్జనివాససద్గుణా
కరుఁడు జగద్విహారి సురకార్యధురంధరుఁ డాశ్రితావళీభరణుఁడు... ౧౬

ఉ. శాత్రవబాహుగర్వబలసంతమసార్కపరాక్రమార్జున
మిత్రుఁడు దుష్టశిక్షణవిచక్షణరక్షణదక్షపుణ్యచా
రిత్రుఁడు భక్తపాలనగరిష్ఠపవిత్రుఁడు ప్రోల్లసద్దయాపాత్రుఁడు... ౧౭

ఉ. వాసవముఖ్యసర్వసురవారమనోంబుజమోహకృన్మహా
రాసవిలాసమోదితనిరంతరసుందరగోపసుందరీ
భాసురనేత్రకైరవవిభాకలితస్మితసాంద్రచంద్రికాభాసుఁడు... ౧౮

ఉ. అవ్యయుఁ డప్రమేయుఁ డఖిలావనశీలుఁడు లోకపాలసం
సేవ్యుఁడు వ్యాసముఖ్యకవిశేఖరకల్పితదివ్యభవ్యస
త్కావ్యుఁడు నందితేంద్రగురుకావ్యుఁడు సర్వసుపర్వసంఘసంభావ్యుఁడు...

ఉ. అంగదపుష్పబాణరుచిరాంగవిలాసము లుల్లసిల్ల గో
పాంగన లంటి కొల్వ యమునాంతికతుంగలవంగలుంగనా
రంగముల నెలంగు యదురాజశిఖామణి భవ్యసత్కృపాపాంగుఁడు... ౨౦

ఉ. అంగదభూషితాంగుఁడు విహంగతురంగుఁడు లక్షితార్క్షపా
తంగుఁడు తాపసాంబుజపతంగుఁడు దగ్ధపయోధికన్యకా
సంగుఁడు వల్లవీజనభుజంగుఁడు భంగవిపత్పరంపరా భంగుఁడు .. ౨౧

ఉ. ప్రాజ్ఞుఁడు ధామకౌశలపరాజితదుర్మదరాక్షసావళీ
ప్రజ్ఞుఁడు వర్తమానశరపర్వభవిష్యదతీతభూతకా
ర్యజ్ఞుఁడు ధారుణీజననిరంతరకల్మషకాలకూటస
ర్వజ్ఞుఁడు కృష్ణమూర్తి మనపాలఁ గలండు విచారమేటికిన్. ౨౨

ఉ. వింతగ యామునాటవిభువిం బ్రభవించినతీవ్రదారుణా
త్యంతదవానలం బడచి యచ్చటఁ గోపకవత్సపంక్తికిన్
వంతలు వాపినట్టి గుణవంతుఁ డనంతుఁ డనంతసుఖా
స్వాంతుఁడు కృష్ణమూర్తి మనపాలఁ గలండు విచారమేటికిన్. ౨౩

చ. అభవుఁ డజాండరక్షకుఁ డనంతగుణాంబుధి విష్టపత్రయీ
విభుఁడు పరాత్పరుం డజుఁడు విశ్వమయుం డఖిలాంతరాత్మకుం
డిభభయసంహరుండు ప్రభుఁడీశ్వరుఁ డాఢ్యుఁడు కూడ నాస్య ము ప్రభవుఁడు.

చ. ఋగ్యజురాదివేదచయవృక్షలతాశిఖరప్రశాఖసౌ
భాగ్యకరుండు పంకరుహబాంధవతేజుఁడు విశ్వభవ్యవై
రాగ్యనిరూఢసజ్జనశరణ్యుఁడు ధీనిధి నందయోదకీ భాగ్యము... ౨౪

ఉ. రాజితబాహువిక్రమపరాజితదోర్మదరాక్షసావళీ
తేజుఁడు వాసవప్రముఖదేవగణార్చితసత్పదారుణాం
భోజుఁడు మానిరాజసురభూజుఁడు సాధుజనావనార్తిని
ర్వ్యాజుఁడు కృష్ణమూర్తి మనపాలఁ గలండు విచారమేటికిన్. ౨౫

ఉ. (శ్రీ)గోసఁగంగఁ గృష్ణకవిశేఖరుపైఁ గరుణాకటాక్షవీ
క్షాళులు నించి తత్కృతసముచితకావ్యముఁ గాంచి మోదగీ
లాలసమానమానసవిలాసముచే నలరారు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మనపాలఁ గలండు విచారమేటికిన్. ౨౬

ఉ. వారక కృష్ణమూర్తిగుణవర్ణన తారకసంజ్ఞవృత్తముల్
సారెకు నెవ్వఁడేని యాదరంబుఁ బఠించిన భవ్యకీర్తిఁ జె
న్నారి సమస్తభాగ్యముల నందుచు నందకపాణి సత్పదాం
భోరుహభక్తి గల్గి యతిమోదము నొంది కృతార్థుఁ డౌ భువిన్.

---

# గ్రంథస్వీకారము.



(1) కృతజ్ఞత—మొదటిభాగము. ఇది యొకవచనకావ్యము. ఇందు మూఁడుప్రకరణము లున్నవి. కృతజ్ఞతనుగూర్చి బహువిధములఁ జర్చింపఁబడినది "గంభీరార్థముగల యీకృతజ్ఞతాస్వరూపమును గ్రహించుట సర్వజ్ఞునకుఁగాని సాధ్యముకాదు. కృతజ్ఞతయందలి పరమార్థమును గ్రహించుట పరబ్రహ్మమెఱుంగుట" యను గ్రంథప్రకాశకుల వాక్యమునందు సత్యము గలదు. 47 పుటలు. చక్కనియచ్చు, మంచివిషయము గల దీని వెల రు 1-2-0.

(2) మాతృస్తవతారావళి—ఇందు 27 సీసములలో మాతృస్తవమును దానికి 93 పుటలలో జీవన్ముక్తివిచారణమును సూక్ష్మసూచీవివరణమును గలదు. ఇది పీఠికాపురభూపాళినుండి బయలువెడలిన పునరుజ్జీవక సారస్వతగ్రంథసరణిలోని (అ) అను సంజ్ఞగలది. సంపాదకులు విజ్ఞాపనములో- "ప్రతిపాద్యరసాస్పదంబు లగుపొత్తము లెచ్చటనో కాని కానరావు. తిరిచి చూచినకొలఁది నమృతంబు చిలికి సుఖావహమగు గ్రంథము మూల దాఁగకుండఁ బ్రకటించుభాగ్యము నాకుఁ గలిగినందులకుఁ జాలధన్యుఁడను. ఈగ్రంథమున కెవ్వరు కర్తలు మున్నగువిషయములకు నిమిత్తములేకుండఁ నిందలివిషయము లెంతవఱకు నాదరణీయంబు లనునవి తెలిసికొని వానిఁబట్టి యిందలిరసంబులఁ జూఱలాడవలయు" నని విన్నవించుచున్నారు. వెల రు 2-2-0 ఈ (1) (2) గ్రంథములకుఁ బ్రకాశకులపేరేగాని కర్తలపేరు తెల్పలేదు.

ఇవి కావలసినవారికి (1) కొరళ్ళ బసవలింగగుప్తగారు, డి. పి. సి ఎం. ఎస్. ఎమ్. ఆర్. పరశువాకము- చెన్నపట్టణము. (2) వి. వి. సుబ్బారావుగారు, గోరస పిఠాపురము పోస్టు అను నీయిద్దఱయొద్ద దొరకును.

(3) విభవ, శుక్ల, ప్రమోదూత, ప్రజోత్పత్తి సంవత్సరముల పంచాంగము. ఇది వర్ణాశ్రమధర్మసంస్థాపనపత్త్రికాధిపతి యగు బ్రహ్మశ్రీ పిన్నంరాజు వేంకటసుబ్రహ్మణ్యశర్మగారిచే గుణింపఁబడి చెన్నపురి స్వధర్మప్రకాశినీపత్త్రికా సంపాదకులగు శ్రీ వై. కోటీశ్వరశర్మదీక్షితులు, కనుపర్తిమార్కండేయశర్మగార్లచేఁ బ్రకటింపఁబడినది. ఇందు వర్తమానసంవత్సరముతోపాటు ముందు మూఁడుసంవత్సరముల పంచాంగములు కూడఁ గలవు కాఁబట్టి భవిష్యద్విషయములం దెలిసికొనుట కీపుస్తకము చాలనుపయోగించును వెల రు 0-12 0

రీకరణము. మృదుమధురశైలిని రచియింపఁబడినది. గ్రంథకర్తయగు కళువె వీర రాజు పదునేడవశతాబ్దాంతమున మైసూరుప్రభుఁడగు చిక్కదేవరాయలకాలమున నున్నటులు దెలియుచున్నది హాలాస్యమాహాత్మ్య వచనశివభక్తవిలాసభగవద్గీతల నాంధ్రమునకు భారతమును గన్నడభాషయందును రచియించిననంజరాజీతనికుమారుఁడు. నంజరాజకృతహాలాస్యమాహాత్మ్యముభక్తివిలాసముపరిషద్భాండాగారమునఁ గలవు. ఆంధ్రవచనభారతమున సభాభీష్మపర్వములే తమకు లభించిన వనియు వానిని వేర్వేఱు భాగములుగఁ బ్రకటించుచున్నామనియుఁ బ్రకాశకులు రాజమహేంద్రవరము గవర్నమెంటుకళాశాలలో నుపాధ్యాయులునగు ఎన్. కే వేంకటేశంపంతులుగారు వ్రాసియున్నారు. అచిరకాలమున మిగిలినభాగములఁ బ్రచురించి వీరు భాషాసేవ యొనర్తురని నమ్ముచున్నారము. వెల రు 0 8-0.

(7) క్షత్రియకులదర్పణ మను నామాంతరము గలరెడ్డికులనిర్ణయచంద్రిక- పెద్దమందడి వేంకటకృష్ణ శేషాద్రిరమణకవులచే రచియింపఁబడి కావ్యకంఠగణపతిశాస్త్రిగారిచేఁ బరిశోధింపఁబడినది. ఆంధ్రభృత్య పల్లవవంశజులయనంతరము దక్షిణహిందూస్థానమందు రాజ్యపాలన మొనర్చిన రాష్ట్రకూటవంశపురాజులు రట్టలు రాథోడు లని పిలువఁబడు చుండిరనియు నారాష్ట్రకూటవంశజులే యాంధ్రదేశమున రెడ్లని వ్యవహరింపఁబడి రనియు గ్రంథకర్తలు వ్రాసియున్నారు. రెడ్లు క్షత్రియులని నిరూపించుటకై క్షత్రియులతో వివాహబాంధవ్యములు, శాసనాధారములు మొదలగు నూతనవిషయములు దెల్పఁబడినవి. వాచకులు సవిమర్శముగ వానిని గైకొందురుగాక.

(8) అశ్వలక్షణసారము—మనుమంచిభట్టప్రణీతము. ఈగ్రంథము సాళువకంపరాయని కంకితమీయఁబడినది. గ్రంథమున, కృతిపతి యొక్కొకచో గన్నభూపాలుఁడనియు మల్లయామాత్యునకును భీమాంబకును బుత్రుఁడనియు వర్ణింపఁబడియున్నాఁడు. కొంకణపతి, మీసరగండ, రాయవేశ్యాభుజంగ—మొదలగుబిరుదము లాతనికిఁ గల వని గ్రంథమువలనఁ దేలుచున్నది. ప్రకటింపఁబడిన గ్రంథము నాలు గంకురములు గలిగియున్నది.

వేఱొకప్రతితోఁ బోల్చిచూడ నందుఁ గలయయిదవ యాశ్వాసము చికిత్స గడ్డికవణప్రకారమును దెల్పిన దిందుఁ గానవచ్చుటలేదు. ఆగ్రంథమున నైదాశ్వాసములు గలవు. అందలి పద్యము లీగ్రంథమునఁ గొన్ని కానరాకపోవుటయే గాక మిగిలినవి వ్యత్యస్తముగఁ గూడఁ గన్పించుచున్నవి.

ఒక్కొక చోటఁ బద్యపాదములు మార్పఁబడినవి. వివిధమాతృకలను బరిశోధించి యీగ్రంథమును దిటుగఁ బ్రకటించి, మనుమంచిభట్టు సాహసవకంపరాయల కాలనిర్ణయమును జేయవలసియున్నది. వెల రు 1-0-0 వలయువారు కొండపల్లి వీరవెంకయ్యగారు బుక్సెల్లరు రాజమహేంద్రవరము అని వ్రాయవలయును.

(9) లోకనాయకిశతకము—బొబ్బిలితాలూకా అజ్జాడవాస్తవ్యులగు బ్రహ్మశ్రీ ఆదిభట్టరామమూర్తిగారిచే రచియింపఁబడినది. శైలికై యొకపద్యము.

ఉ. బంధురగంధవైభవవిభాసురపంకజమాశ్రయించి పు
ష్పంధయ మేతెఱంగున నివాసమొనర్చునో యట్లు ప్రేమ సం
బంధమువీఱ నాహృదయపద్మమున న్వసియించి సిరి మో
హాంధుఁడనైన నన్నుఁ గృప నారయఁగావలె లోకనాయకా.

Annals of the Bhandakar Oriental Reseach Institute, Poona, Vol. IX Part 1.

భండార్కరు ప్రాచ్యవిషయపరిశోధనాసంఘమువారు తమపత్రికను మాపత్రికకు వినిమయముగాఁ బంపుట కంగీకరించినందున వారికి మాకృతజ్ఞతాపూర్వక మగువందనముల నర్పించుచున్నాము. హిందూదేశమునందు సంస్కృతవాఙ్మయమును గూర్చియుఁ బ్రాచీనరాజ్యవిధానాదిసమస్యలను గూర్చియుఁ జర్చించుపత్రికలయం దిది యగ్రగణ్యత నొందు ననుట కెట్టిసందియమును లేదు. మహాభారతమును బాఠాంతరములతోఁ బ్రకటించుటకు విశేషప్రయత్న మొనరించి యాదిపర్వమునందలి మొదటిరెండధ్యాయములను వీరు ప్రకటించియున్నారు. పైపత్రిక (సం. 9.1) యందు శక్తిభద్రుఁడు- భాసుఁడు అనువ్యాసమును బిల్హణునిపంచాశిక యనఁబడువ్యాసమును బ్రాచీనలిఖిత (పత్రము) లను వ్యాసమును గలవు. ఋగ్వేదమునందలి పదములయర్థము ఋగ్వేదమునందు విభక్తు లెట్లు ప్రయోగింపఁబడినవియును వేదసంబంధములగు వ్యాసములు కూడఁగలవు. ఆశ్చర్యచూడామణిని రచియించిన శక్తిభద్రుఁడే భాసవిరచితములగు ప్రతిమాభిషేకాదినాటకములరచియించెననువాదము ప్రథమవ్యాసమున నిరసింపఁబడినది. బిల్హణుని పంచాశిక యనువ్యాసమున వేర్వేఱువ్రాఁతప్రతులఁ బోల్చిచూడ నొకదానికొకటి సరిపోవుట లేదనియు, అన్నిప్రతులలో నయిదు శ్లోకములు మాత్రమే సరిపోవుచున్న వనియు నొకవేళ

బిల్హణపండితుఁడు మొదట నయిదుశ్లోకముల మాత్రమే రచియించి యుండఁ దరువాత దేశకాలానుసారము గ్రంథము విస్తరింపఁబడి యుండవచ్చు ననియు, నుత్తరహిందూస్థానప్రతులయందుఁ బూర్వభాగము 'అద్యాపితాం' అని మొదలిడఁబడిన శ్లోకములవలెనుఁ గానవచ్చుటలేదనియు నిటుఁ జర్చింపఁబడినది. ఇది విమర్శనీయము.

ఈపత్రిక, ఆ గ్లమునఁ బ్రచురింపఁబడుచున్నది. సంస్కృతభాషాభిమానముగల ప్రతిమనుజుఁడు నవశ్యము చదువఁదగినది. సాంవత్సరమునకుఁ జందా రు 10_0_0

(11) శ్రీరామశతకము—ఇది మ॥ సత్యవోలు రాధామాధవరావు గారిచే రచియింపఁబడిన కందపద్యశతకము. ఇందు 117 తెనుఁగుపద్యములును 12 సంస్కృతశ్లోకములును గలవు. భక్తిభరితము లగునీపద్యము లన్నియుఁ గవిగారిచే భద్రాద్రిలో శ్రీరామసాన్నిధ్యమున జదివి సమర్పింపఁబడినవి. ప్రతి పద్యమునకు శబ్దశ్లేష, అర్థశ్లేష, చతుఃప్రాసము మొదలగు శీర్షికలు గలవు. ఇది సకలానందగ్రంథమాలికలోని 8 వ పుష్పము. వెల రు. 0-2-0. కావలసినచోఁ గవిగారియొద్ద నితరబహుగ్రంథములతోపాటు కాకినాడలో దొరకును.

(12) A Descriptive catalogue of the Telugu Manuscripts.

ఇది గవర్నమెంటు ఓరియంటల్ లైబ్రరీలో నున్న తెనుఁగుగ్రంథముల పట్టిక. ప్రబంధసంపుటములలో రెండవదానిలో రెండవభాగము. శృంగారప్రబంధములు. ఇది 1927 సంవత్సరములోఁ బ్రకటింపఁబడినది. ఇందు మదనమోహినీవిలాసము, మధురవాణీవిలాసము, మాధవాభ్యుదయము, రఘువంశము, రత్నావళీపరిణయము, లక్ష్మీనారాయణసంవాదము, వల్లభాంబాపరిణయము మొదలగు క్రొత్తప్రబంధములను గూర్చి కలదు. వెల రు 4-0-0 చెన్నపురి గవర్నమెంటు ప్రెస్సులో దొరకును.

# ఆంధ్ర సింహావలోకన సంగ్రహము.

— దోమా వేంకటస్వామిగుప్తగారు —



భాష యంతయుఁ గవికృతగ్రంథములచే జీవించును. కవీశ్వరులును వారిగ్రంథములునే భాషాసతీమతల్లి కాయువుపట్టులు కాఁబట్టి మహాకవుల యభ్యుదయము వారివారిసమయములలో నాంధ్రవాణి యేయేరీతుల లాస్య మాడినది, యేయేక్రొత్తయందచందములఁ జెందినది మున్నగు విషయములను గమనించుట భాషాచరిత్రవిషయకము కాకపోదు.

ఆంధ్రభాష విశేషముగా సంస్కృతమునుండియు స్వల్పముగ నరవము కన్నడము మున్నగు నితరభాషలనుండియుఁ గొంత సొంతముగను నేర్పఱిచినట్లు తోఁచుచున్నది. అంతేకాక మఱియొకవింత యున్నది. ఆంధ్రభాష యేర్పాటు చేయఁబడునప్పుడు అన్యభాషాపదములు నట్లు సంగ్రహింపఁబకపోయుఁబున నత్యంతసుశబ్దంబులు సంగ్రహింపఁబడినవి. కావుననే భాష చాల సుందరమైన దనుపొగడ్త గన్నది. దానికి మూఁడుప్రబలకారణములు :—

1. కర్ణాటదేశాధిపతియు, నింటఁ గన్నడము మాటలాడునట్లనుమా నింపఁబడినవాఁడును విచక్షణుఁడు నగుకృష్ణదేవరాయలు "దేశభాషలందుఁ దెనుఁగులెస్స" యని తదభివృద్ధికిఁ బ్రోత్సాహం బొసఁగి యాంధ్రభోజనామముఁ గాంచుట.

2 త్యాగరాయలు అరవదేశంబునందు జనించి యాంధ్రగీర్వాణములును ద్రావిడభాషయు నేర్చినను స్వదేశవాసు లుపొంగున ట్లరవములోఁ దనభావములను వెల్లడింపక భావగుంభన కాంధ్రమే యనుకూల మని తనపాటలను దెనుఁగులోనె రచించుట.

3. బ్రౌనుదొర మున్నగుఖండాంతరపండితులు, పరికించి, యైరోపాదేశములం దిటాలియా భాషవలె నిచ్చట నాంధ్ర మున్న దని గ్రహించుట.

నన్నయభట్టు వాగనుశాసనుఁడు. ఇతనికి వాగనుశాసనుఁ డనియు, అష్టభాషానుశాసనుఁ డనియు బిరుదము లున్నట్లు కాలాగతవార్త. ఈతఁడు సంస్కృతప్రాకృతాదిభాషల కనుశాసనుఁ డని యెవ్వరును జెప్పరు. ఆంధ్రమున కే సూత్రనిర్ణేత యందురు. కావున నాంధ్రవాగనుశాసనుఁ డనుట యొప్పును. అట్లయినచో నతనికి ముం దాంధ్రకవులు గాని గ్రంథములు గాని యుండలే

దనవచ్చునా. వీల్లాదు. రసవంత మగుకుమారసంభవము నన్నెచోడునిచేఁ దెలుఁగున రచింపఁబడిన ట్లూహింపఁబడుచున్నది. ఇఁక సితరగ్రంథము లున్న ట్లు చరిత్రపరిశోధకులు దెల్పుచున్నారు. నన్నయ వాగనుశాసనత్వ మన నేమి? అష్టభాషావాగనుశాసనుఁ డన్న నీయష్టభాష లేవి. అని నే నాలోచించుచుండ శ్రీనూర్ బాలసరస్వతి, తర్కతీర్థ, శ్రీనివాసాచార్యులుగా రొసఁగిన యభిప్రాయ మిది :—

"ఆంధ్రదేశ మనఁ జాలఁ బెద్దదేశము గాని చిన్నదేశము గాదు కాఁబట్టి యాంధ్రదేశమునందు నైజాము తెలుఁగు, ఉత్తరసర్కారు తెలుఁగు, మదరాసు తెలుఁగు, దత్తమండలము తెలుఁగు, మైసూరు తెలుఁగు, ఓఢ్రపుఁ దెలుఁగు నని యనేకవిధము లైనపలుకుబడు లున్నట్లుగాఁ దొల్లి గూడ ననేకవిధము లైన పలుకుబ డ్లుండియుండవచ్చును. సూక్ష్మభేదములను వదలి యవి యెనిమిదివిధములుగ విభజింపఁబడి యుండవచ్చును. అట్లొకభాషయం దెనిమిదివిధము లయినపలుకుబ డ్లున్నప్పు డొకభాగమునందలి కవీశ్వరుఁడు తన దేశపు బలుకుబడిప్రకార మొకగ్రంథమును రచించినచో నందలి జాతీయాదిసారస్యము లితరభాగములవారి కర్థము కావుగదా! అట్లే, యిపుడు రాజమహేంద్రవరము మున్నగుదేశభాగములయం దక్కడి యేచలతో రచింపఁబడు ప్రహసనాదులు బళ్ళారి మున్నగుదేశములయందలివారు చదివి యందలియభిప్రాయసారస్యమును సంపూర్ణముగా గ్రహింప వీలులేదుగదా! నైజామునుండి యొకరు వచ్చి తమదేశపుఁబలుకుబడిప్రకార ముపన్యసించినచో నందలి యభిప్రాయములను గ్రహింప నొకమదరాసువానికి వలను గాదు గదా! మదరాసువాఁ డొకయరవతెలుఁగున గ్రంథమును నిర్మించినచో నౌత్తరాహులు చదివి యందలియభిప్రాయమును సంపూర్ణముగా నెఱుఁగ వీలగునా. ఇట్టిచిక్కే నన్నయభట్టారకునికాలమునఁ గనిపెట్టఁబడి దేశభాగముల కన్నింటికి ననుకూలముగా నుండునట్లు భాషాసూత్రములు నిర్మింపఁబడవలయు నని నిర్ణయింపఁబడెను. అందుకు రసికప్రభుసత్తముఁ డగు రాజనరేంద్రుఁడు చేయూఁత యొసఁగెను. దేశదేశపండితు లెల్లరు నొకసంఘముగాఁ గూడిరి. నన్నయభట్టు వారిలో నగ్రస్థానము వహించెను. సుమా రిరువదిసంవత్సరము లాపరిషదాలోచనములు సాగియుండవచ్చును. ఆపరిషదాలోచనముపై వెలువడిన సూత్రసముదాయమే నన్నయభట్టీయము." అని—

ఆచార్యులవారు సెలవిచ్చినవిషయము సమంజసముగానే యున్నది. ఎందు కనఁగా :—నన్నయభట్టానర్చినయితరగ్రంథము లేవియు లేవు నన్నయభట్టీయమును భారతములోని కొంచెము తక్కువ మూఁడుపర్వములునే కదా ! ఆసూత్రములకు లక్ష్యములనిమిత్తమే భారతరచనయు నాతఁడు పూనె ననుట యుక్తియుక్తము. నన్నయభట్టీయరచనకుఁ గొలఁదికాలమే పట్టియున్నచో భారతభాగముమాత్రము రచించినంత నాతనికి వయోవృద్ధిజాడ్యము కలిగియుండదు. కాఁబట్టి యీవాగనుశాసనుఁ డాంధ్రదేశమునం దన్నిభాగములవారికి ననుకూల మగునట్లు సమీకరింపఁబడినభాష నొకటి యేర్పఱిచె నననొప్పు ఇప్పుడు గ్రామ్యవాదులు సూత్రముల నన్నింటి నుల్లఘింప నగునన్నచో నది యెంత యననుకూలముగా నుండునో యరయుట యాలోచనసాధ్యమే కదా! విశృంఖలత్వమే ప్రాప్తించినచో గ్రామమునకు, నింటికి దలకు నొక్కొక్కరకపుఁ బలుకుబడి యేర్పడిపోవునేమో. అద్దాన లాభ మూహ్యము. ఒకరియభిప్రాయ మొక్కరి కవగతము కాక మరల నియమితభాష కొఱకుఁ బునర్నిర్మాణము జరగవలసివచ్చును గదా.

నన్నయభట్టారకునిచేఁ బరిష్కృతం బయినభాష యింతవఱ కారీతినే యున్నదా మార్పు లేమియు జరుగలేదా యని మిత్రు లడిగెదరు మా ప్రత్యుత్తరము "వాగనుశాసనుఁడు భాషను నియమించెను గాని బంధింపలేదు. పూర్వాభరణములనే ధరింపవలయునా? యాచార్యవ్యతిరిక్తములు గాని నవీనాభరణములను సుందరాంగులు ధరింపవచ్చునుగదా! అట్లె తెలుఁగు భాషయందు మహమ్మదీయపరిపాలనములో నితరభాషాపదములు దేశ్యములుగా నంగీకరింపఁబడినవి. కవనపద్ధతులు, గ్రంథరచనపద్ధతులు మారినవి ఈ యాంగ్లేయ పరిపాలనకాలమునఁ దద్భాషాపదము లెన్నియో వాడుక ననుసరించి దేశ్యములుగా నిం దంగీకరింపఁబడెడిని." అట్లయినచో, సోదరులు అన్యభాషాశబ్దగ్రహణము గావించుచున్నారు గదా! గ్రామ్యభాష నేల యంగీకరింపరా దని పల్కినఁ బ్రత్యుత్తరము—భాషను నియమింపుఁడు. బంధింపకుఁడు, చలనవిహీనను గావింపకుఁడు. స్వేచ్ఛ తగును. విశృంఖలత్వము తగదు. అన్యదేశ్యములను మనభాషాపద్ధతులకు లోపడునట్లు చేసి యుపయోగింపుఁడు.

నాటకములయందు, పాత్రౌచితికొఱకు గ్రామ్యభాష యుపయోగ్యమా యనిన, వ్యక్తియొక్క యంతరువు తెలియఁబడుచున్నది, కాన, నుపయోగ్యమే.

ఆంగ్లేయభాషాధికపరిచయమున, సంస్కృతాంధ్రముల నరసియు నరయక పని గల్పించుకొని నియమవిరుద్ధమార్గముల నడువరాదు వేత్తలయుపేక్షపాలముల కందకుండ గ్రంథరచన కావింపవలయును గ్రంథము బైలు వెడలినచోఁ దద్ర సపద్ధికిఁ జర్చకు మార్గము లుండవలయును గదా! చక్కఁగా భాషానియమ ముల నెఱిఁగి పూర్వకవికృతగ్రంథములం జదివి తన్నియమవిమర్శనకుఁ గడఁగ వలయును. అంతవఱకు నా బోటివారు గతానుగతికముగఁ బూర్వుల ననుస రింపనగును.

—♦ ఆంధ్రభాషాభ్యుదయము ♦—

మహాకవులచేఁ దమగ్రంథములయందుఁ దొంటినుండి నేఁటివఱకు నుప యోగింపఁబడిన రీతుల 1 పురాణశైలి, 2 ప్రబంధపద్ధతి, 3 గీర్వాణాంధ్రీకరణ పద్ధతి, 4 నాటకరీతి, 5 నవలారచన, 6 భావకవిత్వము అని విభాగింప వచ్చును.

గీర్వాణభాషయం దున్న పురాణములను దెనిఁగించినచో నాకృతిపు రాణశైలితో నుండును. ఆంధ్రభాషయం దీపురాణములను సంస్కృతభాషలో నిగ్రంథములనుండి రచించినచో, నాశైలి గాంధ్రీకరణశైలి యని పేరిడవచ్చు ను గదా యనఁ జెప్పవచ్చును, కాని, తెనిఁగింపు కేవలవిషయబోధన ప్రధా నముగా నుండును. కావ్యాంధ్రీకరణమువలె వైచిత్ర్యప్రధానముగా నుండదు. మహాభారత మాంధ్రీకరణమే శృంగారనైషధము నాంధ్రీకరణమే కవిత్రయ ము కొంతవఱకు విషయమును మనసులో నిడికొని స్వేచ్ఛమై భారతమును తెనిఁగించెను. శ్రీనాథుఁ డాశకాలు విశేషముగా మూలము ననుసరించి నైష ధమును తెనిఁగించెను పురాణాంధ్రీకర్తల యుద్దేశము విషయబోధన, కా వ్యాంధ్రీకర్తల యది విషయములతోపాటు భాషావైచిత్రిని దెలుపుట.

ప్రబంధపద్ధతి యనఁగాఁ గొన్నివర్ణనలు మనంబునం దుంచుకొని యవి యిముడునట్లు కథాంశము నేర్పాటు చేసికొని గ్రంథమును బూరింతురు.

నాటకముల రీతిని నవలల రీతిని గూర్చి ప్రత్యేకముగాఁ దెల్పనేల ? ఇవి భాషకాధునాతనపద్ధతులు వీనిం గూర్చి స్థూలవివరణము గావింతును.

భారతము నిర్వచనోత్తరరామాయణము రెండు హరివంశములు మా ర్కండేయపురాణము విష్ణుపురాణము నివి పురాణశైలి గలవి. నృసింహపురా ణము పురాణమే యగుఁగాక యది ప్రబంధరీతి నొనర్చుటనే యెఱ్ఱాప్రెగడను,

ప్రబంధపరమేశ్వరబిరుదమువచ్చియుండును. శృంగారనైషధము సంస్కృతకావ్యాంధ్రీకరణశైలి. శ్రీనాథుడు తెనుఁగునకుఁ గ్రొత్తతెలుఁగులు సమకూర్చెను. బమ్మెరపోతరాజకృతభాగవతమునందలి విశేషమేమన- అది విషయబోధకుఁ బురాణము-అలంకారికరీతిని బ్రబంధము- శ్రీనాథునిసూక్తివైచిత్రి, యీభాగమునందు గలదు. ఆమహాకవికవితలో నొకవిధమైన జస్సున్నది. ఇమ్మహాకవికవిత నొకనియమితత్వమున్నది. శ్రీనాథునికవిత నవయౌవనవిలాసవతివంటిది. పోతరాజుని నవయౌవనయుక్తయు నాచారవతియు నగుపుణ్యస్త్రీవంటిది. ఈకవి నిస్పృహుఁడు. రాజసత్కారాదులఁ దృణీకరించె ననుట కాధారములున్నవి. ఇతని నివాస *మొంటిమిట్టయనియు నోరుగల్లనియు వివాదములు జనించినవి. పురాద్యష్టాదశ వర్ణనలతోఁ గూడినదిప్రబంధశైలి దానిపై నిపుడు గొందఱ కసంతుష్టి గలిగినది. కారణము- తొలుత శ్రీనాథుడు కాశీఖండాదులను బ్రబంధరచనకు మార్గదర్శకములుగా రచించెను. పిమ్మటఁ బెద్దనాదులు మనుచరిత్రాదులను రచించిరి. ఇవియన్నియు నించుమించుగా నొక్కఫక్కినే యుండుట- పేరులు భేదమేగాని, విషయము సమానముగా నుండుట- ఈసందర్భమున వసుచరిత్రమునుగుఱించి నొక్కింత ప్రసంగింపఁదగును. దానిని భట్టుమూర్తి భాషాయోషాభూషణముగా రచించుటకొక్కయభిప్రాయము గలదు. అది శ్లేషప్రధానకావ్యము. ఎందఱో దానివెనుక, పిల్లవసుచరిత్రములను రచించిరి ప్రబంధరచనకుఁ గారణమేమనఁగా, ఒక్కప్రబంధము నెవరుగాని చదివినచో వానికి లోకసామాన్యవిషయము లన్నియుఁ దెలియుటయు ననుసర్థమాదుండవచ్చును. కాని, ఒకరు చెప్పినవిషయమే [illegible] గతానుగతికముగాఁ జెప్పుటచేఁ బాఠకులకు మనోవికాసము కలుగుట లేదేమో యని సంశయము.

ఆప్రబంధయుగములోనివాఁడే పింగళి సూరన్న. ఈకవిరత్న మనర్ఘ్యమైనది. ఈసూరన్నకవి వ్రాసిన గ్రంథములు స్వతంత్రశక్తిగలవి. మనోవికాసమునకుఁ దగిన నూత్నమార్గములు గలవి. ఇందుఁ గళాపూర్ణోదయము, పద్యములతోఁడి నవల. ఇట్టికల్పనలు గలగ్రంథము సభాలో నధివిష్యతి- దీనిలోనికథాసంవిధానమునకు షేక్సుపియర్ కవియొక్క "కామెడీ ఆఫ్ ఎర్రర్సు"

* ఒంటిమిట్టయే యనుటకు- అక్కడివారు చెప్పుకొను పోతరాజుకతలు, పోతనకుట్ట, పోతనతాంబూలము మొదలైనయాధారములున్నవి. ఈవాదము నాకిచట నప్రస్తుతము.

సరివచ్చును. దీనిని బిల్లకళాపూర్ణోదయ మనవచ్చును. ఈరెండు గ్రంథములు నేకరీతి నుండక కాకతాళీయమ్మై యుండును. చేమకూర వేంకటరాజును జక్కని పుంతలం ద్రొక్కినాఁడు. ఈతని గ్రంథము గాంచినఁ గేవలాంధ్రజ్ఞాతల కాంధ్ర కవి గీర్వాణవేత్తలకు గీర్వాణకవి.

ఇటీవల నప్పకవి మొదలగులాక్షణికులు ప్రబలిరి.

అవధానములు—నెల్లూరి వీరరాఘవకవి, మాడభూషి వేంకటాచార్యులుగారు, మున్నగువారీవిషయమునఁ బనిచేసిరి. తిరుపతివేంకటేశ్వరకవులు-వీరిద్దాని నాంధ్రదేశమంతట వ్యాపింపఁజేసిరి. కొందఱకీయవధానములు నిరుపయోగము లనిపించును గాని-నైపుణి యలవఱుచుకొనుటకు మంచిమార్గమిది. ఆంధ్రనాటకపితామహులు ధర్మవరము కృష్ణమాచార్యులుగారు శతావధానులు-వీరే యాంధ్రదేశములో నాటకము వ్రాయ మొదలిడినవా రనవొప్పును. తిరుమలబుక్కపట్టణము శ్రీనివాసాచార్యులుగారు చతుశ్శాస్త్రపండితులు. ఆంధ్రగీర్వాణకవులు ఘంటాశతశ్లోకనిర్మాతలు.

అధునాతనులలో బ్ర॥ దాసు శ్రీరాములు పండితులు, తిరుపతివేంకటేశ్వరకవులు, జనమంచి శేషాద్రిశర్మగారు, కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, వావిలికొలను సుబ్బారావుగారును బురాణరచయితలు.

విమర్శనములు—మనభాషలో విమర్శ యనఁగా సాధారణార్థము-ఒక్కపండితునిపై నొక్కపండితునకుఁ గలవైరమునుబట్టి గ్రంథములను మధ్యవర్తులనుగాఁ బెట్టుకొని దూషణములు గావించుట, వెక్కిరించుట, ఆక్షేపణములతోడి యుపన్యాసము లిచ్చుట. అందుఁ బైకి ధర్మపన్నము లగపఱుచుట. విమర్శనములో సాకారణాక్షేపణము లుండవలయును. అంగీకారము, మెప్పు నుండవలయును. అపుడు సద్విమర్శన మనఁదగును.

నవలలు—ఆంగ్లశబ్దమునుండి పుట్టినపదమిది. నవలలు వచనములు. మనలోఁ గాదంబర్యాదు లిట్టివియే. ఇందుఁ గథాసంవిధానవైచిత్రి యుండును. ఇవి సాంఘిక, చారిత్రిక, పరిశోధకము లనువిభాగములఁ గలవు. ఇవియుఁ గతానుగతికములుగనే యున్నవి.

1. సాంఘికనవల—ఒక బి. ఏ. విద్యార్థి, ఎదురింటిలోనో తానద్దెకుఁ గొన్నయింటనో, కన్య లేక వితంతుకన్య—ప్రేమ—వారితలిదండ్రుల యాక్షేపణ—రహస్యప్రేమ—ఎడఁబాటు—జాబులు- మొదలగునవి.

2. చారిత్రికనవల—ఒకబాటసారి, పయనము, అరణ్యము, సత్రము, మఱియొక్కఁడు మాటలాడుట, కోటరహస్యములు—యుద్ధము—ఈరీతిగతానుగతికము.

3. పరిశోధకనవల—ఒకయింట గదితల్పు మూయఁబడియుండును. తెఱచిన నెత్తురు—శవము రక్షకభటాధికారి. రయిలులోనో సత్రములోనో అపరాధి పట్టుబడుట. పరిశోధకునకు సత్కారము. ఇట్లే చర్వితచర్వణము.

ఇఁక నాటకములంగూర్చి చెప్పవలసినదిలేదు. ఇం దెన్నియో కక్కుఱితిపనులు గతానుగతిక మిందునుగలదు. పెద్దల ననుకరించుట తప్పనఁదగదు. పుటలు, పేరులు మార్చి వానికిఁ బ్రతులు వ్రాయవలదని మనవి. ఎంత నిదానముగా రచియించిన నంత బాగుగఁ గృతియుండును.

---

## ధ్రువుఁడు—సునీతి.

— బులుసు వేంకటరమణయ్యగారు. —

సునీతి—

రారా ముద్దులపట్టి! నాయనుఁగకుఱ్ఱా! రార! నాకన్నతం
డ్రీ రారా! మదనేందుసుందరవపుశ్శ్రీరార! యాలింగనం
బేరా యీయవు? చుంబనంబు గొనని వేరా కపోలంబు? నా
ఘోరాగం బదియేమిరా? జనని, నీ- కున్శత్రువై పోయెరా?

ఉ. మోమిటు ద్రిప్పవేమి? యిటు- మ్రొంగురు లిట్టు జాఱె నేమి? నా
సేమము నెంచవేమి? నను- జెక్కిటబాష్పకణంబు లేమి? నీ
కేమి కొఱంత గల్గెనో యొ- కింతయుఁ దెల్పవదేమి? నాకుహృ
త్సీమను నాటుతాపమును- దీర్పఁ దలంపవదేమి పుత్రకా?

మ. కనులం బాష్పముగాఱనేల? తనువుం- గంపింపనేలా? పన్నగ
మునుగన్నట్లు తెఱంగుఁ జూచి కడునా- మోదింపవేలా? సుఖం
బనిలోఁ జోరినరీతి నెట్టనయె నే- లా? వేఱుపల్కేల? నా
కను లెట్లోర్చునొ దుఃఖపీడితు నినుం- గాంచంగ నోపుత్రకా?

మ. పలుకేబంగరమాయెనా? జనని సం- భావించుటే కష్టమా?
కలగీతంబులఁ బాడి యాత్మకుఁ దమిం- గల్గించుటే దోసమా?

వెలలేనట్టిమహాగ్ర్యరత్నగతి నిన్- వేరీతు లాసించు నన్
దలఁపన్నానట న్యాయమయ్యె ననియే- తండ్రీ! కటా! యెంచితే ?
చ. పరుసములాడలేదు, పెఱ- పల్కుల కాగ్రహమొందలేదు; నీ
యిరుగునుబొర్గునేస్తముల- నేమియు రోసము లాడలేదు; నే
సరియనకుండ నీపనులు- సాగకయుండుట కడ్డలే దదే
కరణిని నాపయిం గినుకఁ- గాంచితివో యెఱుఁగంగ! పుత్రకా ?
క. ఉత్తానపాదుపట్టిని, జిత్తజుసొంపునకు రవ్వ- చేసెడినిన్నున్
బత్తిని సేవింపక యా, పత్తును దలపెట్టు మూర్ఖ- పశువు గలాఁడే ?
గీ. తేటిచూచినఁగడునెట్టి-వాటిపోవు, నందమున మించునిన్ను నా-నందమూర్తిఁ
దల్లడిలఁ జేయ నేరీతిఁ-దలఁపుపుట్టుఁ, గటికివానికిబోలు క- ర్కశునకైన ?
గీ. నిన్నుఁ బ్రాణపదంబుగా- నెమ్మిఁదలఁచు, తల్లియెడ దాపటికమది-తగునె నీకు?
చెప్పు మెవ్వరు ని న్నేమి-చేసినారొ, వారలను శిక్షచేయక-వదల మెపుడు
ఉ. తుంటరిపిల్లవాం డ్రెవియొ- దోసపుప్రేలుడు మాటలాడి నీ
కంటను నీరువెట్టిరె? ప్ర- గాఢతరం బగుమైత్రి లేక నీ
జంటను వీడినారె ? సుమ- జాలముఁ గోయుచునుండఁగా నె వెన్
వెంటనె వచ్చినారె ? విన- వేమి యుఁ దెల్ప వదేమి పుత్రకా ?
ధ్రువుఁడు —
ఉ. అమ్మ యిదేలనమ్మ ? నిను- న్నాత్మఁదలంచుచు నెప్డునీదు నె
త్తమ్ములఁ బోలుపాదములఁ- దప్పక ధ్యానముచేయునాకు నీ
కమ్మనిసుద్ది తెల్పకయె- కర్కశభాషణలం గలంప నీ
వెమ్మెయి నోర్చితమ్మ ? నను- నేల కలంచెదవమ్మ ? తల్లిరో ?
ఉ. తల్లివి ధర్మరూపిణివి- ధన్యవు లోకము గావనెంచు మేల్
చల్లనిదేవి వార్యజన- సంస్తవనీయచరిత్ర వట్టినిన్
బల్లుకదల్చి యేదొ యనఁ- బాల్పడి యుండఁదలంప నాలుకల్
చిల్లులువోవవే ? జగతి- సిగ్గుమాట నశింపకుండునే ?
ఉ. చుట్టము గౌరవింపక య- సూయతఁ జూచుచు నున్న నిన్నుఁ జే
పట్టినభర్త యన్యజన- భక్తిని జాటుచునున్న నాకు నీ
పట్టికి మేలుగూర్ప సమ- భావమునం జరియించుచున్న నిన్
గట్టు ! తిరస్కరించుటకుఁ- గన్నకుమారుఁడె యెంచునే భువిన్.

గీ. తల్లిఁ దలఁచుట మానున - ధర్మపరుఁడు, జననియెడ దోసమెంచుట తుచ్ఛప్రసిద్ధుఁ
డమ్మ సేవింపనట్టి క్రూ - రాత్ముఁడు - పుట్టినను బుట్టకున్నను - బడమి సమము.

గీ. తేనశక్యపదార్థముల్ - దెచ్చియీయ, నేర్పనేరని నీతులు - నేర్పుచుండ
బుడుతలందునఁ బెద్దగా - నడుపుచుండ, మాత! నీయెడ లోపమ - న్నాటయున్నె?

శా. రారాజుల్ వెఱఁగొంద నట్టిఘనసా - మ్రాజ్యైశపట్టిన్ సదా
వీరాధీశ్వరసంస్తుతిం గనుమహా - వీరాధివీరార్చితున్
బారాహ్లాదపరుం, బ్రశాంతమతి, ని - ష్పాపుఁ ద్వదీయాత్మజుం
గ్రూరాత్మన్ స్పృశియింపఁ గల్గు జను లీ - క్షోణిం గలారె? కనన్.

గీ. కానితల్లిరో! యొకచిన్న - కారణమున, మానసము స్వస్థతను దప్పి - మాట నిజము
మహిఁ గడున సహ్యమానవ - మానభరముఁ, బొందితి నిలజ్జ చేఁ గడుఁ - గుందుచుంటి

గీ. తమ్ముఁడుత్తముండు - తండ్రియంకమ్మునఁ, గూరుచుండ నేనుఁ - గూరుచుండఁ
గోరితమ్మ! తండ్రి - కూర్మి నందీయఁగాఁ, దలఁపలేదు, మాఱు - పలుకు లేదు.

ఉ. చేరువనున్న పిన్ని దరిఁ - జేరఁగవచ్చి యనూనగర్వసం
భారము వెల్లడించి "విను - పట్టి! లభింపఁగరాని పంక్తికై
చేర నగంబు, లాభమది - చేకుఱునే? యిటు వెఱ్ఱివై సదా—
సారెకుఁ గోర కియ్యది య - సంభవ మట్టితలంపు మానుమీ!

మ. వినుమో యీ ధ్రువ! నీకు నియ్యెడలఁ దా - వింతేని యున్ లేదు, స
జ్జనకాంకమ్ము నలంకరింప ఘనరా - జ్యశ్రీల నన్నింటెనిం
గొన నీతమ్ముఁడె యర్హుఁడౌఁ దలఁప నీ - కున్ 'హక్కు' లే దింతయున్
మనమూన్నా నడియూసరాజ్యఁ మిదియ - స్మద్ద్రవ్య మన్నాటలన్.

గీ. నీవు నా కొమరుండవై - నెగడితేని - రాజ్యలాభము, సర్వసం - పూజ్యతయును
గలిగియుండెడి దయ్యయో - కఠినురాలి, పట్టివగు కారణంబున - ఫలము చెడియె.

గీ. అనుచు నిట్టులు సురుచిప - ల్కాడి నాకుఁ, దండ్రిగారికి నెడఁబాటు - తనరఁ జేసెఁ
దలఁచి మెఱుఁగ నిస్వక్రతిఁ దలను దాల్చి వచ్చుచుంటి నిహ్రాదిని గార్చిచ్చు పెరుఁగ

ఉ. అమ్మ! యిదేమి పిన్ని యిటు - లాడెను? సౌఖ్యమునం జెలంగి నేఁ
దమ్మునితోడఁ గూడుకొని - తండ్రి భజింపఁగ వీలులేదె? రా
జ్యమ్మునఁ దావులేదె? దివి - జాళియు మేలన నేలు నాశ పూ
జ్యమ్మె? తలంప నీయెడల - జన్మము నిష్ఫలమయ్యెనే? కటా?

గీ. అమ్మ! నీవు నుమాఱుమా - టాడవేని, నాఁడు గోడును నెవ్వరి - తోడఁ బలుకఁ
గలుగు దెట్టులనైనను - కఠినురాలి, పట్టుదల నాశనము చేయఁ - బ్రతినఁ జేతు.

సునీతి—(తనలో)

గీ. జాలిగొల్పఁగఁదనగోడు- చాటుచుండు, పట్టినేమనియొప్పింపఁ-బలుకుదాన!
దైవమా? యేలనన్నిట్టి-తరుణిఁగాఁగఁ, గూర్చినావొక చెట్టుగాఁ-గూర్పకుండ?

(ప్రకాశముగ)

ఉ. బాలక! నీపరాభవముఁ- బల్కుచు నామది నెంచి యోరువం
జాలకయుంటి, బాష్పకణ- జాలము చెక్కులరాల నేడ్చుచోఁ
లాలన బుజ్జగించి, కను- లం దడియొత్తఁగ లేకపోతి, నీ
పాలిటితల్లి నాదునె? కృపారహితాత్మను గాక యిట్టిచోన్

ఉ. భూరిధనాఢ్యయై సకలభూరమణీరమణీయరత్నమై
సారెకు నాథు డాజ్ఞఁ గొనసాగఁగఁ జూచుచు నుండు నాతికిం
గూరిమిబిడ్డవై చనక కుందితి శక్తికి నాకుఁ గల్గుటే
కారణమయ్యె! నీకిటులు కష్టపరంపర కల్గుచుండఁగన్.

క. క్రూరాత్ముఁరాల నిన్నున్, భూరమణుని గాఁగఁ జూచు పున్నెము నాకున్
దూరస్థంబిక సురుచికి, మాయుత్తముఁడె భాగ్యమహితుఁడు తండ్రీ!

గీ. సురుచికి తోడఁ బల్కిన సుద్దినిజము, నాయనా! మాఱుపల్కంగ నాతరంబె?
యుత్తముం డనుభవమున కుద్భవించె, నీవు దురదృష్టపథమున నిలిచినావు.

ఉ. ధ్యానము వీడలేను, సురదాముల బూజలు మానలేను, స
న్మానత నర్థులం గనుట మానఁగలే నొకయింతగర్వముం
బూనఁగ లేను, విప్రులకు భూరిధనాదుల నిచ్చుటెప్పుడున్
మానఁగ లేను, దైవమిటు మాయలు పన్నుట కేమిహేతువో?

మ. ఎవరో మ్రొక్కరదేమియో పలికి నీకేదో తిరస్కారము
న్నవిమర్శంబుగఁ జేసిరంచు మదిలో నస్వస్థతం బూన సం
స్తవనీయార్యుఁడవైన నీకుఁ దగునే? తండ్రీ! మదీయోక్తులన్
సవిమర్శంబుల నెంచి పట్టుఁదల నీస్వాంతంబున న్వీడుమీ.

ఉ. శాంతమె భూషణమ్ము, భువి శాంతమె సౌఖ్యకరమ్ము, సర్వథా
శాంతమె యెప్పుడైన సువిశాలధరావృతరాజ్యమిచ్చు, వి
శ్రాంతి నొకింత గోరనిది శాంతమె యంచనయమ్ము నెంచి నీ
స్వాంతమునందుఁ శ్రాంతపగ సాధనచేయఁదలంపు మానుమీ?

ధ్రువుఁడు—

గీ. అమ్మరో! నీవు పల్కినయది నిజంబు, కానిక్షత్త్రియుఁబుట్టినై కాంచరాని
తలఁపరాని తిరస్కృతిఁ దలను దాల్చి, పట్టుదలవీడియుండు టేపగిదిఁ జెపుము?

ఉ. ఉత్తముఁ డిట్టి రాజ్యభరమూని యశోలసదాశుఁడై సుసం
పత్తును బొంది సౌఖ్యములు పల్విధముల్ గ్రహియించు నిమ్మహా
పత్తులు గల్గుచుండినను పట్టును వీడక యంతకంటె స
న్నోత్తమమైన స్థానమున నుజ్జ్వలరీతిఁ దపంబు సేసెదన్.

శా. రాజ్యం బక్కఱలేదు; తొంటిక్రియ నా రాజాంక మాసింప నీ
పూజ్యప్రస్ఫురదైహికంబులను సంపూర్తిన్ విసర్జింతు సా
మ్రాజ్యాధీశులు పొందలేని గురుసామ్రాజ్యార్థినై విశ్వసా
మ్రాజ్యాధీశుఁ దలంపఁ బోయెద మహారణ్యప్రదేశంబులోన్

గీ. అమ్మరో! నాదుదోసంబులన్ని సైచి, కన్నబిడ్డపై నొకకొంత కనికరమ్ము
నింపవేఁ డెదనమ్మ! యాసింపకమ్మ!, మరల నీపురమునకు రా మరలుదు నని.

సునీతి—

గీ. ఐదువర్షముల్ నిండనియట్టిచిట్టి పట్టి వక్కట! నీవిట్టి పగను బాసి
యడవులంబడి పోయిన నక్కటకట!, తల్లి జీవింపఁగలదని తలఁచినావె?

గీ. వద్దు నాయన! నీవుపోవద్దు తండ్రి!, తల్లిచావును నిలుపంగఁ దలఁచి నైన
నిలువు మిట నీవు, నా తండ్రి నిలిచితేని, కన్నులారంగ నేనాలు గాంచుదునురా.

# శ్రీకృష్ణదేవరాయలు.

— శ్రీవేంకట కాళిదాసకవులు —

ఏరాజు సుకవితాధారతో దిశలందు విరజిమ్మె భావ శీకరగణంబు
ఏమూర్తి సంగ్రామ భూమిలోఁ గొనకత్తి వ్రేటుచేఁ దొల్కించె వీరరసము
ఏశక్తి తనబాహుపాశంబుచేఁ గట్టి పడనైచె దౌర్జన్యఘటకులంబు
ఏకీర్తి నాటించె నించుకించుక లోకమందెల్ల దానసస్యాంకురములు
ఎవఁడు హైందవనసపుత్రహృదయకుహర
మందుఁ బ్రసరింపఁజేసె శౌర్యాగ్నిరుచులు
అతఁడు వొగడొందుఁ గృష్ణరాయాభిధానుఁ
డాంధ్రభోజాదిబహుబిరుదాంకితుండు ౧

మ. ఘనబాహాబలవిక్రమస్ఫురణతున్ భాషాద్వయీసంగత
స్ఫుటపాండిత్యము నిష్కళంకకవితాశుంభత్వభావంబుఁ బ్రా
కటవిస్తారవదాన్యసంపదయు లోకఖ్యాతసత్కార్యసం
ఘటనంబుం గలకృష్ణరాయధరణీకాంతుండు సామాన్యుఁడే? ౨

మ. అతఁ డుద్దండరిపుక్ష్మారమణసంహారక్రియాకారణా
యతవైక్రాంతి పరాక్రమప్రకటబాహాదండకల్పద్రుమో
న్నతశాఖాఫలరాజవత్తబహుళానందాబ్ధిసంతృప్తిపూ
రితకవ్యర్థిసమూచకాభిమతివర్ధిష్ణుండు కృష్ణుండిలన్

సీ. ఏఘనవంశాబ్ధికాధారభూతుఁడై తవరాయఁ బూర్ణసుధాకరుండు
ఏమహామహునిపితామహులై యొప్పు నీశ్వరరాయనరేశ్వరుండు
ఏరాజుతండ్రియై పేరొందు శ్రీనృసింహరాయనరేంద్రశేఖరుండు
ఏయుత్తముని తల్లియై యొప్పుమీఱు శ్రీనాగమాంబాఖ్యకాంతాలలామ
అతని శ్రీకృష్ణదేవరాయాభిధాను, నాంధ్రభోజాదిబహుబిరుదాభిరాము
సర్వసర్వసహామహాచక్రవర్తి, మానసముల నెన్నటికేని మఱవ వశమె? ౪

ఉ. వీరుఁడు నగ్రజన్ముఁ డగువీరనృసింహుని వెన్క రాజ్యల
క్ష్మీరమణీప్రియుం డగుచుఁ గృష్ణుఁడు రాజ్యభరంబుఁ బూని దు
ర్వారపరాక్రమక్రమవిభావసుఁడై కడువేగ జైత్రయా
త్రారతి సర్వశత్రునికరంబు జయించె శుభాకరంబుగన్. ౫

చ. చతురరణప్రసిద్ధుఁ డగుసాళువకృష్ణుఁడు దేహమందు భా
రతఘనవీరరాజరుధిరంబు ప్రవాహముగట్టుచుండ, న
ద్భుతతరధైర్యసాహసయుతుం డయి శత్రుశిరోనగంబులన్
శితకరవాలవజ్రమున నేలకునొత్తె నశేషశక్తినై ౮

గీ. ఉదయగిరిపైకి దండెత్తితదధినాథు, నైన ప్రహరేశ్వరుని యుద్ధమందు గెల్చి
యచటిదుర్గంబుఁ గొనియెఁ బరాక్రమమున, ధీరుఁడనఁ గృష్ణరాష్ట్రనాథుఁడు గాఁడె.

మ. తనయన్ నీకునొసంగువాఁడ నని తొల్తం బల్కి వంచించున
క్షనకాధీశ్వరవీరరుద్రగజరాట్స్వామినాథుఁ న్ శౌర్యధై
ర్యనియుక్తిం గలనన్ జయించి ఘనవింధ్యక్ష్మాధరారణ్యరం
గనివాసం బొనరింపఁగాఁ దఱిమె, విఖ్యాతుండు కృష్ణుం డిలన్. ౯

మ. అమితద్రోహ మొనర్చినట్టి నరపుం డావీరరుద్రుండు, త
ద్విమతాంతఃపురభామినీతిలకముల్ వేవేగఁ జేఁజిక్కినన్
బ్రమదం బొప్ప వధింపఁబోక విపినప్రాంతంబునందున్ నివా
స మొనర్పం డఱిమెన్, మహాత్ములు కృపాసాంద్రైకచిత్తుల్ గదా. ౧౦

క. ఆవీరరుద్రగజపతి, భూవిభునకుఁ గలుగు నెనుఁగుఁబుత్త్రికఁ జిన్నా
దేవిం దనకుం బట్టపు, దేవిగఁ గైకొనియెఁ గృష్ణదేవుఁడు ప్రీన్. ౧౧

సీ. రాణ్మహేంద్రపురీవరము నిమేషములోన సాధించె నేధారుణీధవుండు,
బెల్లముకొండయున్, వినుకొండ, మాటమాత్ర జయించె నేవీరధర్మరతుఁడు
విజయవాటికి బోయి విజయసంపదఁ గాంచి తనరారె నేసత్యతత్పరుండు,
కొండపల్లియునల్లకొండవీడు రయంబ కొనియె నేవరనీతికోవిదుండు,
మఱియుఁ బొట్నూరు మొదలుగాఁ బరఁగు నెన్నొ
స్థలములఁ జయింపఁ జాలె నేధైర్యశాలి
పూర్వదిగ్జైత్రయాత్రాభిముఖతనరుగు
నతఁడు శ్రీకృష్ణదేవరాయఁడు ఘనుండు

గీ. అలకళింగదేశాధీశుఁ డగు ప్రతాప, రుద్రదేవుని పుత్త్రిఁ దిరుమలదేవిఁ
గృష్ణరాయండు పూర్వదిగ్విజయయాత్రఁ, జేయునప్పుడు పెండ్లాడె శ్రీకరముగ

మ. ఘనుఁ డాకృష్ణుఁడు పూర్వదిగ్విజయముం గావించి లోకప్రశ
స్తిని సాధించి, సతీసమేతుఁ డగుచున్ సింహాచలస్వామి ద
ర్శనసంరంభ మెలర్పఁ బోయి యట విస్తారం బొనర్చెం గదా,
ధనధాన్యాభరణాదిదానముల నౌదార్యం బవార్యంబుగన్. ౧౨

ఉ. నైజభుజాపరాక్రమఘనప్రతిభావిభవాగ్నికీలికా
తేజము లుజ్జ్వలత్వమున దిక్ప్రకరంబుల నాక్రమింపఁగా
బీజపురీతురుష్కులవీరవనంబు దహించి, కీర్తియొం
తేజగమందు నిండ నతఁ డేసులఖాను జయించె నుద్ధృతిన్. ౧౬

గీ. గజపతులనొడ్డిరాజులఁగలనగెలిచి
యశ్వపతులఁ దురుష్కుల నణఁచివైచి
తెనుఁగురాజుల నరపతులను జయించి
మూరురాయరగండఁడన్ ముఖ్యబిరుద
మొందె శ్రీకృష్ణరాయాధిపోత్తముండు. ౧౭

గీ. సై్వరభావపు దీవియల్ సాగఁదీసి, స్వచ్ఛహృదయాలరత్నముల్ సానపెట్టి
భారతీయస్వతంత్రసంపదలఁ బెంచి, యిచ్చెనతఁడు స్వేచ్ఛాక్షీరవృష్టిపుష్టి.

శా. ఆసత్త్వాఢ్యుఁడు కృష్ణరాయఁడు ఘనుండై యాంధ్రగీర్వాణభా
షాసాహిత్యసముంచితస్ఫుటమనీషావంతుఁడై సత్కవి
త్వాసాధారణచాతురీమయపటుత్వావాప్తి భాషాద్వయిన్
వ్రాసెన్ లెక్కకు మిక్కుటంబు లగుకావ్యంబు ల్విపుల్ మెచ్చఁగన్. ౧౮

మ. పటుధైర్యాప్తిఁ గళింగదేశము జయింపంబూని దండెత్తియం
తట శ్రీకాకుళవిష్ణుదేవుఁ గలలోనం గాంచితత్ప్రేరణన్
ఘటియించెం దనప్రౌఢిమంబు తెలియంగం గృష్ణరాయండు వేం
కటశైలస్థితదేవతాంకితముగాఁగన్ విష్ణుచిత్తీయమున్. ౧౯

సీ. హరినామకీర్తనాయత్తచిత్తుం డయ్యు హరనామకీర్తనాయత్తుఁ డతఁడు
మధుసూదనమతాభిమానమానితుఁ డయ్యు నన్యమతద్వేషశూన్యుఁ డతఁడు
వైష్ణవకవిరాజపరిరక్షకుం డయ్యు, శైవకవీంద్రరక్షకుఁ డతండు
విష్ణుసందర్శనాభిరతమానసుఁ డయ్యు, గిరిశసందర్శనాభిరతుఁ డతఁడు
అఖిలమతనిత్యసమవర్తి న్యాయమూర్తి, సకలదిగ్దేశమాన్యరాజన్యనిచయ
మస్తకకిరీటరత్నధామప్రదీప్త, చరణకహ్లారుఁ డమ్మహాసత్త్వఘనుఁడు. ౨౦

శా. ఆయౌదార్యవికాస మావితరణవ్యాపారకాంక్షోదయం
బాయవ్యాజకృపాకటాక్షకలనం బానిత్యసత్యవ్రతం
బాయత్యంతభుజాబలప్రకటనం బాసద్గుణానీక మా
హా! యాకృష్ణునియంద కాక పరులం దా, కాఁపురంబుండుటల్? ౨౧

సీ. పెద్దనార్యుని గౌరవింపఁగల్గినరాజు, గౌరవింపఁడె తిమ్మకవివరేణ్యు,
అలరామభద్రుని నాదరించినమేటి, యాదరింపఁడె సూరనార్యసుకవి,
ధూర్జటికవి సత్కృతులఁ దన్పినఘనుండు, తనుపకయున్నె మల్లనకవీంద్రు,
శ్రీరామకృష్ణుఁ బోషించియుండినఱేఁడు, పోషింపఁడే రామభూషణకవి,
అష్టదిగ్గజప్రఖ్యాతి నలరునట్టి, కవులనెల్లరఁ బ్రోవఁగాఁ గలుగుదాత
తక్కుఁగల్గుసమస్తసత్కవులఁ బ్రోచు, నాంధ్రభోజుఁ డటన్నచో నబ్బురంబె ?
సీ. గురుకళానిధిగానఁ గువలయంబుల నేలు రాజప్రధానాప్తిఁ బ్రబలునతఁడు
సరసోత్తముఁడు గాన సత్కవీంద్రులఁ బెంచు ఘనకీర్తిసంయుక్తిఁ గ్రాలునతఁడు
బుధభవ్యతరుఁడు గావున బుధావళిఁ దన్పు దాతృత్వవిఖ్యాతిఁ దనరునతఁడు
మధుపదాత్ముఁడుగాన మహితాళిఁ బోషించు సుమనోయశస్ఫూర్తి నమరునతఁడు
సకలసామంతరాజన్యసేకరదత్త, వివిధబహుళోపదావిధావిజితజిష్ణుఁ
డనవరతసత్ప్రవర్తిష్ణుఁ డఘనిరాక, రిష్ణుఁ డతులసహిష్ణుండు కృష్ణుఁ డౌర!

---

సీ. పదచాళి వినిపించు వైభవస్ఫురణకుఁ గొమరొందు ముత్తేలకుచ్చుచెల్లు
జక్కిణివినిపించు చాతుర్యమహిమకు రంజిల్లు వింజామరములు చెల్లు
తాళవిన్యాసభేదమున నాట్యానకుఁ దులలేని బిరుదుకాహాళలు చెల్లు
అభినయుం బొనరించు నతిశయప్రౌఢికి నిరతంబు డవిణెమల్హారులు చెల్లు
ననుచు నేకోజిభూపాలుఁ డనుదినంబు, మెచ్చి ముత్తేలకుచ్చు నీకిచ్చుసభను
గలితగుణపేటి యాశ్రితకల్పవాటి, భావజనిఘోటి ముద్దుమంగావధూటి.

సీ. శివునికంధరముపై శేషునిశిరముపై జలజారియురముపైఁ జఱచిచఱచి
భారతివేణిపై బలునిశ్రుపాశిపై నారదువీణపైఁ దూఱితూఱి
తారాద్రితరులపైఁ దార్క్ష్యునిగరులపై వలిమలచరులపై వ్రాలివ్రాలి
నరసింహునక్కుపై నందిబల్మొక్కుపై గజపతిచెక్కుపైఁ గవిసికవిసి
చెలఁగె జగములఁ దావకోజ్జ్వలితయశము, హారహీరపటీరడిండీరరుచుల
కచ్చియచ్యుతభూపాలుఘునకుమార, వినుతకవిచంద్ర రఘునాథ మేదినీంద్ర.

సీ. మలయకేతన పాండ్యమధురాధినాథాగ్రసామంతనృపనీకు జయముజయము
కున్నమన్వయవార్ధికువలయినీనాథ సజ్జనావననీకు జయముజయము
మళ్వరాయాధిప మహనీయబిరుదాంక సంగరార్జుననీకు జయముజయము
అనుమసక్తవిరాజులు వినుతిసేయ, విశ్వధాత్రీస్థలంబున వెలసితౌర......
తక్కినది లేదు.

ఇట్టిపద్యములు కవిపేరు తెలియకుండ 25 గలవు. మఱియునైదుపత్రములలో నిట్లేయెవ్వరివో పేరుతెలియని సీసపద్యము లున్నవి.
ఇతఁడుసామాన్యుఁడే తిర్మలేంద్రుకోటి, విజయరఘునాథతొండమాన్విభుకిరీటి,
రాయబిరుదాంకరఘునాథరాణ్మృగాంక, యను మకుటములతోఁ గొన్నిపద్యము లున్నవి. కొన్నిమాలిక లున్నవి.

(33) దత్తాత్రేయశతకము. గ్రం. సం. 158.

ఈశతకము వేదాంతబోధకము. మూఁడవపద్యములో :—

క. పరమానందయతీంద్రుఁడఁ, బరమవివేకానుబంధభాగ్యోన్నతిచే
తరచించెదఁ గృతిఁ గైకొను, తరుజతికరుణావిధేయ దత్తాత్రేయా.

అని కవిపేరు పరమానందయతీంద్రుఁ డని తెల్పఁబడెను. శతకములో మొదటినుండి 47 పద్యములు మాత్రమే కలవు. కొన్నిపద్యములు —

1. శ్రీవిలసిత వరసంయమి, సేవితపాదారవింద చింతితఫలదా
కావుము నను నెల్లప్పుడు, దావరముగ గుణవిధేయ దత్తాత్రేయా.

2. శరణాగతవత్సల మీా, చరణాంబుజములకుఁ బద్యశతకం బిపుడే
కరమర్థి విన్నవించెద, ధరలోఁ గగుణావిధేయ దత్తాత్రేయా.
3 ఎఱిఁగించుకొన్న దెఱుఁగను, యెఱిఁగెదు నెఱుఁగించుకొందవె యెప్పటికిని నీ
యెఱుకకలవాఁడె ముక్తుఁడు, ధరలోపల గుణవిధేయ దత్తాత్రేయా.
8. తగులెందు తమకులేకే, తగిలితి మని భ్రమసి కర్మగతిచే జీవుల్
మగుడ జనించుచు మాయం, దగిలిరయో మోసమాయె దత్తాత్రేయా.
9. పుట్టక మునుపును దానే, పుట్టిన పిమ్మటను దానె పొలిసిన వెనుకన్
గట్టిగఁ దానే నిజమున, దట్టంబగు మాయ పోయె దత్తాత్రేయా.
47. గురుశిష్యులనఁగ నిద్దఱి, గుఱుతులు చెడ్డపుడె ముక్తికుదురై నిలువన్
గురుశిష్యభావ మెఱుఁగను, దరమే సన్మానిగేయ దత్తాత్రేయా.
దత్తాత్రేయశతకములోని దని-

క. ఎంతదయో దాసులపైఁ, బంతంబున మకరి పట్టి బాధింపఁగ శ్రీ
కాంతుండు చక్రమంపెను, దంతావళరాజుఁ గాయ దత్తాత్రేయా.

అనుపద్యమును బల్లెటూరుబడులలో నొరవడికుదుర్చుటకై వ్రాయుదురు. పైశతకములో నిట్టిపద్యమునకుఁ దావుండునా ? వేఱొకదత్తాత్రేయశతకములోనిదా :

42. కర్మము జన్మము కొఱకే, కర్మత్యాగంబు ముక్తి కైకొనుకొఱకే
మర్మ మిది తెలియ జనులకు, ధర్మమయా గుణవిధేయ దత్తాత్రేయా.
44. హంసగతివలన నజ్ఞుఁడు, సంసారై మగుడఁ జచ్చి జనియించు నయా
హంసగతినిలువఁ బ్రాజ్ఞో, త్తంసుఁడయ మౌనిగేయ దత్తాత్రేయా.

శతకముపూర్తిగాలేదు. ఈపుస్తకమునందుఁ గాంతాలలామశతకము, భాస్కరశతకము, ఆంజనేయదండకమును బలువితము లగుశృంగారాదిపద్యములును గలవు.

క. నలుగురు నినుఁ బలుమాఱును, గెలుతురు సుఘనోక్తి దీప్తికృత్యాకృతులన్
నలుగురు నినుఁబలుమాఱును, బళిబళియనఁ గచ్చిరంగ భాగ్యతరంగా.
క. చక్రిపి దయచే నాదా,ర్యక్రమమునఁ గర్ణుఁడా పరాక్రమవక్రో
పక్రమణక్రమపరభీ, మక్రోధారాయశౌండమూర్ఖరఘునాథా.
క. నేఁటిదొరలెల్ల నీకును, సాటియ యావిద్ధయుద్ధజాంఘాలికసం
ఘాటనిరాఘాటశర,ద్ఘోటకరాట్ప్రతతి రాజగోపాలపతీ.

క. వెఱవను పోరా నాతో, సరసాలా రూకలీక జాణతనాలా
పొరుగింటిదాని కైతే, వరహాలా రామకృష్ణ వసుధాపాలా.

సీ. చౌకట్లు పోగులు సరిపణల్ తాళీలు గదలంగఁ దేజి నెక్కంగవచ్చు
ఉద్దాపరంగులు నిద్దంపుకేడెముల్ వెలయంగ వీధిగో వెడలవచ్చు
పండుగ వేఁటలు పందెముల్ వేసుక చేకొద్ది తుఁటలు సేయవచ్చు
వెలయాంధ్రకేళికల్ వేడుకల్ చూచుచుఁ గోరమీసము దిద్దికొనఁగవచ్చు
గాక యందులకేమి సంగ్రామభూమిఁ, గక్కసపుబిరుదువజ్రీలఁ ద్రొక్కుటరుదు
కోటికులవర్యరణనిరాఘాటధైర్య, రాయబిరుదాంక రఘునాథరాణ్మృగాంక.

సీ. చలువచీరలుగట్టి కలుగుసొమ్ములువెట్టి నిలువుటద్దంబున నీడగాంతుఁ
బరిమళంబులుగూర్చి బాగాలపొడిచేర్చి నిగ్గైనతట్టలు నిండనింతు
రక్తిగాఁ గనిపింప రాగము ల్వినిపింప మేలైనవీణలు మేళవింతుఁ
దొడిమ పోవఁగ గిల్లి విడిపూలు వెదచల్లి యనువుగాఁ బానుపు నలవరింతు
నీవు వత్తు వటంచును భావమునను, అవుర బాగాయెఁ గానీయ దలివమాయ
గూడ నీతోడ తోరణాగాళికూడ, కామినీమోహనాంగ గోకర్ణలింగ.

ఈగోకర్ణలింగ యనుమకుటము గలశృంగారపద్యములు పెక్కులున్నవి.

సీ. ఇది మనోహరకాంతి కింపైనబింబంబు బింబంబుగా దది బెడఁగుకెంపు
కెంపుగా దది కంటి కింపైనమంకెన మంకెన గా దది మంచిచిగురు
చిగురుగా దది మంచి జిగిహెచ్చు పగడంబు పగడంబు గా దది పానకంబు
పానకం బదిగాదు పలుచని చెఱకుపాల్ చెఱకుపా లవిగావు కుఱుచతేనె
కుఱుచ తేనియ గాదది కుసుమరసము, కుసుమరసమునుగాదదిగొనబుజున్ను
జున్ను గాదది సవిగల్గు సుధల దీవి, సుధల దీవియుఁ గాదది సుదతిమోవి.

సీ. గోత్రామరేంద్రుల కొంగుబంగారుగా ధనములు వెసనిచ్చు దానకర్ణ
కవులదారిద్ర్యాంధకారంబు లణఁగింప తరుణార్కనీభువి (?) దానకర్ణ
నిరుపేదలను గన్న నిమిషమాత్రంబున దయను గటాక్షించు దానకర్ణ
పాత్రులంచని విన్న మాత్రాన నేవారి దైన్యము ల్మాన్చిన దానకర్ణ
నీసమానుల మహిలోన నేనుగాన, ఘనముగానొక భూరూహధన మొసంగి
ననుగరుణఁ జూడు మిప్పుడు నయసకలస, నాధ రాజావిజయరఘునాథరాయ
తొండమాన్ బహదరు ధరామండలేంద్ర.

పాపమీయర్థి యెవ్వరో, అడిగిన ట్లిచ్చినాఁడో లేదో,

(34) రామాయణవచనము. గ్రం. సం. 168.

శ్యామరాయకవి రచించిన వచనకావ్యము, అరణ్యకాండములోని 75 సర్గలకుఁ దెఱఁగు. కవింగూర్చి—

"...సాహిత్యవిద్యాగోష్ఠీప్రసంగంబున నాశ్వలాయనసూత్రుండును వాసిష్ఠగోత్రసంభవుండును కృష్ణయామాత్యపుత్రుండును షడ్దర్శనీపారంగతుండును లక్ష్మీపతినామధేయాగ్రజు ననుజుండును సంస్కృతాంధ్రభాషాకవితానిర్వాహక సకలవిద్యాపారంగతుండును అనఘుండు శ్యామరాయవిద్వత్కవి యగు నన్నుం బిలిపించి చతుశ్శాస్త్రపండితుండవు కవికులతిలకుండవు...కళావల్లభుండ వని కొనియాడి కర్పూరతాంబూలం బొసంగి" కృతిపతి యైనసుబ్బరాయసెట్టి పలికి నట్లున్నది. కావున కవివిషయము తెలిసినది. సుబ్బరాయసెట్టి యెవ్వరు?

శ్రీకాంతిమతీశాలివాటీశ్వరకరుణాకటాక్ష ప్రశమితసకలాంతరాయుండును సేతుహిమాచలమధ్యవర్తి విద్వత్కవినికరసంస్తూయమానుండును దక్షిణకాశీతటతామ్రపర్ణీతీరస్థిత నిరంతరసత్రాన్నదానసమ్మోదమాన భూసురాశీర్వాదసంప్రాప్త సమేధమానోత్తుంగశతాంగమాతంగ తురంగపదాతిసంగతనవరత్నవిరాజితమందిరుండును చతురుదధిముద్రితవిశ్వవిశ్వంభరావలయపరిపాలన రాజాధిరాజసన్మానితుండును సకలగుణగణాలంకృతుండును వాసవకన్యకావరప్రసాదశాశ్వతైశ్వర్యవిలాసుండును వైశ్యకులరత్నరత్నాకరుండును పరిసెట్లగోత్రసంభవుండును తుమ్మలపాటి మన్నారుసెట్టిపౌత్రుండును మణప్పార వేంకటకామిసెట్టిపుత్రుండును నిజసుకృతవిశదీకృతమహనీయ పాతివ్రత్యాదిగుణకదంబ యగుకృష్ణమాంబావధూగర్భశుక్తిముక్తాఫలుండును......గురుమూర్తి సహోదరుండును...... శ్రీవిజయరంగచొక్కనాథమహీవరకరుణాకటాక్షవీక్షణపాత్రుండును వణిగ్గ్రణి యగు సుబ్బరాయవైశ్యధౌరేయుండు."

ఈశ్యామరాయకవి విజయరంగచొక్కనాథునికాలములోనివాఁడై యుండియు సుబ్బరాయసెట్టితో- "......శ్రీమద్రామాయణంబు వచనకావ్యంబుగాఁ జేయు మని పలికితివి నీవు కృతార్థుండ వైతివి. తొల్లి వాల్మీకీయ రామాయణ మహాకావ్యంబు భాస్కరకవి పద్యకావ్యంబుగా రచనచేయించె రంగనాథకవి ద్విపదకావ్యంబు చేసె నితరులెవ్వరును వచనకావ్యంబుగా రచన చేయనిది నీవు నేను జేసినపుణ్యంబుగా నీపేర నంకితంబుగా రచనచేసెద నని"

(కవిపలికి)...నవరసాలంకారంబుగా చాతుర్వర్ణాశ్రమజనంబులు పఠియింప యోగ్యంబుగా శ్రీమద్రామాయణంబు...చేయంబూనినాఁడు. దీనింబట్టి యిప్పుడు మనకుఁ గనఁబడు వచనకావ్యము లగు రామాయణము లీరామాయణము నకుఁ దరువాతివా ?

ఈసంపుటములో నారణ్యకాండ మొక్కటియే యున్నను, బాలకాండము మొదట నుండఁదగిన యీపీఠికకృత్యాదిపద్యములు నిక్కడఁ జేర్చుట మనకీయొక్క కాండమే కాక యన్నికాండములును రచియింపబడినవని స్పష్టపఱుచుటకుఁ బనికివచ్చునవి కృత్యాదిపద్యములు వ్రాసిన ౧౨ పత్రములలోనివ్రాత యొక్కటిది తక్కినకథాభాగమువ్రాఁత వేఱొక్కటిది. ప్రతిసర్గమునకును "ఇతి శ్రీమదారణ్యకాండంబునందు అసహాయశ్యామరాయవిరచితం బహువచనకావ్యంబునందు షడాఱువ్నొకటవసర్గార్థము" అనియిట్లుగలదు. ఆరణ్యకాండము సర్వమును డెబ్బదియైదుసర్గలున్నది. సప్తసంఖ్యను దెలుఁగులో "ఏడు" అనిన నోదనసంఖ్యయని పేరుపెట్టి ఛాందసముగా ఆఱువ్నొక్కటియనుట కలదు. అట్లే యిక్కవియుఁ బదాఱువ్నొక్కటి యనిచెప్పినాఁడు. ఆయాసర్గముల ప్రారంభమునను —

క. జాయాపహరణానంతర, శోకాయుజసంతాపజాత ఘనతరచింతా
భూయోన్వేషణలక్ష్మణ, ధీయుతవచనాభిరామ తేజోరామా. ౨౩ సర్గము.
క. రాక్షసకృపాణవిదళిత, పక్షిద్వయ పాదజానుపార్శ్వకరోటీ
కుక్షివిలోచనచంచూ, పక్షీశుణమోక్షదాన భాగ్యనిదానా ౬౨ సర్గము.
క భీకరకబంధబాధక, సాకల్యభుజప్రసార సంగ్రహవార్తా
శోకసలక్ష్మణరాజ, ద్రాకాశశికీర్తిజాల రామనృపాలా ౭౦ సర్గము.

ఇట్లీయాతాప్రుల కథాసూచనము విషయసూచికవలెఁ బద్యములు చేర్చినాఁడు. మొదట శ్యామరాయకవి పద్యకవిత్వముం గొంత చూపి తర్వాత వచనరచనఁ గనఁబఱుతము.

క. శ్రీతులసీ దామోజ్జ్వల, వాతాత్మజ సేవితాంఘ్రివనరుహయుగళా
కాతర నతజనకైరవ, శీతలగుణసాంద్రసోమ శ్రీరఘురామా.
సీ. ఎవ్వని మదినెంచ నిందిరాదేవియు మందిరంబునదుండి మహిమలొసఁగు
నెవ్వని నుతియింప నిప్పితకవనంబు నిచ్చిశారదయు సన్నిధియొసర్చు
నెవ్వని బింబంబు వీక్షింప నింద్రియగ్రామంబు లన్నియుఁ గదలకుండు

నెవ్వాని నామంబు నెన్నుచో జనులకు బహుపుత్రలాభంబు పరఁగు చుండు
అతఁడు శ్రీరాముఁ డఖిలసన్నుతచరిత్రుఁ, డాశ్రితవనవసంతుఁ డబ్జజాది
వినమదమరముకుటతటవివిధరత్న, కాంతికలితపదయుగుఁ డు కాంతినొసఁగు.

సీ. ఎవ్వనిప్రాయంబు మువ్వంపుఁదోఁటకు దీర్ణాంగ తాటక దృష్టిమొసఁగ
యెవ్వనికరకరి కిక్షుఖండముగదా చండిశుకోదండదండవరము
ఎవ్వనిబాణాగ్ని కిందనమ్ములుగదా యతికాయకుంభకర్ణాసురతతి
యెవ్వనివిశిఖధారేందీవరాక్షికిఁ బంక్తికంఠుఁ తలల్ బాతులాట
అతఁడు శ్రీరాము...

శా. శ్రీమత్కోసలరాజు ప్రేమ నిజలక్ష్మీకాంతికై చేయఁగాఁ
గామార్థంబులు ధర్మమోక్షము లిలంగాంక్షింపఁ దానీయఁగా
సీమాతీత దయావిశేషఘనుఁడై చేదోయిపద్మంబుచే
ధామశ్రీసర్వ సుబ్బరాయకృతినేతం బ్రోచి శ్రీనీవుతన్.

క. శ్రీవేంకటాద్రినేతయు, భావంబునఁ దన్నుఁ దలఁచుభక్తుండగునా
ధీవరు సుబ్బారాయని, కావిశ్రుత...కీర్తికాంతులనొసఁగున్.

మ. శరమావిష్ణువు బ్రహ్మసారథియు నశ్వంబు లక్షావేదముల్
పరఁగన్ ధానుశితేరు సూర్యశశులుం బాడ్గొప్పధానుష్కుఁడా
పురముల్ గూల్చినజోదు నాసుకృతికిన్ బొందొప్ప శ్రీలాదిగా
సిరి మాణిక్య మహాధనాఢ్యజయలక్ష్మీప్రాప్తిఁగాఁ జేయుతన్.

ఇట్లేవో మనశ్యామరాయకవి పద్యములు వ్రాసికొనుచుండఁగా—

సీ. తీఁగెచెంగటనున్నతిలకవృక్షముమాడ్కి బలువిల్లుమూఁపునఁబరఁగువాఁడు
కాఁడత్రోఁజెలువొందుకమలంబు తెఱఁగునఁగరమున జెక్కించుశరము వాఁడు
కరుణారసమ్ములు కనుఁగవ నలరంగఁ జిఱునవ్వుమోమునఁ జెలఁగువాఁడు
పాదసేవకుఁ జేరుపవనజుకరమునఁ గైదండగైకొని కదలువాఁడు
రాజపుత్త్రుండొకఁడు వత్సరాయనెడి, పలుకులను నను బిలువఁగ భక్తిఁ గ
వేకువను గలలోనను వెఱఁగునంది, యేమిపనియనంగను నిట్లనియె.

"నాదుచరిత్రము నీవును, నాదరమునఁ దెనుఁగుఁజేయు" మని చెప్పి
నాఁడఁట వచనశైలిఁ జిత్తగింపుఁడు:—ఏకాదశసర్గప్రారంభము:—

క. సీతాసాంత్వనపూర్వక, ఘాతుకరక్షస్సమూహ ఖండనవార్తా

దండకారణ్యంబునఁ జనునప్పు డగ్రభాగంబున శ్రీరామదేవుండును మధ్యంబునందు సుమధ్యమయగు సీతాకాంతయుఁ బిఱుదిదెస బాణబాణాసనంబులను పాణిచేరాఁశించు లక్ష్మణుం డనువర్తించి చనునప్పు నారాజకుమారు లిప్పుడు నానావిధములగు పర్వతములమధ్యప్రదేశములు వనములు వింతవింతలై రమణీయములగు నదులుంజూచుచు సీతాకాంతామణితోడంగూడి చనునప్పు డానదీమధ్యభాగమునఁ జెలువలరు నిసుకదిబ్బలందు సంచరించు బెగ్గురులు జక్కవలు జలంబునందు జనితము లగునీరుకోళ్ళు నీరుకాకులతోడఁగూడి తామరలచేఁ దవరారు కొలంకులు గుంపుగుంపులుగ సంచరించు జింకలను మదగర్వితములై గొప్పలగు కొమ్ములచేఁ గొమరొప్పు వృషభములను గారెనుపోతులను వనవరాహములను జెల్లును విఱిచి పడవైచు వేతండములను నవలోకించుచు దూరంబగు మార్గంబును గడచి సూర్యుం డస్తగతుండగు సమయంబున సహస్రదళములచే సంకులంబగుపద్మములు నూఱురేకులచేఁ బొలుపలరు పుష్కరంబులనెడి తామరసనహితంబును సమీపదేశంబున సంచరించు సామజములచే సమలంకృతంబును... ..యోజనదూరవిశాలం బగుతటాకంబు నవలోకించి ప్రసన్నజలంబును రమణీయంబునగు నాతటాకంబునందు గీతంబు వాదిత్రంబు నాట్యవీణయు మర్దలంబు పిల్లగ్రోవి కంచుతాళం బనెడి చతుర్విధవాద్యములనాదంబు వినంబడునప్పు నచట నొక్కనిం గానక......ఇట్లు 151 పత్రములలో నారణ్యకాండము గలదు.

పరిషత్తులో—బాలాయోధ్యాకాండములును గలవు.

(35) శ్రీబాలగోపాల శతకము. గ్రం. సం. 901.

ఈశతకము పుసులూరి యుమాపతికిని బాపమాంబకును సుతుండును, శ్రీమదాత్రేయగోత్రుఁడు నగు సోమనామాత్యునిచే రచియింపఁబడినది. అష్టోత్తరశతసీసములతో నలరారుచు గ్రంథము సమగ్రముగ నున్నను, గ్రంథకర్తనివాస మెచటను దెల్పఁబడి యుండలేదు. గ్రంథకర్త కాలమును సూచించు నితరకవులుగాని రాజులుగాని వర్ణింపఁబడియుండలేదు. గ్రంథాంతమున 'శోభకృతు నామసంవత్సర మార్గశిరబహుళ ౬ జయవారం పోడూరి సూరప్పగారి మనుమలు రామప్పగారికుమారుడు మృత్యుంజయుడు అనువారు నిత్యపఠనార్థమై వ్రాశ్నిమాతృక చూచి కస్తూరి సోమరాజుగారి కుమారుడు వెంకన్న.........వ్రాసెను'...ఇం దుదహరింపఁబడిన శోభకృతు

సంవత్సరము క్రీ. శ 1743 నకు సరిపోవుటచే శతకము 18 శతాబ్దమున రచియింపఁబడియుండవచ్చు నని తోఁచుచున్నది. శతకమందలి శైలి సరళముగ నున్నను గ్రంథపాతలేఖకప్రమాదములతోఁ గొన్నిస్థలముల ననన్వయముగ నున్నది. నీలశైలపాలుఁ డగు గోపాలబాలు నుద్దేశింపఁబడుటచే గ్రంథ మా ప్రాంతమున రచియింపఁబడిన దేమో యనుసందేహ మొదవుచున్నది, గాని, యిదమిత్థ మని నిర్ణయింప వలనులేదు. శైలిని దెల్పుటకై యీక్రింది పద్యముల నుదాహరించుచున్నాము.

సీ. శ్రీశుభద్రాకృతిఁ జెలువొంద లచ్చికిఁ బ్రాణేశుఁ డయ్యె నేపరమపురుషుఁ
డవని నీలాచలం బనెడి వైకుంఠంబుఁ బాలించుచుండు నేభద్రమూర్తి
పతితపావనయశఃపాండురచంద్రికా ధవళితాజాండుఁ డేదైవరాయఁ
డపవర్గదానదీక్షాంకమై భువనైకపావనం బెవ్వని పాదయుగము
అట్టినీపాదములకు సాష్టాంగవినతిఁ, జేసి కీర్తింతుఁ బురుషార్థసిద్ధికొఱకు
బాలగోపాల కరుణాలవాల నీల, శైలపాలవనీపాల చారులీల-

సీ. గోపికాకుచకుంభ కుంకుమారుణహార కలితవిశాలవక్షంబువాని
రాసకేళికళావిలాసకుతూహలారంభసంరంభవిభ్రమమువాని
గోపికాగీతానుకూలనృత్యక్రమ ప్రకటహస్తావలేపములవాని
కటకనూపురఝుణత్కారానుగత కరతాళప్రబంధకృత్యములవాని
గొమరుగోపాలకాకృతిగొన్నవాని, నిన్ను భజియింతు నామనోనిలయమునను.

సీ. ఇందీవరశ్యామ సుందరాంగముతోడ శిఖిపింఛభూషిత శిరముతోడ
మాణిక్యమణివర వేణునాదముతోడ రమణీయపీతాంబరంబుతోడ
గోపాలకాకృతి కౌమరుప్రాయముతోడ వరహాసితాస్యపద్మంబుతోడ
వనమాలికాగంధ వక్షఃస్థలముతోడ నవరత్నమయభూషణములతోడఁ
గన్నుదోయికిఁ బండువుగాఁగ మదికిఁ, బ్రేమపుట్టఁగ సాక్షాత్కరింపవయ్య.....

సీ. నిరుపమాగమసార నిగమాంతసంచార నవనీతచోరవందనము నీకు
సకలామరాధ్యక్ష సన్నుతఫాలాక్ష తామరసాక్ష వందనము నీకుఁ
బతితపావననామ భద్రగుణస్తోమ దైవలలామవందనము నీకు
సకలలోకత్రాణ సత్కృపాపారీణ దానధురీణవందనము నీకు
అనుచు నానంద భావమగ్నాంతరంగ, జనితరతి నీకు నిత్యవందన మొనర్తు...

చ. వెనుకకుఁ బోలంతు లత్తెరువు వేగఁ గన న్మనుమనోవ్రజంబు దాఁ
బెరు నెఱిగుంపుటి గ్లొరసి పెల్లు వహుం గరినంపురత్నముల్
సను *నటుసేయుఁ దద్గుణము సన్నను దత్ప్రృతి కేల చాలెడుం
గనుఁగొన †నట్టి నైకగుణగామిత స్తనులంపు వింతయే ౧౪౪

క. వలఁ బాసిన జక్కవకవ, వలె జాలియ నెడయు మేలు బంగరుబొంగ్రం
బులు వోలెఁ గుచము లగపడ, బలుఱొమ్మపయి న్నెలంగుపయ్యెదజాఱున్.

చ. తెలివకుఁ గెంపు గంట నెఱత్రెవ్వని బావ్పగణంబు లత్తఱిన్
మురు వగుఁ గొల్తఁ గావి తెలిముత్యములై మఱి వెండి యూర్పుఁ బె
క్కుటిమినఁ గందుమోవిపయి నాని వెసం ‡గయిపెక్కుఁ గెంపులై
నెఱిఁ జనుగట్టులన్ దొరసి నీటకుఁ గ్రాఁగిన పాత్రజంబులై. ౧౪౬

గీ. కన్నె కైదండ లేక మున్నన్నఁడేని, నడుగు వెట్టఁగఁజాలని యబల తెంపు
కతన లేనిదిజవమూనికడఁగినడచె, నహహ పూబోణులధికసాహసలుగారె.

ఉ. అంతము లేని పంకజభవాండము లోకైకఁ దాల్చుకుక్షి మే
ల్వింతలమాయ యెల్లని నవేద్యమహామహిమంబుచే నణు
స్వాంతమునందు లీలగ నహర్నిశమున్ భరియించునట్టియ
క్రాంతకుఁ దోఁచు గావలెనె కంతుఁడు తోడుగ నొంటి శ్రీహరుడునే. ౧౪౮

వ. ఇట్లు చని యంత. ౧౪౯

క. నవరసభలురుచితోషిత, కవిరాజను సుప్రసాదఘటితము నగుచున్
ధవళాక్షి సమ్ముఖం బగు, కవిసత్కృతిఁబోలు కేళికావన మొందెన్. ౧౫౦

స్రగ్ధర. చిగురాకుఁజిచ్చుమంటన్ జిగిదళుకొని పిఁజించి పూఁగమ్మకుమ్ముల్
ముగిసుఖ్లుగట్టి మింట న్మసరు తెరువునం బువ్వుఁదేనెల్ జడి న్మం
పఁగ మేల్పంపంగి పుప్పొంబదువు రవితతు ల్పర్వఁ గల్పాంతకాలం
బుగతిం బొల్పారుకోనం బొరపడుచు వడి న్మార్ఛిలం బాఱియంతన్ ౧౫౧

ఉ. తెప్పిఱి మెట్ట కేల కిటు దెర్లినఁ బైపయినుండె పూవిరుల్
గుప్పిల నున్న మేనునను గొబ్బున బొబ్బలు లేవఁ గ్రిందటం
బుపొప్పిడి సోఁకి పాదములు పొక్కఁగఁ జేతులఁ దోఁగితోఁగి చే
యప్పటియట్లు పొక్కినను హాయని యూర్చుచుఁ బొర్లిపొర్లి యున్. ౧౫౨

ఉ. అంతట నొయ్య లేచి చరణాబ్జములం గనకాబ్జపత్రపున్
దొంతర దానినూలుకొని నూల్కొనఁ గట్టి జరంగుచు న్నధిం

*నిటు సేయసద్గుణము-మూ †కంటి-మూ- ‡గటి పెక్కు-మూ శ్రీహరుడ నే.

జింతిలె నక్కటా యొడలు చెచ్చెర వీడఁ దలంచినన్ క్షణం
బింతట నిల్వఁగా దొరగునేమొ యికేలొకో దాఁటి వచ్చితిన్. ౧౫౩

వ. అనుచుఁ జింతింపుమఁ గనువిచ్చి కనుంగొనఁ గట్టెదుట నంత. ౧౫౪

ఉ. తామరతూఁడునాళములఁ దార్కొను తుమ్మెద యివ్వగుంపు లు
ద్దామతఁ గూర్చి నల్లగిసెతావులపుప్పొడిముందు గూరియున్
హేమలత ల్సమాగ్నిశిఖ లేరుచుజానకిత్రా డమర్చి యు
పై మొగరంబుగట్టిన తుపాకులపె ల్లెలగోలుమూఁకలున్. ౧౫౫

మాలిని. చికిలితళుకుఁగళ్కుల్ జిల్జు జాళ్వామొలామా
నికరపుఁబమల న్రాణించుగేదఁగిపువ్వ
ల్గుకఱకు మొనయీఁటె ల్గుంపుగాఁ గూడి యచ్చోఁ
బ్రకటత నెలగోలుంబారు వెన్కం జెలంగన్. ౧౫౬

సుగంధి. పచ్చజాతిడాలుతెక్కపక్కెరల్ చెలంగఁగాఁ
బెమ్పపంచదార మెక్కు బీకమీఁజు రంతులన్
గ్రుచ్చి పాంథవైరకోటి గుండెలల్ల వ్రేలఁగాఁ
బచ్చి దేజు మారుతేజిపౌఁజు లొప్పె నాడటన్. ౧౫౭

ఉ. తుమ్మెదసర్పణ ల్మోయ దూఁకొని పుష్పరసోరుదానముల్
గ్రమ్మి భరమ్ముగాఁ గురియఁగాఁ జిగురుంజిగి మేలుధాతుచి
త్రమ్ముగ నొప్పఁ బుప్పగమి దట్టపుడాలు మెఱుంగుఁగత్తులై
ప్రమ్మగఁ గుంజకుంజరపుఁబంక్తులు రఁజిలె *నక్కజంబులన్. ౧౫౮

మత్తకోకిల. వల్లిరశ్మిపినద్ధచక్రనిబద్ధకోకిలఘుంటికా
వేల్లదారవకీరఘోటకవిస్ఫుటోదయకేవలో
త్ఫుల్లసూనశరాసబాణమనోజ్ఞతూణసమగ్రతా
సల్లలత్తరుచిత్రభూరథసంఘ మాదట నొప్పగన్. ౧౫౯

శా. నానాసేనల నీగతి న్భువనసన్మాన్యాత్మజైత్రక్రియా
త్రానూనంబుగఁ జైత్రమంత్రివరుఁ డాయత్తంబు గావింపఁ దే
జోనల్పుం డసమాయుధుండు నిజవిస్ఫూర్తి న్విడంబించిన
సైన్యం జాన యిఁకెట్లొకో తెలియువం చాత్మ న్విచారింపుచున్. ౧౬౦

మత్తకోకిల. ఇంకనొక్కయుపాయముం గల దీకఁడుం దనప్రాణముల్
గొంక నొక్కతఱిన్ హరింపుమఁ గూరి కాఱియ వెట్టకే

*నక్కరంబులన్ - యొ.

నంకి లంతయుఁ దీర వేఁడెద నాతనిం బ్రియమందఁ ద
త్సంకేషుశరాగ్నిదుస్సహశయ్యపై నొడ లేర్చుచున్. ౧౬౧

క. మారుదయ చాలు నతనికి, మాఱువలుక వెఱను నొక్కమాఱును దేఁటుల్
మారుతములు శుకపికభా, మారుతములు మదశదనమారుతము లొగిన్.

వ. అని నిశ్చయించి. ౧౬౩

చ. పసిఁడిమిటారిగట్టుదిగువం దగునెత్తమునం దఖండ మై
పొసఁగు మెఱుంగుఁజప్పదరపున్ జిగిరత్నపుమేలుచప్పు పైఁ
బసగలకోనలోఁ దళుకుబంగరరంటులతోఁట కోలుఁబో
ముసరి జవాదిపుప్పవలపుం దగ సూరెలపై బుగుల్కొనన్. ౧౬౪

శా. పూన్పుందేంయకాల్వచెంత విరిమావు ల్పొన్నచాల్కంచెగాఁ
గ్రేవ న్సంపెఁగగోరఁటల్ బెరయుచక్కన్మల్లెగుర్వెందపూఁ
దీవల్లుం *బలుద్రాక్షకప్పుగల †పందిళ్లంటులోఁ దమ్మిపూ
బావిం జెల్వగుచల్వచప్పరముగప్రంపుంబలుందిన్నె పై. ౧౬౫

శా. కందర్పుం డిరవొందఁ బాంధవనితాకాం ×తాంగధాతువ్రజం
బందంట న్వడి గ్రుచ్చి త్రిప్ప వెస నాయాధాతువు ల్గ్రిమ్మ నం
దందం బొందగు చెందొవ ల్మొదలుగా నల్లేర్చి పువ్వమ్ము లా
రం దాఁ బాన్పు రచించి యందుపయిఁ దాఁ బ్రాయోపవేశంబుగాన్.

వ. ఒడలిడి యుడుకుచుఁ బడంతుక పొడ గడలుకొన నుండి తనమనంబున.

చ. తనమదిలోన నుంచుకొనఁ దాపము దుర్భర మయ్యె మేనునన్
ఘనవనవహ్నిగ్రోల నగు ‡కాఁకకు నెగతి సైఁచె నొక్కొ యు
వ్వనజదళాక్షుఁ డక్కట యబద్ధము దోఁచెఁ §జరాచరాత్మయా
ఘనున కిదేలయబ్బ మయిఁగాఁక మదం డిడునంచుఁ జింతిలున్. ౧౬౬

ఉ. అక్కట వేగిరంపడుచు నందితి నమ్మునంపసెజ్జలో
నక్కొనుశౌరి ఖేదపడు నేరమి వచ్చె నటంచు లేచుచుం
జిక్కునె యిట్టివేదనకు శ్రీపతి యాశరరాశిమీఁదఁ దా
నక్కొని సౌఖ్యమొందె నని నెచ్చెలి (వ్రాలెను) సెజ్జ మెల్లనన్. ౧౬౭

గీ. మదనునాఱవయమ్మన మ్రగ్గునెలఁత, యాత్మవైషమ్య ముడిపిన దైన నింతిఁ
బాన్పువై ఖరిచేబాధపఱిచె నమ్మ, లెనయునౌచిత్య మిల నచేతనము లెట్లు.

వ. ఇవ్విధంబున వనంబునం గుసుమశరశయ్య మెలంగు మెలంగ నంతనక్కడ.

---

*బయిద్రాక్ష †పందిళ్లంటులో ×తాంగదాధుర్ప్రజ ‡కాంతకు §జరాచరాంత-మూ.

ఉ. సుందరయాన యిందుముఖి సుందరమందిరసీమ లేమికిం
దందరఁ జెంది సుందరులు తద్విధ మంతయు నీలవేశికిం
ఖాంచుగఁ జెప్పినం జెలులఁ బుచ్చినఁ జూచుచు నుల్కి నెమ్మనిం
గొందల మంది హా యెటులఁ గోకనుచామణి యేగెఁ జెల్లఁబో. ౧౭౩

క. అని చెలుల దూఱు మనమున, వనటం గూరుచు లతాంగి వడి నచటచటం
గనుఁగొని చొప్పరయుచుఁ జెలి, ఘనతరశృంగారవనముఁ గని చొచ్చె నెసన్.

చ. అడుగులజాడఁ జూడ మలయానిలపోతవిఘాత మైనపు
ప్పొడి పయి సంతతం బొదవు పూవిరి తేనియ వానఁ గానఁగా
న్పడమిఁ బుప్పొంబొద ల్చిగురుమావులు తావుల జొకమొక నొ
ప్పడు నిరవు ల్గొలంకుగమిపజ్జలు నన్నియుఁ జూచి యంతటన్. ౧౭౪

ఉ. ముమ్మర మైన మైసెక లపూర్వపు పొప్పు కడింది వెట్టయుం
గ్రమ్మఁగ మిక్కిలిం గమలి కన్నుల నిగ్గడ తీవెజొంపముల్
*గ్రుమ్ముడి జాఱుపువ్వులను గుబ్బచనుంగవ వీడురత్నముల్
కొమ్మపదారవిందములు గూడఁగ నొచ్చినత్రోవఁ దెల్పఁగన్. ౧౭౫

క. అత్తెఱువునఁ జన నొక్కెడ, జిత్తభవుని యంపసెజ్జఁ జేరి బలువగల్
కుత్తుకబంటిగ నొంటిగఁ, జిత్తము తత్తఱముఁ జెందఁ జింతిలు దానిన్. ౧౭౬

చ. పగలోనరించు తేంచి సెక ప్రమ్మిన లేఁదొగతేని రేకతోఁ
దగవున కేగుదాని సెకదాలుపు వేలుపు సోఁక జొకవో
నొగిలినపూలదండ వగ నూల్కొనుదాని నసుంస్మృతాంగి యై
జిగి ×విడనాడు కాకవితచిన్నతనంబు వహించు నెచ్చెలిన్. ౧౭౭

సీ. వీరులు ముయు వచ్చి †వె (సవంగు) ళుబుపీడఁ గలకంఠకలకంఠగానతతికి
ముసుఁగు వెట్టఁగఁ బూని వెసఁ ద్రోచు బజియుంటమాధుర్యమాధుర్య మధువిసృతికి
సీత్కరించియు వెండి ‡సీత్కరింపమిఁ జెందుఁ బల్లవపల్లవధల్లహాతికి
వడఁకి యుమగుడ గొఱను పాఱు మలయాగమలయాగమసమీరచలనకృతికి
నిట్లు దొలుదొల్తభయపడి యెఱిఁగియంతఁ, దనువు దొఱఁగంగఁ దలఁచిన దానికకట
మారు చెయ్వుల కేలొకో మాటికొనఁగ, ననుచు వెచ్చ నూర్పుచునడలు దాని

చ. కనుఁగవ విచ్చి చూచు మదిఁ గన్పడుఁ గృష్ణుఁ డటంచుఁ జెంగటం
దవరుతమాలసాలరుచిధట్టము దార్కొను రిత్త కౌఁగిలిం

---

*గ్రమ్ముడి-మూ- కురుముడి- లక్ష్మీపతిగారి భారతవ్యాఖ్య- క్రొమ్ముడి యనియర్థవచనము
× వడనాడు † వె...ల్గభుఖు- ‡సీత్కరింపఁగ-

చిన దనచేతిలోఁబడమిఁ జెన్నఁటి కన్నుల నీరు *నించి ఎం
(డి) ననలవాన్పుఁ జేరి విధిఁ దిట్టుచు వెచ్చగనూర్చు నెచ్చెలిన్. ౧౭౯

క. ఉమగనికన్నీర్వాలవం, బడి జాతెమశయ్యఁ జూచి పాపపుదైవం
బాడలిచట విమవ × నీయఁడు, చెడఁజూచెదుఁ గటకటాయనీయనుదానిన్.

ఉ. అత్తమొలం జెలంగెడుమహావసనంబు కరంబు చేగచే
హత్తి హరింప మున్న మన సాదినవాఁడవు మన్మథోటులన్
రిత్తమొల న్మెలంగ విహరించుట నీమది కొగ్గ దోఁచునే
దత్తురకాఁడ యంచదగఁ దత్తియ నీవొనరించు చున్నఁడో. ౧౮౧

ఉ. పల్లవవృత్తి నీ వధరపల్లవఘాతకు మ్రొగ్గ కేటికో
పల్లవమున్ హసించు జిగిపట్టెడి యంచునో తత్సహాసము
న్వల్లభ పంచమియాఘటన వర్తిలఁజేసితొ యంచు నే నన
న్మెల్లనఁ బాట మోవి గొని మేలగు కెంపులు నింపు చున్నఁడో. ౧౮౨

చ. కలికిమిటారిగుబ్బచనుగట్టుల ప్రేమన కోర్వఁజాల వి
చ్చలు క్షణమాత్ర నామెడఁ బొసఁగఁగ నిల్పుదునో సుధారసం
బు లొలుకనీక మోవి పలుమోపున నాదునో యి కేమి కా
వలె నది గూర్తునంచుఁ దమిహాఱగ నిట్లలరించు చున్నఁడో. ౧౮౩

చ. తలఁపున నిల్చుచు న్మనుతఁ దాలిమి నిల్పఁగలేక కౌఁగిట
న్నిలుపున గ్రుచ్చి మోముపయి నెమ్మొగ మూఁది యు మోవి తేనియ
ల్వలు మొన లాని చెక్కుఁగవఁ బల్మఱు గీటుచు నంతఁ గేలిమై
యలరుల పాన్పుపైఁ † బెనఁగియాడుట యెన్నఁ డొకో మనోహరా ౧౮౪

చ. మగని ‡ మెఱుంగుఁజేల మిటు మార్పడఁ గట్టితి వాతఁడు న్రయ
మ్ముగ భవదీయవస్త్రముదు బూనె నెఱుంగ రిదేమి వింత యిం
త గలవటే సయూటములు నాతిరొ. సన్నకుసన్న పోయి పూ
ర్వగతిఁ బొసంగరాదె యని రాము లనంగ మెలంగు చున్నఁడో. ౧౮౫

చ. అని పలవించుదానిఁ దను వారయ నెంతకడించి యోజ ది
ట్లును విడ దార యం చిటునటుం బొరలాడెడుదాని నింక న
న్ననినఖరాత్ము దూఱికొనఁగాఁ బనియేమి దయం దొలంగెఁగా
నెనరుది నీలవేణి యని నెవ్వగ వెల్లి మునుంగుపైదలిన్ ౧౮౬

---

*నించవెం......నల × నివ్వారు ‡ మెఱుమ వాయుట- మూ. పెనఁగు వాఱుఆనియు నన
వచ్చును. † మెలంగు చేల-

గీ. సకలభూషణలక్షణసంగమంబు, వీక్షనాడుచుఁ జూడ్కికి వింత యగుచు
లలితవైఖరి గనియునఁ బ్రంబుగాఁగ, సదృశవస్తు నిబంధన సడలుదాని. ౧౮౭

చ. అనయము మారుఁ డేయుపువ్వుటమ్ముల నెమ్ములు గాఁడి వాడి నె
మ్మనమున వంతఁ జింతిలుచు మక్కువఁ జెక్కిటఁ జేయిఁజేర్చి నె
క్కొను (పెను)వేఁదురందు ననుఁగున్నవలారతనంబుఁ జూచి గ్ర
క్కున భయవిహ్వలాత్మ యయి క్రొమ్మెఱుఁగారు మిటారికత్తెలన్. ౧౮౮

ఉ. సందడి చెందకుండ నొకచాటున నుంచియు నీలవేణి తా
ముందుగఁ బోయి కౌఁగిటను ముద్దియఁ *జేర్చి ముఖాంబుజంబుపైఁ
జిందునునుంగురుల్ లతగఁ జేరిచి చెక్కిట నిచ్చలంబుగాఁ
బొందిన మేలు కేల్దిగిచి పొందుగ విందులు సింద నిట్లనున్. ౧౮౯

ఉ. అమ్మకచెల్ల చెల్వ క్షణమైన వయస్యలఁ బాయ వెన్నఁడై
నమ్మతి వారికన్నఁ దమి నాకయి నెక్కుడు గల్గుదాన వీ
విమ్మెయి నొంటి రాఁ దగునె యీకడుగోలవు నీకడింద్రైనె
దమ్ము లిఁ కేమనందగుఁ బదమ్ములు పుప్పొడి కెట్టు లోర్చునే. ౧౯౦

ఉ. పల్లవసంగతి న్నెలఁగుపంచము లుండెడుచోటు మాటకే
యిల్లడ మైన బేరజము లీఁగెడుమాటు విపాళిపాటు అం
పిల్లెడితావు చూడఁగనె బెట్టు హరించెడిక్రొమ్ముచ్చు హెచ్చి సొం
పిల్లెడునిక్క యక్క యిది భీతిల కిచ్చటి కేలవచ్చితే. ౧౯౧

క. నగువారి నెఱుగవైతివి, తగ వారడిపాలు సేయఁ దలఁచితి వయ్యో
మగువా యింతటి కట్టిడి, తెగు వాను మటంచు నెవరు పెలిపిరి తల్లీ! ౧౯౨

క. శయ మానుచుఁ జెక్కిట సం, శయ మానఁ బనేమికుసుమశరువలనన యో
భయమానవలా నీకు న,భయ మానలినాక్షుఁ డిచ్చుఁ బరమార్థముగన్. ౧౯౩

చ. సకియ మరుండు నీదుకనుసన్నలవాఁ డటె యొక్క కుత్తుకై
పికము శుకమ్ము నీకలుకుఁ బేరిమి దాఁటఁగలేదు నీదు న
డ్డి కనుగుణంబు సంచగమి; దీవి వసంతుఁ డలంతి నీవనీ
పకుఁ డటె సడ్డచేయుచు భవాదృశకీర్తులు రాఁగ నర్హమే. ౧౯౪

క. మొదట ననంగుఁడు మదనుం, డదనున విరియంగఁ బాఱునట్టివి శరముల్
వదల పవి మృదులవిషమత, మదనువలన భీతి నీకు మది వలదమ్మా. ౧౯౫

* వెచ్చి.

ఉ. నీరపరాగదోషముల నీటుం దొలంగఁగఁ దాఁ బయోరుహం
బీరుచిరంపు గన్నులకు నీడఁ గూర్చక యుండు దొల్తఁ ద
న్నీరజజాతికిం దపము నేఁడు ఫలించెఁ గదే కటాకటా
నీరపరాగము ల్గలిగి నీటుఱు నీకనుదోయి పాసెఁగన్ ౧౯౬

చ. చెలువరొ పూర్వుఁడేన బలుచిత్తుఁడ నైనను మాన కెప్పుడు
న్నలయుచు నుండు బుష్పశరుమారుము నేఁగతి నోర్చితన్న సం
కులమదబాధరప్రకరకుట్టన నైనఁ దొలంగ కెంతయుం
గలయఁగఁ బర్వి తే వెజడి*కారియ మారియ దాని సైఁచితే ౧౯౭

సీ. జలమున జీవించుజలజనాళంబులు దినమందగతులు సంధిల్లుచోటు
నతిరక్తముఖత సంతతసత్ఫలచ్ఛిద నడఁచుకల్లరులు నజ్రాడునిక్క
కనుగొంపుగదుఁ జొక్కపులేఁజిగుర్వొడిచి మరుపిసాళులు చెలఁగుచాయ
మలినచ్ఛదముఁ బూని మధుమాత్ర వాసన సొక్కుమత్తాళి పెంపెక్కువంక
యాటను మెలఁగంగఁ గటకటా యేమిటికి వచ్చి
తో ఘనమృణాలభుజకాండ యోసుబింబ
దశనవసన యోకిసలయతరుణచరణ
యోసురభిళాంగి నెమ్మది నోటలేక.

చ. మెలఁతరొ కృష్ణుపై మనసు మెత్తని దెంతకడింది యమ్మెనే
కలితమృదుత్వసంపదల గాదిలి చందురమాను యాదిగాఁ
గలసుకుమారవస్తువులఁ గా దను నిచ్చెలువంపు మేను నేఁ
డెల యిటువంటి బల్కులకిచేష్టలఁ బెట్టగఁ బట్టె నక్కటా. ౧౯౯

క. గురుశిక్షచే మహాగమ, గురుదుర్గము గనియె మున్న గురుకుచ యిపుడుం
బరికింపఁ గనియె మన్మథ, గురుశిక్ష మహాగమంపుగురుదుర్గంబుల్ ౨౦౦

గీ. అతిఘనాగమసంబంధ మతివ కమరె
నతిఘనాగమసంబాధ మబలఁ గన్న
యిరుఁడు చెందఁడో చాయయు నెనయలేదో
కారణగుణంబు కార్యంబు గనఁగరాదో. ౨౦౧

గీ. కృష్ణునందు సరాగత గీలుకొన్న
యింతి కపరాగసాంగత్య మెట్లు పొసఁగు

---

* కారయ.

నెన్నఁగఁ బరాగ మెపుడు సహించునింతి
కిపుడు దాని సహింపట యెంతయరుదు. ౨౦౨

గీ. వినుషి వభ్యర్హితపదార్థవేత్త్రి నీవు, తండ్రిఁ బోలుచు మమ్ము సంతాపపడఁగఁ
జేయు వేటికిఁ దల్లియా ఛాయఁ బోలి, చల్లఁజేయవె మమ్ములఁ జంచలాక్షి.

వ. ఇట్లు పల్కుచు నాలోన. ౨౦౩

ఉ. అక్కట యెందునైన హరిణాక్షులు చక్కనివారిఁ గోరరో
మక్కువెఱింగి తండ్రి గరిమం బ్రియుఁ గూర్పఁగ వేఁ రమింపరో
చక్కఁగఁ గూడి యిట్టిపలుజాడలబూమెలు చూచినారమా
యక్కట నీకుఁ గల్గె నని యాడెదు చేడెలఁ జూచి వారలన్. ౨౦౪

చ. కనలుచుఁ బల్కి పల్కు కనుగందని ముద్దులగుమ్మ యమ్మనీ
మనమునఁ గోరుకొన్న యలమాధవు నీధవుఁగా ఘటించు నీ
జనకుఁడు *నేఁడొతేప యతిసౌఖ్యము నొందెదు తెల్లవాఱినం
గనుఁగొనువారు మెత్తురు వగగ్గొని తెంపున కిట్లు చొత్తురే. ౨౦౫

చ. పొలఁతిరొ యాఁడుచందమునఁ బుట్టినవారికి నెల్లఁ గోరికల్
గలయవె నీకె యన్నటులు గాదిఁక నే మని యంటివేని పైఁ
దొలఁకఁగనీక కూర్మి మదిఁ దొట్టిన గుట్టుగ మట్టు సేయుచు
న్నెలఁగుపొలంతి యెన్నఁదగు మేటి నెలంతలలోనఁ బైదలీ. ౨౦౬

క. కన్నుల నీ రేటికిఁ దెలి, గన్నులచెలి కొన్నినాళ్లు గడవం దగవే
కన్నుల మూఁతం జేకొని, కన్నులవిల్కానిబారి గడచెదు పిదపన్. ౨౦౭

మ. అని సిగ్గెక్కఁగఁ బల్కినం దరుణి యయ్యబ్జాక్షికేఁతంబున
న్ననుఁగేల్దమ్ములు గట్టిగాఁ బెనఁచి కన్నుంగోనఁ గ్రొవ్వేఁడినీ
ర్దొనఁక న్వాడినమోము దమ్మి చెలిమద్దుం జన్నుఁబూబంతులం
దను వొత్తిల్లఁగఁ జిక్కఁ జేర్చి ‡రహించిందం బల్కు మందంబుగన్. ౨౦౮

†ఉ. కాఁకలుముంచు మేనగలకట్టిడితండ్రికిఁ బుట్టునాకు మై
కాఁకలుగాక (సౌఖ్యములు గల్గు) నె యక్కట తప్పనంటిఁగా
కాఁకల కోసమె కొఱతగాంచిన నోములు నోఁచునాకు బ
ల్కాఁకలు గాక యాజమున కాంచెనె కాఁకలు తత్తనూజమై. ౨౦౯

ఉ. సానలుపట్ట నోర్చు నినుచక్కని కూఁతురఁ (గాళి యోరగా)
నూనవిషానలచ్ఛటల కోడని §యేటికి ముద్దుఁజెల్లెలన్

---

* నెడెరేపె ‡౦క. మూ †చూ ౮౩వ పద్యముపోలిక. §యట్టికి- మూ.

హాసకి మూలమై జగతి నాడిక కోర్చినజేసితోడఁ గా
నేని భరింప నావశమె యిట్టి యయోగదవాగ్నికీలలన్. ౨౧౦

చ. ననుగనినట్టివారలకె నాపయిఁ గూర్మి యొకింతలేక య
వ్వనటఁ దొలంగఁజేయుట యవాస్తవమై యిటు లుండుకోఁగ ని
ప్పని మది మీకుఁ బట్టదని పాల్పడి చెప్పఁగనేల యిద్ది మీ
కనభిమతంబ యేని రుచి*యబ్బునె గ్రక్కున నీదృశోక్తులన్. ౨౧౧

క. అటువంటితల్లిదండ్రుల, నిటువంటి యనుంగుఁజెలుల నే నందుటఁగా
యిటు లాప దెడసి కోరిక, చిటుకురు మరకుండ నమరి చెలువందితిఁగా.

ఉ. నీలరుచు ల్దొలంకు సురనిమ్నగచెంగట దర్శచంద్రికల్
మేలగుదచ్చినాదముల మెచ్చుగ నప్రజకన్నమూకు లే
వేళ నుతుల్ ఘటింతు రతివేలమదీయమనోవ్యథాభిదా
లాలసతం జనించి యతిలాలితిఁ జెందెను మీదుకీర్తులన్. ౨౧౩

సీ. కన్నవారికిఁ జెప్పి కరుణ పుట్టఁగఁజేసి తలఁపు చేకూర్పరే తల్లులార
మీరైన హరికి నామేనితాపముఁ దెల్పి యతని నిం దంపరే యమ్మలార
ము న్నిట్టికార్యంబుఁ జెన్నుగా ఘటియించు చెలువల వినరటే మెలఁతలార
భాగ్యవంతుల కిలఁ బ్రాణదానము మించు పుణ్యంబుగలదటే పొలఁతులార
నే వి శేషించి మీదాన నెలఁతలార, మనసు మీదెంతకటికియేమగువలార
యనునయంబునఁ దీరునే వనితలార, తాళఁజాలను మీయాన తరుణులార!

సీ. వెతకింతకైనఁ దాళితి నయో నేఁజెల్ల నేనెంతకటికినే నీలవేణి
యాఁడుఁబుట్టుకఁ జెందినట్టి యింతులకెల్ల నీలాగు లేదటే నీలవేణి
యెటువంటిపని యైన నీడేర్పఁగల వని నెమ్మి నమ్మితి నిన్ను నీలవేణి
కూర్మిచే నుండెదు కొమ్మలలోఁ జాల నెవరు దానవుగదే నీలవేణి
నీకు నెన రెందుఁ బోయెనే నీలవేణి, నేర్పుచేఁ గార్య మీడేర్పు నీలవేణి
యేల యీవట్టిమాటలు నీలవేణి, తాళ హరియాన యింక నేను నీలవేణి.

ఉ. చక్కెరవిల్తుఁ డేయుసుమసాయకపంక్తిఁ ద్రపాభిమానముల్
గ్రక్కునఁబోకమున్నె చెలికత్తియ మొత్తము సేయనారడిం
జిక్కఁగఁ †బల్లు లంగడికిఁ జేరకమున్న ప్రియంబుగాఁ బ్రియు
న్నక్కున గారవింపఁ గలయంతకు నోఁచితినంటె నెచ్చెలీ. ౨౧౪

---

*యబ్బదె †బల్బులంగడికి

సీ. మాధవాధరసుధామాధుర్యమునఁ దేలు వంశంబుజన్మంబు వడయనైతి
హరిభుజాంతరవాసనిరతి నింపార హారమణిస్వరూప మై యమరనైతి
యాదవమౌళిమోహాసితాపాంగకలాపంబు నై యేని యొప్పనైతిఁ
గమలామనోనాయకమనఃప్రియోద్దామమాధవినై యెట్లు మలయనైతి
యకట వీనిలో నేదైననొకటియైనఁ, బొంక నుబ్రియాంగసంగమాభంగసుఖము
తపనసుతనైతిఁ దాపంబుఁ దలఁగనైతిఁ, జెలులు మీ చేతిరట్టి చేసలయనైతి.
క. వలపు పగవారికైన, న్వల దది యెటులన్న నట్టి వలపున మేనం
బోలఁచెమఁ బ్రాణము లీగడె, నిలుపుట యేగండమయ్యె నిక్కము చెలువా.
గీ. ఒకుల వెత యొరు లెఱుఁగ రౌ నుర్వి ననుట
నిజ మనుఁగుఁజెల్వ లే రవ్వ నెఱపఁ జొచ్చి
రకట మది తాప మిటు మీకు నరసి తెలియఁ
బడదు మోచ(వాఁడెఱుఁ)గుఁ గావటిభరమ్ము. ౧౧౯
చ. పతులను గోరు నెల్లరకుఁ *బాటులివే యయినట్టులైన నీ
సతులు చెలంగి నన్ను నెకసక్కెము లాడుదురే యిదంత నా
కత యగుఁబోలు నెట్లయినఁ గానిము ప్రాణము లిప్డు మేన ను
న్నతటిఁ గదా యిఁకెవ్వరు ననంగల యాడిక లబ్జలోచనా. ౧౨౦
గీ. ఔర యప్రస్తుతప్రశంసాన్వితంబు, పల్కునను వ్యాజనిందానిబద్ధసూక్తి
లలితసంగతభావ నేర్పొలయనన్ను, మీరు నవ్వుటయెఱుఁగనెమెలఁతలార
గీ. వనిత యర్థాంతరన్యాస మొనరు నెట్లు, మదికి నిరపేక్షవస్తుసమర్థనమున
మదికి నింపగుఁ గాదె సామాన్యఘటిత, భవ్యవస్తువిశేషసంబంధమమర.
సీ. కలదన్నఁ గలవానిఁ గలిమిచేడియతేనిఁ గరమున సుడివాలు గలుగువానిఁ
గడలినుండెడువానిఁ గరిఁగాచువగవానిఁగరుణసిక్కెడుచూపు గాంచువానిఁ
గలికినవ్వులవానిఁ గౌస్తుభద్యుతివానిఁ గనఁగ నశక్యమౌ కతలవానిఁ
గనకంపురుచు లీనఁగలపచ్చడమువానిఁ గలుగుకాలం బెల్లఁ గలుగువానిఁ
గన్నెప్రేతలవయసులు గొన్నవానిఁ, గన్నయింతయు నవలీలఁ గన్నవానిఁ
గన్నులను†మించుసెకమించుగన్నవాని, గాంతుగా నోఁచునక్కాంతకాంతకాంత
చ. అలదమయంతిఁ (బోలె) నను నంచితపుణ్యనొనర్పు మన్నలుం
దలఁపుము మాధవాప్రకృతతాకథఁస్ఫుటభాగ్యగానయో

*పాటియిదే †మించు

విలసితయానమాత్రమున విస్మృతి నొందకు మంచకైవడిన్
వెలయును తత్కృతోపకృతి వేగనొనర్చి క్రియానరూపతన్. ౨౨౫

వ. అని తరణితనయాతరుణి యయోగశిఖిశిఖారణి యై పలుక నప్పలుకులు (ములుకులు) వోలె మదికి నులుకుచిలుక నచ్చిలుకలకొలికి యక్కలికికి ధైర్యంబు గుదుర నెనరు గదురం దియ్యందనంబు ముదుర నిట్లనియె. ౨౨౬

సీ. పంచత్వమే కాను బాణము ల్గాంచిన యతనుండు ని న్నేమి యనంగలండు
*ఘనవైరమున మందగతిం బూని వెల్లనౌ రాయంచగమి యేమిసేయంగలదు
మధుసేవనంబున మాట ప్రాఁచు పికాళివలనిభయం బేమి వచ్చు నీకు
మధుపత్వమున భూరిమాలిన్యగుణవృత్తి దేయభృంగములు నీ తెరువురావు
బహుళపక్షవిరోధి యా పంకజారి, జడత గుణగంధమాత్రంబు వడయుగాలి
వెక్కసపుమాటలాడుచుం జిక్కెం జిలుక, యింతమాత్రంబునీ కేల వంతతల్లి.

గీ. చెట్టు చెట్టున కొకకొన్ని చుట్టుకుండుం
జెలువ చెలమకు నొకకొన్ని సేయుచుండు
మదనుసేవలు నీవంటిమానవతుల
ధైర్యకంచుక మగలింపం దలంచునెట్లు. ౨౨౭

మ. వెడతూపుంగమి నూఱుపోఁగువను రీవింగట్టుదుం దుంటవిల్
గడికండ ల్పడ గానుగాడి రసముం గావింతు మీనాంకమున్
మఱువంటం బడఁద్రోచి గాలములఁ గ్రుమ్మంజేసి కందర్పునిం
బడఁతీ దుర్బలుఁ జేసి పుచ్చెద భయోత్పాతంబు నీ కేటికిన్. ౨౨౮

వ. అని యాజడిలం బలికిన నప్పలుకులయెడ ననాదరంబు చేసి వెడనవ్వు నవ్వి యవ్వారిఁబోఁడి నీలవేణి కిట్లనియె. ౨౨౯

చ. కలికిరో ప్రోడచేడియవు గాన నెపం బిడి యోట దీరఁగాఁ
బలికితి వింతె నీకు మఱుమాట వచింపఁగఁ జాలఁ గంతుపూ
ములుకుల మున్నె నాయెడలు మోహము దాఁకి తొలంగుఁ బ్రాణముల్
బలువగ నిల్పి యింతవడిఁ బట్టఁగలే నిఁక సిక్క మోచెలీ. ౨౩౦

ఉ. కన్నులు మూసినప్డు పొడకట్టిన (నాథునిఁ) గాఁగి లీరయం
చున్నెడువంగ నోరెగువఁ జూడఁగ †నీ దపు డేడనుండియో

*ఘనవైభమున- †నీధవుడే

పన్నుచు వచ్చు నాదుప్రతిబాధను ప్రీడయు నంతలోనె మే
నున్ననుచుం జలించును గనుంగవ విప్పఁగ మాయ (మా) సఖీ. ౨౩౧

మత్తకోకిల. నీవు నాయెడఁ గూర్మి బోటివి నెమ్మి నాపయిఁ గల్గినం
బూవుఁబోఁడిరో నాదుకోరికఁ బొల్పు నొక్క రహస్యమే
చూవె నీమది నెంతలే దని చూడ కప్పని వేగమే
చేవ దప్పక తీర్చు దేవియుఁ జెప్పెద న్విను తత్క్రియన్. ౨౩౨

వ. అది యేమని యంటివేని. ౨౩౩

శా. సాక్షాన్మాధవగాత్రసంగతికి నోఁచం గావునన్ దీని క
ఙ్జాతుం గస్తురివన్నె జృంభితసువర్ణాంభోజపత్రంబుపై
నక్షీణస్థితి వ్రాసి నన్నును దదీయాంచన్మహాహారాదారస
ద్వక్షోమధ్యమపీఠి రూఢిగ లిఖింపం జూచి వైనం జెలీ. ౨౩౪

క. బిత్తరి చిత్తములోపలి, యుత్తల మొకకొంతయైన నుడిపెద నిటుగాఁ
జిత్తము నిలుపంగదవే, యుత్తమసుకృతంబు నీకు నొనరు నటంచున్ ౨౩౫

చ. పలికి గళస్మరందరసబంధురగంధరసాంధబంభరా
కలితరవంబులం బ్రసవకమ్రవినమ్రరసామ్రతామ్రకో
మలనవపల్లవగ్రసనమంజుకపాయితకంఠకాకలీ
కలకలకంఠనాదములఁ గ్రమ్మి తటాలున నుమ్మి యమ్మియున్. ౨౩౬

వ. అప్పు డప్పల్లవపాణి కపటగోపికాపల్లవాయల్లక మెల్లం...దురంతసంతాపంబున నెంతయు నొల్లంబోయిన నీలవేణి తోడి నీలవేణులం గూడి కటకటంబడి చింతించి యీయింతికి సంతాపంబు బలవంతం (బలుతుల) నంతంబుఁ జెంద నేర దీయెడఁ గొంతకొంత శాంతింబొంద శిశిరోపచారంబులు పచరింపం దగు ననినఁ దత్సహితలై తత్సహితలు తత్ప్రియాయత్తచిత్తలై రయ్యవసరంబున. ౨౩౭

—కాళిందికిఁ జెలులు శిశిరోపచారములు చేయుట—

ఉ. తావుల మోక*మాంవిగమితావుల గొజ్జగనీరుయంత్రముల్
క్రేవలఁ జిల్కఁగాఁ జిగురు †గేదఁగిపూదడిగట్టి వట్టివేర్
పై వటిలారుచెంగలువపందిరి చెందొవరేకనంటి క్రొ
మ్మోవులచందువాపాగడమొగ్గల నిగ్గులచప్పరంబులోన్ ౨౩౮

*మామిగమి †గేదడిపూదడి

సుగంధి. కప్పురంపు దిప్ప నొప్పఁ గమ్మపైఁడితమ్మిమే
ల్పుప్పొడి న్రచించినట్టి పున్నె సెజ్జమీఁదికిన్
అప్పడంతిఁ దెచ్చి, తెచ్చి రంబుజాక్షు లందఱుం
జెప్పరాని వేగ మూని శీతలించు వస్తువుల్. ౨౩౯

ఉ. సారసచందనైణమదసంకుమదాగురుకేసరాళిక
ర్పూరపరాగకుంకుమసముజ్జ్వలపల్లవహల్లకాచ్ఛక
హ్లారతుషారనీరబిసహారసమంజసపుష్పమంజరీ
వారము లాదిగాఁ గొనుచు వచ్చి కరం బుపచారు నేర్పునన్. ౨౪౦

చ. మలయజకర్దమంబు బొడల మాటి కలంది మృణాలవల్లరీ
వలయచయంబు లంఘ్రులను బాహువులం గదియించి వేసలి
న్నోలయ గఁ దెల్లదమ్మి యిడి పెల్లుగఁ గస్తురి కంధరంబునం
గలయఁగఁ బూసి యింతి శిశిరక్రియఁ జేసె రవంగభీతికిన్. ౨౪౧

చ. మృగమదచర్చ యింతటను మేన నలంది పరాగరాగసౌ
భగకదళీదళంబుఁ గటిపై నిడి చెందొవపువ్వుటెత్తఁ బొ
ల్పుగ నెదనుంచినప్డు సతి పొల్చె ననారతశౌరిభక్తియో
గగురునిజాంతరంగ యగుఁగానఁ దదాకృతి దాల్చెనో యనన్. ౨౪౨

ఉ. అంగజుఁ డంగనాఘనహృదంతరకర్పరసీమ స్నేహము
బ్బంగి నభంగురం బగుచు భాసిలఁగా దశపై దశాంతరం
బుం గదియించి త్రోవఁ బరిపూర్ణతఁ గాంచి యయోగదీప మే
చం గడు స్రుక్కుచుం గిసలసంఘటితవ్యజనానిలంబునన్. ౨౪౩

సీ. పదములఁ జిగురాకు లొదవించి జంఘల స్మరతూణతిలకము ల్మురువుకొల్పి
తొడల నరంటిద వ్వడరించి సొబగారుకటిపైఁ బరాగసైకతము నించి
నడుమఁ బుష్కరభంగి దొడరించి యాకువ జోఁక గాఁ గస్తూరిరేక దీర్చి
చన్నుల గుచ్ఛము ల్సవరించి నెమ్మేనఁ జందనం బలఁది భుజంబుల బిస
కాండమిడి చెక్కులను జంద్రఖండములఁది, వేణి శైవాలమునఁ గూర్చి వెలఁదియంగ
సామ్యసదసత్పరీక్షావిచారణ బలెఁ, జెల్వ లీరీతిఁ జేసిరి శిశిరవిధులు.

చ. ఎడపక యింతులెల్లఁ గదియించినపల్లవసూనగుచ్ఛముల్
తొడరి వియోగవహ్నిసెక దొట్టఁగ *జిహ్వన నీరుదీసి యె

* జత్వ

కొంకడు గమలంగ నప్పు డుకోమలిగాత్రము వాల్చె నామకు
డడరుచు దోహదక్రియకునై †రవశించిన లేఁతతీవనాన్. ౨౮౪

సీ. ఉరుతాపమిాలద్ధ్రుగుత్పలంబుల మిత్రకరమార్జనక్రియఁ గఱపరాదు
వగఁ బొగల్లాని మాట లెగయుడెందంబునఁ జంపకస్నేహంబు సంఘపరాదు
కన్నీటివఱదలు గ్రమ్ము చన్నిట్టల ఘనసారజలధార లునుపరాదు
నిట్టూర్పువడగాలిఁ బట్టాను మైఁదీఁగ నల వహ్నిశిఖ నిల్పఁదలఁపరాదు
చండసునుకాండ తేజఃప్రచండకిరణ, దాఁడవిభవ
మోహబహుళాంధకారంబు ముంచిజాఱ, మృగమదంబునఁదిలకమిప్పఁపరాదు

గీ. అతనుతాపంబు హరియింప నంగములను, జెలులు సేర్చినబహువిధశీతలములు
నతనుతాపంబు హరియించె నంగవితతి, నతనుతాపంబు హరియింపవబ్బురంబు

గీ. జడములగుటను సంతాపశాంతి సేయు, నంచుఁ జెలులు లేలయిడిరి సుమాదికములు
జడతఁ గాంచినద్రవ్యము ల్జగతినియతి, గలవు సేయఁగఁ దన్మహాశ్చార్యమెల్ల

క. తనులతఁ బల్లవసుమములు, ఘనతం గొనునేని యతనుఘనశిఖి రేఁచెం
దచులతతాపం బడఁచునె, ఘనములు నవియెన్ని కృష్ణసునమే చిక్కన్.

క. ఈవిధమున సేర్పెప్పఁగ, వావిరి శిశిరోపవిధులు వర్తించి యొకిం
తా వెలఁదిఁ దెలిపి నగరికి, వేవేగం దోడి తెచ్చి వెలఁదులు ప్రీతిన్.

గీ. పసిఁడియుప్పరిగె నునుబూఁబాన్పుమిాఁద
సకియ సరవొందనునిచి హెచ్చరికమిగులఁ
గలితపూర్వకథాప్రసంగంబు చేతఁ
బ్రొద్దు గడపుచు నుండిరి ముద్దు చేసి.

క. మాయాసహాయసీతా, జాయానిరపాయభవ్యసాకేతపురా
ధేయ మునిగేయ జలద, చ్ఛాయలసత్కాయ సకలజగదున్నేయా. ౨౯౨

గద్యము. ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందమిళిందాంతఃకరణపోలూరి మాధ
వయజ్వసముజ్జ్వలత్కృపోక్షితకటాక్షసాదిత పాండిత్యాభరణ ప్రభంజన
వంశాబ్ధిరాకాశశాంక నిరంతరారాధితవిచక్షణశశాంక అభినవ నన్నయభ
ట్టారకాహోబలపత్యాహ్వయకవి మహోపాధ్యాయ భట్టారక ప్రణీతం
బైన కాళిందీకన్యాపరిణయంబను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

† సకలించిన

శ్రీరస్తు.

# కాళిందీకన్యాపరిణయము.

## తృతీయాశ్వాసము.

క. శ్రీరాజమౌళిహృదయ, స్ఫారాంబుజచంచరీక ప్రణమజ్జనతా
ఘోరాఘతిమిరదినకర, తారావల్లభవిరామ దశరథరామా ౧

వ. మహాత్మా దివ్యచిత్తంబున నవధరింపుము. ౨

### — సూర్యాస్తమయవర్ణనము. —

క. అంతట నంతటినెచ్చెలి, యంతర మగలంగఁ గూఁతు నలమట గనుచుం
గాంతి దొలంగుచు వ్రాలెను, జింత ననం దనదు కాంతి చెదరఁగ వ్రాలెన్

గీ. వారుణీసేవ తనము దుర్వార*మహిమ, నంతకంతకుఁ దఱుగ నొయ్యన వెనుకకు
మరు†నొగులంగ నప్పుడు భానుమంతు, డధిక(దీన)స్వరూపంబు నధిగమించె.

సీ. అనురక్తమండలుం డగుచుఁ బూర్వాగమ మూని ప్రబోధ మిం పొప్పఁజేసి
సర్వవర్ణాశ్రమాచారము ల్నడిపించి తా సత్పథంబునఁ దనరి నిలిచి
నలుదిక్కులను గరంబుల(చేత) నలరారి చక్రసద్విజవృత్తి చక్కనునిచి
కుముదంబులకుఁ బొంగు గ్రుంగునట్లు మెలంగి పద్మిని కామోదపటిమ గఱపి
కాలగతి వయసు మించినఁ గడఁకదక్కి, శాంతి గైకొని యుపరాగమాంతమంది
వసుప్రశుచికిచ్చి పరరక్తభావుఁడగుచు, వఱలు నానందవారధి వ్రాలె నినుఁడు.

గీ. ప్రాచి పశ్చిమదిశ యుఁ జేపట్టి యాఁడు, బంతిగాఁ దత్కరచ్ఛవి పట్టె సూర్యుఁ
గానిచో నెద్దికత మన్యకాల మెడయు, నరుణిమచ్ఛట సంజలఁ బరఁగుచుండ.

గీ. చండమార్తాండరోచిరఖండవహ్ని, కీల నొంతయుఁ గ్రాఁగినఁ జాలఁజాల
నరుణిమ భజించె నాజరరాతపమున, దండి నెఱుపెక్కె బ్రహ్మాండభాండ మెల్ల

క. కొండలకు మేలుబంగరు, కొండలరాయనికి మైత్రి గొనకొనఁ జివురుల్
మొండుకొను మావులకు దరు,షండములకు నట్టియెడఁ గచాకచి యమరెన్.

మ. తను లోకంబులు లోకబాంధవుఁ డనం దాఁగర్మసాక్షిత్వముం
గొను చత్యున్నతిఁ గాంచి కాలగతిచేఁ గుంభీభవత్తేజుఁడై
చని యవ్వారుణిసేవ గైకొనియె నష్టప్రాంశుఁ డట్లౌటచేఁ
గనియెన్ ఘోరగభీరవార్ధిపతనాకారోరుపాతిత్యమున్. ౯

---

* మహిజ. † నొగయఁగ.

సీ. సకలజగచ్చరజంతుసంతానసంతతనేత్రదృష్టిసంతతులతోడఁ
జక్రాంగదాంపత్యసరసాభిలాషసంఘటనైకహేతుభాగ్యంబుతోడఁ
దనుధారణక్రియాధావమచ్చావచపతుభృద్వ్యాహృతిభరముతోడఁ
బద్మినీముఖపద్మభవ్యతరామోదకారణాదృష్టవైఖరులతోడ
నస్తమించెను జలరాశి నతిరయమున, వనధిజల మెల్ల నధికపావనతఁ జెంద
దొలుతనుడివెతనుడుపులఁ గడలుకొనెను, బెడఁగుఁబోఁడిమిఁ గైకొన్న పెద్దవేల్పు
గీ. అక్షిగతురీతి జనులుదన్నక్షిగతుగఁ, జలుపనైరెరి పిత్రుప్రసూసంగియనుచుఁ
గలుషమడివోవఁ గడిగికోవలయుననియొ, వనజమిత్రుండు వేగంబ వనధిమునిఁగె
సీ. ఇనపాతకృత మైనఘనవివరంబునఁ బైకెక్కు బాడబప్రభ యనంగ
జలములోనుండి యబ్బలుత్రోవ మీఁదికిఁ బొంగు లేఁబవడంపురం గనంగఁ
గాలుండు జక్కవకవ మది నేర్చఁగఁ జింతించి పొడమించు చిచ్చనంగఁ
గుముదిని నిద్ర పైకొనకుండ నపరాశ వెలయించు దీపంపువెలుఁ గనంగ
నపుడు సూర్యుండు హరియాటవతనితోడఁ, గొంతదవ్వేగి యతఁడబ్ధిఁ గ్రుంకిపోవఁ
దీరమున నిల్చు గరుడని తేటయనఁగ, నింపుదళుకొత్తె సాంధ్యరాగంపుసొంపు.
చ. అరయఁగ సర్వమిత్రుఁ డగునట్టి యినుం డరుగంగ నింక మా
కిరవులు సేరి సద్దడఁగి యేపఁటి యుండెడివేళ యే నిశా
చరుఁ డధికారి తాదృశుల సౌఖ్యము గాంతు రటంచు సంకుల
స్వరములు సేయుచు న్విహగజాలము సేరెఁ గులాయసీమలన్. ౧౩
ఉ. తారలఁ బెండ్లియాడఁ బ్రమదంబున రా జగుదేర నింపు సొం
పార నభోరమారమణి యాకసపుంబలువేదిమీఁద వి
స్తారముగాఁగఁ గల్పసుమజాలము నించెను నా నభంబునం
దారక లుల్లసిల్లెఁ గలితద్యుతు లెల్లెడఁ బర్వుచుండఁగన్. ౧౪
క. చండాతపతప్తదిశా,శుండాలము లుదధిఁ గ్రుంకి శుంభచ్ఛుండా
దండములఁ బైకిఁ జిమ్మఁగ, నిండెను శీకరము లనఁగ నెఱసెం దారల్.
చ. పగ లొనరించు చగ్రకరభావము గైకొని మమ్ము నేఁచుచుం
దగు లయినట్టిపంకజవితానము నేదు నినుండు వోయె నె
వ్వగ మది మాకు మానె ననివారణ శీతకరుండు రాజు దా
నొగిఁ జనుదెంచు నంచుఁ జెలువొందెను మిన్ననఁ దారకాప్రజల్. ౧౬

| ధాతువు | | సంస్కృతార్థము | తెలుఁగర్థము. |
|---|---|---|---|
| కొను | స | గ్రహణే<br>క్రయణేచ | గ్రహించుట<br>క్రయముసేయుట |
| కొనుక్కొను | స | స్వార్థక్రయణే | తనకైక్రయముసేయుట |
| కొనియాడు | స | స్తుతౌ | స్తుతియించుట |
| కొనిపోవు<br>కొంపోవు | స | గృహీత్వాగమనే | గ్రహించుకొనిపోవుట |
| కొఱుకు | స | దంశనే | కఱచుట |
| కొఱలు | అ | పూర్తౌ | నిండుట |
| కొలు | స | మానే | మానముసేయుట (ధాన్యాదులుకొలుచు) |
| | | సేవాయాంచ | సేవించుట |
| క్రొవ్వు<br>కొవ్వు | అ | మదే | మదించుట |
| కొసరు<br>కొసుకు | స | అతికాంక్షాయాం<br>దానానంతరం పునఃకించిద్దేయమితి ప్రార్థనాయాంచ | మిక్కిలికోరుట<br>ఇచ్చినవెనుక మరలఁ గొంచెమిమ్మని ప్రార్థించుట |
| కోడు | స | తండులాదివివేచనే | బియ్యము మొదలైనవానిని బృథక్కరించుట |
| కోపగించు | అ | కోపే | కోపపడుట |
| కోయు | స | పుష్పాద్యపచయే | పుష్పాదులు చెట్లలోనుండి గ్రహించుట |
| | | లవనే | పైరుమొదలైనవికోయుట |
| కోరు | స | కాంక్షాయాం | కాంక్షించుట |
| | | వరణేచ | వరించుట |
| కోరుకొను | స | వరణే | వరించుట |
| కోరాడు | స | వరాహాదీనాంమృదాద్యుత్ఖాతవికిరణాద్వా | పందులు మొదలైనవి మట్టి త్రవ్వియావలనావల వెదచల్లుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| క్రోలు | స | పానే | త్రాగుట |
| క్రోల్పడు | అ | స్వార్థవ్యపనాశనే | పోఁగొట్టుకొనుట |
| క్రోల్పుచ్ | స | నాశనే | నశింపఁజేయుట |
| క్రోలుమసఁగు | అ | విజృంభణే | విజృంభించుట |
| క్రొత్తలఁజేయు | స | రణోద్యోగకరణే | రణోద్యుక్తముగాఁజేయుట |
| కొకొను గ్రా | స | ప్రాగన్యదీయ స్వార్థస్య కార్యస్య స్వాస్వవశీకరణే | మున్నొకనిది గానున్న యర్థము నైనఁ గార్యము నైన స్వవశముగాఁ జేసికొనుట |
| కౌఁగిలించు | స | ఆలింగనే | ఆలింగనము చేసికొనుట |

## గ

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము |
|---|---|---|---|
| గ్రక్కదలు | అ | భృశచలనే | మిక్కిలి కదలుట |
| గట్టించు | స | ఘట్టనయాపూరణే ఫలకేమస్యాదినా పూర్వరూపవ్యపనయనేచ | ఘట్టనచేసికూరుట పలకమీఁదమసి మొదలైనవానిచేత మొదటిరూపు మాపుట |
| గడు | అ | అతిక్రమణే | అతిక్రమించుట |
| | స | లంఘనేచ- గ్రా | దాఁటుట |
| గడించు<br>గణించు | స | అర్జనే | ఆర్జించుట |
| గండరించు | అ | ఆవిర్భావే | ఆవిర్భవించుట |
| గడిఁదేరు<br>గడిఁదీరు | అ | ప్రౌఢతాయాం | ప్రౌఢుఁడౌట |
| గతుకు | స | శునఆస్వాదే | కుక్క యాస్వాదించుట |
| గంతుగొను<br>గంతుగొట్టు | అ | మృతౌ | చచ్చుట |
| గదుము<br>గదుముకొను<br>గదురు | స | ప్రాప్తౌ | పొందుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| గదురుకొను | స | ధర్షణే | ధర్షించుట |
| గద్దించు<br>గదమాయించు | స | ధిక్కారే గ్రా | ధిక్కరించుట |
| గద్గదించు | అ | ముఖాదేరుచ్ఛ్వాసతాయాం | ముఖము మొదలైనవుబ్బుట |
| గలతరించు | అ | ఆకస్మికపులకోద్గమే | ఆకస్మికముగా గగురుపొడుచుట |
| గలవరించు<br>గలబరించు | స | పాత్రజలవిలోడనే | పాత్రంలోనీళ్లుకలియఁబెట్టు |
| గాఁడు | స | వేధనే | బాణాదులచేత గ్రుచ్చుట |
| | అ | విద్ధతాయాంచ | బాణాదులుఁగ్రుచ్చుకొనుట |
| గారవించు | స | ప్రీణనే | ప్రీతిసేయుట |
| గాలించు | స | పాత్రేజలేనతండులాదిషుపాషాణశోధనే | పాత్రలో జలముచేత బియ్యము మొదలైన వాని లోని ఱాళ్లుశోధించుట. |
| | | మార్గణేచ. | వెదకుట |
| గిచ్ | స | నఖక్షోదనే | గోళ్లతోరక్కుట [ట |
| గింజు గ్రా | స | కార్పణ్యయాచనే | కార్పణ్యముగ యాచించు |
| గింజుకొను<br>గిజగిజలాడు | అ | ఆపదాహస్తపాదాదికర్షణే | ఆపదచేతఁ గాలుసేతులు సీడ్చికొనుట |
| గిట్టు | అ | మృతౌ | చచ్చుట |
| | | సమ్మతౌచ | సమ్మతమౌట |
| గిఱిగొను | స | పరివేష్టనే | చుట్టుకొనుట |
| గిలుబాడు | స | చౌర్యే | దొంగిలించుట |
| గిల్లు | స | అంగుష్ఠతర్జనీభ్యామూర్ధ్వాదాచర్మోద్గ్రహణే | అంగుష్ఠతర్జనులచేతఁదొడమొదలైనచోటులఁ జర్మమును బట్టి లాగుట |
| | | నఖక్షతకరణేచ | నఖక్షతముసేయుట. పండ్లు గిల్లెను |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| గీచు | స | రేఖాకారక్షతే | రేఖాకారముగాక్షతము సేయుట |
| గీటు | స | అసనే | చిమ్ముట |
| గీటుకొను | స | సంకేతే | సంకేతము సేయుట |
| | | ఛద్మనామారణేచ | ఛద్మనగాఁజంపుట |
| గీటడఁచు | స | మారణే | చంపుట |
| గీయు గ్రా / గీరు | స | రేఖాలిఖనే | రేఖగావ్రాయుట |
| గీఱు | స | ఫలాద్యాస్వాదనభేదే | దంతములతో ఫలాదుల నఁజీకుట |
| | | బాణప్రయోగే | బాణములు ప్రయోగించుట |
| | | ప్రహారేచ | ప్రహారించుట |
| గీఱుకొను | స | సంకేతే | సంకేతము సేయుట |
| గ్రుంకు | అ | హ్రైస్వ్యే | తగ్గుట |
| | | మజ్జనే | మునుఁగుట |
| | | అస్తమయేచ | అస్తమించుట |
| గ్రుచ్ / గుచ్ | స | శలాకాదీనామంతః ప్రవేశే | కడ్డి మొదలైనదానిని లోపలికిఁ దూర్చుట |
| గుంజు | స | హఠాత్కర్షణే | బలాత్కారముగా నీడ్చుట |
| | | వాసస్సంహత్యపాణిభ్యాం నిర్ణేజనేచ | బట్టముద్దగాఁజేసి రెండుచేతులతో నుదుకుట |
| గుజగుజలాడు | అ | మిథోజల్పనే | ఒక విషయమై రహస్యముగాఁ గుంపులుగూడి మాటలాడుకొనుట. |
| గుంజులాడు | స | హఠాదన్యోన్యకర్షణే | బలాత్కారముగా నొకనినొకఁ డీడ్చుకొనుట |
| గుటుక్కను గ్రా / గుండువేయు | అ | మృతౌ | చచ్చుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
| --- | --- | --- | --- |
| గుంగ్రించు | అ | పిత్తదోషేణఆంత్రభ్రమణే | పిత్తముచేతఁ బ్రేగులుదిరుగుట |
| గుద్దు | స | ముష్టిఘాతే | పిడికిటంగొట్టుట |
| గుద్దులాడు | స | అన్యోన్యముష్టిఘాతే | ఒకనినొకఁడు గుద్దుకొనుట |
| గుద్దలించు | స | కుద్దాలేనఖననే | గుద్దలితోఁ ద్రవ్వుట |
| గుదియించు | స | అవస్థాపనే | నిలుపుట |
| గుదగుదలాడు | అ | సగద్గదరోదనే | డగ్గుత్తికతో నేడ్చుట |
| | | మిథోజల్పనేచ | ఒకనివిషయమైరహస్యముగా గుంపులుగూడి మాటలాడుకొనుట |
| గునియు | అ | ప్రీతివిస్రంభాస్కంద మందయాచనాయాం | చనువుచేత మెల్లమెల్లగా నడుగుట |
| గుప్పు | స | గాఢావఘాతే | గట్టిగాదంచుట |
| గుప్పటించు గ్రా / గుప్పళించు | స | వాసస్సంహత్యపాణిభ్యాంనిర్ణేజనే | బట్టముద్దగాఁజేసి రెండుచేతులతో నుదుకుట |
| గుంపించు | స | ఈర్ష్యయావికృతభాషణే | ఈర్ష్యచేత వికారపు మాటలాడుట |
| గుబాళించు | అ | ప్రకాశే | ప్రకాశించుట |
| గుబుకు / గుముకు | స | ముష్టితాడనే | పిడికిట_తాడనముచేయుట |
| గుఱుకొను | అ | ఉద్యోగే | ఉద్యోగించుట |
| గుఱువెట్టు / గుఱ్ఱువెట్టు | అ | నిద్రాయాంకంఠఘోషే | గుఱకవెట్టుట |
| గుఱ్ఱు | అ | అసమ్మత్యాకోపే | అసమ్మతిచేతఁ గోపించుట |
| గుసగుసలాడు | అ | ఉపాంశుమంత్రణే | రహస్యముగా నాలోచించుట |
| గెంటు | స | నోదనే | త్రోయుట |
| | అ | విషమచలనేచ | ఎచ్చుతగ్గుగాఁగదలుట |
| గెంట్లు గ్రా | అ | విషమచలనే | ఎచ్చుతగ్గుగాఁగదలుట |
| గెట్టించు గ్రా | స | ఘట్టనయాపూరణే | ఘట్టనచేసికూరుట |

| ధాతువు | | | సంస్కృతార్థము | తెలుఁగర్థము |
|---|---|---|---|---|
| | | | ఫలకేమష్యాదినా పూర్వరూపవ్యపనయనేచ | పలకమీఁద మసి మొదలైనవానిచేత మొదటిరూపు మాపుట |
| గెలు | | స | జయే | జయించుట |
| గెడించు | | స | బహిరపనోదనే | అవతలికిఁద్రోయుట |
| గేలించు | గ్రా | స | అపహాసే | అపహాసముచేయుట |
| గ్రొచ్ | | స | ఖననే | త్రవ్వుట |
| గొణుగు, గొనుగు | | స | ఉపాంశుజల్పనే | తనలోఁదాను మెల్లగా మాటలాడుట |
| గొఱుగు | | స | క్షురకర్మణి | క్షౌరముచేయుట |
| గోఁకు | | స | కండూయనాదౌ | దురదతీరునట్లు గోళ్ళతోఁ గీఁచుట (కుండగోఁకెనను) |
| గోజు, గోజులాడు | | స | ముహుర్వివేచనే, అవిమోచనేచ | మాటిమాటికి వివేచించుట, విడువనివాఁడగుట |
| గోజరు | | స | ముహుర్యాచనే | మాటిమాటికి యాచించుట |
| గోలించు | | స | స్నేహభర్జనే | చమురుపోసివేయించుట |

## చ

| ధాతువు | | సంస్కృతార్థము | తెలుఁగర్థము |
|---|---|---|---|
| చక్కాడు | స | మారణే | చంపుట |
| చచ్ | అ | మృతౌ | మృతుఁడౌట |
| చతికిలఁబడు, చదికిలఁబడు | అ | విశీర్ణపతనే | కూలఁబడుట |
| చదియు | అ | చూర్ణీభావే | చూర్ణమగుట |
| చదుపు | స | మారణే | చంపుట |
| చదువు | స | విద్యాభ్యాసే, పఠనేచ | విద్యయభ్యసించుట, పఠించుట |
| చను | అ | గమనే, అర్హత్వేచ | పోవుట, తగుట |
| చనుదెంచు | అ | ఆగమనే | వచ్చుట |
| చప్పరించు | స | ఆస్వాదవిశేషే | రుచిచూచుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| చమురు / చరుము | స | స్నేహాలేపనే / ఆమర్శనేచ | నెయ్యి మొదలైనవి పట్టించి రాచుట / తడవుట |
| చఱి | స | ఆస్ఫాలనే | అప్పళించుట |
| చఱు | | ప్రహారే | కొట్టుట |
| | | అయఃప్రభృతిశలాకాకర్షణే | అయస్సు మొదలగునవి పొడిగించుట |
| చల్లు | స | ప్రోక్షణే | ప్రోక్షించుట |
| | | బీజావాపే | విత్తనము వేయుట |
| | | వికిరణేచ | వెదచల్లుట |
| చల్లారు | అ | ఊష్మశాంతౌ | వేడిలేనిదవుట |
| | | అగ్నిశాంతౌచ | నిప్పుశమించుట |
| చలివాపు | స | భయవారణేవసాంత్వనే | భయముదీర్చి బుజ్జగించుట |
| చాఁచు | స | ప్రసారణే | ప్రసరింపఁజేయుట |
| చాటు / చాటించు | స | విధ్యాద్యుద్ఘోష్యసర్వేషాంజ్ఞాపనే | విధిగా నుద్ఘోషించి యందఱకును దెలియఁజేయుట |
| చాఁను | స | శాణాదిషుఘర్షణే | సానమొదలగువానిమీఁద రాచుట |
| చాఁపు | స | ప్రసారణే | ప్రసరింపఁజేయుట |
| చాదు | స | ఖలాదౌసమ్మార్జన్యాదినా ధాన్యాదీనాం రాశీకరణే | కళ్ళము మొదలైనవానిలోఁ జీపురుకట్ట మొదలైనవానిచేత ధాన్యాదులు ప్రోగుసేయుట. |
| చాలు | అ | పర్యాప్తౌ | పర్యాప్తమగుట |
| | | శక్తౌచ | శక్తుండగుట |
| చాలించు | స | కార్యవిరమణే | పని నిలుపుట |
| చాల్పడు | అ | యావత్పతనే | అంతయుఁబడుట |
| చిక్కు | అ | కార్శ్యే | కృశించుట |
| | | లాభే | లభించుట |
| | | శేషే | మిగులుట |
| | | హస్తగ్రాహేచ | చేతికిఁబట్టువడుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| చిక్కువడు | అ | తంతూనాం పరస్పరమేళనే | దారములు పరస్పరము మేళనమగుట |
| | | కష్టప్రాప్తౌ | కష్టమునొందుట |
| | | హస్తగ్రాహే చ | చేతికిఁ బట్టువడుట |
| చిక్కుకొను | అ | లగ్నతాయాం | అంటుకొనుట |
| | | పరాధీనతాయాం చ | పరాధీనుఁడవుట |
| చిగిర్చు<br>చిగిరించు | అ | పల్లవోత్పత్తౌ | పల్లవించుట |
| చించు | స | వస్త్రాదీనాం ద్వైధీకరణే | వస్త్రములు మొదలైనవానిని రెండుగాఁ జేయుట |
| చిచ్చికొట్టు | స | బాలానాం ప్రస్వాపనే | పిల్లకాయలను నిద్రపుచ్చుట |
| చిట్లు<br>చిటులు | అ | శుష్కఫలాదీనాం స్వతస్సశబ్దవిదళనే | ఎండినఫలాదులు తనకుఁదానె ధ్వనిగాఁ బగులుట |
| చిటాఁరించు గ్రా | స | కోపవికృతౌ | కోపముచేత వికృతమగుట |
| చిత్తగించు | స | బుద్ధ్యారోహే | బుద్ధికిఁ దెచ్చుకొనుట |
| చితుకు<br>చిదుకు | అ | విశీరణే | విశీర్ణమగుట |
| చిదుపు<br>చిదుము | స | మారణే | చంపుట |
| | | విశీర్ణకరణే చ | విశీర్ణముగాఁ జేయుట |
| చిందు | అ | స్యందనే | ఒలుకుట |
| చినుకు | అ | వృష్టౌ | వర్షించుట |
| చినుఁగు | అ | వస్త్రాదిభేదే | వస్త్రాదులు బద్దలగుట |
| చిన్నవోవు | అ | ఖేదే | ఖిన్నుండవుట |
| చిప్పిలు | అ | ఉద్గమే | ఉబుకుట |
| చింపు | స | ఛేదనే | చినుఁగునట్లు చేయుట |
| చిముడు | అ | అతిపాకదూషితే | అతిపాకముచేతఁ జెడిపోవుట |
| చిమ్ము | స | అసనే | మీటుట |
| చిరుఁగు | అ | వస్త్రాదిభేదే | వస్త్రాదులు భిన్నమౌట |
| చిరుతలువారు<br>చిరుతలుగ్రమ్ము | అ | తేజోతిశయదర్శనేన చక్షుః ప్రతిఘాతే | మిక్కిలి తేజస్సును జూచుటచేతఁ గన్నులు చెదరుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| చిఱుము | స | విశీర్ణకరణే | చిదురుపట్టులు చేయుట |
| చిఱచిఱలాడు<br>చిఱ్ఱుముఱ్ఱాడు | అ | కోపవికారే | కోపవికారము నొందుట |
| చిలుకు<br>చిల్కు | స | మథనే<br>ప్రోక్షణేచ | మథించుట<br>ప్రోక్షించుట |
| చిలకరించు | స | ప్రోక్షణే | ప్రోక్షించుట |
| చిర్వ | స | తక్షణే | చెక్కుట |
| చివుకు | స | శైథిల్యే<br>ఆస్వాదవిశేషేచ | శిథిలమౌట, అనఁగాఁ గ్రాఁతగిలుట<br>ఫలాదులాస్వాదించుట |
| చీకాకుపడు<br>చీదరపడు | అ | వ్యాకులత్వే | వ్యాకులుండగుట |
| చీదు | స | నాసామలనిస్సారణక్రియాయాం | చీమిడి పోవునట్లు చేసికొనుట |
| చీరు | స | ఛేదనే | బద్దలు చేయుట |
| చీఱు | స | ఆహ్వానే | పిలుచుట |
| చీలు | స | వంశాదిదళనే | వెదురు మొదలైనవి బద్దలవుట |
| చీవు | స | తక్షణే | చెక్కుట |
| చుట్టు | స | వేష్టనే | వేష్టనసేయుట |
| చుట్టుముట్టు<br>చుట్టుకొను<br>చుట్టువేయు | స | పరివేష్టనే | పరివేష్టించుట |
| చుఱుపుచ్ | స | దహనే | కాల్చుట |
| చూచు | స | దర్శనే | దర్శనము సేయుట |
| చూఁడు | స | దహనే | కాల్చుట |
| చూపట్టు | అ | దర్శనవిషయతాయాం | అగపడుట |
| చూపెట్టుకొను<br>చూపట్టుకొను | స | ప్రతీక్షాయాం<br>అనుపద్రవదర్శనావస్థానేచ | ప్రతీక్షించుట<br>ఉపద్రవము రాకుండఁ జూచుచుండుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| చెక్కు | స | తక్షణే | తక్షణముసేయుట |
| | | ఉపగూహనే | దోఁపుట |
| | | పర్యుపరిఖననే | పయిపయిగాఁ ద్రవ్వుట |
| | | ప్రతివపనేచ | రత్నములు చెక్కెననియును |
| చెక్కుచెదరు | అ | ఈషద్భంగే | ఈషద్భంగమగుట |
| చెంగు | అ | క్రీడాదిషుపరాభవే | ఆట మొదలైనవానిలోఁ బరాభూతుఁడగుట |
| చెంగలించు | అ | ప్రకాశే | ప్రకాశించుట |
| చెటాయించు(గ్రా) | అ | విరోధే | విరోధమవుట |
| చెట్టవట్టు | స | వివాహే | వివాహమవుట |
| చెడు | అ | కార్యవైకల్యే | కార్యవైకల్యమగుట |
| చెణకు / చెణుకు | స | స్పర్శే | స్పృశించుట |
| చెదరు / చెదురు | అ | ఉత్పత్యపరితఃప్రసరణే | ఎగసియంతటను బ్రసరించుట |
| | | సేనాపరాభవే | దండు పరాభూతమగుట |
| | | చలనేచ | కదలుట |
| చెందు | స | ప్రాప్తౌ | పొందుట |
| చెనయు | స | స్పర్శే | స్పృశించుట |
| చెప్పు | స | ఉక్తౌ | పలుకుట |
| చెమర్చు / చెమ్మటిలు / చెమ్మగించు | అ | ఆర్ద్రీత్వే | ఆర్ద్రీమౌట |
| చెరువు | అ | ఉపగూహనే | దోఁపుట |
| చెరుగు | స | పరాపవనే | చేటతోఁ దవుడు మొదలైనది విడఁజేయుట |
| చెఱుచు / చెరుపు | స | కార్యవైకల్యకరణే | కార్యవైకల్యము సేయుట |
| చెఱలాడు | అ | వప్రక్రీడాయాం | దరికోరాడు |
| చెఱుము | స | లేపనే | రాచుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| చెల్లు | అ | ఋణనిర్యాతనే | అప్పుదీఱుట |
| | | అప్రతిబంధే | ప్రతిబంధము లేనిదవుట |
| | | మృతౌచ | చచ్చుట |
| చెలఁగు | అ | శోభాయాం | శోభించుట |
| చెలరేఁగు | అ | అతివ్యాప్తౌ | మిక్కిలి వ్యాపించుట |
| | | అత్యుద్ధతౌచ | మిక్కిలి నుద్ధతుండవుట |
| చేకుఱు<br>చేకూఱు<br>చేకూడు | అ | హస్తగతే<br>ఆనుకూల్యేచ | హస్తగతమౌట<br>అనుకూలమగుట |
| చేటుమూఁడు<br>చేటుమూడు<br>చేడ్పడు | అ | దైవప్రాతికూల్యప్రాప్తౌ | దైవప్రాతికూల్యము వొందుట |
| చేఁదు | స | నికురణే | బావి మొదలైనదానిలోనుండి నీళ్ళుచేఁదుట |
| చేఁపు | అ | క్షీరప్రస్నవే | పాలు ఉబుకుట |
| | స | క్షీరప్రస్నవకరణేచ | ఆవు పాలుబుకఁజేయుట |
| చేపడు | అ | హస్తగతే | హస్తగతమౌట |
| చేపట్టు | స | అవలంబే | అవలంబించుట |
| | | వివాహేచ | వివాహమగుట |
| చేమోడ్చు | అ | ప్రణామే | మ్రొక్కుట |
| చేయు | స | కరణే | సలుపుట |
| చేరు | స | ప్రాప్తౌ | పొందుట |
| | స | ఉపధానే | ఆనుకొనుట |
| | అ | హస్తగతేచ | హస్తగతమౌట |
| చేరుచు<br>చేర్చు | స | పుష్పాదిధారణే<br>ప్రాపణేచ | పుష్పాదులు ధరించుట<br>పొందించుట |
| చొక్కు | అ | మత్తతాయాం | మత్తుగొనుట |
| | | శ్రాంతౌ | బడలుట |
| | | మృతౌచ | చచ్చుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెలుఁగర్థము. |
|---|---|---|---|
| చొచ్చు } చొత్తెంచు } | స | అంతఃప్రవేశే | లోపలికిఁ బ్రవేశించుట |
| చొనుపు | స | అంతఃప్రవేశనే | లోపలికిఁ బ్రవేశింపఁజేయుట |
| | | బాణప్రయోగేచ | బాణములు ప్రయోగించుట |
| చొప్పడు | అ | ఆనుకూల్యే | అనుకూలమవుట |
| చొప్పిల్లు | అ | ప్రకాశే | ప్రకాశించుట |
| చొరవేయు | అ | అంతఃప్రవేశే | లోపలికిఁ బ్రవేశించుట |
| | స | అంతఃప్రవేశనేచ | లోపలికిఁ బ్రవేశింపఁజేయుట |

జ

| | | | |
|---|---|---|---|
| జంకు | అ | భయే | భయపడుట |
| జక్కించు | అ | అనవమృశ్యకరణే | విచారింపక చేయుట |
| జడియు | అ | భయే | భయపడుట |
| జడనుపడు | అ | బలహాన్యామాంద్యే | బలహానిచేత మందపడుట |
| జరుగు | అ | మనాగపసర్పణే | మెల్లగా నావలఁబోవుట |
| | | కాలగతౌచ | కాలము గడచుట |
| జల్లించు | స | తితఉభ్రామణేనశోధనే | జల్లెడతోఁ ద్రిప్పి పరిశోధించుట |

ధనే

| | | | |
|---|---|---|---|
| జల్లను } జల్లుమను } జలపరించు } | అ | అనిష్టదర్శనశ్రవణాది జన్యకంపస్వేదపులకోద్భేదాదౌ | అనిష్టవస్తువును జూచుటవలనైన వినుటవలననైన శరీరము కంపస్వేదరోమాంచాదులుగలదౌట |
| జవుకు | అ | | కురుపు మొదలైనది మెత్తగిలుట |
| జవురు | స | రజ్జ్వాదినాతాడనే | త్రాఁకు మొదలైనవానితోఁ గొట్టుట |
| | | సమూహనేచ | ప్రోఁగుగాఁజేయుట |
| జవురుకొను | స | సమూహ్యగ్రహణే | ప్రోఁగుగాఁజేసి యెత్తికొనుట |
| జాడించు | స | జలేవస్త్రాదిప్రక్షిప్య మాలిన్యాపనయనే | జలమునందు బట్ట మొదలైనదానిని వేసి మైలపోఁగొట్టుట |
| | | ప్రహారేచ | కొట్టుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెలుఁగర్థము |
|---|---|---|---|
| జాఱు | అ | పలాయనే | పలాయితుఁడౌట |
| | | గ్రంథివిస్రంసే | ముడివిడిపోవుట |
| | | పాదాదిస్ఖలనభేదే | కాలు మొదలైనది స్ఖలనమగుట |
| | | జలస్రావే | నీళ్ళు స్రవించుట |
| | | అపరాధే | తప్పుట |
| | స | విసర్జనేచ గ్రా | విడుచుట మాటజాఱితినని |
| జాల్గొను | అ | ప్రవాహే | ప్రవహించుట |
| జితపడు | అ | అభ్యాసే | అభ్యస్తమగుట |
| | | అనుకూల్యేచ | అనుకూలించుట (ఒంౘెననుట) |
| జిలుగు | స | శ్లిష్టసూక్ష్మలిఖనే | ఒకదానితోనొకటి కలియునట్లు సన్నముగా వ్రాయుట |
| జీరు, జీరాడు, జీరుకాడు | అ | లంబనే | వ్రేలుకాడుట |
| జుణగు, జుణుగు | అ | పరాగతౌ | వెనుకఁదీయుట |
| జుఱ్ఱు | స | చోషణే | పాయసము మొదలైనది నోటితో ధ్వనిగా గ్రహించుట |
| జేవురించు, జొత్తిల్లు | అ | అరుణీభావే | ఎఱ్ఱనవుట |
| జొబ్బిల్లు | అ | ఉద్గమే | ఉబుకుట |
| జోకొట్టు | స | బాలానునీయ ప్రస్వాపనే | పిల్లకాయల నూరార్చి నిద్రపుచ్చుట |
| జోకు | స | ఉపాలంభే | తిట్టుట |
| జోడించు | స | ద్వితీయేనసంయోజనే | రెండవదానితోఁగూర్చుట |
| జోపు | స | అపనోదనే | ఆవలఁద్రోయుట |
| జోలపాడు | స | బాలానునీయస్వాపనే | పిల్లకాయలనూరార్చినిద్రపుచ్చుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
| --- | --- | --- | --- |
| | | **ట** | |
| టక్కు<br>టక్కుచేయు<br>టక్కులాడు | స | ప్రతారణే | వంచనసేయుట |
| | | **డ** | |
| డగ్గఱు | అ | సన్నిధానే | సమీపించుట |
| డమ్మరు గ్రా | అ | మృతౌ | చచ్చుట |
| డయ్యు | అ | బలహానౌ | బలహీనుఁడగుట |
| డాఁగు | అ | అదృశ్యతాయాం | అదృశ్యుండవుట |
| డాపలించు | అ | పార్శ్వదేశప్రాప్తౌ | ప్రక్కఁజేరుట |
| డాయు | స | సన్నిధానే | సమీపించుట |
| డిగు<br>డిగ్గు | అ | అవతరణే | దిగుట |
| డిందు | అ | మృతౌ | చచ్చుట |
| డిందుపడు | అ | బలహానౌ | బలహీనుండవుట |
| డిల్లపడు | అ | నిశ్చేష్టతాయాం | నిశ్చేష్టుండవుట |
| డీకొను | స | కలహాభ్యుత్థానే | ఎదిరించుట |
| డీలుపడు | అ | బలహానౌ | బలహీనమవుట |
| డుయ్యు | అ | ముష్ట్యాదిభ్యో నిస్సరణే | పిడికిలి మొదలైనదానివలన జాఱిపోవుట |
| | | పరాగతౌ | వెనుకదీయుట |
| | | విస్రస్తేచ | విచ్చిపోవుట |
| డుల్లు | అ | పతనే | పడుట |
| డులుచు | స | అవస్రంసనే | వదలించుట |
| | | పాతనేచ | పడవేయుట |
| డెక్కు | స | అవరోధనే | అడ్డగించుట |
| డొంకు | అ | హైన్యే | తగ్గిపోవుట |
| డొల్లు | అ | పతనే | పడుట |
| | | పరివర్తనేచ | పొర్లుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| **త** | | | |
| తక్కు | అ | శేషే | మిగులుట-తక్కినదియని |
| | | పరిహారేచ | పరిహరించుట-పోకతక్కనని |
| తగు | అ | అర్హతాయాం | అర్హుఁడవుట |
| తగ్గు | అ | హ్రాస్యే | తక్కువగుట |
| తగులు | స | ప్రాప్తౌ | పొందుట |
| | స | స్పర్శే | అంటుట |
| | అ | లగ్నేచ | పట్టుపడుట |
| తగుల్పడు | అ | లగ్నే | పట్టువడుట |
| తగులుకొను | అ | లగ్నే | పట్టువడుట |
| | | దగ్ధేచ | కాలుట |
| తగలవేయు | స | దహనే | కాల్చుట |
| | | వ్యతిషంజనేచ | అంటునట్లుచేయుట |
| తగలఁబడు | అ | దగ్ధే | కాలుట |
| త్రచ్ | స | మథనే | మథించుట |
| తట్టు | స | తాడనే | తాటించుట |
| తటాయించు గ్రా | స | నిర్భిద్యగమనే | భేదించుకొనిపోవుట |
| తడయు | అ | ఆలస్యే | ఆలస్యముసేయుట |
| తడియు | అ | ఆర్ద్రీభావే | ఆర్ద్రమవుట |
| తడవు, తడువు | స | ఆమర్శనే | అంతటస్పృశించుట |
| తండు | స | దేయార్థోద్గ్రహణే | ఈవలయునర్థమును రాఁబట్టుట |
| తడఁబడు, తత్తజిలు, తత్తరిల్లు, తత్తరపడు, తత్తరకొను | అ | సంభ్రమే | తొట్రువడుట |
| తొందరిలు, తందరిల్లు | అ | సంభ్రమే | తొట్రువడుట |
| తన్ను | స | పాదతాడనే | పాదములతోఁగొట్టుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| తనకు<br>తనరు<br>తనర్చు | అ | ప్రకాశే | ప్రకాశించుట |
| తనియు | అ | తృప్తౌ | తృప్తిఁబొందుట |
| తన్నుకాడు | అ | పిష్టపేషణేనావిమోచనే | పట్టినదిపట్టుగా విడువనివాఁడౌట |
| | | స్వయంస్వపాదతాడనే | తన్నుఁదానుదన్నుకొనుట |
| | | అన్యోన్యపాదతాడనేచ | ఒకనినొకండు తన్నుకొనుట |
| తన్నులాడు | అ | అన్యోన్యపాదతాడనే | ఒకనిచేనొకండుతన్నులఁబడుట |
| తప్పు | స | అతిక్రమే | అతిక్రమించుట |
| తమకు | అ | చలనే | కదలుట |
| | | పరాగతావిత్యేకే | వెనుకఁదీయుట |
| తమకించు | స | అత్యనురాగే | మిక్కిలియనురాగముఁబొందుట |
| తరలు | అ | చలనే | చలించుట |
| | | నిర్గమనేచ | బయలువెళ్లుట |
| తర్లు | అ | ప్రస్థానే | ప్రయాణమగుట |
| తరు | స | మథనే | మథించుట |
| తరతరలాడు | అ | అతిసంభ్రమే | మిక్కిలిసంభ్రమపడుట |
| తఱుగు | స | హీనతాయాం | తక్కువౌట |
| | | ఫలాదీనాముపఖండనేచ | ఫలాదులు రెండుచేతులతోఁబట్టుకొని కోయుట |
| తఱుము | స | ధావతోనుధావనేన వేగజననే | పరుగెత్తువాని వెంబడిఁ దానును బరుగెత్తుచు వానికివేగము పుట్టించుట |
| | | ఆక్రమణే | ఆక్రమించుట |
| | | శాణోల్లేఖనే | తఱిమెనపట్టుట |
| తఱుము | స | ధావతోనుధావనేన వేగజననే | పరుగెత్తువాని వెంబడిఁ దానును బరుగెత్తుచు వానికివేగము పుట్టించుట |

# పరిషత్కార్యాలయమున వెలకు దొరకు గ్రంథములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము-చదలువాడ మల్లయకవి | రు | 0 | 8 | 0 |
| 2 | కవిజనాశ్రయము-వేములవాడ భీమకవి ... | ... | 0 | 10 | 0 |
| 3 | చంపూరామాయణము-ఋగ్వేదికవి వేంకటాచలపతికవి | ... | 1 | 0 | 0 |
| 4 | నీతిసీసపద్యశతకము-తాళ్లపాక పెదతిరుమలార్యుఁడు | ... | 0 | 2 | 0 |
| 5 | జ్యోతిశ్శాస్త్రసారము-శ్రీమాన్ కపిస్థలం కృష్ణమాచార్యులుగారు బి. ఏ., యల్. టి. ... | ... | 0 | 8 | 0 |
| 6 | జ్ఞానప్రసూనాంబికాశతకము-శిష్టు సర్వశాస్త్రికవి | ... | 0 | 2 | 0 |
| 7 | సర్వేశ్వరశతకము-యథావాక్కుల అన్నమయ్యగారు | ... | 0 | 3 | 0 |
| 8 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము-జ. రామయ్య పంతులు గారు, బి ఏ., బి ఎల్ ... | ... | 0 | 8 | 0 |
| 9 | కావ్యాలంకారచూడామణి-విన్నకోట పెద్దయకవి | | 0 | 8 | 0 |
| 10 | చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లనకవి | ... | 1 | 0 | 0 |
| 11 | అకారాద్యముద్రిత గ్రంథసూచిక ... | ... | 0 | 8 | 0 |
| 12 | ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ... | ... | 0 | 12 | 0 |
| 13 | శివతత్త్వసారము-మల్లికార్జున పండితారాధ్యులు | ... | 0 | 12 | 0 |
| 14 | Defence of Literary Telugu జయంతి రామయ్య పంతులుగారు బి ఏ, బి. ఎల్. ... | ... | 0 | 8 | 0 |
| 15 | శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి ... | .. | 0 | 12 | 0 |
| 16 | ఆర్యభాషావిభాగము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ... | ... | 0 | 8 | 0 |
| 87 | Drawidian Lexicography ... | ... | 0 | 4 | 0 |
| 18 | ప్రహస్వరంగములు-కొత్తపల్లి సూర్యారావు ... | ... | 0 | 8 | 0 |
| 19 | నారసింహపురాణము ఉత్తరభాగము-హరిభట్టు | ... | 1 | 0 | 0 |
| 20 | మన్నారుదాస విలాసనాటకము—రంగాజమ్మ. | ... | 0 | 8 | 0 |
| 21 | జైమినిభారతము-వచనము-వేంకటకృష్ణప్ప నాయఁకుఁడు | ... | 0 | 12 | 0 |

# మీ ప్రకటనలను సుభాషిలోఁ బ్రకటింపుఁడు.

ఏలయన—

రాజులు, మహారాజులు, ధనవంతులు, లాయర్లు, డాక్టర్లు, వైద్యులు, మిల్లుయజమానులు, వర్తకులు, ఉపాధ్యాయులు, విద్యార్థులు, మొదలగువారందఱు సుభాషిని జదివెదరు. ఇందులో విజ్ఞాపనలను బ్రకటించినట్లయిన మీ వ్యాపారమునుగూర్చి యందఱకు వెల్లడికాఁగలదు. మీవస్తువులను గొనువారందఱను నిట్టివారే కావున, మీవ్యాపారము వృద్ధిఁబొందుట కింతకంటె సులభమైన మార్గమేమైనఁ గలదా?

ఇది తెలుఁగుదేశములోని పత్రికలన్నిటిలో నగ్రస్థానము వహించుచున్నది. ఈపత్రికను, ఆంధ్రులందఱు నాసక్తితోను, ఆదరముతోను జదివెదరు? కాఁబట్టి మీప్రకటనలు దేశమంతట వ్యాపించుటకు జక్కని సాధనము సుభాషియే

ఈపత్రికకు, హిందూదేశములోని ప్రతిభాగమునఁ బ్రచారముకలదు కావున, మీప్రకటనలుకూడ దేశమందంతట వ్యాపించునని వేఱె చెప్పనవసరము లేదు.

ఈపత్రికకు, చందాదారులు దినదినము ననేకులుచేరుచున్నారు. స్త్రీపురుషులెల్లరు దీనిని జదువుచున్నారు. ఇంతటి ప్రజాదరణమును చూరగొనుచున్న పత్రిక ఆంధ్రదేశములో నింకొకటిలేదు.

ఇందు సమస్తవిషయములనుగూర్చిన వ్యాసములును బ్రకటింపఁబడును కాఁబట్టి, వివిధములగు నభిరుచులు గలవారందఱు దీనిని జదివెదరు.

అందఱకు నందుబాటులో నుండుటకుఁ బ్రకటన దరలు, చాల దక్కువగ నేర్పఱుపఁబడ్డవి.

వెంటనే మీప్రకటనలను, కంట్రాక్టు చేయించుకొనుఁడు, లేనిచో ముందుముందు, ప్రకటనరేట్లు, అధికముకాఁగలవు.

వివరములు, ఈదిగువ చిరునామాకు వ్రాసినఁ బొందఁగలరు.

మేనేజరు:—సుభాషి
రాజమహేంద్రవరము.

Printed by M. Rangiah at the Cocanada Printing Works, Cocanada.

శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy).**

సంపుటము ౧౭. { విభవనామసంవత్సరము. జ్యేష్ఠాషాఢమాసములు. } సంచిక ౨.



కాకినాడ

క్రొత్తపల్లి సూర్యారావుచేఁ బరిషత్కార్యాలయమునఁ

బ్రకటింపఁబడినది.

చందా { పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు. 3. } { విడిసంచిక రు ౦-౮-౦

1928

## ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు,
పిఠాపురము మహారాజావారు. పరిషత్కార్యప్రధానాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు మైలవరము జమీందారువారు.

శ్రీరాణి సత్యవాణి వేంకటసుబ్రహ్మణ్యమ్మ జగపతిబహద్దరుగారు, ... రాణీగారు.

కీ. శే. శ్రీబొబ్బిలి మహారాజావారు

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

### అధ్యక్షులు

జయంతి రామయ్యపంతులుగారు బి.ఏ., బి.ఎల్.

### కార్యదర్శులు.

దర్భా వేంకటశివరామశాస్త్రిగారు బి.ఏ., బి.ఎల్.

కిడాంబి రాఘవాచార్యులుగారు ఎం.ఏ., బి.ఎల్.

### కార్యనిర్వాహకసభాసభ్యులు

దివాన్ బహదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారు,
(కోశాధ్యక్షులు.)

శ్రీ త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారు.
కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.
అనంతపంతుల రామలింగస్వామిగారు.
దగ్గిరాల వేంకటసూర్యప్రకాశరావుగారు బి. ఏ.
తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు.
అల్లంకి వెంకట్రామయ్యగారు.
కోశా వేంకటసుబ్బారావు నాయుడుగారు.
డాక్టరు వేమూరి రామకృష్ణారావుగారు ఎం. ఏ. ఎల్. టి. PH. D
ఓలేటి వేంకటరామశాస్త్రిగారు.
పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.
పిల్లారిసెట్టి గంగబ్రహ్మరావు నాయుడుగారు.

# విషయసూచిక.

# పరిషత్ప్రయోజనములు.

---

తెనుఁగుభాషను, వాఙ్మయమును, అభివృద్ధి నొందించుటయు, ఆవిషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసంగుటయు నీపరిషత్తుయొక్క ప్రయోజనములు ఈపనిని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యీ క్రిందఁ బొందుపఱుపఁబడు చున్నవి.—

I తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వాంకష మగునిఘంటు వొకటి రచించి ప్రచురించుట ,

II తెలుఁగుభాషకు సజాతీయేతర భాషలతోఁ గలసాదృశ్యములను సాకల్యముగ నిరూపించుచు నొకవ్యాకరణమును రచించి ప్రచురించుట ,

III ఆధునికశాస్త్ర గ్రంథరచనయందుఁ బ్రయోగించుటకునై పారిభాషికపదములను నిర్ణయించి వివరించు నొకశబ్దకోశమును సిద్ధముచేయుట ,

IV ఆంధ్రదేశప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహ మొసంగుటయు, లభ్యము లయిన వానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుఁగుదేశముయొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్ర మొకటి రచించి ప్రచురించుటయు ;

V సర్వవిషయములనుగుఱించి చేయఁదగు గ్రంథరచనకుఁ బ్రోత్సాహమొసంగుట ;

VI ఆంధ్రభాషలోని మంచిగ్రంథములఁ బండితపరిష్కారము చేయించి నిర్దుష్టముగఁ బ్రచురించుట ,

VII తెలుఁగుభాషకును వాఙ్మయమునకును సంబంధించిన విషయములను జర్చించు నొక పత్రికను బ్రకటించుట ,

VIII తెలుఁగువాఙ్మయమునకు సంబంధించిన విషయములను గుఱించి చర్చించుటకుఁగాను సాంవత్సరికసభల నేర్పాటుచేయుట ,

IX తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలఁ గావించి పారితోషికములను, సాహిత్య పట్టములను, యోగ్యతాపత్రికలను, నొసంగుట ;

X ఒక పుస్తకభాండాగారమును స్థాపించి సాగించుట ఇందుఁ బ్రధానముగాఁ దెలుఁగు గ్రంథము లుండవలయును , వ్రాఁతప్రతులుగూడ నుండవలయును ;

XI తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికి నుపచరించు నన్ని కార్యములను జేయుట.

ఆంధ్రసాహిత్య
పరిషత్పత్రిక.

సంపుటము ౧౭ | విభవనామసంవత్సరము జ్యేష్ఠాషాఢమాసములు | సంచిక ౨

# కవి—కవిత.

—: కాశీ వ్యాసాచార్యులుగారు :—

" శ్లో॥ జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః।
నాస్తి తేషాం యశఃకాయే జరామరణజం భయమ్॥ "

అని యిబ్బిగంబున దివ్యతపఃప్రభావయుతుండును, భాషార్ణవోత్తారకుండును, సమస్తనీతిశాస్త్రకోవిదుండు నగుభర్తృహరి తనసుభాషితంబున వాక్రుచ్చియుండుట సర్వజనవిదితమే కదా. దీనిఫలితాంశముఁ జూడఁ గవి యగువానికిఁ బునర్భవంబు లేక నిత్యముక్తత్వము సిద్ధించు నటులఁ గానఁబడు చున్నది. ఆయర్థ మెటులు సందర్భించు ననువిషయమునఁ బదపడి నుడివెద. పైయంశంబునే రూఢిపఱచుచు, శ్లో॥ చతుర్వర్గఫలప్రాప్తిః సుఖా దల్పధియామపి। కావ్యాదేవ.....॥ అనఁగా నల్పబుద్ధులకుఁ గూడఁ గావ్యసుఖంబుచేత నే చతుర్వర్గఫలప్రాప్తి చేకూరు నని సాహిత్యదర్పణకారుఁడును,

కం. తనకు హితార్థము తెలిఁగిం, చు, నఘంబులడంచు, ధనముశోభనముయశం
బునుగూర్చు నఖిలసురలం, గనఁబడఁగాఁజేయు నెపుడుఁ గావ్యము కవికిన్.

అని, అప్పకవియుఁ దదితరులు పెక్కురును దమగ్రంథముల నుడివియున్నారు. ఈయంశంబుల మతంబులం దిడికొనియే కాఁబోలును, నాబోటివారు కొంద ఱకాలంబున నూహలఁ జేసి చేసి, ఘోరకాంతారంబులఁ దలక్రిందుగా జపం బొనర్చెడి మునీశ్వరులకు సహిత మందరానట్టియు సాంగోపాంగముగ వేదాధ్యయన మొనర్చువారలకేనిఁ జేరరానట్టియు, శరీరాయాసంబుల కోర్చి క్రతువు లొనర్చెడి మహామహులకేనిఁ జూడరానట్టియు, ఆచతుర్థపురుషార్థ

ము కావ్యనిర్మాణమున నొక్కమారుగ నూడి చేతఁ బడుఁ గదరా, యని యెంచుచుఁ దమలోఁ దాము సంతసించుచున్నారు, నవ్వుకొనుచున్నారు, చిక్కెరా మోక్షము, చిక్కెరా యని గంతులువైచుచున్నారు, ఆకావ్యనిర్మాణ మెంత పని, అది మనచేతిలోనిదే కదా యని యనుకొనుచున్నారు. పాఠకమహాశయులారా! పంచభక్ష్యపరమాన్నంబులు హస్తగతంబు లైనను, వాని నారగించి ఫలంబుఁ గాంచుటకుఁ గొంత ప్రయత్న మవసరము కదా! అట్టులే పైఁ జెప్పిన యుత్తమపురుషార్థకాములు రసానుభవోపలబ్ధికిఁ దగు ప్రయత్నములేమైన నొనరించుచున్నారా? లం దెంతవఱకు నవాప్తకాము లగుచున్నారు? అని మీకొకవిధ మగుశంక మనంబుల జనింపవచ్చును. ఇందు శంకింపవలసిన విషయ మేమున్నది? కల్పవృక్షఫలంబు చేతఁ జిక్కిన * శ్లో॥ హస్తాగతం కిల న ముంచతి కోఽపి మూఢః' అనినటులు మూఢుఁడైనను దాని నారగింపఁ బ్రయత్నింపకుండునా! అటులే యమ్మహాపురుషులును జాల గట్టిప్రయత్నములనే చేయుచున్నారు, ఇఁకముందుఁ గూడ నింతకంటెను దృఢతరప్రయత్నంబులనే చేసెదరు, అం దనుమానం బిసుమంతయు వలదు. మఱియు, వీరి మొదటిప్రయత్నం బెద్దియందురా? తమనామధేయంబులకు ముందుగనో వెన్కనో 'కవి' యనునామంబు క్లప్తపఱుచుటయే. ఔరా! ఎంతసాహస మెంతసాహసము! 'కవి' యనుబిరుదంబుఁ దమకై తామె తగిలించుకొనుటయా! చాల విడ్డూరముగ నున్నదే!—విడ్డూర మేమి? సాహస మేమి? వారిని గొట్టువారెవరు? తిట్టువా రెవరు? అంతయు స్వహస్తంబులయందుననే యున్నది, ఒకవేళ మీరు 'పండితులు లోకంబున వేనవేలు కలరు గదా, వారు సత్యాసత్యనిర్ణేతలు కారా?' యని యందురేమో. సోదరులారా! శాస్త్రోక్తలక్షణలక్షితు లగుపండితులు బొత్తిగ లే రని చెప్పుటకు వీలులేదు, అల్పసంఖ్యాకు లం దందుఁ గలరు. ఐనను మొత్తంబున విచారించినచో,—

శా. ఏమే! సోమి! పలాండు సంస్కృతముకాదే కూర యేన్నేఁడు? నా
థా! ఖారేగద మున్పురాణమునఁ దృక్తవ్యం బటం చన్నవా!
రామాంటల్ మవయి టనా? పరులు చేయుం జెప్పితి న్గాని యం
చీమాద్రిస్వచియిత్రు పెద్ద లగువారే విశ్వనాథేశ్వరా.—

అని నేను గాశీవిశ్వనాథేశ్వరశతకంబున నుడివినరీతిఁ బండితులకన్నఁ బండితంమన్యులే పెక్కురు కానఁబడుచున్నారు. అథవా పూర్వోక్తసుప్రసిద్ధు లగుపండి

తులు నాబోటి నవనాగరకుల చెంతఁ బడినఁ, బ్రప్రథమమునఁ గట్టువిషయమున
ను, జుట్టు విషయమునను, బొట్టువిషయమునను హాస్యాస్పదు లగుచున్నారు. నేఁ
డు, అన్యదేశ భాషాచారంబుల మూఁడింటిలో రెండవదానియందుఁ గాకున్నను,
దక్కిన రెంటియందేని నుత్తీర్ణు లైనవారు సహితము పండితులు కానవచ్చినచో
డలఁ బూర్వకాలపు టనార్యులఁ (Aboriginies) జూచునట్లు చూచుచున్నారు.
సమస్తవిధములఁ బూజ్యార్హు లగువారిని బూజించుట యటులుండఁ బైపెచ్చు త
త్పండితులఁ జూచి యాసడించుకొనుచు, ముసిముసినవ్వులు నవ్వుచు 'మర్యాద
లెఱుఁగని పశువులు (Mannerless brutes)' అనుచున్నారు ఏతద్విధగౌరవ
పాత్రు లగుపండితులఁ బరిష్కర్తలుగా నియమించువా రెవరు? అథవా యొకరి
ద్దఱు వారి నాదరించువా రున్నను వారిపరిష్కారంబుల వినువా రెవరు? అది
యుఁ గాక మఱొకమాట చెప్పవలసియున్నది. అప్రసిద్ధపండితులయందుసహి
తము పెక్కురు చాలవఱకుఁ గాలము మాఱుచుండుట యెఱుఁగక, 'శ్లో. సర్వ
నాశే సముత్పన్నే, త్వర్థం త్యజతి పండితః॥" అనుమాట మఱచి, సమయాను
కూలంబుగ శాస్త్రసమ్మతము లగుమార్పులఁ జేయుటకేనియు నిచ్చగింపక,
లౌక్యపద్ధతు లన నెవ్వియో యెఱుఁగక, పూర్వకాలపు "హైకోర్టు" తీర్పులనె
చేయుచున్నారు. దానఁ జేసియుఁ గొంతముప్పు వాటిల్లుచున్నదని చెప్పవచ్చుఁ.

ఆసంగతి యటులుండనిండు, మనమాతృభాషాసంస్కరణ విషయమున
నెల్లవారును 'స్వయం రాజా స్వయం మంత్రీ" అనినటులు తామే రాజులు తా
మే మంత్రులు. ఎవనికివాఁ డేవియో రెండుపద్యముల నేర్చికొని గాని, నేర్చి
కొనకయే గాని "కవి" అని పేరిడికొని, అక్షరాభ్యాసంబుననే ప్రబంధరచన
కుఁ బూనుకొని గ్రంథములవ్రాసి గ్రంథసాంగుఁ డగుచున్నాఁడు. మఱియుఁ ద
నకుఁగల యాయపూర్వజ్ఞానముచేతనే "శ్లో॥ అతిరమణీయే కావ్యే పిశునోఽన్వే
షయతి దూషణా న్యేవ, అతిరమణీయే వపుషి వ్రణమేవ హి మక్షికా నికరః॥
అన్నట్లుగా నొరులవాక్ప్రపంచమున దోసఁగుల వెదకఁ జూచుచున్నాఁడు. పూ
ర్వమున "కవి" యనుపదంబుఁ గొనుట చాల దుర్ఘటమైయుండె ఆలక్షణంబుల
ముందు వివరించెద. నేఁ డన్ననో, యూరూరను గవులే, యింటింటను గవులే,
ఎట్టివారును గవులే, ఆమహాపురుషులు 'ఊ' అన్నఁ గవిత్వమే, "ఆ" అన్నఁ గ
విత్వమే, తుదకు వారినోటినుండి వచ్చుమాటమాటయుఁ గవిత్వమే, ప్రత్యక్ష
రము కవిత్వమే ఆహా! ఏమీ! ఈవింత! పూర్వకాలంబునఁ బండితులు, కవి

లేదా! ఎల్లవారును గోపాలకుఁడు లేని గోవులచందంబున విజృంభించి, యార్భాటము లొనర్చుచు, ఎక్కడరా కవితాకాంత, యెక్కడ? అని బొబ్బలిడుచు నామె వెన్నఁటి పరుగిడి తత్సతీమణి పుస్తకపేటికలయందు డాగియుండె నని విని, యాపేటికల లేవనెత్తుటకుఁ దగినపనిముట్లు స్వాధీనముగ లేకుంటచేతను, దాళమెచ్చోటనో దానిఁ దీయుట యెట్లో తెలియమిచేతను, దమయిచ్చవచ్చినట్లు నల్వురొక్కుమ్మడిగ మీఁదఁబడి 'అదిగోఁ గవితాకాంత, పట్టుఁడు, కొట్టుఁడు; అనుచు బలవంతముగఁ బైకీడ్చుచున్నారు. ఇట్టిసాహసకృత్య మొనర్చువేళ నొకనిచేతఁబడి, పాప మాకాంతామణి యొక్క మంగళసూత్రము తెగినది, అలంకారములా, అధోగతిపాలైనవి. సౌకుమార్యములా చల్లాఱినవి, పదములా తారుమారైనవి; శయ్యలా. అంపశయ్యలైనవి, కావ్యముల, తుదకు వీరిబారినుండి తప్పించుకొని పాఱిపోవుదమన్నను, సంధిబంధములు చాలవఱకు విఱిగినవి, దైవవశమున నే రెంటిమూఁడింటియందునో యించుక పటిమయుంటచే నామె యింతవఱకు నిలిచియున్నది కాని లేనిచో నేనాఁడో, నామమాత్రావశిష్టమై యుండియుండును అట్టిపుణ్యంబు గట్టికొనెడి మహాత్ములు లేకుండిరా యేమి?' అని యొకవేళ మీరు తలంచెదరేమో, సోదరులారా! ఆవిషయమున మీ రనుమానింపవలసినపనియేమియును లేదు. అట్టిఘనులును, ఇప్పటికప్పుడే జన్మించియే యున్నారు, తత్ప్రయత్నములు జరుగుచునేయున్నవి, పరమేశ్వరుఁడు వారికోర్కెల నవశ్యము నీడేర్చుననియే తలంపవలసియున్నది.

అదిగాక పూర్వశాస్త్రోక్తలక్షణలక్షితకవితావధూటియుఁ దత్పోషకవర్గంబును, నేఁటిపత్త్రికవిబుధాంకితులఁ గని, 'అయ్యో! ఇదేమి! కవితాకాంత నిట్లుతారుమారు చేయుచున్నారు' అనినఁ దత్పోషకవర్గంబు నుఱిమిచూచుచున్నారు, హుంకరించుచున్నారు, వీరైన మీఁదబడి కొట్టవచ్చుచున్నారు. మఱియు నాకవితావధూటినిఁ జూచి "ఓసీ! ఏమి ప్రేలుచున్నావు? 'మేము నిన్నుఁ దారుమారు చేయుచుంటిమా?' చాలుఁజాలు నోరుమూసికొనుము, ఎఱుఁగవు కాఁబోలును, కాలము మారినది, నవనాగరకత హెచ్చినది, స్త్రీస్వాతంత్ర్య "అమలు"లోనికి వచ్చినది, నీభాషాపద్ధతులును, నీపూర్వకాలపుటలంకారములును, నీభావగాంభీర్యములును, నీసూత్రబంధములును, ఇఁకెంతమాత్రమును బనికిరావు, ఎక్కుము, రంగస్థల మెక్కుము; వీఁడువాఁడనక, చిన్న పెద్ద యనక పట్టుము, ప్రతిమనుజునిచేయి పట్టుము; నిన్నుఁజే

పట్టుటకుఁ జిన్న యేమి పెద్ద యేమి? పండితుఁ డేమి, పామరుఁ డేమి? భాష సర్వాధీనము; గురుజననీమతల్లియే యుగ్గుపాలతోడనే భాషాధ్యయన మొనర్పించినది. నిన్ను గ్రహించటకు నింక మాతృభాషయందును గూడ గురుశుశ్రూషయా చాలుఁ జాలు లెమ్ము; రమ్ము వేగమే రమ్ము, రాకున్న నిన్నీడ్చువారెవరు?' అని యొకవైపున బెదరించుచు మఱి యొకవైపున "ఓసీ! 'నాయలంకారములు విఱిగిపోయిన వయ్యయ్యో!' ఇంకెట్లు' అని యలంకారములపై బెంగఁ గొంటివా యేమి? ఎంత వెఱ్ఱిదానవు? నీకలంకారములే కావలసియున్న వానికి నేమి లోటు, ఆపూర్వకాలపు టలంకారము లేల క్రొత్తసొమ్ముల నీమొగలునిండఁ దొడిగెదము లెమ్ము, అదిగాక ఏంటిపాకంబులరుచి దవిలియుంటివా? నీకాప్రాచీనోపమాప్రీతి యింకను బోలేదా? మేము నీకొఱకాయాదేశములనుండి మైసూరుపాకము మొదలైనదివ్యపాకముల సంగ్రహింప దశవిధావస్థలఁ బడుచునే యున్నాము, 'అయ్యయో! మోసము వచ్చినదే. కంఠసూత్రములే తెగినవే, అనాథత్వము సిద్ధించునా' యని దుఃఖించుచుంటివా? ఎంతవెఱ్ఱిదానవు? మే ముండఁగా నీకనాథత్వమా? కట్టిపెట్టుము, ఇంకను నీకుఁ బూర్వాచారపరాయణత్వమేనా? కాలము మారుచుండుటఁ గాంచుచుండుటలేదా? ఈకాలమున నామంగళసూత్రము మోసమైనసంగతి నీవెఱుంగవా? ఒకవేళ నీకు వానిపై మోజే యున్నయెడల నాప్రాంతసూత్రంబు లేమిటికి? మే మెవరికి వారమే స్వహస్తములతో సిద్ధము చేసిన మంచిమంగలసూత్రములు గలవు, వాని నీకంఠంబునకు బంధించెదము. మామ [illegible] మము గూడ నీమంగళసూత్రము లెపుడు పెరిగిపోవునా యనియే, మాబోటి హరిశ్చంద్రుల కేలుపట్టఁ గంఠమున మంగళసూత్ర మున్నదియా లేదా యనునను మానంబెందులకు? నీవాచంద్రతారకముగఁ జంద్రమతిచాయఁ బ్రకాశించెదవు అని యాకవితావధూటి నోదార్చుచుఁ దత్పరాదత్తకవినిరుపాంకితు లుభయవిధంబుల నామెను లోఁబఱుచుకొనఁ జూచుచున్నారు.

వీరిలో సహిత మనేకమతభేదము లున్నవి. అందలియవాంతరభేదంబుల నటుండనిచ్చి మొత్తమున రెండుతెగలుగా విభజింపనగు.- మొదటితెగవార పండితకవిమన్యులు, రెండవతెగవారు కవితాతత్త్వానుశాసకులు. పండితకవిమన్యులు, స్థాలీపులాకన్యాయావలంబులై, భాషారత్నగర్భాంతరంబున 'కోదవ్యవసాయ' మొనర్చి, 'శతశ్లోకేనపండితః' అను లక్షణమునకు లక్ష్యులగుచు

ఒకప్రబంధమునుండి కొన్నిసమాసంబులను వేఱొకకోశమునుండి కొన్నిపదంబులను, మఱియొకపుస్తకమునుండి కొన్నివర్ణనాంశంబులను, తదితరగ్రంథములనుండి కొన్నియలంకారంబులను సంగ్రహించి, యారంభముననే ప్రబంధరచనకుఁ బూని గ్రంథసాంగులగుచున్నారు పదపడి గర్భవిచ్ఛేదం బగుపండితవేషం బూని 'అబద్ధం వా సుబద్ధం వా కుంతీపుత్రో వినాయకః' అనుమార్గం బవలంబించుచు, ఉద్దండతాండవం బొనర్చి, తద్భాషయం దంతగాఁ బ్రవేశము లేని ధనాధికులచేతను, ఇతరోన్నతోద్యోగస్థులచేతను బామరులచేతను దమపాండిత్యప్రకర్షఁ జూపుచుఁ, బూర్వోక్తపద్ధతిఁ దాము వ్రాసిన తిలకాష్ఠమహిషబంధనంబుల—వారిచేత విప్పుచు, దానిపై గుండె లవియునటు లుపన్యసించుచుఁ, దాము స్వప్నటీకకు మరలఁ డీక నద్ఘోషించుచుఁ, బూర్వోక్తశ్రోతల మెప్పువడసి, వారలవలన, 'అభినవతిక్కన' 'కవిశేఖర' మున్నగు బిరుదంబులవడసి, తమకన్న మిన్నలు లే రని విఱ్ఱవీఁగుచు 'ఘటంభింద్యాత్ పటంఛింద్యాత్' అన్నట్లు దష్టావదంబుల యోగ్యులగువారల వంచించుచుఁ దమకుఁ గలయల్పజ్ఞానంబుచేతనే మహామహులసుద్దులఁ దప్పులెన్న సాహసించుచున్నారు. కొందఱు, బహువిధంబులచే నసంపూర్తిగ నున్నయొక్క చిన్నయసూరివ్యాకరణంబునమాత్రమే కొంతవఱకుఁ దమకై తామే యర్థమైనంతదనుక నందందుఁ జూచి, తద్వ్యాకరణాల్పజ్ఞానంబుననే, సమస్తవిధములఁ నుత్తమోత్తమప్రమాణంబులై శిరసావహింపవలసిన భారతాద్యద్గ్రంథములయందుననే దోసంగులు కానివానిఁగూడ దోసంగు లని వాక్రుచ్చుచు, 'విమర్శ' యనఁ గేవలముఁ దప్పులెన్నుటయే యనునసర్థకోద్దేశంబు మనంబులం దిడికొని తా మెఱుంగని దంతయుఁ దప్పే యని చెప్పుచు భాషాయోష నడుగంటఁ జేయుచున్నారు. కనుకనే అప్పకవి, "గీ॥ ఉత్తముఁడు లక్ష్యలక్షణవృత్తివేది। మధ్యముఁడు లక్ష్యలక్షణమాత్రవేది" అనిలక్ష్యలక్షణములయొక్క సంపూర్ణజ్ఞానముకలవాఁడే సర్వవిధములచేఁ బ్రామాణికుఁ డనవొప్పు నని వ్రాసియున్నాఁడు. పూర్వకాలంబునం బలెఁ బరీక్షాపద్ధతులు లేకపోవుటచేతను, జనబాహుళ్యము తాము కృషి యంతయు హూణభాషయందుననే చేయుచుండుటచేతను, అథవా, ఆహూణభాషకుఁ దోడు మాతృభాషయందుఁ గూడఁ బాటుపడువారెవ్వరైన నున్నయెడల నట్టివారిసంఖ్యతోపాటు జ్ఞానము నల్పమై యుంటచేతను ఎవరుత్తములో యెవరు మధ్యములో కనుఁగొనుట చాల దుర్ఘటముగ

నున్నది. ఎవని మాటలాడించిచూచిన నేమి తప్పో, వీరు మహానుభావులన్న వీరు మహానుభావు లనుచుఁ గాలముఁ గడపుచున్నారు. కొన్ని విషయంబుల మనము వీరిని నన్నయతిక్కనాదికవినాథులతో సమానముగ గౌరవింపవలసినదియే కారణ మే మందురా! వీరి ప్రబంధరచనల బాగుగఁ బరిశీలించినయెడల, నందందుఁ గనఁబడు దివ్యసమాసంబులతోడను, ఒదవచో గుంభనలతోడను, బంధురభావంబులతోడను, రసగాంభీర్యాదిగుణంబులతోడను, బెన్నారు వీరిపద్యరాజంబులను, ఆనన్నయాది కవివర్యుల పద్యంబుల కెంతమాత్రమును దీసిపోవని నొక్కి వక్కాణింపవలసియున్నది. వేయేల, "అసలు"నకు "నకళ్లు" పలుతావుల వీరిగ్రంథములఁ గానఁబడుచుండు అవిగాక, మంజులధ్వనివిశేషంబు లందురా, అవి వీరిహస్తఘంటికల యందుఁ గాని, కవితాకాంతాహస్తకంకణంబులఁ గాదు, క్రొత్తదగి యందురా, అది వీరు కంఠంబునఁ దాల్చిన 'మెడల్సు'ను మొహరీలపేరునందుఁ గాని కవితాకాంతాలంకారములయందుఁ గాదు, రసోద్రేకం బందురా, అది వీరిప్రగల్భవాక్కులయందుఁ గాని, కవితాకాంతాభాషణంబులఁ గాదు, మఱియు మహానుభావుల పాండిత్యప్రకర్షాదికం బందురా, అది వీరుదేవతార్చన పేటికలతోపాటుగా మూఁపున మోసిమోసి, చెమటచే సగముచెనఁగి, అక్షరములు రేగి, మాసి, శిథిలమై యేలతూధికారులో యిచ్చిన యపూర్వ యోగ్యతాపత్రములయందుననేగాని, కవితాకాంతాప్రకటనయందుఁ గాదు.

ఈసందర్భమున నొక మనవి చేయవలసియున్నది. నేను వ్రాసిన పైవ్రాతలఁ బట్టియుఁ, ఇఁకముందు వ్రాయఁబోవువానిం బట్టియు— నేను గర్వంబున విఱ్ఱవీఁగుచు, మహానుభావుఁడ నని చెప్పుకొనుచుంటి నని కొందఱనుకొనవచ్చును. వారట్లెంతమాత్రముఁ దలంపకుందురుగాక! నే నల్పజ్ఞుఁడను, అల్పజ్ఞుఁడనైనఁగాను; కేవల మజ్ఞుఁడనే. ఒకవేళ నిదివఱకే మైన నించుక భాషాప్రవేశమున్న దని యనుకొందమన్నను బడిపంతులుగాఁ బ్రవేశించి, ప్రవేశపరీక్షా విద్యార్థుల తెలుఁగువ్యాసరచనల (The Telugu Compositions of the School Final Students) దిద్దుట కేనాఁడు ప్రారంభించితినో, ఆనాఁడే భాషాప్రవేశము కూడ సంతరించుటకుఁ బ్రారంభించినది. ఐనను, భాషయందునను, కవితయందునను నభిరుచిగలవాఁడ నగుటచేఁ దద్భాషాకవితాప్రపంచంబుల సంచరించువారితోఁ గూడ సాహచర్యముఁ గలవాఁడనై యప్పుడప్పు

డు వారితోఁ బ్రసంగించునాఁటి కొన్ని విషయంబుల మనంబునం దిడుకొనియు, నాయా సమయంబులఁ దమతమ గ్రంథంబులఁ బాఠశాలలయందుఁ బఠనీయ గ్రంథములుగా నిర్ణయింపుఁడని యడిగిన కొందఱుసరసులతో జరిగిన సంభాషణంబుల మది నిడుకొనియు, మఱియుఁ గొందఱు మాతృభాషలను, పూర్వకవిపుంగవులను దూషించిన దూషణలను మనమున నిడికొనియు, నీవ్యాసము వ్రాయఁ బూనితిఁ గాని కేవల మెల్లరను నిందించుటయే ప్రధానముగాఁ బెట్టుకొని వ్రాసినవాఁడఁగాను.

రెండవ తెగకుఁ జేరిన కవితాతత్త్వానుశాసను లన్ననో, 'దిమ్మిని బ్రహ్మనిగాను, బ్రహ్మని దిమ్మినిగాను జేయుచు భాషాసౌధంబునకు నాదినుండియుఁ బునాదిఁ దీయుచున్నారు. మొదటనుండియుఁ గొత్తమట్టమే. వీరిమతావలంబకులపద్ధతుల నొకింత వివరించెద, వీరిమతంబున మనుజుఁడు భాషావిషయంబున నెట్టిప్రయత్నంబులు నొనర్పవలసినపని లేదు; ఉగ్గుపాలనాఁటినుండియుఁ దల్లి చెప్పిన పదజాలమే చాలును, దానితోడనే భూమినుండి స్వర్గంబువఱకు "హైరోడ్డు" పఱచి, దానిపైఁ గవితాకాంతను గుఱ్ఱపు "కదను" ద్రొక్కించుచు బాహాటంబుగ విష్ణుపదంబున నటియింపఁజేయవచ్చు, వ్యాకరణసూత్రాదిబంధము లుండినఁ బ్రయోగస్వాతంత్ర్యమునకుఁ గొంతయాటంకము వచ్చునుగాన నట్టిప్రయత్నంబుల కెంతమాత్రమును బ్రయత్నపూర్వకంబుగ నొడఁబడరాదు, అలంకారవిషయమునందన్ననో, కవితాకాంత కొక్క స్వభావోక్త్యలంకారమే యలంకారము గాని, కువలయానందప్రతాపరుద్రీయాదిగ్రంథములలో నుడివిన తదితరాలంకారంబు లన్నియుఁ గేవలము చెత్తయే; వానిని దుంగలోఁ ద్రొక్కవలసినదియే, అవి కవితాకాంతయొక్క నెత్తిపై బోర్లించిన కుండమూఁకుళ్లు, రాచిప్పపెంకులు తప్ప వేఱు కావు. ఇట్లే యేతత్కవిసాంప్రదాయంబులకుఁ బూర్వకవిసాంప్రదాయంబులకు హస్తిమశకాంతరభేదంబు కలదు. విస్తరింప నేల, వీరియాశయము, — భవభూతికవి చెప్పినట్లు॥ "ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోనుధావతి॥" అన్నట్లు తమనోటినుండి వచ్చినమాటయే కవిత్వము. భగవంతునియందు సమస్తప్రపంచములు నిండియుండునట్లు వీరియమూల్యచ్ఛాందసవాక్యమునందే సమస్తాలంకారములు, సమస్తరసములు సమస్తతత్త్వములు నిండియుండును. ఈమహామహుల సంప్రజ్ఞాతసమాధిలో నున్నవేళఁ గవితాధిపతి వీరివక్త్రకుహరములనుండి పొంగి పొరలు

నఁట. 'ఆర్షత్వా న్నదోషః' అనునియమము వీరియందుఁగూడఁ దన్కైతానే వర్తించునఁట! దీనిఁబట్టి చూడ వీరిమతమున లక్ష్యలక్షణంబు లెవ్వియును గానరావు. అథవా యేదే ననుశాసనమే యవసర మందురా,—"కుళ్లాయి నిబట్టి తల సవరింపవలయునా లేక తలనుబట్టి కుళ్లాయిని సవరింపవలయునా" అను విచికిత్సయందు వీరు మొదటిపద్ధతికే చేరియున్నటులు గానఁబడియుంటచే వారికవితాధోరణిఁ బట్టియే యనుశాసన మేర్పఱుపవలయుఁ గాని, యనుశాసననునుబట్టి వీరికవితాధోరణి కాదు. వీరలలోఁ గొందఱకు, వాల్మీక్యాది సంస్కృతకవు లన్నను, నన్నయాద్యాంధ్రకవు లన్నను, దదితరలక్షణకర్త లన్నను జలాగ్నిమైత్రి. అంత ద్వేషభావ మెందులకో తెలియరాకున్నది. ఈసందర్భమున నొక్కవిషయము మనవి చేయవలసియున్నది. నాకుఁ బరమమిత్రులును హూణభాషాకోవిదులు—దెలుఁగుభాషయందుఁ గూడ మేటిఁయునగు నొకరు నాతోఁగూడ నొకసందర్భమున భాషావిషయమును గవితాతత్త్వమును ముచ్చటించువేళ నాయన నిరూపించిన కొన్ని విషయముల నిదివఱకే తమకుఁ దెల్పియున్నాఁడను. అంత వారు "సంస్కృతభాష పూర్తిగఁ జచ్చి, పూర్వలక్షణకర్తలపద్ధతు లన్నియు మొదలంట నాశనమొందినఁ గాని దేశము భాషయు బాగుపడదు' అని నుడివిరి. మన్మిత్రునకు వానియం దంతటిక్రోధంబునకుఁ గారణ మేమియో వారిగ్రంథములఁ బరిశీలింపకుండుటయే కారణ మని తోఁచెడిని. ఒకముఖ్యమగు సంగతి- వీతత్సాంప్రదాయవర్తులు చతుర్విధపురుషార్థంబులలోఁ జతుర్థపురుషార్థము నవలీల నందుకొని బ్రహ్మానంద మొందుచు, భర్తృహరినుడివినరీతి రససిద్ధత్వము చేకూరిన జీవన్ముక్తు లనియుఁ గూడ మన్మిత్రునిమాటలవలనఁ దెలియవచ్చినది. పూర్వలక్షణకర్తలు, 1 కవు లన నెవరు. 2 కవిత్వ మన నెట్టిది. 3 కావ్యంబు లన నెవ్వి' అనువిషయములఁ గూర్చి నుడివినసంగతుల నించుక వివరించెద.

"కవయతే—వర్ణయతీతి=కవిః" అనువ్యుత్పత్తిచేఁ గవి యనఁగా వర్ణించువాఁ డని యర్థము. అటులైన వీథులను బోవుచు నింటింటికడ గుంబమున 'ఆకలౌతుండదో నారాయణా—అన్నంబు పెట్టండో నారాయణా' అని పాడుచుండు ప్రతిముష్టివాఁడును గవియేనా యనుశంక మనమనంబులకుఁ బొడమవచ్చును. కాని మనపూర్వులు కవియొక్క లక్షణములఁ జెప్పుటలో,

శ్లో॥ సత్కులీన శ్శుచిర్దక్ష శ్ఛందో వ్యాకరణాదివిత్
ప్రశాంతశుభగాకారో దైవజ్ఞశ్చ కవిర్భవేత్॥

అని నుడివియున్నారు. దీనిఁ బట్టియే నే మొదటఁ దెలిపిన, "జయంతి తే సుకృతినః" అనుశ్లోకంబును, భర్తృహరి—"సత్కవులు, అసత్కవులు నన నెట్టివారో? ఫలంబుల నాయిరువురకుఁ గలతారతమ్య మేమియో?" అను విషయంబుల శంక చేసికొనియే—వ్రాసియున్నాఁ డని యందలి విచిత్రపదవిభాగాన్వయంబులఁ దేలుచున్నది. అదెట్లన- సుకృతినః, రససిద్ధాః, ఏవ. కవీశ్వరాః, తే ఏవ జయంతి; తేషాం, యశః కాయే, జరామరణజం, భయం నాస్తి. అనఁగా 1, 'సుకృతినః' అనుటచే 'సుకృతీ పుణ్యవా౯ ధన్యో' అనునిఘంటుప్రకారము స్వయముగా దోషరహితులై పుణ్యవంతులై నట్టివారనియు, మఱొకపక్షమున 'శోభనం కృతం ఏషాం అస్తీతి సుకృతినః' అనువిగ్రహవాక్యానుసారంబునఁ, బదవాక్యార్థాదిదోష రహితములై ఛందోవ్యాకరణప్రయోగానుకూలంబులై యుండుకావ్యనిర్మాణము గలట్టివా రనియు నర్థము చెప్పవచ్చును 2 "రససిద్ధాః' అనుటచే నొకపక్షమున,'రసము'=శృంగారాదిరసంబు లని యర్థము తీసికొని "రససిద్ధాః=శృంగారాదిరసపరిజ్ఞానము కలట్టివారనియు, మఱొకపక్షమున రసము=పాదరస మనియర్థము తీసికొని "రససిద్ధాః"=రసశాస్త్రమునందు సిద్ధిగాంచినవా రనియు,=అణిమాద్యష్టసిద్ధులు గాంచినవా రనియు, వేఱొకపక్షమున 'రసో వై సః అను శ్రుత్యనుసారము, రసశబ్దవాచ్యుఁడు కేవల మాపరబ్రహ్మయే గాన 'రససిద్ధాః"=తద్బ్రహ్మసాక్షాత్కారముఁ బొందినట్టివా రనియు నర్థము. పైచర్చనుబట్టి యింతవఱకును దేలినతాత్పర్యాంశ మేమన, దోషరహితులై పుణ్యవంతులైనట్టియుఁ బదవాక్యార్థాదిదోషరహితంబులై ఛందోవ్యాకరణానుకూలంబులై యుండుసత్కావ్యముల నిర్మింపఁగలిగి పరబ్రహ్మస్వరూపంబు గుర్తెఱుఁగ నట్టివారే కవు లని తేలుచున్నది. "కవీశ్వరాః" అనుటచే 'కవయః క్రాంత దర్శినః' అని చెప్పఁబడియుంటచేఁ 'గవి' కాలత్రయవేదియై యుండవలయు నని కూడఁ దెలియవచ్చుచున్నది. ఇట్టికవులే సర్వోత్కృష్టులై యుండఁ గలరు. వారలకుఁ గీర్తిశరీరవిషయంబున జననమరణప్రయుక్త మగుభీతి యుండదు. ఇఁక నసత్కవుల విషయమున నాశ్లోకంబుననే- (అసుకృతినః, అరససిద్ధాః, నకవీశ్వరాః, తే న జయంతి, తేషాం యశః నాస్తి, కాయే జరామరణజం భయం) అనఁగాఁ బుణ్య

హీనులై అసత్కావ్యకర్తలై, రససిద్ధశబ్దవాచ్యులు కానివారు కవీశ్వరు లనఁబడరు, వారికిఁ గీర్తి యుండదు, శరీరవిషయమున నెప్పటికప్పుడ భయము కలుగుచుండును” అని యాభర్తృహరి నుడివియున్నాఁడు. ఇం దింకను జెప్పవలసినవిషయము లున్నను గ్రంథవిస్తరభీతిచే నాపుచున్నాఁడ. ఈపైసంగతులఁ బట్టి చూడ సలక్షణుఁ డగు కవికిఁ జతుర్థపురుషార్థ మవలీలగాఁ జిక్కు నను టకు నభ్యంతర మేమున్నది?

సత్కులీనః శుచిః—అనుశ్లోకంబునఁ జెప్పినకవిధర్మంబులు సామాన్యధర్మములే, ఈసామాన్యధర్మంబులును ముందుఁ జెప్పఁబోవు విశేషధర్మంబులును మొత్తమున నన్నియు నమరియుండినఁ గాని మనుజుఁడు పూర్తిగ ‘కవి’శబ్దవాచ్యుఁడు గాఁడు. ఆవిశేషగుణంబు లెవ్వియనఁ, 1 వ్యుత్పత్తి 2 ప్రతిభ 3 అభ్యాసము ననునవి. అందు వ్యుత్పత్తియన శ్లో. వ్యుత్పత్తి ర్లోకచారిత్ర శాస్త్ర కావ్యాద్యవేక్షణాత్ । అను ప్రమాణవచనానుసారము- పురాణేతిహాసాది సమస్తచరిత్రాంశములను, గాలానుగుణంబు లగుతత్తద్దేశచరిత్రాంశములను బాగుగ గుర్తెఱింగి యుండుటయుఁ, దర్క వ్యాకరణాదిశాస్త్రవిషయంబుల నరసియుండుటయు, రామాయణాదిపూర్వకవినిర్మిత కావ్యవిషయములఁ దెలిసియుండుటయునని పెద్దలు చెప్పుదురు. 2. ఇఁక రెండవది యగు ‘ప్రతిభ’ యనుదానిఁ గూర్చి యిట్లు చెప్పియున్నారు “శ్లో స్మృతి ర్వ్యతీతవిషయా మతి రాగామిగోచరా । బుద్ధి స్తాత్కాలికీజ్ఞేయా । ప్రజ్ఞా త్రైకాలికీమతా । ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభామతా ” పూర్వవిషయాపేక్షచేత నూతననూతనవిషయోద్భవ కల్గినట్టి ప్రజ్ఞావిశేషంబునకే ప్రతిభయనిపేరు 3 మూఁడవదియగు నభ్యాస మనఁగా, గావ్యమర్యాద లెఱింగిన వాల్మీక్యాదిమహాపురుషులచేఁ జూపఁబడిన మార్గముల ననుసరించి నిరంతరముఁ గావ్యరచనయందుఁ బెద్దలతోఁ గృషి చేయుటయే యైయున్నది. ఇదివఱకుఁ జెప్పిన సాధారణగుణములను నింతకుఁ బైఁ జెప్పిన విశేషగుణములు నీరెండును గలిపి యున్న నప్పటికిఁ గావ్యనిర్మాణమునకు యోగ్యత కల్గును ఇన్నిలక్షణములు గల్గియుండినను వీనియన్నిటికన్నఁ బ్రధానము గు ‘శక్తి’ అనువిశేషంబు లేకున్నచో నాతఁ డెంతమాత్రమును గావ్యము నిర్మించుటకుఁ దగఁడు. ‘ప్రతిభ’ మొదలగు విశేషగుణంబులకుఁ గూడ నాదికారణ మీశక్తియే. లక్షణకర్త లీ‘శక్తి’యనుదానికి ‘శ్లో॥ శక్తిః కవిత్వబీజం హి ప్రాక్తనీ కాపి సంస్క్రియా । యయా వినా న ప్రసరేత్ । కావ్యం శిక్షావతా మపిః॥ అని లక్షణముం జెప్పిరి.

ఈపైవిషయంబుల నరసిచూచినచోఁ గవియగువాఁ డెట్టిసుగుణసంపత్తి గల్గి యుండవలెనో, ఎట్టి శాస్త్రపరిజ్ఞానము గల్గి యుండవలెనో, ఎట్టి భగవద్భక్తుఁడై యుండవలెనో తేలినదిగదా! అట్లుగాక గామశబ్దము నేని, శ్రీ మొదలు ఇతిశ్రీవఱకును బఠింపక మాతృభాషలను దత్కవులను బడఁదిట్టువాఁడా కవి? పాణిని నన్నయాదిసూత్రకర్తల నామంబులేని జన్మావధిగ నెన్నఁ డెఱుంగక చేతులారఁ గంఠసూత్రంబులఁ ద్రెంచువాఁడా కవి? "పైమరి" భ్రష్టవిద్వాంసుఁడై తనకన్న మిన్నలు లేరని గర్వించి పైపై చూపులు చూచువాఁడా కవి? భారతరామాయణాది పురాణాంతర్గత చరిత్రాంశములలోని తత్త్వం బెఱుంగక యవి బూతులపురాణము లనియుఁ, గోతులపురాణము లనియు నిందించువాఁడా కవి? పరభాషాపరిజ్ఞానంబును బురస్కరించుకొని మాతృభాషలయందుఁ గూడ, నసంబద్ధములును నవ్యక్తములు నగు సంస్కరణలఁ జేయువాఁడా కవి? సదాచారసంపత్తిలేక జారత్వము కవులకు సామాన్యధర్మం బని నుడువుచు వేశ్యాలంపటుఁడై యుండువాఁడా కవి ?

కవి యన నెవ్వఁ డందురా, అప్రత్యక్షవిషయంబులఁ గూడ నిజకవితా చమత్కృతిచే జనులకన్నులఁ గట్టినటులఁ గనఁబఱిచి యానందముఁ గూర్చువాఁడే కవి; అశాశ్వత మగుసమస్తవిధాతృసృష్టికి శాశ్వతరూపంబు కల్పించి నిజప్రజ్ఞావైశద్యంబున నాచంద్రతారకముగ నిల్పఁగల్గు కవిబ్రహ్మయే కవి, నటునిరీతిఁ గాక, సమస్తచరాచరప్రపంచముయొక్క హృదయాంతరంబులఁ దూఱి, అంచు, పరమాత్మానుసంధాన మొనర్చుచుఁ దత్తద్వ్యక్తుల ననుకరించుచు, నవి మాటలాడినట్లే మాటలాడువాఁడును, అవి నవ్వినట్లే నవ్వువాఁడును, ఏడ్చినట్లే యేడ్చువాఁడును, వెయ్యేల? ఆవ్యక్తులు తానయ్యె యవి యెట్లుచేసిన నట్లుచేయువాఁడే కవి, కామక్రోధాదిబహువ్యాధులచే బాధపడెడి జనంబునకు భిషగ్వరుఁడై వైద్యుఁ డాభవరోగంబుల నౌషధములచే నివారించి జనుల కారోగ్యానందంబుల నొసంగునట్లనుగుణపదాలంకారాది వస్తుసామగ్రిఁ గూర్చి దుఃఖరోగంబు మాన్పి సుఖంబొనఁగూర్పఁగలవాఁడే కవి. భూతభవిష్యద్వర్తమానాంశముల నెల్ల వర్తమానాంశములుగనే స్వయముగఁ దెలిసి పరులకుఁ దెల్పఁగల్గువాఁడే కవి. నిశ్చయముగఁ గవి యగువాని కెఱుకపడని విషయమే యుండదు. దీని కుదాహరణభూతుఁడు, వాల్మీకియే. ఈవిషయంబు టెనిసన్ (Tennyson) మహాకవియు నిట్లు చెప్పియున్నాఁడు.

The poet in a golden clime was bron,
With golden stars above
Dowered with the hate of hate,
The scorn of scorn
The love of love.
He saw through life and death, through good and ill
He saw through his own soul,
The marvel of the everlasting will,
An open scroll,
Before him lay with echoing feet he threaded
The secretest walks of fame
The viewless arrows of his thoughts were headed
And winged with flame.

—( దీనికి మదీయానువాదగీతము )—

పసిఁడిమిసి మించు తారకావళులతోడ, నంచితమగు, సువర్ణప్రపంచమందుఁ బుట్టి తనరారి సత్కవిపుంగవుండు; మంచిచెడ్డల తారతమ్యం బెఱింగి చావుబ్రతుకులలో రహస్యంబుఁ దెలిసి, తాను దానన నెవ్వండో తరిచిచూచి నిరసనగుణంబు నేచూచు నిరసనమునఁ, బ్రేమయందుననే నిజప్రేమఁ గొలుపు, ద్వేషభావంబుమీఁదనే ద్వేషమూనుఁ, జ్ఞానమూర్తుని సృష్టివిచిత్ర మెల్లఁ దెఱచిపెట్టిన పొత్తంబుకరణి నతని, కనుల చెంగట విశదంబుగాఁ, గనఁబడు అతఁడు జనుల కలభ్యమైనట్టి కీర్తి; రాజమార్గంబుపైని నర్తనము సతముఁ జేయుచుండుఁ బ్రతిధ్వనించెడి సుగతుల, కాంతిమయ కంకపత్త్రపుంఖములతోడ నలరు తన్మహనీయునూహాశుగములు, సర్వలక్ష్యైకగాములై పర్వుచుండు.

ఈపైయంశంబులఁబట్టి కవియన నెట్టివాఁడో తేలినది. ఇఁక "కవేః కర్మ=కావ్యం" అను వ్యుత్పత్తిచేఁ బూర్వోక్తలక్షణలక్షితుఁ డగుకవియొక్క చేఁతయే కావ్యము అట్టికావ్యమే "శ్లో॥ కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే। సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే॥" అని లాక్షణికులు చెప్పినప్రకారము, కీర్తి నొసంగునదియు, ధనమును గూర్చునదియు, సమస్తవ్యవహారంబులఁ దెల్పునదియు, అశుభంబులఁ బోఁగొట్టునదియు, సద్యస్కాలసుఖం బొనఁగూర్చునదియుఁ, గాంతతో సమానముగ నిష్టానిష్టములఁ దెలియఁజేయునదియుఁ గావ్యమే యై యున్నది. పూర్వకవులు వ్రాసినయట్టి కావ్యములే లోకోపకారకములు; జ్ఞానజనకంబులు; శ్రేయస్సాధకం

బులు, అట్లుగాక, ఒకహద్దు నాజ్ఞయు లేక లాక్షణికులపద్ధతు లన్న నేమియో యెఱుఁగక, దానికిఁదోఁచుగా నహంభావము నెత్తికెక్క నాలాక్షణికులఁ బడఁదిట్టువారు వ్రాసినవియూ కావ్యములు, ఇవియూ జ్ఞానజనకంబులు, ఇవియూ మనుష్యతారకంబులు, ఏ"లోవర్ సెకండరీ"యో"ప్యాసు"చేసియో చేయకయో తిండి కగచాట్లఁబడి, జీవనమునకై యుపాయాంతరము కానక యేయవాకులో చవాకులోఁ పుస్తకరూపమున వ్రాసి, పరనీయపుస్తకనిర్ధారణకర్తలఁ పరమానుగ్రహప్రాప్తులై యాపుస్తకముల నిర్ధారణ(Approve)చేయించుకొని పదపడి కాలికి బలపంబుఁగట్టికొని, ప్రతిపాఠశాలోన్నతోపాధ్యాయునికడను వంగివంగి సలాములుచేయుచు మీకన్న మహనీయు లెవరున్నారని ప్రతిజనుని వైతాళికస్తుతిపారంబొనర్చుచునొక్కొకచోఁ దమపేటికమునుగ్గడించి దేవుఁడువరం బిచ్చినను బూజారి వరంబీయఁ డనుచందంబున బడిపెద్ద సరియన్నను బిఱ్ఱబిగిసి తనపాండిత్యప్రకర్షమంతయు నుగ్గడించుచున్న యాపాఠశాలాపండితుని లోపఱుచుకొనుచు అష్టకష్టములకుఁ బాలై ధనార్జనమే ముఖ్యముగాఁ గొనిన యీమహానీయుల పుస్తకములా బాలకులకుఁ దారకంబులు. మన తెలుఁగుపుస్తకములు పరనీయగ్రంథములుగా నిర్ధారణచేయువారలలోఁ గొందఱరవమువారు గూడఁ గల రని చెప్పుదురు. ఆంధ్రపండితులు చేసినగ్రంథములు లేవనియే కాఁబోలును, అరవము వారు వ్రాసిన తెలుఁగుగ్రంథములు గూడఁ బ్రవేశపరీక్ష (School Final) మధ్యమపరీక్ష (Intermediate) పరీక్షలకుఁ బరనీయగ్రంథములుగా నిర్ణయించుచుందురు. స్వభాషలో గ్రంథము వ్రాయుటలోను బరభాష నెట్లోకొంత యభ్యసించి వ్రాయుటలోను భేదముండును. మాతృభాషపై నాదరములేని బాలకుల కట్టిపుస్తకపఠనమున నెట్టిపరిజ్ఞాన మంకురింపఁగలదు!

గద్యకావ్యంబులస్థితి యిటులుండ నిఁకఁ బద్యకావ్యములసంగతి చెప్పవలయునా! ఇట్టికావ్యములు వేనవేలు వెల్వడుచునేయున్నవి. వెలువడవలసినదే, భాష యభివృద్ధి చెందవలసినదియే కాని మనయాధునికులలోఁ గొందఱికి నియమములనినఁ దలనొప్పి వచ్చును. నియమములు కొంతవఱ కవసరమని పలువురు పెద్దలయొక్క యుద్దేశము. కానిచో; —అక్షరాభ్యాసమునాఁడే పిల్లవాఁడు పంతులుగారు! 'ఓ' అనునక్షరము నిట్లేల వ్రాయవలయు నిట్లేల వ్రాయఁగూడ దని ప్రశ్నింప మొదలిడినచో గురు వేమి చెప్పఁగలఁడు; పిల్లవాఁ డేమి నేర్చికొనఁగలఁడు. మున్ముందు గురువు చెప్పిన నియమములకు బ

ష్టుఁడై తత్ప్రకారంబున బాగుగ విద్య నేర్చికొనినపిదప నాత్మసందేహంబులఁ గూర్చి విచారించుకొనవలెను. ఇతరులతో సంప్రతించి చూడవలయును. ఆవిషయంబున మిన్నలగువారితోఁ గూడ నాలోచించి తరువాత సంస్కరణ మావశ్యక మని తోఁచినయెడల నపుడు చేయవలసినదియే. అప్పటికిని "తాఁబట్టినకుందేటికి మూఁడేకాళ్లు" అని భీష్మించి కూరుచున్న నది సరసులపద్ధతి కాదు. మాతృభాషయందించుకేని కృషిచేయక నియమము లుంట కిష్ట మనియెంచి, స్వచ్ఛందసూత్రంబులను, స్వచ్ఛందపదరూపంబులను, స్వచ్ఛందవృత్తంబులను గొని యిచ్చవచ్చినట్లు వ్రాసి యచ్చొత్తించు మహాకవిచే వ్రాయఁబడిన యేదో కావ్య మని పేరుపెట్టి జనులముందుఁ బడవేయుచున్నారు. ఎంచి చూడ, వ్యంగ్యప్రధానమై ధ్వనివిశేషయుక్తమై భావగర్భితమై యుండునదియే కావ్యము. మఱియుఁ బ్రస్తుతకాలంబునను బలువురు మనసోదరులు భావకవిత్వము లని చెప్పుచు వ్రాసెడికొన్నిపద్యములఁ జూచుచునే యున్నారము. అందుఁ గొన్నిహృదయానందజనకములై యున్నను గొన్ని మాత్రము నాబోటియల్పబుద్ధులకుబోధపడకున్నవి. పలుమాఱు తద్విధభావకవిత్వకర్తలును నేనునుగలయుట తటస్థించినది. వారు తమపద్యములఁ జదువువేళఁ గర్తలును దన్మిత్రులందుఁ గొందఱును గన్నులరమోడ్పుచేసి తలలించుక వంచి రసాస్వాదైకపరులై బ్రహ్మసాక్షాత్కారముఁ బొందుచున్నట్లు గానవచ్చినది; అపుడు వారిహృదయవార్ధినుండి సంతోషతరంగములు పొంగఁజొచ్చినకొలఁది నాహృదయమునుండి దుఃఖతరంగములు పొంగఁజొచ్చినవి- దీనికిఁ గారణము బ్రహ్మానందంబునొందఁ గల శక్తిని భగవంతుఁడు నాకొసంగకుండుటయే- పద్యములభావమును వారి నడిగి తెలిసికొని తత్సమానానందముఁ బొందఁ దలఁచి వారి నడుగుదుఁ గదా,.—ఆపద్యములలో లేని యేమేమో యభూతకల్పనలఁ జేసి, ఏమేమో యర్థములఁ జెప్పి, ఏమేమో యభినయించుచు, వారు చెప్పునది నాకును, నేనడుగునది వారికినిఁ దెలియక—తుదకు వారు చెప్పునది వారికే తెలియక నే నడుగునది నా కంతకుమునుపే తెలియక యుండెడిస్థితిలోని కుభయులము రాఁగాఁ బ్రాణంబులు విసివి వారు, 'భావకవిత్వమన నిదమిత్థ మని చెప్పుటకు వీలుండదు; దాని నెవరికి వారే యర్థము చేసికొని భావమెఱింగి యానందింపవలయు' నని సెలవిచ్చిరి. అది కేవల మనుభవైకవేద్య మఁట. ఆయనుభవించెడిశక్తి స్వతస్సిద్ధముగ రావలయు నఁట. కేవలము వ్యంగ్యార్థ ద్యోతకత్వమే కావ్యమునకు

లక్షణముగా గ్రహించినచో మనము గుంటూరునుండి బెజవాడకుఁ బోవులో పల, పుస్తకవిక్రేతల హస్తముల నెన్నికావ్యములఁ గాంచుచున్నారము. ఒక వైపున 'అల్లుఁడా మేనల్లుఁడా' అను ప్రబంధము, మఱొకవైపున, 'వేశ్యావిట సంవాదము' వేఱొకచెంత 'సిరిసిరిమువ్వ' అను మహాకావ్యము. ఇటు లెన్ని గ్రంథములు లేవు. ఇవన్నియు మహాప్రబంధములేనా? పైవానిలో మాత్రము భావములకు, వ్యంగ్యార్థములకు లోటేమున్నది? ఉదాహరణమున కొకసంగతి మనవిచేసెద. "మీచేనుమీఁదురాయె" అను ప్రబంధములోని యొక పాదంబున వ్యంగ్యార్థము ద్యోతమానము కాదా? అందు భావస్ఫూర్తి లేదా? అలంకారము కానఁబడదా? అన్నియుఁ గలవే; అట్టివాని మహాకావ్య మని యేల నుడువరాదు? అనినచో, "శ్లో॥ కామం సర్వోప్యలంకారో రస మర్థే నిషించతు। తథా ప్యగ్రామ్యతైవైనం భారంవహతి భూయసా॥" అని దండి చెప్పినట్లుదాహరణమందు గ్రామ్యత కానఁబడుటచే నది సాధుజనగ్రాహ్యము కాదు. ఇంతకుఁ గావ్య మనఁగా 'శ్లో॥ వాక్యం రసాత్మకం కావ్యం' అని సాహిత్యదర్పణకారుఁడు చెప్పినట్లు, 'శ్లో॥ గుణాలంకారసహితౌ శబ్దార్థౌ దోషవర్జితౌ॥' అని ప్రతాపరుద్రీయకారుఁడు చెప్పినట్లు రసాత్మక మగువాక్యములతో నిండినదై, దోషప్రకరణమందుఁ జూపిన శబ్దగతార్థగతదోషరహితంబై, గుణప్రకరణమందు నుడివిన శ్లేషాదిచతుర్వింశతిగుణయుతంబై, అలంకారప్రకరణమందు వాక్రుచ్చిన యుపమాద్యలంకారసహితంబై యొప్పునదియే యని పెద్దలు చెప్పెదరు. చమత్కారయుత మగునట్టికావ్యమే పండితపామరరంజకంబై, కృతికర్తయొక్కయుఁ, గృతిభర్తయొక్కయుఁ గీర్తి నాచంద్రతారకముగఁ బ్రపంచమున నిల్పఁగల్గినది యగును. అవ్విధంబున గద్యాత్మక మగుకావ్యంబుఁగాని పద్యాత్మక మగుకావ్యంబుఁగాని, లేక యుభయాత్మక మగుకావ్యంబుఁగాని నిర్మించువాఁడేకవి. ఆతఁడే లోకోపకారకుఁడు; ఆతఁడే బ్రహ్మసృష్టికిఁ బ్రతిసృష్టిచేయఁగల్గినవాఁడు; ఆతఁడే సర్వదేశచరిత్రాంశపరిజ్ఞానంబున కాధారమైనవాఁడు; ఆతఁడే జీవకోటియొక్క హృదయక్షేత్రంబుల దున్ని, సురసం బిడి పదునుజేసి, తాలుగింజలఁగాక మంచిగింజల నాటి, సస్యయుతంబులు గాఁ జేసి కాపాడి ఫలం బనుభవింపఁజేయువాఁడు. కవులు లేనిదేశ మొండైనఁ గలదా? సమస్తమును గవులచేతనే నిల్చుచున్నది. ఇంతవఱకు మనదేశచరిత్రములు కొంతవఱకు నిల్చియుండుటకుఁ గారణము సత్కవియుఁ దత్కవితయునే.

---

# గ్రంథవిమర్శనపద్ధతి—విమర్శనము.

(కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు)

సారస్వతాభివృద్ధికిఁ గావ్యము లెంత ముఖ్యములో విమర్శనములును నంతముఖ్యములు. గుణాగుణవిమర్శనము లేనికావ్యరచనము వ్యర్థము. కాన కావ్యములందలి గుణవిశేషములను దోషాంశములను విభజించి చూపు విమర్శనము లుత్పిత్సువుల జ్ఞానమును వికసింపఁజేసి సారస్వతమునందు సత్యమగు నభిరుచిని గల్గించి వివేకాభివృద్ధిని గలిగించును. ఎచ్చట సారస్వతోన్నతి కలదో యచ్చట విమర్శనోన్నతియుఁ గలదు. కాని మనయాంధ్రసారస్వతమున విమర్శనము లంతగ లేవు. ఆకొఱంతను దీర్చుటకై యిటీవలఁ గొన్నివిమర్శనములు బైలుపడుచున్నవి. అందులకయి యే నేనును బ్రబంధతల్లజ మగుమనుచరిత్రమునందలి గుణాగుణములను విభజించి చూపి యొకవిమర్శనము గావించి పరిషత్పత్రికలోఁ బ్రచురించితిని. నాయుద్దేశమును గ్రహింపఁజాలని పండితవరులు కొందఱు నావ్యాసముపైఁ గొన్నిప్రతివిమర్శనములు గావించిరి. వానికన్నిటికిని సమాధానముల నిచ్చితిని. పండితవరు లగు కేతవరపు వేంకటశాస్త్రిగారు గ్రంథవిమర్శనపద్ధతి యనుపేరుపెట్టి నావ్యాసముపై నొక్కక్రొత్తప్రతివిమర్శనము వ్రాసి నూతనముగా బైలువెడలిన పరిషత్పత్రికలోఁ బ్రకటించిరి. లోకహితార్థమై దాని నిందు విమర్శించుచున్నాఁడను.

—♦ రసప్రశంస ♦—

కావ్యమునకుఁ బ్రాణభూత మైనది రసము. అట్టిరసవిషయమున శాస్త్రిగారిపద్ధతి యెట్లు నడచినదో చూచుకొందము.

శృంగారరసము :—మనుచరిత్రమునందు శృంగారరస మంగిగా నున్నదని మనశాస్త్రిగారే యంగీకరించియున్నారు. కాని యారసనిరూపణము చేయుటలోనే శాస్త్రిగారు ప్రమాదమునకు లోనైరి. సంభోగశృంగార మని విప్రలంభశృంగార మని శృంగారము రెండువిధములు. మనుచరిత్రమునందలి విప్రలంభశృంగారమును మనవేంకటశాస్త్రిగారు కరుణరసముగా నిరూపించి యీక్రిందిరీతిని వ్రాసిరి.

“కరుణరసము—ప్రవరతిరస్కృత యగువరూథినీప్రవర్తనము వలన సువ్యక్త మగుచున్నది. పరిపూర్ణానురాగమున కాస్పదుఁ డగుప్రవరుఁ డగ్ని

సాయమున నంతర్ధానము చెందఁగనే వరూధినికి శోక మావేశించినది. కావున దైవనిందాదు లగునను భావములతోను నిర్వేదమోహాదు లగువ్యభిచారభావములతోను శోకము స్థాయిగాఁ గలకరుణము పోషింపఁబడినది మను 3 ఆ. 5 పద్యము మొదలుకొని చూడఁదగును."

ఇది సరికాదు. మనుచరిత్రమునుండి మనశాస్త్రిగారు చూపినభాగము విప్రలంభశృంగారద్యోతకము గాని కరుణరసద్యోతకము గాదు. శోకాదులు నాయకవియోగఖిన్న లైయుండు శృంగారనాయికలయందును బుట్టును. అంత మాత్రముచే నవి కరుణరసద్యోతకములు కావు. శోకము శృంగారమునందు సంచారిభావముగా నుండును. కరుణరసమునందు స్థాయీభావముగా నుండును. మనశాస్త్రిగారు మనుచరిత్రమునుండి చూపిన భాగము శోకము సంచారిభావముగాఁ గల విప్రలంభశృంగారము గాని యయ్యది స్థాయిగాఁగల కరుణరసము కాదు. ఇంత యేల విప్రలంభశృంగారమున కరుణవిప్రలంభము గూడఁ గలదు అందు భర్త మరణించుటచేఁ గలిగినశోకము వ్యక్త మగుచుండును. అయినను నదియే స్థిరము గాక దైవకృపాదులచే మృతనాయకసమాగమావకాశము కలుగుచో దానికి రతియే స్థాయి యనియు రసము విప్రలంభశృంగార మనియు నలంకారశాస్త్రకారులు నిశ్చయించిరి. మన్మథుఁడు ముక్కంటికంటిమంటం బడి భస్మము గాఁగా రతీదేవి విలపించినవిలాప మంతయు నాతఁడు మరల బ్రతికివచ్చెను గావునఁ గరుణవిప్రలంభనామక శృంగారమే యనిరి. ఈవిషయమును గూర్చి సాహిత్యదర్పణమునం దిట్లున్నది —

"స్త్రీపుంసయో ర్వియోగే జీవత్వజ్ఞానదశాయాం వైక్లబ్యపోషితాయా రతే రేవప్రాధాన్యా ద్విప్రలంభః వైక్లబ్యంతు సంచారిమాత్రం మృతత్వజ్ఞానదశాయాంతు రతిపోషితస్య వైక్లబ్యస్యైవ ప్రాధాన్య మితి కరుణఏవ. యదాతు సత్యపి మృతత్వజ్ఞానే దేవతాప్రసాదాదినా పునరుజ్జీవనజ్ఞానం కథంచిత్స్యా త్తదాలంబనస్యా త్యంతికనిరాసాభావా చ్చిరప్రవాస ఇవ విప్రలంభఏవ నచకరుణ ఇతి నవ్యాః"

ఈవిధముగాఁ గరుణవిప్రలంభమే శృంగార మగుచుండఁగాఁ గేవల విప్రలంభము శృంగారము గాక మఱొండు గానేరదు గదా. మనుచరిత్రము నుండి మనవేంకటశాస్త్రిగారు చూపినభాగము నాయకవియోగము సంప్రాప్తము కాఁగా నాయిక పొందువిరహార్తిని దెలుపునదిగా మాత్రమున్నది. ప్రవ

రుఁడు తనదృష్టిపథమునుండి దాఁటిపోఁగాఁ దద్వియోగఖిన్న యగువరూథిని యాతనిని మరలఁ గనుఁగొనవగు ననునాసచే వనమునఁ గొంతసేపు వెతకినది. కానమి విరహము నందినది. చెలికత్తెలు నీనాయకుఁడు నిన్ను వచ్చి కలిసికొనునని చెప్పి ప్రోత్సాహము గల్గించిరి. ఆమెకును నాతనిఁ బొందఁగలుగుదు నను నాస కలదు. చెలు లుద్యానవిహారమునకు రమ్మనఁగాఁ గొంచెముగనో గొప్పగనో యలంకరించుకొని వనమునకు వచ్చినది ఆమె కాపురాం ద్రగుచెలికత్తియలు జలక్రీడాదివినోదముల నామె యెదుటఁ గావించిరి. ఆమె విరహార్తిగని హేళనము గావించిరి. కావున నిది యంతయు రతి స్థాయిగాఁ గల శృంగారము గాని శోకము స్థాయిగాఁగల కరుణము గాదు. శోకమే దిక్కయి యేడ్చుచున్న యాపన్నురాలి నెవ్వరును వనవిహారాదులకుఁ బిలువరు. ఆమె యచటికిఁ బోను. ఆమెయార్తిం గని యాప్తులెల్లరును దుఃఖితులు గాని హేళనము గావింపరు విరహముచే దుఃఖించిన నామెదుఃఖము శృంగారరసపోషకముగా వర్ణింపఁబడును. విరహముచే గిరిక యేడ్చినయేడ్పును రామరాజభూషణుఁడు "కిన్నరవధూరాజత్కరాంభోజకాంభోజీమేళవిపంచికారవసుధాపూరంబు ఘోరంబుగాన్" అని వర్ణించెను. మఱియొక కవి "భూపాలైకరాగంబునన్" అని వర్ణించె. ఈయేడ్పులు సంచారిభావములై రతి స్థాయిగాఁగల శృంగారమును వ్యక్తీకరించును. గావుననే వా రటు చెప్పిరి. మనవేంకటశాస్త్రి గారు చెప్పినదే సత్య మగునెడల ప్రతిప్రబంధరాజమునందుఁ గల విప్రలంభశృంగారమును మహాపత్తై కరుణరస మైపోవును. మేఘసందేశాదులు కరుణరసప్రధానము లైపోవలసివచ్చును. అట్లు బుద్ధిమంతు లెవ్వరును దలంచుట లేదు. కావున మనుచరిత్రమునుండి మన వెంకటశాస్త్రి గారు చూపినభాగము విప్రలంభశృంగారరసము గాని కరుణరస మెంతమాత్రమును గాదు

శృంగారరసాభాసము:—మనుచరిత్రమునందు సరిగాఁ జెప్పఁబడు శృంగార మంతటను వట్టియాభాసమాత్రమై పోయినది కాని తుదకు సరియైనది కా లేదు. ఈయంశమును నేను నావ్యాసములోఁ జర్చించి యుండినను మనవేంకటశాస్త్రిగారు 'మనుచరిత్రమందుఁ బ్రధాన మగుశృంగారము చక్కగాఁ బోషింపఁబడినది యని యే నాతలంపు. నాయికానాయకులు వీరే యని నిర్ణయింప వీలులేకున్నను నాయకాంతాపుల శృంగారరసస్ఫురణము సముచితముగానే యున్నది. అంతియకాని శ్రీశాస్త్రిగారు సెలవిచ్చినట్లు లీగ్రంథ

మున నున్నది శృంగారరసాభాసము కాదు. వారు చూపిన "ఏకత్రైవానురాగశ్చేత్" అను లక్షణమున కీగ్రంథము విషయము కాలేదు" అని వ్రాసిరి. ఇది సరికాదు. ఏకత్రానురాగము రసాభాస మని యంగీకరించియుచు గూడ మనుచరిత్రమునందు రసాభాసము లే దనుట వింత. అయినను శాస్త్రిగారా భాసము లేదనిరి, కావున మనుచరిత్రమునందు శృంగారమున కిక్కడ లగు తావుల నది యెట్లున్నదో మరల విచారించి చూచుకొందము.

1. ప్రవరవరూథినుల విషయములోఁ గొంతశృంగారము నడచినది కాని యది యాభాసమాత్ర మయిపోయినది. ఏమన, వరూథినికే యనురాగము కలదు గాని ప్రవరునకు లేదు. ఈతావున శృంగారమునకును శాంతమునకును బోరాటము జరిగిన దనియు శృంగార మోడిపోయె ననియు శాంతము జయించె ననియు మనవేంకటశాస్త్రిగారే వ్రాసిరి. ఏకత్రానురాగ మగుటచేతనే కదా శృంగారమున కిచట నపజయము కలిగినది. కాన నిట తదాభాసము కల దనుటకు సందియము లేదు

2 వరూథినీ మాయాప్రవరుల విషయములోఁ గొంత శృంగారము నడచినది అదియు నాభాసమాత్రమే. ఏమన నచట మాయాప్రవరునకే యనురాగము కలదు కాని వరూథినికి లేదు వరూథినికి మాయాప్రవరునందు రాగము లేకపోవుటయే కాదు. రోఁతగూడఁ గల దని మనుచరిత్రము చెప్పుచున్నది. అయినను నీఘట్టమును శృంగారకలితము చేయుటకై మనవేంకటశాస్త్రిగారు "వరూథినికిఁ బ్రవరునియందును నతనిరూప మనుకరించిన మాయాప్రవరునియందును నిష్కపటానురాగమే కలదు. వరూథినియందుఁ బ్రవరునికి లేకపోయినను మాయాప్రవరునకు దృఢానురాగమే కలదు. కావున వరూథినీమాయాప్రవరుల యనురాగము పరిపూర్ణ మయిన దని చెప్పుటకు సందియము లేదు." అని వ్రాసిరి. ఇది సరికాదు. వరూథినికిఁ బ్రవరునియందే యనురాగము కలదు కాని, మాయాప్రవరునందు లేదు. మాయాప్రవరుఁ డెన్నఁడును బ్రవరుఁడు కానేరఁడు. ఆవ్యక్తి వేఱు. ఈవ్యక్తి వేఱు ముచ్చిబంగార మెన్నటికిని బంగారము కాని యట్లే మాయాప్రవరుఁ డెన్నటికిని బ్రవరుఁడు కానేరఁడు. కలి యను నతఁడు మాయాప్రవరరూపమును ధరించి తన్ను వంచించుచున్నాఁ డని వరూథిని యెఱుంగకపోయినను నాగంధర్వాధముఁ డది యెఱుంగకపోలేదు. ఆమెకుఁ దన యం దిష్టము లే దని యాతఁ డెఱిఁగియే

దొంగవేషముచే నామెను వంచించెను. ఆమె ప్రవరా యని తన్నుఁ సంబోధించిన నామెహృదయము ప్రవరునందే గాని తనయందు లేదని గ్రహించి యుండియు నను నల్పుఁ డగుటచే నాసంబోధనము తనదిగానే భావించి యుండెను. ఈతఁ డామెశరీరముతోడి యైక్యము కలుగుటయే పరమానందముగా భావించుకొనెను గాని ఆమెహృదయము తనయం దుండుట ముఖ్య మని భావించుకొనలేదు. తనయందు హృదయము లేని వరూధినిని గూడుట శవమును గూడుటవంటిదే. మత్తుమందిచ్చి యొడలెఱుంగని స్థితియం దున్నప్పుడు కూడువాఁ డెంతటివాఁడో వీఁడును నంతటివాఁడే అల్లును గాదు మత్తు నందున్నయామెకుఁ గూడువానియందు రోఁత లేక పోవచ్చును. ఈమెకుఁ గలిగాని యందు రోఁత కూడఁ గలదు. "వంచన యెఱిఁగిన మఱి శపియించునో" యను భీతి వీనిహృదయమునం దెప్పుడును గలదు. ఇట్టి భీతాత్ముఁడు వినిర్మలశృంగారానందమును నెట్లందఁగలఁడు? ఇంతయేల. యామెశరీరమును దాఁకుటయను సౌఖ్యమును దాను బొందుటకై పై భీతి ననుసరించి యామెను నిజముగాఁ గీల్బొమ్మనే చేసినాఁడు. తనవంచనము తెలియకుండుటకై కన్నులు మూయించివేసినాఁడు. దాన గ్రుడ్డిది యైపోయినది హృదయ మంతకుఁ బూర్వమే లేదు. ఇట్లు కన్ను లుండియుఁ దన్నుఁ జూచుట లేనిది, హృదయ ముండియుఁ దన్నుఁ బ్రేమించుట లేనిది, యగునీమెను గూడుట కీల్బొమ్మను గూడుటకంటెను నీచము కాదా? ఇఁక నీతఁ డామెను గూడి పొందినసంభోగసౌఖ్యము సరసమైనదియుఁ బ్రౌఢ మైనదియు నెట్లు కాఁగలదు? అది ప్రౌఢ మగు సరసత కలది కాలే దని పెద్దనార్యుఁడే "అన్నుకఁ గనుమూయుట, రొద సన్నగిలుట కౌఁగిలింత సడలుట నేర్పుల్, సున్నగుట వరూధినిరతి, కన్నెఱికపురతియుఁ బోలెఁ గడు నింపొసఁగెన్" అని వర్ణించినాఁడు. నేర్పులు సున్నయై గ్రుడ్డిదై యుండుదానిని దనయందు హృదయములేనిదానిని గూడుట రసికున కానంద మిడునా? ఎన్నటికిని గానేరదు. కానఁ గలిగానికి వరూధినితోఁ గలిగినపొత్తు కీల్బొమ్మతోడి పొత్తువంటిదే. అంతకంటెను దప్పక హాస్యాస్పదమే. ఏమనఁ గీల్బొమ్మను బొందువాఁ డాబొమ్మ శపించునేమో యన్నభీతి లేక స్వేచ్ఛ గలిగి యుండును. ఇట వరూధినికిఁ దనయం దిష్టములేదనుదుఃఖ మొకటి తన్నామె శపించునేమో యన్నభీతి యొకటి బాధించుచుండుటచే నీకీల్బొమ్మను బొందువాఁ డెన్నటికిని శృంగారరసరసికుఁడు కానేరఁడు. కాన వరూధినికిని మాయాప్రవ

రుపకును నడుమ నడచినశృంగార మనునది వట్టియాభాసమాత్రము కాని నిజ మగుశృంగార మొంతమాత్రమును గానేరదు.

3. స్వరోచికిని నాతనిభార్యలకును నడుమ నడచినశృంగార మొక్క నికి బహునాయికలతోడి దగుటచే నాభాసమాత్రమే యైపోయిన దని మన పెద్దనార్యుఁడే తనమనుచరిత్రమునందే యిట్లు వివరించియున్నాఁడు.

" చ. పలువురయందు నొక్కనికి భ్రాంతియు నొక్కనియందుఁజూడ న
గ్గల మగుప్రేమ పల్వురకుఁ గల్గుట యద్భుత మట్లు గాన యి
వ్వెలదు లయందుఁ గూర్మిపస వీనికి నేమియు లేదు వీనియం
దలవడఁ గల్గ దీజలరుహాక్షులకుం బ్రియ మెవ్విధంబునన్. "

ఈపద్యటీకలో, టీకాకారుఁడు "శ్లో॥ ఏకత్రైవానురాగశ్చే త్తిర్యఙ్మ్లేచ్ఛగతోపివా, యోషితాం బహుసక్తిశ్చ రసాభాస స్త్రిధా స్మృతః " అని వ్రాసి యిది రసాభాస మని సూచించినాఁడు.

మనోరమాస్వరోచులవిషయములో నడచినశృంగారము నైనను మన పెద్దనార్యుఁడు సరిగ సాఁగనియ్యలేదు. మూలకారుఁడు మనోరమామనోగత విచారమును దొలఁగించివైచి పిమ్మట సంభోగశృంగారస్ఫురణమును గలిగించి యుండఁగా మనపెద్దనార్యుఁ డామనోదుఃఖమును దీసివేయకయే మనోరమా స్వరోచుల గర్భాధానపుగదిలోనికిఁ జేర్చి శృంగారచేష్టల వర్ణించి వర్ణించి తుదకు మనోరమను దుఃఖార్తను జేసి యేడ్పించి తుద కనురాగయుత నాయి కానాయకులందు విజృంభించు మన్న యానందమునకు భంగము గలిగించి రసాభాసముఁ జేసివేసినాఁడు. ఇట్టియానందమునకు భంగము గలిగించుట రసాభాసమే యని వేంకటశాస్త్రిగారే సూచించియున్నారు. ఇది కవి స్వయ ముగాఁ దెచ్చిపెట్టిన రసాభాసము. ఈవిధముగాఁ బరిశీలించి చూచిన నన్ని తావులయందలి శృంగారమును వట్టియాభాసమై పోయిన దని చెప్పవలసివచ్చు చున్నది గాని తగుపోషణము గల్గియున్న దని చెప్పుట కవకాశము లేదు. పెద్దన శృంగారవిషయములో నున్నతము లగునూహలు కలవాఁడు గాఁడు. పశుకామమే శృంగార మని భావించియున్నాఁ డని విద్యావినోది కీ॥ శే॥ పసప్పాక మనంతాచార్యులవా రిట్లు వ్రాసిరి—

"He has treated as to the common places of human affairs and to the physical effects of the sort of love, which coarser minds gloat over and which we want no poet describe to the world."

అంగి యగుశృంగారరసమునకుఁ గలిగినపాట్లే యిట్లున్నవి.

శాంతరసము.—వరూధినీప్రవరులవిషయములో శాంతరసపోషణము కలిగిన దని మన వేంకటశాస్త్రిగారు వ్రాసిరి. అది సరి కాదు. మనపెద్దనార్యునిచేఁ బ్రవరుఁ డొక్కరసికతావిహీనమూర్ఖుఁడు గావింపఁబడినాఁడు. ఈతని గోల బేల యని పలువురచేఁ బలికించుటయే గాక "కొనసాగి కామినీగోష్ఠిఁ బ్రౌఢములైన యుదుటుఁజూపుల ఱెప్పతుదల నాచి" అనుపద్యములోఁ బ్రవరుఁ డవిదగ్ధుఁ డగునరసికుఁ డని తేల్చియున్నాఁడు. అవిదగ్ధుఁడు నాయకుఁడుగా నుండుచోట రసపోషణము కానేర దని శృంగారశాస్త్రకారులు చెప్పియున్నారు. కాన ప్రవరచర్యలో శాంతరస మాభాసమాత్ర మై పోయినది.

ఈవిధముగా మనుచరిత్రమునందుఁ బ్రధానముగా నెంచఁబడి కొంచెముగనో గొప్పగనో విజృంభణము నందిన రసము లన్నియు నాభాసమాత్రములై పోయినవి అంగి యగుశృంగారముమాట చెప్పనే యక్కఱలేదు. ఇఁక రసవిషయమున మనుచరిత్రము నెట్టిదానిఁగా నెంచుకొనవలెనో ప్రాజ్ఞు లగుచదువరులే యూహించుకొందురుగాక.

———

వీరరౌద్రములు. — రసవిషయమున వేంకటశాస్త్రిగారి ప్రమాదము లింకను గలవు. విప్రలంభమును కరుణముగ వ్రాసినట్లే రౌద్రలక్షణ మగురక్తాస్యనేత్రత్వమును యుద్ధవీర ప్రధానలక్షణముగా వ్రాసిరి. ఇది సరికాదు అయ్యది క్రోధము స్థాయిగాఁగల రౌద్రలక్షణము కాని యుత్సాహము స్థాయిగాఁగల యుద్ధవీరలక్షణము కాదనియు శత్రు వాలంబనముగాఁ గల యీరెండురసములకు నిదియే భేదమనియు సాహిత్యదర్పణకారుఁ డిట్లు వ్రాసె.

"అస్యయుద్ధవీరాద్భేదమాహ:— రక్తాస్యనేత్రతా చాత్ర భేదినీ యుద్ధవీరతః" వ్యాఖ్య- "అస్యేతి రౌద్రస్యేత్యర్థః రక్తాస్యనేత్రతావ్యంగ్యః క్రోధఏవ భేదః తథా చోభయత్ర రిపో రాలంబనత్వేపి క్రోధావిర్భావే రౌద్రః ఉత్సాహావిర్భావే వీర ఇత్యనయో ర్భేద ఇతిభావః"

కాన శాస్త్రిగారు వ్రాసినది లక్షణానుసారముగా లేదు

సవరణ — ఈ వ్యాసములోని "విమర్శనము లుత్పిత్సువుల"ని యున్న దానిని 'విమర్శనములువ్యుత్పిత్సువుల"ని చదువుకొనవలయును

# సంస్కృతరాఘవపాండవీయవిమర్శనము.

యీయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులుగారు,
శ్రీరంగం సోమేశ్వరశాస్త్రిగారు.



1. కవిరాజుశైలి 2. కవిరాజుకవితాసామర్థ్యము 3 తత్కవితాప్రాశస్త్యాప్రాశస్త్యములు 4. కవిరాజకవితకు నితరకవితకుఁ గలసామ్యవైషమ్యములు 5. సంస్కృతసారస్వతమునఁ గవిరాజుస్థానము.

1. కవిరాజుశయ్య :— సంస్కృతరాఘవపాండవీయరచనాకౌశల మనితరసాధారణము, నదృష్టపూర్వము నై విరాజిల్లుచున్నది. ఇట్టి కథాద్వితయసంధానవైచిత్రి కీకవిరాజసూరియే మార్గదర్శి. ఈవిద్వత్కవిశయ్యాకౌశల మతిమాత్రమనోరంజకము. ఇతనిశబ్దసౌలభ్యము, భావసౌకుమార్యము నత్యద్భుతజనకములు ఇతనికవితావనిత, సుఖప్రబోధలలితయు, సువర్ణఘటనోజ్జ్వలయు, దృష్టాంతోపమాద్యలంకారభూషితయు నయ్యు శ్లేషోహను బోఁగొట్టుచున్నది.

2. కవిరాజుకవితాసామర్థ్యము :— కవిరాజుకవితాసామర్థ్య మపారము. పూర్వోల్లిఖిత (రాజశేఖరకృతము) కవిరాజనిర్వచనముంబట్టి, మనకవిరాజు బహుభాషానిష్ణాతుఁ డనియు, వివిధప్రబంధనిర్మాత యనియు, రసభావనిరంతరకవితాదక్షుఁ డనియు నూహింపవచ్చును. ఆంధ్రద్వ్యర్థికావ్యనిర్మాత లగుసూరనరామరాజభూషణులకంటె సంస్కృతద్వ్యర్థికావ్యకవులకుఁ గ్లేశ మధికము. ఆంధ్రకవుల కాంధ్రగీర్వాణము లుపయోగించుకొనుసదుపాయము గలదు. సంస్కృతశ్లేషకవు లేకభాషాశరణ్యు లగుటంజేసి వారి కతిమాత్రక్లేశము గలదు. ఈవిషయమై 'రాఘవనైషధీయ' కారుఁ డగుహరదత్తసూరి, తద్వ్యాఖ్యానములో నిట్లు వాక్రుచ్చియున్నాఁడు. "సంస్కృతభాషారూపోఽర్థాన్తరశ్లేషసంఘటితో దుర్ఘటః కవ్యన్తరైః స్వప్నేఽపి వ్యథాయి ప్రబన్ధోఽయమ్." (I స. 7 శ్లో. వ్యాఖ్య) కవిరాజు బంధకవితారచనమునఁ గుశలుఁ డని యంతిమసర్గస్థ శ్లోకద్వయమువలన ద్యోతిత మగుచున్నది. అందు XIII స. 61 శ్లో. సర్వతోభద్రశ్లోకము ; XIII- 62 శ్లోకము కవినామాంకితమహాచక్రబన్ధము ; ఇవి స్థలాంతరమున వివరింపఁబడును. ఆంధ్రరాఘవపాండవీయము నాలుగాశ్వాసములగ్రంథము. కవిరాజురాఘవపాండవీయము 13 సర్గలమహాకావ్యము.

కాని, పద్యసంఖ్య యించుమించు సమానముగా నున్నది. (ఆంధ్ర రా. పాం. 649 పద్యములు, సంస్కృత రా. పాం. 668 శ్లో.) ద్విసంధానమహాకావ్యము 18 సర్గల బృహత్కావ్యము. కవిరాజుసామర్థ్యముం గూర్చి పాశ్చాత్యవిద్వాంసు లిట్లు వాక్రుచ్చియున్నారు.

Dr A. A. Macdonell opines in his "Sanskrit Literature" (P. 331).

"The culmination of artificiality is attained by the Raghava Pandaviya of Kaviraja. It celebrates simultaneously the actions of Raghava or Rama and of the Pandava princes The composition is so arranged that by the use of ambiguous words and phrases the story of the 'Ramayana' and 'Maha-Bharata is told at one and the same time The same words, according to the sense in which they are understood, narrate the events of each epic. A '*tour de force*' of this kind is doubtless unique in the literatures of the world. Kaviraja has, however, found imitators in India itself."

Prof. A. B Keith opines in his "Classical Sanskrit Literature" P. 56. "The ultimate result of the love of playing with language which marks both Bharavi and Magha is seen in the Raghava Pandaviya of Kaviraja It aims at telling the tale of Rama and of the Maha-Bharata simultaneously, a result which is only possible because of the large number of meanings which are assigned to Sanskrit words, by the lexicons, the diverse modes in which members of compounds may be connected, and the different ways in which the syllables composing a line can be conjoined. It is fair to say that considering the appaling nature of the task undertaken, the poet, whose name is lost to the obloquy he merits, shows very considerable skill, and might have produced a meritorious work had he devoted his efforts to a more legitimate end."

'Kavirája, we must know, lived in an age of artificial poetry, in which the use of alliterations, fanciful words, strange conceits, ingenious turns of expression, the various बन्धs such as सर्वतोभद्रबन्ध, महाचक्रबन्ध, गोमूत्रिकाबन्ध &c, was indulged in by the poets. Really that was a period of deterioration—or development on artificial lines—in the style of poetry.'

కవిరాజుప్రశ్నావైఖరిని నాలోచించునపుడు, శ్లేషకావ్యద్వ్యర్థికావ్యభేదము నరయుట యవసరము. సుబంధుని 'వాసవదత్త' యు, బాణుని 'కాదంబరి' యు శ్లేషకావ్యములుగాని ద్వ్యర్థికావ్యములు గావు. శ్లేషయమకచక్రవర్తియగు వేంకటాధ్వరిమహాకవికావ్యములుగూడ శ్లేషకావ్యములుగాని, ద్వ్యర్థికావ్యములు గావు వసుచరిత్ర శ్లేషకావ్యము. హరిశ్చంద్రనలోపాఖ్యానము ద్వ్యర్థికావ్యము. ద్వ్యర్థికవుల శ్లేషకవు లనియు నన నగుఁ, గాని శ్లేషకవుల ద్వ్యర్థికవు లనఁజనదు. సుబంధుభట్టబాణులు వక్రోక్తినిపుణులు, శ్లేషకవులు ; కాని ద్వ్యర్థికవులు గారు కవిరాజు వక్రోక్తిమార్గనిపుణుఁడు శ్లేషకవితానిపుణుఁడే గాదు, మఱియు ద్వ్యర్థికావ్యరచనాదక్షుఁడు. శ్లేష యన, నానార్థసంశ్రయము, అనఁగా వివిధార్థములు గలపదములఁ బ్రయోగించిన శ్లేషాలంకారమగు ఇట్లు కావ్యమంతయు శ్లేషభూయిష్ఠమైనను నది శ్లేషకావ్యమే కాని ద్వ్యర్థికావ్యము కా నేరదు. ఏకవృన్తగతఫలద్వయన్యాయమునఁ గావ్యమంతయుఁ గథాద్వితయాన్వితమై యుండినచో నక్కావ్యము ద్వ్యర్థికావ్య మనఁబడును. ఇట వక్రోక్తిస్వరూపనిరూపణ మప్రస్తుతము కా దని యెంచెదము.




1. ఆచార్యమమ్మటుఁడు, "కావ్యప్రకాశము" IX

"శ్లో. యదుక్త మన్యథావాక్య మన్యథా న్యేన యోజ్యతే
శ్లేషేణ కాక్వా వా జ్ఞేయా సా వక్రోక్తి స్తథాద్విధా"

11. రాజానకరుయ్యకుఁడు; "అలంకారసర్వస్వము," 175 పు.

"అన్యథోక్తస్య వాక్యస్య కాకుశ్లేషాభ్యా మన్యథా యోజనం వక్రోక్తిః' వివరణము. 'యద్వాక్యం కేనచి దభిప్రాయేణోక్తం స దపరే

ణ వక్త్రా కాకుప్రయోగేణ శ్లేషప్రయోగేన వాన్యథా న్యార్థఘటన యాయోజ్యతే తదుక్తిః సా వక్రోక్తిః '

A కాకువక్రోక్తి

B. శ్లేషవక్రోక్తి: —(a) అభఙ్గశ్లేషవక్రోక్తి

(b) సభఙ్గశ్లేషవక్రోక్తి

(c) ఉభయశ్లేషవక్రోక్తి

III జయదేవుఁడు: 'చన్ద్రాలోకము,' XCII అలం. 158

'శ్లో. వక్రోక్తి శ్లేషకాకుభ్యా మపరార్థప్రకల్పనమ్ '

IV ధర్మసూరి: 'సాహిత్యరత్నాకరము' VII అర్థాలఙ్కారతరఙ్గము 235

"శ్లో. అన్యథోదితవాక్యస్య కాక్వాశ్లేషేణ వాన్యథా
యోజనం క్రియతే తత్ర వక్రోక్తిస్స్యా ద్యలంకృతిః"

శ్లేషముచేతఁగాని, కాకుస్వరముచేతఁ గాని యర్థాన్తరము కల్పించినయెడల వక్రోక్త్యలంకార మని పిండితార్థము.

ఇఁక శ్లేషస్వరూపమును నిరూపించెదము.




నానార్థసంశ్రయము శ్లేషము (అనేకార్థశబ్దవిన్యాసము శ్లేషము) అనఁగా ననేకార్థములు గలశబ్దముల నుపయోగించితిమేని శ్లేషాలంకార మగును. పాఠకులు రెండర్థములఁ దప్పక తెలిసికొనకున్నఁ గథాభాగము నడువనిరీతిగ నుండు సమానశక్తము లగునర్థములు శ్లేషార్థములు.

(A) శ్లేషస్ఫురణమునకు శబ్దములు ప్రధానమైనచో శబ్దశ్లేష మనఁబడు. ఇందు శ్లేష, శబ్దగత మగుటంజేసి, శ్లిష్టశబ్దవైపరీత్యమునకు వీలులేదు, కావున

నిందు భంగసహిష్ణుత కలదు; "ఉదాత్తస్వరభేదాత్ప్రయత్నభేదాచ్చ శబ్దాన్యత్వే శబ్దశ్లేషః; యత్ర ప్రాయేణ పదభఙ్గో భవతి"—రాజానకరుయ్యకుఁడు "నను శబ్దశ్లేషస్థలే ప్రయత్నాదిభేదాత్ స్ఫుట ఏవ శబ్దభేద ఇతి చేత్సత్యం భేదోఽస్తి. తథాపి జతుకాష్ఠన్యాయేన శబ్దయో రితరేతరశ్లిష్టత్వా చ్ఛబ్దైకత్వవ్యవహారః. అతఏవ శబ్దశ్లేషే భంగసహిష్ణుతా"—సాహిత్యరత్నాకరము.) ఇందు శబ్దము విఱిగి శ్లేషించుటచే దీనిని సభంగశ్లేష మందురు

(a) "శ్లో. వేంకటార్యవచోగుంఫై ర్జితౌ గురుఫణీశ్వరౌ
ధిషణాహీనతాం ప్రాప్య జీవశేషౌ బభూవతుః"

శ్లేషయమకచక్రవర్తి, వేంకటాధ్వరిమహాకవి.

"ధిషణాహీనతాం," జీవశేషౌ," ఇట శబ్దశ్లేషగలదు ధిషణాహీనతాం= i బుద్ధిహీనతను ii (ధిషణ అహీనతాం) బృహస్పతిత్వమును సర్పరాజత్వమును.

ఇక్కడ 'ధిషణ' శబ్దమును దీసివైచి, 'శేముషీ' శబ్దమును బ్రయోగించినచో శ్లేష యదృశ్యమగును.

జీవశేషౌ=i జీవశేషులు ii (జీవ + శేషౌ) వాచస్పత్యాదిశేషులు.

ఇక్కడ 'శేష' శబ్దమునకు బదులు, 'అనన్త' శబ్దమును గాని 'జీవ' శబ్దమునకు బదులు 'గురు' శబ్దమును గాని ప్రయోగించినయెడల శ్లేష యదృశ్యమగును.

(b) ఉదా: "బాలేవోద్యానమాలేయం సాలకాననశోభినీ"

'సాలకాననశోభినీ'—అలకలతోఁ గూడిన యాననముచే శోభిల్లునది బాలపక్షమునను,—సాలవృక్షములతోఁ గూడిన కాననముచే శోభిల్లునది యుద్యానమాలపక్షమునను నిట నన్వయము. "సాలక" శబ్దము తీసివైచి, సమానార్థము గలసకున్తలశబ్దము నుపయోగించినచో శ్లేష యదృశ్యమగు.

(B) శ్లేషద్యోతకమున కర్థము ప్రధానమైనచో నది యర్థశ్లేషము నాఁబడు. ఇందు శ్లేష యర్థగత మగుటంజేసి శబ్దపరివర్తనమున కవకాశము గలదు. ఇందు శబ్దము విఱుగకయే శ్లేషించుటంజేసి దీని నభంగశ్లేష యందురు. ['యత్రశబ్దపరివర్తనేఽపి న శ్లేషత్వఖండనా తత్రైవార్థశ్లేషః'—సాహిత్యదర్పణము; 'అర్థశ్లేషస్తు యత్ర స్వరాదిభేదో నాస్తి. అత ఏవ న తత్ర సభఙ్గపదత్వమ్' అలంకారసర్వస్వము; 'అర్థశ్లేషేతు ప్రయత్నాదిభేదస్య శబ్దభేదక

స్యాభావేన శబ్దైక్యనిశ్చయే సత్యేకనాళావలంబిఫలద్వయరీత్యా శ్లిష్టత్వమర్థయో రితి. శబ్దపరివృత్తి యోగ్యత్వాం భంగాసహిష్ణుత్వాం చేత్యాలంకారికరహస్యం'—సాహిత్యరత్నాకరము.]

(a) ఉదా మాఘము IV స. 59 శ్లో (కువలయానందవృత్తము.)

శ్లో. ఏతస్మిన్నధికపయశ్శ్రియం వహన్త్యః సంక్షోభం పవనభువా జవేన నీతాః ।
వాల్మీకేరరహితరామలక్ష్మణానాం సాధర్మ్యం దధతి గిరాం మహాసరస్యః."

[మల్లినాథుఁడు; "అత్ర పవనభువా జవేనే త్యత్రైకవృన్తావలంబిఫలద్వయవ దభంగైకపాదగతత్వే నార్థద్వయప్రతీతే రర్థశ్లేషః అన్యత్ర పదభఙ్గో నార్థద్వయప్రతీతే ర్జతుకాష్ఠవ చ్ఛబ్దయోరేవ మిథః శ్లిష్టత్వా చ్ఛబ్దశ్లేష ఇత్యుభయసాహిత్యా దుభయశ్లేషోఽయం ప్రకృతాప్రకృతగోచరః"]

ఇట—"పవనభువా జవేన" యనుచో నర్థశ్లేష గలదు.

(a) పవనమువలనఁ గలిగినజవముచేఁ గలఁగింపఁబడిన

(b) మారుతియుద్ధతిచేఁ గలఁగింపఁబడిన.

'పవన' శబ్దమునకు బదులు 'అనిల' శబ్దము గాని (అది ఛందోభంగము గలిగించుననుచో) 'శ్వసన' శబ్దముఁ గాని ప్రయోగించినను నర్థశ్లేషకు భంగము గలుగదు.

(b) కావ్యప్రకాశోదాహరణము. X:—

"శ్లో. ఉదయమయతే దిఙ్మాలిన్యం నిరాకురుతే తరాం
నయతి నిధనం నిద్రాముద్రాం ప్రవర్తయతి క్రియాః
రచయతి తరాం స్వైరాచారప్రవర్తనకర్తనం
బత బత లసత్తేజఃపుఞ్జో విభాతి విభాకరః"

(ఇట 'విభాకరుఁడ'నునొకరాజును, సూర్యుఁడును వర్ణింపఁబడిరి)

(c) శబ్దమొకపక్షమున నొకభాషగను, వేఱొకపక్షమున వేఱొకభాషగను నుండిన నది "భాషాశ్లేష"మని విశ్వనాథకవిరాజు 'సాహిత్యదర్పణమున వ్రాసియున్నాఁడు. దీనినే పింగళి సూరన "ఆంధ్రభాషాసంస్కృతాభిభాషశ్లేష" యని సూచించియున్నాఁడు.

మఱియుఁ బింగళి సూరన 'ముఖ్యగౌణవృత్తిశ్లేష, అర్థాన్వయభేదశ్లేష, శబ్దాన్వయశ్లేష' మొదలగు శ్లేషభేదములు నుపయోగించెను. ఇఁక శ్లేషవిషయమున నాలంకారికనిర్వచనముల నరయుదము.

I. రాజానకరుయ్యకుఁడు; "అలంకారసర్వస్వము, 95 పు.
"విశేష్యస్యాపి సామ్యే ద్వయోరుపాదానే శ్లేషః."

II. సరస్వతీకంఠాభరణము: (భోజుఁడు)
"ఏకరూపేణ వాక్యేన ద్వయోర్భణన మర్థయోః
తన్త్రేణ తచ్చసర్వజ్ఞైః శ్లేష ఇత్యభిధీయతే
ప్రకృతి ప్రత్యయస్థా ద్వా విభక్తివచనాశ్రయా
పదపాదో (?) త్తరాచేతి శబ్దశ్లేషాభవన్తిషట్."

III విద్యానాథుఁడు, "ప్రతాపరుద్రీయము," VIII ప్ర. 59 కారిక–
"ప్రకృతాప్రకృతోభయగతముక్తం చేచ్ఛబ్దమాత్ర సాధర్మ్యా శ్లేషోఽయం శ్లిష్టత్వం సర్వత్రాద్యద్వయేనాంత్యే."

IV జయదేవుఁడు: "చన్ద్రాలోకము." XXVI అలం.
"శ్లో. నానార్థసంశ్రయశ్లేషోవర్ణ్యావర్ణ్యోభయాశ్రితః"
వ్యా. "అథశ్లేషః. సచత్రివిధః: ప్రకృతానేకగోచరః, అప్రకృతానేకగోచరః, ప్రకృతాప్రకృతానేకగోచరశ్చ × × ఏకనాళావలంబిఫలద్వయవదర్థద్వయప్రతీతేరర్థశ్లేషః, జతుకాష్ఠవచ్ఛబ్దశ్లేషః."

V. విశ్వనాథకవిరాజు: "సాహిత్యదర్పణము" X పరి. 704 కారిక.
"శ్లో శబ్దై స్స్వభావా దేకార్థైః శ్లేషోఽనేకార్థవాచనం."
సా. దర్ప. X 643, 644.
"శ్లిష్టైః పదై రనేకార్థాభిధానే శ్లేషయిష్యతే
వర్ణప్రత్యయలిఙ్గానాం ప్రకృత్యోః పదయోరపి
శ్లేషాద్విభక్తివచనభాషాణా మష్టధా చ సః
పునస్త్రిధా సభఙ్గోఽథాభంగ స్త దుభయాత్మకః"

VI. ఆచార్యదండి: "కావ్యాదర్శము." II పరి. 310 శ్లో.
"శ్లిష్ట మిష్ట మనేకార్థ మేకరూపాన్వితం వచః."

VII వారణాసి ధర్మసూరి: "సాహిత్యరత్నాకరము" VII అర్థాలంకార తరంగము. 199 పు.
"శ్లేష స్సామ్యే సమాదిష్టో విశేషణవిశేష్యయోః"

ఈశ్లోకములు వ్యాసగౌరవభీతినవివృతములు. కవిరాట్, శ్లేషకవితా నిర్మాణము లోభాశ్రయణముచేఁ గా దనియు, నట్టిరచన బహుపరిశ్రమసాధ్య మనియు నీశ్లోకమున వివరించుచున్నాఁడు.

"శ్లో. పదమేక మపి శ్లిష్టం వక్తుం భూయా న్పరిశ్రమః
కథాద్వయైక్యనిర్వోఢుః కిం ధరాపతితో౽ధికమ్."

పింగళి సూరనమహాకవియు నాకుపీటి పెదవేంకటాద్రిప్రభువు తన్నుం గూర్చి యిట్లు వక్కాణించినట్లును, దానును 'దదీయాతిమాత్రగౌరవసంభావనాది విశేషంబులచేతం బ్రీతచేతస్కుండై యునికిం జేసి శక్యాశక్యవిచారంబు లేక యంగీకారభంగీతరంగితం బగునంతరంగంబుతో నతనికిఁ బ్రత్యుత్తరం బొసంగి నట్లును జెప్పికొనెను.

"శా. రెండర్థంబులపద్య మొక్కటియు నిర్మింపంగ శక్యంబుగా
కుండం దద్గతిఁ గావ్యమెల్ల నగునే నోహో యనం జేయదే
పాండిత్యంబున నందునుం దెనుఁగుకబ్బం బద్భుతంబుప్రప
ఞ్చుం డెవ్వాఁ డిలరామభారతకథల్ జోడింప భాషాకృతిన్.

ఉ. రాఘవపాండవీయకథ రమ్యముగా నొకకావ్యసృష్టి నా
హాఘటియింపఁగా వశమె యాంధ్రకవీంద్రుల కైనఁ దావక
శ్లాఘనపూర్వకోక్తి యవి లంఘ్యము కావునఁ గోవిదానుకం
పాఘనబుద్ధిఁ జూపెదఁ జమత్కృతి మత్కృతిమత్కృతిత్వమున్."

రాఘవపాండవీయపీఠిక. 10, 15 పద్యములు.

కవినామాంకితమహాచక్రబంధః

రమ్యాకల్పవిలాసినీక్షితిపతేర్లావణ్యతేజస్వినీ
నుత్యావిష్కృతమణ్డనాస్థితిమతీయాభీష్టలోకోత్తరా
రక్షోరాజసభాజకంమతిమతామాద్యంసుసేవ్యంముదా
దాతారంరసితానుజేనరశతానీకేనరామంతదా.

# తెలుఁగు పోలుపు.

—॥ కాశీభట్ట కృష్ణరాయశాస్త్రిగారు ॥—



(వెనుకటిసంచిక శేషము)

గ్రామ్య మనియమమువలన ననుచోటఁ బదము, దదశ్లీలమునిరూపించెను. నియమించిన గ్రామ్యత్వము తొలఁగును. సంస్కారవంత మగుచో నాపదము గ్రామ్యముగా నేరదు. కోశముల గ్రామ్య మనఁ బామరోక్తి యశ్లీలము నని యున్నది. గ్రామ్యమునకుఁ బర్యాయ మశ్లీలము. వ్యాకరణమున నశ్లీలపర్యాయముగ నర్థము సేయఁజనదు. అనియమము గ్రామ్య మని యనవలయును. ఏది సాంప్రదాయబద్ధము కాఁగలదో యది గ్రామ్యము కానేరదు. ఏ సాంప్రదాయమునకు వశముగాక యవ్యవస్థమై పామరైకయోగ్య మై యుండునేని గ్రామ్యమగును. పదసంబంధముగ గ్రామ్యమ్మని చెప్పి యపభ్రంశము నది యగుననెను.

“గ్రామ్యా” అని స్త్రీలింగములో నుపయోగించిన స్థలమున “గ్రామ్యా, ఆంధ్రభాషా” అని యర్థము. చతుర్విధము లని చెప్పి తజ్జాదిసాహచర్యమున గ్రామ్యమును జెప్పెను, గావున, గ్రామ్య ముపయోగింపఁదగు నని యన్వయమగును. మఱియుఁ దజ్జాదిలక్షణమును “ప్రకృతిద్వయజా” ఇత్యాదిగఁ జెప్పి గ్రామ్యమునకు లక్షణమును జెప్పలేదు. ఇది విరుద్ధము కదా? ‘అనియమాత్’ అనిచెప్పిన దాని నిట గ్రహింపఁదగు నందుమా, ఈసంశయములు తీఱవలసి యున్నవి.

ఉత్తముఁడు, మధ్యముఁడు, అధముఁడు, అధమాధముఁడు, అని మనుష్యులు నాల్గువిధములవా రన్నట్లు తజ్జాదిసూత్ర మన్వయము చేయుద మన్నఁ గ్రమముగ బలహీన మగుట లేదు. ఉత్తమునికన్న మధ్యముఁడు తక్కువ యనునర్థము వచ్చినట్లు తజ్జముకంటె సమము తక్కువ యనునర్థము రాదు. ఉత్తరోత్తరశ్రేష్ఠత్వమును రాదు. దీనింబోలిన వాక్యము వ్యాకరణప్రపంచమునను౦డదనియె యూహింతును. చింతామణిలో నింకొకసూత్రము దీనిం బోలిన యన్వయము గలది లేదు. ఏది ప్రమాణము సేసికొని యన్వయము చేయుటయో !

సూత్రాన్వయము:- నాల్గుభాగములలో నేదేభాగమును గుఱించి గ్రం

థమంతటఁ బ్రశంసించెనో, ఈసూత్రమునకు సన్నిహితపూర్వాపరముల నేయే సూత్రములు గలవో, వానితోడిసంబంధ మెట్లున్నదో కనుఁగొందుమేని మన కన్వయ మగును. కళాద్రుతప్రకృతికములను బూర్వమున నిర్వచించి ప్రయోగానుశాసనము పరమునకు జేసెను. గ్రంథ మంతట మూఁడుభాగములను గూర్చియే ప్రసంగించెను. గ్రామ్యము నెక్కడను శాసింపలేదు, కావున, మూఁడు భాగములే గ్రాహ్యము లనియు నితర మగ్రాహ్య మనియు నర్థముసేయవచ్చును మఱియు నీసూత్రము తరువాతిసూత్రమునఁ గల "ఇహాతు ప్రవ్యాహార్యాం సంకేతిత సుప్రసిద్ధమేవ పదమ్" అను శాసనమునుబట్టి గ్రామ్య మప్రసిద్ధము నసంకేతితము గావున నగ్రాహ్య మనియు నర్థము సేయవచ్చును అనుమానజ్ఞానముతోఁ బైరీతి నన్వయ మగును. అనుపలబ్ధిజ్ఞానముతో నింకొకరీతి నన్వయము సేయఁదగును.

తజ్జ, సమ, యఃప్రకృతిద్వయముతో నన్వయముచేసెను గావునఁ బ్రవాహినీ, అనులక్షణము దేశ్యకును గ్రామ్యకును జెల్లును. ప్రవాహినీ దేశ్యా, గ్రామ్యాచ అనియన్వయము. కాక 'దేశసామాన్యముగ నుండునది' దేశ్య యనియు నది ప్రవాహినివంటి దనియు 'గ్రామ్య'చిన్నచిన్నపల్లెలవారికిమాత్రము తెలియునది యనియు మాండలికపదజాలముం బోలినది యనియు నది కుల్య వంటి దనియు నర్థమగును. ఇంకొకయన్వయము పూర్వు లనుసరించినదియే ఈమూఁడన్వయములలో గ్రాహ్యమగున దేది?

నాయభిప్రాయ మీపరిచ్ఛేదమున వాక్రుత్తును. శాస్త్రమర్యాదకొఱకు నాంధ్రభాష నాల్గువిధముల నున్న దని చెప్పి లక్షణముల మూఁడింటికి మాత్రము చెప్పి నాల్గవదాని లక్షణము స్పష్ట మగుటఁ జెప్పక యనంతరము సంకేతితసుప్రసిద్ధము గ్రాహ్య మని నిర్వచించెను. కుక్కమాంసముయొక్క గుణమును వైద్యశాస్త్రమునఁ జెప్పినను నభక్ష్య మెట్లో యట్లే నాల్గింటినిఁ జెప్పినను నసంకేతిత మప్రసిద్ధము నిషిద్ధ మని నొక్కి చెప్పెను. గ్రంథమందెచ్చట గ్రామ్యవిధిఁ జెప్పలేదని యందుమేని సంకేతితసుప్రసిద్ధ మని యన్నతావుననే చెప్పె నని గ్రహింపవలయును అనియమాత్ అనుదానివలన గ్రామ్యలక్షణమును జెప్పె ననరాదు. అది యపభ్రంశము. ఇందలిగ్రామ్యయాంధ్రభాష. ఒకభాగము. దీనిలక్షణము చెప్పకుంట లోపమే. కావున నీక్రిందిరీతి నన్విత మగును.

వ్యా॥ హాహుఁడు, లింగుఁడు, రంగుఁడు, విశ్వపుండు, భూమిపుండు, ఏకుఁడు, సర్వుఁడు, ఇత్యాదిసమములును సందెము, సంద్యము, దిబ్బ (ద్వీపార్థమున) జచ్చుము (యక్ష్మము) ముద్ది, (ముగ్ధ) పన్నాణము (ప్రజ్ఞానము) ఇత్యాది తజ్జలును, ఉంటుడు, ఏంది, వాణ్ణి, అవక, గుంట (స్త్రీ) ఆడు, నేడు, (లేఁడు) ఇత్యాదిగ్రామ్యములును వానింబోలిన దేశ్యములును "ఉంటాడు, వస్తాడు, వాడిని, ఇత్యాదులు, శాస్త్రమువలన సాధింపఁబడినవు సంకేతిత సుప్రసిద్ధము గామి నగ్రాహ్యంబు లగు నని నిర్ణయము.

ఇఁక మన మనుకొన్నట్లు గాదు గ్రామ్యమును గ్రాహ్యమే యగును. "చేతు" య్యంతధాతువుల కీరూప మనిష్ట మైనను బ్రసిద్ధముగ నున్నది యుపయోగింపఁదగును. సుప్రసిద్ధ మగుచో గ్రహింపవలసినదే కాని సుప్రసిద్ధత్వము నిర్ణయించుట కష్టము. అయినను బూర్వమునుండి శిష్టవ్యవహారము ప్రమాణ మని యనుచునే యున్నారు. కావున శిష్టవ్యవహారమున నున్న దెల్ల గ్రాహ్య మని యందు మనువాదము బయల్పడెను. "శిష్టవ్యవహారము" అను విశేషణము లెస్సగ నున్నది కాని విమర్శించి చూడవలయును.

ఉపయోగింపఁదగు భాష యేది యనుసంశయము ముఖ్యముగఁ దీర్చుకొనవలయును. సులభముగ నాంధ్ర మని (ఆంధ్రులకు) చెప్పవచ్చును గాని యడ్డము లెన్నియో కలవు. వాని నన్నింటి నిర్వర్తింపఁ దగువ్యాకరణ మొకటుండవలయును. వ్యాకరణ మక్కఱలే దని యనువారును గలరు. అట్లనుట పొసఁగదు.

వ్యాకరణము—వ్యాకరణ మన నేమి? ఇత్యాదిప్రశ్నములు నైచి ప్రత్యుత్తర మీనక్కఱలేదు. పతంజలి తనభాష్యమున నెన్నియో ప్రయోజనములను దెలియఁబఱిచెను. వాని నరయుఁడు. నేఁటివారి కవి యన్నియు గ్రాహ్యములు గా వని యన్నను భాషకు వ్యాకరణము లేమి యొకలోపమే యగును. త్రికాలముల నుండు నట్లు వ్యాకరణము భాషను జేయును మఱియు నపశబ్దము లివి సుశబ్దము లివి యని తెలిసికొనమి భావము నైచ్యము నొందును గౌరవభావ మేర్పడదు. నిసై్రగణ్యపథవిచరన్మహాత్ములకు విధినిషేధములు లేకున్నను లీలామాత్రముగ విధినిషేధములు గల్గును. అట్లే సుహృత్పదమాత్రప్రయోక్త మైనను సంకేతితము సేయఁదగును. కాకున్న నభిప్రాయములు శస్తములు గావు. అవశ్యముగ నట్టినియమబద్ధతకు లోఁ

గును. ఎట్టివాఁడైన దృఢముగఁ జెప్పఁదలంచుచో నియమితమార్గముననే చెప్పును.

స్వభావసిద్ధముగ నొకఁ డయమను తెలియఁబడక యేర్పాటగుచుండ దానిఁ గనిపట్టి శాస్త్రము గావింపవలయును అది మానవధర్మము. తాత్కాలికమున కన్న శాస్త్రము లేకున్నను సార్వకాలికమునకు శాస్త్ర ముండితీరవలయును. శాసనము లేనిదెల్ల నాశన మగును సంఘరక్షకు శాసనము కావలయునన్న సంఘభాషకును శాసనము కావలయును సంఘమునకును భాషకును భేద మెక్కుడు లేదు. సంఘ మనఁగ రూపసమితి, భాష యనఁగ ధ్వనిసమితి. సంఘాభివృద్ధికి నేమేమి కావలయునో భాషాభివృద్ధికి నవియెల్లఁ గావలసినవియే. వ్యక్తి సంఘములో నిముడవలయును సంఘము వ్యక్తిలో నిముడవలయును. అట్లే వ్యక్తి భాష సంఘములో నుండవలయును. సంఘభాష వ్యక్తిలో నుండవలయును. అట్టివ్యక్తి సంఘభాషల యన్యోన్యసమన్వయము భారతవర్షమున నాంగ్లవిదుల కెల్లఁ గలదు. కావున నెల్లసహృద్యములు తద్ద్వారమున నగును. శాసనములు మున్నగునవి కావలయును. ప్రతినిధు లున్నట్లే భాషకుఁ బ్రతినిధులుగలరు. వారే శిష్టులు. ప్రతినిధులు సర్వసామాన్యమునకుఁ దగినట్లు శాసింతురో యట్లే శిష్టులును గ్రామ్యవ్యవహారమును విషవకయ శాసనముగావింతురు. విశేషులకు విశేషశాసన మున్నట్లు కవులకు సరల కృతిగఁ బల్లవలనుగాను. (కావ్యముల) ఇట్టి రెండును నొక్కటియే యగును కావునఁ జక్కనియేర్పాటు గలదియే యవలంబనీయము వ్యావహారికాంధ్ర మధ యోగింపఁదగు నని యనుచున్నారు. కాని వారివ్యావహారికవిశేషణము వివాదాస్పదము. వివరించిచూతము—

శిష్టవ్యావహారికాంధ్రవాదులు:—పైవారివాద ముపాదేయ మైనను సంస్కార్య మని నాకుఁ దోఁచుచున్నది. దీనింగూర్చి పూర్వపండితు లెందఱో వాదించిరి. వారివాదములకు సదుత్తరము రాలేదనియే నా తలఁపు. అట్లయ్యు నేల నే నిందు వ్రాయుచున్నానో యెఱుంగుఁడు. ఈ వాదమును స్థాపింపఁజూచు ఘనులు "బ్ర॥ శ్రీ॥ రావుసాహేబు గిడుగు రామమూర్తిపంతులుగారు. ఈమహాశయు లుదారులు. ఆంధ్రభాషాసంప్రదాయజ్ఞానపూర్ణులు. వీరివలె సేవచేయువా రరుదు. ఆంధ్రసరస్వతి. భాషావిషయమునఁ బూర్వులవి నేఁటివారివి గ్రంథముల నేరూపమున నున్న నరసి మోమోడక యభి

ప్రాయ మొసంగి గర్వరహితులై యుందురు. ఇంతవాదము సేయుచున్నను విషయప్రాధాన్యమును విడువరు. వారివాదము హేయమో యుపాదేయమో యెఱుఁగక యుంట నాకుఁ దగ దని యిందుమూలమునఁ దెలియఁజేయుచున్నాను.

వాదము:—జ్ఞానమును నన్యోన్యము నందించుకొనుటకు దూతవంటిది భాష. అగ్ని యజమానకృతహుతహవ్యమును దేవతలకుఁ దీసికొనిపోవునట్లు భాష మధ్యవర్తి. అతఁ డెంతసులువుగ లభించిన నంతలాభము అందు నందఱు సుముఖులే యగుట వ్యావహారికభాష నుపయోగింపవలసినది యని వాదము. అట్లుగాక పూర్వభాష కావలయు ననుట మంచిదికాదు భాష యొక్క ప్రవాహమువంటిది కావునఁ బూర్వాపరములు రెండును వర్తమానమున నుండును. పూర్వము మాత్రమే కావలయు ననుట ప్రకృత మెఱుగకుంటయే, కాని యాలోచించిన దానిని నట్లే పలుకుట యాచరణీయము మని యనుట కర్థము కాలేదు. యథాలోచితగదిత మగుట స్వభావమే కాని సుభావము గాదు "వానంటే యేమిట్రా? అక్కడినుండి నీళ్ళు రావటం" ప్రశ్న ప్రత్యుత్తరములు గలవు. ప్రయోజనము కొంచెము గలదు. ఆలోచించునప్పుడు మన భాష చాలఁ బరిమిత మగుటయు సహజము. అట్లు చెప్పుటయు సహజమే కాని ప్రయోజనము శూన్యము. "ఇది" అను నీసర్వనామము భాషామృత్యువు ఎంతభావమైన "ఇది" లో నిమిడించి మాటలాడువారెందఱో గలరు మన పలుకు పరా పశ్యంతి మధ్యమ వైఖరి యని నాల్గువిధములు. మనస్సులో నాలోచించునప్పు డిన్నిరూపముల నొంది మధ్యమావస్థలో నుండును. స్థూలరూప మగును వైఖరి యగును. మధ్యమావస్థ కావుననే పదము స్ఫురింపక భావము స్పష్టమగును. భావము పుట్టి తరువాతఁ బదము పుట్టును. ఆలోచించిన దాని నట్లే వ్రాయుట యసంభవము నప్రయోజనము హాస్యాస్పదము నగును. ఆంగ్లులయభిప్రాయము నిదియ ఏమాటలతో మనసులో నాలోచింతుమో యామాటలనే వాడుక చేయవలయు ననుట పొసగదు పరిమితపదములతో మనమున నాలోచింతుము. ప్రయత్నపూర్వకముగ దానిఁ బల్కుదుము. నైతికుల యనుశాసనమునిట్లే యున్నది. "మాటకూ మనోభావమునకూ గలసంబంధము చిన్నతనమునందే కలిగి అంతకంతకు దృఢపడుతుంది" అనుదాని విమర్శింతము మాటకును మనోభావమునకును సంబంధ మున్నది. కాని యామాట సంస్క—

రించినంగాని మనోభావము విశదీకరింపదు. మఱియు నీమాటల వాడుకలోఁ బ్రమాదములు సంభవించును.

'I beg your pardon' అనునీవాక్యమును నాంగ్లు లుచ్చరించునప్పుడు విన్నస్పష్టమగును. ఉచ్చారణానుసారమును గర్హ్యము కదా? ఉచ్చరించినట్లు వ్రాయుచో నక్షరమాల యక్షయమాల కావలసివచ్చును. భారతభాష నేటిది కాదనరాదు. కొన్నిపదములు భిన్నించినవి కాని పూర్తిగ భిన్నింపలేదు కదా? భారతము మన మనుకొనునట్టి వ్యావహారికభాషలో రచింపఁబడిన ఏమిప్రమాణము? సంభాషణభాషలో భారతము వ్రాయఁబడలేదు. "కావ్యములలో కవులు ఔచితిని బట్టి ఎట్టిశబ్దములు వాడుకచేసినా చెల్లును గాని లోకవ్యవహారములోను జనసామాన్యమునకు వ్రాసేగ్రంథములలోను చెల్లకూడదు" అనువాక్యము చూతము.

కవులభాషను విడిచిరి. అయినను జనసామాన్యమునకు వ్రాయునప్పుడేభాష యుండవచ్చు నందురు. జనసామాన్యవ్యవహారభాషయే యుండవలయును. శిష్టవ్యవహారభాష కాదుగదా? జనసామాన్యవ్యవహారభాష సకలవిషయములఁ దెలిపికొనన నసమర్థమగును. అంద తెఱంగినదియే ఇఁక నేవిషయములు వ్రాయవలయును? ఇది యొకసంశయము. కావ్యములుగూడ జనసామాన్యమున కుద్దేశించిన వేలకావు? అవియు నట్టి వ్యవహారభాష నుండవలయును. ఇట్టి యనవస్థాదోషము పోవుటకుఁ బదములమాట యెత్తక ప్రత్యయములను గూర్చియే యనవలయును. ఇప్పటివారి వ్యావహారికభాష యనఁగాఁ బ్రకృతిగతమైనది కాదు, ప్రత్యయగతమైనది యనియే నాకు బోధమయ్యెను. ప్రత్యయమాత్రమున కింతవాద మేల? నాయభిప్రాయము వాదివాక్యవిమర్శానంతరము తెల్పెదను. వ్యవహారభాషావాదము నిల్వలేదు.

ఇంక నిట్లనిరి. "తెలుఁగువారు వ్రాసేదేకాక మాట్లాడేది కూడా సభ్యభాషే అనే గౌరవము దేశమునకు సంపాదించడము"- గౌరవమరదే గొప్ప కాని, యగునో కాదో? ఇంగ్లాండు ఫ్రెంచిదేశములలో రెండును నొక్కటే యైనవఁట, కావచ్చునేమో కాని మనదేశములోఁ గాదు. అక్కడఁ గూడఁ గొలఁదిగనో గొప్పగనో భేదము గలదనియే విందును. కాని, మనదేశములో మొదటినుండియు నట్టియాచారము నెడల వైముఖ్యమే కన్పట్టుచున్నది. చాల

నిదర్శనములు గలవు సామాన్యవిషయములమాట యెట్లున్న మిగిలినవి యెల్ల నాచెప్పినట్లే యుండెను.

ఋగ్వేదమునుండియుఁ గలయుదాహరణములఁ జూపఁగలను విస్తరభీతి విరమించుచున్నాను. మఱియు నపశబ్ద మన వ్యావహారికవాదులనిర్వచన మేదియో? అపార్థప్రతిపాదకమా? అపప్రయోగమా? శబ్దావయవమునఁ గలవైషమ్య మెఱుంగుట యెట్లు ఈసంశయములు తీఱవలయును. ఇకఁ దదుపాతివాద మరయుదము.

"మాఉద్దేశము కొనసాగితే పెద్దమనుష్యులు వ్రాసేసభ్యభాష దేశమంతా క్రమక్రమముగా వ్యాపించి విద్యాబోధకు కావలసిన సులభసాధన మేర్పడుతుంది. పామరులకు సులభమైన వాఙ్మయముపుట్టుతుంది"

పైవాక్యమునఁ బెద్ద లను పదమున కర్థమేమి? ధనికులా ఆంధ్రాంగ్లులా, ఆంధ్రగీర్వాణులా, ఆంధ్రాంధ్రులా? మొదటివారివలన సాహిత్యాభావమున లాభములేదు. రెండవవారు గొప్పవారే కాని యాంధ్రత్వ మెఱిఁగి చెప్పలేరు. మన కిది యనుభవమే. మూఁడవవారు నాలవవా రుపకరింతురుకదా? ఆంధ్రాంధ్రు లాయిద్దఱలో శ్రేష్ఠులు. వారియభిప్రాయము బాహుళ్యమునుయోగ్యతనుబట్టి యుపాదేయ మగును. వారియభిప్రాయమును 'యుక్తిచే' ననుభవముచే (పెద్దలవాక్యములచేఁ బూర్వలాక్షణికపండితులు) సాధితము గావలయును. అప్పుడు విశ్వసింపవచ్చును. పామరవాఙ్మయము పుట్టిన లాభ మేమి?

ఇప్పుడు మనదేశములోఁ బామరవాఙ్మయము లేదా? లేకేమి? పామరుల కుండవలసినంత లేదు. కారణము సులభసాధనము భాషావిషయము లేకపోవుట కాదు. లోపము లన్నియు దీనివలన వచ్చినవనుట తగదు. చిన్నపిల్లలతోఁ జెప్పెడికారణము లవి. చిన్నమ్మి వేళ కన్నము తినక తల్లి యెంత పిలిచినను రాలేదు. అప్పుడు చిన్నమ్మి తల్లి "చిన్నమ్మీరావే" అనిపిలిచెను. చిన్నమ్మి నప్పుడొకచీమ కఱచెను. ఏడ్చుచువచ్చి తల్లితోఁ జెప్పెను. తల్లి విని "అమ్మా! చూసేవా వేళపట్టున బువ్వతినకపోతే చీమలు దోమలు కరుస్తాయమ్మా దా బువ్వతినీ" అని యనును. ఆతల్లి బిడ్డలవాక్యములలోఁ గారణకార్యములకు సంబంధము సరిగ లేకున్నను దల్లియొక్క సదుద్దేశము పూర్తమయ్యెను. అట్లే పెద్ద లనుచున్నారు. పామరులు పామరులే కదా? వారిబుద్ధి యేప్రొద్దును గేవలజ్ఞానేతరవిషయమున స్వార్థమునఁ బ్రవర్తించును.

పంచాంగము పామరులయిండ్లఁ నున్నట్లు తదితరగ్రంథము లుండవు. మఱియు దమ్మిడి వెలగల్గి చాలఁ బుటలు గలగ్రంథము (విషయమాత్త్రీయభాష యైనఁ జాలు) లుండునట్లు నాల్గణాలువెలగల 'యారోగ్యదర్శిని, యుండదు. కొందఱి కాశ, దారిద్ర్యమును గలవు. ఇట్టి వెన్నియో కారణము లున్నవి. మఱియు సాధారణముగఁ బండితులగ్రంథములు చాలభాగము పామరగృహీతమై యగుచున్నవి. పూర్వు లక్కారణముననే యొకసామెతను గూడఁ బల్కిరి. "పండితాః మూర్ఖజీవినః" అని. సత్యముగూడ నంతియే. పామరుల పామరత్వము తొలఁగించుటకుఁ బండితవాక్ష చును గావలయును. పురాణకథలు మున్నగునవి లేవా ? అంతమాత్రమే పామరులభాషగో వ్రాయవచ్చును. శాస్త్రములు, దర్శనములు, స్మృతులు, లోనగునవి యెల్ల నేభాషలోఁ జెప్పినను వ్యుత్పన్నులే గ్రహింపవలయును. పామరులకు సుబోధకముగ నుండుటకుఁ గొన్నివిధముల గ్రంథములు గలవు, మఱియుఁ గల్పింపవచ్చును దానికిఁ బామరభాష యక్కఱలేదు. బాలురకు బోధింపఁదలఁచిన బాలభాష యక్కఱలేదు. సర్వసామాన్యముగ మాటాడుభాష కావలయు నన్నను నదియు ననుపపడదు. ప్రతిదేశమునను నాంగ్లభాష గలదు సర్వసామాన్యముగ నాంధ్రదేశమున నాంధ్రులు (శిష్టులన్నవారును) ఆంగ్లత్రిలింగముల నాడుదురు కావున నాంగ్లత్రిలింగభాషాగ్రంథము లుండవలయునా ? ముస్ముందు హిందీసామాన్యభాష గానున్నది. దానికి సిద్ధము కావలయును. "మంచి ఫ్రెండుషిప్పు సంపాదించాలంటే ఇమ్మొరాలిటీ లేని కాండక్టు బాగుండాలి" ఇత్యాదిగ గ్రంథములు వ్రాయవలయును. అన్యదేశ్యములు లేవా! యట్లే యాంగ్లమును వాడవచ్చును. అని యందురా ? రాస్తు, రవర, బదులు, బిడారు, ఇత్యాదిపదములు సురూపములయిన ట్లాంగ్లపదములును గానిం డప్పు డట్లే దేశము చేయును. ఇంగ్లీషునేర్చిన యాంధ్రులకుఁ గా దందురా ? అన్నను బ్రయోజనము లేదు. ఆంగ్ల ముపయోగింతురు. ఉపయోగింపనివా రున్నఁ బరిమితినామ సర్వనామములతో భాషాదేవికి నామము పెట్టెదరు. అట్లే వ్రాయవలయునా? ఏది మనకాదర్శమై నిలుచును ? పిమ్మట వాక్యమరయుదము. "మాట్లాడడము తమ ఎదుటివారికోసమున్నూ వ్రాయడము దూరమువారికోసమున్నూ తమకోసమున్నూ కూడాగలదు." అనిరి. అవును. కాని యెదుటివారితో మాటాడునప్పుడు క్రమభంగమును పదభ్రంశతను, స్వరవైశద్యనిరాదరణమును సంభవించును.

(సశేషము)

# కచటతపలు.

కో. వేం. కృష్ణమాచార్యులుగారు, (ఉభయభాషాప్రవీణ ఏ)

---

ఆర్యులనాగరకత సనాతనము. వారలయాశయములు నాచారములును సనాతనములే. వ్యావహారికభాష తప్ప గ్రాంథికభాషయు సనాతనమే. వైదికభాషకును లౌకికభాషకు నత్యంతభేద ముండినను వ్యాకరణనియమము లేర్పడినతరువాత సూత్రకర్తలకాలమున భాష యెట్లుండెనో నేఁటికి నట్టులే యున్నది. ఇట్టులే యాంధ్రభాషయుఁ బ్రథమానుశాసకుండును గావ్యకర్తయు నగు నన్నపార్యునికాలమున నేరూపమున నుండెనో నేఁటికి నట్టులే యున్నది. ఆధునికులలోఁ గూడ నేకొందఱో తప్పఁ గవు లందఱును నన్నపార్యాదులకావ్యభాషను విమర్శించుచు, విమర్శఫల మగుసపూర్వజ్ఞానమును దమ గ్రంథరచనమున వినియోగించుచున్నారు. ఆధునికులే గాక తిక్కనాదిసత్కవులు నిట్టులే యని,-

క. ఆమూఁడుపర్వములలో, నామాన్యుఁడనుడువు తెనుఁగులరసికోనికృతుల్
తా మురచించిరి తిక్కసు, ధీమణి మొదలైనతొంటి తెనుఁగుకవీంద్రుల్ (పీఠిక 47)

అప్పకవియు వచించియున్నాఁడు.

ఆధునికు లగునాంధ్రభాషాతత్త్వవిమర్శకులఁ జిన్నయసూరి చాల పట్టు భాషాశోధన మొనర్చి చాలవఱకు నన్నయభట్టీయమున కభిన్నముగ నుండుట నెఱింగి తన బాలవ్యాకరణమును సంభవించినంతవఱకు నన్నయభట్టీయమునకు భావాంధ్రీకరణముగ రచించెను. ఈ బాలవ్యాకరణమున సంజ్ఞాపరిచ్ఛేదమున

'కచటతపలు పరుషంబు లని గజడదబలు సరళంబు
లని చెప్పంబడు' (౫) ననుచున్నాఁడు.

ఈసూత్రము నన్నయభట్టీయమునందలి 'కచటతపాః పరుషాఖ్యా గజడదబాస్తు సరళాః' అనుసూత్రమున కాంధ్రీకరణము. ఈసంజ్ఞ చతుర్విధాంధ్రభాషాసాధారణము కావుననే యహోబలపతి 'స్థిరా ఇతరే' యను పైసూత్రవ్యాఖ్యానమున 'శాస్త్ర మిదం సంజ్ఞావిధాయకం శుద్ధాంధ్రపదానా మేవేతి నియంతుం నశక్యతే, సామాన్యప్రవృత్తత్వాత్ ప్రయోగవ్యాకోపచ్చ తేన శబ్దప్రయోగప్రాప్తానాం పాదీనామపి సంగ్రహః' అని సాధారణ్యమును

తెలుపుచున్నాఁడు. సూరికూడ 'ఇతరములగు హల్లులు స్థిరములు (౬) అను సూత్రమున వర్గద్వితీయాదులఁ బరిగణించి పైయాశయమునే స్థిరపఱుచుచున్నాఁడు. పారకులు వైకృత (సంస్కృతసమేతర) మున వర్గద్వితీయాదులు కలవని సాహసించి "ఋౠఌౡ" ఇత్యాది (సంజ్ఞా ౪) సూత్రమును విస్మరింపఁజాలరుగదా!

ఆద్యవ్యాకరణమున సంజ్ఞలవిషయమునఁ గార్గ్య కాలయధోద్దేశములను రెండుపక్షము లుండినను 'పూర్వత్రాసిద్ధ' మిత్యాద్యధికారసూత్రములు లేని మనయీ యాంధ్రవ్యాకరణమున ఫలభేదమును గల్పింపఁజాలవు. కావున "ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళము లగు" సంధి ౧౬ (పరుషాన్ ద్రుతప్రకృతికాత్సరళాః స్యుః) అను మొదలగు సూత్రములఁ బరుషపదముచేఁ దత్సంజ్ఞాసంజ్ఞితము లగుకచటతప లుపస్థితము లయి పూచెను గలువలు మొదలగురూపములు సిద్ధించును రూపములు సిద్ధించుటయు నన్నయభట్టాదుల ప్రయోగము లట్లుండె ననుటయే. ఈసూత్రవృత్తిలో సూరి 'నెగడెను + తమములు=నెగడెను దమములు, మొగిడెను + పద్మము = మొగిడెను బద్మ' మని యుదాహరించియున్నాఁడు. ఈయుదాహరణములఁబట్టి కూడఁ బరుషాదిసంజ్ఞ సాధారణ మని సూరి నన్నపార్యులయాశయ మైనట్లు నిర్ణయింపవచ్చును.

విషయ మిట్లుండఁగా బారనంది రామశాస్త్రిగారు ఆంధ్రశబ్దచింతామణి కుద్యోతిని యనువ్యాఖ్యను రచింపుచుఁ దమవ్యాఖ్యానమున నెద్దియో యొకయపూర్వాశయ ముండుటావశ్యక మనునూహతో "ఇవి సంజ్ఞాకార్యములు గావున నాసంజ్ఞలున్నచోట్లనే యగును గాని లేనిచోట్లఁ గావు. తత్సమములలోఁ బరుషము లుండవు గావున నచ్చట సరళాదేశము లేదు........ ........................................ ఉ వా. నన్నయభట్టారకుఁడు ఆది ౧ ఆ ౨౧ తరలము. గురుపద్యవిద్యకు నాద్య, ౪౬ క. పన్పర్వంబులు. సభా ౧ ఆ ౧౭౩ చ. గిరివ్రజమన్పురము ౨ ఆ ౩౧౫ క. సభాపర్వంబునకథ, అనుచోట్లఁ జేయకయు ఆది ౧ ఆ ౨౨ వ ఏఁబాద్రు, ఏఁబది, యీమొదలగుచోట్లఁ జేసియుఁ దన యభిప్రాయమును దెలిపియున్నాఁడు. ఇట్లే సోమయాజియును భీష్మపర్వమున వ్యాసప్రార్థనమున- ప్రాంశుపయోదనీల అనుచోటను సరళాదేశంబు చేయలేదు. అచ్చట * గురుని + పద్యవిద్యకు, ప్రాంశుని + పయోదనీలతనుభాసితు

* గురుని= గురున్. ప్రాంశుని= ప్రాంశున్- చూ. తప్పొప్పులపట్టిక.

అని కాని యవి సమస్తపదములు కావు. వారు వ్యర్థవిశేషములఁ బెట్టినవారు కారు. ఇటీవలివారు క్రమక్రమమున ప్రకృతులను వికృతులుగాఁ జేయుచు వ్రాసినవ్రాఁతలలోఁ గృతికర్తలపాఠములు ప్రాయికముగా ఖిలము లగుచున్నవి, అచట 'విరమో మహతాం లుక్చ స్యాత్' అనువక్ష్యమాణసూత్రముచే ద్వితీయైకవచన మగువిభక్తికమునకు లోపము రాగా గురు ప్రాంశు అనురూపములు నిలుచును. బయోంద, బింగాంశు, త్రిదశవందితుని ఇత్యాదులలో సరళాదేశపాఠములు కృతికర్తలవి కావనుటకు నిదర్శనములు ? (44 పుట.) అని వ్రాయుచున్నారు. పాఠకులు, గురు + పద్యవిద్యకు సభాపర్వంబున + కథ యనునవి భిన్నపదములై సరళము లన్న నేమి సమస్తపదము లన్న నేమి యవి ప్రశ్నింపకుందురుగాక ! శాస్త్రిలవారు వికృతులుగాని ప్రకృతులనే సంపాదించి యుదాహరించి యున్నారు, మన కోకరామబాణమునుఁ బ్రయోగించి యున్నారు. రామశాస్త్రిగారిబాణ మిది రామబాణమే. నన్నయాదుల ప్రయోగము లెల్లున్నను బ్రమాదముచే నైనన సరళాదేశము నెక్కడా నైనఁ జేయని శ్రీవారి నియమాసక్తిని మాత్రము ప్రశంసింపక తీరదు.

శాస్త్రులవారు, అట్లేసోమయాజియును భీష్మపర్వమున వ్యాసప్రార్థనము న...... ...సరళాదేశమును జేయలే దనుచున్నారు. ఈయపూర్వనియమము వ్యాసప్రార్థనమున (మిగిలినచోట్లఁ జేయఁబడిన సరళాదేశములు కృతికర్తలవి కావని చెప్పియున్నారు) నేల చేసిరో తెలియకున్నది. లేక వారిభారతభాగము నంతయు నిట్లే చేసి "భీష్ము నాజిం గబళించి పాండవులు జృంభితవిక్రమలీలఁబొల్చుటక్, (భీష్మ)పీఁడె వచ్చెం గుంతీసుతమధ్యముండు సమరస్థేమాభిరామాకృతిక్ (విరా) ఇత్యాదులకిఁ గప్రాసము నట్లు లేచజపబాది ప్రాసముల వాడె నని యందమా ? శాస్త్రులవారు సోమయాజి కగాదిప్రాసములవాఁడె నన నంగీకరింతు రేమో ?

కానిసాంప్రతికపరుషములకు గజడదబాదేశము శాసనముల గూడఁ బెక్కుచోట్లఁ గానంబడుచున్నది చూడుఁడు, ఓపిలిసిద్ధి కొణిదెన శిలాశాసనమున,

ఉ ఆకరిబాల్పునాభి దలితాబ్జమునం † ద్దుదయించె బ్రహ్మ సం
ప్రీతిగ నావిరించికి మరీచి జనించె మరీచి కన్వయ

† సంయుక్తాక్షరమునకు ముందున్న బిందువును బూర్ణముగను స్వవర్గపంచమసంయుక్తమును అసంయుక్తబిందుపూర్వమును నర్ధబిందువుగా గ్రహించికొనునది.

ఖ్యాతుండు పుట్టెఁ గస్యపుండు గస్యపుండను ముని కుద్భవించెఁ జో
కాతతరమ్యమూర్తి గమలాప్తుఁడు సూర్యుండు వంశకర్తయై.

క. దర్దిజగనొబ్బగండఁడు, గండరగండఁడు వీరఖణిబెజ్జన యు
ద్దండుండుం దాం బనుముర్వర, గండగండడు ధార నిలిపెం గటకములోనను

వనపతియొక్క దీర్ఘాసిశాసనమున (చూ: రాజరాజనరేంద్రపట్టాభి షేకసంచిక పుట 54).

సీ దీవియ పెట్టెం బద్మావతియును [నా]
క్షోణీనశశులు గలయంతకును ముదమున

ఇంతయేల! నన్నచోడ్యుని కాలమునాటి ద్రాక్షారామము దలి సోమల దేవిశిలాశాసనముననే,

ఆ. వె. సకలవసు[మతీ]శమకుటలసద్ర[త్న], కిరణరుచివిరాజి చరణుఁడాయెన
† కూంతుసరియె పోల్పం ‡ గాంతలెంకు, నిజభుజప్రధాని[బె]జయితదేవని,

అనియుఁగలదు.

శాసనాదుల యాధారము లిట్లున్నవి నూతనాశేయముకు బ్రకటించు నప్పుడు శాస్త్రులవారు తప్పక యెద్దియో ప్రమాణము నుదాహరించు టావశ్యకము. కాని పరుషసంజ్ఞయే లేక యాకార్య మెట్లు సిద్ధించును? "సారము తిం గవీంద్రులు" ఇచట కవీంద్రులు గవీంద్రులా? వింటిం బురాణముల్ "పురాణము బురాణమా? ఇట్లే ఎల్లెడలను ప్రకృతివికృతిభేదము, విద్వదవిద్వద్భేదము లేక యెల్లకవులును జేయుచునే యున్నారు భట్టుఁగారియభిప్రాయము వికృతిసంజ్ఞాకార్యములు వికృతియందే కాని ప్రకృతిభాషలోఁ జేయరాదన్నట్లు వారుఁదోఁచుచున్నది. వాఁడుపీతాంబరుఁడు, వీఁడుసక్రపాణి, మాతావితరలు మున్నగునవి యశాస్త్రీయములు గాని సాధువులు కావని తలంచెదను. అయినను సహృదయు లగువిద్వాంసులు విచారించుటకుఁ దెలిపితిని గాని శుష్కవివాదమునకొఱకుఁగాదు" అను టావశ్యకముగదా?

---

† ఇచటఁ బాదవ్యత్యయము కలదు. నిజభుజప్రధాని బెజయితదేవని కూఁతుసరియె పోల్పఁ గాంతలెంకు అని పఠింపఁదగు—

‡ పోల్పంగాంత అనుచెడ ముద్రణలో 'పోల్పగాంత' యనికలదు. కాని గ్రుతమునీఁదని కచటతపలు గజడదబ లగు నన్న నియమ మప్పటికి స్థిరమై లేఖకులకుఁ దెలిసినదిమయుగ నుండెను. ఉదా.........పోల్పంగాంత. (3 ర) అని వివరింపఁబడుటచే 'పోల్పంగాంత యని యీఁబడినది.

శ్రీయుత చిలుకూరి నారాయణరావు, ఎం. ఏ. గారు కూడ భారతాంధ్రభాషాలక్షణమున (చూ. రా. ప. సం. పుట 41) పరుషములకు సంధియందుఁ గలుగు మార్పులఁ గూర్చి భారతరచనాకాలమున నెట్లుండెనో చెప్పుటకు వీలులేదు ఈవిషయమున నన్నయకు దగ్గఱనున్న వైయాకరణులే ప్రమాణమనుచున్నారు దీని కేమి హేతువో ?

ప్రకృతాంశమునకు వత్తము, నన్నయకుఁ బూర్వమునను బరమునను సమకాలమునను గూడ సంస్కృతాసంస్కృతసాధారణము లీపరుషాదిసంజ్ఞ లని శాసనాద్యాధారము లున్నను ఉండుఁగాక ! నన్నయ వ్యాకరణమున వీనిని విశేషాకారముగ వ్యవహరింపరాదా ? స్వకృతి నట్లు ప్రయోగింపరాదా ? యను సంశయమును విమర్శింతము.

నన్నయభట్టీయమునఁ బరుషపదోపస్థితికై ఏతే తే పదములు ప్రయోగింపఁబడినవి అందు 'గసడదవాః స్యుః ప్రథమామాత్రాదాత్త్వాస్తదోర్ద్వయై వేతే' యను సూత్రమున 'వేతే' యను పదముచేఁ బరుషపదమను వదింపఁబడినది. ఆవలి సూత్రమున 'నవికృతిశబ్దాత్పరతః సాంస్కృతికానాం భవన్తి గసడదవాః' అనువాని లో 'సాంస్కృతికానాం = సంస్కృతశబ్దాదిగతానాం పరుషాణా' మని గసడదవాదేశము నిషేధింపఁబడినది. సాంస్కృతిక కచటతపల కీసంజ్ఞ లేకున్న నిషేధ మనుచితము గదా !

శాస్త్రులవారీసూత్రవ్యాఖ్యలో 'మూలకారుఁడు పరుషాణాం అనక సాంస్కృతికానా మని శబ్దపరముగ నే చెప్పినాఁడనిరి. ఈశబ్దపర మన నర్థమేమి ? వ్యాఖ్యాతలు మూలకారునాశయమును వివరించుట గాని సర్వత్ర యవ్యభిచారిగా స్వాశయమునే మూలకారునాశయ మనుట గాని యుచితము. వ్రాయసకాండ్ర దూషించుటమాత్ర మనుచితము.

తాను నేను పదంబులును ద్రుతప్రకృతికములే, వానిపై కచటతపలకును గజడదబ లాదేశముగ వచ్చును (చూ పై దుడిజగనొబ్బగండఁ డను పద్యములోని తాఁబమునువ్వర)

విమర్శకులు కొందఱు నన్నయభట్టీయమున 'గసడదవ' యనుసూత్రపర్యుదాసమునుబట్టి యవి రావనియుఁ బ్రాప్తిలేమి గజడదబలు రావనియుఁ గావునఁ గచటతపలు స్వరూపముననే యుండు ననియు సంధుల కుపష్టంభముగా 'నచ పర్యుదాసస్య తామజెప్పె, నేనుజదివితి నితిరూపద్వయ

సంపాదన ఏవ ఉపక్షీణశక్తికత్వ మితి వాచ్యం, తాదృశప్రయోగస్య కుత్రచిదప్యభావా' త్తను నహోబలపండితీయము, నుదాహరణముగ విరాటపర్వములోని,

క. నీచెప్పినపెద్దలు ద్రో, ణాచార్యులు మున్నుగాఁగ నని కొల్లని వా
రైచన్న వారలం గొని, యేఁ చక్కం బెట్ట వాఁడనే పాండవులన్.

అనుపద్యము నిచ్చుచున్నారు వీరిమతమున శల్యపర్వములోని,

క. కవదొనలును గాండీవము, నవలనిడం బరుపు ముందఱరదము డిగుమే
ను విడప డిగియెద శుభకర, మవు నివ్విధ మిట్లు సేయుమనుచు నతండున్.

అనుపద్యమున నేను విడప యనుటయే యుచిత మనియుఁ బూర్వలాక్షణిక కవులకు వపప్రాస మిష్ట మనియుఁ గావుననే యాదిపర్వములోని 'అవసరజ్ఞుండయి' యనునక్షరలోని కపిలగడ్డంబు నిత్యాదిప్రయోగంబులు గలవనియుఁ దెలుపుచున్నారు.

మఱికొందఱు నేనువిడప సాధువేయనియుఁ దాను నేనుపదములు ద్రుత ప్రకృతులు కావనియు గసడదవలే వికల్పముగ నగు ననియు ననుచున్నారు.

తత్త్వవిమర్శకులు వైకల్పికమతమును బర్యుదాస ముండుటచే గ్రహింపఁజాలరు నిత్యముగ స్వస్వరూపమున నుండు ననువిషయమును "ఏఁగినియ మికిఁ దగని ఘోరార్తియొనర్చినవాఁడ" (రాఘవపాండవీయము ౧౫) నిత్యాది ప్రయోగము లుండుటచే ననుచితము లే. అహోబలపండితీయపుఁ బైపంక్తులు ముద్రణలోని స్ఖాలిత్యములు సాదేశమునకుఁ బర్యుదాససూత్రకథితమై యుండ జాదేశవిషయ మెటనుండి వచ్చినది 'సలోలోశ్చ' యను సూత్రాహోబలపతి "నచత్ర పరుషేషు వికల్పోభిమతః, తానుసెప్ప నిత్యాదిరూపస్య ప్రయోగాభావా దితి చేన్నైవ' మనునెడ సాదేశము లేదనుట దీని కుపష్టంభకము కానఁ బైపంక్తుల తాను చెప్పె, నేను చదివితి ననుస్వత్వపాఠమే యుచితము. 'వారలం గొని యేచక్కఁ బెట్టువాఁడనే" యను పాఠమే యగ్రాహ్యము. మొదటి ఏవకార మవధారణార్థకము.

'నేనువిడప,' § 'నందువోయె' 'నెందువోయిగొని' యిత్యాదుల వా

§ (అ + అందుక్) అందుక్ (ఈ + ఇందుక్) ఇందుక్, (ఏ + అందుక్) ఎందుక్ అనునవి సప్తమీవిభక్తిప్రతిరూపకావ్యయములు. నన్నయమతముఁ గూడ 'అన్యేద్రుతప్రకృతయః' యను సూత్రముచే ద్రుతప్రకృతు లని గ్రహింప దగును.

దేశము శ్లేషలోఁ గూడ వబలకుఁ గలయభేదోపపత్తిక్రృతము అనఁగా గజడ దబ గసడదవలలోఁ జాదేశజస లేవిభిన్నములు_ వప్రాసము భారతకవుల కెన్నఁడు నిష్టము కాదు. అక్కఱలోను వకారమే పాఠ్యము. సూరిపాఠము గమనించునది.

సరళ యనుపేర బాలవ్యాకరణముపై నారచించు వ్యాఖ్యలోని కొన్నియంశముల నిందు వివరించితిని. ఇం దనౌచిత్య మున్న సూరిమతము ననుసరించి విబుధులు నిరూపింతురుగాత !

---

# రెండు చాటుపద్యములు.

—( కోట భాస్కరరావుగారు )—

---

చ. రణరణతాలతాలయవిరాజివిరాజితపైకపైక జృం
భణభణనీయనీ ! యనితమానిత ! మానితభూరిభూరి మా
ర్గణగణసార ! సారమధు కైరవకైరవమిత్రమిత్ర ! నీ
గుణగణమారఁ, మార ! విఁగోలల గోలల నేయ నాయమా ? ౧

దీనికి స్వర్గీయ బ్రహ్మశ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రిగారి వ్యాఖ్యానము:—(మదనునిగూర్చి విరహిణీవాక్యము.)

రణరణతా= రణరణధ్వనితోఁ గూడిన, లతాలయ= తీవయిండ్లయందలి, వి, రాజి= పక్షిసముదాయముచే, విరాజిత= ప్రకాశింపఁజేయఁబడిన, పైక (ప+ఏక)= అమృతమువలె ముఖ్యమైన, పైక= కోకిలసముదాయముయొక్క, జృంభణ= అతిశయముతోఁగూడిన, భణనీయ= వాక్యములను, నీ= పొందించువాఁడా ! అనిత= కూడుకొనని, మానిత= మర్యాదకలవాఁడా ! (మర్యాదలేనివాఁడా ! యని భావము.) మానిత= పూజ్యమైనట్టి, భూ= (కళా) స్థానములనుండి, రి= జాఱుచున్నటువంటి, భూరి= గొప్పవైన, మార్గణ= బాణములయొక్క, గణసార= సముదాయబలము కలవాఁడా !, సార= బలవత్తరమైన, మధు= తేనెలకు, కైర= కీరములసమూహమునకు, వ=మందమారుతమునకు, కైరవమిత్ర=చంద్రునకు, మిత్ర= స్నేహితుఁడయినవాఁడా !, నీగుణగణము= నీయొక్క సుగుణపుంజము, ఆరక= ఒప్పునట్లుగా, మార!=ఓమన్మథా!,

విరిగోలలన్ (విరి+కోలల) పూములుగల చే, గోలలన్= బాలలను, ఏయన్= కొట్టుట (కు) నాయమా ?= న్యాయమా ? (న్యాయముగాదని భావము.)

నైఘంటికాధారములు

వి:- విశ్చక్షుసి వ్యోమ్నివాతే పరమాత్మని పక్షిణి (నానార్థరత్నమాలా) ప:- పః పుమాన్ పవనే శైలే ప్రకాశే కౌస్తుభేక్షణే, శుభలగ్నేథపంక్లీబే హేమ్నిపః పాత్రపానయోః (నా. నా) స్త్రీలింగే త్వంబుధారాయాం సుధాయాం సమ్మతౌచపా (నానా) భూ.- స్థానభూమ్యోస్తు భూస్త్రీయాం (నానా) ర:- రశబ్దస్తు ప్రవేశయే (నానా) వ - వః పుమాన్ సాత్త్వికే వాయౌ సంయమే వరుణేస్మరే (నానా)

క. కమలాకరకమలాకర, కమలాకరకమలకమల ! కమలాకరమై
కమలాకరకమలాకర, కమలాకరమైనకొలను ! గనిరాసుదతుల్. ౨

దీనికి స్వర్గీయ బ్రహ్మశ్రీ అల్లమరాజు సుబ్రహ్మణ్యకవిగారి వ్యాఖ్యానము:—(సరోవరవర్ణనము.)

ఆసుదతుల్= ఆస్త్రీలు, కమలా= లక్ష్మియొక్క, కరకమల= హస్తపద్మములు, ఆకర= నివాసముగాఁగల, కమల= సహస్రదళపద్మములయొక్క, అ= గౌరవమును, కర= చేయుచున్న, కమల= శోభగల, కమల= జలములకు, కమలాకరమై= సముద్రమువంటిదై, కమలా= ఉత్తమస్త్రీలయొక్క, కరకమల= హస్తములవంటి యెఱ్ఱదామరలయొక్క, ఆకర= అత్యంతకాంతులయొక్క, కమలాకరమైన= సంపదలకు నిక్షేపమైయున్న, కొలను గనిరి= సరస్సునుజూచిరి.

నైఘంటికాధారములు.

కమలా:-కమలం ఛురికాదీనాం హేమ్నాస్యై శ్చిత్రిలాజినే। క్లోమ్న్యౌషధేరుణాబ్జేపి కమలా శ్రీవరస్త్రియో (నానా) కమలమ్.-ఆప స్త్రీ భూమ్నివార్వారి సలిలం కమలం జలమ్ (అమర) అ:- అకారో బ్రహ్మవిష్ణ్వీశ కమఠేష్వంగణే రణే। గౌరవేంతఃపురే హేతౌ భూషణే ఘ్రావుమేజ్యయోః (నానా) ఆ:-ఆకారస్తు పదే భావే పరితాపే పితామహే (నానా) కర.-కరో వర్షోపలే పాణౌ శుండాయాం కిరణే బలౌ (నానా)

ఆస్త్రీలు లక్ష్మీదేవిచేతిలోని తామరలవంటి తామరలు గలిగి పిల్లాలమై నట్టియు, నుత్తమస్త్రీల హస్తములవంటి యెఱ్ఱదామరల కాంతిసంపదలకు నిక్షేపమైనట్టియు నొకానొక సరస్సును జూచిరని భావము.

# ఆంధ్రపండితరాయశతకము.

— సత్యవోలు సోమసుందరకవిప్రణీతము —

## భృంగము.

శ్లో. అళి రసా నళినీకులవల్లభః కమలినీహృది కేళికృతాదరః
విధివశా త్పరదేశ ముపాగతః కుటజపుష్పరసం బహుమన్యతే.

క. నళినీకులవల్లభుఁడు క, మలినీకులచిద్విలాసమహితాదరుఁ డీ
యళి పరదేశమునను విధి,కలనం గుటజమకరందకాంక్షఁ గొనెఁగదా!

శ్లో. ప్రబంధనం పద్మవనే నిశాయాం మాతంగదానే మదకర్ణతాళైః
స్వప్రాణభంగః ఖలు చంపకేస్మి న్సర్వత్ర దుఃఖం భ్రమరస్య లోకే.

క. వనజవనమ్మున నిసి బం, ధన మగు గజదానమునను దగ శ్రుతియుగతా
డనమును జంపకమున జీ,వనహానియె భ్రమరమునకు వంతగు సంతన్.

శ్లో. అపసర మధుకర దూరం పరిమళబహుళేపి కేతకీకుసుమే
ఇహ నహి మధులాభ స్తే భవతి పరం ధూళిధూసరం గాత్రమ్, ౩

క. పరిమళమిళితం బనుచును, జొరకు సుమీ! కేతకీకుసుమమునకు నళీ!
విరి తేనె దొరక దదిగా, కరుదుగఁ బుప్పొడులు దనువు నంతట గుప్పున్.

శ్లో. దృష్ట్వా హృష్టోఽభవ దళి రసా చిత్రసంస్థేచ పద్మే
వర్ణం రూపం కిమితి కిమితి వ్యాహర న్నాజగామ
నాస్మి న్గంధో నచ మధుకణో నాస్తి తత్సౌకుమార్యం
ఘూర్ణన్ ఘూర్ణ న్నవనతముఖో వ్రీడయా నిర్జగామ. ౪

చ. పలుమఱుఁ జిత్రసంకలితపంకజకాంతవిశేషరూపముల్
గలయఁగఁ జూచి మోద మెదఁ గ్రమ్మఁగఁ దుమ్మెద ఝమ్మటంచుఁ దా
వలగొని యామృదుత్వము సువాసనయున్ మకరంద మందునం
గలుగమి సిగ్గుచేఁ దనముఖం బటువంచి చనెన్ ధ్వనించుచున్.

శ్లో. యే వర్ధితాః కరికపోలమదేన భృంగాః
ప్రోత్ఫుల్లపంకజరజస్సురభీకృతాంగాః
తే సాంప్రతం ప్రతిదినం గమయంతి కాలం
నింబేషు చార్కకుసుమేషు చ దైవయోగాత్. ౫

చ. సమదకరీంద్రగండవిలసన్మదబృందవివర్ధితంబులుం
గమలపరాగసౌరభవికారశుభాంగము లైనభృంగముల్

శ్రమునగాని యీ యెడఁ జెవిధివశంబునఁ గాలముఁ బుచ్చు నిచ్చ శీ
ర్షములను వంచి నింబముల సారెకు జిల్లెడుఁబువ్వులందునన్.

శ్లో. మధూకే మార్ద్వీకం పిబసి శతపత్త్రే భ్రమసే
మధూళీపాళీభి ర్మధుప సహకారే విహరసే
వసంతే వాసంతీమధుమధుర మశ్నాసి బహుశో
దురావేశో యం తే తదపి కుటజే యద్విహరసే. ౭

చ. అరయ మధూకమార్ద్వీకము నాని తళీ! సుమధూళిపాళిచే
సరసిజ మందుఁ గ్రీడలను సల్పితి వాసహకారమందు సా
దరమతి నాడి తామని సుదారత మాధవికామరందమున్
మఱిమఱిఁ గ్రోలె దైన గిరిమల్లిక నంటుట మౌఢ్యమే కదా!

శ్లో. పీత మత్ర మధు యాపితా క్షపా భృంగ సర్వ మచిరేణ విస్మృతమ్
హీయమానసుషమాం హిమాగమే పద్మినీం యదిహ నావలోకసే

క. అళి! లలితమధువుఁ గ్రోలుచుఁ, గలకాలము రాత్రులిచటఁ గడపితి విపుడా
తలఁ పెద మఱచితొ మంచున, నిలునుట రహిఁజెడిన పద్మినిని గనవు బళీ!

శ్లో. గళితాని మధూని సర్వతః ప్రవికీర్ణాని దళాని మారుతైః
అధునాపి నహంత మాధవీం మధుపైతా మిహా నావలంబసే. ౮

క. గళితము లయ్యెను మధువులు, దళములు నెయ్యెడలమారుతమునఁ జెదరె నీ
వల మాధవి నిపుడైననుఁ, గలయుట మాను టదిలేదు గదరా! మధుపా!

శ్లో. చంచరీకచతురోసి చంద్రికావైభవే కుముదినీం నిషేవసే
భాస్కరే జయతి పుష్కరే కరై రున్మిషన్నవదళే నురజ్యసి. ౯

క. దినకరకిరణోన్మేషము,గాని మనునెడ వనజమునకుఁ గువలయపతి రా
కను వెలయునెడలఁగలువకుఁ, జనిమనెదు మధుప్రతుండ! జతురుఁడవుబళీ.

శ్లో. మరందలోభా చ్చ మిళిందమాలా ఖేజేంబుజం సూర్యకరై ర్విభిన్నమ్
హా హంత నాళీక మిదం దురంతః ప్రాలేయపాళీ ముకుళీచకార. ౧౦

క. దినకరకరవికచాంబుజ,మును మధువునకై మిళిందములు చేరఁగ న
వ్వనజంబునె ముకుళింపం, గనుజేసెను నయ్యొ మంచుగమి వింత గదా.

శ్లో. అమరతరుకుసుమసౌరభసేవనసంపూర్ణసకలకామస్య ౧౧
పుష్పాంతరసే వేయం భ్రమరస్య విడంబనా మహతీ. ౧౧

క. సురతరువరసుమసౌరభ, పరిసేవనపూర్ణసకలవాంఛితుఁడై శ్రీ
కరుఁ డగుభ్రమరునకు సుమాం,తరసేవవిడంబనముగదా ధారుణిలోన్.

శ్లో. యావ దేనం నజానాతి పారిజాతం మధువ్రతః
తావ ద్భ్రమణమే వాస్య కుంజే కుంజే ద్రుమే ద్రుమే. ౧౨

గీ. సరససౌరభమకరందజాత మైన, పారిజాతంబు నెంతలోఁ బడయకుండు
నంతవఱకుసుభ్రమరంబుభ్రాంతిఁదిసుగు, నెల్లకుజముల యెడఁబొదరిండ్లకడను

శ్లో. పురందరపురే పురా రుచిరకాననే నాదనే
నిపీయ మధురం మధు ప్రకటితారవో సోంభవేత్
ప్రశుష్కగళతాలుకో గళితను జులాం [illegible]
స ఏవ మధుగో ధునా బదరి [illegible] ౧౩

చ. [illegible] రహి [illegible] దొ [illegible]
విహితమరందబిందువులు వ్యక్తము గ్రో [illegible]
మహితమిళింద మియ్యెడల మంజునినాదవిహీనకంఠముఁ
బహుతరశుష్కతాలువుగఁ బొల్పడె హా! బదరీరసాప్తికై.

శ్లో. గంధాఢ్యా సౌ జగతి విదితా కేతకీ స్వర్ణ [illegible]
పద్మభ్రాంత్యా రసిక మధుకః పుష [illegible] ధే [illegible]
[illegible] ధీ [illegible]

చ. స [illegible] సను [illegible]
సరసిజము [illegible]
దు రసికభృంగ [illegible] సు బధూ [illegible] ము [illegible] ల [illegible]
చిరిగెను ముండ్లు దాఁక యిటు చిందఱవందఱఁ జెంది కుంద సు
స్థిరమతి నిల్వలే దచటఁ జేరఁగలే దెటకైన మిత్రుఁడా.

శ్లో. నిపీవతు శిరీషకే చరతువా కదంబే చిరం
సముత్పతతు పంకజే కురవకే కరోతు స్థితిమ్
దినం నయతు కుందకే నను రసాల కాలక్రమాత్
న విస్మరతి కేవలం తవగుణా నసౌ షట్పదః. ౧౫

చ. వెరవుగఁ గాలరీతి నొకవేళ శిరీషములం జరించినన్
సరసిజమందు వ్రాలినను జారుకదంబముల న్నటించినం
గురవకమందు నిల్చినను గుందమునందు దినంబుఁ బుచ్చినన్
మఱవదు నీదుసద్గుణసమాజము షట్పద మోరసాలమా!

శ్లో. మలినేపి రాగపూర్ణాం వికసితవదనా మనల్పజల్పేపి
త్వయి చపలేపి చ సరసాం భ్రమర కథం వా సరోజినీం త్యజసి. ౧౬

చ. మలినుఁడవైనఁ గాని మది మానక రాగమునే వహించుఁ జా
పలమును నీవు దాల్చినను బాయక బల్పరసత్వమూనుఁ గే
వలముగ నీవు జల్పగతి బాటిలినన్ వికచాననాభయా
లలితసరోజినిం గడఁ జలంబున రోసితి వేల భృంగమా.

శ్లో. భృంగః క్షుధాతురపి కింశుక విభ్రమేణ
వ్యాజృంభమాణశుకచంచుపుటం ప్రవిష్టః
ఆశాం విహాయ మధునోపయనై స్సనుత్రై
ర్నిర్గంధ మిచ్ఛతి పరం పరితప్యమానః. ౧౭

చ. ఒకతఱి కింశుకభ్రమత నొంది క్షుధాతురమౌ మిళిందమా
ప్రకటితజృంభమాణశుకభాసురచంచుపుటంబు సొచ్చి వా
రక కడుఁగుందుఁ జెంది మకరందపరత్వము డింది వింతుగా
సకలనిజాంగసంగతి వెస న్గను చేరఁగఁ గోరె సారెకున్.

శ్లో. చర స్వనాంతే నవమంజరీషు న షట్పదో గంధఫలీ మజిస్రత్
సా కిం న రమ్యా స చ కిం న రంతా బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా

గీ. మహితవనమధ్యమున మంజుమంజరులను
గనుఁ జరించుచు మధుపంబు గంధఫలిని
గొన దదియు రమ్య గాదొ తానును రమింప
నదియొ కేవల మది యీశ్వరాజ్ఞ గాదె.

చాతకము.

శ్లో. వృథా ముధా ధావసి చాతక త్వం నాయం ఘనః కింతు కరీ మదాంధః
న త్వాదృశేభ్యో విదదాతి దానం మాతంగదానం మధుపేభ్య ఏవ ౧౮

గీ చాతకమ! వట్టివృథగాఁగఁ జనఁగవలదు
ఘనుఁడు గాఁడితఁ డున్మత్తకరివరుండు
పొసగ మీబోట్లకును దాన మొసఁగఁ డయ్యొ
మహిని మాతంగదానంబు మధుపతతికె.

శ్లో. రే రే చాతక సావధానమనసా మిత్ర క్షణం శ్రూయతా
మంభోదా గగనే వసంతి బహవ స్సర్వేపి నైకక్రమాః

కేచి ద్వృష్టిభి రార్ద్రయంతి ధరణీం కేచి ద్వృథా గర్జ్యతే
యం యం పశ్యసి తస్య తస్య పురతో మాబ్రూహి దీనం వచః. ౨౦

చ. వినుమిఁక సావధానముగ పీరులఁ జాతకమా! మదుక్తి నీ
ఘనమున మింట బల్మొగులు గన్పడ నన్నియు నేకరీతులై
తనరవు కొన్ని గర్జిలు వృథాగతిమై మఱికొన్ని వృష్టిచే
తను దగఁ గాంచునన్నిటిని దాత లటంచును వేఁడఁబోకుమా.

పిచ్చుక.

శ్లో. గిళితగరళకంఠ శ్శంకరో నీలకంఠః ప్రబలతరవిషాశీ బర్హిణో నీలకంఠః
అజిరతృణవిసర్పత్కీటదర్పాపహారీ కలయసి కలవింకత్వంచ భో నీలకంఠః.

చ. గరళము కంఠమం దణఁచి కాతరలోకము నెంచి పెంచు శం
కరుఁడును నీలకంఠుఁడె దగ న్విషవత్ఫణిభోజి కేకియున్
ధరణిని నీలకంఠుడె ప్రతాపముఁ జూపుచు గడ్డిఁ బుర్వులన్
వెరపఱ మెక్కి నిక్కు కలవింకము దా నొకనీలకంఠమే!

కాకి.

శ్లో. కరోతు కరట శ్శబ్దం సర్వదా ప్రాంగణే వసన్
నశృణోతి బుధః ప్రీత్యా శృణోతి పికభాషితమ్. ౨౧

క. ధర మాలకాకి వాకిట, మొఱిగినఁ జెవి యొగ్గి వినఁడు బుధజనుఁ డెపుడుం
దరువుకడ నుండి నుడివిన, సరసపికారవము వినుచు సంతసపడఁడే

శ్లో. విధిరేవ విశేషగర్హణీయో కరట త్వం రటక స్తవాపరాధః
సహకారతరౌ చకార యస్తే సహవాసం సరళేన కోకిలేన. ౨౩

క. కేకలు వేయుట దోషము, కాకీ! నీకేమి విధియె కడునింద్యుఁ డగున్
కోకిలతో సహవాసము, నీకెపుడు రసాలమందు నెఱపుటచేతన్.

శ్లో. నీలంవపుర్వహతు చుంబతు సత్ఫలాని రమ్యేషు సంచరతు చూతవనాంతరేషు
పుంస్కోకిలస్య చరితాని కరోతు నామ కాకః కలస్వనవిధౌ నను కాకఏవ.

చ. అతిలలితామ్రకాననములందుఁ జరించిన మంచిపండులన్
సతతము మెక్కినన్ మలినసంగతి నల్లనిరూపు దాల్చినం
గుతుకముతోఁ జరిత్రములఁ గోకిలఁ బోలిన నాకలస్వనో
ద్గతసుధఁ జిల్కఁ బల్కుతఱిఁ గాకము గాకము గాక మానునే.

శ్లో. ప్రత్యంగణం ప్రతితరు ప్రతివారితీరం
కాకా శ్చరంతి చలచంచుపుటా రటంతి

నో యాంతి తృప్తి మథ పండితపుండరీక
మండే చరన్నపి న తుష్యతి రాజహంసః. ౨౫

చ. వరుసఁగ నెల్లమ్రాఁకులను బ్రాపుల వాకిళులన్ వలత్తృషా
కరమతి ముక్కుసాఁచుకొని కాకులయూఁకలు గూయుచున్ సదా
తిరిగియుఁ దృప్తి జెందవలదివ్యమరాళము తమ్మితూండ్లనే
గొఱికి భుజించి తుష్టిగొనుఁ గూరిమిమీఱఁగ సారెసారెకున్.

శ్లో. కిం కేకీవ శిఖండమండితతను శ్వారీవ కిం సుస్వరః
కిం వా హంత కపోతబాలపికవ ర్ణ్నాన్నుతా స్పందతి
కిం వా హంస ఇ వా గమందధవళః కీర వా రః
కాకః కేన గుణేన కాంచనమయే సంస్థాపితః పంజరే ౨౬

చ. కరము మయూరమున్ బలె శిఖండకమండితమూర్తియో మృదు
స్వరయుత మేమొ శారివలె బాలపికంబువలెన్ సుధారసో
త్కరకలకంఠమో ధవళకాంతియుతంబొ మరాళమున్ బలెన్
వరగుణకీరమున్ బలెను బారకమో యలవాయసంబు సు
స్థిరముగ నేల నిల్పఁబడె దివ్యసణికాంచనపంజరంబునన్.

శ్లో.

శ్లో. రేరే కోకిల మా భజ మౌనం కించి దుదంచయ పంచమరాగమ్
నోచే త్వా మిహ కో జానీతే కాకకదంబకపిహితే చూతే. ౨౭

క. ఇంచుక పంచమరాగ ము,దంచితగతి నింపు మిచట నటుగాకను ని
న్నెంచుచు నెవఁడు గ్రహించును,మించెడు వాయసగణాక్రమితచూతమునన్.

శ్లో. ధ్యాయ న్నంజనతోయబుద్బుదకణప్రాయం స్వయం మస్తకం
పశ్య న్వాయసకూటకోటిఘటితత్రోటీపుటం వాయసమ్
నస్థాతుం న పలాయితుం న చలితుం నో స్ఖలితుం మీలితుం
నో మర్తుం నచ జీవితుం నభవతి త్రాసాకులః కోకిలః. ౨౮

ఉ. కాటుకనీటిబుగ్గవలెఁ గన్పడునాత్మశిరంబు గాంచిబల్
గాటపు నిన్పకాఱువలెఁ గన్పడు వాయసనాసఁ జూచియున్
నీటుగఁ గోకిలం బచట నిల్వఁగలే దెట కేగలేదు దాఁ
మోటుగఁ జూడలేదు గనుమూయఁగలేదు చలింపలేదు మైఁ
బాటిలుప్రాణముల్ గనదు బాయదు భీతిఁ జలించునక్కటా.

శ్లో. సంత్యజ్య కోకిలశిశో మధురప్రవాళం మాకందబృందమళిపోతమిళత్ప్రసూనమ్
నింబే తు తిక్తహృదయే బలిభుక్కులాఢ్యే మౌనేన తిష్ఠసి యదీహ వదాశు కార్యమ్

చ. ధర మధురప్రవాళము సదాసుమిళిందమిళత్ప్రసూనమౌ
సరసరసాలభూజము వెసన్విడి యాపలుగాకిమూఁకతో
వఱలుచుఁ దిక్తదుష్టహృదయవాసితమౌ నలవేఁపచెట్టుపై
స్థిరముగ మౌనవృత్తిని వసించితి వేటికిరా! పికార్భకా!

శ్లో. వపుర్మలిన మీదృశం తదపి పుష్ట మేతత్పరై
శ్శకుంత బత సంతతం శకునిభి ర్వనే ధావసి
క్వవా వద గరుత్మతా మధుర మీదృశం శిక్షితం
నిషించసి సుధాయుత శ్రవణయో రిమాం శృణ్వతః.　　౩౦

చ. తను వతినైల్యయుక్తమును దత్తనువుం బరపుష్ట మెంతయున్
వనముల సంతతంబు నలపక్షులఁగూడి చరించుచుంటి వై
నను వినువారివీనుల కనారతతృప్తి వహింపఁ బల్కె దే
మని వినుతింతుఁ గోకిలమ! మచ్చిక నెచ్చట నేశకుంత మీ
ఘనసుధఁ జిల్కు పల్కులను గౌరవ మొందగఁ దెల్పెఁ దెల్పుమా.

చిలుక.

శ్లో. ఫలవతి పిచుమందే మందబుద్ధే కథంవా
స్వనసి మధురవాణీం వ్యర్థయన్ రాజకీర!
అతిపరుషరవాణాం వాయసానాం నివాసే
కుసుమితసహకారప్రాంతభాగం విహాయ.　　౩౧

చ. సురుచిరపుష్పపల్లవితచూతముఁ జూతమటంచు నెంచ కా
పరుషరవాంచితంబు లగువాయసముల్ గలనింబభూజ మి
త్తఱి ఫలియింపఁగా నటకుఁ దద్దయుఁ జేరి నుతించుచుంటి నీ
వరమృదువాక్యవైఖరిని వ్యర్థముసేయుచు రాజకీరమా.

శ్లో. ఉచ్చైశ్చేషతరుః ఫలంచ పృథులం దృష్ట్వా ప్రహృష్టశ్శుక
శ్శాలిం చాస్య గతం విహాయ నిభృతం తన్నారికేళం గతః
తత్రారుహ్య బుభుక్షితేన మనసా యత్నః కృతో భేదనే
హ్యాశా తస్య న కేవలం విగళితా చంచుశ్చ చూర్ణీకృతా.　　౩౨

చ. తెలియక పెద్దమ్రాకు మిది తీరుగ దీసిఫలంబు గొప్పదై
వెలయు నటంచుఁ గీర మతివేడుకఁ గూడెడు శాలిమానికొ
బ్బరిపయిఁ జేరి తత్ఫలము వాకొని చీల్పఁగ నెంచునంతఁ గే
వలముఁ దదాశమాత్రమె విభంగముగాదు ముఖాగ్రముం జెడెన్.

శ్లో. నిఖిలేషు విహంగేషు హంత స్వచ్ఛందచారిషు
శుకపంజరబంధస్తే మధురాణాం గిరాం ఫలమ్. ౩౩

క. వరసర్వవిహంగములున్, మెఱయుచు స్వేచ్ఛానుసారముగ నేగఁగఁ బం
జరబంధము నీకిది తగ, వర మధురమృదూక్తులకును ఫలమో శుకమా.

శ్లో. సుభాషితం సురూపత్వం వాచాలత్వం సుశీలతా
ఏతత్కీరకిశోరస్య వ్యర్థ మాఖుభుజః పురః. ౩౪

క. కీరకిశోరమ నకుఁగల, సారసుభాషితసురూపసౌశీల్యములుం
జారువచోమాధుర్యము, నారయఁగా మిగుల వ్యర్థ మగుఁ బిల్లికడన్.

రాజహంస.

శ్లో. భుక్తా మృణాళపటలీ భవతా నిపీతా న్యంబూని యత్ర నళినాని నిషేవితాని
రేరాజహంస వద తస్య సరోవరస్య కృత్యేన కేన భవితాసి కృతోపకారః

చ. తరగల నోలలాడితివి ద్రావితి నీరము లెల్ల మక్కువన్
మెఱువగు తమ్మితూండ్లుగొని మెక్కితి పద్మము లెక్కి లొక్కి తా
సరససరోవరంబునకు సన్నుతి మీఱఁగ రాజహంసమా
కర మనురక్తి నేమి యుపకార మొనర్చితొ మాకుఁ దెల్పుమా.

శ్లో. అస్తి యద్యపి సర్వత్ర నీరం నీరజమండితమ్
తథాపి న మరాళస్య మానసం మానసం వినా. ౩౬

క. నీరజమండలమండిత, నీరము లెల్లెడలఁ గలవు నిజ మటులగుఁగా
కారాజహంస మానస, మారయ మానసమునంద యనురక్తి గనున్.

పిల్లి.

శ్లో. మా గర్వ ముద్వహ బిడాల మహీపతీనా
మంతఃపురం మణిమయం నిలయం మమేతి
పట్టాభిషేకసమయే పృథివీపతీనాం
బాహ్యస్థితస్య కలభస్య తు మండనశ్రీః. ౩౭

# బాలవ్యాకరణము.

—చంద్రాభట్ల రామమూర్తిగారు.—

సంజ్ఞాపరిచ్ఛేదములో “సంస్కృతసమంబులం దికారాంతము లయినశబ్దముల యుపధాచజలు బహువచనంబు పరం బగునపుడు దంత్యము లగు” (సూత్రము ౧౦)

“ఇవి దప్ప సంస్కృతసమంబులందు దంత్యచజలు లే వని తాత్పర్యము. అర్చి- అర్చులు. రోచి- రోచులు. వీచి- వీచులు. రాజి- రాజులు. వాజి- వాజులు. మఱియు రాజుశబ్దం బొక్కటి దంత్యయుక్తంబు కానంబడియెడి” అని యున్నది.

దీనింబట్టి రాజుశబ్దము తత్సమమునను గూడ దంత్యయుక్త మని రూఢి యగుచున్నది. అట్లగునేని శ్లేషకావ్య మగురాఘవపాండవీయమందలి “అకట పాండురాజయశ మెన్నవైతి” అను గీతపద్యపాదమునఁ గల జకారముగతి యేమి? పాండవార్థమున “పాండురాజయశ మెన్నవైతి” అని విడఁదీయునపుడు పాండురాజపదము సంబోధనప్రథమైకవచనాంతమై దంత్యజకారయుక్తంబు కావలసివచ్చును. రాఘవార్థమం దన్ననో “పాండుర అజయశ మెన్నవైతి” అని విడఁదీయునపుడు సిద్ధసమాసగత మైనయజశబ్దము తాలవ్యజకారయుక్తంబు కావలసివచ్చును. ఇట్టిచో నొకయర్థమున దంత్యమైనట్టియు వేఱొకయర్థమునఁ దాలవ్య మైనట్టియు జకారము నేకపారమున సరిగా నుచ్చరించు టెట్లు? అది దుర్ఘటము. కావున సంబోధనాంత మైనప్పుడు కూడ రాజశబ్దమును దాలవ్యముగానే యుచ్చరించుట సముచితము.

ప్రకృతిశబ్దములందుఁ దాలవ్యములుగాను వికృతిశబ్దములందు దంత్యములుగాను మంచ ఘంజరాదు లగుకొన్నిశబ్దములలోని చజలు కానఁబడుచున్నవి. వాని నీక్రింద నుదాహరించుచున్నాను.

| ప్రకృతి-తాలవ్యము. | వికృతి-దంత్యము. |
|---|---|
| మంచము. | మంచము. |
| కాంచనము. | కాంచనము. |
| జగము. | జగము. |
| ఘంజరము. | పంజరము. |

“వలరాజుసూడు జక్కులతేనిచెలికాఁడు” అని రాజుశబ్దమాంధ్రనామసంగ్రహమునం దాచ్ఛికముగానే వాడఁబడియున్నది. పాండుశబ్దముతో సమ

సించిన రాజశబ్దము తత్సమముకాక తప్పదు గదా?

తత్సమతద్భవశబ్దముల రెంటియందును గలరాజశబ్దములోని జకారము దంత్యమే యనుటకంటెఁ దత్సమ మైనప్పుడు తాలవ్య మనియుఁ దద్భవ మైనప్పుడు దంత్య మనియు నిర్ణయించుట యర్హ మని నాతలంపు

"యరలవలు లఘువు లని యలఘువు లని ద్వివిధంబులగు" (సూత్రము ౧౮) "హరియతఁడు- ఇత్యాదులం దాగమయకారము లఘువు. తక్కిన యకార మలఘువు" అని యున్నది

దీనింబట్టి హరి + అతఁడు-హరియతఁ డని వ్యాకరణమువలన వచ్చిన యాగమయకారము లఘువని తేలుచున్నది. అనఁగా హరి + అతఁడు = హరి అతఁడని కలుపుగా నుచ్చరింపవలసిన స్థలమున అకారమునకు వ్యాకరణనియమమున యకార మాగమమైనందున హరియతఁ డని లఘూచ్చారణము కలదయ్యెను. అందు నీయకారము లఘువనియు నిట్లుచ్చారణసౌకర్యార్థము రామింజేసి కాయ చాయ మొదలగు శబ్దములయందలి సహజయకార మలఘు వనియుఁగూడఁ దేలుచున్నది. వకారవిషయమునఁ గూడ నిట్టి యభిప్రాయమే. ఇక్కడ లఘ్వలఘువులైన యకారవకారములకు వ్రాఁతయందు నుచ్చారణమునందును భిన్నరూపధ్వనులు లేవు.

"యవ" లకు నడిమినున్న "రల" ల కన్ననో యచ్చారణభేదమును రూపభేదమును లఘ్వలఘుభావముఁ జెప్పఁబడియున్నది. కాన వానిని మిగిలి సహల్లులవలెనే వర్ణాంతరములుగానే యాలోచింపవలెను, గాని, లఘ్వలఘుభేదములు గలవానినిగా నాలోచింపరాదు.

ఈయభిప్రాయ ముండుటచేతనే కాఁబోలు "వర్ణసమామ్నాయమునందలి ళకారము వర్ణాంతరము గాని యలఘుళకారము గా దని యెఱుంగునది" దనివివరింపఁబడినది.

మఱియు ళకారము వర్ణాంతర మని వ్రాయఁబడినప్పుడు శకటరేఫము వర్ణసమామ్నాయమునుండి తద్గ్రంథమున నేలవిడువఁబడవలెను.

దీని నంతనుబట్టి విచారింపఁగా బాలవ్యాకరణమున బండిఱాను విడిచి తెనుఁగునకు వర్ణములు ముప్పదియా అని వ్రాయుట సముచితముగా దనియు శకటరేఫమును గూడఁ జేర్చి ముప్పదియే దని వ్రాయు టుచిత మనియు లఘ్వలఘుభేదము "యవల"లకె గాని యాంధ్రమున "రల"లకు లేదనియుఁ దోఁచుచున్నది. పండితు లీవిషయములఁ జర్చింతురు గాక. సందేహములను దెల్పినందుకు నన్ను మన్నింతురుగాక.

# గ్రంథస్వీకారము.

ఈ క్రిందిమూఁడు గ్రంథములు, గంజాముజిల్లా, సోంపేట, పంచానన గ్రంథమాలనుండి వెలువడినవచనకావ్యములు. ఈ గ్రంథమాలయొక్క యుద్దేశము, శిల్పసంబంధము లగు గ్రంథములు ప్రకటించి ఆంధ్రశిల్పసారస్వతము వికసింపఁజేయుట. 2 శైల్పికసంఘభావాభివృద్ధి నెలకొల్పు నైతిహాసికపౌరాణికయాథార్థిక ప్రబంధములను బ్రచురించుట 3 శిల్పసంఘ సమోత్కృష్టత సాంఘికులును సాంఘికేతరులును గ్రహించునట్లు చేయుటయునై యున్నది.

(1) మయసభ —(మొదటికుసుమము) దీనిని కేశవపట్టణము వేంకటరత్నసూరిగారు విరచించిరి ఈ గ్రంథము, పౌరాణికప్రసిద్ధుఁడును మహాశిల్పియు నగుమయుని పరమోత్కృష్టశిల్పనిర్మాణమును గూర్చినదై యున్నది. భారతసభాపర్వము ననుసరించి యిందలికథ నవలాప్రణాళికను నిర్మింపఁబడినది. ఇందు 100 పుటలలో 13 ప్రకరణములు గలవు. అందందు యవ్వనవతి, వార్ధిక్య (మేరిముసుఁగు) మొదలగు చేతిపొరపాట్లు గలవు. భాష శైలి మంచివి. సర్వత్రశకటరేఫములు నర్ధానుస్వారముల భేదముం బాటింపలేదు. వెల రు 0—8—0.

(3) స్వాంతరాతికోట:—అను పేరుగల అయస్కాంతదుర్గము, ప్రథమఖండము- (ద్వితీయకుసుమము) గ్రంథకర్త స్వయంసహాయవాది. కథ రామాయణమందు వాల్మీకిచే వర్ణింపఁబడిన మయునియొక్క గిరిదుర్గము నాధారపఱచుకొని గ్రంథకర్తగారీకథను గల్పించి నవలగా వ్రాసియున్నారు రెండవఖండమునఁ జోళాధిపులతో నీదుర్గమునకుఁ గలసంధమును వివరించి వ్రాసియున్నారు "ఈకథయందుఁ గర్త స్వయంసహాయమువలన నెంతటిఘనాభివృద్ధికయిననొకసంఘము రాఁగల దని సాధించుట యాదర్శముగఁ బెట్టుకొని నట్లు తోచెడిని కథయందును భాషయందును లోపము లనేకము లున్నను పాఠకుల మనసు రంజిలజేసె మహత్తరమగు సద్భావముల నెన్నియేని గలిగించగల దని మానమ్మకము" అని సంపాదకీయనివేదనయం దున్నదానిని మేము నంగీకరించుచున్నాము. వెల రు 1—0—0.

(3) చిత్రవధ:—(తృతీయకుసుమము) గ్రంథకర్త బలభద్ర కోటయ్యగారు. ఈనవలయొక్క ముఖ్యాభిప్రాయము "విశ్వబ్రాహ్మణులు పూర్వము

విద్యాధనగౌరవములయందు దసమానులనియు, దాటరాని యాపదలకుఁ జిక్కి యధోగతికిఁ బోయి రనియు, మఱలఁ బూర్వోన్నత్యమునకుఁ బాటుపడి శీఘ్రముగ ఫలము నొందఁజాలక హాస్యాస్పదు లగుచున్నా రనియుఁ" దెలిసికొనుట- 93 పుటలలో 17 ప్రకరణములు గల యిందలి కథలో అమరసింహుఁడు తనయమరనిఘంటువులో విశ్వబ్రాహ్మణులను హీనకులులనుగాఁ జెప్పినకారణముననే యతఁ డెన్నియుక్తులు పన్నినను నెగ్గలేక చివరకుఁ జిత్రవధ గావింపఁబడెనని తేలుచున్నది. ఆదినములలో నమరునంతటివాని కమరకోశమును రచించుటకు "నాకు గ్రంథమును రచించుట కవకాశము ధనమును లభించకుండునా..........." అని విచారించుటకు గారణము కనఁబడదు. కిరీటము చేయుమనిన నుప్పరితట్టచేసె- ననుట- వేసగాండ్రు వచ్చి సింహాసనముమీఁది రాజును నఱకుట, ప్రసవించునపుడు కన్నులుమూసికొన్ననుట; ఇట్టివి, యితర కథలలోఁగూడనున్నవి. వవిసత్యములో- అమరసింహునకు విశ్వబ్రాహ్మణులపై నసూయ- చోళరాజు విశ్వబ్రాహ్మణులపై వారి శిల్పశాస్త్రజ్ఞాననిపుణతం గని చూపుప్రేమ. దీనిచేత నమరసింహుని పాండిత్యమును సామర్థ్యమును గ్రహింపలేక చిత్రవధచేయుఁడని యాజ్ఞాపించుట- చిత్రవధచేసి వానికళేబరమును గుక్కలు నక్కలు తినునట్లు విడిచి విశ్వబ్రాహ్మణులు మనశ్శాంతి గావించుకొనిరనుటయుఁ జారిత్రికదృష్టిలో సత్యముగా నిలువఁబడఁజాల వేమో యనుశంక గలుగుచున్నది.అచ్చుతప్పులకంటె వ్రాఁతతప్పులు విశేషముగా నున్నవి. నాశికము, తొలిచూలాంగన, మాట్లాడెదవు, నిలచెను, ఎర్రని, ఎఱ్ఱని, రోక్షహాపము, నూత్నచందాలు, విఘడియలు, అనేకనైపులు, గ్రంథరచనానెపము, రాచకార్యము, గుడిశలు, అనేకమంది, విప్పుడు, కభురులు, నిర్లక్ష్యాకసము, నేరస్తులు అనుమున్నగునవి వానికుదాహరణములు. వెల రు 0—8—0.

(4) సుగుణశతకము:—(కవితాసమితి) పట్టిసపు శ్రీరామమూర్తిగారిచే రచియింపఁబడినది. సర్వవిధములను సుమతిశతకము ననుకరించుచున్నది తొలిపద్యములోనే- శ్రీకరివరదుని దలంచి చెవులింపొదవక, లోకులు మేలన బుధతతి మెకొను నీతులను వ్రాతు మహిలో సుగుణా- అనినారు. చెవులింపొదవక- అర్థమేమి? దుస్తుల నిచ్చియుఁ దినుబడి, వస్తువులను నిచ్చి విద్యవచ్చుట కెన్నోపుస్తకములు గొనుజనకుని, హస్తమ్ములు మోడ్చి కొల్వనగుఁజుమి సుగుణా- అనియున్నది. తండ్రిపని, దుస్తు లిచ్చి, చిఱుతిండి, పుస్తక

ములు కొనిపెట్టుటమాత్రమా! అభిప్రాయము లిచ్చినవారు కవిగారి యభిప్రాయమునకుఁ దోడుపడుటలోఁ జాల నశ్రద్ధవహించిరి. వ్రాతప్రతిమీఁదఁ జూచియు సవరణలు చెప్పరైరి. తమసమితిలోనివారే "సుమతీశతకము ననుకరించి వ్రాసినటులు కానవచ్చును""నామిత్రులగు శ్రీయుత........ఇందలి పెక్కునీతులు బాలుర నుద్దేశించి వ్రాసి రనుట స్పష్టము" అనియే తేల్చివేసిరి. మిత్రులు ముద్రణమునకు ముందే యాలోచనలు చెప్పి సవరణలు చేయించియుండినచో నింతకంటె మిన్నగ నుండియుండును. "ఇలునమ్మి ఋణమ్ముఁ జేసి యేమువనేలా" యనుటకంటెఁ గొంచెము మృదుపద ముండిన మేలు. "గుణవంతుఁ డెప్పుడేనియు, గుణహీనుని చెలిమిచేయఁ గ్రూరుం డగునా!" అనిరి. ఏలకాఁడు? ఆఱునెలలు సావాసముచేసిన వారు వీరగుదు రనిలేదా "ఫణికిఁ గలవిషముచేతఁగా మణిగుణ మెపుడైనఁ జెడునె" అని. సావాసమున్నఁ జెడుట సిద్ధము- మణియు విషము నొక్కచోట నుండవు "తలయందు విషముఫణికి" ననునది సామాన్యవాక్యము. గుణహీనుని చెలిమిచేయునాతఁడు గుణవంతుఁడా! బాలురకై చెప్పునీతులు నిస్సందేహములుగ నుండవలయును. ఇట్టివి మాదృష్టికిఁ గొన్నికనఁబడునుగాని, యీచిన్నపుస్తకము చిన్నపిల్లలకు మహోపకారము చేయుననుటకు సందేహము లేదు- రెండు మచ్చుపద్యములు—

క. గర్వము శత్రులఁగూర్చును, గర్వ మగౌరవము దెచ్చుఁగావున నెపుడుఁ
గర్వింపకు ధనమున్నను, సర్వముఁ జెడు గర్వమున్న సత్యము సుగుణా.

క. కలిగినవానికి దానము, పలు తెఱఁగులఁ జేయనేల వ్యర్థము కాదే
జలనిధికి నీరు లోటా, జలదం బందెంత కురియ సఫలమె సుగుణా.

ఈపుస్తకము వెల రు 0 2-0. విశాఖపట్టణముజిల్లా, గవరవరంపోస్టు, వరహాపురములో కరివదనాకంపెనీలోను, గ్రంథకర్తగారియొద్దను దొరకును.

(5) నిర్మలానందము:—ఇది బులుసు వేంకటరమణయ్యగారిచే రచియింపఁబడిన యైదంకములనాటకము. నిర్మల- ఆనందుఁడు- వీరిద్దఱు దంపతులు. జ్ఞానపాలుఁ డానందుని మిత్రము జ్ఞానపాలుని యుపదేశము విని యానందుఁడు- తల్లిదండ్రులను భార్యను విడిచి విరాగియై యోగివేషమున నాశ్రమమునకుఁ జనును. ఈతనియుద్దేశము పరోపకారముచేయుట- ఆయుద్దేశమెంతవఱకు నెఱవేఱెనదో తెలియరాదుగాని- "నేనిలువీడి వచ్చి చేసినకార్యముల లోఁ బరోపకారసంఘసంస్థాపనము. హిందూఅహింసాశ్రమమును రెండేశప్ప

మఱేమియును లేదు." అని (46 పుటలో) పలికెను. గాలవుఁడు మొదలైన వారు రామతీర్థములో నేమియో చేయుచున్నారన్నాఁడు గాని నాటకములో వారు కనఁబడరు. ఇల్లువిడిచి చీఁకటిలోఁబోవుచున్న యానందుని జ్ఞానపాలుఁడు చూచి "నీలోత్పలముఁబోలు నీలనేత్రంబుల బాష్పపూరితములై పరిషవిల్ల...నడిరేయి మానిరీతి నేలవచ్చితి" అని యానవాలుపట్టి యడిగినాఁడు- ఈతఁడు నామగఁడని యానందుని నిర్మల యానందభారతివేషముదాల్చి తెలిసికొన్నదిగాని- తనకుపచారముచేయుచు, దనవెంటనున్నను భార్య నానందుఁడు గుర్తుపట్టలేదట. నే నెవ్వఁడనో యెఱుఁగుదువా యని స్నేహితుఁడు మాఱువేసములోనుండి యడిగిన నీవు జ్ఞానపాలుఁడ వని చెప్పినవాఁడు, భార్యను గుర్తింపలేకపోయినాఁడు. బాలయోగియని విశ్వసించెను. "మీ వెను వెంట నే తిరుగుచుందు నిదియే నాజీవితావధి" యని యానందభారతి నాల్గవయంకము చివర నానందునితో నిష్క్రమించినది. మరల నెక్కడను నానందునితో రాలేదు. ఈలీల మహోద్ధరించితివిఁ కట్టడికొడిగట్టినను సరియే- మొదలగునవి ప్రమాదపతితములు కావచ్చును.

> చల్లనివై సుధాంశుకరజాలము లట్లు మనోహరంబులై
> సల్లలితోపదేశమున సత్పథదర్శక దీపికాత్మ్కరం
> జిల్లుచు జ్ఞానరూపసుధఁ జేకొని హృత్కుసుమమ్ముసర్వథా
> ఫుల్లముఁ జేయుచూడ్కు లవి ప్రోచుత దీనజనాళి నిచ్చలున్.

ఈనాందిపద్యములోని చూడ్కు లెవ్వరివో స్పష్టపడుటలేదు

వెల గ్రంథాలయములకు విద్యార్థులకు రు 0-6-0 ఇతరులకు 0-8 0. నెల్లిమర్ల పోష్టు, రామతీర్థములో గ్రంథకర్తగారియొద్ద దొరకును.

(6) భావప్రపంచము:—వరహాగిరి వేంకటభగీరథిగారిచే రచియింపఁబడినది ఇదిప్రథమఖండము. కవిగారు "భావప్రపంచ మను పేరున విరచింపఁబడిన ఈవచనరచనావళిలోని విషయజాలము నాస్వకీయముకాదు ఉద్దండుఁడనునొక మహావక్త స్వప్నములో ననేకపర్యాయములు అనివార్యముగా సాక్షాత్కరించి" చేసినయుపన్యాసములను "ఆయుద్దండుని శైలినే శక్తివంచన లేకుండగా ననుకరించి ప్రకటించియుంటి"నని వ్రాసియున్నారు. ఇందు హాస్యరసప్రధానములు భావపూరితములునైన 13 విషయములు గలవు. ఈ చిన్న పుస్తకము వెల రు 0-5-0. కావలసినవారికి గోదావరిజిల్లా పెద్దాపురంతాలూకా జగ్గంపేటలో వరహాగిరి బాలాత్రిపురసుందర్రావు గారియొద్దదొరకును.

---

గీ. పుట్టినప్పుడుసుత పగ లూర్పని కువల, యంబు(నేఁచెడు)నినుఁ డేగ నట్టి కాని
గొనములకుమాఱుగై కొన్న కొమరురాజు, వచ్చె ననితారకాప్రజ వఱలెఁ జదల.

సీ. రాణ సత్పుత్రప్రజారాతులు గడిదేఱ ద్విజవృత్తు లెల్లను దెంపువాఱ
జారచోరస్ఫూర్తి చాల విజృంభింప సరసులసౌఖ్యవైఖరి కృశింప
వరధర్మవిజ్ఞానవార్తలు సడలంగ ననృతాభిసంధి చయ్యన మెలంగఁ
గుముదంబుల మెలంగుకొంకు శంకను జెందఁ బరఁగి ప్రదోషంబుపటిమనంద
నంజనాచలరోచిర్నవాభ్ర కాంతి, భంజన మొనర్చు చాయ లపారములుగ
నంధకారమహాకలి యావరించె, నఖిలదిశల నరాజకం బైనయపుడు. ౧౮

ఉ. వేలుపుఱేఁడు నామఱుఁగు వేకొని యాత్మవధూటిఁ జెంద న
జ్జాలి నసూయ పుట్టఁగ విచారము సేయక భావమంచు న
న్నోలి రచించె గౌతముఁ డహో యిదె రూపము నాబలంబు లో
కాళి గనుంగొనన్వలయు నన్నగతిఁ బలసెం దమశ్ఛటల్. ౧౯

సీ. తా నొకబలియుఁడే తరణి లోకాలోకగిరిదుర్గమునఁ బడి కరము లన్ని
గలిగియు నావలెఁ గడవఁగా శక్తుఁడో మెట్టలో నారాక మెఱిఁగి నీళ్ళఁ
బడెఁ గాక పట్టరో భవ్యసున్నామగంధమున నతను బట్టెఁ దమము శక్తి
గాంచెను నారాక గననియచ్చోటనె తనకాఁకలును దాను బనికివచ్చు
నంటరానివానియందుఁ దా నసువెల్ల, దాఁచి పోయెఁ గాన దక్కెఁ దనకు
ననుచు వేగ వచ్చె నన బలునీలిమ, గప్పికొనఁగ నిరులు గప్పికొనియె.

సీ. నే ననిర్వచనీయనిజరూప మగు చనాదిత మెలంగుచుఁ దత్త్వధీ నడంచి
వెలయు నవిద్యనై మెలఁగెద మచ్ఛబలతఁ గాంచియే యాత్మ బ్రహ్మ మయ్యె
నటుగాన నాయందు నమరు కారణలక్షణం బతివ్యాప్తిదుష్టంబు గాదు
బ్రహ్మవిద్య యెటంద్రు బలవత్ప్రమాణంబు మఱి గుహాశయత బ్రహ్మంబు సేన
యఖిలమును నాదురూపంబు ననుసరించి, నిలుచునో లేదొ చూడుఁడీ నిఖిలజనము
లనెడివైఖరి రోదసు లాక్రమించి, యంధతమసంబు వఱఁగెభయంబు వెఱుఁగ.

క. ఔర తమోబల మయ్యెడ, నేరీతి వచింప శక్య మేరికి నైనన్
ధారాళతరవివేకవి, హారులకును వస్తు వరయు టరుదై తోఁచెన్. ౨౨

గీ. చంద్రతారావివాహంబు సమయ మనుచుఁ, గాలకజ్జలకారుఁ డఖండపద్మ
జాండమంజుకరండంబు నిండుకొనఁగ, నునుచు కాటుక యనను దెఘనతమంబు.

ఉ. వేళ యెఱింగి సూర్యుపయి వేళమ వచ్చుగుహాంతరాళధా
రాళతమంబువెంట గ్రహరాజహతస్మృతు లౌట వచ్చి య

వ్వేళ నినుండు పోవుటకు వేదనఁ గుందుచునుండ జ్యోతులో
నా లలిమించుఁ గప్పు పయి నల్వఁగ నొప్పు గృహప్రదీపముల్ ౨౪

క. వడి నినుఁడు చనఁగ వెంబడిఁ, బడిచనఁ దడఁబడుమఁ జిక్కి బలునిరులుగొనన్
వడి యుడిగి యచ్చటచ్చటఁ, బడియుండెనురశ్మ్ము లనఁగ భాసిలుదివియల్

చ. తలఁపఁగ శబ్దమాత్రవిదితం బగుచున్ గుణమాత్రహీనతన్
మెలఁగుచు నప్రతీతగతి మేదురసంశయవృత్తి నందుచున్
బలునసృతంబువాదములప ట్టగుచుం గరుణాప్రయత్నముం
దలకొని కుప్రబంధమతిఁ దార్కొని యుండెను లోక వృత్తతిన్. ౨౫

ఉ. రాజవియోగవేదనఁ గరంబుఁ గృశించి తమంబుఁ గాంచి ప్రా
గ్రాజనిభాస్య రాణసెడరాఁ జనుదెంచును వేగ మంచు వే
శాజలజాక్షి చెల్ప నతిలాలసమూన........దన్ముఖాం
భోజము నవ్వుపూనె ననఁ బొల్పెసఁగెం దొలితెల్వు ప్రాగ్దిశన్. ౨౬

చ. విరహిజనంబు నేఁచ నతివేగమ వచ్చు ననంగవీరుభా
సురతరకేతకీశరముసొంపున రేక, లిదర్ధచంద్రసుం
దరవిశిఖంబునా సగము, తజ్జయకారణచక్రమో యనన్
సురుచిరబింబము న్వసనఁ జూడఁగ నొప్పెను బ్రాక్కకుప్పునన్. ౨౭

—♦ చంద్రోదయవర్ణన ♦—

క. అలప్రాచి కుంకుమచ్ఛవి, నలరెడుమోమునను నీల మగుమృగనాభిం
దిలకము దిద్దె ననంగాఁ, గలువలచెలి కెంపుమేనఁ గప్పు డొప్పెన్. ౨౮

సీ. విరహిజనంబుల వేఁగింప మారుండు తెలివిఁ బెట్టిన గండదీప మనఁగఁ
గమలచక్రము లేర్పఁగడలితోఁ బొడముచు హెచ్చిసొచ్చెడువింతచిచ్చు ననఁగఁ
గుముదినిపాలింటి కొమరారు పూర్వంపు బలుతరంపుఁదపంపు ఫలమనంగఁ
గలశాబ్ధి వెడలి వెన్నెలపుల్గునిసువులం బోషించు నును వెన్నముద్ద యనఁగ
విరహిమోహాకకర కాండవిసరమండి, *తస్మరైక్షవవృత్తకోదండ మనఁగ
దండిరుచులనజాండంబు నిండుకొనఁగఁ, బండువగ వచ్చె నైందవమండలంబు.

చ. †నలువటి యంధకారవసనంబు ముసుంగిడి యున్నయద్దిశా
లలనలమేనఁ గప్పు శిథిలంబుగఁ జేయుచుఁ గప్పురంబుఁ దా

* తిస్మరైక్షవవృత్త † నలుడరి-మూ.

లలితకరంబుల న్నినిచె లాలితి మీఱ నన న్నిజచ్ఛవుల్
నలుదెసల న్మెలంగ నలినంబులసూడు వెలింగెఁ బొంగుచున్. ౩౧

చ. సరసులు స్రుక్కఁ జక్రములు సంగతి దక్క వియోగమానసం
బరుదుగఁ బొక్కఁ గల్వగమి కందము లెక్కఁ జకోరపాళికల్
శరబడి వ్రాక్క ఘూకములసంస్మృతి నిక్క ధరాళి నూష్మము
ల్పొరువడిఁ జిక్కఁ జక్కఁ గనుపట్టెను రిక్కలరేఁడు గ్రక్కునన్. ౩౨

సీ. సురలయాఁకటిచిచ్చుసోబగార్చుమేఘంబు పాంథులపాలింటిప్రళయవహ్ని
జారమలిమ్లుచోచ్చాటనమంత్రంబు హాతదృష్టిపేచకేద్ధాంజనంబు
కుముదిని నేదెసు కులదేవతామణి యురుచక్రసంతాపహుతభుగరణి
సరసజీవంజీవసంజీవనౌషధి తాపదరిద్రతాదానకర్త
తంద్రి నుబ్బించునందంపుదాఁపురంబు, పొసఁగు తమ్ములబడలికపుట్టినిల్లు
కళలు నాఱుపదింటికిఁ గాణయాచి, చెలఁగుఁ జుక్కలతెరువున సితమరీచి.

చ. హారునకు సొమ్ము కమ్ము జలజాకరపాళికిఁ జక్రవాకసం
సరణము కీడు దోడు జలజంబులసామికిఁ గైరవాటవీ
స్ఫురణము పొందు విందు సురభుక్తి(కి) భవ్యచకోరపారణా
చరణము పొంగు రంగు గని చాల వెలింగెను నింగి చెంగటన్. ౩౪

సీ. కలశపాథోరాశిగర్భసంజాతంబు ప్రాగ్దిశావసథవిభ్రాజితంబు
విమలనిజద్యోతవిశదీకృతాశంబు నభ్రంలిహాదభ్రవిభ్రమంబుఁ
గౌశికసంచారకార్యధౌరేయంబు నురుకరోద్ధూతపద్మోదయంబు
బహుళద్విజాళిసంభరణప్రవీణంబు నుపకంఠతారాళియోజితంబు
కవి నొరబడె శశభృదైరావణంబు, రుచిరతారకమార్గసగోపురంబు
భవ్యనక్షత్రవీచికాబంధురంబు, సంకుసకసద్గ్రహగ్రాహసంకులంబు. (?)౩౫

గీ. క్షీరజలరాశిదీప్తిసం(జీ)వనంబు, పంకరుహకాండఖండనపండితంబు
పక్షయుగధారి తారకావర్తచారి, రాజిలుచునుండె నవ్వేళ రాజహంస.

క. చెన్నారుచుండె వెన్నెల, మిన్నా వెన్నెలలతేట మించియొసఁగఁగా
నన్నలినజాండ మొప్పెను, సన్నపుఁ దెలికప్పురంపుసంపుటముక్రియన్.

క. చందురునివంటిబిడ్డని, పొందెడయఁగలేక పాలమున్నీ రరుదే
నిండెల్లఁ బాలు నిండెన, నందగె లోకమునఁ గుముదనాథాంశురుచుల్.

సీ. కలువలగములచొక్కపువాసనలతోడఁ గమలసంకోచంబు ఘనతగాంచె
వెన్నెలపులుఁగులచెన్నుఁదనంబులోఁ జక్రాంగఖేదంబు చాల మించెఁ
జంద్రకాంతోపలస్రవదచ్ఛవారితో విరహినేత్రాంబువు ల్విస్తరించెఁ
గాకారిముఖజంతులోకాభయంబుతో జారులమది భీతి సందడించెఁ
బుడమిచెలి మేనఁబుట్టిన భూరితాప, భరముతో నంధకారంబు పఱవఁబొచ్చె
వలులనెఱతావు సద్గుణావలులప్రోవు, నీరజంబులదాయ వెన్నెలలు గాయ.

క. లోకాలోకాంతరమున, భీకరమై యుండు తమము బెదరి గిరిగుహా
కోకహృదంతరసీమలఁ, గాక్కడఁ బాటి యుండఁగల దీవేళన్. ౧౦

క. చలివెలుఁగుచాయ తమముం, గలయన్ హరియించు ననుట గాదబ్రము కో
కులహృదయము నిది చిత్రము, తలఁపఁ దమోమయముగాఁగఁ దగ్రుచి చేసెన్.

*. అడరి తమంబు సర్వజగదాత్మకవస్తువు గ్రస్యుచుండఁగా
వడఁచెను గోవిలాసముల నత్తను మంతయు వస్తుదృష్టి చే
పడఁగ నొనర్చె సద్వ్రతతి భవ్యముదంబుధి నోలలార్చెఁ దా
నెడయఁ దుదారవిష్ణుపద మీద్విజరాజు మహాత్ముఁ డెన్నఁగన్. ౧౨

గీ. తలఁప నబ్బుర మీకళాధరునిగోవి, లాసమాధుర్యమహిమంబులబ్ధవర్ణ [గ
హృదయములుత్రప్రసక్తిగా నటులుకరఁగ, కుండుఁ దెలిగాలుగరఁగుటంకొప్పి కొనఁ

సీ. నిజగోవిలాససన్నిహితనానాపదార్థప్రపంచంబున నీప్ర మగుచు
మాధుర్యము ప్రసాదమహిమతో నెనయంగమిగులనర్థవ్యక్తి మెఱపు గొనఁగ
నసృతవాగాదిదోషాత్మకతిమిరంబు దూరింప నస్త్వాలంకారరసము
లలరారఁ జిత్రబంధాదివిశేషము ల్వాఅలఁగ శుచిరసాస్వాదిరసిక
వరకవులు మెచ్చినవరసాస్వాదమందఁ, గుకవిబృందంబుత్సహప్రకటమహిమఁ
జూడఁ జాలక స్రుక్కఁగ జోడులేని, లాలితి వెలింగె మేటి కళాధరుండు. ౧౧

చ. ...మొక్కఁ డేప్రబలునొండుగుణంబు గనంగలేక వి
స్ఫురణము దక్క లోకమున శోభిలఁజేసె గుణవ్యవస్థ దా
విరహిజనాంతరంగములఁ బెందమనుం గుముదంబులందు ని
బ్బరపురజంబుగాకరి............గిరిసత్త్వము న్పుచున్. ౧౩

క. వెన్నెలరాయుని వెన్నెల, వెన్నలపైఁ బర్వ గిరులు వృక్షము లెల్లన్
వెన్నెలజిగి గిరితరువుల, యన్నలుఁ దమ్ములు నవంగ నలరెన్ ధాత్రిన్.

మ. తొలుపక్షంబునఁ దారకల్ విరళతం దు..........తంతకుం
జలిని గ్గక్కుడుచాయఁ జేకొన మఱి సంధిల్లె నిత్తెల్వి తా
రలు మేటుల్ మగఁ డేగుదేరఁ బరమార్గ్రింబైన భావంబునం
జెలువొప్పన్నెదురేగి *తత్తనువు నాశ్లేషించె నెంతేనియున్. ౮౭
గీ. మృదులశీతలకరముల......చుఁ జేసి, కువలయానంద మొనరించెఁ గ్రూరరాజు
కువలయానంద మొనరింపఁ గోరు వాఁడె, రాజనుచు నెన్నుదురు బుధరాజలెల్ల
చ. ఇనుఁడు చనంగ నందుగొని హెచ్చినరక్తత నైంద్రిఁ జెంది య
...నిన్ని శాచరుఁ డొయారమునం గర మంది నన్ను న
య్యినునిపతివ్రతం జెనక నేపునఁ జేరెడు వీఁడె జూచు టే
పని యని పద్మినీరమణి పద్మముఖంబును వాంచె గ్రక్కునన్. ౮౯
చ. సరసి తుషారరశ్మికరసంగతరశ్మితుషారశీకరో
త్కరఘనబాష్పపూరములు గ్రమ్మఁగఁ దామరమోము వంచి యం
తరతరలీనభృంగచయతారవినాదము లుప్పతిల్లఁగాఁ
బురణ దొలంగి జక్కవల పొంగక పొక్కఁగ నేడ్చె స్రుక్కుచున్. ౯౦
క. రతు లుడిగి పొంత ద్విజదం, పతు లడలఁగఁ జూచి(చూచి)పాపక్రియకున్
వెత గదుర సరసి లజ్జా, నతముఖి యై యుండె నపుడు నలువెడలంగన్ ౯౧
సీ. తనతమ్ములకు జేరఁ దలఁపఁగఁ బగవాని శరబడి తొవల సంసర్గఁ జేయ
ఖరకరుం డగునినుం డురుతీవ్రతఁ గడంగి పవలుగారించు నుత్పలవిచికిల
బంధ్యగారంబులఁ బడవేసె యుష్ణంపు మధురాన్నములు లేక మాఁడఁజేయు
నినుఁ బాఱఁదోలి చల్లనిరాజు చనుదెంచి బెడఁగుకరంబుల వెడలఁ దిగిచి
కలువపూఁబల్లెరంబులఁ గఱవుదీఱ, హితరసాన్నము గల్పింప నింపు గాఁగ
నారవస్తుతు లెసఁగంగ నారగించెఁ, దనివిమదిఁదీరఁగ మధువ్రతద్విజాళిగి౨
ఉ. చల్లనిరాజు వచ్చి కరసంగతి సేయ నినుంకు సేయఁగా
కెల్లఁ దొలంగ నంగసుఖ మెంతయుగా సుఖనిద్రఁ జెందెఁగా
కెల్లరుఁ బద్మినీరమణి మెప్పడు నెల్లను చంద్రునందు రి
క్కల్లకు మెత్తురా యని పకాపక నవ్వెఁ గుముద్వతీసతుల్. ౯౩
గీ సరసులకమిత్రుఁడగు నెచూచందమామ, యలఖరాంశుండుదమ్మేమియాదరించెఁ
గాఁకగావించిజీవనగ్రాహిగాఁగ, ననుచు నవ్వునవ్వెననఁ గల్వ లపుడు విరిసె.

* తత్తరువు.

ఉ. ఏమగవారు నామగనియింపు వహించిరి చంద్రుఁ డన్న య
న్నామము స(ర్వ)మోదఘటనం గలిగెఁ శశికంచుఁ జెప్పరే
ప్రేమను నన్నుఁ జేకొనఁగ బెట్టుగ నీరసమూని పద్మినీ
భామయ మోము మోడ్చె నని పక్కున నవ్వెను గైరవావళుల్. ౫౫

సీ. సితపక్షగతి గాంచి చెలువారి పంకజాసనభావమై ఖరిఁ జాలఁ బ్రబలి
వెన్నెల లీనెడు వెలిమేన దైవారి జిగికకప్పులు పూనుపొంక మమరి
యచ్చంపుగుణమూని లచ్చికిఁ దోడౌచు విధుసమాఖ్య జగంబు వినఁగ నలరి
తమను పోఁగొట్ట నుత్తమధర్మరీతులు సాకల్యముగఁ దెల్పఁ జాగ గలిగి
మూఁడుమూర్తులవేసంబు ముచ్చటవుల
యాకృతియు నొక్కవేళన యానుకొనుచుఁ
గాలభిద గోరి తద్వృత్త గాంచునిను
మించి దీపించు దివి మంచునించువేల్పు ౫౬

సీ. ధరణీధరోరుకందరమందిరోదారతమ మణంపమికిఁ దా నమరె నేమొ
ఛాయాపహారణధౌరేయరశ్మిచ్ఛటావాప్తి లేమిడికిఁ దా నమరె నేమొ
ద్విజరాజసంతతి* దీనత్వ మడపఁగా నేరుపులేమిడిఁ జేరె నేమొ
సరసుల నామోదసంపద నందింప బలిమిచాలమికిఁ జేపడియె నేమొ
యొకకలంకంబు నెమ్మేనఁ బ్రకటమయ్యెఁ
గళలు పదియాఱు వెలుఁగంగ మెలఁగుదొరకు
సకలసద్గుణనిధి యైనచక్కనయ్య
కొక్కదోసంబు లెక్కింప నొచ్చె మగునె. ౫౭

సీ. జారసంకల్పంబుఁ దూలింపఁగాఁ జేసి చోరుల మూలకుఁ జారఁగఁ జేసి
సన్మార్గ మెల్లను సత్ప్రకాశముచేసి పంకజావళిఁ బటాపంచ చేసి
యరిజాలములనెల్ల నండ వాయఁగఁ జేసి యాశ్రితద్విజరాజి నలరఁ జేసి
పరతమోగ్రంథుల గిరిగుహల్ సొరఁ జేసి ధర్మసంస్థాపన దనరఁ జేసి
ఖరకరుఁడు మున్ను చేసినకాఁకఁ బసి, యలరి సద్వర్గ మెల్లను మెలఁగఁ జేసి
కువలయానంద మొనరించెఁ గూర్మిఁ జేసి, యారచల్లనిరాజు దివ్యప్రకాశి.

చ. వెరవు దలిర్ప యజ్వపతి వేగ రథాంగవధూటికామనః
స్ఫురదురుహేమకుండమున భూరివియోగకృపీటయోని భా

* సంపతి-యా

సురకరకాండజాలముల శోభిలఁజేసెఁ దదుత్థధూమమే
పరఁగెను మేన నంక మయి పంకజవైరికి నెంచి చూడఁగన్. ౫౯

ఉ. అచ్చలినిగ్గువిగ్గులు రయంబున నెమ్మొయిసోఁకు కాఁకచేఁ
జిచ్చున నేఁగినట్లు చెలిచిత్తము తత్తఱమంద హెచ్చి బ
ల్వెచ్చనియూర్పుగా డ్పడర విన్నని కన్నులు విచ్చి చుర్చురన్
మచ్చరమారఁ జూచి యవమానము మీఱఁగ దూఱెఁ జంద్రునిన్. ౬౦

—♦ చంద్రోపాలంభము ♦—

ఉ. చిచ్చిదె మింట మింటఁ గనఁ జిచ్చొక టబ్బెనె చందమామయో
హెచ్చుగ నిప్పు లుప్పతిలు హేతువు గానము పచ్చివెన్నెలో
యచ్చెరువయ్యె నంగముల నంటిన మాత్రన పొక్కు లేలొకో
యచ్చెరు వేల యిట్టివిరహార్తజనంబుల కట్టు లయ్యెడున్. ౬౧

ఉ. తమ్ములకల్మికిం గనలుదాల్చుచు లోపలఁ గుంది కందు నీ
విమ్మెయిఁ బాంథకామినుల నేఁచక మానుదువే తలంపు మో
హమ్మున నిన్నుఁ గన్నకడు పా బడబాగ్నినిఁ గాలకున్నె భా
వమ్మునఁ జూడఁగా విరహవర్గము పాపమె కా నిశాచరా. ౬౨

సీ. చండాంశుకరమహాజ్వాలలలోఁ గాలి మాఁడక తక్కునే మఱియొకండు
బడబాగ్నిలోఁ బడి భస్మమై కూలక మహి వృద్ధిఁ బొందునే మఱియొకండు
కాలకూటంబు సంగతి గాంచినంతనె యసి గాకపోవునే మఱియొకండు
సైంహికేయమహోగ్రజఠరాగ్నిలోఁ బడి మఱుఁడ నేతెంచునే మఱియొకఁడు

(ఇక్కడఁ గొన్ని పద్యములు లోపించినవి.)

ఉ. అన్నను గూఁతుఁ బట్టుకొనునట్లుగఁ జేసిన దుండగీఁడు గా
కొన్ననవింటివాఁ డతనిక్రూరత యేమని యెంచుదాన నీ
*వెన్నఁగ మేనమామవు గదే గురుతల్పగు నిన్నుఁ జేయఁడే
యన్న! కళానిధీ! యతని నల్లుఁ డటంచుఁ దలంచి కూడితే. ౬౪

క. గణుతింతు రెఱులునిను భువి
గుణవంతులు ప్రకృతి వికృతిగొను నితఁ డనుచున్
గుణవృద్ధిప్రతిషేధము
లణువెఱుఁగవు సమభవంబు లందవు చంద్రా. ౬౫

* వేడుక మేనమామవు-మూ

గీ. ఆర్యు లెల్లఁ బ్రసాదమాధుర్యముఖ్య
సద్గుణాలంకృతుల కెల్ల జన్మభూమి
యితఁ డనుచు నెన్నుదురు నిన్ను నెట్లు తద్వ
యోభిదజ్ఞానకలన నింపెసఁగునుతులు. ౬౮

గీ. అసితరుచి మించు నాహాలాహాలముకంటె
వెలివెలుంగుల యీచంద్రవిషము మించు
నసితవిష మెల్ల మ్రింగెను హరుఁడు రాహు
వీని మ్రింగియు నోపక వెడలనుమిసె. ౬౯

గీ. సైంహికేయ వివేకంబు చాల కీవు, ద్విజులరా జని మ్రింగక విడిచి తేల
వీవిద్విజ*సంతతిద్రోహి వీనఁగాచె, మహిఁ బ్రవర్తిల్లె నీకుఁ దమఃపదంబు.

సీ. ఘనతమాగమములు గాంచితి వేరీతి వానియూంతరములు గాన వైతి
రహి నన్నియును బదార్థము లెట్లు దెలిపితి వ్యాప్తి నకుంఠితవడయ వైతి
వాగి నపూర్వాలోక మొందితి వేగతిఁ బ్రాభాకరచ్ఛాయఁ బడయ వైతి
పురుతమోహాతి నెట్లు లొనరంగఁజేసితి సత్ప్రకాశముఁ జేయఁజాల వైతి
కాదు తెలివికిఁ బదవిభాగంబు సేయ, వ్యాకరణవేత్తవై యెట్లు వఱలి తీవు
జగతి నెన్నఁగ నీవతిజడుఁడ వయ్యు, నహహ యెట్లు కళానిధి వైతిచంద్ర!

గీ. చంద్ర సన్మార్గవర్తి వై జరుగునీకు, సత్ప్రకాశంబు సేయుఁగఁ జనదె చెపుమ
సరవి దప్పంగఁ బలికితి సత్ప్రకాశ,మిలఁ దమోగ్రస్తునకు నెల్లు గలుగ నేర్చు.

గీ. అకట పదదర్శనమ్ము కరాగ్రమునన, యున్న దని చంద్ర యేటికి నుల్లసిలెదు
సంధివేళలఁదమము దుస్తరముగాఁగఁ, బ్రకృతిభావంబె తెలియఁగఁబడదునీకు

గీ. పంకజాతారి సంతాపపదమ వగుట, వాసికెక్కెను నీకళావత్త్వ మెన్న
నకటకట నీవు జడభావమందియుండి, యరసిచూడ మహత్త్వంబునంది తెల్లు!

గీ. మేనిది నిశాసహాయత మెలఁగె ననుచు
సామ్యవైరంబుచే బాధ సంఘటింపఁ
జనునె పద మాద్యము హరిద్ర నొనరఁ బలుక
శబ్దమాత్ర సమాయాతసమతఁ గంటె. ౭౩

గీ. †నలినబాధక గుణవద్గణంబులోన, గణన గొనలేవు ముగుదలఁ గ్రాచ నీవు
అరసి చూడంగనిది చిత్ర మయ్యె నెట్టు,లవని నిన్నుఁగళావంతుఁ డనిరిబుధులు

*సంపతి-మూ †నలినబాంధవ-మూ

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| తఱియు | స | ప్రవేశే | ప్రవేశించుట |
| తఱలు | అ | నిర్గమనే | బయలువెళ్ళుట |
| | | భయేచ | భయపడుట |
| తఱమిడు | స | భ్రామణే | గిఱగిఱఁద్రిప్పుట |
| తఱిగొను | అ | ఉద్యోగే | ఉద్యుక్తుండవుట |
| తఱియఁజొచ్చు | స | సమ్యగంతఃప్రవేశే | లెస్సగా లోను బ్రవేశించుట |
| తలఁ | స | స్మరణే | స్మరించుట |
| | | విచారేచ | విచారించుట |
| తలఁకు | అ | భయే | భయపడుట |
| తలఁగు | అ | అపసర్పణే | తొలఁగుట |
| | స | వ్యపనాశనేచ | పోఁగొట్టుట |
| తలరు | అ | శోభాయాం | శోభించుట |
| తలిర్చు | అ | పల్లవోత్పత్తౌ | పల్లవించుట |
| తలపెట్టు | స | ఆరంభే | ఆరంభించుట |
| తలపడు | అ | కార్యాతిప్రవేశే | మిక్కిలియుఁబనిలోఁ బ్రవేశించుట |
| తలపోయు<br>తలపోసికొను | స | యావద్దుఃఖావేదనే | ఉన్నదుఃఖ మంతయుఁ జెప్పుకొనుట |
| తల్లడిలు<br>తల్లడిల్లు<br>తల్లడించు<br>తల్లటించు<br>తల్లడపడు | అ | సంభ్రమే | తొట్రుపడుట |
| తళుకొత్తు | అ | ప్రకాశే | ప్రకాశించుట |
| త్రవ్వు<br>తవ్వు | స | ఖననే | ఖననముచేయుట |
| తవుడు<br>తవుడుకాడు | స | ఆమర్శనే | అంతట స్పృశించుట |
| తవులు<br>తాఁకు | స | స్పర్శే<br>ప్రాప్తౌచ | స్పృశించుట<br>పొందుట |

| ధాతువు | సంస్కృతార్థము | | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| తాఁగు<br>త్రాఁగు | స | పానే | పానముసేయుట |
| తాఁచు | స | పాదతాడనే | తన్నుట |
| తాటించు | స | తాలాద్యాదివాదనే | దవుడలు మొదలైనవానిని జప్పుడు చేయుట |
| తారు | స | నిలీయదర్శనే | పొంచుట |
| | | విహ్వాలతాయాంచ | సొలిసిపోవుట |
| తార్చు | స | ప్రాపణే | పొందించుట |
| తారసిలు<br>తారసిల్లు<br>తారసించు | అ | సన్నిధానే | సమీపించుట |
| తార్కాణించు | స | నిదర్శనే | నిదర్శనముసేయుట |
| తారుమారవు | అ | వైకల్యే | చెడిపోవుట |
| తాలు | అ | ధావనే | పరుగెత్తుట |
| | స | నిలయనే | డాఁగుట |
| | | హరణేచ | హరించుట |
| తాటించు | స | ధావనకరణె | పరుగెత్తించుట |
| తాల్చు | స | ధారణే | ధరించుట |
| | | శూర్పాదీనాంతండు లాదిషుఫలీకరణాద్య పాకరణే | చేట మొదలైనవానిచేత బియ్యము మొదలైన వానియందలి తవుడు మొదలైనది పోఁగొట్టుట |
| తాళు | స | సహనే | సహించుట |
| తాలించు<br>తాళించు | స | శాకాదిసంస్కారే | కూర మొదలైనవానికిఁ దాలింపుచేయుట |
| త్రావు | స | పనే | పానముసేయుట |
| తిగుచు | స | గ్రహణే | గ్రహించుట |
| తిట్టు | స | శాపే | శపించుట |
| తిను | స | భక్షణే | భక్షించుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| త్రిప్పు<br>తిప్పు | స | పర్యావర్తనే<br>భ్రామణే | మళ్ళించుట<br>తిరుగఁజేయుట |
| | అ | పిత్తదూషితేచ | పిత్తదూషితమగుట |
| త్రిమ్మరు | అ | సంచారే | సంచరించుట |
| తిరుచు | స | కార్పణ్యయాచనే | కార్పణ్యముగ యాచించుట |
| తిరివడు<br>తిరుగుడువడు | అ | మనఃకాలుష్యేణ<br>సంభ్రమే | మనస్సు కలఁతపొంది తొట్రుపడు<br>ట |
| తిరుగఁబడు<br>తిరగఁబడు | అ | రోషేణాభ్యుత్థానే<br>మనఃకాలుష్యే<br>పునరారంభేచ | రోషముచేత నెదిరించుట<br>మనస్సునఁ గలఁతనొందుట<br>మళ్ళి యారంభింపఁబడుట |
| తిరుగు | అ | పర్యావృత్తౌ<br>సంచారేచ | మళ్ళుట<br>సంచరించుట |
| తిఱుగు | అ | భ్రమణే | భ్రమించుట, గిఱగిఱఁ దిరిగెనని |
| తిలకించు | స | దర్శనే | చూచుట |
| తివుచు<br>తివియు | స | గ్రహణే | గ్రహించుట |
| తివురు | స | కాంక్షాయాం | కోరుట |
| తీండ్రించు | అ | ప్రకాశే | ప్రకాశించుట |
| తీయు | స | గ్రహణే<br>చందనాదిఘర్షణే<br>అపహరణే | గ్రహించుట<br>గంధము నూఱుట<br>అవతలఁబెట్టుట |
| | అ | వ్రణాదివేదనా<br>యాంచ | తీపుదీయుట |
| తీరు | అ | నాశే | నశించుట |
| తీఱు | | కార్యాంతరాభావే<br>వివాదనిష్కర్షే<br>నిష్ణాతే<br>ఋణనివృత్తౌ | వేఱుగాఁ బనిలేని దవుట<br>వివాదము నిష్కృష్ట మవుట<br>నేర్పరియవుట<br>అప్పు నివృత్తించుట |
| తీవరించు | స | త్వరాకరణే | త్వరచేయుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| త్రుంగు | అ | మృతౌ | చచ్చుట |
| | | శకలీభావేచ | తునియలవుట |
| తుటాయించు గ్రా | అ | విచ్ఛేదే | విచ్ఛిన్నమవుట |
| తుడు | స | ఆమర్శనే | తడువుట |
| | | ఆర్ద్రితాద్యపనయనేచ | తడి మొదలైనవానిని బోఁగొట్టుట |
| తునుగు | అ | శకలీభావే | తునియలవుట |
| | | సాహసేచ | సాహసించుట |
| తునుము | స | శకలీకరణే | తునియలుసేయుట |
| | | మారణేచ | చంపుట |
| తునియు | అ | శకలీభావే | తునియలవుట |
| | | సాహసే | సాహసించుట |
| | స | శకలీకరణేచ | తునియలుసేయుట |
| తుమ్ము | అ | క్షుతే | క్షుతముచేయుట |
| తురుము | స | ఫలాదిచూర్ణీకరణే | ఫలాదులు చూర్ణముచేయుట |
| తుఱుము | స | పుష్పాదిధారణే | పుష్పాదులను ధరించుట |
| తుఱుఁగలించు<br>తులకించు | అ | ప్రకాశే | ప్రకాశించుట |
| త్రుళ్లు<br>తుళ్లు | అ | గర్వే<br>కార్యాత్యుత్సాహేచ | గర్వించుట<br>పనికి మిక్కిలియుత్సాహపడుట |
| తూఁగు | అ | నిద్రాయాం | నిద్రవోవుట |
| | | తులితేచ | తూనికెయవుట |
| తూఁచు | స | తోలనే | తూనికసేయుట |
| తూఁటాడు | స | ఛిద్రకరణే | ఛిద్రములగునట్లుచేయుట |
| తూఁటుకట్టు | అ | ఛిద్రీభవనే | ఛిద్రమవుట |
| తూర్పెత్తు<br>తూర్పారఁబెట్టు | స | ధాన్యాద్యుత్క్షిప్య వాయునాతత్ర ధూళ్యాద్యపనయనే | ధాన్యాదులు పొడుగుగా నెత్తి గాలిచేత వానియందుండునట్టి దుమ్ము మొదలైనదానిని బోఁగొట్టుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| తూఱు | స | అంతఃప్రవేశే | లోపలికిఁ బ్రవేశించుట |
| తూలు | అ | లంబనే | వ్రేలుకాడుట |
| | | పిత్తాద్యున్మాదేనచలనే | పిత్తాద్యున్మాదముచేఁ గదలుట |
| | | బలహీనేచ | బలహీనుండవుట |
| తెక్కొను | స | ప్రాప్తౌ | పొందుట |
| తెగు | అ | త్రుటనే | ఛిన్నమవుట |
| | | సాహసేచ | సాహసించుట |
| తెగించు | అ | సాహసే | సాహసించుట |
| తెగుచు | స | మారణే | చంపుట |
| | | ఛేదనేచ | తెగఁదీయుట |
| తెగడు | స | నిందాయాం | నిందించుట |
| తెగటారు | అ | మృతౌ | చచ్చుట |
| తెంచు | స | ఛేదనే | ఛేదించుట |
| | అ | వైధవ్యప్రాప్తౌచ | వైధవ్యమునుబొందుట |
| తెచ్ | స | ఆనయనే | ఆనయనముసేయుట |
| తెండు | అ | నిద్రాయాం | నిద్రించుట |
| తెనిఁగించు | స | ఆంధ్రభాషయావివరణే | ఆంధ్రభాషచేత వివరించుట |
| తెప్పిఱు, తెప్పిఱులు, తెప్పఱులు, తెప్పఱ్లు | అ | స్వాస్థ్యే, ప్రమాదనివృత్తౌచ | స్వస్థుండవుట, ప్రమాదమునుబోఁగొట్టుకొనుట |
| తెమలు | అ | చలనే | కదలుట |
| తెరలు | అ | విశ్లేషే | విచ్చిపోవుట |
| | | చలనేచ | చలించుట |
| తెఱలు, తెఱ్లు, తెఱకొను | అ | ఉల్బణతాయాం, క్వథితక్షీరాదివిషయేచ | ఉల్బణమవుట, కాఁగినపాలు మొదలైనవి పైకిఁబొంగుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| తెఱ<br>తెఱు | స | కవాటపిధానాద్యుద్ఘాటనే | తలుపుమూఁత మొదలైనవానినుద్ఘాటించుట |
| తెలియు | అ | విదితే | విదితమవుట |
| తెలిసికొను | స | జ్ఞానే | ఎఱుఁగుట |
| తెలవాఱు<br>తెల్లవాఱు | అ | నిశాత్యయే<br>శ్వేతీభవనే చ | రాత్రి వేఁగుట<br>తెలుపవుట |
| తెలిఁగించు | స | ఆంధ్రభాషయావివరణే | ఆంధ్రభాషచేత వివరించుట |
| తెలతెలపోవు | అ | ముఖవైవర్ణ్యే | వివర్ణముఖుఁడవుట |
| త్రెళ్లు | అ | పతనే | పడుట |
| తేజరిలు<br>తేజరిల్లు | అ | ప్రకాశే | ప్రకాశించుట |
| తేఱ్చు<br>తేన్చు | అ | ఉద్గారే | ఉద్గారముసేయుట |
| తేరు | అ | వ్యసనాంతగమనే | కడతేరుట |
| తేఱు | అ | నిర్మలీభావే | నిర్మలమవుట |
| తేలు | అ | జలప్లవనే<br>నిష్కృష్టే చ | నీళ్ళలోఁ పయినుండుట<br>నిష్కృష్టమవుట |
| త్రొక్కు<br>తొక్కు | స | పాదనిష్పీడనే<br>మర్దనే చ | కాళ్ళతోనదుముట<br>మర్దించుట |
| తొంగు | అ | నిద్రాయాం<br>లంబనే చ | నిద్రించుట<br>వ్రేలుకాడుట |
| తొంగిచూచు | స | ముఖమాత్రం ప్రసార్యదర్శనే | మొగముమాత్రము ప్రసరింపఁజేసి చూచుట |
| తొంగుండు | అ | శయనే | శయనించుట |
| తొట్రిలు<br>తొట్రుపడు<br>తొడిఁబడు | అ | సంభ్రమే | తడఁబడుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| తొడఁగు | అ | అభిముఖాయత్తీభవనే | అభిముఖగానాయత్తుండౌట |
| | స | కవచాదిధారణే | కవచాదులుధరించుట |
| | | బాణసంధానే | బాణముసంధించుట |
| | | ఆరంభేచ | ఆరంభించుట |
| తొడుగు | స | కవచాదిధారణే | కవచాదులు ధరించుట |
| తొడరు | అ | సంభ్రమే | లొట్రపడుట |
| | స | ప్రాప్తౌ | పొందుట |
| | | స్పర్శేచ | స్పృశించుట |
| తొండాడు గ్రా | స | పునఃపునః త్వరాకరణే | మాటిమాటికిఁద్వరచేయుట |
| తొణుకు | అ | జలాదీనామవస్కందనే | నీళ్ళుచిందుట |
| తొణఁగు | స | ఆరంభే | ఆరంభించుట |
| తొన్నుండు | అ | శయనే | శయనించుట |
| తొరలు | అ | సంయోగే | కలియుట |
| తొరవడు | అ | త్వరాయాం | త్వరనుబొందుట |
| తొరగు | అ | స్రావే | నీళ్లుజాఱుట |
| తొఱఁగు | అ | విశ్లేషే | వీడుట |
| తొలఁగు / తొలుగు | స | వినాభావే | విడిచియుండుట |
| | స | యుద్ధవైముఖ్యేచ | యుద్ధమునందు విముఖుఁడౌట |
| తొలు | స | పాత్రాదీనాంజలేన శోధనే | పాత్రలుమొదలైనవానిని నీళ్ళతో శుద్ధిచేయుట |
| | | దార్వాదౌరంధ్రకరణేచ | కొయ్యమొదలైనవానియందుతొలుచుట |
| తొలుకరించు / తొల్కరించు / తొలకరించు | అ | వర్షారంభే | వర్షారంభముసేయుట |

| ధాతువు | | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|---|
| తొవ్వ | గ్రా | స | ఖననే | ఖననముసేయుట |
| తోకొను | | స | సహానయనే | వెంటఁబెట్టుకొనుట |
| తోఁగు | | అ | నిద్రాయాం | నిద్రించుట |
| తోచు | | అ | స్ఫురణే | స్ఫురించుట |
| త్రోఁచు | | స | అపనోదనే | అవలికిఁబోఁజేయుట |
| తోఁడు | | స | కూపాదిజలోద్ధరణే | బావి మొదలైనవానిలో నుండినీళ్ళు మొదలైనవి పైటికిఁ దీయుట |
| | గ్రా | | వ్యర్థబహుదానేచ | వ్యర్థముగ నిండుగనిచ్చుట |
| తోడుకొను | | అ | ఆతక్తే | పాలుపేరుట |
| | | స | సహానయనే | వెంటఁబెట్టుకొనుట |
| | | | కూపాదితోజలోద్ధరణేచ | బావి మొదలైనవానినుండి నీళ్ళు బైటికిఁ దీయుట |
| తోతెచ్ | | స | ఆనీయాగమనే | పిలుచుకవచ్చుట |
| తోతెంచు | | అ | ఆగమనే | వచ్చుట |
| త్రోపాడు | | స | నోదనే | తోయుట |
| తోము | | స | పాత్రాదిషుభస్మాదినా ఘర్షణే | పాత్రాదులయందు బూడిద మొదలైనవానిచేతఘర్షణముసేయుట |
| | | | తైలేనాంగమర్దనేచ | తైలాదులచేతదేహము చమురుట |
| త్రోయు, తోయు | | స | అపనోదనే | అవలికిఁబోఁజేయుట |
| తోలు | | స | పశ్వాదిప్రాజనే | పశ్వాదుల నావలఁ బోఁజేయుట |
| | | | ధావనకరణే | పరుగెత్తించుట |
| | | | ప్రస్థాపనేచ | పంపుట |

## ద

| | | | | |
|---|---|---|---|---|
| దక్కు | | అ | స్వవశీభావే | స్వవశమవుట |
| దక్కొను | | స | గోపనే | దాఁచుట |
| దగ్గు | | అ | కాసే | కాసముసేయుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| దంగు | అ | ముసలహతేన వ్రీహ్యాదీనాం వైతుష్యే | రోఁకంటిపోటున వడ్లు మొదలైనవి పొట్టువీడినపాట |
| దంచు | స | అవహననే | వ్రీహ్యాదులను రోఁకఁటగుమ్మట |
| దండెత్తు | అ | యుద్ధసన్నాహే | యుద్ధసన్నద్ధుండవుట |
| దద్దఱిల్లు | అ | సంభ్రమే | తొట్రుపడుట |
| దద్దురించు, దద్దరించు | అ | దద్రురోగే | దద్దుకుగలదవుట |
| దండనచేయు | అ | వృథాకాలయాపనే | వ్యర్థముగాఁ గాలముగడుపుట |
| దబాయించు గ్రా | స | తర్జనే | బెదరించుట |
| దరికొను | అ | దాహే | కాలుట |
| దళమెత్తు | అ | యుద్ధసన్నాహే | యుద్ధసన్నద్ధుండవుట |
| దాకొను | అ | సన్నిధానే | సమీపించుట |
| | | నిలీయావస్థానేచ | దాఁగియుండుట |
| దాక్కొను గ్రా | అ | నిలీయావస్థానే | దాఁగియుండుట |
| దాఁగు | అ | నిలయనే | అగపడకయుండుట |
| దాఁచు | స | గోపనే | గోపనముసేయుట |
| | | పాదాదిప్రసారణేచ | కాళ్లుమొదలైనవిచాఁపుట |
| దాపలించు, దాయు | అ | సన్నిధానే | సమీపించుట |
| దాపు | స | పాదాదిప్రసారణే | కాళ్లుదాపుట |
| ద్రాపు | స | నోదనే | త్రోయుట |
| దిగు | అ | అవతరణే | అవతరణముసేయుట |
| | | ఆవాసకరణేచ | ఆవాసముసేయుట |
| దిగాలుపడు | అ | నిశ్చేష్టతాయాం | నిశ్చేష్టుండవుట |
| దిగవేయు | స | కర్తవ్యేధ్యేతవ్యేవా మధ్యే కించిత్పరిత్యాగే | చేయవలసినదానిలోఁగాని చదువవలసినదానిలోఁగాని నడుమఁ గొంచెము విడిచిపెట్టుట |
| దిగఁదుడు | అ | దృష్టిదోషవారణాయహరిద్రాజలాదీనాంభ్రామణే | దృష్టికిదిగఁదుడుచుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| దిగఁబడు | అ | పంకాదావధోగమనే | బురద మొదలైనవానిలోఁ గ్రుంగుట |
| దిట్టపడు | అ | నిష్కర్షే | నిష్కృష్టమవుట |
| దిద్దు | స | లిఖితలిపిష్వభ్యాసాయపునర్లేఖనే | వ్రాసినవ్రాఁతలో నేర్చుటకు మరల వ్రాయుట |
| | | తిలకాదీనాం సమ్యక్కరణేచ | బొట్టు మొదలైనవానిని లెస్సగాఁ జేయుట |
| ద్రిమ్మరు | అ | సంచారే | సంచరించుట |
| దీకొను | స | కలహాభ్యుత్థానే | ఎదిరించుట |
| దీటుకొను | | సామ్యే | సరియవుట |
| దీవించు | స | ఆశీర్వాదే | ఆశీర్వాదముసేయుట |
| ద్రుంగు | అ | న్యూనతాయాం | తక్కువవుట |
| దగ్గపడు గ్రా | అ | మనోవ్యసనే | మనస్సున వ్యసనపడుట |
| దున్ను | స | కృషౌ | కృషిసేయుట |
| దుముకు | అ | ఊర్ధ్వాదధఃస్వైర పతనే | స్వేచ్ఛచేతను మీఁదినుండి క్రిందికిఁ బడుట |
| | | ఉత్ప్లుత్యపతనేచ | ఎగసిపడుట |
| దురటిల్లు | స | మనోదుఃఖే | మనస్సున దుఃఖపడుట |
| దువ్వు | స | కేశప్రసాధనే | వెండ్రుకలు నివురుట |
| | | ఆమర్శనేచ | అంతటఁ దడవుట |
| దువాళించు | అ | ప్రకాశే | ప్రకాశించుట |
| దుసికిలు | అ | స్రంసే | జాఱిపోవుట |
| దూకొను | స | అంతఃప్రవిశ్యాగమనే | లోపలికిఁజొచ్చి వచ్చుట |
| దూఁకు గ్రా | అ | ఊర్ధ్వాదధఃస్వైర పతనే | స్వేచ్ఛచేతను మీఁదినుండి క్రిందికిఁ బడుట |
| | | ఉత్ప్లుత్యపతనేచ | ఎగిసిపడుట |
| దూయు | | స్రంసే | జాఱుట |
| | | పరాభవే | పరాభవించుట |
| | | ముష్టినాశాఖాది త్వః పత్రాదికర్షణేచ | పిడికెట నారులు మొదలైనవిదూయుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| దూరు | స | అంతః ప్రవేశే | లోపలికిఁ బ్రవేశించుట |
| | | నిందాయాంచ | నిందించుట |
| ద్రెక్కొను | స | అభ్యుత్థానే | ఎదిరించుట |
| దెప్పు | స | దోషప్రత్యభిజ్ఞాపనే | తప్పులెత్తిపొడుచుట |
| దెబ్బటించు, దెబ్బడించు | స | తాడనే | కొట్టుట |
| ద్రెయ్యు | అ | ద్వైధీభావే | తెగుట |
| దెర్లించు | స | ఉష్ణానామపాంస మీకరణే | వేఁడినీళ్లుపాట్లుచేయుట |
| దేకు | అ | ఉపవిశ్యాపసరణే | కూర్చుండి జరగుట |
| దేబిరించు గ్రా | అ | కార్పణ్యయాంచనావస్థానే | కార్పణ్యయాచనచేయుచునుండుట |
| దేవు | స | హస్తేనజలలోడనే | చేయిపెట్టి నీళ్ళుకలియఁజూచుట |
| దేవురించు, దేవరించు, దేవిరించు | అ | కార్పణ్యయాంచనావస్థానే | కార్పణ్యయాచనచేయుచు నుండుట |
| దొంగిలు, దొంగిలించు | స | స్తేయే | చౌర్యముచేయుట |
| దొప్పదోఁగు | అ | మజ్జనే | మునుఁగుట |
| ద్రొబ్బు, దొబ్బు | స | పతననోదనే | పడఁద్రోయుట |
| దొరయు | అ | సామ్యే | సరియగుట |
| | | శోభాయాంచ | శోభించుట |
| దొరలు, దొర్లు | అ | పర్యుల్లుఠనే | పొర్లుట |
| | | అవాక్పతనే | తలక్రిందుగాఁబడుట |
| | | మృతౌచ | చచ్చుట |
| దొర్లుకాడు | అ | పర్యుల్లుంఠనే | పొర్లుకాడుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| దొరకొను | స | ప్రాప్తౌ | పొందుట |
| | | ఆరంభేచ | ఆరంభించుట |
| దొరుక్కొను గ్రా | స | ఆరంభే | ఆరంభింపుట |
| దొరుకు } | అ | లాభే | లభించుట |
| దొఱుకు } | | దృష్టేచ | అగపడుట |
| దోఁకు | స | ఖననవిశేషే | దోఁకుడు పాఱతోఁ ద్రవ్వుట |
| దోఁగు | అ | ఆర్ద్రీభావే | తడియుట |
| | | జానుచంక్రమణేచ | పిల్లకాయ మోఁకాళ్లతో నడచుట |
| దోఁగాడు | అ | జానుచంక్రమణే | పిల్లకాయ మోఁకాళ్లతో నడచుట |
| దోఁచు | స | బలాదపహారే | కొల్లపెట్టుట |
| దోపు | స | అవగూహనే | గుచ్చిపెట్టుట |
| దోయిలించు | అ | పానాయాంజలికరణే | త్రాగుటకై దోసిలిపట్టుట |
| దోరు | స | మృతౌ | చచ్చుట |
| | | ఏకత ఆనమనేచ | ఒఱగుట |
| దోరగిలు } | అ | ఏకత ఆనమనే | ఒఱగుట |
| దోరగిల్లు } | | ఫలపరిపాకేచ | కొంచెముగఁ బండుట |
| ధావంతపడు | అ | పరితాపే గ్రా | పరితపించుట |

## న

| | | | |
|---|---|---|---|
| నక్కు | అ | నిలయనే | దాఁగుట |
| నగు | అ | హాసే | నవ్వుట |
| నంగు | అ | నాసికయా వ్యాహరణే | ముక్కుతో మాటలాడుట |
| నచ్ | స | విస్రంభే | నమ్ముట |
| | | ఆలస్యేచ | ఆలస్యముసేయుట |
| నంజు | స | అనిష్టభోజనే | అనిష్టముగా భుజించుట |
| నంజుకొను | స | ఉపదంశనే | అన్నమునకు సహాయము ఊఱుఁగాయ మొదలైనవి తినుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| నట్టుకొను | అ | స్థానావిమోక్షే | తావువిడువకయుండుట |
| నట్టువడు | అ | కార్యవిఘాతే | పనిసాగకపోవుట |
| నట్టుచేయు | అ | ఆలస్యే | ఆలస్యముసేయుట |
| నడు | అ | పాదన్యాసే | అడుగులుపట్టుట |
| | | గమనే | పోవుట |
| | | భవనేచ | అవుట |
| నడుపు | స | అక్షవ్యాపారే | సొగటాలు మొదలైనవానినికచ్చుట |
| | | భావనాయాంచ | కావలసినదానిఁ గావించుట |
| నడిపించు | స | అక్షవ్యాపారే | సొగటాలు మొదలైనవానినికచ్చుట |
| | | భావనాయాం | కావలసినదానిని గావించుట |
| | | పదన్యాస | అడుగులు పెట్టించుట |
| | | ప్రయోజనేచ | |
| నడతెంచు | అ | ఆగమనే | వచ్చుట |
| నత్తమిల్లు | అ | శయనే | శయనించుట |
| నత్తు | అ | పవనవ్యాధినాసం భ్రమోక్తౌ | నత్తిచేతఁ దశఁబడి మాటలాడుట |
| ననయు } ననచు } | అ | పుష్పోత్పత్తౌ | పుష్పించుట |
| | | పల్లవోత్పత్తౌచ | పల్లవించుట |
| ననుపు | అ | భక్షితస్యదేహప్రాతికూల్యాభావే | భక్షింపఁబడ్డవస్తువు దేహమునకు బ్రతికూలింపనిదగుట |
| నమలు } నములు } | స | చర్వణే | చర్వణముసేయుట |
| నమ్ము | స | విస్రంభే | విశ్వసించుట |
| నరియు | అ | పలితే | తల ముదిమిచేత శుక్లకేశమగుట |
| నఱుకు | స | ఛేదనే | కత్తిని ఛేదించుట |
| నట్రాడు | అ | సంచారే | సంచరించుట |
| నలుచు | | | |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| నలుగు<br>నలియు | అ | అవధ్వంసే<br>రోగపీడాయాంచ | చూర్ణమవుట<br>రోగపీడితుండవుట |
| నవయు<br>నవియు | అ | రోగపీడాయాం | రోగపీడితుండవుట |
| నవ్వు | అ | హాసే | నగుట |
| | స | అపహాసే | అపహాస్యముసేయుట |
| నసగొట్టు | అ | అసమ్మత్యావిప్రలాపే | సమ్మతిలేక వేమాఱు విరుద్ధపు మాటలాడుట |
| నాకు | స | జిహ్వాయాలేహనే | నాలుకచేత లేహనము చేయుట |
| నాచుకొను | స | అపహారే | అపహరించుట |
| నాటు | స | అంకురాదిప్రతిరోపణే | మొక్కలు మొదలైనవి నాటుట |
| | | బాణాదివేధనే | బాణాదులచేత గ్రుచ్చుట |
| | అ | విద్ధేచ | బాణాదులు గ్రుచ్చుకొనుట |
| నాటించు | స | అంకురాదిప్రతిరోపణకరణే | మొలకలు మొదలైనవి నాటఁజేయుట |
| | | బాణాదివేధనే | బాణాదులు గ్రుచ్చుకోఁజేయుట |
| నాదాఱు | అ | బలక్షయే | బలక్షీణుండవుట |
| నాను | అ | జలనివాసే | నీళ్ళలో నుండుట |
| నిక్కఁబొడుచు | అ | అవినతావస్థానే | వంగకయుండుట |
| నిక్కు<br>నిగుడు | అ | ఉన్నతావస్థానే | పొడుగవుట |
| నిగడఁదన్ను | స | దూరతఃపాదప్రసారణే | దూరముగాఁ గాళ్ళుచాఁపు |
| నిగ్గు | అ | కార్యనిర్వాహే | పని నిర్వహింపఁబడుట |
| నించు | స | పూరణే | పూర్తిసేయుట |
| నిట్టవొడుచు | అ | ఉద్వేల్లనే | ఉప్పొంగుట |
| నిండు | అ | పూర్తౌ | పూర్ణమగుట |
| నిండించు<br>నింపు | స | పూరణే | పూర్తిసేయుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| నిభాయించు | గ్రా అ | నిర్వాహే | నిర్వహించుట |
| నిట్టనీలుగు | అ | భృశతనుభంగే | మిక్కిలి యొడలువిఱుచుకొనుట |
| నిలు | అ | విరామే | విరమించుట-పని నిలిచెనని |
| | | అనుపవిశ్యావస్థానే | కూర్చుండకయుండుట |
| | | అవస్థానే | ఉండుట |
| | | శేషేచ | మిగులుట |
| నిలుచుండు | అ | అనుపవిశ్యావస్థానే | కూర్చుండకయుండుట |
| నిలుపు | స | అనుపవేశావస్థాపనే | కూర్చుండకయుండఁజేయుట |
| | | అవస్థాపనే | ఉంచుట |
| | | అవరోధనే | అడ్డగించుట |
| | | విరమణే | చాలించుట |
| | | శేషణేచ | మిగులఁజేయుట |
| నిలువరించు<br>నిలవరించు | స | నిర్వాహే | పని నిగ్గించుట |
| నివాటించు | | | |
| నివ్వటిల్లు | అ | అతిశయే | అతిశయించుట |
| నివాళించు | స | నీరాజనే | నీరాజనముఁ జేయుట |
| నివురు<br>నిమురు | స | ఆమర్శనే | అంతటఁదడవుట-దువ్వెననుట |
| నీలుగు<br>నీల్గు | స | మృతౌ | చచ్చుట |
| | | జృంభణే | ఆవలించుట |
| | | తనుభంగేచ | ఒడలు విఱిచికొనుట |
| నీళ్ళాడు | అ | ప్రసవే | ప్రసవించుట |
| నుగ్గు | స | చూర్ణీకరణే | చూర్ణముసేయుట |
| | | యథేష్టవాదేచ గ్రా | యథేష్టముగా వాదించుట |
| నుగ్గాడు | స | మారణే | చంపుట |
| నుడువు | స | ఉక్తౌ | చెప్పుట |
| నుఱుము | స | అవధ్వంసనే | చూర్ణముసేయుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| నురుముచేయు | స | మారణే | చంపుట |
| నులిగొను | స | పరివేష్టనే | చుట్టుకొనుట |
| నులు<br>నులుచు<br>నులుపు | స | ధాన్యాదీనాంపశ్వాదిపదఘాతే | ధాన్యములను బశ్వాదులకాళ్ళఁ ద్రొక్కించుట |
| నుసలు<br>నుసులు | అ | మత్తతాయాం | మత్తుగొనుట |
| నూఁకు | స | కఁరగ్రహణనోదనే | మెడవట్టిత్రోయుట |
| నూఱు | స | దృషదిపేషణే | సన్నికంటఁ బేషణముసేయుట |
| నూర్చు ద్రొ | స | ధాన్యాదీనాంపశ్వాదిపాదఘాతే | ధాన్యములను బశ్వాదులకాళ్ళఁ ద్రొక్కించుట |
| నూలుకొను | అ | విజృంభణే<br>జ్ఞప్తౌచ | విజృంభించుట<br>తెలివొందుట |
| నెక్కొను | స | వ్యాప్తౌ | వ్యాపించుట |
| నెగడు<br>నెగుడు | అ | వృద్ధౌ<br>ప్రవృత్తౌచ | వృద్ధిబొందుట<br>ప్రవర్తించుట |
| నెగయు | అ | ఉడ్డయనే | పక్షి యెగియుట |
| నెగ్గు<br>నెట్టు | స | బలాన్నోదనే | బలాత్కారముగఁ దోయుట |
| నెట్టుకొను | | అభిముఖసన్నాహే | ఎదురుగా సన్నద్ధుండవుట |
| నెమకు | స | మార్గణే | వెతకుట |
| నెమురు | స | స్నేహమర్దనే | తైలాదులు పట్టించి రాచుట |
| నెరము | అ | నాడీవేదనాయాం | నరమునొచ్చుట |
| | స | విధ్వాయుధప్రతివేష్టనేచ | పొడిచిఆయుధము మెలికపెట్టుట |
| నెరయు<br>నెరియు | స | వ్యాప్తౌ<br>పలితేచ | వ్యాపించుట<br>పలితమవుట |

# కాకినాడ
# పరిషత్కార్యాలయమున వెలకు దొరకు
# గ్రంథములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము-చదలువాడ మల్లయకవి | రు 0 | 8 | 0 |
| 2 | కవిజనాశ్రయము-వేములవాడ భీమకవి ... ... | 0 | 10 | 0 |
| 3 | చంపూరామాయణము-ఋగ్వేదికవి వేంకటాచలపతికవి ... | 1 | 0 | 0 |
| 4 | నీతిసీసపద్యశతకము-తాళ్లపాక పెదతిరుమలార్యుఁడు ... | 0 | 2 | 0 |
| 5 | జ్యోతిశ్శాస్త్రసారము శ్రీమాన్ కపిస్థలం కృష్ణమాచార్యులుగారు బి. ఏ., యల్. టి. ... ... | 0 | 8 | 0 |
| 6 | జ్ఞానప్రసూనాంబికాశతకము-శిష్టు సర్వశాస్త్రికవి ... | 0 | 2 | 0 |
| 7 | సర్వేశ్వరశతకము-యథావాక్కుల అన్నమయ్యగారు ... | 0 | 3 | 0 |
| 8 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము-జ. రామయ్యపంతులు గారు, బి ఏ., బి ఎల్ ... ... | 0 | 8 | 0 |
| 9 | కావ్యాలంకారచూడామణి-విన్నకోట పెద్దయకవి | 0 | 8 | 0 |
| 10 | చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లనకవి ... | 1 | 0 | 0 |
| 11 | అకారాద్యముద్రిత గ్రంథసూచిక ... ... | 0 | 8 | 0 |
| 12 | ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ... ... | 0 | 12 | 0 |
| 13 | శివతత్త్వసారము-మల్లికార్జున పండితారాధ్యులు ... | 0 | 12 | 0 |
| 14 | Defence of Literary Telugu జయంతి రామయ్య పంతులుగారు బి ఏ., బి. ఎల్. ... ... | 0 | 8 | 0 |
| 15 | శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి ... ... | 0 | 12 | 0 |
| 16 | ఆర్యభాషావిభాగము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ... ... | 0 | 8 | 0 |
| 17 | Drawidian Lexicography ... ... | 0 | 4 | 0 |
| 18 | హాస్యరంగములు-కొత్తపల్లి సూర్యారావు ... ... | 0 | 8 | 0 |
| 19 | నారసింహపురాణము ఉత్తరభాగము-హరిభట్టు ... | 1 | 0 | 0 |
| 20 | మన్నారుదాస విలాసనాటకము — రంగాజమ్మ. ... | 0 | 8 | 0 |
| 21 | జైమినిభారతము-వచనము-వేంకటకృష్ణప్పనాయకుఁడు ... | 0 | 12 | 0 |

# మీ ప్రకటనలను సుభాషిలోఁ బ్రకటింపుఁడు.

ఏలయన—

రాజులు, మహారాజులు, ధనవంతులు, లాయర్లు, డాక్టర్లు, వైద్యులు, మిల్లుయజమానులు, వర్తకులు, ఉపాధ్యాయులు, విద్యార్థులు, మొదలగువారందఱు సుభాషిని జదివెదరు. ఇందులో విజ్ఞాపనలను బ్రకటించినట్లయిన మీ వ్యాపారమునుగూర్చి యందఱకు వెల్లడికాఁగలదు. మీవస్తువులను గొనువారందఱను నిట్టివారే కావున, మీ వ్యాపారము వృద్ధిఁబొందుట కింతకంటె సులభమైన మార్గమేమైనఁ గలదా?

ఇది తెలుఁగుదేశములోని పత్రికలన్నిటిలో నగ్రస్థానము వహించుచున్నది. ఈపత్రికను, ఆంధ్రులందఱు నాసక్తితోను, ఆదరముతోను జదివెదరు? కాఁబట్టి మీ ప్రకటనలు దేశమంతట వ్యాపించుటకు జక్కని సాధనము సుభాషియే

ఈపత్రికకు, హిందూదేశములోని ప్రతిభాగమునఁ బ్రచారముకలదు కావున, మీ ప్రకటనలుకూడ దేశమందంతట వ్యాపించునని వేఱె చెప్పనవసరములేదు.

ఈపత్రికకు, చందాదారులు దినదినము ననేకులుచేరుచున్నారు స్త్రీపురుషులెల్లరు దీనిని జదువుచున్నారు. ఇంతటి ప్రజాదరణమును చూరగొనుచున్న పత్రిక ఆంధ్రదేశములో నింకొకటిలేదు.

ఇందు సమస్తవిషయములనుగూర్చిన వ్యాసములును బ్రకటింపఁబడును కాఁబట్టి, వివిధములగు నభిరుచులు గలవారందఱు దీనిని జదివెదరు.

అందఱకు నందుఁబాటులో నుండుటకుఁ బ్రకటన దరలు, చాలఁ దక్కువగ నేర్పఱుపఁబడ్డవి.

వెంటనే మీ ప్రకటనలను, కంట్రాక్టు చేయించుకొనుండు, లేనిచో ముందుముందు, ప్రకటన రేట్లు, అధికము కాఁగలవు.

వివరములు, ఈదిగువ చిరునామాకు వ్రాసినఁ బొందఁగలరు.

మేనేజరు:—సుభాషి
రాజమహేంద్రవరము.

Printed by M. Rangiah at the Cocanada Printing Works, Cocanada.

శ్రీ

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

## (Journal of the Telugu Academy).

సంపుటము ౧౭. { విభవనామసంవత్సరము. శ్రావణభాద్రపదమాసములు. } సంచిక 3



కాకినాడ:

కొత్తపల్లి సూర్యారావుచే పరిషత్కార్యాలయమునఁ
ప్రకటింపఁబడినది.

చందా { పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు. 3. } { విడిసంచిక రు ౦-౮-౦

1928

## ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు,
పిఠాపురము మహారాజావారు. పరిషద్యావజ్జీవాధ్యక్షులు.
కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు—ఉయ్యూరు జమీందారువారు.
శ్రీరాణి వత్సవాయ వేంకట సుభద్రయ్యమ్మ జగపతిబహద్దరుగారు—తుని రాణిగారు.
కీ. శే. శ్రీబొబ్బిలి మహారాజావారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

### అధ్యక్షుఁడు.

జయంతి రామయ్యపంతులుగారు బి.ఏ, బి.ఎల్.

### కార్యదర్శులు.

దర్భా వేంకటశివరామరాజుగారు బి.ఏ, బి.ఎల్.
కిడాంబి రాఘవాచార్యులుగారు ఎం.ఏ, బి.ఎల్.

### కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహాదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయఁడుగారు
డాక్టరు వేమూరి రామకృష్ణారావుగారు. ఎం. ఏ. ఎల్. టి. PH. D.
(కోశాధ్యక్షులు.)
శ్రీ త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారు.
కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.
అనంతపంతుల రామలింగస్వామిగారు.
దుగ్గిరాల వేంకటసూర్యప్రకాశరావుగారు బి.ఏ.
తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు.
అశక్కి వెంకట్రామయ్యగారు
కోశా వెంకటసుబ్బారావు నాయఁడుగారు.
ఓలేటి వేంకటరామశాస్త్రిగారు.
పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.
పిల్లారిసెట్టి రంగబ్రహ్మరావు నాయఁడుగారు.

# విషయసూచిక.

# పరిషత్ప్రయోజనములు.



తెనుఁగుభాషను, వాఙ్మయమును, అభివృద్ధి నొందించుటయు, ఆవిషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసంగుటయు నీపరిషత్తుయొక్క ప్రయోజనములు. ఈపనిని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యీక్రింద బొందుపఱుపఁబడు చున్నవి —

I తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వంకష మగునిఘంటు వొకటి రచించి ప్రచురించుట,

II తెలుఁగుభాషకు సజాతీయేతర భాషలతోఁ గలసాదృశ్యములను సాకల్యముగ నిరూపించుచు నొకవ్యాకరణము రచించి ప్రచురించుట,

III ఆధునికశాస్త్ర గ్రంథరచనయందుఁ బ్రయోగించుటకునై పారిభాషికపదములను నిర్ణయించి వివరించు నొకశబ్దకోశమును సిద్ధము చేయుట,

IV ఆంధ్రదేశప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహ మొసంగుటయు, లభ్యములయిన వానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుఁగు దేశముయొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్ర మొకటి రచించి ప్రచురించుటయు;

V సర్వవిషయములనుగుఱించి చేయఁదగు గ్రంథరచనకు బ్రోత్సాహ మొసంగుట,

VI ఆంధ్రభాషలోని మంచిగ్రంథములఁ బండితపరిష్కారము చేయించి నిర్దుష్టముగఁ బ్రచురించుట;

VII తెలుఁగుభాషకును వాఙ్మయమునకును సంబంధించిన విషయములను జర్చించు నొక పత్రికను బ్రకటించుట,

VIII తెలుఁగువాఙ్మయమునకు సంబంధించిన విషయములను గుఱించి చర్చించుటకుఁ గాను సాంవత్సరికసభల నేర్పాటుచేయుట,

IX తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలఁ గావించి పారితోషికములను, సాహిత్యపట్టములను, యోగ్యతాపత్రికలను నొసంగుట,

X ఒక పుస్తకభాండాగారమును స్థాపించి సాగించుట. ఇందుఁ బ్రధానముగాఁ దెలుఁగు గ్రంథము లుండవలయును, వ్రాఁతప్రతులుగూడ నుండవలయును;

XI తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికి నుపచరించు నన్ని కార్యములను జేయుట.

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

| | | |
|---|---|---|
| సంపుటము ౧౭. | విభవనామసంవత్సరము<br>శ్రావణభాద్రపదమాసములు. | సంచిక ౩. |

## గ్రంథవిమర్శనపద్ధతి విమర్శనము.

### మనుచరిత్రమునందలి పాకమును శైలియును.

— ( కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు ) —

రసవిషయమున స్ఖాలిత్యములపాలైనట్లె మన కేతవరపు వేంకటశాస్త్రి గారు పాకాదివిషయమునఁగూడఁ బ్రమాదములపాలైరి. మనుచరిత్రమునందలి పాకమును శైలియును జాల కఠినములైన వని నాతలంపు. పలువురు పండితు లిట్లే తలంచుచున్నారు. మనుచరిత్రమునందలిపాకముంగూర్చి నాయొనర్చిన విమర్శనములో నే నిట్లు వ్రాసితిని. "వీరికవితాకన్యయొక్క వాక్పటుత్వము వాగ్ధారావిశేషము సంధ్యానాట్యమానమానితహరజటాజూటనటన్వియన్నదీలహరింబోలి యున్నది. ఈకవితాపాకము ద్రాక్షాపాకమున లేదు. నారికేళపాకమునను లేదు. ఇది యిక్షుపాకమున నున్న దని చెప్పవచ్చును. చెఱకుగడలను బట్టుకొని పెచ్చు లూడఁదీసి పంటనొక్కి తినిన మధుర మగు రస మూరినట్లే యిందలిదీర్ఘసమాసముల విఱిచి పీల్చి ఘనద్విజసహాయమున గట్టిపట్టు పట్టిన రస మూరుచుండును. సర్వవిధముల శ్రీనాథు ననుకరించిన వానికవిత్వము శిరీషకుసుమపేశల మెట్లు కాఁగలదు. కఠినపాక ముండఁగూడ దని నాతలంపు కాదు. ప్రౌఢప్రబంధములందు నుండఁగాక కాని యట్టిదానిని ద్రాక్షాపాక మనియు మృదుమధురశైలి యనియుఁ జెప్పుట మాత్ర ముచితముగాదు." ఇందుపై మన వేంకటశాస్త్రిగారివిమర్శనపద్ధతి యీక్రిందిరీతిని నడచినది. "మఱియుఁ బాకవిషయమున వ్రాయుచు శ్రీబ్రహ్మయశాస్త్రిగారు మను

చరిత్ర యిక్షుపాకమునఁ బడినదని వ్రాసిరి. అంతఁగా నారికేళపాకముకంటెను గఠినతర మనునభిప్రాయమును దెల్పిరి. అది వారికే గోచరము కావలెను" శ్రీవేంకటశాస్త్రిగారిట్లేల వ్రాసిరో నాకు గోచర మగుటలేదు. శ్రీశాస్త్రిగారు తమకు నావాక్యములభావము గోచరము గానియట్లు వ్రాసినను దుదకు నావాక్యములవలన మనుచరిత్రపాకము నారికేళపాకముకంటెను గఠినతర మనునభిప్రాయము తేలుచున్నట్లు లిఖింపఁగలిగిరి. ఇది పెద్దవింత! నావాక్యములంబట్టి యిక్షుపాకము నారికేళపాకముకంటెను గఠినతర మను భావము వీరికెట్లు గోచరించినదో తెలియవచ్చుట లేదు. నే నట్టిభావమును దెల్పియుండ లేదు. అట్లగుచో "ఈకవితాపాకము ద్రాక్షాపాకమున లేదు. నారికేళపాకమునను లేదు. ఇది యిక్షుపాకమున నున్నదని చెప్పవచ్చును" అని యేల వ్రాసితి నందురా? అయ్యది యిక్షుపాకము నారికేళపాకముకంటెఁ గఠినతర మని తెల్పుటకు వ్రాసినదికాదు. శ్రీవేంకటశాస్త్రిగారు కవితాపాకవిషయమై దూరమాలోచించినట్లు కాన్పించుటలేదు ఇట్టే మఱికొందఱు తలంచి యుండవచ్చును గానఁ దద్విషయమై కొంత వివరించి వ్రాసెద.

సాధారణముగా లాక్షణికులు ద్రాక్షానారికేళపాకములమాత్రమే తమ గ్రంథములలోఁ బ్రశంసించుట కలదు. ఎట్లన?

"అర్థగంభీరిమా పాక స్సద్విధా హృదయంగమః
ద్రాక్షాపాకో నారికేరపాక శ్చ ప్రస్ఫుటాంతరా."

అని ప్రతాపరుద్రీయకారుఁడు వ్రాసియున్నాఁడు. మఱియు,

"ఉ. పాక ముదీరితార్థపరిపాక మనందగు నందు గోస్తనీ
పాకము నారికేళఫలపాక మనం ద్వివిధంబు గోస్తనీ
పాకము సంవృతార్థపరిపాకనివేద్యము నారికేళపా
కాకలనంబు గూఢనిబిడార్థవిచార్యము వీనిలక్ష్యముల్."

అని కావ్యాలంకారసంగ్రహకారుఁడును వ్రాసియున్నాఁడు. మఱియు,

"క. పాక మనఁగా నర్థని, రాకులగంభీరయుక్తి యది యిరుదెఱఁగై
లోకమునఁ బేర్చు ద్రాక్షా, పాకంబును నారికేళపాకము ననఁగన్."

అని కావ్యాలంకారచూడామణికారుఁడను వ్రాసినాఁడు. వీరెల్లరు నిట్లు ద్రాక్షానారికేళపాకములంగూర్చి మాత్రమే ముచ్చటించుటచే నితరపాకములు లేవని వారియభిప్రాయ మైనట్లు గ్రహింపరాదు. ఈవిషయమై ప్రతాపరుద్రీయకారుఁడు తనయభిప్రాయము నీక్రిందిరీతి వ్యక్తముఁ జేసియున్నాఁడు.

"ఏవం వస్త్వలంకారప్రతీత్యావపి ద్రష్టవ్యం పాకాంతరాణి మధుక్షీరాదీని యథాసమ్భవ మూహ్యాని."

మఱియు వ్యాఖ్యాత యిట్లు వ్రాసినాఁడు:—

"ద్రాక్షాపాకనారికేళపాకా వర్ధస్య ద్రుతవిలంబితప్రతీత్యోః పరాంకోటిమారూఢా అతస్తదన్తరాళవర్తిన్యా మధ్యమప్రతీతేరనేకవిధత్వా త్తదనుసారేణ కదళీరసాలాదిపాక స్స్వయ మూహ్యా ఇత్యాహ ఏవమితి"

వీనివలన ద్రాక్షానారికేళపాకములే గాక యింకను ననేకపాకములు గలవనియు సులభగ్రాహ్యము లగువానిలో మొదటిది ద్రాక్షాపాకమును గఠిన ప్రయత్నముచే గ్రాహ్యము లగువానిలో నారికేళపాకమును బ్రసిద్ధములు గావున మొదటిపాకముగా గోస్తనీపాకమును దుదిపాకముగా నారికేళపాకముం దీసికొనఁబడి యవిరెండును మొదట నుద్ఘాటింపఁబడిన వనియు వీనినడుమ నింకను ననేకపాకములు గలవనియుఁ దేలుచున్నది. అవి యేవియన 1 మధుపాకము 2 క్షీరపాకము 3 కదళీపాకము 4 రసాలపాకము మున్నగునవి యనేకములు గలవు. ఇట్టిపాకములను సందర్భానుసార మూహించుకొనవలె నని పైయలంకారశాస్త్రకారులు చెప్పియున్నారు సందర్భముంబట్టి మనపండితకవివరులు క్రొత్తగాఁ గొన్నిటి నూహించుచున్నారు. మహోపాధ్యాయబిరుదాంకితు లగుపండితకవిశేఖరులయిన వేదము వేంకటరాయశాస్త్రులవారు తమయాముక్తమాల్యదాపీఠికలోఁ దద్గ్రంథముపరిపక్వపనసఫలపాకమునను్న దని వ్రాసియుండిరి. కరిగిరిచంపువును విరచించిన శ్లేషయమకచక్రవర్తియుఁ బండితకవితల్లజుఁడును నగువేంకటాధ్వరి తనకావ్యములో సరస్వతీస్తవ మనుపేరఁ జేసిన సారస్వతస్తవములోఁ గావ్యపాకముల నీక్రిందిరీతినిఁ జక్కఁగ సూచించియున్నాఁడు.

"శ్లో. ఇక్షూ నాక్షిపతీ పునర్విదధతీ ద్రాక్షా ముపేక్షాపదం
నిర్దస్త్రి మకరన్ద మైన్దవసుధా మాధుర్య మాధూన్వతీ
కామం కామగవీనవీనపయసాం గర్వక్షతిం కుర్వతీ
వాచాం విందతి వీచికా తవ జనాః స్వాచాన్తమోచామదా॥

ఇందు 1 ఇక్షుపాకము 2 ద్రాక్షాపాకము 3 మధుపాకము 4 సుధాపాకము 5 క్షీరపాకము 6 కదళీపాకము నను పాకషట్కము సూచింపఁబడియున్న దని పండితు లందురు. ఈవిధముగా నిక్షుపాకముగూడ నొకసుప్రసిద్ధకావ్యపా

కముగా మనపండితకవివరులచేఁ బరిగణింపఁబడుచున్న దనుసంగతి తేటతెల్లమగుచున్నది. ఇట్టిపాకము లన్నియుఁ దమతమమృదుత్వ కఠినత్వములం బట్టి ద్రాక్షా నారికేళపాకముల నడుమ వెలయుచుండును గాన నిక్షుపాకమును ద్రాక్షా నారికేళపాకములనడిమిదానినిఁగా గ్రహించి నేను పైరీతినిఁ దెలిపితినేగాని యియ్యది నారికేళముకంటెఁ గఠినతర మని తెలుప నెంచి యుండలేదు. ఇంకను "చెఱకుగడలను బట్టుకొని పెచ్చు లూడఁదీసి పంటనొక్కి తినిన మధుర మగు రస మూరినట్లే యిందలిదీర్ఘసమాసముల విఱిచి పీల్చి ఘనద్విజసహాయమున గట్టిపట్టు పట్టిన రస మూరుచుండును." అని నేను వ్రాసినదానింబట్టి యిక్షుపాకమును ననుభవములోనికిఁ దెచ్చుకొనుటకు నారికేళపాకము ననుభవించుటకై పడునంతశ్రమ పడనక్కఱలేదని తేలుచునేయున్నది. చెఱకుగడను నితరసాహాయ్యమక్కఱలేకయే నోటితోఁ దినునట్లుగా మానవు లెవ్వరును నారికేళఫలమును నోటితోఁ దినఁజాలరుకదా! కాన నిక్షుపాకము నారికేళపాకముకన్నఁ గఠినతరమైనదానినిఁగా నేను జెప్పితి ననుట సమంజసము గాదు. ఇంకను "అది వారికే నోచరముకావలెను" అనుశాస్త్రిగారిపదములు సందర్భరహితము లని చదువరులకు బోధపడునని భావించెదను. లోకములో సామాన్యముగా 1 ద్రాక్షాపాకము 2 నారికేళపాకము 3 కదళీపాకము ననునవి పాకత్రయముగా లెక్కలోనికి వచ్చుచున్నవి. విశేషపరిశీలనముఁ జేసినంగాని తక్కినపాకము లున్నట్లు లోకమునకుఁ దోఁపదు. ఆహేతువుచేతఁ గాఁబోలు మన శ్రీవేంకటశాస్త్రిగారు "అది వారికే గోచరముకావలెను" అని మృదువుగ నన్ను మందలించిరి. శ్రీశాస్త్రిగారు పాకవిశేషములంగూర్చి తగుశ్రద్ధఁ దీసికొని మనయలంకారశాస్త్రములఁ బరిశీలింతురుగాక!

మఱియు శ్రీవేంకటశాస్త్రిగారు తమపద్ధతిలో "దీర్ఘసమాసములున్నంతమాత్రమున నది నారికేళపాక మనియు నిక్షుపాక మనియుఁ జెప్పరాదు. ద్రాక్షాపాకమున కర్హమైనది." అని వ్రాయించిరి. దీర్ఘసమాసము లున్నంతన మనుచరిత్రమును గఠినపాకము గలదానినిఁగా నస్మదాదుల మెంచుటలేదు. అర్థగంభీరిమఁబట్టి యట్టిసిద్ధాంతమునకు వచ్చితిమి. కావ్యము ద్రాక్షాపాకమున నుండిననే ఘనతవహించు నని యెంచుకొనందగినది కాదు. ప్రౌఢప్రబంధములందుఁ గఠినపాకము లుండుట రసికాహ్లాదకరముగనే యుండును. ఈయంశమును నేను నావిమర్శనములో వ్రాసియే యున్నాను. మనుచరిత్రముంగూర్చి

మహోపాధ్యాయ శ్రీవేదము వేంకటరాయశాస్త్రులవా రాముక్తమాల్యదా పీఠికలో నిట్లు లిఖించిరి. “నారికేళపాకము మహాకవిజుష్టముగాదా” నారికేళపాకము మనుచరిత్రలో లేదా మనుచరిత్రము ప్రౌఢము గాదా దానియర్థము వ్యాఖ్యానముఖమున మహనీయులు జూలూరి అప్పయ్యపంతులువా రెల్లరకుం దెల్లముగావించినయెడ నదియును పాషాణకల్పముగాదా” ఇంకను గొందఱుపండితులు మనుచరిత్రపాకము నారికేళ మనుచున్నారని శ్రీవేంకటశాస్త్రిగారే వ్రాసిరి. ఇట్టిదానినిఁ దామన్యథా భావించుటకుఁ గారణము గాన్పించుటలేదు. లోకము భిన్నరుచులును భిన్నాభిప్రాయములును గలది కాన శ్రీశాస్త్రిగారికి మనుచరిత్రమునందలి పాకము ద్రాక్షాపాకముగాఁ దోఁచినఁ దోఁచుఁగాక. అస్మద్వాక్యములభావము గోచరింపలేదనుట పెద్దవింత. కావ్యపాకములు లోకసామాన్య మెంచుపాకత్రయముకంటె హెచ్చుగఁ గలవనియు నయ్యవి సందర్భానుసారముగ నూహ్యము లనుసంగతి గమనింపఁదగినదనియు నట్లుకావించిన మద్వాక్యములభావము దమకు గోచరము గాకపో దనియు శ్రీశాస్త్రిగారికి మనవిచేయుచున్నాను.

ఇంకను శ్రీవేంకటశాస్త్రిగారు పెద్దన చేసిన వన్నియు దీర్ఘసమాసభూయిష్ఠములు గావనుటకై యీక్రిందిరీతిని వ్రాసిరి చూడుఁడు.

“సీ. నిడుదపెన్నిఱిగుంపు......హార్ష మునఁజూచి ప్రవరాఖ్యుఁ డాత్మలోన”

ఇందలి పదములకూ ర్పెంత హృద్యముగా నున్నదో గమనింపుఁడు. ఇం దొకపదమును దీయుటకుఁగాని వేయుటకుఁగాని యవకాశ మింతేనియు లేదుకదా. శ్రీబ్రహ్మయశాస్త్రిగా రీపద్యరాజమునందుఁ గూడ దోషారోపణము చు గావించిరి. శ్రీబ్రహ్మయశాస్త్రిగారు వ్రాసినయంశములు సముచితములుగా లే వని నాయభిప్రాయము. వలరాచరా చవాఁ డని వ్రాసినంత మాత్రమున శృంగార మగునా? ఈశ్వరునికంటిమంటలచే శృంగారరసనిధాన మగుమన్మథుఁడు భస్మమైనచో ననుటచేఁ గరుణరస ముప్పతిల్లును గాని శృంగారము గల్గునా? ఇందుఁ బెద్దనగారిశృంగారప్రియత్వ మేమియో తెలియరాకున్నది. ఇట్లు చెప్పుటలో సారస్యము లే దఁట. ఏమో? పవిత్రస్థలములఁ జూపలే దన్నారు. ఇది పవిత్రస్థలమైనను గావచ్చునుగదా మనకుఁ బ్రధానదేవత యగు నీశ్వరుఁడు కామమును జయించినచో ననుటవలనఁ బవిత్రత వెల్లడి కాకపోలేదే. అరిషడ్వర్గములో నొకటి యగుకామమును దహించె ననుటచేఁ బర్హుప

విత్రస్థల మని యెంచఁదగును గదా! అట్లే దీనిపై రెండవయాక్షేపణముగూడ సరిగాలేదు. ఇట శ్రీశాస్త్రిగారు చక్కగా నాలోచింపలే దనుట స్పష్ట మగుచున్నది. పార్వతి మొదటఁ బరమేశ్వరునికిఁ బరిచర్య చేసినది. మన్మథదహన మైనతర్వాతఁ దనసౌందర్యము శంకరుని మెప్పింపఁ జాలకపోయె నని వగచి తల్లిదండ్రు లెంత చెప్పినను వినక పార్వతి తపస్సుచే శంకరుని వశపఱుచుకొనఁ దలఁచి తపస్సు చేసినది. పెద్దన పార్వతి యీశ్వరునికిఁ బరిచర్యను జేసి యాయాసపడినచోటును వర్ణించెను గాని పార్వతి తపస్సుచేసిన చోటును వర్ణింపలేదు. ఈవిషయమున శ్రీ శాస్త్రిగారు పొరపడి పెద్దనకవిని నిందించినారు. ఇ దెంత బాగున్నదో పండితు లూహింతురుగాక ” ఇట్లు వేంకటశాస్త్రిగారు లిఖించుట వింతను బుట్టించుచున్నది. విమర్శకు లెవరును బెద్దనార్యునిపదముల కూర్పు మనోహరముగా నుండ దని గాని దీర్ఘసమాసములు లేనివర్ణనములు లేవని గాని వ్రాసియుండలేదు. దీర్ఘసమాసములు గలపద్యములు మనుచరిత్రమున స్థలాస్థలవిచారముగూడఁ గావింపకుండ వ్రాయఁబడిన వని నావంటివారైనను వ్రాసిరి కాని కూర్పు నధిక్షేపింప నెవ్వరును బూనలేదు. అది యటులుండ “ నిడుదపెన్నెఱిగుంపు ” అనుపద్యము మనుచరిత్రమందలి సామాన్య పద్యములలోనిది గాని విశేషస్తుతి నందఁదగిన చమత్కారాతిశయము గలది కాదు. మనుచరిత్రమును మెచ్చుకొని నపండితశిరోమణులైనను నీపద్యమును రంగస్థలమునకుఁ దెచ్చి ప్రదర్శించియుండలేదు. అయినను శ్రీ వేంకటశాస్త్రుల వారియూహలో నీయది ముఖ్యముగా నెన్నఁదగినపద్యరాజ మైనది ఉత్తమములగు పద్యరత్నములందుఁగూడ నేనుదోషారోపణముగావించి యకృత్యమునొనరించియున్నట్లు లోకమునకుఁజూపుటకుఁ గాఁబోలునీపద్యమును మొదట విశేషముగ వీరు గొండాడి యుండిరి. “శ్రీ బ్రహ్మయశాస్త్రి గారీపద్యరాజమునందుఁగూడ దోషారోపణముచు గావించిరి ” అని పనిఁబూని లిఖించిరి. ఎంతటిపద్యరత్నమునందైనను దోషారోపణమును గావించుటయే నాపనియైనట్లుగా లోకమునకుఁ దోఁపఁజేయు వీరిగమునిక నవలంబించిరి. న్యాయముచేత మనుచరిత్రమునుండి నేను జూపినన్ని గుణముల వీరు తమపద్ధతిలోఁ జూపియేయుండలేదు. వీరు చూపినగుణములన్ననో మూఁడువంతులకుఁ బైఁగా నేను జూపినవే. అయినను దాము గుణముల నే నెంచినరీతిగా నెంచినచోట నైనను బ్రహ్మయశాస్త్రియు దీనిని గుణముగనె భావించె నని వీ రెచటను వ్రాసియుండలేదు. దోష

ములను జూపుటకో మాత్రము నాపేరు నొక్కదానినిమాత్రమే పేరెత్తుచువచ్చిరి. తమయుపోద్ఘాతములోఁ బామెవరెవరివ్రాఁతల విమర్శించియున్నారో వారి వారినామముల నాయాసందర్భములఁ దెలుపుదు మని పెద్దప్రకటనము గావించిరి గాని తుదకుఁ జూపినది మాత్రము నాపేరే. ఒక్కచోటమాత్రము శ్రీ వెన్నేటి రామచంద్రరావుపంతులవారిపే రెత్తిరి గాని అది నే నాపే రెత్తిన ఘట్టమును బరిశీలించుసందర్భ మగుటచేఁ వారి కాపే రెత్తక తప్పినదికాదు. కాన శ్రీ కేతవరపు వేంకటశాస్త్రిగారికిఁ బరిపూర్ణకటాక్షము నాయొక్కని మీఁదనే పూర్తిగఁ బ్రసరించినదని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. విమర్శన పద్ధతి యీరీతి నుండవలెను గాఁబోలును. దానికేమి సందర్భరహితముగా వీరు పైపద్యము నెత్తి నేనీపద్యముపైఁ గావించిన ఖండనముపైఁ బ్రతిఖండనముఁ గావించిరి. ఆపద్ధతి యేరీతినున్నదో చూచుకొందము. ఈశ్వరారాధనతత్పరుఁడు గర్తరుఁడు శుద్ధశ్రోత్రియశిరోమణియు నగుప్రవరాఖ్యుఁ డెంతకాలమునుండియో చూడ నిచ్ఛగించుచున్న హిమవత్పర్వతమును దుదకుఁ జూడ నేతెంచుచో నందుఁ గర్తరునకు ముఖ్యముగా దర్శనీయము లని తోఁచు ప్రదేశములను గదా చూచును. వానిని వర్ణించుటయేగదా ముఖ్యము. అట్టిస్థితిలో నీపరమ ఛాందసుని మనపెద్దనార్యుఁ డచటికిఁ గొనిపోయి విశేషముగ శృంగారప్రియులు చూడఁదలంచు స్థలములఁ జాలవఱకుఁ జూపె. ఈయంశమును నేనువ్రాసియుండఁగా శృంగారప్రియత్వము స్ఫురించుచోటులఁ గొన్నిటిని విడిచి మఱికొన్నిటి కన్యభావము గలిగింప యత్నించి మఱివేనినో యుద్ఘాటించి వానింగూర్చి కావింపఁబడిన వర్ణనములనైన సరిగఁ జూపక మసిబూసి మారేడుకాయ చేసి మనశాస్త్రిగారు తుదకు నాపై నేరమును మోపిరి. అది యుచితముగాదు. ఎట్లన! ఈకర్తరుఁడు హిమగిరికిం బోయి "తపసియిల్లాండ్ర చెలువంబుఁ దలఁచితలఁచి, మున్ను ముచ్చిచ్చును విరాళిఁ గొన్నచోటు" ను జూచె నఁట. అచట మునిభార్యలవిషయమై యగ్నిహోత్రుఁడు విరహతాపమునొందిన చోటును జూచె నఁట. ఇది యుచితముగ నున్నదా? అనిరతాగ్నిహోత్రి తుదకు హిమవంతమునఁ జూచుపవిత్రస్థల మిదియా? ఈయంశమును గూర్చి యేమియు వ్రాయక మనవేఁకటశాస్త్రిగారు చల్లగ జాఱవిడిచిరి. "వలరాచరాచవాఁ డలికాక్షుకనువెచ్చఁ గరఁగిన యలనికరపుఁ జోటు" అను నీఁకనొక్కయంశముం జూచుకొందము. ఇది మాత్రము కర్తరుఁడు చూడ నభిలషించి

ప్రదేశ మగునా? దీనిం బవిత్రస్థలముం జేయుటకై మన వేంకటశాస్త్రిగారు మన్మథుని జయించిన చోటనినఁ గామవిజయ మొనరించినతా వని తేలునుగదా! అదిపవిత్రమైనది కాదా యని శంకించిరి. కవులు వాడినపద క్రమముం బట్టి యర్థము దేలునుగాని విమర్శకుఁడు విమర్శనములో వాడినవాక్యములం బట్టి కావ్యార్థము దేలదు. మనపెద్దనార్యుఁడు శివుఁడు మన్మథవిజయ మొనరించిన పవిత్రస్థల మని చెప్పియుండలేదు. అట్లు చెప్పిన సమంజసముగనే యుండును. మన్మథుఁడు త్రినేత్రునికంటిచే భస్మమైపోవుటచే నేస్థలము జాలిని బుట్టించుచుండునో యాచోటుంజూచె నని వ్రాసినాఁడు! అది జాలినిఁ బుట్టించుచో టనుటచే మన్మథునకాయవస్థ గలుగుట ప్రవరుని హృదయమున వేదన ముప్పతిల్లఁజేయునదిగా నున్నదని తేలుచున్నది గాని మంచిపని జరిగినదని యతనిహృదయము మన్మథవిజయమున కానందించి శాంతరసపూరిత మైనట్లు తెలుపునదిగా లేదు. ఇది కరుణవిప్రలంభముతో సంబంధించినవిషయము కావున శృంగారరసముతో సంబంధించినదే కేవలకరుణ రసప్రధానమైనను మన వేంకటశాస్త్రిగారు చెప్పు విశేషభావ మిచటఁ బట్టదు. కర్మఠు లెప్పుడును యజ్ఞయాగాదులు జరిగిన పవిత్రస్థలములును నదీనదాదు లుత్పన్నములైన స్థలములును జూడనుద్యమింతురు గాని మదనునకుఁ గలిగినయవస్థలఁ దెలుపుచోటులం గని జాలిపడ నుద్యమింపరు వారిహృదయమున మన్మథుం డుండఁడు వానిపై వారు కారుణ్యము వహింపరు. కావున నిదియును బ్రవరునికిఁ బవిత్రస్థలములఁ జూపుగమనికలోఁ జేరదు.

3. "పుచ్ఛడీకతనంబు పోఁబెట్టి గిరికన్య పతిఁగొల్వ నాయాసపడినచోటు" అనుదానింగూర్చి విచారించుకొందము. "పతిఁ గొల్వఁ నాయాసపడినచో" టనఁ బతినిఁగూర్చి తపస్సుఁజేసినచో టని వ్యాఖ్యాతలు పూర్వకాలపు జూలూరి అప్పయపంతులువారును నీకాలపుఁ దంజనగరము తేవప్పెరుమాళ్ళయ్యగారు మున్నగువారును వ్రాసిరి. ఆయాగ్రంథముల శ్రీ వేంకటశాస్త్రిగారు చదివిచూచుకొందురుగాక. అదియటులుండఁ దపస్సుఁజేసినచోటనక విమర్శకులు దెలిపినరీతిగాఁ బతిఁగొల్వ నాయాసపడినచోటని చెప్పుకొనినను పార్వతిపతినిఁగొల్చినచో టనక పతిఁగొల్వ నాయాసపడినచోటనిన విశేషమేమి? ఇవి యన్నియు శృంగారవర్ణనములు గాక మఱేమగును? భక్తితో హిమగిరిఁ జూడఁబోయిన తీర్థయాత్రాపరుం డగునర్జునుఁ డం దేమేమి చూచె నని విజయ

విలాసకారుఁడు వర్ణించెనో గనుఁడు. “..............తత్ప్రదేశమ్మున శాఖాశిఖోల్లిఖితగ్లావృక్షం బగునగస్త్యవటవృక్షంబుఁ గనుంగొని, యచట నికటవిశంకటకటకకమనీయమణిశృంగం బగుమణిశృంగంబుఁ గని, యగణ్యపుణ్యాగమనమర్హం బగుహిరణ్యబిందుతీర్థమ్మునఁ గృతావగాహుండై గోహిరణ్యాధరణ్యాదిదానమ్ము లనేకమ్ములు గావించి ప్రాగ్భాగమునఁ గలికలితనరశరణ్యం బగునైమిశారణ్యంబు సొచ్చి, యచ్చటం గోటిగుణితాంగీకృతానతజనతాసమర్పితనారాయణుం డగుబదరీనారాయణుం బూజించి..............” క్షత్రియతైర్థికునిచే వేంకటకవి హిమగిరిపైఁ బైపుణ్యప్రదేశముల దర్శించునట్లు చేసినపుడు నాకరణులు దక్షులుం బ్రియములైన ట్లన్యములఁ గావను కేవలకర్తరుం డగుప్రవరనామకవిప్రవరునిచే మనపెద్దనార్యుఁడు మునిభార్యలసౌందర్యముం గని యగ్నిహోత్రుఁడు మదనతాపమునొందినచోటును మన్మథుఁడు కాలిపోయిన కనికరపుఁజోటును బార్వతి శివుని మోహించినచోటును జూచునట్లు చేయుట యెంతయసందర్భమో చదువరులే గ్రహించుకొనవలయును. హిమగిరి మహనీయు లనేకులచేఁ గావింపఁబడిన క్రతువులకుఁ బ్రసిద్ధినందిన పవిత్రప్రదేశము లనేకములు గలది. “నలినసంభవనరనారాయణస్థాణువాసవప్రభృతిగీర్వాణముఖ్యు లెం దేని క్రతువుల ననేకయుగంబులఁ జేసిరి” అని భారతము ప్రకటించుచున్నది. ఈమనయరణిప్రియుం డగుప్రవరుఁ డాక్రతుప్రదేశముల భక్తితోఁ జూచె ననిన నెంతయో సమంజసముగ నుండియుండును. అతివిస్తార మేల? పైపద్యము చాలసందర్భరహితముగ నున్నది. మనవేంకటశాస్త్రిగా రెన్ని బొట్లుపెట్టినను సరిగ నిలువంజాలదు. ఇంకను నీపద్యమునం దొకపదము వేయుటకుఁగాని తీయుటకుఁ గాని వలనుపడ దనుటస్తవమగును గాని వాస్తవముగా నేరదు.

వస్త్వైక్యము:—మనుచరిత్రమునందు వస్త్వైక్యము లే దనియు నది యొకదోష మనియు విమర్శకులుం జెప్పిరి. ఈవిషయమునఁ గవినిఁ గాపాడుటకై మన శ్రీవేంకటశాస్త్రిగా రిట్లువ్రాసిరి. “రఘువంశాదికావ్యములందు వస్తువున నేకత్వము లేనంతమాత్రమున నవి రసహీనములైనవా? మఱియుఁ బెద్దన వేఱువేఱుగా నున్నకథాంశముల నొక్కగ్రంథముగఁ గూర్చి తనకవితాచాతుర్యమహిమచే నెడనెడను రస ముప్పతిలునట్లు వర్ణించి పండితతల్లజులయుల్లములకు వచ్చునట్లు చేసినాఁ డని నాయభిప్రాయము.” ఇది సమంజసముగాదు,

రఘువంశకావ్యము రఘువంశసంభూతు లగురాజుల చరిత్రల వ్రాయుటకయియే విరచింపఁబడినది. కావున నయ్యది బహునాయక మగుట సరసముగనే యున్నది. పెద్దనార్యునికావ్య మట్టిది కాదు. ఇయ్యది మనుచరిత్రమును వ్రాయుటకై లిఖింపఁబడినది కాన నీప్రబంధమునందు వస్త్వైక్య ముండవలెను. అనవసరమైనది యుండుట–అవసరమైనది లేకుండుట వస్తుదోషముగాకతప్పదు. మను చరిత్రమును రచింతు నని చెప్పిన పెద్దనార్యుఁడు మనువుయొక్క చరిత్రము నంతగా వర్ణింపక యతిసంగ్రహముగా నీడ్చివైచి యామనువునాయనమ్మచర్యలకై మూఁడాశ్వాసములును నాతనిసవతితల్లియుదంతమునకై రెండాశ్వాసములును విరచించుట వస్తువు ననవసరముగాఁ బెంచుటయే యగును. పెద్దన వ్రాసినది "మనుసంభవ" మనినను బైదోషము పట్టితీరును. ఇట్టివ్రాఁతలు కొంత రసహీనతను బుట్టింపకపోవు. పెద్దానార్యుఁ డక్కడక్కడ నున్నకథలన్నింటినిఁ దెచ్చి యొకచోటఁ బెట్టి రస ముప్పతిల్లునట్లు చేసినాఁడని మనవేంకటశాస్త్రి గారు వ్రాసిరి. ఆతఁ డట్లుచేసియుండలేదు. మార్కండేయపురాణోక్తప్రకారంబుగానే కథను నడుపుకొనిపోయినాఁడు. ఈతఁడు కొన్నిమార్పులు పెట్టెఁగాని యవి రసభంగమునకుఁ గారణ మైనవి కాని రసప్రాశస్త్యమునకుఁ గారణము గాలేదు.

గ్రంథచౌర్యప్రశంస:— పెద్దనార్యునిమనుచరిత్రమునందు గ్రంథచౌర్యము గలదనియు నాతఁడు మారన పీరన శ్రీనాథుఁడు మున్నగువారిగ్రంథములనుండి చౌర్యమొనరించె ననియుఁ బెక్కురు విమర్శకులు వ్రాసిరి. పెద్దనార్యుఁడు గావించినది చౌర్యము గాదనియు నాతఁడు సర్వవిధముల సమర్థుఁ డనియు నేను నొక్కివక్కాణించి యుంటిని. అయినను మనుచరిత్రపై విమర్శనములను వ్రాసినవారిపేరుల నాయాతావులఁ బేరుకొందు మని వాగ్దానముఁజేసియున్న మన శ్రీ వేంకటశాస్త్రిగారు గ్రంథచౌర్యఘట్టమును బరిశీలించునప్పుడైనఁ బెద్దన చౌర్య మొనరించె నని వ్రాసిన విమర్శకులపేర్లను దెల్పక యీఘట్టమునఁ గూడ నాపేరునకే ప్రముఖత నిచ్చి పెద్దనార్యుఁడు గ్రంథచౌర్యముచేసె నని నేను నిందించినట్లే లోకమునకు బోధపడునట్లు చేయ విపరీతప్రయత్నముఁ గావించిరి. పెద్దనార్యుఁడు చేసినది యనుకరణము గాని చౌర్యముగా దనియు నిట్టియనుకరణమును గాళిదాసాదులును గావించి రనియు నేను వ్రాయుచు నీక్రిందిసారాంశమును దెల్చితిని. "...... కాని యిదియును గ్రంథచౌర్యము

కాదు; కవిత్వపటుత్వవిషయములోఁ బెద్దనయందు లేమిలేదు. ఇఁక నేల యను కరించె నన వారివారియందలిగౌరవముచే నితరుల నీతఁ డనుకరించుచు వచ్చె ననుట యుచితము" మన శ్రీ వేంకటశాస్త్రిగారు తెల్పఁగలిగినదియు నిదియే గదా! తాము నుస్వవిరచితశృంగారనైషధోపోద్ఘాతములోఁ బెద్దన యితరకవుల ననుసరించె నని బిగించి వ్రాసియే యుండిరికదా! ఇట్టివారు నన్నేల నిందాపాత్రునిఁ గావింపఁ బ్రయత్నించిరో తెలియవచ్చుటలేదు. అయిన నీవిషయమై బ్రహ్మశ్రీ సోమంచి సూర్యనారాయణశర్మగారు పరిషత్పత్రిక 16 వ సం॥ సంచిక 5, 6 లో విపులముగాఁ జర్చించియే యున్నారు. కాన నిట నేను మరలఁ జర్చించుట యనవసరము. ఒక్కవిషయమును మాత్రము తెలిపెదను. ఇతరు లెంచినగ్రంథచౌర్యమునుండి పెద్దనార్యునిఁ దప్పించుటకై మన శ్రీ వేంకటశాస్త్రిగారు గావించినప్రయత్నపద్ధతి బాగుగాఁ జదువరులకు బోధపడుటకై యఘమర్షణస్నానమును గూర్చి వీరు వ్రాసినదాని నించుక చర్చించి విశదీకరించెదను.

అఘమర్షణస్నానప్రశంస:—ఈవిషయమై శ్రీ వేంకటశాస్త్రిగా రిట్లు వ్రాసిరి. "అఘమర్షణస్నాన మనుపద మొకటి పూర్వకవులు వాడియున్నారు. ఆ పదము నొకపద్యములోఁ జేర్పవలె నన్నచో సీసములో మాత్రమే యిముడును, అందు యతి చెడకుండ వ్రాయవలె నన్నచో నఘమర్షణస్నాన పదమునకుఁ దోడుగా నాచరించు ననుపదముగూడ నుండకతీరదు. అట్లే వ్రాసినచో నదికేవల మనుకరణముగా నుండకతీరదు.

"త్ర్యంబికాచలకన్యకాంబుపూరంబున నఘమర్షణస్నాన మాచరించి" కాశీ- "సచ్ఛాత్రుఁడగుచు నిచ్చలు నేఁగి యాయేట నఘమర్షణస్నాన మాచరించి" మను- మఱియు నఘమర్షణస్నాన మనుసమాసమున మూఁడుపదము లున్నవి. ఆపదములలోఁ గొన్నింటిని మార్పుచేయవలసినచో "పాపమర్షణ- పాతకమర్షణ" యనికాని స్నానపదము తీసివైచి యభిషేకపదమును జేర్చి పాపమర్షణాభిషేక మని కాని వ్రాయవలయును. కాని, యిది మిక్కిలి విరసముగా నుండును.'' ఈసమర్థనము బాగుగా లేదు. అఘమర్షణస్నానపదము సీసమునందే కాక కందము గీతములు మున్నగు వానిలోఁ గూడ నిముడును. అది గాక యీపదముతో నాచరించి యని కూడ వాడితీరవలసిన యవసరము లేదు. ఆడి మున్నగుపదములను వాడినను యతిభంగాదులు గలుగవు. వీనినన్ని

టి నటు లుండనిండు. స్నాన మొనరించి యనక యఘమర్షణస్నాన మాచరించి" యని మనపెద్దనార్యుఁ డేల వ్రాయవలసివచ్చె. ఈయఘమర్షణపద మేల? ఈయఘమర్షణస్నానము ప్రాయశ్చిత్తస్నానములలోనిది గాని నిత్యస్నానములలోనిది కాదు కొందఱు పెద్దలు నిత్యస్నానానంతరమున నొదులకై న మంచి దని యఘమర్షణస్నానమును గూడ నాచరింతురుగాక. అంత మాత్రముచే నిత్యస్నానప్రశంసను విడిచి ప్రవరుఁడు నదికిఁ బోయి యెప్పుడును నఘమర్షణస్నాన మాచరించెడివాఁ డని యఘమర్షణపదమునకుఁ, బ్రముఖత నిచ్చి తెల్పుటచేఁ దానొనరించిన ఘోరపాపములఁ బోఁగొట్టుకొనుటకై యాతఁ డాస్నాన మొనరించుచున్నాఁ డని తెల్పవలసివచ్చును. "హత్వాలోకాని మాం స్త్రీహి త్రిః పఠే దఘమర్షణమ్" అని యోగియాజ్ఞవల్క్యుండును, "పాతకోపపాతకమహాపాతకా నామేకతమసన్నిపాతేఽఘమర్షణమేవ జపేత్" అని హారీతుఁడును, "మాతరం భగినీం గత్వా మాతృస్వసారం స్నుషాం సఖీం సనాభ్యాం చాగమ్యాగమనం కృత్వాఘమర్షణ మన్తర్జలే త్రిరావర్త్య పేతస్మాత్పాపా త్పూతోభవతీతి, పరాగురుతల్పగమనంకృత్వా అఘమర్షణమన్తర్జలే త్రిరావర్త్య పేతస్మాత్పాపా త్పూతోభవతీతి చ" అని బృహన్మనువును జెప్పిరి. ఈవిధముగా ఘోరపాతకములుచేసినవారలు తత్పాతకనివృత్తికయి యఘమర్షణస్నాన మాచరింపవలె ననిబోధపడుచున్నది. ఈస్నానము మానసికదోషములనుగూడఁ బోఁగొట్టునది యనినను మొత్తముమీఁదఁ బ్రాయశ్చిత్తస్నానము గావునఁ బ్రత్యేకించి దీనినే తెలుపుట యంతగా నుచితము గాదు. ఇం దేమిస్వారస్యముండఁగలదు. కావున మనపెద్దనార్యుఁడు ప్రవరుఁడు నిచ్చలు నేఁగి యయ్యేట నఘమర్షణస్నాన మాచరించినాఁ డని తెలుపుటయం దేస్వారస్యమును గాన్పించుటలేదు. ఇంక నీయనుకరణమునకు యతిప్రాసములు కారణమని వానిపై నేరమును మోప యత్నించుటయందును స్వారస్యము లేదు. అనుకరణము దోషమే కాదు ఇంచుక దోష మనిన దానిని సమర్థించుటకై విపరీతప్రయత్నముఁ జేయుటలో స్వారస్య ముండనేరదు. విషయము మఱింత చెడును. మొత్తముమీఁద మన వేంకటశాస్త్రిగారివిమర్శనపద్ధతి ధారాళముగాఁ బోయిన దని తెల్పుట కవకాశము గాన్పించుటలేదు

---

# చాటుపద్యములు.

—: వడ్డాది సుబ్బారాయుఁడుగారు :—

శా. నానాప్రాణిసమూహముల్ మనఁగఁ గ్రిందన్ మీఁద, విశ్వంపుఁ బె
న్మ్రానందుం బహు నభ్రపత్రవితతిన్ నక్షత్రపుష్పావళిన్
భానుస్వచ్ఛమయూఖసత్ఫలములన్ బ్రస్ఫారదిక్శాఖలన్
ధ్యానింతున్ నిను మూలకందము ముకుందా! భక్తచింతామణీ.

మ. గళమాధుర్యము హస్తకౌశలముతోఁ గంపంబువం జాఱెఁ జే
రలన్ దూఁగెడునావరేవ నొడ లూఁగాడం గడంగెన్ నడన్
బాలయున్ గొం లెడగాఁ గనుల్ పరిచితుం బోల్పంగలేకుండె వీ
నుల కింకం జరగాలి సోఁక దటు రెండుం డెబ్బదయ్యె న్సమల్. 2

ఉ. సన్నసిసూదిబెజ్జమునఁ జట్రన దారముగ్రుచ్చుప్రాయమున్
గన్నులకున్ సహాయముగ గాజుఁగనుల్ ఘటియించునీవు మున్
గొన్నముహోచనంపు గవకుం బసియూనివయస్సుఁ జన్నఁ బైఁ
దిన్నగ డాయు నెయ్యు గుఱుతింపని వాలవవస్థ సిద్ధమా. 3

మ. ప్రభవశ్రావణశుద్ధపంచమికి మత్ప్రాయంపువర్షంబు లో
యుభవా! డెబ్బదిమూఁడు నిండె భవదీయావ్యాజదివ్యద్దయన్
విభవాదుల్ మఱి కొన్ని భక్తునకుఁ జూపింపన్ దలంపేని నా
ప్రభువా! సల్పు దృఢాంగు నిల్పు నిజసేవన్ భక్తచింతామణీ. 4

క. పతియెడఁ గలగౌరవముం, బ్రతినిధిచోఁ జూపవలదె? ప్రతిదినసృష్టి
స్థితిలయకరుఁ డగు భాస్కరు, నతిభక్తిని నరులు వలయు నారాధింపన్. 5

క. అరవిందము వికసితమై, పరిమళమును నెరపు సరసిఁ బ్రత్యూషమునన్
బొరసి ప్రబోధముఁ బరమేశ్వరుఁ బ్రార్థనసలుపు సెజ్జ భక్తునిమనమున్ 6

ఉ. కమ్ములనీడ లెండ పొగకట్టులు రిత్తలు నేల నంతరా
శమ్మున నెత్తుసోరణములన్ రవిభానువు లేటవాల్గ గే
హమ్ము చొరన్ ఘటిల్లునెపుఁ బ్రాహ్ణామునం దణుధూమవల్లిలా
స్యమ్ములరంగముల్ ముద మొసంగుఁ గనుంగవకుం దృతీయముల్. 7

క. జరిపి బహువాసరములు, త్తరదిశను బ్రవాసమాత్మతనయునిఁ జూడం
బెరిమ నట మనసువాఱిన, నరుగ సరగ దక్షిణాశ కర్కుఁడు దిరిగెన్. 8

క. మెక్కిన దంతయు నీచేఁ, గ్రక్కింపక మాన దెండకాలమ! వచ్చెం
గ్రొక్కారు తాపకరునకుఁ, దక్కనె మహి వేఁచి కొనిన ద్రవ్యమొకింతేన్

మ. అధికశ్రావణశుద్ధషష్ఠి, విభవాఖ్యాబ్దంబునన్ రేవగల్
విధువారంబున, సూర్యుఁ జంద్రు భ్రమలన్ వీక్షింపరాకుండఁగా
నిధినిక్షేపము లాదిగా బయలుగా నిశ్శబ్దనీలాభ్రముల్
బుధు లట్టుల్ దవివాఱ దాన మొసఁగెన్ భూచాతకాచాంతికిన్. 10
క. అదరులు మెఱయుచుఁ జదలను, జెదరెడుతఱిఁ గరము దర్శనీయము లటులే
బ్రదికెడు దినముల జంతుస, ముదయము లోమినుకుమినుక బూడిదకణముల్
చ. మిడుఁగు ఱటంచు దద్దఱిలి మేవలువన్ దులుపం దొడంగితిన్
మిడుఁగుఱుఁబుర్వు వ్రాల సరణిన్ మరబండిని రాత్రి నత్తఱిన్
"గడఁగెను వానరాలు చలిగాఁచుకొనన్ వనమందు సీతునం
బొడగని జ్యోతిరింగణసమూహ" మటన్ కథ వచ్చె జ్ఞప్తికిన్. 12
క. హీనులసహవాసంబున, హానికి లోనయ్యెదరు మహాజను లెందున్
గానదృశవృక్షములు ద,వానలదగ్ధములు సారుపుటాకులకూర్మిన్. 13
ఉ. సంగడమై సుబుద్ధి యనుజంబుక మొక్క వనంబులోనఁ జి
త్రాంగుఁ డటన్మృగంబునకు నాపదఁ దెచ్చెను బ చతంత్రమం
దుంగలమిత్రలాభమునఁ దోఁచెడునీకథ మైత్రి చేయుప
ట్లుం గడుజాగరూకత మెలంగవలెం దలఁగంగ వంచకున్. 14
ఆ. చేతఁ బ్రభుత యున్నఁ జెడ్డవాఁ డొరులకు, హానిసేయుఁ జేతనైనకొలఁది
దూఁకఁ గఱవ మ్రింగఁ దోఁకఁగొట్టను జీర, వెఱపుగొలుపఁ గాదె ద్వీపి బలము? 15
చ. కరములు ముందువెన్నలకుఁ గాళులు క్రిందికి మీఁదికిం జనన్
నరుగతిఁ దాఱుమాఱ్లిడె కనంబడుఁ గాలగతిం బ్రజాతతిన్
జరణము లొద్దవాఁడు తలచక్కిని బృష్ఠముప్రక్కవాఁడు ముం
దరదెసఁ గానయ్యెడు విధాతృని విట్టివె చిద్విలాసముల్. 16
క. అపవిత్రులకుం బావను,లపాత్తు సరిపడదు విసములౌగునఁ దోఁచున్
సుపరిమళాజ్యాంచితభో,జ్యపదార్థము లన్న, శ్వసమా యాఁగలకున్. 17
ఉ. తేనియ యించుసక్కెరల, తీయనిపండుల, యింక నిట్టివా
వాని రసంబునానఁ గడువాంఛను గూరుట మెచ్చుకొంఁదగున్
గాని మనంబు రోయు నినుఁ గాంచిన యప్పుడు "నానలేక కా
లూనె దమేధ్యవస్తువుల నోడక" యంచపవిత్ర! మక్షికా! 18
శా. ఏ మెయ్యంగక మక్కు మర్త మభవుం డెందెందుకై యిచ్చె, నా
మైయందంబు నెఱింగి, యన్ని సరిగా నందందుకై వాడువాఁ
డాయుశ్శ్రీబలసౌఖ్యవృద్ధులకు మోహావాప్తికిం బాత్రమౌఁ;
జేయన్ దుర్వినియోగమున్, సుఖదమున్ జెందిం చెడున్ దుఃఖముల్.

# బాలవ్యాకరణము.

## (2)

—। చంద్రాభట్ట రామమూర్తిగారు ।—

సంజ్ఞాపరిచ్ఛేదములో "ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు" (సూత్రము ౨౩)

పెద్దలు వ్యవహరించినమాట గ్రామ్యం బయిన గ్రహింపఁదగు నని తాత్పర్యము. కఱకంఠుఁడు, ప్రాణగొడ్డము, జీవగఱ్ఱ, కపిలకన్నులు, కపిల గడ్డము కపిలజడలు" అనియున్నది.

కఱకంఠుఁడులోని కఱశబ్ద మాచ్ఛికము; నలు పనియర్థము-కఱ-నల్లని, కంఠ-కంఠముగలవాఁడు. ఇది బహువ్రీహిసమాసము. మిశ్రంబునఁ దత్పురుషమే గాని బహువ్రీహిద్వంద్వంబు లుండవు. కాన నాచ్ఛికశబ్దం బగుకఱశబ్దమునకును బ్రకృతిశబ్దం బగుకంఠశబ్దమునకును బహువ్రీహిసమాసంబు పొసఁగదు. ఇట్లు పొసఁగని మిశ్రబహువ్రీహి ప్రయోగించె నని నన్నయభట్టునకుఁ గళంకము దెచ్చిపెట్టుట భావ్యముకాదు.

నపుంసక మైనగరశబ్దము విషార్థకముగా నిఘంటువునఁ గానవచ్చుచున్నది. కాన గరకంఠుఁ డనఁగా గరళకంఠుఁ డనియే యర్థము. ఈగరకంఠశబ్దమునే నన్నయ ప్రయోగించియుండును.

క. ఎఱుకని యెఱుఁగక నిన్నుఁ
మఱకువ మార్కొన్నతప్పు మఱవుము నాకుం
గరకంఠా క్షమియింపుము
నెఱి నెవ్వరి కెఱుఁగఁదగునె నీచరితంబుల్.

అనునీపద్యమున నన్నయ గరకంఠశబ్దమునే యుపయోగించియుండును. లాక్షణికు లెవ్వరో లఘ్వలఘురేఫములకు మైత్రి కూడ దనువారు దీనిని కఱకంఠశబ్దముగా మార్చి వాడుకలోనికిఁ దెచ్చియుందురు. బాలవ్యాకరణకర్త దానిని సరిగా విమర్శించుకొనకయో మఱియేకారణముచేతనో యారూపమునే గ్రహించి యనింద్యగ్రామ్య మని యుదాహరించినాఁడు. అట్లు వ్రాసి యుండుటకు హేతువు లేకపోలేదు. బాలవ్యాకరణప్రకీర్ణపరిచ్ఛేదములో "యవలలు లఘ్వలఘువుల మైత్రిం బొరయు రేఫంబులు పొరయవు" అనియున్నది. ఇందుచే

గురురేఫప్రాసముతో మొదలిడిన పైపద్యమున దీనిని దత్సమ మైనగరకంఠశబ్దముగా గ్రహించినయెడలం బ్రాసభంగ మగు నని తలంచి యందలి 'గ' కారమును సిద్ధసరళముగాఁ గైకొనక యాదేశసరళ మని తలంచి తనయభిమత ప్రకారము కఱకంఠుఁ డని యుదాహరించినట్లు తోఁచుచున్నది.

మఱియు, కపిలకన్నులు మొదలగు నుదాహరణములందుఁ బొరపడినట్లు గానవచ్చెడు.

బాలవ్యాకరణమున ననిందృగ్రామ్యముగా నుదాహరింపఁబడినది. పైకపిలకన్నులు మొదలగుశబ్దములు ప్రయోగింపఁబడిన భారతపద్యము శబ్దరత్నాకరమునం దీక్రిందివిధముగాఁ దెల్పఁబడినది.

అక్కర. అవసరజ్ఞుండయి వ్యాసుఁడే తెంచె నంత నత్తపసి
గవిలగడ్డంబును గవిలజడలును గవిలకన్నులును
దవినయున్నవసల్లనైన దీర్ఘపుఁదనువును జూచి
యువిద కన్నుంగవ మొగిచి తెఱవకయుండె భయమున.

ఇక్కడ వకారప్రాసము గనుక కవిలగడ్డ మనియె చెప్పవలయును అప్పుడు కవిలయనునది వైకృత మగుచున్నది.

అని శబ్దరత్నాకరమున వ్రాయఁబడియున్నది. దీనింబట్టి కపిలశబ్దతద్భవము కవిల యనియు నన్నయభట్టు వకారప్రాసమునఁ గవిలగడ్డ మని యుక్తముగానే ప్రయోగించె ననియుఁ దేలుచున్నది.

ఇఁకఁ బ్రాణగొడ్డమున కన్ననో ప్రాణశబ్దమునకు వైకృతముగా పానమని వ్యవహారమున్నది. కావున, సరియైనరూపము పానగొడ్డమేమో యని సందేహము గలుగుచున్నది. కాని యట్టిరూపము గ్రంథములఁ గానరాదు. అయినను ప్రా యనుసంయుక్తవర్ణము యతియందుఁగాని ప్రాసమందుఁ గాని కానవచ్చునందాఁక నట్టిప్రయోగ మార్యమతము కా దేమో యనియుఁ గపిలకన్నులు మొదలగువానివలెనే వ్యాకరణమునఁ బ్రమాదమున నుదాహరింపఁబడిన దనియుఁ దోఁచుచున్నది.

ఆపక్షమున "పానగొడ్డ" మనునది 'సగపాలు' 'కరవాఁడి' మొదలగు వానివలెనే పానము వృత్తియందు ములోపముగలది కావచ్చును.

భాషాభిమానులీవిషయములను జర్చింత్రుగాక.

చ. మణిగణభర్మనిర్మితరమాయుతభూపతికేళిసద్మమే
ఘన మగునానివాస మని గర్వము నొందకుమా బిడాలమా !
పనిగొని యామహీశులకుఁ బట్టముఁగట్టెడువేళఁ బైపయిన్
మనుకలభంబె గాంచుఁగద మండనసంపద నింపుమీఱఁగన్

కుక్క.

శ్లో. ఉచ్ఛిష్టపత్రనిచయే నిజజాతివర్గై
ర్యుద్ధం కురుష్వ కలహప్రియ సారమేయ!
పూజ్యం విలోక్య నరదేవగృహే కరీంద్రం
మా రోదనం కురు ఫలం నహి తేస్తి కించిత్. ౩౮

చ. కడువడి నెంగిలాకులను గైకొన నాఁకొని తోడఁగూడి సా
పడునిజజాతివర్గమును బైకొని పోరుము సారమేయమా
తడయక రాజమందిరగతం బగుపూజ్యమదేభనాయకుం
జెడుమతిఁ జూచి రోదనముఁ జేసిన లాభము లేదు లేశమున్.

శ్లో. ఆబద్ధకృత్రిమసటాజటిలాంసభిత్తిరారోపితో మృగపతేః పదవీం యదిశ్వా
మత్తేభకుంభతటపాటనలంపటస్య నాదం కరిష్యతి కథం హరిణాధిపస్య. ౩౯

చ. అరయఁగఁ గుక్క కృత్రిమజటావళిచే జటిలాంసభిత్తియై
వరహరిమార్గమందు నిలుపంబడియున్ భయమొందఁగాని తా
వెఱవక మీఱి ధీరత గభీరమతి న్రచియింపఁ జాలునే
పరుషమదేభకుంభతటపాటనలంపటసింహనాదమున్.

జేడి - కురంగీపంచకము.

శ్లో. అయి కురంగి తపోవనవిభ్రమా త్తిముగతాసి కిరాతపురీ మిమామ్
ఇహ నపశ్యసి దారయ మారయ గ్రస పిబేతి శుకానపి జల్పతః. ౪౦

చ. పొలముల సంచరించుచుఁ దపోవనవిభ్రమమొంది యయ్యయో
ఖలమతులౌ కిరాతకులు గల్గినపల్లె కిటుల వచ్చితే
చిలుకలు గూడఁ జంపుఁడు, గ్రసింపుఁడు, నెత్తురుద్రావుఁ, డంచిటం
బలుకుచునుండుఁ దత్పరుషవాక్యములన్ వినవే కురంగికా!

శ్లో. రజ్వా దిశః పరివృతా స్సలిలం విషాక్తం
ఖాతా మహీ హుతభుజా జ్వలితం వనాంతమ్
వ్యాధాః పదా న్యనుసరంతి గృహీతచాపా
స్తం దేశ మాశ్రయతి డింభవతీ కురంగీ. ౪౧

చ. అఱయురిత్త్రాళులన్ దిశల నన్నిటఁ బన్ని విషంబు సజ్జలం
బుఱుగల బావులం గలిపి భూమిని గోతులు ద్రవ్వి తద్వనా
వళుల దహించి చాపములు పట్టి చరించెడు వ్యాధు లుండు న
వ్వలనికె చేరె డింభములవారముతోడఁ గురఁగి పొంగుచున్.

శ్లో. అగ్రే వ్యాధః కరధృతధనుః పార్శ్వయో ర్జ్వాలమాలాః
పృష్ఠే వహ్ని ర్దహతి విపినం ప్రేరితా స్సారమేయాః
ఏణీ గర్భా దలసగమనా డింభకై ర్నగ్నపాదా
లక్ష్మీనాథ త్వమసి శరణం కిం కరోమి క్వ యామి. ౪౨

సీ. అగ్రభాగమున దురాత్ముఁడైన కిరాతకుఁడు వడిఁ జాప మెక్కిడి వసించె
నీవలావలకును బోవుదారుల కడ్డునెఱపఁగఁ దగువలల్ పఱఁగుచుండె
నడుగిడుచో మీఁదఁబడఁజూచుచును సర్వదిక్కుల నలవేఁటకుక్క లొప్పె
వెనుకభాగమునందు విపినమెల్లెడఁగాల్చిమించుదావముప్రజ్వలించుచుండెఁ
బిల్లలెల్లను బదములఁ బెనఁగుచుండె, నేమిసేయుదు నేనిపు డెటకుఁ జొత్తు
హరిహరి యటంచు గర్భభారాలసగతి, వాడిచెడి లేడివర్తైను వ్యాధుతోడ.

శ్లో. ఆదాయ మాంస మఖిలం స్తనవర్జ మంగే
మాం ముంచ వాగురిక యామి కురు ప్రసాదమ్
అద్యాపి ఘాసకబళగ్రహణానభిజ్ఞాః
మన్మార్గవీక్షణపరా శ్శిశవో మదీయాః. ౪౩

చ. చనులనుమాత్రమున్ విడచి సర్వము నాదగుమేనిమాంసముం
గొని కరుణించి నన్విడుము గొబ్బున నేగెద నోకిరాతకా !
కనులనుమూసి నేఁటికిని గ్రాసము మెక్కఁగఁజాలనట్టి మ
త్తనువునఁ బుట్టిపిల్ల లటుఁ దా మెదఁగోరెడు నాదురాకకున్.

శ్లో. మధ్యే జ్యాత్రుటితా ధనుశ్చ రభసా ద్భగ్నం దవాగ్నే రయా
న్నిష్క్రాంతా భషకా స్స్వత స్తనుగతా దగ్ధాశ్చ పాశా స్తతః
శాంతో వహ్ని రకాలమేఘసలిలై రేణీ కుటుంబావృతా
యాతా తత్కరుణాకృపార్ద్రమనసో లక్ష్మీపతే రీదృశీ. ౪౪

సీ. అనవుడుఁ దొందరగొని ప్రేయు నల్లె పుటుక్కునఁ దెగి విల్లు ముక్కలయ్యె
దవవహ్ని వేఁడిమి తాఁకి కుక్కలు పొక్కి పర్వులెత్తెను వలల్ భస్మమయ్యె

నలవహ్నాయు నకాలజలదవృష్టి నణంగె నభయంబు మనమునందలరుచుండ
నట్టివేళను మది నలజడి వాయంగ సమ్మదమిడునట్టి సరణిఁబట్టెఁ
బిల్లలనుగూడి యా లేడి మెల్లగాను, నిజనివాసమునకు నేగె నెమ్మదిగను
భూరితరసత్కృపారసపూర్ణుఁడైన, శ్రీహరికటాక్షమీలీల జెలఁగుచుండు.

ఏనుఁగు.

శ్లో. కేళీం కురుష్వ పరిభుఙ్క్ష్వ సరోరుహాణి గాహస్వ శైలతటనిర్ఝరకాననాని
గాఢానురక్తకరిణీకరలాలితాంగమాతంగ ముంచ మృగరాజరణాభిలాషమ్.

చ. నిరతదృఢానురక్తకరిణీకరలాలితలాలితాంగివై
గిరులకు వప్రకేళిగొని కేసను సారసముల్ భుజింపుమీ
సరసర్ఝరంబులన్ వనుల శైలతటంబుల నొందు మెన్నఁడున్
మురిసి మృగేంద్రుతో నెదిరి పోరఁగఁ గోరకుమా! మదేభమా!

శ్లో. స్థితిం నో రే దధ్యాః క్షణ మపి మదాంధేక్షణ సఖే
గజశ్రేణీనాథ త్వ మిహ జటిలాయాం వనభువి
అసౌ కుంభిభ్రాంత్యా ఖరనఖరవిద్రావితమహా
గురుగ్రావగ్రామ స్స్వపితి గిరిగర్భే హరిపతిః.　　　౭౬

ఉ. మానితవారణాధిపుఁడ మ్రాకు లనేకముగల్గి వెల్గునీ
కాననసీమలో క్షణము కాలిడమాను మదాంధుఁడా! యనుం
గా నగసంఘముం గరు లటంచును గోరులఁ జీరి ఘోరముం
బూని మృగేంద్ర మద్రిగుహఁ బొల్పుగ నిద్రవహించె నిత్తఱిన్.

శ్లో. దానార్థినోమధుకరాయదికర్ణతాళైర్దూరీకృతాః కరివరేణమదాంధబుద్ధ్యా
తస్యైవగండయుగమండనహానిరేషాభృంగాపునర్వికచపద్మవనే చరంతి.

చ. గుదిఁగొని దానధారలకుఁ గూరిమిమీఱఁగఁ జేరుగండుఁదు
మ్మెదలనుఁ గర్ణతాళముల మీటి చలింపఁగఁ జేయుచున్న యా
మదకరి కెన్న గండయుగమండనహానియె గాక భృంగముల్
ముదమున నేగి తూఁగుచుఁబ్రఫుల్లసరోజములం జరింపవే.

సింహము.

శ్లో. గర్వం స్వతో విదళయంతి కరేణుకానాం
గండూషయంతి గజగండతటీ మదాంభః
యద్గర్జితాని జరయా ముషిత స్సఏవ
కంగీరవః పరిభవం సహతే మృగీభ్యః.　　　౭౭

చ. మొదటను దేనిగర్జితసమూహ ముదారకరేణుగర్భముల్
గదలఁ జేసె మత్తగజగండతటీమదబిందుబృందముల్
చెదరఁగఁ మీఱె వార్ధకముచేఁ గలితం బగు నామృగేంద్ర మా
యదనున లేడిపిల్ల లపహాస్య మొనర్చుదశ న్భజించెడిన్.

శ్లో. దిగంతే శ్రూయంతే మదమలినగండాః కరటినః
కరిణ్యః కారుణ్యాస్పద మసమశీలాః ఖలు మృగాః
ఇదానీం లోకేస్మి న్ననుపమశిఖానాం పునరయం
నఖానాం పాండిత్యం ప్రకటయతు కస్మి న్మృగపతిః. ౪౯

చ. మదమలినార్ద్రగండయుతమత్తకరీంద్రము లెల్లదిక్కులం
బదపడి డాగెఁ దద్దశ లపారకృపారసపాత్ర లెంతయున్
సదృశవిహీనముల్ హరిణశాబకముల్ మఱి యొందుఁ జూపునో
సదసి నఖాంకురాళిగతసాహితి నామృగరాజు మేదినిన్.

శ్లో. గమ్యతే యది మృగేంద్రమందిరం లభ్యతే ద్విరదకుంభమౌక్తికమ్
జంబుకాలయగతేన లభ్యతే వత్సపుచ్ఛ ఖురచర్మఖండనమ్. ౫౦

క. హరిగుహల కరుగ దొరకును, గరివరదంతములు మౌక్తికము లటు జనఁ జే
కుఱునవి దూడలతోఁకలు, నరములు డెక్కలును దోళ్లు నక్కబొరియలన్.

శ్లో. యేన శైశవపదే మదేభరా డ్గండసీమ్ని నఖరై ర్విఖండితః
యౌవనోత్సవ మవాప్య కేసరీ కేషు దర్శయతు సోద్య పౌరుషమ్ ౫౧

ఉ. చండనఖాంకురంబుల విశంకటవృత్తిని మత్తకుంభిరా
డ్గండములందు దండిగను గండము లిండికిఁ జేసె బాల్యమ
ప్పుడుగ వేళఁ గేసరి విభాసురవిక్రమశౌర్యధైర్యవ
త్పండితభావ మింకె నిఁకఁ బౌరుష మెచ్చటఁ జూపు వృద్ధతన్.

పక్షులు - కోకిల.

శ్లో. తూష్ణీంతిష్ఠ చకోర! సంహర గిర స్త్వం కీర! పారావత!
త్వద్వాచో విరమంతు బర్హిణ! భవ త్కారోపి విశ్రామ్యతు
ఏతన్మాతనచూతపల్లవదళగ్రాసోల్లసన్మంజుల
వ్యాహారః కలకంఠ ఏష కిరతి శ్రోత్రే సుధాశీకరాన్. ౫౨

ఉ. కూరిమినూరకుండుమ చకోరమ! కీరమ! నోరుమూయుమా
కాఱులు మాను పావురమ! కంఠము నెత్తకుమా మయూరమా!

కోరికదీర మామిడిచిగుళ్లిదె మెక్కుచు నిక్కి సొంపువెం
పారయఁ బల్కు కోకిల కలామృతబిందులు చిల్కెడిం జెవిన్.

కమసాలి.

శ్లో. హే హేమకార పరదుఃఖవిహారదక్ష
కిం మాం ప్రతాపయసి వారశతాని వహ్నౌ
ఆతాపితేన మయ యాతి గుణాతిరేకో
భూయ స్త్వైవ వదనే కిల భస్మపాతః. ౫౩

ఉ. ఓర సువర్ణకార యహహా పరదుఃఖవిహారచోరుఁడా!
వారక వహ్ని నేల బహువారము లిట్లు పసిండి నన్నుఁ జె
న్నార దహింపఁజేతు వటులైనను వన్నె వహింతు నీకె పో
సారెకుఁ గన్నులం బొగ పొసంగుట మోమున భస్మపాతమున్.

దుర్జనుఁడు.

శ్లో. ఖల స్సజ్జనకార్పాసరక్షైకహుతాశనః
పరదుఃఖాగ్నిశమనమారుతః కేవలం సతామ్. ౫౪

గీ. పరమసజ్జనతూలసత్పాలనమునఁ, గేవలాగ్నియుఁ బరదుఃఖదావశాంతి
కలన మారుతుఁడైన యాఖలజనుండు, వసుధ నెవ్వనిచే నుతిఁబడసి మనునొ?

శ్లో. ఖలః కరోతి దుర్వృత్తం నూనం ఫలతి సాధుషు
రావణేన హృతా సీతా బంధనం తు మహోదధేః ౫౫

క. ఖలుఁ డొనరించును దుష్కృతి, చెలఁగుచు నది సాధుబాధ సేయును; సీతన్
బలిమిని దశవదనుఁడు గొన, నలరు మహోదధికి బంధమయ్యెఁ గడంకన్.

శ్లో. అహమేవ గురు స్సుదారుణానా మితి హాలాహల మాస్మ తాత దృప్యః
నను సంతి భవాదృశాని భూయో భువనేఽస్మిన్ వచనాని దుర్జనానామ్.

చ. ధరణితలంబునందు బహుదారుణసంతతిలోన నేనె పల్
గురుతరమైన దాన నని క్రొవ్వకుమా విషమా కడంగి నీ
సరియగులీలతో నలరి సర్వజనప్రతికూలకారియై
దొరకొను ముజ్జగంబులను దుర్జనవాగ్వ్రజ మెంతొ వింతగాన్.

శ్లో. నిష్ణాతోఽపి చ వేదాంతే సాధుత్వం నైతి దుర్జనః
చిరం జలనిధౌ మగ్నో మైనాక ఇవ మార్దవమ్. ౫౭

గీ. లలితవేదాంత విద్యచే నలరుచున్న, నార్జవము గాంచి మించు డాదుర్జనుండు
కడఁగి నిరతంబు జలధిమగ్నతను గాంచి, పరఁగు మైనాకగిరిమార్దవమును బోలె.

శ్లో. పరగుహ్యగుప్తినిపుణం గుణమయ మఖిలై స్సమాహితం నితరామ్
లలితాంబర మివ సజ్జన మాఖవ ఇవ దూషయంతి ఖలాః. ౫౮

క. పరగుహ్యగోపనాంచిత, వరగుణమయనిఖిలమనుజవాంఛితలసదం
బరమును నెలుకలవలెనే, సరసుని దూషింతు రిల నసాధుజనంబుల్.

శ్లో. కృతమపి మహోపకారం పయ ఇవ పీత్వా నిరాతంకమ్
ప్రత్యుత హంతుం యతతే కాకోదరసోదరః ఖలో జగతి. ౫౯

క. సరసకృతోపకృతిం దగఁ, ద్వరతో క్షీరములవలెనె త్రావియు సౌరా!
పరిమార్పఁదలఁచుఁ గాకో, దరసోదరుఁడేమొ ఖలుఁడు ధరణీస్థలిలోన్.

శ్లో. కస్తూరికాం తృణభుజామటవీచరాణాం విన్యస్య నాభిషు వధాయ వృధా చకార
మూఢో విధి స్సకిల దుర్జనలోలజిహ్వామూలేషు నిక్షిపతి చేత్ సకలోపకారః

ఉ. కానలలోన వర్తిలుచు గడ్డి విమేయుమృగాళి బొడ్డులం
దాను విధించె మూఢవిధి తద్వధకై వృధగాఁగఁ గస్తురి
న్నానుగ నల్లదుర్జనులనాలుకమూలములందు నుంచినన్
లూనత నెల్లరీతులను లోకములో సకలోపకారమా.

మహాత్ములు.

శ్లో. తుంగాత్మనాం తుంగరసా స్సమర్థా మనోరథా న్పూరయితుం ననీచాః
ధారాధరా ఏవ ధరాధరాణాం నిదాఘదాహప్రశమే న నద్యః. ౬౧

గీ. ఉన్నతులకోర్కె లొనగూర్పనున్నతరస, ధరఘనులుగాక నీచులు దగుదురొక్కొ
ధరను ధరణీధరనిదాఘతాపమణఁపఁ, దగును ధారాధరావళి తగవు నదులు.

గుణము.

శ్లో. గుణై రుత్తుంగతాం యాతి నతు సింహాసనాదినా
ప్రాసాదశిఖరస్థోపి కాకః కిం గరుడాయతే ౬౨

క. గుణగణమువలన గురుతనుఁ, గొను సింహాసనమునందుఁ గూర్చుండియుఁ గై
కొనఁ డున్నతి నలకాకము, ఘనసౌధాగ్రమున నెక్కి గరుడుండగునే.

మేఘుఁడు.

శ్లో. చాతక స్త్రిచతురా న్పయఃకణాన్ యాచతే జలధరం పిపాసయా
సోపి పూరయతి విశ్వమంభసా హంత హంత మహతా ముదారతా. ౬౩

గీ. చాతకము మూఁడునాలుగు జలకణముల
నమితదాహముగొని వేఁడునంబుదాయి

నతఁడుఁ బూరించు జగముల నంబువృష్టి
నహహా దాతలయౌదార్యఁ మట్టిదకద!

శ్లో. వితర వారిద వారి దవాతురే చిరముపోషితచాతకపోతకే
ప్రచలితే మరుతి క్షణమన్యథా క్వచ భవాన్ క్వచ వారి క్వచాతకః ౬౪

క. నిరతోపోషితదావా, తురచాతకపోతమునకుఁ దోయ మిడుము కం
ధర యిటుగామిని గాలివి, సరుతటిచాతకము నీవు జల మెచ టెచటో.

శ్లో. నిష్పద్మం శిశిరేణ ధీవరగణై ర్నిర్మత్స్యనిష్పూర్మకం
వ్యాధై ర్నిర్విహగం నిరంబు రవిణా నిర్నాళకం దంతిభిః
నిశ్శాలూర మకారి సూకరగణై ర్నామైకమాత్రం సరః
హేపాథోద పరోపకారక పయోదానేన తత్పూరయ! ౬౫

చ. సరసిజమీనముఖ్యకవిశంబరనాళకకందబృందముల్
వరహిమపాళిధీవరసవాగురసూర్యమదేభరాట్కిటుల్
వరుస హరింపఁగేవలము వారకఁ జేసువహించు నాసరో
వరుఁడు పరోపకార ఘన వారిదమా! జలమిచ్చి ప్రోవుమా!

శ్లో. ధారాధర ధరా వారిధారాభి రభిపూరితా
ఖగత్రోటీపుటద్రోణీ పూరణే కిను తే శ్రమః. ౬౬

క. ధారాధర తావకజల, ధారలఁ బూరింతు వార! ధరను ఖగత్రో
టీరమ్యపుటద్రోణిని, వారకఁ బూరింప నేమి భారము చెపుమా.

శ్లో. దారాధర! వివేకాత్మ న్సుధావర్షసి వార్ధౌ
చిరాశ్రితం కణాతృప్తం చాతకం కిం నలోకసే. ౬౭

క. జలమిటులు వ్యర్థముగ నల, జలధిం గురిసెదు వివేకిజలధరుఁడ భవ
జ్జలకణమాత్రముఁ గోరుచుఁ, గలకాలముఁగొలుచు చాతకముఁ గనవేలా.

శ్లో. జలధర జలభరనికరైః పరిహర పరితాప ముత్థితం జగతః
నోచే దపసర దూరం హిమకరకరదర్శనం వితర! ౬౮

క. జలధర జలభరనికర, మ్ములజగముల నలము తాపమును మాపుము నీ
కిలనది బలువే నిచ్చుటఁ, దొలఁగుము హిమకరకరాళిఁ దోఁజూపుమిఁకన్

శ్లో. గర్జ న్నంబు దదాతి తచ్చ కణికారూపేణ యత్ర క్వచి
త్కాలాపేక్షతయా ప్రదానసమయే నైల్యం విధత్తే ముఖే

పశ్చాత్పాండురతా ముపైతి లఘుతా మభ్యేతి భూయస్తరాం
నీరశ్రీప్రభురత్నశేఖరమణే దాతా కి యాన్వారిదః. ౬౯

ఉ. ఇచ్చెడువేళ మోమున వహించును నైల్యము గర్జితోక్తి మై
నిచ్చినదైన నీర మది యెయ్యెడ నియ్యకు వెల్లనౌచుఁ దా
నిచ్చిన వెన్కఁ జుల్కఁబడు నెంతయు వారిదుఁ డెంతదాత నిన్
మెచ్చఁగవచ్చు దాతలకు మేటిగ వేంకటజగ్గరాట్ప్రభూ.

శ్లో. అన్యే తే విహగా పయోద పురతో ధావంతి తృష్ణాతురా
వాపీకూపతటాకసాగరసరిత్తోయేషు బద్ధాదరాః
చిత్రం పశ్య య ఏష చాతకశిశు శ్శుష్కోష్ఠకంఠోపి స
న్నాన్యం పశ్యతి నోపసర్పతి నచ ప్రస్తౌతి నోద్గాయతి. ౭౦

చ. ఇతరవిహంగసంఘము పయోధర నిన్ గణియింప కింపుగా
బ్రతితల, వాపి, కూప, నద, వార్ధి, సరస్సలిలంబు గ్రోలఁగా
నతులితలీలఁ బర్విడు తృషాతురతన్ గను మీవు చిత్రమా
నతతపిపాస నొందియును జాతకపోతక మన్యుఁ జేర, దే
స్తుతి యొనరింప దాశగొని చూడదు ధ్యానముసేయు దెయ్యెడన్.

శ్లో. నభసి నిరవలంబే సీదతా దీర్ఘకాలం త్వదభిముఖనివిష్టోత్తానచంచూపుటే
జలధర జలధారా దూరత స్తావదాస్తాం ధ్వనిరపిమధుర స్తేనశ్రుత శ్చాతకేః

ఉ. అంబరమందె నిల్చి భవదంబుకదంబము గోరుచున్ నిరా
లంబగతిన్ భవన్ముఖవిలాసముఁ జూచుచు నోరు చాఁపఁగా
నంబుద చాతకంబునకు నంబుకణంబులు రాల్పకుండె పో
శంబవిహీనమా మధురశబ్దమునైననుఁ బల్క వయ్యయో.

శ్లో. నీహారాకరసారసాకరసరిత్కాసారనీరాశ్రయం
త్యక్త్వా తోయద చాతకేన మహతీ సేవా సమాసాదితా
తస్యై తత్ఫలితం సముతుసి శిలాసంతాడనం మస్తకే
గాఢం గర్జసి వజ్ర ముజ్ఝసి తటిల్లేఖాభి రాతర్జసి.

చ. సరససరోవరంబులను సారసరిత్కమలాకరంబులన్
నిరసనచేసి చాతకము నిన్నె భజించుట కెంచె వారిదా!
శిరమున వజ్రపాతమును జేసెదు గర్జితె దామహాశిలో
త్తరమున మొత్తె దాచపలకాండముచే జడిపించె దెంతయున్
వరఫల మిట్లొసంగితివి భక్తవశంవదులే జడాశయుల్.

(గతసంచిక శేషము.)

### 3. కవిరాజుకవితయందలి ప్రాశస్త్యాప్రాశస్త్యములు :

ఇతని కవితారచన వచనాతీతాద్భుతావేశభాసురం బై, సహృదయహృదయంగమం బై కన్పట్టు. ప్రాయికముగా నర్థవిమలగు పారకులకుఁ దత్తద్వివక్షితార్థంబును దత్తత్ప్రధానకావ్యమట్లు యీకావ్యము బోధించుచుండెడిని. అర్థసమన్వయ మరసి యుచితరీతిం జదివినఁ దత్తదర్థము సుబోధమై యుండుఁ గాని కొన్నిద్వ్యర్థిప్రబంధములవలె నీకావ్యము నానార్థకకోశాన్వేషణావసరమును దఱచుగాఁ గలిగింపదు. ఒకమాఱు చదివిన రామాయణార్థంబును, వేఱొకమాఱు చదివిన భారతార్థంబును గ్రహించునెడఁ బాఠకుల కావృత్తికల్పనంబున వ్యాపారగౌరవంబు గలిగినను నొక్క కావ్యమే యుభయార్థప్రతిపాదకం బగుటఁ బ్రయోక్తకు (మాత్రలాభము పుత్త్రలాభతుల్య మని సంతసించు వైయాకరణులకు సమ్మతం బగు) నుచ్చారణలాఘవంబును దానం జమత్కృతివిశేషంబును సహృదయైకవేద్యం బై యుండు. రాఘవపాండవీయముం గూర్చి పండితమూర్ధన్యుఁ డగు "మెక్డానెల్" యిట్లు వ్రాసియున్నాఁడు. "A *tour de force* of this kind is doubtless unique in the literatures of the world."

బహునియమములు గలిగిన ద్వ్యర్థికావ్యమునే యింతసౌలభ్యముతో విరచించి, తనవాచామగోచరప్రజ్ఞావైభవమును జూపినకవిరా జీనియమరహితకావ్యమును రచించినచో నెంతచేతోరంజకముగా నుండునో !

ఈవిషయముం గూర్చి పండిత "బెరిడేల్ కీత్" ఇట్లు వ్రాసియున్నాఁడు. "It is fair to say that, considering the appalling nature of the task undertaken, the poet whose name is lost to the obloquy he merits, shows very considerable skill, and might have produced a meritorious work, had he devoted his efforts to a more legitimate end"

కవిరా జభినందనార్హుఁడు గాని యనుకరణార్హుఁడు గాఁడు. ఆంగ్లవిమర్శకాగ్రణి యగు 'జాన్సన్' పండితుఁడు, ఆఁగ్లకవిశిఖామణి యగు "మిల్టన్" విషయమై వ్రాసినవాక్యము— 'Milton is to be admired rather than imitated'— మనకవిరాజునకుఁ గూడ వర్తించును.

4. కవిరాజకవితకు నితరకవితకుఁ గలసామ్యవైషమ్యములు :

ఇష్టదేవతానమస్కారరూపమంగళము :-

'శ్లో. స్వాధిష్ఠానాంబుజరజః పుఞ్జపిఞ్జరమూర్తయే
ఇచ్ఛాధీనజగత్సృష్టికర్మణే బ్రహ్మణే నమః I_1

శుకస్మరణము—

'శ్లో. పునాతు వః సరస్వత్యా విలాసళిశుకః శుకః
కరాంశుమయమాణిక్యపఞ్జరాన్తరగోచరః I_2

శ్రీమహావిష్ణుధ్యానము—

'శ్లో. శ్రీలతాలిఙ్గితాఙ్గస్య విష్ణుకల్పద్రుమస్య వః
అవతారమహాశాఖాః పుష్ణన్తు [ఫలన్తు] ఫలమీప్సితమ్ I_4

ఈశ్లోకములఁ జూచిన శ్రీభట్టపరాశరమహాకవిశ్లోకరత్నములు స్ఫురించుచున్నవి.

'శ్లో. అనుకలతనుకాండాలింగనారంభశుంభ
త్ప్రతిదిశభుజశాఖశ్రీసఖానోకహార్ధిః
స్తననయనగుళుచ్ఛస్ఫారపుష్పద్విరేఫా
రచయతు మయి లక్ష్మీ కల్పవల్లీ కటాక్షాన్. శ్రీగుణరత్నకోశము.

'శ్లో. లక్ష్మీకల్పలతోత్తుఙ్గస్తనస్తబకచంచలః
శ్రీరంగరాజభృంగో మే రమతాం మానసాంబుజే.' (శ్రీరంగరాజస్తవము.)

ఈపైశ్లోకములు కవిరాజశ్లోకముతోఁ దుల్యముగ నున్నవి. తరువాతఁ గవిరాజు ప్రాచేతసవ్యాసులను, దత్కృతులను నిట్లు నుతించియున్నాఁడు.

'శ్లో. జగత్ప్రదీపయో ర్వంశౌ సూర్యాచన్ద్రమసో రపి
యయో రుద్దీపితౌ వాగ్భిస్తౌ వన్దే కవిపుంగవౌ
అన్యో విధాతా వాల్మీకి రాదికావ్యం కమణ్డలుః
రఘునాథకథాగఙ్గా తయాపూతా జగత్త్రయీ.
ద్వైపాయనోఽపరో బ్రహ్మా తత్సృష్టి ర్భారతార్ణవః
సూక్తయో దివ్యరత్నాని త్రైలోక్యం తై రలంకృతమ్.
నిశ్శ్రేణ్యౌ బ్రహ్మలోకస్య వాగ్దేవ్యాః కర్ణకుణ్డలే
ధర్మద్రుమమహామూలే వాల్మీకివ్యాసయోః కృతీ.
భారతాదిపురాణాని శ్రీరామచరితానిచ
త్రిసన్ధ్యసవనాన్యేష సర్వసాధారణోమఖః. —రా. పాం. I_7—11 శ్లో

పింగళిసూరనార్యుఁ డొనరించిన ‘వాల్మీకివ్యాసస్తవ’ మిట నప్రస్తుతముగా దని వ్రాయుచున్నాము.

“శా. లోకత్రాణరతిం దదాదిమమహీలోకప్రవేశోక్త్యభా
షాక్లృప్తప్రథమద్వితీయపదగుంజన్మంజుమంజీరగ
ర్జాకల్పామలరామభారతకథాసర్గంబుల న్మించు వా
ల్మీకివ్యాసులఁ గొల్చెదం దదుభయశ్లేషార్థసంసిద్ధికిన్.

—రాఘవపాండవీయపీఠిక.

‘శ్లో. పురాణరామాయణభారతాదిక్షీరాణిసంయోజితభక్తివత్సైః
పురాతనై ర్యా దుదుహే కవీంద్రైః సా భారతీ కామదుఘా మమాస్తు’

—రా. పాం. I స 12 శ్లో

పైశ్లోకముం జదివిన నీక్రిందిశ్లోకరత్నములు స్మృతిపథమున లభించుచున్నవి.

‘శ్లో. యం సర్వశైలాః పరికల్ప్య వత్సం మేరౌ స్థితే దోగ్ధరి దోహదక్షే
భాస్వన్తి రత్నాని మహౌషధీశ్చ పృథూపదిష్టాం దుదుహు ర్ధరిత్రీమ్’

—కుమారసంభవము I స 2 శ్లో

‘శ్లో. సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనన్దనః
పార్థో వత్స స్సుధీ ర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్’

భగవద్గీతాధ్యానశ్లోకము.

పిమ్మటఁ గృతిపతియగు కాదంబవీరకామదేవప్రభుని వర్ణనము విస్తరింపఁబడినది.

‘శ్లో. అస్తి కాదంబసంతానసంతానకనవాంకురః
కామదేవః క్షమాదేవకామధేను ర్జనేశ్వరః (I-13)
కామః పురాతనో యేన నూతనే నాభిభూయతే
భార్గవో రాఘవేణేవ రామో రామేణసంగరే. (I-14)
దత్తయః కీర్తయశ్చైవ యదీయాః కర్ణమార్గగాః
కాన్తాభ్యశ్చ కవిభ్యశ్చ కామదం యస్యదర్శనమ్. (I-15)
దధానోఽపి ధనుర్విద్యా వైశారద్యం కిరీటివత్
అఙ్గనాపాఙ్గబాణానాం యః స్వయం యాతి లక్ష్యతామ్. (I-16)
యద్యశో రాజహంసస్య బ్రహ్మాండం పంజరాయతే
గ్రాసక్షీరాయతే చాస్య పురస్తాత్ క్షీరనీరధిః. (I-17)

యథా సర్వేషు దేవేషు కామదేవో జగత్ప్రియః
తథామనుష్యదేవేషు కామదేవో జగత్ప్రియః. (I-22)

శ్లో. ఆదిత్యస్యాన్వవాయో జయతి రఘుపతే ర్జన్మనోజ్జృంభితశ్రీ
స్తత్సామ్యం సోమవంశ శ్రయతి సురభితః పాణ్డవానాం యశోభిః
ధత్తే తత్సామ్యమద్య స్మరహరధరణీసంభవస్యాన్వవాయో
యస్యాలంకారభావం భజతి కృతధియాం కామదః కామదేవః

శ్లో. కేచి ద్దానేషువీరాః సమరభువి పునః కేచి దన్యేదయాయామ్
కర్ణాద్యాః పార్థముఖ్యాః ఖచరపతిముఖాః పూర్వమాసన్యుగేషు
తేషాంతేషాంచ తేషా మపి వహతి ధురం సాంప్రతం తావదస్యా
మేకః శ్రీకామనామా జలనిధిలహరీస్రగ్ధరాయాం ధరాయామ్

శ్లో. న్యఞ్చత్కాంచీమనోజ్ఞాః సులలితమధురాః కున్తలై రుల్లసన్త్యః
పుష్ణన్త్యో హారశోభాం ధృతకరకటకాః కాన్తిమద్వేదిమధ్యాః
అఙ్గశ్రీభఙ్గభాజః పరిమిలదలకాః ప్రోల్లసత్కామరూపాః
సేవన్తే తం మనోజ్ఞా అనుదిన మబలాశ్రేణయః క్షోణయశ్చ.

శ్లో. కూర్మాకారం చరణయుగలం ధూతదిగ్దన్తిశుణ్డా
దణ్డాపూరా భుజయుగమపి వ్యక్తనాగేన్ద్రశోభమ్
ప్రాయః పృథ్వీధరణవిషయే తత్సమర్థాన్ పదార్థా
నేకీకృత్య త్రిభువనసృజా నిర్మితా యస్యమూర్తిః.

రామరాజభూషణుఁ డీశ్లోకము వంటిపద్యము నింతకంటెఁ బ్రౌఢతరముగ రచించినాఁడు.

చ. ఉరమున నేఁగుఁ గుండలి పయోధరధారల నాను నెప్పుడున్
గిరులు గరుల్ రజోవిహృతికిం జను వెళ్లఁడు నేలకూర్మశే
ఖరుఁ డిదియేల బాలజన కల్పితసౌఖ్య మటంచు ధారుణీ
తరుణి సిరంగరాయవసుధావరుఁ జేరెఁ గుమారమన్మథున్ ”

శ్లో. కస్త్రాతా? కామదేవః సమరవిజయినాం కోఽగ్రణీః? కామదేవః
కస్త్యాగీ? కామదేవః సరసకవిగిరాం కింపదం? కామదేవః
కః సేవ్యః? కామదేవః శ్రితభరణవిధౌ కః కృతీ? కామదేవః
ప్రశ్నానా మేకమేక ప్రతివచన మహో కామవత్కామదేవః 1-28

శ్లో. జిత్వా శత్రూన్ స్వమభివిశతో ధామహర్మ్యాగ్రలగ్నా
భావోద్భేదా ద్గలితగతయో లోలమాలాయితాక్ష్యః
ప్రాన్తప్రేఖచ్ఛఫరకనక స్తంభశోభై ర్నిజాంగైః
సీమన్తిన్యో విదధతి దృఢం యస్య మీనధ్వజత్వమ్. I-29

శ్లో. విశిష్టగీతా దృతవంశదీప్తః శ్రుతిప్రతిష్ఠాపురుషార్థసూతిః
సన్మార్గవిస్తారవతీసుజాతి ర్యాంభారతీ శ్రీ ర్భజతేఽభిరామా

పైశ్లోకస్వారస్యము వ్యాఖ్యయందు విపులముగాఁ జూపఁబడియున్నది; వ్యాసగౌరవభీతి నిట నది యప్రదర్శితము.

శ్లో. ఛత్రచన్ద్రమసి యస్యవిభ్రమే లోకతాపమపహర్తు ముద్యతే
కుడ్మలీ భవతి వైరిభూభృతా మాతపత్రశతపత్రసంతతిః.

తరువాతఁ గామదేవునకు రామాయణభారతములమీఁదఁ గల యభిమానము వర్ణింపఁబడుచున్నది.

శ్లో ఔదార్యే రఘునాథధర్మసుతయో స్తోత్రేనరాణాం పునః
సౌభ్రాత్రే పతిదేవతావ్రతవిధౌ పృథ్వీసుతాకృష్ణయోః
శ్రీరామాయణభారతార్ణవకృతే వ్యాఖ్యానరత్నేషుచ
శ్రేయా న్సంప్రతి కామదేవనృపతిః కౌతూహలీవర్తతే.

రాజ్యచింతకంటె సత్సూక్తిగోష్ఠియందలియాధిక్యముం జెప్పుచున్నాఁడు.

శ్లో. జ్ఞానం జృంభయతి శ్రియం విశదయ త్యానంద ముద్దీపయ
త్యాధత్తే మతిపాటవం వితనుతే వాచాం సమీచీనతామ్
ప్రత్యక్షీకురుతే పదార్థనివహం ఖ్యాతిం ప్రతిష్ఠాపయ
త్యన్యైః కోనృపతే ర్వినోదవిభవః సత్సూక్తిగోష్ఠీరసాత్' (I-34)

గ్రంథరచనానిదానము సూచింపఁబడుచున్నది.

'శ్లో. తన్వావదాతైః కవిసూక్తిసూత్రైః సంస్యూతనానాగుణరత్నరాశేః
వినోదహేతోః కవిరాజసూరి ర్నిబన్ధనద్వన్ద్వ మిదం విధత్తే. (I-35)

దీనికి సాజాత్యము గలరత్నములు కవితారత్నాకరమున సముపలబ్ధము లగుచున్నవి

"శ్లో. అథవా కృతవాగ్ద్వారే వంశేఽస్మిన్పూర్వసూరిభిః
మణౌ వజ్రసముత్కీర్ణే సూత్రస్యేవాస్తి మేగతిః.-"రఘువం.

"శ్లో. తావేవనూనం సఫలోదయాస్యుః ముక్తాః ప్రసన్నాః కవిసూక్తయశ్చ

గుణోపపత్త్యా కమనీయగుంఫాః కంఠే సతాం యాః పద మాప్నువన్తి."

కృష్ణానందమహాకవి: సహృదయానన్దమహాకావ్యము.

సర్వథా తనకావ్యమున కుపాదేయత కలుగునని సూచించుచున్నాఁడు.

శ్లో. శ్రీరామాయణమాణిక్యం భారతస్వర్ణముద్రితమ్
న కస్య కురుతే లోకే విస్మయోల్లాసి మానసమ్. I_36

గ్రంథరచనావిధానము సూచింపఁబడుచున్నది.

శ్లో. ప్రాయః ప్రకరణైక్యేన విశేషణవిశేష్యయోః
పరివృత్త్యా క్వచిత్తద్వ దుపమానోపమేయయోః
క్వచిత్పదైశ్చ నానార్థైః క్వచిద్వక్రోక్తిభంగిభిః
విధాస్యతే మయా కావ్యం శ్రీరామాయణభారతమ్ I_37_38

తారతమ్యచర్చోపయుక్తములుగ సూరనార్యుని గ్రంథపరిపాటియు వివరింపఁబడుచున్నది.

"సీ. ఆంధ్రభాషాసంస్కృతాభిభాషాశ్లేష యొక్కొకచోట నొక్కొక్కచోట
నుచితశబ్దశ్లేష యొక్కొక్కచోట నర్థశ్లేష యొక్కొక్కతఱిని ముఖ్య
గౌణవృత్తిశ్లేష ఘటన యొక్కొకతఱి నర్థాన్వయము వేఱె యగుచు నుభికి
శబ్దాన్వయవిభేదసంగతియొక్కొక్కతఱి నివియొక్కొక్క తఱిని రెండు

తే. మూఁడు గూడుటయునన సముజ్జ్వలముగ
నాకుఁ దోఁచినగతిఁ జెక్కుచోక లమర
రామభారతకథలు పర్యాయదృష్టిఁ
జూచుసుమతుల కేర్పడ నాచరింతు."

గ్రంథకర్తయొక్క ప్రాగల్భ్యము.

"శ్లో. శ్రీమద్రామాయణం గంగా భారతం సాగరో మహాన్
తత్సంయోజనకార్యజ్ఞః కవిరాజభగీరథః" I_41

స్వకావ్య ప్రకాశోద్ఘాటనము.

శ్లో. రమ్యా రామాయణీ యైషా భారతీ సైవ భారతీ
అర్ధనారీశ్వరమయీ మూర్తి రేకత్ర శోభతామ్. I_42

రాఘవపాండవీయమునకు సుమేరుపర్వతమునకు గలసాధర్మ్యముం జెప్పుచున్నాఁడు.

శ్లో. ఏకత్ర చన్ద్రార్పితపసున్దరస్య పార్శ్వేపరస్మిన్ స్ఫురదుష్ణభాసః
అయం సుమేరో రనుయాతి లీలాం కథాద్వయాశ్చర్యపదం ప్రబన్ధః. I_43

పైశ్లోకము మాఘునకు ఘంటామాఘుఁ డనుబిరుదముం దెచ్చిన మాఘములోని యీక్రిందిశ్లోకముం దలపించుచున్నది.

'శ్లో. ఉదయతి వితతోర్ధ్వరశ్మిరజ్జా వహిమకరే హిమధామ్ని యాతి చాస్తమ్
వహతి గిరి రయం విలంబిఘంటా ద్వయపరివారితవారణేన్ద్రలీలామ్'

పిమ్మట స్వకావ్యముయొక్క తీర్థస్వరూపముం జెప్పుచున్నాఁడు.

'శ్లో. మనోజ్ఞరామాయణభారతాఖ్య భాగీరథీసాగరసంనిపాతే
సన్తః ప్రకుర్వ న్త్వవగాహలీలామస్మిన్నఘచ్ఛేదిని కావ్యతీర్థే. I_44

కవులకుఁ బరిశ్రమాధిక్యమునఁ బ్రజాపతిసామ్యము గల దని చెప్పుచున్నాఁడు.

"శ్లో. విస్తారితాగాబ్ధి పురీ వనాన్తాం సందర్శితేందర్వర్కదినర్తుశోభామ్
సృష్టిః కవిః సూక్తిమయీం వితన్వన్ ప్రజాపతేః కిం నసమానమల్లః"

శివరామాభ్యుదయ మనుద్వ్యర్థికావ్యము ను నిర్మించిన పోడూరి పెదరామామాత్యుఁడు పింగళిసూరనార్యుని నవస్రష్ట యని యిట్లు స్తుతించియున్నాఁడు.

ఉ. శ్లిష్టకవిత్వవైఖరి విచిత్రత రాఘవపాండవీయము
త్కృష్టముగా రచించి జగదేకనుతు ల్గని ధాత్రిలో నవ
స్రష్టయనంగఁ బద్మభవసన్నిభుఁ డైనమహాకవీశ్వరా
భీష్టతమప్రభావుఁ డగుపింగళి సూరకవీంద్రుఁ గొల్చెదన్.

శ్రీనాథకవిసార్వభౌముఁడు కూడఁ దిక్కనసోమయాజి నిట్లుస్తుతించెను.

"ఉ. పంచమవేదమై పరఁగుభారతసంహిత నాంధ్రభాషఁ గా
వించెఁ బదేనుపర్వములు విశ్వజగద్ధితబుద్ధి నెవ్వఁ డ
క్కాంచనగర్భతుల్యున కఖండితభక్తి నమస్కరింతు ని
ర్వంచితకీర్తివై భవవిరాజికిఁ దిక్కనసోమయాజికిన్."

భ్రాంతి, పురుషస్వభావము గుటఁ దనకావ్యగతదోషముల విద్వాంసులు పరిశోధింతురుగాక యని కవి స్వవైచ్యానుసన్ధానముఁ జేసికొనుచున్నాఁడు.

'శ్లో. దోషాన్ధకారవ్యపసారణేన గుణాంబుజోన్మీలననిత్యదక్షాః
సన్తః ప్రబన్ధం మమ శోధయన్తు లోకం మయూఖా ఇవ చండరశ్మేః'

కవితాసుధానిధిలోనివిట్టివి యొకటిరెండుసూక్తిసుధాబిందువులాస్వాదింపంబడుంగాక.

'శ్లో. తం సన్తః శ్రోతుమర్హన్తి సదసద్వ్యక్తిహేతవః
హేమ్నః సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధిః శ్యామికాపి వా. రఘు- I-10

రుచిపతిమహోపాధ్యాయుఁడు:—(మురారికృతా'నర్ఘరాఘవ' వ్యాఖ్యాత)

'శ్లో. దోషాకరం సమవధీర్య గుణా నశేషా
నాశుప్రకాశయతి సూర ఇ వాంశురాశీ
న్యస్తం ప్రతి ప్రవిహితో౽ఞ్జలి రేష నిత్య
మాలోకనా న్మమకృతే ర్మద మాదధాతు.

అరసికనిరసనపూర్వకముగా, సత్పురుషులే తనప్రబన్ధమును బరికింపనర్హులని చెప్పుచున్నాఁడు.

'శ్లో. అనధ్వన్యాః కావ్యే ష్వలసగతయః శాస్త్రగహనే
ష్వదుఃఖజ్ఞా వాచాం పరిణతిషు మూకాః పరగుణే
విదగ్ధానాం గోష్ఠీ ష్వకృతపరిచర్యా శ్చ ఖలు మే
భవేయు స్తే కింవా కవిభణితికండూతినికషాః I-46

ఇట్టివి భట్టమురారిమహాకవిశ్లోకములు రెండుదాహరించెదను.

"శ్లో. యే శబ్దశాస్త్రనిష్ణాతాః యే శీలితనిఘంటవః
తేషామే వాధికారో౽స్తి మురారికృతినాటకే" చాటువు.

'శ్లో సమున్మీలత్సూక్తిస్తబకమకరందై శ్శ్రవణయో
రవిశ్రామ్యద్ధారాస్సతతముపచిన్వన్తు కవయః
నశబ్దబ్రహ్మాఖ్యం పరిమళమనాఘ్రాయ సుధియః
కవీనాం గంభీరే వచసి గుణదోషా న్రచయతు— అనర్ఘరాఘవము.

అరసికనిరసనపూర్వకముగా రసజ్ఞులఁ బ్రార్థించుచున్నాఁడు.

శ్లో. అసద్భి రారోపితదూషణాపి నసూక్తి రార్యై రవధీర్యతాం మే
పీతోజ్ఝితాం రాహుముఖేన చాన్ద్రీం నకిం సుధాం నాకజుషో జుషన్తే.

క్రీ. శ. 1600 కుఁ బూర్వము జీవించియున్న రుచిపతిమహోపాధ్యాయుఁ డిట్టిశ్లోకమే మిక్కిలి రసవంతముగా నిర్మించెను.

'శ్లో. అసద్భి రధిరోప్యతే యదపి దూషణం మత్కృతౌ
తథాపి సుమనీషిణాం భవతి కణభూషోచితా

సిపీయ ఖలు నిర్దయం ప్రసభ ముజ్ఝితా రాహుణా
సకిం దివిషదః పరాః పరిపిబన్తి చాన్ద్రీః కలాః"

అనర్ఘరాఘవవ్యాఖ్యానపీఠిక. 7 శ్లో.

ఈసందర్భమున శ్లేషయమకచక్రవర్తి యగు వేంకటాధ్వరిమహాకవి విరచితము లగు నరసికనిరసనపూర్వకరసజ్ఞప్రార్థనోక్తు లొండు రెండు సూచించెదము.

1 లక్ష్మీసహస్రము I స్తబకము 13 శ్లో

'శ్లో. విద్వద్భ్య స్స్వదమానయా యదనయా విశ్వాంబ నాధీయతే
స్తత్త్వాత్తే సుఖవజ్ఞచేతసి దృషత్ప్రాయే న దూయే తతః
గాన్ధర్వీ హి పురన్దరాదిశిరసా మాందోళయిత్రీ చిరం
గీతి స్సా బధిరా న్ననన్దయతి చే త్కిం ఛిన్న మేతావతా.

II ల. స 25 స్త 12 శ్లో.

'శ్లో. యే యాం నాద్రియతే కృతిః కతిపయై రీర్ష్యాగృహీతై ర్జనై
శ్చిత్రం సైవ విపశ్చితా మకలుషే చిత్తే విధత్తే పదమ్
విశ్వస్యాంబ మనో ధునోతి దయితా విశ్లేషిణాం యాన్వృణాం
నో కిం కోకిలకాకలీ భవతి సంతోషాయ యోషాజుషామ్'

III కరిగిరిచంపువు. I విలాసము. 10 శ్లో.

'శ్లో. కీర్తిం ధత్తే కిల విదధతీ గీ రసౌ ధీరసౌఖ్యం
కిం నశ్ఛిన్నం నఫలతి యథా జాతచేత స్సుఖంచేత్
దీప్తి ర్భానోః ప్రజనయతి యా దృష్టిపుష్టిం జనానాం
దుష్యే త్సా కిం యదితు నభవే త్తోషితో మూషికాణామ్.

పిమ్మటఁ గథ ప్రారంభింపఁబడినది. ఆంధ్రరాఘవపాండవీయమునకంటె సంస్కృతరాఘవపాండవీయము చాల మనోహరముగ నున్న దని నిశ్శంకనీయముగఁ జెప్పనగును. కథాభాగమునందలి శ్లోకములఁ గొన్నింటి నుదాహరింతుము. ఈశ్లోకములు స్వయంవరసభాగతసీతాద్రౌపదీవర్ణనములోనివి.

'శ్లో. సా దుగ్ధసిన్ధో రుదితేవ లక్ష్మీ ర్లావణ్య మస్యా నియతం సుధైవ
యదేత దాపీయ దృశా ప్రపేదే మనుష్యలోకేఽప్యనిమేషభావః.'

II స. 10 శ్లో.

'శ్లో. వక్త్రస్య తస్యాః ప్రసమీక్ష్య శోభాం తారాపతి ర్మండల మాపభానోః
తథాపి నో సామ్య ముపైతి దీన స్తప్తుం తపః ప్రాప పురారిమౌళిమ్.'
II స. 13 శ్లో

యుధిష్ఠిరదాశరథులు వనగమనాభిముఖు లగుఘట్టమునందలి కొన్ని శ్లోకము లుదాహరింతును.

'శ్లో. సరాజ్య మైంద్రేణ పదేన తుల్యం గురుప్రియార్థం తృణవ ద్విహాయ
అరణ్యవాసాయ కృతప్రతిజ్ఞః ప్రతస్థివా న్సావరజః సదారః' III స29

'శ్లో. అపోఢరత్నాభరణౌ రథేన నిర్యాంత మేతం నగరా న్నిరీక్ష్య
విమోక్తు మశ్రూణి చిరం జనానా మాసీన్నపర్యాప్త మివాక్షియుగ్మమ్.'

'శ్లో. రాజేంద్రవేషాపగమేపి నైనం సౌభాగ్యలక్ష్మీః శ్లథయాం బభూవ
సురాసురైః స్వీకృతరత్నరాశి స్తథాపి రత్నాకరఏవ సిన్ధుః'

కవితారత్నాకరమున నిట్టిశ్లోకరత్నము మఱియొకటి సముపలబ్ధ మగుచున్నది.

'శ్లో. గృహ్ణన్తు సర్వే యదివా యథేచ్ఛం నాస్తి క్షతిః క్వాపి కవీశ్వరాణామ్
రత్నేషు లుప్తేషు బహుష్వమర్త్యై రద్యాపి రత్నాకర ఏవ సిన్ధుః?
బిల్హణకవి: 'విక్రమాంకదేవచరితము' I సర్గ.

మ. కవులారా! గ్రహియింపుఁ డిష్టమగువాక్సారంబుఁ దోరంబుగన్
భువిపై లోపము గల్గునే సుకవితాస్ఫూర్తి న్విజృంభించినన్
దివిజుల్ రత్నము లెన్నితీసికొనిన న్నీరాకరం బిప్పుడున్
నవరత్నాకరనామధేయమున విన్నాణంబుగా నుండదే.

"శ్లో. నిరస్తరత్నాభరణాపి గేహా ద్వినిర్గతా సా నిజయైవభాసా
విద్యోతయామాస నరేన్ద్రమార్గం తడిల్లతా మేఘవినిర్గతేవ".
III 34.

ఈశ్లోకము కవికులగురుసూక్తిం దలపించుచున్నది.

'శ్లో. సరసిజ మనువిద్ధం శైవలేనాపి రమ్యం
మలినమపి హిమాంశో ర్లక్ష్మ లక్ష్మీం తనోతి
ఇయ మధికమనోజ్ఞా వల్కలేనాపి తన్వీ
కిమివహి మధురాణాం మండనం నాకృతీనామ్.'
శాకున్తలము. II అ.

5 సంస్కృతసారస్వతమునఁ గవిరాజుస్థానము:—ఇందు, స్థూలదృష్టిని గవిరాజు సారస్వతమున నేస్థానము నలంకరించునో నిరూపించెదము. జగద్గీత కీర్తు లగు, ప్రాచేతసవ్యాసశుకభాసకాళిదాసాదులు గీర్వాణసారస్వతతారా పథమున దివ్యజ్యోతులవలె వెలుఁగుచున్నారు వీరు గీర్వాణకవితాపీఠమునఁ బ్రథమస్థానము నలంకరింతురు. ఇంతియకాదు; వీరు సార్వలౌకికకవితాపీఠ మునఁ గూడ నగ్రస్థానము నలంకరింప నర్హులు. ఇట్లనుటచే సార్వలౌకిక కవిశిరోమణులగు Homer, Virgil, Shakespeare, Milton మొదలగువారిని మేము నిరసించితి మని యెంచకుందురుగాక. వారియందును మా కతిమా త్రగౌరవము గల దని విన్నవించుచున్నాము. భవభూతి, శూద్రకుఁడు, సుబం ధుఁడు, దండి, బాణుఁడు, హర్షుఁడు, భోజుఁడు, మురారి, జయదేవుఁడు, బిల్హ ణుఁడు, వేదాన్తదేశికులు, శంకరాచార్యులు మొదలగు కవిరత్నములు, కవి తాపీఠమున ద్వితీయస్థానము నలంకరించుచున్నారు.

భారవి, మాఘుఁడు, 'కవిరాజు' ధనంజయుఁడు ('ద్విసంధాన' కారుఁ డు) రాజశేఖరుఁడ, వేంకటాధ్వరి, పండితరాయలు, మొదలగు కవీంద్రులు గీర్వాణకవితాపీఠమునఁ దృతీయస్థానము నలంకరించుచున్నారు. నియమబా హుళ్యము లేనికావ్యమును రచించినచోఁ గవిరాజు కవితాపీఠమున ద్వితీయ స్థానము నలంకరించెడిని. ఇం దభిప్రాయభేద మున్నచో క్షంతవ్యులము.

---

# గ్రంథస్వీకారము.

(1) ఆంధ్రీకృతప్రసన్నరాఘవనాటకము:—మహారాజశ్రీ శ్రీరాజామంత్రిప్రగ్గడ భుజంగరాయకవిగారిచే నాంధ్రీకరింపఁబడిన ప్రసన్నరాఘవనాటకమును సాకల్యముగాఁ జదివితిమి. జయదేవమహాకవిచే గీర్వాణభాషయందు విరచింపఁబడిన ప్రసన్నరాఘవనాటకమున కిది పరివర్తనము. శ్రీభుజంగరాయకవిగారు జయదేవకృతియందుఁ గలరసభావాదుల నన్నింటిని దమ యాంధ్రీకరణాదర్శమున స్ఫుటముగఁ జూపఁగలిగిరి.

ప్రాయికముగఁ బరివర్తనములలోనికి మూలగ్రంథములఁ గలభావచమత్కృతుల సాకల్యముగాఁ గొనివచ్చుట దుర్లభము. కవు లాతి తేటినవా రైనం గాని యట్టిపరివర్తనపాటవ మబ్బనేరదు. ఇందలికవిత్వమును మృదుమధురమై, శ్రీభుజంగరావుబహదరుగారి సహజకవితాప్రావీణ్యమును బ్రకటించుచున్నది.

(2) నళిని:—ఇది గంధర్వగ్రంథమాలలోని ప్రథమసారిక. శ్రీవేంకటకాళిదాసకవులచే రచియింపఁబడిన చిన్నపద్యకావ్యము 3 భాగములు- ఒక్కొక్కభాగములోఁ బ్రకృతివర్ణనముతోఁ జిన్న యింపైనకథ రచియింపఁబడినది పద్యములు చక్కఁగానున్నవి. ఒక్కమచ్చుపద్యము—

గీ. అంత మీ లేసియుద్యానమందు నేఁడు, పూచినది క్రొత్తగాఁ జిన్నిపువ్వొకండు
మారుతకిశోర! నీ వెంతదూరమునకు, దానిగంధంబుఁ గొనిపోవ దలఁచినావో.

చందాదారులకు దీని వెల రు 0-4-0 ఇతరులకు 0 8 0 గంధర్వగ్రంథమాల—విజయనగరము వ్రాయవలయును.

(3) ఈక్రిందియెనిమిది శ్రీశారదాగ్రంథమాలనుండి వెలువడినవి - గ్రంథకర్త గరిమెళ్ల సత్యనారాయణగారు.

౧. భక్తగీతములు— ప్రథమకుసుమము. విఘ్నేశ్వరస్తుతి. భరతమాతృస్తవము మొ॥ కీర్తనలు గలవు వెల రు 0-6-0 చందాదారులకు రు 0 4-0

౨ బాలగీతములు—ద్వితీయకుసుమము. ఇందు దైవప్రార్థనము. విద్యార్థులవిధులు, భారతదేశప్రార్థనము, భారతదేశసందర్శనము, నాదేశము, బాలిఆశయము. క్షమాపణప్రార్థన- యనుశీర్షికలక్రింద- పదములుగలవు. వెల 0-2-0.

3 మాణిక్యము—మూఁడవకుసుమము- ఇదినాలుగంకముల నాటకము. కథ సాంసారికము. శ్రీకాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారి కంకితము

చేయఁబడినది. "ఇందలి భాషను గూర్చి యించుక చెప్పవలసియున్నది. రాజకీయమున నేమి, సాంఘికమున నేమి, ఆర్థికమున నేమి, సాహిత్యమున నేమి భారత జాతీయ సనాతన ప్రవాహమునకు భంగము కలుగనీయకుండ యోగ్యమైనంత అధునాతనత్వమును జొప్పించి తత్తదంగములను సజీవములును సాంప్రదాయ సిద్ధములును పండితపామరజన ప్రశంసనీయంబులును...జేయవలయు నని యే నాయాశయము. ఈవిధానము నిదమిద్ధ మని నిర్వచించుట యేరికిని సంపూర్ణ సాధ్యము కాదు." అని చెప్పి యన్నివిధములను వ్రాసెరి. యతిప్రాసములుగల పద్యములు లేని పద్యములు గ్రాథికము, గ్రామ్యమును బ్రయోగించినారు దీని వెల రు 1-0-0.

౪ నూతనజాతీయగీతములు — నాలుగవ కుసుమము. వెల 0-12-0,

౫ ఖండకావ్యములు (ఒకటవభాగము) ఐదవకుసుమము. వెల 0-12-0

౬ అఖండకావ్యములు — ఒకటవభాగము- ఆఱవకుసుమము. ఇందలి పద్యములును, యతిప్రాసములలో స్వేచ్ఛను వహించినవి వెల 0-12-0.

౭. అర్థత్రయసర్వస్వము — (ఒకటవభాగము) ఏడవకుసుమము. గార్హస్థ్యము. తిరువళ్లువరు కుఱళు- దానికి పరిమేళజగరు వ్యాఖ్యానమును, గలవు. వెల రు 1-4-0 కొన్నివిషయములు-

ఇంటిగుణములు పత్ని కెనగకుండినను నెటువంటిగుణముల ఫలంబేమి
ఇల్లాలుకుదురైన నెనగదెది లేక విలసిల్లగలదెద్ది లోకములో
ఉవిదకన్నను యోగ్యయుతమేది సతీత్వబలసువిలసితయై యొప్పునేని
సురల నెంచక నిజేశుని మ్రొక్కి లేచుసతి కురియుమన్నను వాన కురియుఁ.

౮ క్రొత్తస్వరాజ్యం — పాటలు- ఎనిమిదవకుసుమము. వెల 0-6-0 శ్రీశారదాగ్రంథమాలకు ప్రియాగ్రహారము (Via కళింగపట్టణము) గంజాఁజిల్లా, వ్రాయవలయును.

(4) <u>22 శ్రుతులు-స్వరావళి</u> (సంగీతము) అఖిలభారతగాయకమహాసభయందు, పండిత వింజమూరి వరాహనరసింహాచార్యులుగారిచే నొసఁగఁబడిన యుపన్యాసము: శ్రుతులు స్వరములు వీనింగూర్చి యనేకవిషయములు పూర్వశాస్త్రానుసారముగ సంగ్రహించి యింగ్లీషుసంగీతపండితుల యభిప్రాయములతోఁ గూడఁ బహుపరిశ్రమపై సిద్ధముచేసి చెన్నపురమున సంగీతవిద్వాంసులమహాసభలోఁ జేసినయుపన్యాసము-విషయ మిది యని సంగీతరుచిగలవారెల్లరుఁ జది

విగ్రహింపఁదగినగ్రంథము వెల 0—8—0 కాకినాడలో నుపన్యాసకుల యొద్దనే దొరకును.

(5) ప్రభవ-కవితాసమితిగ్రంథావళి ౧. మ॥ శ్రీ॥ శ్రీనివాసరావుగారిచే రచియింపఁబడినది. ఇందుఁ బ్రకృతిగీతములు ప్రణయగీతము ప్రకీర్ణగీతములను మూఁడుభాగములు గలవు. ప్రకృతిగీతములలో నెనిమిది ప్రణయగీతములలో నాలుగు ప్రకీర్ణగీతములలో నాలుగును విషయములు గలవు. ఇందలిఖండకావ్యములు మనోహరవర్ణనలతో నిండియున్నవి. వెల 0_8_0. మచ్చు-

అంతమేలేని యీవిరహాంబురాశి, ముంచుచున్నది తనువెల్లఁబొంగిపొరలి
దీనిఁబూనికఁబూని మథించితుదకుఁ, బడసెదననంతసుఖసుధాస్వాదరసము
అతిభయంకరవిరహాగాఢాంధకార, మలముకొనెడినాహృదయాంతరమున
అయిన నరసెద నిట నీసహస్రకిరణ,మాలికాదివ్యదేదీప్యమానకాంతి.
ఒక యనిర్వచనీయమహోన్నతమగు,హాయి యున్నదిగీతపద్యములయందు
దరులొరసిపారు గాంగనిర్ఝరిణికరణి,చెంగుచెంగున గీతి తురంగలించు.

కావలసినవారు "కవితాసమితి-విశాఖపట్టణము" అని వ్రాయవలెను.

(6) దేవీభాగవతము- సప్తమస్కంధము- శ్రీ తిరుపతివేంకటేశ్వరకవులు విరచించినది. కాత్యాయనీగ్రంథమాలలోని ప్రథమపుష్పము బ్ర॥ శ్రీ॥ తంగిరాల జగన్నాథశాస్త్రిగారిసంపాదకత్వమునఁ దణుకునుండి వెలువడినది. ఈ స్కంధములో బ్రహ్మోత్పత్తి, సూర్యవంశవిస్తారము, సుకన్యాచ్యవనవివాహము, శశాదచరిత్ర, మాంధాతృచరిత్ర, సత్యవ్రతోపాఖ్యానము, హరిశ్చంద్రచరిత్ర, శతాక్షీమహిమ, గౌరీజన్మము, భక్తియోగము మొదలైనవి ముఖ్యవిషయములు. విషయసూచిక మొదటఁ జేర్పఁబడిన నది పాఠకులకుఁ గొంత సాయపడి యుండును. కొన్నిమచ్చుపద్యములు.

చ. జనవర యాతఁ డిప్పటికి సమ్మతినందఁడ యేని నేన మ
త్తనయుఁ డటంచు సందియ మెదం గనకే మఖకర్మపూర్తికై
హనన మొనర్తు నిప్పశువు నప్పు డొసంగిన దానికన్న వే
తన ద్విగుణమ్ముగా నిడెద ద్రవ్యమ చేయు మఖేష్టికృత్యముల్.

చ. బ్రదుకుట యిష్టమెల్లరకుఁ బార్థివ నీవలె వీఁకిన్ స్వకీ
యతనువునందుఁ బ్రీతి యగు టబ్బురమే సకలంబు నాత్మస

మ్మితముగఁ జూచు పూరుషుఁడు మేటి పురాభవవైరమేని నీ
కితనికి లేదు నిక్క మితఁ డేయుపకార మొనర్చె నక్కటా.

ఉ. ఏనృపుదేశమందు వసియించు జనుం డొనరించుఁబాప మ
ద్దానను షష్ఠభాగమును దన్నరనాథుఁడు వొందు నుత్తముం
డైన త్రిశంకుభూమిపతి కాత్మభవుండవు పుత్రుఁ జంపుని
వ్వానికి ద్రవ్యమిచ్చి రవివంశమునం దపకీర్తిఁ గూర్తువే.

చందాదారుల కీగ్రంథము వెల రు 1 0-0 ఇతరులకు రు 1.4-0.

(7) మహాభారతచరిత్రము — బ్ర॥ శ్రీ॥ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి గారిచే రచియింపఁబడినది.

ఇందు గ్రంథారంభసమర్థనము పిమ్మట— మహాభారతయుద్ధకాలము, మహాభారతచరిత్రము, మహాభారతగాథావిశేషములు, శ్రీకృష్ణుఁడు, పూత నారోగనిదానము, నాగులు, నాగలోకము, శ్రీకృష్ణుఁడు, ద్రౌపదీమానరక్షణము, సాంఘికదురాచారములు, చంద్రవంశము, భీష్మద్రోణవిదురాదులు. వ్యాసుఁడు, మొదలగు విషయములు మహాభారతమును బట్టి విమర్శపూర్వకముగాఁ గలవు. భారతకాలభరతఖండముయొక్క పటముగలదు. ఇందలి కొన్ని మొదటిభాగములను పాఠకులు పరిషత్పత్రికలోఁ జదివియున్నారు: దీని వెల రు 1 4-0. కావలసినవారికి- పిఠాపురములో శాస్త్రులవారియొద్ద దొరుకును.

---

# పత్రికాస్వీకారము.

1. విద్యానంద—ఇది చెన్నపురి, పరశువాకము 13 సుబ్రహ్మణ్యమొదలి వీథిలో సాధు వేంకటేశ్వరశాస్త్రిగారిచేఁ బ్రకటింపఁబడుచున్న మాసపత్రిక. శ్రీదిగంబర విద్యానంద అవధూతస్వాములు బి. ఏ. గారి ఛాయాపటము ముఖపత్రమున నుండను. తఱచు శ్రీస్వాములవారి కవిత్వము వారిసామర్థ్యాతిశయమును దెల్పఁబడుచుండును. ఇతరవిషయము లనేకములు నుండును. చందా రు 3—0—0 వినోదార్థము- ఒకపత్రికలోని రెండుపద్యములిచటఁ జూపుచున్నాము.

శా. విద్యానందుఁ దలంతు భక్తిమయుఁడై వేదాంతదీక్షుండునై
విద్యాసాగరగట్టు చేరుచు నిలన్ వేడ్కల్లు పుట్టంగగా
విద్యానందుని నామమొందె యశమున్ వేనోళ్ల కీర్తింపఁగా
విద్యాతాపసశక్తులొందె ఘనతన్ విశ్వంబు జజేయనన్.

శా. నీవేభక్తశిరోమణీ గుణమణీ నీవే మనీషామణీ
నీవేసాధుశిఖామణీ నరులలో నీవేసుశీలాగ్రణీ
నీవే భాగవతప్రియుండవు భువిలో నీసాటినీవేయగున్
ఏవ్యాళన్ కనకోరియుండుతనకున్ యివ్యాళనే లోలుడై
శ్రీవత్సాంకుని కండ్లఁజూపితివిగా చిన్నారిమాణిక్యమా.

2 సమదర్శిని— విభవసంవత్సరాదిసంచిక (1928-29) సమదర్శిని కిది మొదటి ఉగాదిసంచిక- మత సాంఘిక, రాజకీయ, సారస్వతాది నానావిష యకవ్యాసములు గలవు. సమదర్శిని పత్రికాధిపు లగు శ్రీయుత పింజల సుబ్రహ్మణ్యముసెట్టిగారు చక్కనిరూపమున దీనిని బ్రకటించిరి. దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు, గౌ. వేమవరపు రామదాసుపంతులుగారు, శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు, డా. భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు, కట్టమంచి రామలింగారెడ్డిగారు, కావ్యవ్యాకరణతీర్థులు పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు, మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు, చల్లా శేషగిరిరావుగారు, నడకుదుటి వీరరాజుపంతులుగారు, కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిగారు, పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు మొదలైన పలువురు ప్రసిద్ధపండితులును కవులును రచించిన వ్యాసము లిందుఁబ్రకటింపఁబడినవి. బహువర్ణ చిత్రములు నేకవర్ణపటములును శతాధికముగఁ బ్రకటింపఁబడినవి. దర్శనీయమైన రూపములోను హృదయంగమములైన కొన్నివ్యాసములతో నలరారుచున్న యీసంచిక చందాదారులకు వెల 0—12—0 ఇతరులకు రు 1—0—0 చెన్నపురి సమదర్శిని కార్యాలయమున దొరకును.

౩. రాజహంస :— ఇది యొక యానందభరిత సచిత్రమాసపత్రిక- సేలము జిల్లా హొసూరులో విద్యానిధి కారుపల్లి శివరామదాసుగారిచేఁ బ్రకటింపఁబడుచున్నది. చందా సం॥ రు 3—0—0.

చ. హరియణుమాత్రమానసమునందు జనించి మరుం డనంగుఁడై
కరణిని నీ వతీంద్రియతఁ గాంచితి వేని నిశేశ మాకు సౌ
ఖ్యరమ ఘటిల్లదే యటులు గామి వియోగులభాగ్యహానియే
హరిహరి తప్పనాడితి ననంగుఁడునయ్యు నతండు నేఁచఁడే ౭౫

చ. చలువలరాయ నీకు హరిసన్నిధి వర్తిలుదాన నౌటచేఁ
జెలియల నైతి గా వరుసఁ జెప్పఁగ నైనను నన్నుఁ బ్రోవుమీ
చెలియలి నేఁచుఁ దోడనుచుఁ జెప్పఁగ విందుమె యింత చెప్పఁగా
వలవదు తోడనే పొడమి వచ్చినచెల్లెలియిల్లు నిల్పితే. ౭౬

ఉ. తమ్ముల*మేల్ నిజోదయత దాసినయాతనె కూల్చి సుప్రభా
తమ్ములఁ బక్షపాతసుఖితమ్ముల సద్విజరాజచంద్రజా
తమ్ముల నెప్పుడుం బొగలఁ దద్దయుఁ జేయుచు నుండు నీకు నో
తమ్ములదాయ సద్గతియుఁ దద్ద్విజరాజత గల్గె నెల్లొకో. ౭౭

గీ. రాణ గైకొని నే ద్విజరాజ ననుచుఁ, జెప్పికొన నీకు మదిలోన సిగ్గుగాదె
విప్రయోగులపాలింటివేరువిత్త, వది నిశాచర నీకెన్న †ననుచితంబు. ౭౮

సీ. పదియాఱుదినములు ప్రాప్త మా వెంటనే యఱిగెడుసిరికి మి న్నందికొనుచు
ద్విజరాజసాంగత్యవృజినంబు గైకొంచు సరసులు బెగడెడుచాయఁ గనుచు
ద్విజవృత్తిహరియించువెరవులో మెలఁగుచుస్వప్రకాశోన్నతి చన మెలఁగుచుఁ
జెలఁగి మాన్యక్షేత్రములనాక్రమించుచుమావంటియనదలమన్నిగొనుచుఁ
దెరలనికలంక మూనుచుఁ దిరిగితిరిగి, యుడిగిపోయియధోగతిఁ బడెడునిన్ను
...ద్విజరాజవని...యెన్నకొనెడు, కోశకారులు జగతిలోఁ గొఱఁతవడరె.

గీ. చంద్రత్వద్వాచక(ంబగు)చంద్రపదము, పలుకు విపరీతలక్షణాకలిత మగుచు
ఖేదకారిత్వ మిది వింతగాదు తెలియ, దర్శపదము విరుద్ధబోధకము గాదె.

క. కిరణసితరుక్కలంక, స్ఫురి‡తానీ(ల)రుచులొదవఁ బూర్ణేందుఁడు సం
హరిణారిఁ బోలు నేనియు, విరహిమృగము వీనిఁ గనుచు విడుచు నసువులన్.

క. కరము సుఖంబొనరు బుధ, స్ఫురణంబున జగతి నీకుఁ బొడమినబుధవి
స్ఫురణంబు జగదుపద్రవ, కరణం బని యెన్నవయ్యెఁగా భువిఁ జంద్రా!

క. సకలాలంకృతి వేగతి, నకట లలితచిత్రరూపకౌపమ్యంబుల్
వికలములు నీకు మఱి దీ, పకభావవిరోధములును బ్రకటం బగునే. ౮౩

* మేలునిజోదత-† ననుచితంబె. ‡ స్ఫురితాసిరుచు-మూ.

ఉ. ఆతతపుష్కరస్థలి విహారముసేయు గజంబుచా స్రుక్కెడ
ప్రీతి బిసాంగులం గొడప *చిట్టు మదిం గనలూని సింహిక
జాతుఁడు మ్రింగి క్రక్కె మెయి చాలక వానికి దోస మేమి దై
వాత్ముకుఁగా సృజించు నలువం దులువంచు వచింపఁగాఁ దగున్. ౮౭
గీ. విరహిబిసములఁ ద్రుంచుచు విమలపద్మ, †సీగణంబుఁ గలంచుచు నీరజారి
మదగజేంద్రునిసాటియై మలయు మింటఁ, గరబహుత్వంబు వీనికిఁగలదు గాని.
చ. ♦చలి కగువింటిబల్మిఁ గొని సారము జాఱఁగఁజేయు మారుఁ జి
చ్చులికను వెట్టచేఁ గడపి శూలి శశిం దలనిల్పె ‡నేలొకో
నలివొరవింటి కోపధులు నిచ్చలు నేలుట వీనిఁ ద్రుంచినం
దెలిలును ఖేదము ల్విషమదృష్టికి నిశ్చితబుద్ధి గల్గునే. ౮౮
సీ. నింగికి ముట్టంగ నెఱిఁ బాలమున్నీరు పొంగించ, మేనెల్లఁ బొక్కఁజేయు,
జలజాటవి దహించుఁ, జంద్రుఁ డన్న(ను)విశేషార్థవాచ్యార్థంబు లనుపపన్న
ములుగవహ్నిత్రయి దెలియనబ్బరమేమిశ్రౌతవాక్యమున నహఃకేతుముఖ్య
భేదకముల నుపపాదించుసూర్యునిఁ జంద్రమాఃపద మని చదువులేదె
యరసి చూడంగ వహ్నికి నరిది వీని, వేఁడి యెట్లన్న నత్యంతవిహితయోగ
బలముచే నుక్తకార్యంబు పరఁగుశుచికి,నట్టికార్యంబువీనిఁగన్నంతఁబోడము.
గీ. జనన మందినదేశంబు మనఁగనీఁడు, వీని కాకీలితో నెల్లు భేద మెనయుఁ
గలుషితాకృతి యగువీఁ గన్నకతనఁ, బాలవంటికులం బెల్ల భంగపడియె.
క. కాఁకదొరబిడ్డ తమ్ములఁ, గాఁకం దొరలంగఁ జేయు గామిడికానిం
గా కెనయ నిల్లు దూఱుచుఁ, గాఁ కెనయం బువ్వరువ్వకట్టిఁడిగ్గదిట్టున్.

—( మన్మథోపాలంభనము. )—

శా. తల్లి ల్లంచును నన్నగద్దె యనుచుం దర్శింప క ల్లాచ్చి తా
నల్లారుంజిగితమ్ము లంపగమిపా లొనట్లుగాఁ జేయునీ
వల్లుల్ గన్గొనఁ గన్నతండ్రిమది దావజ్వాలతో డిందదే
చెల్లంబో మముబోంట్ల నేఁమ టనుదే చింతింపఁ జేతోభవా. ౯౦
చ. హరుఁడు మహాత్ముఁ డం చెఱుఁగ కాతని కెగ్గొనరించి కంటిమం
ట రహిఁ దొఱంగి నీఱయి యనంగ పిశాచము వైతి కానిచో
ధర నబలాలి సోఁకుదువొ తద్దయుఁ దాపము సంఘటింతువో
పరఁగ ననుష్ణతోన్మిషదపారవికారదశల్ రచింతువో. ౯౧

*జెట్టుమదిం †నీగుణంబు ♦చెలికనిమొండఁధగుసు. ‡నేలకో ద్రిశిట్టిక మూ.

సీ. చెల్లెలి*యిల్లెల్లఁ జెల్వుపుల్లఁగఁ జేసి కుముదంబులకుఁ బెంపు లమరఁ జేసి
సూర్యసంగతి నైనసొబగు మైఁ గలిమూని సురలకై కళ లెల్లఁ జూఱచేసి
పూర్వపక్షం బన్నఁ బొడవుగా నిక్కుచు నితరపక్షం బన్న నింపు చెఱుచుఁ
జాలని యొకకళ సర్వజ్ఞుతలఁ దన్ని మేల్కళానిధి నని మిన్నుముట్టి
ధరణిఁ జక్రస్విజాతులఁ దలఁకఁ జేసి, శంక డిగి రాజ ననెడుకళంకితోడ
వంకయే పొంకమని పూనుమంకుతోడఁ, బొందుదగునయ్య నీకు ముకుందతనయ
గీ. సాధనం బవికల మైన జగతి సాధ్య, సిద్ధిఁ గాంతురు గాదె ప్రబుద్ధు లెల్ల
నహహ వికలము సాధనం బైనయట్లు, చేకుఱెను మార యువజయసిద్ధి నీకు.

ఉ. తామదిలోఁ గళం కుడిగి తక్ దలకెక్కఁగఁ జేసికోఁగనే
భీముని నీకు బల్పగతుఁ బెద్దగ భూషణచేసి నీశరం
బేమఱి కూల్చినట్టి జను నీతని నే మని చందమామ మా
మామని చెప్పకో హరికుమారక నీమది సిగ్గు లే దొకో. ౯౪

చ. సమయము గాఁగనే విరియసాఁగెడు తూపులు నంటినంతనే
భ్రమపడి కూయునారి తఱిరాఁ దెగువిల్లు విరూపమైన తే
రు మఱి చిట్కు రన్న బెదరుం బడివాగెలు గల్గి దేహమే
యమరని యోధవై యకట యాదితి వెట్లు జయంబు మన్మథా. ౯౫

గీ బాణ మున్మత్త మై నీకుఁ బరఁగసాగె, మధుపుతోఁ గూడ నీకు నున్మత్తవృత్తి
గలుగఁ గార్యంబు చెడుఁగాకఁ గానిపొందు, విడువనిఁక నైనఁదగుమధుద్వేషితనయ.

సీ తియ్యనిబోనంబుఁ దిని మ్రాని పట్టులఁ జేరి నున్నస్దులఁ గేరువాని
నొకమృదుసుమమాత్ర మొంట నంటిన యంతఁ జెల్లుభీతిల్లి మూర్ఛిల్లువానిఁ
బల్లవపద మీఁగి బలుకష్ట మైఁ బూని పంచమవృత్తి చేపట్టువాని
శరవర్షముల నుక్కి గిరిగహ్వరము దూఱి పోవడి తప్పట†నలరువాని
చుప్పరంబున నెలకుబ్బి‡యూఁగువాని, వెన్నెలకై వాడి తెలి వెల్లవిడుచువానిఁ
గలసికొని మున్ను వేధింప వలచి తేని, మదన మనలే వరూపమయ్యెదవుగాని.

—♦ మందమారుతోపాలంభనము ♦—

క. అలివేణి యిట్లు నెవ్వగ, వలివేలుపునల్లుఁ దెగడి వారనికినుకన్
బలుకీలలీల సోఁకెడు, చలిగాలిన్ దూఱుఁ దూఱి చనని విరాళిన్. ౯౬

సీ. వాగులు మలలు నవ్వారిగా నెలకొని కనరాక మెల్లన చనుచు నెట్టి
సమయంబునైన వాసన మచ్చు వడిఁ జల్లి చలువ లెక్కఁగఁ జేసి సాధుమాన

*యిల్లల్ల †బడలువాని ‡నూలువాని-మూ.

వస్తువు గ్గొను నల్వ పశ్యతో హరచోరుఁడని పాపములలోయ నలయహీన
బలములఁ గాఁపుంచి షడ వైవఁగా వాని నటుచేసి తద్ధనం బంత గొనుచు
మమ్ము వేధింప వచ్చితిమలయపవన, మనవిగాఁ జెప్పెదను నామమాటవినుము
ధైర్యమనియెడునొకమహాధనముగలదు, వెన్నునకు దానిలాగెడు వెరవుగనుము

చ. పురహరమూర్తులందు నొకమూర్తివి బాలసమీర నీవుగా
హరునకు నెప్పు డక్షిగతుఁ డైనయనంగుని క్రింద నీఁగఁగాఁ
బరిణత మయ్యె నెట్లు మది భావము నీ కభిమానశూన్యమే
హరిహరి తప్పఁ బల్కితి ననంగత నీవుఁ బిశాచ మాదువున్. ౧౦౧

గీ. బాలభావత జడుఁడవై వచ్చుకీమఁ, దెలిసికొనలేక ననుడాయుఁదలఁచి పవన
వచ్చె దేటికి మోసంబు వచ్చు నీకు, ఫణిశయానునిసన్నిధిపట్టు మాకు.

క. కట్టా యేఁచెదు చెలువులు, చెట్టలపాలయ్యె నేమి *చేరెడుఁ బుట్టన్
పుట్టవ యాఁదోడులతో, నుట్టిపడితె యాకసంబునుండి సమీరా. ౧౦౨

ఉ. గంధపుఁగొండ నండగొను కట్టిఁడి పాపవిషాగ్నికీలలం
జెందఁగఁ బోయె నీజడిమ శీతత గల్గినఁ గాఁక చేయుదే
మందత నిట్టి ధీ యొదవె మానగు శైత్యము నీకుఁ గల్గెనా
యందలి దందశూకచయ మంది గ్రసింపఁగ నిందు వత్తువే ౧౦౩

గీ. విరహిజనముల ప్రాణముల్ వేగఁగొనఁగఁ, బవననీకెట్లుదగు జగత్ప్రాణసంజ్ఞ
యశ్వకర్ణాదినయమున నది పొసంగు, నొండె విపరీతలక్షణ నొనరునొండె.

గీ. నిరతిశయమత్తనూష్ణిమ నీకు నెట్లు, లుష్ణిమ యడంగి శీతత యుద్భవిల్లు
నాతురతఁ గానిపనికి నీ వరుగుదెంచి, తహహ జడునకు విజ్ఞాన మబ్బునెట్లు.

గీ. పాంథులకు నిన్నునుండియుఁ బడనిపాటు, లెట్టు లన్ననుజంద్రశీ(తేం)ధనమున
నతనువహ్నిసమింధనం బగుటయరుసు, మలయపవమానపయినీవుమలయకున్న.

క. మాయన్న శమనుఁ డనుపఁగ, మాయన్నా వచ్చినావె మమ్మరయంగా
మాయన్నదూత వగుట, న్మాయన్నయుఁ బోలె నీవు మమ్మలఁచెదవో.

చ విరహుల నేఁచుపాతకము వీడెఁడి వోవునె జాడ్యఖంజతా
భరమునఁ గుంచి బల్మలలపాలుగ నుంచి భ్రమంబు నించి రూ
పరిదిగ డించి యప్పు గవు లంట రచించి యహీనభీతి మే
దరము రచించి నిన్నుఁ బలుఁత్రోవల బెట్టెడుఁగాక మారుతా. ౧౦౪

*చేరెడుబుట్టల్ పుట్టలయాం-మూ.

సీ. పాంథజనద్రోహ మొనరింపఁ బవన నీకుఁ, జెల్లునసలాభిధానంబు చెల్ల దనిల
శబ్ద మచ్చట నిత్యసంసర్గఘటన, మహిజనంబుల కెల్లఁ బ్రాణమాదికంబు.

చ. మలయసమీర, రీతి గన మంచిది శబ్దము నుమ్ము శైత్యముల్
బలువులు సుప్రసాదత యపారము మాధురి హెచ్చు వాసనల్
గలుగు రసంబు పూర్త మని కా వినుతించు బుధాళి యట్టినీ
చెలువపురీతి నా చెవుల చెంత (నితాంత) కఠోర మేలొకో. ౧౧౦

—। శుకకోకిలాద్యుపాలంభనము ।—

క. కలకంఠి యిట్లు గదవు, మల మెల్లఁ గనుగాఁకఁ బల్కి మానక శుకకో
కిలబృందాళి హంసల, కలకలముల కలికి పలికెఁ గటకటపడుచున్. ౧౧౧

గీ. శుకసుకవి నీకవిత్వంబు శోభ గాంచు, మధురతరవాక్యరచనల మదనమూర్తిఁ
డాలుపుమై నీవు మీఁ దెక్క నోర్చితెల్లు, విషము మున్న త్తమతనిగోవితతి గాదె

గీ. యోగిజనులకు నానందయోగ మొసఁగు, నతిజడా యోగులకు నెల్ల నరతిఁ జేయు
నీమధురోక్తి యీయుక్తి నిజము సుమ్ము, శుకమృదూక్తుల కైవడి శుకవతంస.

చ. హరిపదదేశ మందు మహామధురంపు రుచుల్ స్వజిహ్వకిం
పరుదుగ నాని మాధవసమాశ్రయణైకనిబద్ధబుద్ధి మే
లిరవగునట్టి నీకుఁ దగునే శుకసత్త్వము మెచ్చి చూడుమా
హరిహరి యీఁడుఁజీవలకు నాంతర మెల్లను నొవ్వఁ బల్కఁగన్. ౧౧౪

చ. వలువ మొనర్చి భాణము ఘనం బగు శృంగ యేతదర్థముం
దెలియక శబ్దసామ్యమునఁ దియ్యవిచ్చరెరఁ బెట్టసాగి ర
ట్టుల నయన న్నిజోక్తులఁ గఠోరత మాను నె నీకుఁ గీరమా
తెలిసెఁగదా విధాత్రుఁగు విధించినకార్యము రిత్తవోవునే. ౧౧౫

క. సుక మానసీక చెవులకుఁ, సెక మాటి కౌనర్పనిది రసికమాధురియే
యిక మానుము ముఖజితకిం, శుకమా చల మేల బాలసుకమారకమా

చ. అనుసమయాపతద్విషధరాగతసమ్మదనర్తనానువ
ర్తన లొనఁగూడియు న్విషధరగ్రసనోగ్రత మించి తోఁశిఖం
డి నిను నుతింప మైఁ దలఁకు రీవిఁ గలాపము కేశపాశమై
మొనయ యిడూద్వహుండు ధరియించుట యెట్లులొకో మయూరమా. ౧౧౬

శా. లేదావంత యనుంగు నెవ్వగల జాలిం బొందఁగా నేరికిన్
లే దావంతఁ దుఃఖనై చెనంచు మది నోలిం గూర్మి యకావ్యాశిఖీ

నాదాఱి న్నినుఁ బెంచమూర్ప నిఁక నెన్నం గొంచె మా పాపమున్
రా దావ్యాకృతి దా నిపాతితమయూరవ్యంసకంబే కదా. ౧౧౯
సీ. చతురాననాకృతి సతతంబుఁ బూనుట గగనపథంబున గతులు గొనుట
నీరజంబులయందు నెఱిఁ గూర్మి వడయుట మాధవు చెలువు రా మదిఁ బొదలుట
ఘనకాలమున నప్రకాశతఁ బొందుట యురుధరాంతరసీమనుండి పడుట
కాలవృత్తులఁ గాంచి *కాంచముల్గా నుంట ఖగశబ్దవాచ్యత గలిగి మనుట
హంసనీకును ననుఁగన్నహంసునకును, దారతమ్యంబు గలుగు నెతలఁచి చూడఁ
బోఁడిమి ఘటించు మాతండ్రి పొందు డిగిన, యిందుఁ బోందు నీకెందు నిందితంబు
ఉ. పాలును నీరు నేర్పఱుపఁ జాల్పు మనట్టి(ది) గోపకన్యకా
పాలు నుదారకీర్తిరుచి పట్టిది యంచను నిన్ను నెన్నఁగాఁ
బాలయినట్టి నాదుమయి భావజు తెంపఱియింపగుంపు పెం
బాలుగఁ జేసి కన్ను జడి పాలుగఁ జేసితిగా సితచ్ఛదా. ౧౨౦
చ. మును దమయంతి నైషధుని ముచ్చట దీరఁగఁ గూర్చి కీర్తి చే
కొనియె మరాళచంద్రుఁ డది గోలె భవత్కుల మెల్ల నిర్మలం
బన నలరారు నమ్మహితునట్ల చరించుట నీకవశ్యమే
విను మటు గానఁ గృష్ణునకు వేచని తెల్పుచు నన్నుఁ గూర్పవే. ౧౨౧
క. కవికి వైదగ్ధ్యవలె నా, కవి కావైదగ్ధ్య యిష్టగతి ము న్నలరెం
గవిరాజ నీకు నేనుం, బ్రవిమలమతి నిష్టురాల భావింపఁగదే. ౧౨౨
గీ. తుల్యరుచిపక్షయుగమునఁ దొలఁగువానిఁ, గమలముల మేలు సైఁపక కందువాని
మేను సకలంక మైనను మెఱయువానిఁ, గూడకుము హంస తదితరగుణరిరంస.
చ. అనుపమమానసభ్రమరసాగమపల్లవసేవనక్రియా
జనితము లైనమాధవవశంవదతాద్విజవర్యభావముం
గనినటువంటి నీ కకట గాలిమఁ గన్ తొంగరెక్కి పంచమ
ధ్వని వచియించు †టిట్టు లుచితం బగునే పికమా తలంపఁగన్. ౧౨౪
చ. అకట సపక్షపాతత నయంబును బూనితి వంచు నమ్మినం
బ్రకటవిపక్షపాతమున వర్తిలి నీ వవిపక్షపాతమం
బికమ ఘటించె దేమిటికిఁ జేర్మి మదిం గదియించి ప్రోవు న
న్నిఁక మఱి యొంటు మాని వినుమీ కనుమీ పరపుష్టనామమున్. ౧౨౫

* కాఁడముల్గా ? † టిర్యాగ్రియుచితం-మూ.

గీ. మాటమంచితనము మహిలోఁ బ్రసిద్ధంబు, మాటమంచితనము మనకుఁ గలదు
చిగురు వోడచిరసము తెగఁద్రావుదానికి, నీకుఁ బికమ యదియు జోకగాదు

చ. సరసులపొంత హంసగణసంగతి సేయుచుఁ బద్మగహ్వరాం
తరముల నుండుచుం దనువు దాఁచుటకై భువిలో నదర్శన
స్ఫురణగఁ బువ్వునీరు పలుచోటుల భిక్ష యొసర్చునీకు ని
ష్ఠ్వరహులమీఁద నెట్లొదవె బెట్టగఁ గ్రోధరసంబు భృంగమా. ౧౨౮

ఉ. జీవనమాత్రనే తనివిఁ జెందుచు హంసకులంబు నాత్మగా
త్రావళిఁ జాలఁ దన్పుచు ననల్పమనోహరసుప్రసాదశో
భావృతమైన సారసచయంబులయాంతరసార *మెక్కు నీ
కేవిధి సీధుపాయికి నళీ దయపుట్టెను నయ్యయోగిపై. ౧౨౯

గీ. చాల సీధువుఁ గ్రోలుచు జడత నొంది, నీచతను గాంచితివిగాదె నీవు జగతి
నకట భృంగంబ సంబుద్ధి నాంధ్రశబ్ద, శాస్త్రకర్త మహత్త్వంబు సదివె నెట్లు.

వ. ఈరీతి నానారీతిలకం బబ్జవైరి నవమతించియు నలరువిల్తు నధఃకరించియు నలసపవను నవమానించియు నళుల నవహేళనించియు నంచల ననాదరించియు నాటపులుఁగుల ననురోధించియు, ననవిందుల నపాకరించియు, నతనుమావుల నపురస్కరించియుఁ దద్దర్శనంబునం దత్స్పర్శనంబునఁ దదనులాపాకర్ణనంబున వెతమేరమీఱిన యయోగపారావారంబున మునింగి మూర్ఛిల్లిన నుల్లంబునఁ దల్లడిల్లి నీలవేణీప్రముఖపల్లవాధరలు తెల్లవాఱు నెప్పుడో †తెల్లంబుగా నీమెతల్లిదండ్రులకు మేమెల్ల (మెల్ల)న నరిగి విన్నవించు టెప్పుడో యని యనితరాయత్తచిత్తలై యమ్మత్తకాశినికి నుత్తల మొక్కింత మెత్తంబడఁ దత్తదుపచారంబు లాచరించు చున్నయవసరంబున. ౧౩౦

చ. సరసుల నేర్చి చక్రముల సంస్మృతిఁ గాల్చి జగంబు వెల్వెలం
బారయఁగఁ జేసి వారుణికిఁ బోయె నిశాచరచంద్రుఁ డింక నీ
వరయఁగ రా నిదే సమయ మంచును సారెకు మిత్రుఁ బిల్చె నా
మొరసెడు గాలవేకు లటముందుగ నుత్త్వము ముప్పిధంబుగన్. ౧౩౧

శా. ఊకారంబు సవర్ణదీర్ఘయుగళీయుక్తంబు గావింపుచున్
జోకన్ హ్రస్వముఖస్వరాంకములఁ దా సూత్రంబున న్మాటఁ గా

*మిక్కు †తెల్లబు గానితల్లిదం-మూ

*వ్యాకర్తాముని మద్వచస్సరణి నుత్వం బచ్చట న్నాన మం
చూకారాకృతి త్రిప్రకారముగ మ్రోయుం గాలవిద్వాంసముల్. ౧౩౨

ఉ మిత్త్రుఁడు రాతి †రిచ్చెఁ దనమేలిమిఁ గైకొని పొంగి తండ్రి యీ
గాత్రము లెల్ల నుల్లసిల గారవ మొప్పఁగఁ బెంచె నింక న
మిత్త్రుఁడు గైకొను న్వసు(వు) ‡మేను లిఁకెట్లు ప్రోదిగాంచు నం
చాత్రము దోఁపఁ బెల్వ డిగి యాడుచు నుండెను దీపడింభముల్. ౧౩౩

క. నిలిపినదిక్కునఁ గుటిలత, దలఁపక సస్నేహవర్తిత న్నెలఁగు మముఞ్
వెలయింపఁడు ఖరకరుఁ డని, వెలవెలఁ బోయెను బ్రదీపవిసరం బెల్లన్.

చ. కువలయ మేర్ప నుగ్రకరగుంభన మై నినుఁ డేగుదెంచె స
త్ప్రవణత లే దరివ్రజము రాణయొసంగెడు యుష్మదీయమై
భవములు చెల్ల వేగుఁ డని బంధులఁ దెల్పఁగ వేగ వచ్చె నా
దివిఁ గనుపట్టె సూక్ష్మరుచిఁ దేలుచు వేగురుఁజుక్క చొక్కమై. ౧౩౫

క. అనుసృతశబ్దగుణం బై, కనికనముల వేగుఁజుక్క కడు నలరారెం
గననగుచుగనమిఁ గైకొను, చనువగు నయ్యర్థమునకు నతిమిత్రం బై. ౧౩౬

మ. ఉరుపూర్వాగనుసంగతిం గొనుచు నెంతో రక్తిమం బూనుచుం
గరము ల్పొంచె మహాంబురాసు లలరన్ ఖండించె నుద్యత్తమో
భర మెంతే నపరాగమంబు గనుమన్ భావింపఁజేయుం దమో
భర హారా ద్విజరాజు చిత్రగతులం బాటిల్లి చూపట్టెడిన్. ౧౩౭

చ. అరులు దొలంగ నత్తువలయంబు చెలంగ సమస్తవర్ణముల్
సిరులు మెలంగ బల్తమము చెన్ను దొఱంగఁగ రాజు రాణమై
గరము వసించి కాలగతిఁ గ్లుసిరు ల్విడనాడి పోవుచున్
జరమఘనాగమంబు గొని సారమహాంబుధిఁ గ్రుంకె గ్రక్కునన్. ౧౩౮

—। సూర్యోదయవర్ణనము ।—

క పూర్వమహీధరశిఖరా, ఖర్వాసన మెక్క నినుఁడు కడురక్తిన్ రా
సర్వదిశలన్ ద్విజోక్తులు,పర్వెఁ దదభ్యుదయవిభవపటుబీజము లై. ౧౩౯

సీ. ఇనుఁడురా నుదయాద్రిఘనభద్రపీఠిపైఁ బఱచిన నునుగెంపుపఱపనంగ
నమ్మిత్రురథరశ్మ లై మెలంగెడు చిల్వపడగలరతనాలభాతి యనఁగ
నజహూప మైనట్టి యంబుజాప్తుని మేని పురతఃస్ఫురత్కాంతిపూర మనఁగ

* వ్యాకర్తాముని † రిచ్చ ‡ మేనులిపెట్టులు.—పూ.

నినుసిరి మగుడంగ నిడ నెమరేగిన సతనాలుకలవేల్పుచాయ యనఁగఁ
బరిణతేంద్రమతంగజప్రబలదంత, కుందముఖదారితోదయకుధరహైమ
తటసముత్పతగురురేణుపటలమనఁగ, సాంధ్యరాగంబుతోలుదెసఁజాలనలరె.

సీ. చెలువులు గుల్కెడుసీమంతరేఖపై సొగసూను కుంకుమ జొఁగ గాఁగ
సింగార మొనరెడు చెక్కుటద్దంబుల దీపించు పూఁతచందిరము గాఁగ
విన్నాణములు గాంచు వీనులఁ గ్రొన్ననరాణించు కర్ణపూరములుగాఁగఁ
గొమరు సిబ్బెపుగబ్బిగుబ్బలఁ బవడాలఁ బురిణించు బలుబన్నసరులుగాఁగఁ
దనదు కెంజాయలకు నాస దండడింప, విప్పుగంటులతోవకెంటులొప్పమీఱఁ
బొఁడుపుగుబ్బలిగుబ్బలపొందుసేయ, దండిఁగనుపట్టె మార్తాండమండలంబు.

సీ. అందుగుఁజగు రంచు బృందారకస్వామిసామజంబు కరంబు సాఁపఁజూడఁ
బలుకుఁబూఁబోఁడిరైమెలఁగెడుచామకై చిలుకబింబంబంచుఁజిదుమఁజూడఁ
దళుకుఁగెందామరతండం బని *విరించి పడివాగె రాయంచ తడవఁజూడ
మహితకుంకుమకర్దమంబంచునూహించియగచరాంగనలెల్లనలఁదఁజూడఁ
గెంపుడా లంతటంతటఁ గీలుకొనఁగ, నుదితుఁ డయ్యెను జగదేకవిదితకీర్తి
యాదివాఙ్మూర్తి ద్రుహిణరూపానువర్తి, సంహృతనతార్తి ఖేచరచక్రవర్తి.

సీ. సన్నుతిశ్రుత్యర్థసత్కర్మమర్మంబు నొఱపుఁ దెల్పెడు మేటిరొజ్జ యనఁగ
†జగదుత్ప్లవోదయశాంతిక్రియార్థమై వఱలెడు పటుహోమవహ్ని యనఁగ
జలవాసనియత యోగాజలజినీతతితపఃఫలము గైకొన్న వివర్త మనఁగ
జక్కవపులుఁగుల స్రుక్కించు విరహాగ్ని మానింప దీపించుమణి యనంగ
మూఁడుమూర్తులతోఁ గూర్చి ముచ్చదువులఁ
బొడుపుగుబ్బలిశిఖరంపుమూషలోన
మొనయ ఘటియించి చేసిన ముద్ద యనఁగ
నింబు మీఱంగ నహిమాంశుబింబ మలరె. ౧౮౩

క. సతతేజీల ఖురోద్ధత, హతిఁ దుము రగుపూర్వపర్వతాగ్రస్థలి ను
ద్గత మైనరజము గ్రమ్మిన,గతి నినమండలము కెంపుగదురఁగ నొప్పెన్.

సీ. అఖిలనేత్రాంధ్యసిద్ధాంజనకళికలు తిమిరోపసంహారదీపశిఖలు
భూమీరుహాగ్రప్రభూతపల్లవములు ‡కమలినీతంద్రీవిఘటనబంధు
లక్షీణఘూకౌఘవీక్షణపటలంబు లంబరాంచలతప్తహైమరేఖ

*తలంచి †జగదుత్ప్లవోదయ ‡విఘటనవొందు-మూ

లురుయాగవహ్నిసంస్ఫురణైకధౌయ్యలు కైరవనిద్రానుసారిగీతు
లతివిరహికోకసాంగత్యచతురచేలు, లుడుగణోత్పాతకర్ణేజపోత్తమములు
దిఙ్మలినతాప్రమార్జనదీప్రవారు, లినకరచ్ఛవిమాలిక లింపుగాంచె. ౧౪౫
సీ. ముద్దుదుగడచ్ఛిమోములొందెడుసామిబారపోఁడుములూనుబలిమికాఁడు
చుక్కలచెలికాని జోడైన నెఱవాది తొవలమే లోర్వనిదుండగీఁడు
తమ్మితావులఁ దావి గ్రుమ్మరించు ననుంగు వేవేఁడిచాయల వింతలాఁడు
ముత్తొంటిచదువులు హత్తుమైఁ గలమేటి పగడచక్కనగుజాలసొగసుజాణ
పగలు గావించుచును జుట్టమగునొయారి, జగజంతవేల్పు
కుంటిగడపరి యొకబండికంటితేరు, గడప రిక్కలతెరువున నడవఁదొడఁగె.
క. భీకరతమోంబురాశిన్, జోకతి పడియున్న జగము శుంభద్వేగో
ద్రేకత మిత్రుం డొగిఁ దన, వేకరముల నుద్ధరించె వేకనుపట్టన్. ౧౪౭
క. ?తొలుదెసయును పేర్మొదలగు, కలపేరులపుట్టినిల్లు కరువలిజేజే
చెలికాని కప్పు లొసఁగెడు, బలుసిరులవెలుంగు బ వెలిఁగెన్. ౧౪౮
గీ. అపుడుసప్తాశ్వుఁడఖిలశబ్దార్థములను, నవనవోన్మేషమెసయించినలుఫ్రుపతిచె
నబ్రమా యిది సర్వశబ్దార్థజాల, మహితకరమండలుం డైనమా(న్యమతికి)
సీ. నానావిధార్థసంధానవివాసంబు సత్కాంతికరపదసంగతంబు
నకలంకసుందరం బతులప్రసాదంబు ననుపమాజోగుణాత్యద్భుతంబు
నసదృశానఁదనిష్యందధారేయంబు బహురసగ్రహణైకబంధురంబు
గువలయమోదసంకోచనప్రవణంబు బుధకవిసంయోగభూషితంబు
సంగరౌదార్య మఖిలభూషణ ముపాత్త
విష్ణుపద మాచుఁ గవిచంద్రవిరచితంపుఁ
గావ్యమనఁ గోవిలాసంబు గడు సరసుల
నలరఁజేయఁగ సూర్యమండలము దనరె. ౧౫౦
క. అరుదైన లోకమిత్రత, కరము ప్రసిద్ధంబు గాఁగఁ గడునామోద
స్ఫురణ దయచేసి యరులన్, సరసుల సరిగాఁగ నేలె జలజాప్తుఁ డొగిన్.
గీ. అఖిలపదదర్శనా , వ్యాకృతి యొనర్పఁ దాఁ బూని యఖిలసంజ్ఞ
లప్రతీకప్రకాశత నమరఁజేసి, మఱచెఁ గాఁబోలును భసంజ్ఞ వఱలఁజేయ.
ఉ. చాయల సారుహావారముపైఁ దమోరిపుం
బాయక డాఁచునంచు గిరివర్గముపైఁ బగవానియాంధ్రబ

ల్చాయల మారాకు నంచు సురజాలపథంబుపయి న్సరోవరూ
షాయతదృష్టు లుంచె నన నంబుజబంధుఁడు నించెఁ గ్రొంజిగుల్. ౧౫౩

చ. తమము నిరాకరించి...... ౧౫౪

(ఇక్కడఁ గొన్ని పద్యములు లేవు)

—॥ కాళిందియవస్థఁ జెలి సూర్యునకుఁ దెల్పుట ॥—

సీ. అవధారు దేవ లోకారాధ్యనిజరూప వినఁగదే జగదేకవిమలదీప
యాలింపవే భక్తజాలరక్షణదక్ష చిత్తగింపవె హాతోచ్ఛ్రితవిపక్ష
యాదరించవె సహస్రాంశుమాలాధుర్య మనవి చేపట్టవే మహితశౌర్య
మది నిల్పవే వేదవిదితసద్గుణగణ్య యభయ మీఁగదె మహాప్రభువరేణ్య
పలుకు వినఁజూడఁగదవయ్య జలజమిత్ర, తలఁపులీడేర్పఁగదవయ్య కలుషజైత్ర
ప్రేమ నాయెడ నిల్పు ముద్ధామధామ, చక్క నిటు చూడవే గ్రహసార్వభౌమ.

సీ. సకలలోకానీకసంరక్షణ పరాకు తిమిరోరుగజమృగాధిప పరాకు
కమలప్రమోదసంఘటనధుర్య పరాకు హతభీమనిగ్గరాహిత పరాకు
బ్రహ్మాదిమూర్తిసంపద్బంధుర పరాకు వితతత్రయీరూపయుత పరాకు
భవ్యాంబరాంగణదివ్యదీప పరాకు నిరుపమగుణరత్ననిధి పరాకు
కలితకారుణ్యపూర్ణవీక్షణ పరాకు, నతమనోరథపూరణవ్రత పరాకు
ధార్మికోత్తంససేవితోదయ పరాకు, తపన మార్తాండ సంవిదాత్మక పరాకు.

గీ. సామి నేఁ జెప్పునది యేమి సకలకర్మ, సాక్షి వై నీవు సర్వశాస్త్రములయందు
నధికరూఢత మెలఁగెద వయిన నేను, నబలఁ గద నాదువచనంబు లాలకింపు.

క. కలకంఠి మీదుసన్నిధిఁ, గలగానము సేయ వినఁగఁ గడునలరుచు న
క్కలహంసి వచ్చి తెలిపెఁ, జలజాక్షునిమహిమ మీకుఁ జతురత మెఱయన్

క. తెలుపుచు నంతట నిలువక, జలజాక్షుఁడు నీదుబిడ్డసహచరుఁ డగుచున్
మెలఁగఁగలవాఁడు సుమ్మీ, పలు కిది నిజమంచు నాఁడు పలికి చనెఁగదా!

క. అది విన్నది మొదలుగ న, మ్మదిరేక్షణ హృదయవారి మాధవగజముం
బదిలముగ రాగశృంఖలఁ, గుదియఁగ బంధించె నధికగోప్యముగాఁగన్.

క. వనితకు నది కారణముగఁ, దనువున నంతంత కతనుధర్మము పర్వెన్
విను మనలకీల యార్ద్రేం, ధనమునఁ బలె సకలసుజనధర్మనిధానా! ౧౬౧

గీ. ప్రకృతి ననుసరించి పరఁగును జగతిలో, వికృతి యిద్ది వింత వెలఁదియందుఁ
బ్రకృతి నడఁచి వికృతి ప్రబలమై కనుపట్టె, నఖిలగుణసనాథ యజ్ఞనాథ.

ఉ. ఇంతికిఁ బుట్టునిర్వికృతి యేమి యొకో యని కొన్నినాళ్లు తే
మెంతయు సంశయం బెద వహింపఁగ నుంటిమి రాఁగ రాఁగ నే
కాంతము మాని బైలుఱుకునట్టివచోరచనం దమూలతై
కాంతసతాంతతాదివికృతాకృతి సందియ మేగ మాకొగిన్. ౧౬౩

గీ. అరయఁడనినిన్నుఁగోపించియతివప్రాతి,భత్యముభరించెనేమొతాఁబద్మమిత్ర
తన్వవస్థలు నీవు ద్వాదశతఁ బూనఁ, ద్వాదశాతన్వవస్థలు తరుణిపూనె.

ఉ. తల్లిన పోలుఁ గూఁతు రను ధార్మికవాక్యము పొల్లువోయె నేఁ
దల్లినిఁబోలఁ జాయవలెఁ దద్దయు శైత్యముఁ *జెందకుందు నే
తెల్లముగాఁగఁ దండ్రియగుతీవ్రమయూఖునిఁ బోలి కాఁక మే
నెల్ల మునుంగ నుంటి నని యిందునిభానన పల్కు నుల్కుచున్. ౧౬౪

సీ. తలిరాకుఁబోఁడియాటలమీఁదియనురక్తి వంధ్యాసుతక్రీడవాసిఁ దెగడుఁ
గలికి పాటలమీఁది ఘనతరామోదంబు మృగతృష్ణికావారిసొగసుఁ గాను
నతివభూషణధారణాభిలాషస్ఫూర్తి శశవిషాణముతోడ సరసమాడు
నెలనాఁగసరసాన్నగిళనవాంఛోదయం బంబరసుమము నొయ్యారమెనయుఁ
బణఁతిచీనాంబరలతాంతభరణకాంక్ష, యపదవాక్యార్థవైఖరి నపహసించు
బాలికామణితనుధృతిలాలసంబు, నప్రణవవేదపారంబు ననుసరించు.

గీ. కాఁక యుడిగినపుడు కలదు సత్త్వగుణంబు, మీకుఁ గాన నింతిమిమ్ముమించుఁ
గాఁక మేన మిగులఁ గడుసత్త్వగుణముల, నెనిమిదింటిఁ బూను నెపుడువింటె.

క. ఇంతి యవియోగమహాగద, శాంతికి నస్మత్కృతోపచారములు దివా
కాంత చ్యుతమయ్యె నచ్యుత, కాంతోపస్మృతిన్ ఘటించి కరుణింపఁగదే.

ఉ. మన్నొకనాఁడు నీతనుజమోహము దెల్పఁగ వచ్చి సందడిం
గన్నకతంబునం దెలుపఁ గార్యము గా దని పోయి తప్పు డీ
మెన్నుప నయ్యువియోగరుజ యింతకుఁ దెచ్చె ఔయుంగనైతి నా
విన్నప మాలకింపు మిఁక వేదన కోర్వదు కూఁతుఁ బ్రోవవే ౧౬౮

ఉ. ఈగతి నీలవేణి తనయుంపులకూఁతు నవియోగయాతనా
యోగము విన్నవింపఁగ ననూనకృపాకలితాశ్రువాఃపృష
ద్యోగము.గాఁగ దీప్రపుమయూఖసహస్రము చిట్చిటస్వనా
భోగముగా నొకింత వడిఁ బొందిక దప్పక తత్క్షణంబునన్. ౧౭౦

*జెందకుందు నే—మూ

గీ. ఛాయమాయఁగఁదనమేనిచాయవోలె, జాయసచుదేరఁదనుజాతచాయఁదొల్త
వేయుచాయలమనసుతో వేగ నడువ, జాయపెన్మిటివచ్చెఁ దత్సదనమునకు.

ఉ. వచ్చి యసంస్కృతాంగి యయి వాడుచు జీవితనైరపేక్ష్యమే
హెచ్చు చనుక్తవాచ్య యయి యాహితయోగము దప్పి శాంతిలే
మచ్చుపడంగ నస్తాగతి నందనివర్ణము గాంచి పైపయిన్
విచ్చక క్రమ్ము కష్టత నవేతృకృతిన్ హసియించు పైదలిన్. ౧౭౨

సీ. శుక్తికానిర్గతముక్తాఫలంబులకరణిఁ గన్నుల బాష్పకణము లొలుక
రాహునిర్ముక్తపూర్ణనిశాకరునిమాడ్కి ముద్దులనెమ్మోము మురువువదల
వనవహ్నిశిఖలచే బలె వేఁడినిట్టూర్పుగాడ్పుల దిశలెల్లఁ గాంతివిడువఁ
దాపాబ్ధిశైవాలరూపమై కనుజడి జడగట్టి పెన్నెఱుల్ చాయ దఱుఁగఁ
గాఁకచేఁజీర్ణమైఁ పూఁతగంధము నశుఁ, దోఁచుపడియస్త్ర వారులుదోఁగిమిగులఁ
బంకమగుపాన్పు నెలవునఁ బడుచు లేచు, నుస్సురుసురంచు*వలవంతనున్న దాని.

చ. తనుభవఁ గాంచి మేను మది తద్దయు†జల్లన వేకరంబులం
దనువు మనంబుతో మిగులఁ దాపము చెందఁగఁ గౌఁగిలించి చ
క్కనితొడమీఁద నిల్పి జడకట్టిన పెన్నెఱి చిక్కుదీర్పఁగా
నోన రొకయింతలేక యవి యొక్కెడఁ జేర్చి ముడి న్రచింపుచున్. ౧౭౪

గీ. చెక్కునొక్కుచు ముద్దాడి శిరముఘ్రాణ, విషయముగఁ జేసి నెమ్మేను వేకరములు
వెక్కసపుటూష్మ మనసు శోఁజిక్కపడఁగఁ, బలికె మధురంబుగా లోకబాంధవుండు.

క. తల్లీ వరనారీమ, తల్లీ నీతల్లి మనసు తల్లడపడ నా
యుల్లము జ ల్లన నీకీ, పల్లట మేలమ్మ మేలుబంగరుబొమ్మా. ౧౭౬

గీ. పడఁతి మత్పూర్వపటుతపఃఫలమ వగుచు, ఖ్యాతి మీఱఁగ దనుజాతవైతివీవు
నీకతంబునఁ గద నాకు నిఖిలలోకవల్లభుండైన శ్రీకృష్ణుఁ డల్లుఁ డమరు.

క. అస్తంగతిరహితాధిక, శస్తాభ్యుదయంబు నాకు సమకూరు ‡నిఁకన్
నిస్తులసుగుణాంగన యరి, హాస్తుడు లోకైకకర్త యల్లుం డగుటన్. ౧౭౮

ఉ. శీలగుణాభిరూప్యసవిశేష్యకళాచతురత్వవైఖరీ
శాలిత గల్గు నీకు హరిసంగతి గల్గ సమాఖ్య భూషణం
బేల మెలంగకుండు సుజనేరితవాక్కుల నాకుఁ గల్గదే
మేలసమాఖ్య వోవఁగ నమేలసమాఖ్య వరింప రాఁ గనన్. ౧౭౯

---

* బలువంత † జిల్లగ. ‡ నికన్ నిస్తులసుగుణాంగనయరి—మూ. నిశున్...సుగుణాంగనియరి హాస్తు—అనియుఁ బఠింపవచ్చును.

క. ఆనాయకమణి వక్షో, ధీనముగాఁ జేయఁదివిరితివి నేను దధా
*నూనాకల్ప మొనరుతుఁ, మానిని యిచ్ఛార్య మమరు మది సంశయమా.
క. అమ్మా పురుషమణికిఁ బలు,తొమ్మున నిలుపంగ నీకు రుచి గల్గినఁ జో
క్క మ్మది కుదురఁగ నొకసూ,త్ర మ్మతిసూక్ష్మమ్ము గలదు దానిం గొనుమా.
వ. అది యెయ్యది యంటేని. ౧౮౨
చ. దనుజవిభేది లోఁగొనఁగ దానతపోముఖయోగముఖ్యసా
ధనములు పెక్కు గల్గు నని తద్దయు వేదము పల్కు వానిలోఁ
బనుపడుసాధనంబు దృఢభక్తియ దానిన పూని నీవు న
వ్వనజదళాక్షు ధ్యానమున వశ్యు నవశ్యముఁ జేయఁగాఁ దగుఁ. ౧౮౩
సీ. అనుపమానేచనకాంగకంబులవానిఁ దరుణాభ్రసన్నిభతనువువాని
శ్రీవత్సకౌస్తుభశ్రీవిలాసమువాని బాహాచతుష్టయపటిమవానిఁ
దమ్మియింటిసెలంత దనరువక్షమువానిఁ బంచాయుధోద్దీప్తబలమువాని
మేలిమిబంగారుమెఱుపుచేలమువాని భవ్యశేషాహితల్పంబువాని
దివ్యనవరత్నకీలితదివ్యదగ్ర్య, హారకుండలమకుటకేయూరముఖ్య
భూషణోదారరోచులఁ బొలుచువాని, వెన్నుని భజించిసుఖయింపు కన్నతల్లి
గీ. ఇంతి కతిపయదినముల కీసమాధి, నీసమాధిని హరియించు నిజముగాఁగ
మెచ్చి యాఖేటమిషమున వచ్చి నిన్ను, నలకపటయాదవుం డైనహరి వరించు.
శా. సారోదారపనీనివాస మఖిలస్వర్వాపినీవారసం
చారస్ఫీతము సంవసజ్జనమనశ్చాంచల్యమాలిన్యసం
హారైకప్రవణంబు యామునతటం బచ్చోట నున్నిర్మిత
స్ఫారాగారమునందు నెచ్చెలులతో స్వామి న్భజింపందగుఁ. ౧౮౪
గీ. వనిత కాళిందితీరమె వర్ణ్యమగుచుఁ, దగు నుదాత్తవిభూషణోదారశక్తి
నచట నీవున్న మఱియు మే లమగుఁగాదె, యెల్లయొప్పులకుప్ప వు తల్లి నీవు.
గీ. చెలువ కాళిందిమహిమంబు చెప్పఁదరమె, తద్విసీలపయఃస్ఫూర్తి తనువుసోఁక
మతికి నీలిమ రక్తిమ మాని మిగులఁ, దెలుపు కనుపట్టుఁ జిత్రమో కలువకంటి.
క. శ్రుతిగదితమహిమ సర్వ,శ్రుతిభూషణసుగుణ యమున సుమ్మీ తద్వి
శ్రుతి పాపహరము గాదే, శ్రుతియుగళనిరుద్ధనయనసుందరవదనా. ౧౮౫
క. హరి†శైశవనవవిస్మయ, కరలీలాజన్మభూమి కాళిందితటం
బరుదా యది ‡భావికయు, స్వరకవివాక్కులకు మిగులవర్ణ్యము గాఁగన్.

* నూనసంకల్ప మొనరితి † శైశవ ‡ భావిక-మూ.

ఉ. అమ్మరొ కన్నవారి నెడయుం బనివచ్చె నటంచు మానసం
బుమ్మలికం బడంగఁ గడు నొప్పమిగాఁగఁ దలంపవమ్మ నీ
నెమ్మదిఁ బాయఁ జాయ కొక నేరుపు సిక్కునటమ్మ నాదుపా
దమ్ములు నిల్వ నేరవు గదమ్మ భవద్గృహ మొందకుండినన్. ౧౯౧

ఉ. చుక్కలదారిమానికము సొంపులకూఁతురి నిట్లు తేనియల్
చొక్కిపడంగఁ జేయు మృదుసూక్తులు పల్కుచుఁ దత్సమాధిఁ దా
నిక్కముగా నెఱింగి గృహనిర్మితి సేయఁగ దేవవర్ధకిన్
గ్రక్కునఁ బన్పెఁగా నతఁ డఖండనిజాద్భుతకృత్యచాతురిన్. ౧౯౨

సీ. రమణీయనాయకరత్నబంధురంబు నవవిధవస్తువైభవయుతంబు
శ్రీకరాంకాంచత్పతాకాభిరామంబు నురుసుంగళార్థపదోజ్జ్వలంబు
దీవ్యత్ప్రపంచసంధిప్రోల్లసితంబు సిహామృగభిదావగాహితంబు
గగనావలంబివాక్యస్ఫూర్తి మహితంబు మధురవాక్కవిజాలమానితంబు
చిత్రసదలంక్రియాగణోజ్జీవితంబు, సద్భుతరసాఢ్యపాత్రంబు నాత్తదోష
పాటనంబు సునగుచొప్పి నాటకంబు, క్రియఁ బ్రకాశించు నొకదివ్యగృహ మొనర్చె

గీ. అట్టులగ్గేహ మొనరించి యమరతక్షుఁ, డంబుజాప్తునకెఱిఁగింపనలరి యతఁడు
సమ్ముఖంబునఁ జాయతో జాయ మొనరఁ, గూఁతు రావించి పలికె సాకూతుఁడగుచు

క. రమ్మా శంబరరిపుమా, యమ్మా యగ్గేహమునకు ననుఁగుఁజెలులతోఁ
బొమ్మా తపంబు గొను మభ, యమ్మా హరి నీకొసంగు నమ్మా యమ్మా.

ఉ. ఘోరతపంబుచే నధికకోమలవల్లి* యనుంగుఁజుట్టమా
నీరుచిరాంగయష్టిఁ గడు నేఁచ మనంబు దయావిహీనమై
మీఱఁగఁ జూచుచుండెదు సుమీ హరియాన సుమీ నెలంత చె
న్నారఁగఁ గన్నవారిపయి నానసుమీ పరికించి చూడుమీ. ౧౯౫

క. † మన మొప్పినఁ దను వొప్పదు, తను వొప్పిన నిట్టికష్టదశ నేనొప్పన్
విను మే నొప్పిన నొప్పదు, జనని నీజనని ప్రేమసంరంభమునన్. ౧౯౬

క. దెప్పరపుఁగార్య మూనిన, నప్పగు కాళిందిమేన నగ్గలమగుఁ గా
కప్పొలను టంతరంగము, దప్పని యావిలతతోడఁ దరళమృగాక్షీ. ౧౯౭

గీ. అమలినం బైనమానసం బబ్బెనేని, రాజయోగంబె సర్వకార్యములు దీర్చుఁ
జిత్తసంశుద్ధి లేకున్నఁ జెలువ బాహ్య, బహువిధాయాసచేష్టల ఫలము లేదు.

---

* అసంగుజటుమా. † మనువొప్పిన-మూ.

ఉ. కావున రాజయోగినివి కమ్ము మదంబ కరోరకృత్యముల్
భావములోఁ దలంపకుము భాస్వదసంగసదంబుమార్జనో
ద్భావముచే మనోంబుజ ముదస్తరజోమల మై యెసంగ నం
దావనజాక్షు నాత్మవిభు నంచితభృంగముగా రచింపవే. ౨౦౦

క. నాలుగుపురుషార్థములం, జాల ఘటింపించునట్టి సాధనములలో
మే లేర్చిరి ధ్యానం బని, నీలాలకి సర్వశాస్త్రనిశ్చయకర్తల్. ౨౦౧

సీ. బహుసంభవార్జితబహుపాతకవ్రాతవిపినమహావహ్ని విష్ణుభక్తి
మానసరాగాదిమాలిన్యపరిహారవిమలాంబుపూరంబు విష్ణుభక్తి
తాపత్రయోదారదావవైశ్వానరవిపులధారావృష్టి విష్ణుభక్తి
చతురర్థసిద్ధిసంపాదనక్రియావిదితాంజనంబు శ్రీవిష్ణుభక్తి
సకలసత్కర్మసాద్గుణ్యసంపదలకు, వేల్పుమొదవులమేల్బంతి విష్ణుభక్తి
సద్గురుకటాక్షసముపాత్తసాధుబోధ, విద్యలకు నెల్ల ఫలము శ్రీవిష్ణుభక్తి.

చ. అరయ నభేద మన్నపలు కానెడు పెద్దలకేని జీవనం
బురుజపహోమయజ్ఞదృఢయోగముఖాఖిలసాధనక్రియో
త్తరసఫలత్వకారణ మఖండపదార్థనిరీక్షణక్షణా
పరనిరపేక్షసాధనము పంజకలోచనభక్తి నందనీ. ౨౦౩

క. అటుగాన భక్తిపూర్వక, పటుతరతద్ధ్యానయోగపాటవ మెసఁగన్
ఘటియిల్లఁ గామితము వడి,నటమట మని యెన్నఁబోకు మరయునిజముగన్

గీ. అరసి ప్రాగాదిదిగ్వ్యవహారబీజ, మయిన ఱేఁ డిట్లు తనకూఁతు నమరఁ బలికి
కూఁతు నెడఁబాయువగలడగ్గుతికవడఁగ, నని యెదడఁబాటుదోఁపనెయ్యపుంజెలు

చ. పదమున నర్థమున్ బలెను బాయకయుండెడు బాల గోల యి [లకు.
మ్ముదిత తపంబు సేయుపని మోయుట మ మ్మెడఁబాయు మీకు మా
కొదవెడు ప్రేమ దీనిపయి నొప్పెడుఁ గావున నప్పగించెదం
బిదప నెలంతలార వలపించిన పెన్మిటి కప్పగించెదన్. ౨౦౬

ఉ. అంతట ఖేదమోదజనితాశ్రులు కోష్ణము లౌచు నేత్రసం
క్రాంతము లైన మంగళము గా దని క్రుక్కుచు స్రుక్కుచు న్రమా
కాంతునిదక్షిణంపుబలుక న్నగు వేలుపు బిడ్డహస్త మే
కాంతపుఁబ్రేమఁ గేల నిడు చాదృతిమై నను నీలవేణికిన్. ౨౦౭

శ్రీ

# వేంకటనగాధిపతిశతకము.

—( మంచెళ్ల కృష్ణకవి. )—

ఉ శ్రీమహిళాభిరామ మునిశేఖరసంస్తవనీయ తోయద
శ్యామ మరుల్లలామ సమరాంగణభీమ నితాంతవైభవో
ద్దామ సమస్తభవ్యగుణధామ మహీజనపోషహృత్ప్రశ
స్తామితనామ వేంకటనగాధిపతీ విలసత్కృపామతీ. ౧

ఉ భూజనసంచయత్రిదశభూజ (సమర్చితదే)వతాపరి
వ్రాజ మహాహితాహిఖగరాజ దరస్మితసుందరాననాం
భోజ వచోవిలాసరసమోదితలోచనకర్ణరాజహా
రాజబిడౌజ వేంకటనగాధిపతీ విలసత్కృపామతీ. ౨

ఉ (సంతతమి) త్రహృద్వనవసంత సురారికృతాంత మంజుల
స్వాంత నితాంతకాంత గుణవంత నిరంతరభాగ్యవంత (యు
త్యంత)యశఃప్రపూరితసమస్తదిశాంత సుశాంత సర్వవే
దాంతనిశాంత వేంకటనగాధిపతీ విలసత్కృపామతీ. ౩

ఉ. సుందరతుండ తాపసవిశుద్ధమనోబ్జమిళింద సంతతా
నంద వసిష్ఠనారదసనందనవంద్యపదారవింద గో
వింద సమస్తలోకపరివిశ్రుతకీర్తిజితాంబుజాసన
స్యందన(బృంద) వేంకటనగాధిపతీ విలసత్కృపామతీ. ౪

ఉ. తోయదనీలకాయ గతదోషనికాయ నికృత్తమత్తదై
తేయ నతాంజనేయ శతధృత్యమరాధిపమానసాంబుజ
ధ్యేయ రమాసహాయ తరుణేందుకళాధరగేయ సంతత
న్యాయవిధేయ వేంకట...... ౫

ఉ. శ్రీశ జగన్నివేశ మునిబృందమనోబ్జదినేశ తారకా
కాశనదీద్యుకేశశశికాశబలశ్వసనాశనేశనీ
కాశ యశఃప్రకాశ పరిఖండితదుర్భవపాశ కేశిమూం
సాశివినాశ వేంకట...... ౬

ఉ. పంకజగర్భముఖ్యసురపార్థిశశాంక వినిర్గతాశ్రితా

తంక సురూపభావవిజితప్రథితాభినవీనకోటిమీ
నాంక సుధాంబురాశితనయాసమలంకృతపావనైకవా
మాంక శుభాంక వేంకట...... ౭

ఉ. హాటకసత్కిరీట చరణాబ్జవివేశితసర్వదేవతా
కోటికిరీట కూటరుచిగుంభితభాస్వదురఃకవాట లో
కాటఖరేషుఖండితనిశాట మనోజ్ఞలలాట రంగద
భ్రాటనఘోట వేంకట...... ౮

ఉ. దండితవైరికాండ దురితవ్రజగాఢతరాంధకారమా
ర్తాండ భుజావిశాలజితద్విపతుండ సమగ్రశార్ఙ్గకో
దండ మహోగ్రకాండ పరదర్పణగండ పిచండపూరితా
జాండకరండ వేంకట...... ౯

ఉ. భాగవతానురాగ పరిపాలితనాగ వ్రజాంగనైకసం
భోగ పదాబ్జరాగరుచిపుంజసురంజితవర్ణనీయస
ర్వాగమమానినీమణిశిఖాంచితభాగ శ్రితాంతదైన్యభూ
తాగ ధృతాగ వేంకట...... ౧౦

ఉ. శ్రీతరుణీసమేత నతజిష్ణుముఖామరజాత సద్గుణో
పేత కిరీటిసూత పటుభీకరసాయకమర్దితాహిత
వ్రాత త్రిలోకపూత రసవన్మురళీమృదుగీత పాతకా
ద్రాతతవాత వేంకట...... ౧౧

ఉ. బాణకళాప్రవీణ శ్రితపాలనకార్యధురీణ పత్రికం
ఖాణ మదాసురాసుహృదఖండకృపాణ సమస్తచేతన
త్రాణ సరోజబాణవిమతప్రకటోజ్జ్వలబాణ నిత్యక
ల్యాణ పురాణ వేం...... ౧౨

ఉ. దాసమనోజ్ఞవాస వినతత్రిదశాగశరాస సత్త్రధా
భ్యాసమనోజ్ఞవాస సుమహన్మణిమండనభాస నందిత
వ్యాస సువర్ణవాస నిగమాంతనివాస శశాంకచంద్రికా
హాసవిలాస వేంకట...... ౧౩

ఉ. వేదదరద్వినోద సురబృందమయూరపయోద నిర్మలా
మోద త్రిలోకపూజితసముజ్జ్వలపాద గజేంద్రఖేదవి

చ్ఛేద వినిర్గతాఖిలవిశిష్టవిషావ వృషోరగాదియు
ర్త్యాదవిభేద వేంకట...... ౧౪

చ. వసుమయవాస వాసవభవద్రుహిణాసురభాసమానమా
నసకజహంస హంస
రసవిమలాక్ష యక్షయశరప్రహతారివరాస్యవాయవా
యసముదఘాతి వేంకట...... ౧౫

చ శరధిగభీర భీరహితశత్రుగిరీంద్రశతార తారకా
వరరుచిసార సారసభవస్తుతసద్గుణవార వార(ణ
స్ఫుర)దవతార తారకయశోవిభవోజ్జ్వలభారభారసా
హారణవిదార వేం...... ౧౬

చ. గురుచరణాంబుజాతములకుం బ్రణమిల్లి సమస్తసత్త్వవి
శ్వరుల మదిం దలంచి బుధవర్గములం గొనియాడి సద్రసో
త్తరముగ వృత్తపద్యశతకంబు నొనర్తుఁ బరిగ్రహింపుమీ
యరమర లేక వేంక...... ౧౭

చ. సకలకళావిశేషములజాడ లెఱింగినవాఁడఁగాను తా
వకకమనీయనిర్భరకృపారసభాసురవీక్షణాప్తిచే
సుకవితఁ జెప్పఁబూనితి యశోనిధి యింకిట నన్ను జంటవా
యక ఫలమిమ్ము వేంకట ..... ౧౮

చ వికసితపుష్పదామముగ విస్ఫురితోత్పలచంపకాభిధా
నకఘనవృత్తపద్యము లొనర్చి దృఢంబుగ భక్తలోకపా
లకునకు నీకు నిచ్చెద నిలాపతి దీనికి నీ వసూయసే
యక గయికొమ్ము వేంకట.. ... ౧౯

ఉ. ఇమ్ముల నాయకబ్బము రహిం రసవంతముగాక యున్న నం
దమ్ముగ నీదువర్ణన ఘనమ్ముగ నట్లనఁ గల్పవృక్షముల్
కొమ్మలు వంకలైనఁ గడుఁగజ్జునం గొఱఁతౌనె దానియో
గ్యమ్ము గణింప వేంకట...... ౨౦

చ సలలితమైన మీచరణసారసము ల్వికసన్నవోత్పలో
ద్వాసితచంపకప్రథితవృత్తసువర్ణసుమాలిఁ బూజ లిం

పలవఁ జేసి భాసురపదార్థము పాయున మిచ్చిన న్మహా
బలరఁ గొనుండు వేం...... ౨౧

చ. జలజభవాదులైనఁ గనఁజాలని మిమ్ము గురుండు మంత్రి నె
చ్చెలి భవకప్రదాయకుఁడు చేసినచుట్ట మటంచుఁ బ్రేమవా
టిలఁ దొలి పాండవేయులు నటించి రఁ టంతటి భాగ్యరేఖ మా
కలవడుఁగాక వేంకట...... ౨౨

ఉ. అంచితమైన కావ్యరస మారసి కాంచి రసజ్ఞునట్లు మో
దించునె ముష్కరాత్ముఁడు దేవనదీజలజాతకాండముల్
గాంచి ముదంబుఁబొందుట పికంబునకెన్నఁడు శక్యమానె రా
యంచకుఁ గాక వేంకట...... ౨౩

ఉ. ఎంచవశంబుగాక నటియించెడి నాదుమనంబనేటి రా
యంచను బట్టి నీదుచరణాంబుజపంజరపాళిఁ బెట్టి మ
న్నించుకటాక్షలీల నను నిచ్చలు నీపదపద్మభక్తుఁడే
యంచు గణించు వేంకట...... ౨౪

ఉ. వంచనచేయనేల సురవల్లభ సత్కరుణార్ద్రదృష్టి వీ
క్షింపక నీవనాదరణచేసిన నెవ్వరు నన్ను నింక ర
క్షించెడివారు కాన నిరసింపక నాపయినుంచుమీ కటా
క్షాంచలలీల వేంకట...... ౨౫

ఉ. కంటినగంబు పుష్కరిణిఁ గంటి సమస్తవనాటబృందముం
గంటి కిరీటకుండలవికాసితచారుముఖారవిందునిం
గంటిని మిమ్ము మీ(కరుణ) గంటి కరద్వయి మీపదద్వయం
బంటఁగఁగంటి వేంకట...... ౨౬

ఉ. బంటుగ నేలికొమ్మనుచుఁ బల్కుల నెంతయు వేఁడుకొంటిఁ గ్రే
గంట దయారసంబొలుకఁ గన్గొనుమంటి రమాధినాథ మీ
వంటిమహాప్రభుం గొలుచుభాగ్యము గంటి భవార్తు లింక న
న్నంటవటంటి వేంకట...... ౨౭

ఉ. కంటకమైన యత్తులువకాకముఁ గావవె యల్లనాఁడు ని
ష్కంటకమైన నీమఱుఁగు చయ్యనఁ జొచ్చితి నేఁడు నన్నుఁ గ్రే

గంటను జూడు మీచరణకంజము గోరుడు నన్నుఁ బ్రోవ మీ
కంటెను లేడు వేంకట..... ౨౮
ఉ. ఇమ్ము ఫలప్రదాన మిఁక నిమ్ముల నెన్నకు నాయెడన్న నే
రమ్ము నరాదిభక్తనికరమ్ముఁ గృపారసదృష్టిఁ జూచి శ్రే
యమ్ము లొసంగినట్టు లనయమ్ము నను\ం గృపఁ గావవేని న్యా
యమ్ము కరమ్ము వేంకట...... ౨౯
ఉ. సమ్మదలీల దాసులకు సౌఖ్యము లిచ్చెడి మీయడుంగుఁ గెం
దమ్ములఁ జూడ మాకుకు సదాశరణం బనుచుంద్రిశుద్ధిగా
నమ్మితినయ్య యయ్య యిక నాహృదయాబ్జము నీకు గట్టిగా
నమ్మితినయ్య వేంకట.......... ౩౦
చ. పరిమెయి నేలికొమ్ము కవఁబాయక నావెనువెంట రమ్ము మా
ర్తర నెగఁ జిమ్ము మాకు వరదుండవు గమ్ము సుధర్మిపాట నే
నెఱుఁగుదు తెమ్ము కాంక్షితము లిమ్ము భవజ్గుణవర్ణనల్ వృథా
హారణముచున్ను వేంకట.......... ౩౧
చ. నరుఁడు ముకుంద మాధవ జనార్దన కృష్ణ హరే యటంచు మీ
స్మరణ దనర్చి ముక్తిఁ గనఁజాలు ట దెంతటివింత మీకథల్
కరము వినంగ గోసి చెవి గంటలు గట్టిన ముష్కరుండు గ్ర
చ్చరఁ గనె ముక్తి వేంకట...... ..... ౩౨
చ. కరుణరుణంబులై ఫలితకామ్యములై నిగమాంతసంతతా
భరణము లైన మీచరణపంకరుహంబులు నామనోంబుజా
కరమునఁ దేజరిల్లుటకుఁ గాంక్ష యొనర్చెద శ్రీరమారమనో
హర యొనఁగూర్పు వేంకట............ ౩౩
ఉ. క్రమ్మఁగరాదు కూర్మిఁ బరకాంతల నెంతటికైన శత్రుల
న్నమ్మఁగరాదు మచ్చిక ఘనమ్ముగ బెద్దల నిచ్చ తచ్చన
ల్పమ్మ గరాదు బెగ్గిలిన ప్రాణులఁ జిమ్మఁగరాదు వేదమెం
దమ్మఁగరాదు వేంకట...... ..... ౩౪
చ. హరిహరి యంచు నెంచుపురుషాగ్రణి దోషము నంధకారముల్
హరి హరియించుచందమున నగ్గిలి నాత్మవిరోధివర్గముల్
హరి హరిణాళిఁ ద్రుంచుగతి నాశమొలర్పఁ జెలంగుఁ గాద శ్రీ
హరి హరిమిత్ర వేంకట.............. ౩౫

చ. సరసముగాని గానమును శాకచయంబులు లేనిభోజనమ్ము
స్థిరమతి లేనిజ్ఞానమును నిత్య మహూనము గానిమానమున్
గురుకృపలేని ధ్యానము సకుంఠితపాత్రము గానిదాన మిం
పరయఁగనేల వేంకట ........... ౩౬

ఉ. నేరము పెక్కువాక్యములు నీకృపవుట్టఁగ నాడ మేము మీ
వారము బ్రోవ నీదెకద భారమిఁకన్యుల వేఁడ నెన్నఁడుం
గోరము సాగెసారెకును గోరి తలంచెద నెంచ నీకు నా
య్యారము లోలి వేంకట ........... ౩౭

ఉ. దారుణరోగపుంజములఁ దాపము నొందెడివేళలందు మీ
పేరు దలంచువారి కతివేగమె తద్వ్యథలెల్ల దూరమై
పాటకయున్న నిన్గొలుచువారికి సౌఖ్యము లెల్లఁబొందఁ బెం
పారక యున్న వేంకట . ......... ౩౮

ఉ ఏరికిఁ బుణ్యపాపవిధు లెందు నొనర్పఁగ బుద్ధి భావము
ల్గారణ మెన్న నెన్నఁటికిఁ గావు భవత్కరుణాకటాక్షమే
కారణమౌను గాన ననుఁ గాచినఁ గావక యున్న భారమిం
కారయ నీదె వేంకట............ ౩౯

చ. సకలబుధానురక్తి సరసప్రకటాఖిలసద్గుణాలిమా
క్తికఘనశుక్తి వే విరజ పెంపున దాఁటెడిశక్తి ఖండితా
చకితసమస్తదుర్విషయసక్తి భవత్పదపద్మభక్తి స
త్యకలితసూక్తి వేంకట............ ౪౦

చ. అనయమునోవికారమున నల్గుచుఁ గుయ్యిడు నన్నుఁ బ్రోచుక
న్నను బనియేమి నీకు శరణాగతరక్షయ యొంచిచూడ నీ
ఘనబిరుదాంక మబ్బినది కాదన నేటికి నానిమిత్తమో
యనఘవిధాన వేంకట............ ౪౧

చ. మొనసి నతార్చనాదుల మిముం గొలువన్ క్షణమాత్రమైన నా
మనము వశంబుగాదు చలమా గనుమా బహుమాన దృష్టిచే
ఘనమగు నీకటాక్షమునఁ గాన ముకుందరియింపనౌను వే
యనఁ బనియేమి వేంకట........ ... ౪౨

చ ఘనతరభీతిఁజిక్కి కడగానక క్రమ్మరునన్నుఁ గావఁగా
జను వినుమీకు నాయెడల సందియ మొందఁగఁ బాడిగాదమో

యనుపమపుణ్య నీదుచరణాంబుజముల్ శరణమ్ము సుమ్ము మా
కనవరతమ్ము వేంకట......... ౪౩

చ. నినుశరణన్నవానిఁ గరుణింపఁగఁజాలిన పుణ్యశీలి వం
చని భవదీయదివ్యచరణాబ్జము నమ్మితిఁ గృష్ణ నన్నుఁ బ్రో
చిన నగుఁగాక నీవుదయనేలక యుండితి వేని యింకనే
మనఁగలవాఁడ వేంకట.......... ౪౪

చ. మనమును బుద్ధి యింద్రియసమాజము నీవగుటన్ ధరిత్రి నెం
చ నరులు సేయ నేపనులు సర్వమునన్ భవదాజ్ఞనెల్లనే
సినయతఁ డుండఁగా శరము సేసెడి దే మటుగానఁ గర్తవీ
వని మదినెంతు వేంకట.......... ౪౫

చ. జననము లింకఁ జాలు సురసంఘమునన్నుతియింపలేరు నీ
గానములచాలు నిన్నెపుడుఁ గొల్చుట మాకును వేయువేలు నే
నను పుగ నిన్నె నమ్మితి దయాళు భజించెద నీదు మేలు న
న్ననిశము నేలు వేంకట.. ......... ౪౬

ఉ. దీనులపాలిటం గలుగు దేవుఁడ వీ వని మీపదద్వయి
న్నానుగ నమ్మియుండెడి యనన్యశరణ్యుని నన్ గటాక్షదీ
క్షానిరతింగనుంగొనక సారె పరాకొనరించుటేమి నా
కానతియిమ్ము వేంకట.......... ౪౭

ఉ. దీనుఁడ నేను నాదిగులు దీఱుపలే రొరు లీవు దీనర
క్షానిరతాత్మకుండ వటుగావున మామకదైన్యదుర్దశన్
మానుపుమయ్య నిన్ను నెఱనమ్మిన దాసునిఁ బ్రోవకుంట బా
గా నటవయ్య వేంకట.......... ౪౮

ఉ. మానము సంతతంబు ననుమానము లేల భవత్కథానుసం
ధానము నీపదార్చనవిధానము యుష్మదమేయభక్తివి
జ్ఞానము తావకప్రణుతగానము త్వత్పదపద్మనిశ్చల
ధ్యానము దేవ వేంకట.......... ౪౯

ఉ. మానసమద్క్రియాహృదసమానవిధానము మోక్షమార్గసో
పానము నిర్గతోగ్రభవబంధవితానము సర్వమంగళ
స్థానము మందిరాంతరనిధానము తావకపాదపంకజ
ధ్యానము నన్న వేంకట.......... ౫౦

ఉ. పున్నమచందురుం దెగడు పొంకపునీనగుమోముఁ దమ్మి నా
కన్నులకర్వ్వదీఱ నిటఁ గన్గొనఁజాలిన భాగ్యరేఖ మా
కెన్నఁడు గల్గు నీవు కృప నెన్నఁడు మాకుఁ బ్రసన్న మయ్యెదో
యన్న వచింపు వేంకట............ ౧౧

ఉ. క్రన్నన నాదుమానసవికారము మాన్పి ప్రోవుమంచు నె
న్నెన్నొవిధంబుల న్వదల కేను మిముం బలుమాఱు వేఁడిన
న్విన్నప మాలకించి కరుణింపవు నీమన మెంతగట్టి ద
న్నన్న తలంప వేంకట..... ...... ౧౨

ఉ. మన్నన నేలు మన్నతఱి మన్ననఁ బ్రోవ వదేమి మిన్న య
న్నన్న విచిత్రమంచు నగరా యిదిలోకము విన్న నీవు క్రే
గన్నులఁ జూడకున్న ననుఁగాచెడువార లిఁకెవ్వరన్న మీ
కన్న మఱెన్న వేంకట............ ౧౩

ఉ. ఆయతదీక్షఁ దొల్లి శరణాగతులం గరుణించి సద్ధమా
దాయధనంబు లిచ్చినవిధంబున న న్గరుణించి దోషముల్
వాయఁగఁజేసి శాశ్వతశుభంబు లొసంగి యశంబుఁ బొందుట
న్యాయమె నీకు వేంకట............ ౧౪

ఉ. ఏమొడదీనమానవు లనేకవిధంబుల వేఁడు సందడిన్
నాయొనరించు మొఱ్ఱ చెవినాటదొ గాక యుపేక్ష చేసెదో
పాయనిభక్తసంఘపరిపాలనభారవహంబునం బరా
కీయెడఁ గల్గెనేమొ మఱియేటికిఁ బ్రోచుట కింతజాగు నా
రాయణమూర్తి వేంకట............ ౧౫

ఉ. నాయొనరించుదోషము లనంతము లైనను మీపయిన్మన
స్తోయజమున్ ఘటిల్లె బహుదుష్టుఁ డజామిళుఁ డొక్కవేళ నా
రా యని పుత్త్రుఁ బేర్కొని తిరంబుగ వాఁడట ముక్తుఁడౌట లే
దా యనె తొల్లి వేంకట............ ౧౬

ఉ. తప్పవు సత్య మెన్నఁటికి దాసజనావళిదుఃఖవార్ధికిం
దెప్పవు మేలుచేసి మఱి దెప్పవు ముంగిటిలోధనంబు పె
న్గుప్పవు తప్పులెన్నక మముం గరమొప్పఁ గృతార్థుఁజేయు మా
యప్పవు నీవ వేంకట............ ౧౭

ఉ. ఎప్పుడొ నీ వొకప్పు డిల నెవ్వరినైనఁ గటాక్షదృష్టులం
దప్పక చూచితేని సుగుణంబులు దానె క్రమక్రమంబునం
జొప్పడుఁ గర్మబంధముల నొప్పడఁగించి కృతార్థుఁడౌ నిజం
బప్పురుషుండు వేంకట...... ౫౮

ఉ. చేసినపాప మెల్ల మఱి చెప్పినఁబాయు నటంట్రు పాపముల్
చేసిన హాని యం చనక చేయఁగరాని మహోగ్రకృత్యముల్
చేసితిఁగాన నీకెఱుకచేసితి నేగతి నన్నుఁ బ్రోచెదో
యాసురవైరి వేంకట...... ౫౯

ఉ. వాసరము ల్వెసం గడపువాఁడు గదా రవి నాఁడునాఁటి క
జ్ఞాసననిర్ణయాయువు ప్రజం బగునట్లుగ ధర్మసంగ్రహం
బే సవరింపనైతి నన నేటికి మాటికి నీదుచింతనా
భ్యాసమె చాలు వేంకట...... ౬౦

ఉ. చూడఁగదయ్య శీతలపుఁజూపుల నాయెడ నీవరా కిఁకన్
వీడఁగదయ్య పాతకుఁడు వీని భరింపఁగ లే నటంచుఁ బో
నాడకు మయ్య సర్వజననార్జితపాతకపుంజమెల్లఁ జ
క్కాడఁగదయ్య వేంకట...... ౬౧

ఉ. పాడెద నీదుకీర్తనలు పాయనిభక్తిని మిమ్ముఁ బల్మఱు
న్వేఁడెద దాస్యసఖ్యమును వీడెద మీపదభక్తవర్గముం
గూడెద మీకుఁ దుల్యు లిఁకఁ గుంభిని లేరని నిశ్చయంబుగా
నాడెద నయ్య వేంకట...... ౬౨

ఉ. నీదరహాసహాసముఖనిర్మలకాంతికిఁ జూడ సాటియే
రేదొర నీదురాజితశరీరఘనద్యుతి కీఘనాఘనం
బేదొర లేదు రన్న పురుడేదొర నీదుజగంబులన్ లస
త్సాదరమోద...... ౬౩

ఉ. దేవర దీనపాలన మదే వరకీర్తి యటంచుఁ గూర్మిచేఁ
బ్రోవర నాదు నేరములు ప్రోవఱిగా శరణార్థి నైన న
న్నావర నామనోరిపులకావర మెల్ల నశింపఁజేసి యీ
ద్రావరజాత వేంకట...... ౬౪

ఉ. పావనమూర్తి వై పతితపావనదీక్ష వహించి నాయెడన్
నీ వది దప్పితేనియు గణింగని నవ్వరె లోకు లీయెడన్
భూవర నోఁచరాదు కొఱనోము లటం ద్రది చూచి కావు దీ
నావనశీల వేంకట...... ౬౫

ఉ. చీఁకటి నెవ్వఁడేని మిముఁ జింతనచేసిన డాకినీముఖా
నేకపిశాచభూతగణ మెల్లను దద్దిశ నిల్వలేక చి
కాకయి పాఱు గుండెలు వకావకలై బలి డాక నీదె యా
రా కొనియాడ వేంకట..... ౬౬

ఉ. నా శభయప్రసిద్ధికి మనంబున నెన్నదఁ జాపసాయకా
నీకము దాల్చి యుద్ధమున నిల్చిన నిన్నని రాక్షసాళి నీ
ఘాతకుఁ దాళఁజాలక హుటాహుటితోఁ దెగఁబాఱు వెల్ల లో
కైకశరణ్య వేంకట...... ౬౭

చ. బడిబడి చిత్తము న్నిలువఁబట్టఁగ లేను మహోగ్రకృత్య మే
నుడివిన వాఁడఁగాను మది యుష్మదధీనము నాదు మేను నె
వ్వుడు నిఁక నన్యులం దలఁపఁబోను బరంపర యెంచి చూడ నీ
కొడుకను నేను నాదుమది కోర్కు లొసంగఁగ మేలుసేయ సి
న్నడుగిడనీను వేంకట...... ౬౮

చ. బిడియము మిఁకేల నేఁ బరులవేఁడఁ గృతాకృతదోష మెంచి న
న్నిడుములఁబెట్టఁ జూచుటకు నెంతటివాఁడఁ గటాక్షదృష్టి నా
యెడ నిగిడించి నన్ను దయనేలుటె మిక్కిలి కీర్తి చూడ మీ
నడక మహత్త్వమెల్ల వినినాఁడ నిఁకం గలలోన నైన మీ
యడుగులు వీడ వేంకట...... ౬౯

చ. ఈడుగనిముక్తిత్రోవ జము నుల్లసమాడఁగఁజాలుచేవ తుం
దుడుకుల గెల్చురేవ బహుదుర్భరజన్మపరంపరామహా
జడధికి నావ భూమి జనసంతతి కారయ దేవదేవ మీ
యడుగులసేవ వేంకట...... ౭౦

ఉ. ఈక్షితి నీవదాన్యగుణ మెంతని చెప్పఁగవచ్చు నోసరో
జేక్షణ కావు కావు మని యెంతయు భీతిఁ గలంగి వేఁడఁగా

నక్షయవస్త్రసంచయము లాక్షణ మీయవె ద్రౌపదీపయో
జాక్షికి మున్ను వేంకట...... ౨౧

ఉ. పక్షితురంగ నీమన మపారకృపారసరాశి నిర్మలం
బక్షయమైన నీదు యశ మారయఁ గార్యము నీకు భక్తసం
రక్షణతాదృశత్వము పరాకున నుండఁగఁబోకు నాకుఁ బ్ర
త్యక్షముగమ్ము వేంకట...... ౨౨

ఉ ఎంతదురాత్ముఁడైన నఘ మెంత యొనర్చిన మానవుండు ప్రా
ణాంతమునందు నీభజన మబ్బిన మోక్షపదంబుఁ జేరు శ్రీ
కాంత భవత్కటాక్షమునఁ గాక ఘటించునె యట్టిపుణ్య మ
త్యంతవిభూతి వేంకట...... ౨౩

ఉ చింతిలనేల కొంత మిముఁ జేరి భజించినవారి కన్నఁ డా
వంతయు లేదు వంత నను సాదరదృష్టినిఁ బాఱఁజూడు మొ
క్కింత మదీయభీతి హరియింపఁగ జాగిఁకఁ జేసితేని లే
దంతటి వింత వేంకట...... ౨౪

ఉ కాంతు మనీష నిన్ను సిరికాంతు నిజంబుగ నీకటాక్ష మా
సింతు భవత్కథావ్యము హసింతు నను స్మతిమంతుఁ జేయ నీ
వంతు నిరంతరంబు గుణవంతులు మెచ్చఁగ నీగుణవ్రజం
బంతయు నెంతు వేంకట...... ౨౫

ఉ దంతి మహార్తిఁ బాపిన యుదారదయాపరమూర్తి వౌట నా
వంతలు వాపి ప్రోచుటకు భారము నీదె యటంచు నమ్మి ని
శ్చింతత నున్న నన్ను దయ చిప్పిలుచూపులఁ జూడ నొప్పు న
భ్యంతర మేల వేంకట...... ౨౬

ఉ. వేమఱు వేఁడసాఁగె నని వేసట నొందితొ యట్లుగాక నీ
పామరుఁ బ్రోవ నెయ్యది యుపాయ మటంచును జింతఁ జెందితో
యే మొఱ వెట్టినం దలఁప వెక్కడి రాజసమయ్యె నీకు భ
క్తామరశాఖి వేంకట...... ౨౭

ఉ. సామము మీఱి మి మ్మెపుడు సామము చేఁ గొనియాడువాఁడు హృ
ద్ధామమునందు నీమహితధామము నిచ్చలు నిల్పువాఁడు మీ

నామము సంస్మరించుమనఁ బ్రణామము నిచ్చు యొనర్చువాఁడు వి
త్యామలకీర్తి వేంకట...... ౭౮

చ. సుగుణపరంపరార్జితము చొప్పునఁ గూడిచి యాపదల్ హరిం
పఁగఁ గరుణ న్నిరంతరశుభంబు లొసంగఁగ నేర మోర్చి యిం
పుఁగ దలిదండ్రులుం బలె సుబుద్ధులు సెప్పఁగ నన్ను ధన్యుఁ జే
యఁగ గతి నీవె వేంకట...... ౭౯

చ. తగ శరణన్నమాత్ర రిపుకమ్ముఁ గాచితి ప్రేమ దక్షులౌ
త్తఁగ నొగి గోపగోవ్రజనితంబినులం దయనేలితౌ బళీ
పొగడఁగ నీవు భక్తసులభుండవు మాయురె నీదయారసం
బగణితమాను వేంకట...... ౮౦

చ. పనచెడఁ గుత్తుకం గఘను పర్వఁగఁ దస్మయ మార్తిఁ గప్పఁగా
నసువులు మేనఁ బాయుసమయంబునఁ దాపము నై ఘటించి సం
తనమఱగాక మున్నుగ సుదర్శనధారణ నీసుదర్శనం
బొసఁగి కటాక్షవీక్షణచయోన్నతి నాకు సమస్తసద్గుణా
భ్యసన మొనర్చు వేంకట...... ౮౧

చ. పొసఁగ విపన్నుఁడై శరణుపొందినఁ గాచుటకన్న నెన్నఁ బు
ణ్యసరణిఁ దద్విసర్జనము కన్నను ధర్మము లేదటండ్రు రిం
పెసఁగఁగఁ జిక్కులం దిడిన నేమిఫలం బిఁక నోనికృత్తరా
క్షస నను బాదదాసకునిగా దయనేలి మనోవికారదు
ర్వ్యసనము మాన్పు వేంకట...... ౮౨

చ. కలియుగవేళ శ్రీహరిని గన్గొన లేమని మూఢబుద్ధిచేఁ
దెలియఁగలేక మానవులు దీనతఁ జిక్కిరికాక వేంకటా
చలమున నున్న మిమ్ముఁ గని సన్నుతిచేసిన నీప్సితార్థ మీ
దలఁతురు గాదె వేంకట...... ౮౩

ఉ. అచ్చపు మత్స్యరూపమున నచ్చు దలిర్పఁగ వారిరాశిలోఁ
జొచ్చి మహోగ్రదుర్మదుని సోముకు వ్రచ్చి త్రయీకదంబముం
దెచ్చి విరించి కిచ్చితివి నీవకదయ్య వియచ్చరవ్రజం
బచ్చెరువంద వేంకట...... ౮౪

ఉ. అచ్చెరువంద మందరము నయ్యమృతాంబుధి దేవదానవుల్
ద్రచ్చెడుచో సరోజముకుళస్థితభృంగసమానసంగతిం
గ్రచ్చర వెన్నున న్నిలుపఁ గచ్ఛపమూర్తి వహించి తీవ పెం
పచ్చుపడంగ వేంకట...... ౮౫

ఉ. గ్రాహనివాసగర్భగతకాశ్యపి గ్గొని వేగ యజ్ఞవా
రాహవిధంబుచే ఘనపరాక్రమమొప్పఁగఁ గాంచనాక్షర
క్షోహరణం బొనర్చి కొనకొమ్మున భూస్థలి నెత్తితీవ య
వ్యాహతలీల వేంకట...... ౮౬

ఉ. స్నేహమెలర్ప బాలుఁ గరుణించుటకై నరసింహలీల ను
త్సాహమిగుర్ప స్తంభమున సంభవమై నఖరాంకురంబులన్
సాహసవృత్తి రక్కసుని జక్కడఁగించితి వీవకాదె ఘో
రాహవభూమి వేంకట..... ౮౭

ఉ. ఉగ్రముఖున్నతింపఁ బురుహూతున కాత్రిజగంబులు న్మహా
నుగ్రహలీలనిచ్చుట కనూనమతిన్ బలి వామనాఖ్య న
త్యుగ్రవిధిన్ రసాతలము నొయ్యనఁ జేర్చితి వీవకావె మ
స్తాగ్రము ద్రొక్కి వేంకట...... ౮౮

ఉ ఉగ్రబలాఢ్యులౌ నృపుల నుర్వర నిర్వది యొక్కమాఱు వీ
రాగ్రహ మొప్పఁగూల్చి తదస్రముచేఁ బితృతర్పణ మ్మహో
దగ్రతఁ జేసి విప్రులకు ధాత్రి నొసంగిన భార్గవాన్వవా
యాగ్రణి వీవ వేంకట..... ౮౯

చ. మృడువిలుఁ ద్రుంచి భూమిజవరించి మునిస్తుతిఁ దండ్రియాజ్ఞచే
నడవులుసొచ్చి కీశపద మంతయు భాస్కరసూతికిచ్చి యా
జలధినిగట్టి రాత్రిచరసైన్యముఁ గొట్టి దశాస్యు రేవ చ
క్కడఁచితి వీవ వేంకట...... ౯౦

చ. పుడమిఁ బ్రలంబముఖ్యరిపుపుంజముఁ ద్రుంచి కళిందజామదం
బడఁచి కురుప్రవీరులు భయంబునబెగ్గిల హస్తినాపురిం
గడిమిఁ బెకల్చి రేవతికిఁ గాంతుఁడవ బలరాములీలఁ బెం
పడరితి వీవ వేంకట...... ౯౧

ఉ. చక్కని బౌద్ధవేషమున సారె పురప్రమదాళి మాయలన్
మిక్కిలి దేల్పరించి కలిమిం ద్రిపురంబు లడంచువేళ నా
చక్కలఁజేనితాల్పునకుఁ జొక్కపుబాణమువైన మీయశం
బక్కజమయ్యె వేంకట...... ౯౨

ఉ మిక్కిలి రూపకాంతి కలిమిం గలికిస్థితి వారువంబుపై
నెక్కి కనత్కరాశి ధరియించి వసుంధర దుష్టకోటులం
గ్రక్కునఁ ద్రుంచి సాధుజనరక్షణ సేసెద వీవెకాదె స
మ్యక్కృప నింక వేంకట... .. ౯౩

ఉ. అక్కమలాసనాదిసురలైన నుతింపఁగఁ జాలనట్టి నీ
వెక్కడ దుస్తరోగ్రచలనైకమనస్కుఁడ మానవుండ నే
నెక్కడ నిన్భజించు టది యెక్కడనైనను నన్నుఁ బ్రోచుటే
యక్కట కీర్తి వేంకట...... ౯౪

ఉ. జాతిరసాలముఖ్యసుమజాతి సదా మిముఁ బూజసేయుటే
భూతి విరోధినైనఁ బరభూతి యొనర్పక మేలుసేయుటే
నీతి జితేంద్రియుండయి వినీతిపథంబున సంచరించుటే
ఖ్యాతి నరుండు వేంకట...... ౯౫

ఉ ఏతటి ధర్మ మేమఱక యెల్లజనావళిఁ బ్రోచువాఁడె భూ
నేత నిరంతరంబుఁ దగునీతి నిజాధిపుఁ గొల్చు వాఁడే
దూత ధనేచ్ఛ నర్థితతి దోసిలియొగ్గిన నిచ్చునేని పో
యాతఁడె దాత వేంకట...... ౯౬

ఉ. ఆగమవేద్య మీభజన మబ్బనివారి కశేషసత్క్రియా
భోగములేల రాజ్యసుఖభోగము లేల చరాచరాదిసం
యోగములేల సాంఖ్యముఖయోగములేల సమస్తయాగముల్
త్యాగములేల వేంకట...... ౯౭

ఉ. నీపదనీరజాతములు నెమ్మది నమ్మినవారికెల్ల సం
తాపములేదు సమ్మదము తక్కువగాదు లవంబుమాత్రముం
బాపములేదు ధర్మగుణమార్గము పోదు తలంచిచూడఁగా
నాపదరాదు వేంకట..... ౯౮

చ. ఇభభయవిదూర యింక దయసేల వదేర భవచ్చరిత్రముల్
శుభదములౌర నన్గరుణఁజూడఁగరార ముదంబుదేర నా
యభిమతమెల్లఁదీర దురితావలిఁజాఱ నయంబు మీఱ నా
కభయమునీర వేంకట...... ౯౯

ఉ. మాటికి నీపదాబ్జముల మాఁటికిఁజొచ్చితి నొంచుమాట లిం
కేటికి రాజహంస చదలేటికిడాసె దిభంగి నున్న నే
నాఁటికి జాగుగాని యొకనాఁటికిఁ గన్పడవేమినీ టరో
హాటకశాటి వేంకట .... ౧౦౦

చ. వెలసినదయ్య నీబిరుదు విష్టపజాలమునందు నాకునుం
దెలిసినదయ్య నీవెపుడు దీనశరణ్యుఁడవౌట నీపయి
న్నిలిచినదయ్య నామనము నిశ్చలమై దయనేలుమయ్య మా
యలు వలదయ్య వేంకట.. ... ౧౦౧

ఉ. ఎందు మహాఘరోగము రహింందొలఁగింపఁగ నీదునామమే
మందు ననాథులై మెలఁగు మందులకుం దరి నీవటంచు నే
విందు గ్రహించితౌ విదురువిందు నటుంబలె నాదువిందు గో
మ్మందు ముకుంద వేంకట...... ౧౦౨

ఉ. పంబినప్రీతి నేగతి భవంబెడఁబాపి కృతార్థుఁజేసెదో
యంబుజనాభ నామతి మహావిపరీత మదెన్నరాదు చి
త్తంబు వశంబుగాదు విదితంబుగ నన్గరుణింతు వన్న ధై
ర్యంబఱగాదు వేంకట...... ౧౦౩

చ. గుహుని విభీషణున్ శబరిఁ గూరిమినేలుట లాదిగాఁగ నీ
మహిమ సమస్తము న్బుధసమాజముచే వినియుండుటన్ హరీ
యిహపరసాధకుండ వని యేహృదయంబున నమ్మి (నిన్నుఁ) బ్ర
త్యహము భజింతు వేంకట...... ౧౦౪

ఉ. దండము నీకు నీమహిమ ధాతకు శక్యమె యెన్న నీ భుజా
దండము (భూత)పాపజనతండము నీఘనకాండభీకరో
ద్దండము నిర్జితార్ణవము తావకచక్రము రక్షితార్తవే
దండము నౌర వేంకట...... ౧౦౫

చ. సరసవిలాసవాక్యములు సంగతులం దగుకావ్యకన్యకన్
వరమతి నీకొసంగితి నవారణ శ్రీయలమేలుమంగతోఁ
సరిగఁ బరిగ్రహించి వరుసం బరిపాలన మాచరింపుము
య్యా రహివహింప వేంకట...... ౧౦౬

ఉ. మంగళ మార్యసంగ జయమంగళ మీశమనోజ్ఞభృంగ స
న్మంగళ మార్తిభంగ శుభమంగళ మబ్రచరత్తురంగ శ్రీ
మంగళ ముజ్జ్వలాంగ శివమంగళ మాశ్రితసౌఖ్యకృద్దయా
పాంగతరంగ వేంకట...... ౧౦౭

చ. క్షితిని ననేకదుర్జనసింధుఘనోర్మికల న్మునుంగు చ
ప్రతిహతమైన తద్వ్యథలఁ బాయనుపాయము లేక నీకటా
క్షతరిని దూఁకి నేఁటి కిటఁ గాంచి తరించితి నంచు నిర్భయా
యతమతినైతి వేంకట...... ౧౦౮

చ సతతము నాత్మవిగ్రహవచఃప్రకృతీంద్రియహస్తపాదహృ
న్మతికృతమెల్ల నీపదసమర్పణ చేసితి మత్కృతంబులన్
హితమహితంబు సర్వము సహించి నను గృపఁజూడు మంగళా
యతనముగాఁగ వేంకట...... ౧౦౯

చ. చదివినవారికి న్వినఁగఁ జాలినవారి కనంతభోగభా
గ్యద మగుచు న్వచఃశ్రుతిసుఖంబయి యీశతకంబు నింపుసొం
పొదవ రవీందుతారముగ నుర్వరపైఁ బ్రకటం బొనర్పుము
య్యా దయదలిర్ప వేంకట...... ౧౧౦

ఉ. భ్రాజిత మందవళాన్వయుఁడఁ బాపయమంత్రితనూజుఁడ న్భర
ద్వాజసగోత్రజుండఁ బ్రియభక్తుఁడఁ గృష్ణకవి న్భవత్పదాం
భోజయుగాంకితంబుగ సమున్నతిఁ గబ్బ మొనర్చినాఁడ న
వ్యాజతఁ గొమ్ము వేంకటనగాధిపతీ విలసత్కృపామతీ ౧౧౧

ఉ. పూరుషముఖ్య రంగ రఘుపుంగవ వేంకటనాథ కృష్ణశృం
గారకథాళి నైదుశతకంబు లొనర్చి తటాకబాహ్యధా
త్రీరుహముఖ్యసంతతులు ప్రేమనొనర్చి యొసంగినాఁడ సొం
పార గ్రహింపు వేంకటనగాధిపతీ విలసత్కృపామతీ. ౧౧౨

(36) అకారాదిదేశీయ తెలుఁగునిఘంటువు. గ్రం. సం 16.

ఇది ౧౦ పత్రముల యకారాదినిఘంటువు. దేశీయపదము లన్నియు నేర్చి వ్రాయఁబడినది. కవి యెవ్వరో—ముందు వెనుక నేమియు వ్రాయఁబడి యుండలేదు. గణపవరపు వేంకటకవి లక్షణశిరోమణిలోని భాగము కావచ్చును.

అరిది—అబ్బురము
అట్టిద—అటువంటిదె
అసలు—బురద
అయిద—వెంబడి
అలకి—కలశము
అల్లో నేరేళ్ళు—నమస్కారము
అకరులు—కేసరములు
అత్తము—గుంపు
అల్లారుముద్దుగ—జనసమ్మతిగా
ఉత్తరించి—ఖండించి
కివ్వెను—మడిసెను
కిట్టి—దగ్గరి
చుచ్చులు—మేఁకలు
చెయిద—చెలికాఁడు
పవాడము—బిరుదు
సురెయాళుండు—చండాలుండు
హాస—క్రొత్త

(37) చంద్రాననాదండకము గ్రం సం. 61.

పుష్కోటరా జగు రాజాబహద్దరుమహీనాథుని పౌత్త్రుఁడును, రఘుస్వామిధాత్రీంద్రపుత్త్రుఁడును నగు శ్రీరామచంద్రక్షితీశునిపైఁ దదాస్థానకవి—నుదురుపాటి వేంకనార్యుని మనుమనిచే రచియింపఁబడినది. కాగితపుఁబ్రతి వ్రాఁత పరిశుభ్రముగా నున్నది. పుస్తకము మంచిస్థితిలోనున్నది. అక్కడక్కడఁ గొంత మచ్చుచూపఁబడును.

"శ్రీమద్బృహన్నాయికాన్మకరోద్భక్తి విస్మేరవక్త్రారవిందస్ఫురద్దివ్యతేజస్సదాధ్యానసక్తాత్మభావుండు, భావోద్భవామిత్రఫాలాక్షకీలాసమానప్రతాపార్క బిభ్యద్విపద్ఘూకవారుండు, వారాశిగాంభీర్యగాఢత్వదానప్రవీణాతిగంభీరతాశాలి, శాలీనవిద్విడ్ధరాపాలమౌళిస్ఫురన్మంజురత్నచ్ఛవిచ్ఛన్నచక్రాదిరేఖోల్లసత్పాదపద్ముండు—జంభారివంశాబ్ధిసోముండు సర్వజ్ఞతాతుల్యసోముండు రాజాబహద్దర్ మహీనాథపౌత్త్రుండు సల్లక్షణోపేతగాత్రుండు శ్రీమద్రఘుస్వామిధాత్రీంద్రపుత్త్రుండు......హయాధిరాజస్యసంస్తూయమానోల్లసద్యక్కైలెస్సీన మాఖ్యాభిరాముండు శ్రీమద్బృహన్నాయికాపాదసేవాప్తకాముండు శ్రీరామచంద్రక్షితీంద్రుండు తానొక్కనాఁటన్ హజారమ్మునన్...భూపాలరాగాదులన్మాగధుల్ వేకువన్ గానముల్ సేయ...స్వీయేతరంబైన భూపాలశబ్దాక్షమిత్వంబు

నం గిక్కనుంబూనె నోనాఁగ విప్పొచునొప్పారు నేత్రారవిందంబులం గెంపుడా ల్భ్రాంతచెన్నొంద (నిద్రలేచి యద్దముఁజూచికొని) సామికూటమ్మునుం జేరి యం దుండు నబ్బాలగోపాలమూర్తిం గనంజేయు దండంబులోనాఁగ దండంబులుం దీసి...గోవర్ధనాద్రిం గయింబూను శ్రీవేణుగోపాలు చందంబునన్నిల్చి గోత్రా ము చేనెత్తి (స్నానముచేసివచ్చి సభలోఁగూర్చుండి తర్వాత పురమునుంజూడ వెలువడిన) కోటీశులంగాంచి యీమేటిసాళువ్వారున్ లేమిచేఁ గోటిభూపాలవ ర్యం డితండంచు లోకుల్నుతింపంగ (చూచి చంద్రానన విరాళిగొని) "హా హా తాన్త్రీహా కోహేతు రాసీ దిదం కిం వరాకే కిలాహా" మ్మటంచున్వనిన్నేవ ఁద్యుక్తహాస్తాబ్జయై (యిత్యాదిదండకవర్ణనలు) ఉద్దండవిద్వత్తవిత్యాంకనుండైన శ్రీవేంకనాభిఖ్య ధీరేంద్రపౌత్రుండు శ్రీనూత్నభూతాఖ్య ధీమంతు పుత్రుండు శ్రీమచ్చిదాకారవిద్వత్కవీంద్రుండు కైచేయుచంద్రాననాదండకము.

(38) రుక్మాంగదచరిత్రము. గ్రం. సం. 81.

ప్రౌఢకవి మల్లనకవిచే రచియింపఁబడి దక్షవాటికా భీమేశ్వరున కంకిత ముచేయఁబడిన యైదాశ్వాసముల కావ్యము. ప్రారంభము-

చ. వఱుఁ దగ మ్రొక్కెదన్ లవణవార్ధివిజృంభణతానివర్తికిన్
దశదిగధీశమౌళిమణిదర్పణముండితదివ్యకీర్తికిన్
దశశతభానుమూర్తికి సుధామృదుభాషికి సాధుపోషికిన్
దశరథరాజుపట్టికిని దైత్యసతిం బొరిగొన్నజెట్టికిన్.

ఉ. రాముఁడె యిష్టదైవతము రాఘవుఁడే జనకుండు జానకీ
స్వామియె బాంధవుండు రఘువల్లభుఁడే సఖుఁ డంశుమత్కుల
గ్రామణియే సహోదరుఁడు రావణవైరియె సద్గురుండు గా
నామదిలోఁ దలంతు రఘునాథనృపాలవతంస యెంతయున్.

ఉ. శ్రీమయపత్రముల్ జడలు చెల్వగునభ్రతరంగిణీకణ
స్తోమము పుష్పముల్ ఫలము సోముఁడునై పొలుపొంది పార్వతీ
కోమలదేహవల్లిఁ బెనఁగొన్న సముంచితదక్షవాటికా
భీమయదేవకల్పక మభీష్టఫలంబులు మాకునీవుతన్.

ఈపద్యమునకుఁ బైనున్న రెండుపద్యములును జాటువులు గావచ్చును.

చ. కలశపయోధికన్య మృదుగండమరీచుల నీడఁజూచుచుం
దిలకముఁ గమ్మకస్తురి ప్రదీప్తముగాఁ గొనగోర దిద్దును

త్పలదళమేచకద్యుతికదంబశరీరుఁడు మాధవుండు ని
చ్చలుఁ గరుణాకటాక్షముల...నిశ్శో మము బ్రోచు గాపుతన్.

ఇత్యాది కృత్యాది రచియించి వినపిచ్చట—

క. మనమున సేవింపుడు మ, జ్జనకుని శ్రీవత్సగోత్రసాగరచంద్రు
ఘనుఁబోతనమంత్రీశ్వరు, ననయంబును భక్తి నక్కలాంబాప్రియునిన్.

సీ ...యాదిశంభుస్వరూపమైయధికమహిమ, నున్నతికినెక్కు శివదేవయోగిపాత్రు
శక్తినాథుని మద్గురుస్వామిఁ దలఁచి—

అని చెప్పఁబడినపద్యభాగములఁ బట్టి యీకవి తండ్రి శ్రీవత్సగోత్రుఁడైన పోతనమంత్రి యనియుఁ దల్లి యక్కలాంబ యనియు, గురువు శక్తినాథు డనియు దెలియవచ్చుచున్నది.

గద్యము:—ఇది శ్రీమత్పార్వతీశ్వరవరప్రసాదలబ్ధకవితాపవిత్ర పోతయామాత్యపుత్ర సకలజనానందచర్య స్రాసకవి మల్లనార్యప్రణీతంబైన రుక్మాంగద...

ఇంతకంటెఁ గవివంశాదికము దీనిలోఁ దెలియదు.

ఈమల్లనకవి యీగ్రంథమును దక్షవాటి భీమేశ్వరున కంకితమిచ్చెను. ఈదక్షవాటి తగవులకుదూరమైన గోదావరిజిల్లాలోని ద్రాక్షారామమే యని "సప్తగోదావరీజలసవిహారవిహారవిస్ఫురితమహాభుజంగజంగమస్థావర... దక్షపురీభీమలింగకాంతాశుభాంగ" యనుపద్యము బట్టి యనుకొనవచ్చును. ఈతనినివాసముకూడ నచ్చటికి సమీపమై యుండవచ్చును.

సీ హోతభీమేశుఁ డచ్యుతశర్మ యధ్వానధాని యజ్ఞేశుఁ డాధానయాజి
చల్లవల్లభుఁ డార్యచర్చ గోవిందుండు భట్టమాధవుఁడు దర్భలముకుందుఁ
డీశ్వరభట్లు బ్రహ్మేంద్రయోజ్జలు క్రమదాడెమాధవుఁడు జంద్యాలపెద్ద
భాస్కరోజ్జలు చక్రపాణి చతుర్వేది గౌరికృష్ణుఁడు మల్లుసోమయాజి
వామదేవుండు నరసింహవాజపేయి, వాదికేసర్లు వక్షిబామోదరుండు
పట్టవర్ధనమయలన్న పల్లమంచి, యాదియగు విప్రులే తెంచి రచటికపుడు.

అనుపద్యములోని వైదికబ్రాహ్మణశాఖవారు చాలమంది ద్రాక్షారామసమీపగ్రామములలో నిప్పుడునున్నారు.

హరివాసరవ్రతవిశేషముం దెలుపు రుక్మాంగదనృపాలుని చరిత్రమిందు వర్ణింపఁబడినది దీని కేకాదశీమాహాత్మ్య మనుపేరొండవపేరు వాడుకలోనున్నది.

కవిపురాతనుఁడు గా వినుచున్నాము. కావున "దశమినాఁ డేకభుక్తముచేసి మఱునాఁ డహోరాత్రముల భక్తి నుపవసించి" ఇత్యాదిప్రథమాశ్వాసములోని సీసపద్యము-ఆముక్తమాల్యదలోని యిట్టిపద్యమునకు మాతృకమై యుండును ఈప్రతి చాల శిథిలమైనది 121 సంఖ్యగల ప్రతి శుభ్రముగానున్నది. వ్రాతతప్పు లిందు నందును మెండుగాఁగలవు. కొన్నిపద్యములు-

మ. ధరఁ బాలించెఁ బురూరవు న్సగరునిం ద్రైశంకునిన్ హైహయుం
బురుకుత్సు న్నలు నంబరీషు శశిబిందున్ రంతి నంగు న్గకు
త్థు రఘూత్తంసు భగీరథుం బృథు సుహోత్రు న్నాహుషున్ భార్గవున్
భరతక్ష్మాధిపునిన్ దిలీపు గయు మాంధాతృన్ శిబిం బోలుచున్.

ఉ. స్నానమొనర్చి ధౌతపరిధానములున్ ధరియించి యుంటఁగాఁ
గానిమనుష్యులం గనక కల్లలు వల్కక యుగ్రకృత్యము
ల్మాని వినిద్యుఁడై నియతమానసుఁడై తములంబు దక్కి శ్రీ
జానిపురాణము ల్వినుట సంగతి శ్రీహరివాసరంబునన్.

రెండవప్రతిలో "స్నానమొనర్చి" యని కలదు.

శా. ఓకంజాక్షతనూజ నీమదకరాళోగ్రక్రియాసైంభో
త్సేకగ్రీవ...ప్రకల్పితభయోద్రేకస్ఫురద్ఘంటికా
నీకానేకఘణాఘణత్ప్రళయసన్నిద్రధ్వను ల్వీనులం
దాకర్ణింపఁడె పద్మనాభపదపద్మారాధకుం డెన్నఁడున్.

క. మానినులు నూర్వురుండఁగా నను నేరీతి మేలుగా నేర్చెదవో
భూనాథజ రుపవచ్చునె, *గానుగునుదలారికముఁ బ్రగల్భముతోడన్.

ఉ. కాయజుమేనమామ కఱకంఠుని యౌఁదలపువ్వు వాహినీ
నాయకుకూర్మిపట్టి నలినాక్షునిముద్దుమఱంది కౌముది
ప్రాయముదుంప యంబురుహబంధుని యుద్ది చకోరజీవనో
పాయమహౌషధంబు శితభానుఁడు కానఁగవచ్చెఁ దూర్పునన్.

ఈప్రతి ఆనందనామసంవత్సర పుష్యబహుళ విదియా అంగారకవాసరమందున వెలికంటి రంగప్పయ కొమారుడు వెంకటనారయణ వ్రాసినది. (దక్షిణదేశపుప్రతి) 121 ప్రతి సర్వధారినామసంవత్సర వయిశాఖ శు ౯ బు॥ వరకు తెలిదేవర సుందర్రాముడు రుక్మాంగదచరిత్రము వాడ్రేవు కృష్ణంమ్మగారు

* గానుగునదలార్థి కంఘ్రిఁగల్పముతోడన్ — అచ్చుప్రతి.

వ్రాసిన ప్రతిక్రమానరు నదరుపీం చరిత్రలో...ఆశ్వాసము వ్రాసెను.

(39) కవికర్ణరసాయనము—గ్రం. సం. 134.

ఇది యాఱాశ్వాసముల ప్రౌఢకావ్యము. కవి తనపేరు

క. గురువరభట్టపరాశర, చరణసరోరుహనముల్లస న్మానసుఁడన్
నరసింహనామధేయుఁడఁ, బరిచిత సత్కృతిరసానుభవహేతువునన్.

క. కవితాదిదృష్టి గలిగినఁ, గవికంఠవిభూషణముగఁ గైకొనవలయున్
గవివరనృసింహవిరచిత, కవికర్ణరసాయనాఖ్య కావ్యము దీనిన్.

అను పద్యములంబట్టియు, "ఇది శ్రీమద్భట్ట పరాశరదేశికేంద్ర చరణ సరసిజ శరగోపసేవక నరసింహనామధేయప్రణీతంబైన కవికర్ణరసాయనం బను కావ్యంబునందు" అను నాశ్వాసాంత్యగద్యములంబట్టియు నరసింహకవియని తెలియవచ్చుచున్నది. ఇంతకంటె నీగ్రంథమందుఁ గవి తన్నుం గూర్చి యేమియుఁ జెప్పకొనలేదు స్వప్నములోఁ గవి చెప్పఁగా మిగిలిన- తలిదండ్రులు, వారువారుచేసిన గ్రంథములు, నుద్యోగంబులు నింటిపేరులుం జెప్ప నిష్టదైవతములును వచ్చి చెప్పలేదు. ఈకఁడు చేసెనరెండవగ్రంథమును గనఁబడదు. మఱి యీకవియింటిపేరు సంకుసాలవారని సుంకుసాలవారని సింగసాళ్ళవారని టంకసాలవారలని యనేకులు నిరాధారముగాఁ జెప్పకొనుచున్నారేల. కులము తెలియదు గోత్రము తెలియదు ఇట్టివాని యింటిపేరెట్లు తెలిసినదో

క. నేరిచిన సుకవి కృతిచేఁ, బేరెఱఁగించుకొనిజగతిఁ బెంపగుటొప్పన్
నేరక కృతిఁజెప్పట తన, నేరమి యపకీర్తి జగతి నిలుపుటగాదే.

అని కవి తనపేరు తెల్పుకొన్నాఁడు. ఆడంబరములేని పరమభక్తాగ్రేసరుఁడగునీకవి రచించినయీగ్రంథములోని కథ మాంధాతృచరిత్రము- శ్రీరంగనాథునికిఁ గృతిసమర్పణము చేసినాఁడు.

సీ. "ఆ దోళికలయందు నంతరచరులైన సవికృతాకృతులఁ బిశాచజనులఁ
బరకరాలంబులై ప్రార్థింపఁ గనుఁగొనక వాయెత్తకుండు జీవచ్ఛవముల
వాలవీజనములం గ్రాలుచు నీఁగకు నాఁడీని ఖరవర్తులాండసముల
వేత్రపరంపరావిల కంటకాకృతిఁ జేరంగరాని బర్బూరతరుల
.. ......ప్రభుమదాత్ముల నెవ్వాఁడు ప్రస్తుతించు" అనుపద్యమునందు నరపాలనింద కావించుట యొక్కటి విచారింపవలసియున్నది.

సీ.జగదేకపతియయ్యు సకలాభిగమ్యుండు సర్వశాసకుఁడయ్యు సదయహృదయుఁ

డభిమతప్రదుఁ డయ్యు నంజలిసాధ్యుండు పరిపూర్ణుఁడయ్యుఁ బ్రణతికాముఁ
డతిగతేంద్రియుఁడయ్యు ననిమేషదృగ్దృశ్యుఁ డవిభాజ్యుఁడయ్యు భక్తానుయాయి
సాక్షియయ్యు నతాపచారానభిజ్ఞుండు సముఁడయ్యు నార్తరక్షాపరుండు
భద్రగుణనిధి నిర్గుణప్రతిభటుండు, సముఁడు నధికుండు లేని యుత్తమపురుషుఁడు
వెదకిచూచిన శ్రీరంగవిభునివంటి ప్రభువు నత్యంతసులభుండుఁ బరుఁడుఁ గలఁడె.

అనుపద్యమునకు వ్యతిరేకాభిప్రాయమునకై వ్రాసినపద్యమే కాని కేవలప్రభువుల నిందించుటకుఁ గాదనవలయును. ధనాపేక్ష లేదు పరమదైవభక్తుఁడు, ఆత్మస్తుతివిముఖుఁడు నిట్లు చెప్పుట పరనిందకుఁ గానగునని తలంపఁ గూడదు. ఈపద్యమునుండియే కాఁబోలును, వికటకధలు పుట్టి యల్లసానిపెద్దనార్యునకుఁ గూడ నపకీర్తిం దెచ్చుచున్నవి.

ఈక్రిందిపద్యములో సత్కవులసామర్థ్యముం దెల్పినాఁడు.

చ. మనమునఁ గొన్ననెవ్వగలు మాన్పి ఘటింతురు కాండసమ్మదం
బనఘకథాముఖంబున హితాహితబోధ మొనర్తురింపుగాఁ
గనుఁగొనుకన్న నద్భుతముగా నెఱిఁగింతురతీంద్రియార్థముల్
ఘనమతులెల్లవారికి నకారణబాంధులు గారె సత్కవుల్.

ఈక్రిందిపద్యములోఁ దనకవిత్వసామర్థ్యము వెల్లడించినాఁడు.

గీ. యతి విటుఁడు గాక పోవునెట్లు మదీయ, కావ్యశృంగారవైభవాకర్ణనమున
విటుఁడు యతిగాక పోరాదు వెస మదీయ, కావ్యవైరాగ్యవర్ణనాకర్ణనమున.

కృతి ప్రారంభపద్యములు.

మ. శ్రీరామావసుధాపయోధరములం జేదోయి రెంట న్సను
ప్రారంభంబునఁ జిత్రభంగి మకరీపత్రాంకముల్ వ్రాసి ని
ర్వైరప్రేముల నిద్దఱుం దుసమసారస్యంబునం దేలు నా
శ్రీరంగేశుఁడు మమ్ము నిర్మల శుచిశ్రీయుక్తులం జేయుతన్.

చ. పొలయలుకన్ జపంబునకుఁ బూని కనుంగవ లెల్ల మోడ్చియుం
దలఁచిన మంత్రవర్ణమయతం గనుపట్టిన వాణిఁ జూచి న
వ్వొలయఁ గవుంగిలించి సుసుఖోన్నతిఁ జెందెడు సర్వతోముఖుం
డెలమి దలిర్ప మత్కృతికి నీవుత విశ్వజనాభిముఖ్యమున్.

మ. ముకుటేందుద్యుతిజాలముల్ సతతమై ముంపం బ్రభాతంబెఱుం
గక శశ్వత్పరిరంభణావిరతసౌఖ్యస్నిగ్ధుఁడై జాయఁ బా

యక లీలాపరుఁడైన శంకరుఁడు నిత్యప్రీతి సంధించుత౯
సకలాహ్లాదముగా మదీయకృతికి౯ శబ్దార్థదాంపత్యము౯.

కథాభాగములోని రెండుపద్యములు.

శా. కస్తూరీతిలకంబులై హరిశిలాకల్పంబులై కజ్జల
ప్రస్తారక్రియలై నవాగరుమషీపంకానులేపంబులై
శస్తానీలపటావగుంఠనములై జన్మించె దిక్స్త్రీయునా
రిస్తోమంబులయందు నూతనతమోరేఖాంకురశ్రేణికల్.

ఉ. దారుశిలాదిభావనలదైవముల న్నిరసించి తామసుల్
గోరుదు రింత చేయుదు రయో కోర తను కాఙ్క్షవివేకపాకముల్
వారిధరంబుల న్విడిచి వచ్చినచాతకధూర్తు లంబుధిం
దారు గొనంగ శక్తులె సుధామధురోదకపానసౌఖ్యముల్.

(40) పద్మపురాణోత్తరఖండము.- గ్రం. సం. 115.

అయ్యలమంత్రిపుత్త్రుఁడు మడికిసింగనార్యుఁడు రచించినది ఇది "గౌతమీ దక్షిణంబున...సబ్బినాటిరాష్ట్రంబున రామగిరిపట్టణంబు నిజరాజధానిగా... గల, నిరువెత్తుగండ గండగోపాలాది బిరుదాంచితుఁడగు గురుజాలముప్పభూపాలకుని మంత్రి యోబళామాత్యుని పుత్త్రుఁడగు వాణస కందనామాత్యున కంకితము చేయఁబడినది. తొమ్మిదియాశ్వాసములు నిండుగా నున్నవి. పదియవది పూర్తిగ లేదు. ఈకందామాత్యుఁడు సింగనకవీశ్వరునకు మిత్రమయినట్లు "నీ సహవాససౌఖ్యముల నెమ్మిఁజరించుట జేసి దిక్కుల న్వాసికి నెక్కి యిష్టజనవర్గముచేఁ బొగడొంది...ప్రస్తుతికెక్కితి"నను కృతిపతి వాక్యములోఁ దేటపడుచున్నది.

"ధాత్రిఁబద్మపురాణఖండత్రయమున, సర్వసారాంశమై పుణ్యజననమగుచు
మండితంబైన యుత్తరఖండ మీవు, తెనుఁగుగావింపు నాపేర ననఘచరిత.

గీ. బాదరాయణమునిముఖప్రభవ మైన,యిప్పురాణార్థ మిలఁగొంద రెఱుఁగనేర
కునికి నేఁటికినంధ్రభాషోక్తిఁ దెలియఁ, జెప్పిలోకోపకారంబు సేయవలయు.

వ. అట్లయిన నేను గృతకృత్యుండ నగుదు నీకును గీర్తిసుకృతంబులు సంభవించు—అని కవిని గందామాత్యుఁడు కోరినాఁడఁట.

చ. అమరిన మత్స్యకూర్మవిభవాదులు దీవులు వేదవాక్యసా
రము జలపూర మున్నతతరంగము లాగమశాస్త్రపద్ధతుల్

విమలయశోభిరామమగు విష్ణుచరిత్రము భోగితల్పమై
యమృతపయోధినాఁగఁ బఱపై చనుఁబద్మపురాణమిమ్ములన్

సీ. ధర్మబోధైశ్వర్యతతిమూలనికరంబు విమలాదిశక్తుల వెలయుకంద
మామ్నాయశాస్త్రంబు లనుపమశాఖలు బహుకథాసూక్తులుపల్లవమ్ము
లుపనిషద్వాక్యంబు లురుపుష్పసంఘంబు సొలుపారహరిభక్తి పుష్పరజము
వరయోగివైష్ణవవరులు భృంగంబులు పరమసౌఖ్యాసక్తి పరిమళంబు
బాదరాయణువాక్సుధాప్రౌఢిఁ బరఁగి, నిఖిలధర్మంబులకు నిల్వనీడ యగుచు
విష్ణురూపంబు దానయై వెలసిసౌఖ్య,రసికమై యొప్పుఁ బద్మపురాణతరువు.

వ. కలికాలజనితమహాదోషాతపసంతప్తాంతరంగులును సంసారపథాశ్రాంతస్వాంతులు నగు మనుష్యులీపుణ్యతరుశీతలచ్ఛాయ నాశ్రయించి-తాపత్రయంబుఁ బాసి జరామరణభయబుభుక్షారహితులై యవ్యయానందంబు నొందుదురు. అని దీనిఫలశ్రుతిముందే యాంధ్రీకరణోద్యమమునకుఁ గారణముగాఁ దెలిపినాఁడు ప్రారంభపద్యములు.

శా. శ్రీరమ్యం బగుదుగ్ధవార్ధి నడుమన్ శేషాహితల్పంబుపై
నారూఢంబగు నిందిరా సహితుఁడై యానందలీలన్ గణా
ధారుండై వరసంయమీంద్రులకు నాత్మజ్ఞానరూపంబుఁ దా
నై రంజిల్లెడు వేల్పు ప్రోచుఁ గృపఁ గందామాత్యు నెల్లప్పుడున్.

చెలువగు జాలరంధ్రములఁ జెచ్చెరఁ బిల్లలఁ బెట్టి యెప్పుడున్
వెలయు చకోరదంపతులు వెన్నెలమీఁగడలంచు ముక్కులం
జెలయుచుఁ గుప్పసంపుదొరఁ జివ్వఁగ మేల్గని చూచు శేషుమై
యలకున గాంచినవ్వు శివుఁ డబ్బయకందని ధన్యుఁ జేయుతన్.

చ. తనకు నివాసమైన వెలిదమ్మిఁ జెలంగెడు చంచరీకని
స్వన మొగి విన్నవారలకు సామకృతాభ్యసనప్రవృత్తి శి
ష్యనినదమోయనంగఁ గడు నింపెసలారెడు వేల్పుపెద్ద శో
భనయుతుఁ జేయుఁగాతఁ బ్రతిభాషిభు నాభళిమంత్రి కందనిన్

ఇక్కవిగద్యము-ఇది శ్రీనరసింహావరప్రసాదలబ్ధ కవితావిలాస భారద్వాజగోత్ర పవిత్ర అయ్యలామాత్యపుత్ర సరసగుణధుర్య సింగనార్యప్రణీతంబగు...

ఈతఁడొనర్చిన వాసిష్ఠరామాయణము, ద్విపదభాగవతము నిటీవలివికావచ్చును. ఇందు వానిం దెల్పలేదు.

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| నెఱియు | అ | ప్రకాశే | ప్రకాశించుట, నిండుట |
| నెఱవేఱు | అ | నిర్వాహే | నిర్వాహమవుట |
| నెలకొను | స | వ్యాప్తౌ | వ్యాపించుట |
| | | అవస్థానేచ | నిలుచుట |
| నేము | స | తండులాదిషుస్థూల సూక్ష్మవిభాగాయ శూర్పచాలనే | బియ్యము మొదలైనవానిలో సన్నవిడి, పెద్దవిడి యేర్పడుటకై చేట కదిలించుట |
| నేయు | స | వస్త్రాదినిర్మాణే | వస్త్రాదినిర్మాణము సేయుట |
| నేరు<br>నేర్చు | స | అభ్యాసే | అభ్యసించుట |
| నొక్కు | స | ప్రచితాపచయే | ఉబ్బణఁచుట |
| నొగులు | అ | పీడాయాం | పీడితుండవుట |
| నొచ్ | అ | వ్రణాదివేదనాయాం | పుండు మొదలైనది వేదన సేయుట |
| నొంచు | స | వ్రణాదివేదనాకరణే | నొప్పించుట |
| నొచ్చుకొను | స, అ | మనోవ్యథాయాం | మనస్సున వ్యథపొందుట |
| నొడుచు | స | వ్రణాదివేదనాకరణే | నొప్పించుట |
| నొడువు | స | ఉక్తౌ | చెప్పుట |
| నోచు<br>నోము | స | వ్రతకరణే<br>వ్యపనాశనేచ | నోముసేయుట<br>పోఁగొట్టుట |

## ప

| | | | |
|---|---|---|---|
| పకపకలాడు | అ | సహాసభాషణే | మిక్కిలి నవ్వుచు మాటలాడుట |
| పగలు<br>పగులు | అ | విదీర్ణతాయాం | బద్దలవుట |
| పంగటించు<br>పంగడించు<br>పంగలించు | స | యుక్తమూలాగ్రవిస్తారే | పంగలఁగాఁజేయుట |
| పచరించు | స | ప్రసారణే | ప్రసరింపఁజేయుట |
| | అ | ప్రచారేచ | సంచరించుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| పంచు | స | విభజనే | విభజించుట |
| | | ప్రస్థాపనే | అంపించుట |
| | | నియోజనే | నియోగించుట |
| | | భాగహారేచ | భాగహారముసేయుట |
| ప్రజ్వరిల్లు | అ | ప్రకాశే | ప్రకాశించుట |
| పట్టు | స | గ్రహణే | గ్రహించుట |
| | | స్పర్శే | స్పృశించుట |
| | | ఆరంభే | పనిపూనుట |
| | | అంగసంవాహనే | కాళ్ళు మొదలైనవి మర్దించుట |
| | అ | బుద్ధ్యారోహే | మనస్సునకు వచ్చుట |
| | | ప్రవేశపర్యాప్తౌ | ప్రవేశించుటకుఁ జాలుట |
| | | సంశ్లేషేచ | అంటుట |
| పట్టుపడు | అ | గృహీతే | గృహీతుండవుట |
| పట్టుకొను | స | హస్తగ్రహణే | చేతగ్రహించుట |
| | | అన్విష్యగ్రహణే | వెదకి గ్రహించుట |
| | అ | లేపనదృఢీభావే | లేపనము దృఢమౌట |
| | | అస్థిసంధిచలనవేదనాయాంచ | ఎముకలసంధి కదలుటచే నొచ్చుట |
| పడు | అ | పతనే | పతనమవుట |
| | | సహనేచ | సహించుట |
| పండు | అ | పరిపాకే | పరిపక్వమవుట |
| | | సస్యాదిఫలనిష్పత్తౌ | పయిరు మొదలైనవి పండుట |
| | | శయనేచ | శయనించుట |
| పండుకొను, పడుక్కొను గ్రా | అ | శయనే | శయనించుట |
| పడయు | స | ప్రాప్తౌ | పొందుట |
| పడుచు, పడుచుకొను | స | విటసంగత్యా ధనార్జనే | విటునితోఁ గలియుటచేత ధనము సంపాదించుకొనుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెలుఁగర్థము. |
|---|---|---|---|
| పడిపోవు | అ | స్వతఃపతనే | తనకుఁ దానే పడుట |
| | | మరణేచ | చచ్చుట |
| పంతగించు | స | ప్రతిజ్ఞాయాం | ప్రతిజ్ఞసేయుట |
| పదటు | స | వృథాజల్పనే | వ్యర్థముగా మాటలాడుట |
| | | ధర్షణేచ | గదురుకొనుట |
| పన్ను | స | కర్షణాయ హాలపశ్వాదిసన్నహనే | దున్నుటకై నాఁగలి పశువులు మొదలైనవానిని సన్నద్ధముగాఁ జేయుట |
| | | కార్యసన్నహనేచ | పని సన్నద్ధముగాఁజేయుట |
| పనుచు | స | ప్రస్థాపనే | పంపించుట |
| | | నియోజనేచ | నియోగించుట |
| పనవు | స | పరివేష్టనే | పరివేష్టించుట |
| పనివిను | అ | గమనే | పోవుట |
| పనిదీర్చు | స | మారణే | చంపుట |
| పనిపడు<br>పనుపడు | అ | అభ్యాసే | అలవాటగుట |
| పంపు<br>పంపించు | స | ప్రస్థాపనే | అంపించుట |
| పంబు | స | సంయోజనే | కూర్చుట |
| | అ | వ్యాప్తౌచ | వ్యాపించుట |
| ప్రబ్బ | స | ప్రాప్తౌ | పొందుట |
| ప్రబలు | అ | వృద్ధౌ | వృద్ధిపొందుట |
| పరికించు | స | మార్గణే | వెదకుట |
| | | పరిశీలనేచ | పరిశీలించుట |
| పరగు | అ | శోభాయాం | శోభించుట |
| పరిగొను | స | ప్రాప్తౌ | పొందుట |
| | | వేష్టనేచ | చుట్టుకొనుట |
| పరుగెత్తు | అ | ధావనే | ధావనముసేయుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| పర | స | వస్త్రాదిపర్యాస్తరణే | వస్త్రాదులు నేలవిస్తరింపఁజేయుట |
| | | వ్యాప్తౌచ | వ్యాపించుట |
| పరుండు | అ | శయనే | శయనించుట |
| పరిమార్చు | స | మారణే | చంపుట |
| పర్వు | స | వ్యాప్తౌ | వ్యాపించుట |
| | అ | శోభాయాంచ | శోభించుట |
| పరవంజు | అ | ప్రసరణే | ప్రసరించుట |
| పరపు | స | పూర్తికరణే | నిండించుట |
| పరిసిపోవు | అ | ఉపద్రవభ్రంశే | ఉపద్రవము తప్పిపోవుట |
| పఱిగించు | స | బాణప్రయోగే | బాణములు ప్రయోగించుట |
| పఱిగొను | స | ప్రాప్తౌ | పొందుట |
| | | వేష్టనేచ | చుట్టుకొనుట |
| పఱ | అ | పలాయనే | పరుగెత్తుట |
| | | ప్రవాహేచ | ప్రవహించుట |
| పఱతెంచు | అ | ఆగమనే | వచ్చుట |
| పఱపు | స | ధావనకరణే | పరుగెత్తించుట |
| | | బాణప్రయోగే | బాణము ప్రయోగించుట |
| | | బాధనేచ | బాధించుట |
| పఱివోవు | స | ఆక్రమణే | ఆక్రమించుట |
| | అ | అసమ్యగ్భావేచ | చెడిపోవుట |
| పలుకరించు, పల్లరించు, పలకరించు | స | జ్ఞాపనే | జ్ఞాపకముసేయుట |
| పల్లటిల్లు | అ | బలహానౌ | బలహీనుండగుట |
| పలవించు | స | ప్రలాపే | ప్రలాపించుట |
| పలువరించు | స | స్వప్నభాషణే | కలవరించుట |
| పవ్వళించు | అ | శయనే | శయనించుట |
| వసాపడు, వసాబడు | స | భోజనే | భోజనముసేయుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| ప్రాఁకు<br>పాఁకు | అ | ఉరోవష్టంభేనసర్పణే | ఱొమ్ముయొక్క అవష్టంభముచేతజరుగుట |
| | | లతావిసర్పణేచ | తీఁగెయల్లుకొనుట |
| ప్రాఁకొను<br>పాఁకొను | అ | మాలిన్యోపశ్లేషే | పాఁచిపట్టుట |
| పాఁచు | అ | కాలతోదూషితే | కాలముగడచిచెడిపోవుట |
| పాటిల్లు | అ | శోభాయాం | శోభించుట |
| పాటించు | స | ప్రాప్తౌ | పొందుట |
| | | కించిన్నిషేధవ్యవహారే | కొంచెమునిషేధముగా వాడుకొనుట |
| | | సమ్మతౌచ | సమ్మతించుట |
| పాడు | స | గానే | గానముసేయుట |
| పాఁతు | స | నిఖననే | క్రిందనాటుట |
| ప్రాఁతగిలు<br>పాఁతగిలు | అ | ప్రాచీనతాయాం | ప్రాచీనమౌట |
| పాతరలాడు<br>పాతర్లాడు | అ | నటనే | నాట్యముసేయుట |
| | | నిరవలంబభ్రమణే | అవలంబనములేకతిరుగుట |
| | | అన్వేషణేచ | వెదకుట |
| పాదుకొను | అ | బద్ధమూలతాయాం | లెస్సగానాటుకొనుట |
| ప్రాము | స | అనులేపనే | అలఁదుట |
| పాయు | స | వినాభావే | విడిచియుండుట |
| | అ | కాలతోదూషితేచ | కాలముగడచి చెడిపోవుట |
| పారాణించు | స | పాదయోర్లాక్షాద్యలంకారే | పాదములయందు లత్తుకమొదలైనవానిచేత నలంకరించుట |
| పారు | అ | గతౌ | పోవుట |
| | స | అత్యుచ్చారేచ | పాసనముసేయుట |
| పారవేయు | స | దూరక్షేపే | దూరముగవేయుట |
| పారుకాడు | అ | ముహుస్సంచారే | వేమాఱుసంచరించుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| పాఱు | అ | పలాయనే<br>ప్రవాహేచ | పరుగెత్తుట<br>ప్రవహించుట |
| పాఱుతెంచు | అ | శీఘ్రమాగమనే | శీఘ్రముగావచ్చుట |
| ప్రాల్మాలు<br>ప్రాఁమాలు<br>పాలుమాలు | అ | కర్తవ్యాలసతాయాం | పనిసేయుట కలసుండవుట |
| పాల్పడు | అ | ప్రాతిభావ్యే | పూఁటపడుట |
| పాలుపడు | అ | ప్రాధాన్యేచ | ఆలాయమవుట |
| పావుకొను | స | ఆతురతయాతిభక్షణే | ఆతురతపడి నిండుగాఁదినుట |
| పిక్కు | స | వంచనయార్థగ్రహణే | వంచనచేత నర్థమునుగ్రహించుట |
| పిక్కటిల్లు | అ | అతిశయే | అతిశయించుట |
| పిగులు | అ | స్యూతివిశ్లేషే | కుట్లువీడుట |
| పిచ్చిలు<br>పిచ్చిల్లు | అ | నిష్పీడనేన రసోద్గమే | పిసుకఁగ రసము బైటికివచ్చుట |
| పిచ్చలించు | అ | సంభ్రమే | తొట్రుపడుట |
| పించమణంచు | స | మారణే<br>గర్వప్రతీఘాతేచ | చంపుట<br>గర్వముపోఁగొట్టుట |
| పిడు | స | వస్త్రాదినిష్పీడనే | వస్త్రాదులునిష్పీడనముచేయుట |
| పిండు | స | రసక్షారణే | రసము స్రవింపఁజేయుట |
| పితుకు<br>పిసుకు | స | దోహనే | దోహనముసేయుట |
| ప్రిదిలు | అ | గ్రంథివిస్రంసే | ముడివీడిపోవుట |
| పిరిగొను | స | వేష్టనే | చుట్టుకొనుట |
| పిలు | స | ఆహ్వానే | ఆహ్వానముసేయుట |
| పిసుకు | స | ముష్టిమర్దనే | పిడికిటమర్దించుట |
| పీకు | స | ఉత్పాటనే | పెళ్లగించుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| పీకులాడు | స | ముహురాకర్షణే | వేమాఱులాగుట |
| పీచమణఁచు | స | మారణే | చంపుట |
| | | గర్వప్రతిఘాతేచ | గర్వముపోఁగొట్టుట |
| పీలు, పీల్చు | స | రసాకర్షణే | రసమునాకర్షించుట |
| పుక్కిలించు | స | జలేనముఖాంతశ్శోధనే | నీళ్లచేతఁ బుక్కిలిశోధించుట |
| పుచ్ | అ | జంతుదూషితే | కాయమొదలైనవి జంతువులచేతఁ జెడిపోవుట |
| | | ప్రస్థాపనే | అంపించుట |
| | | నియోజనేచ | నియోగించుట |
| పుచ్చుకొను | స | గ్రహణే | గ్రహించుట |
| | | పానే | త్రాగుట |
| | | భక్షణేచ | భక్షించుట |
| పుట్టు | అ | జననే | జనించుట |
| పుడుకు | స | దానే | ఇచ్చుట |
| పుణుకు | స | స్పర్శే | స్పృశించుట |
| | | అపర్యాప్తదానే | చాలకుండనిచ్చుట |
| | | పంచభిరంగులీభిర్గ్రహణేచ | అయిదువ్రేళ్లతోఁబుచ్చుకొనుట |
| పుణకరించు | స | అపర్యాప్తదానే | చాలకుండనిచ్చుట |
| | | ముమూర్షోర్హస్తచేష్టాయాంచ | చావఁబోవువాఁడు చేతులు పుణకరింతలు వెట్టుట |
| పుత్తెంచు | స | ప్రస్థాపనే | పంపించుట |
| పుయిలోడు | అ | దాక్షిణ్యే | దాక్షిణ్యపడుట |
| పురణించు | స | తిరస్కారే | తిరస్కరించుట |
| పురికొను | అ | విజృంభణే | విజృంభించుట |
| పుఁవిచ్ | అ | పరాగతౌ | వెనుకఁదీయుట |
| | | విశ్లేషేచ | విడిపోవుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| పులకరించు | అ | జ్వరే | జ్వరించుట |
| పులుము | స | క్షాళనే | క్షాళనము సేయుట |
| పులియు | అ | ఆమ్లీభావే | ఆమ్లమవుట |
| పుల్లవడు | అ | నిశ్చేష్టతాయాం | నిశ్చేష్టితుండవుట |
| పూ | అ | పుష్పోత్పత్తౌ | పుష్పించుట |
| పూడు | అ | ఖాతాపిరోహే | గొయ్యి మొదలైనవి పూడిపోవుట |
| పూను | స | కార్యోద్యమనే | ఉద్యుక్తుండౌట |
| | | వహనే చ | వహించుట |
| పూన్చు | స | ఉద్యోజనే | ఉద్యోగింపఁజేయుట |
| | | ధారణే చ | ధరించుట |
| పూయు | స | రూషణే | రూషణము సేయుట |
| పెకలు | అ | మూలోద్గమే | పెళ్లగిలుట |
| పెచ్చుపెరుగు | అ | విజృంభణే | విజృంభించుట |
| పెంచు | స | వర్ధనే | వృద్ధిపొందించుట |
| పెట్టు | స | నిధానే | ఉంచుట |
| | | పరివేషణే చ | వడ్డించుట |
| పెట్లు | అ | స్ఫోటే | స్ఫుటితమగుట |
| పెనఁగు<br>పెనుగు<br>పెనఁగులాడు<br>పెనుగులాడు<br>పెనుగొను<br>పెనయు | అ<br>స | అన్యోన్యవేష్టనే | అన్యోన్యము చుట్టుకొనుట |
| పెనఁచు<br>పెనుచు | స | శుల్బకరణే<br>వర్ధనే చ | పేనుట<br>వృద్ధిపొందించుట |
| పెంపలు | అ | క్షయే | క్షయించు |
| పెంపారు | అ | వృద్ధిప్రాప్తౌ | వృద్ధిపొందుట |
| పెరుగు | అ | వృద్ధౌ | వర్ధిల్లుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము |
|---|---|---|---|
| పెలుగు | స | శల్యకస్యదేహా విఘూర్ణనే | ఏదుపందిమొండలు విదిలించుట |
| పెలుకు<br>పెల్లగించు<br>పెళ్లగించు | స | మూలోత్పాటనే | పెకలించుట |
| పెల్లగిలు<br>పెళ్లగిలు | అ | మూలోద్గమే | పెకలుట |
| పేటాడు | అ | అతిసంచారే | మిక్కిలిసంచరించుట |
| పేడు<br>పేదు | స | శుంబ్యకరణే | త్రాడుపెనఁచుట |
| పేర్కొను<br>పేరుకొను | స | స్తుతౌ | స్తుతియించుట |
| | | నామ్నాహ్వానే | పేరుపెట్టి పిలుచుట |
| | అ | ఘనీభావేచ | ఘనీభవించుట |
| పేరుచు<br>పేర్చు | స | ఉపర్యుపరిస్థాపనే | ఒకదానిమీఁదనొకటియుంచుట |
| | | విజృంభణేచ | విజృంభించుట |
| పేరు<br>పేఱు | స | ఘనీభావే | ఘనీభవించుట |
| ప్రేరేపించు<br>ప్రేరేఁచు | స | ప్రేరణాయాం | ప్రేరణసేయుట |
| ప్రేలు | స | వృథాబహుజల్పనే | వ్యర్థముగా తలుచు మాటలాడుట |
| పేలు | అ | ఘర్మవిస్ఫోటే | చెమటకాయలులేచుట |
| పైకొను | అ | ఉపర్యాగమనే | మీఁదికివచ్చుట |
| పొక్కు | అ | మనోదుఃఖే | మనస్సునదుఃఖించుట |
| | | ఊష్మణోచ్ఛ్వానేచ | వేఁడిచేత బొబ్బపోవుట |
| పొంగు | అ | ఉద్వేల్లనే | ఉబుకుట |
| పొగడు | స | స్తుతౌ | స్తుతియించుట |
| పొగయు<br>పొగియు | అ | ధూమోత్పత్తౌ | పొగగలిగినదవుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| పొగచూరు | అ | ధూమమాలిన్యే | పొగచేతమలినమవుట |
| పొగలు | అ | పరితాపే | పరితపించుట |
| పొంచు | స | నిలీయనిరీక్షణే | దాఁగి నిరీక్షించుట |
| పొటకరించు, పొటమరించు | అ | వ్రణాదీనామావిర్భావే | వ్రణాదులావిర్భవించుట |
| పొట్లు | అ | కుంకుమాదీనాం వర్ణవైకల్యే | కుంకుమ మొదలైనవి వర్ణవికలమవుట |
| పొడుగు | అ | దీర్ఘీభావే | దీర్ఘమవుట |
| పొడు | స | వేధనే | గ్రుచ్చుట |
| | స | మారణే | చంపుట |
| | అ | ఉదయే చ | ఉదయించుట-చుక్కపొడిచెనని |
| పొడము | అ | ఉత్పత్తౌ | పుట్టుట |
| పొడకట్టు | అ | స్ఫూర్తౌ | స్ఫురించుట |
| పొడగను, పొడగాంచు | స | ప్రథమదర్శనే | మొదటఁజూచుట |
| పొడసూపు | అ | ప్రథమదృష్టౌ | మొదటనగపడుట |
| పొందు | స | ప్రాప్తౌ | చెందుట |
| పొదలు | అ | ప్రకాశే | ప్రకాశించుట |
| పొదుగు, పొదుపు | స | ఆక్రమణే | ఆక్రమించుట |
| | | అంతఃప్రవేశ్యఛాదనే చ | లోఁగాఁ బ్రవేశింపఁజేసికప్పుట |
| పొసరు | అ | శోభాయాం | శోభించుట |
| | స | దానే చ | ఇచ్చుట |
| పొరయు | స | ప్రాప్తౌ | పొందుట |
| పొరవోవు | అ | పీతజలాదీనాం నాడ్యంతరప్రవేశే | త్రాగిననీళ్లు మొదలైనవి నాడ్యంతరములోఁ బ్రవేశించుట |
| పొరివోవు | అ | మృతౌ | చచ్చుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము |
|---|---|---|---|
| పొరిగొను<br>పొరిమార్చు<br>పొరివుచ్ | స | మారణే | చంపుట |
| పొరలు<br>పొర్లు | అ | పర్యుల్లుంఠనే | ఉరితమవుట |
| పొర్లుకాడు | అ | ముహుఃపర్యుల్లుంఠనే | వేమాఱుపొర్లుట |
| పొఱుటు | | | |
| పొలయు | అ | అభిముఖాగమనే | అభిముఖముగావచ్చుట |
| పొలియు | అ | మృతౌ | చచ్చుట |
| పొలుచు<br>పొలిచు | అ | శోభాయాం<br>సంచారేచ | శోభించుట<br>సంచరించుట |
| పొలివోవు | అ | కించిద్భంగే | కించిద్భంగమవుట |
| పొలుపు | | | బట్ట మొదలైనవి మట్టి మొదలైనవానిలోఁ బొర్లించుట మందు ఉంట మొదలైనవి పేలపిండి మొదలైన వానిలోఁ బొర్లించుట |
| పొసుకు<br>పొసఁగు | అ | సంభవే | సంభవించుట |
| పోకార్చు<br>పోఁగొట్టు | స | వ్యపనాశనే | పోఁజేయుట |
| ప్రో | స | పాలనే | పాలించుట |
| పోచు<br>పోజు | స | వల్లరీపాటనే | నారచీల్చుట |
| పోట్లాడు | అ | కలహే | కలహించుట |
| పోటొగ్గు | అ | రణోద్యోగే | యుద్ధోద్యుక్తుండవుట |
| పోయు | స | ఆవర్జనే | నీళ్లు మొదలైనవానిని గ్రుమ్మరించుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెలుఁగర్థము. |
|---|---|---|---|
| పోరు<br>పోరాడు | స | కలహే | కలహించుట |
| పోరచు | స | దీనవృత్తియాచనే | దీనవృత్తినియాచించుట |
| పోలు | అ | శోభాయాం | శోభించుట |
| | స | అనుకరణేచ | అనుకరించుట |
| పోవు | అ | గమనే | ఏగుట |

బ

| | | | |
|---|---|---|---|
| బడలు<br>బడలుపడు | అ | శ్రాంతౌ | అలయుట |
| బడియు | స | దృష్టిదోషవారణాయహరిద్రాజలాదీనాం పురుషోపరిభ్రామణే | దిగఁదుడుచుట |
| బతిమాలు | స | దైన్యయాచనే | దైన్యముగయాచించుట |
| బ్రతుకు<br>బతుకు<br>బ్రుకుకు | అ | జీవనే | జీవించుట |
| బదిలించు<br>బదలాయించు గ్రా | స | ప్రతినిధికరణే | బదులుసైచుట |
| బద్ధకించు | అ | అలసతాయాం | అలసుఁడవుట |
| | | మూత్రపురీషనిరోధేచ | బద్ధకోష్ఠియగుట |
| బమ్మరిల్లు | అ | సంభ్రమే | తొట్రుపడుట |
| బ్రమయు<br>బ్రమియు | స | భ్రమే | భ్రమించుట |
| బరుకు | స | నఖపాటనే | గోళ్లతోఁ గీయుట |
| బలియు | అ | పీవరతాయాం | లావవుట |
| బాదు | స | తాడనే | కొట్టుట |
| బారిసమరు | స | మారణే | చంపుట |
| బిగియు | అ | దార్ఢ్యే | దృఢమవుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెలుఁగర్థము. |
|---|---|---|---|
| బ్రిదిలు | అ | విస్రంసే | వదులుట |
| బిద్దు | అ | జలస్రావే | నీళ్లుకాఱుట |
| బిలుకుమార్చు | స | మారణే | చంపుట |
| బిలుకుఱు | అ | శ్వాసపారవశ్యే | ఊపిరి త్రిప్పుకోలేకపోవుట |
| బీజారు | స | | ధాన్యము గడ్డి మొదలైనవి పైపైకి కుప్పచేయుట |
| బ్రుంగు | అ | మజ్జనే | మునుఁగుట |
| | | మృతౌచ | చచ్చుట |
| బుగులుకొను | స | వ్యాప్తౌ | వ్యాపించుట |
| బుజ్జగించు | స | సాంత్వనే | సాంత్వనసేయుట |
| బురణించు | స | తిరస్కారే | తిరస్కరించుట |
| బుసకొట్టు | అ | కోపశ్వాసే | కోపముచేత నిట్టూర్పువిడు |
| బుసివోవు | అ | ఈషద్భంగే | ఈషద్భంగమవుట |
| బెగడాయించు గ్రా | అ | విరోధే | విరోధించుట |
| బెట్టించు | స | నిరసనే | చిమ్ముట |
| బెడియు, బెడాయించు | అ | కార్యవైకల్యే | కార్యవైకల్యమవుట |
| బెణకు, బెణుకు | అ | అస్థ్యాదీనాంస్థానతశ్చలనే | ఎముక మొదలైనవి స్థానము వల్లఁ జలించుట |
| బెదరు, బెదురు | అ | ఆకస్మికభయే | ఆకస్మికముగ భయపడుట |
| బెరయు | స | ప్రాప్తౌ | పొందుట |
| బెల్లించు, బేలించు | స | సాంత్వనే | సాంత్వనసేయుట |
| బొక్కు, బొక్కలాడు, బొక్కులాడు గ్రా | స | ముఖమాపూర్యచర్వణే | నోటినిండఁ బోసికొని నములుట |
| బొంకు | స | అపలాపే | అపలపించుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| బొబ్బరించు | అ | ఉత్క్రోశే | గట్టిగా నఱచుట |
| బొల్లు | స | అసత్యభాషణే | అబద్ధపుమాటలాడుట |
| బ్రో | స | పాలనే | పాలించుట |
| భోంచేయు గ్రా | స | భోజనే | భుజించుట |
| బోరగిలు | అ | అవపత్యాశయనే | బోర్లపండుకొనుట |
| బోర్లించు | స | కుంభాదీనామవపాతనే | కుండ మొదలైనవానిని దలక్రిందుగాఁ జేయుట |

## మ

| | | | |
|---|---|---|---|
| మ్రగ్గు, మగ్గు | అ | పరిపాకవిశేషే | పండు మొదలైనవి పరుపుతగిలినందునఁ బడిపోవుట |
| | | న్యూనతాయాం | తగ్గిపోవుట |
| | | పాకదూషితేచ | మిక్కిలి ఉడికినందునఁ జిమిడిపోవుట |
| మగుడు | అ | పర్యావృత్తౌ | మరలుట |
| మట్టు | స | పాదఘాతే | కాళ్ళతోఁ ద్రొక్కుట |
| మట్టగించు | స | అనురూపఖండనే | సరిగా ఖండించుట |
| మట్టుపడు | అ | రోగాదినివృత్తౌ | రోగాదులు నివర్తించుట |
| మట్టుపఱచు | స | పర్ణాదీనాం సమవక్లృప్తౌ | ఆకులు మొదలైనవానిని సరిగా నేర్పఱచుట |
| | | అనురూపఖండనేచ | సరిగా ఖండించుట |
| మండు | అ | ప్రజ్వలనే | ప్రజ్వలించుట |
| మండిపడు | అ | అతిక్రోధే | మిక్కిలి క్రుద్ధుండవుట |
| మడు | స | ఆకుంచనభేదే | మడతపెట్టుట |
| మడియు | అ | మృతౌ | చచ్చుట |
| మడఁగు, మణఁగు | అ | వినమనే | కత్తిమొన మొదలైనవి వంగుట |
| మందలించు | స | ఉక్తౌ | చెప్పుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| మదాలించు | అ | సస్యాదీనామఫల వృద్ధౌ | పైరు మొదలైనది వ్యర్థముగా బలియుట |
| మ్రందు | స అ | దాహే | దహించుట |
| మద్దటిల్లు<br>మద్దటిలు | అ | ఆతపాదిశాంతౌ | ఎండ మొదలైనది శమించుట |
| మను<br>మన్ను | అ | జీవనే | బ్రతుకుట |
| మన్నించు | స | బహుమతౌ<br>అపరాధసహనేచ | మన్ననసేయుట<br>తప్పుసహించుట |
| మన్నిగొను | స | మారణే | చంపుట |
| మప్పు | స | అభ్యాసనే | అలవఱుచుట |
| మరఁగు<br>మరుగు | స | వాసనయాసక్తౌ | వాసనచేత నాసక్తుండవుట |
| మరలు<br>మఱలు | అ | పర్యావృత్తౌ | మళ్ళుట |
| మఱఁగు<br>మఱుగు | అ | తప్తతాయాం | కాఁగుట |
| మఱ<br>మఱు | స | విస్మృతౌ | విస్మృతిపొందుట |
| మఱుపడు | అ | అదృశ్యతాయాం | అదృశ్యమవుట |
| మలఁగు | అ | స్వయంవేష్టనే<br>పర్యావృత్తౌచ | చాఁప మొదలైనదిచుట్టుకొనుట<br>మళ్ళుట |
| మలుఁగు | అ | దీపనిర్వాణే | దీపము చల్లారుట |
| మల<br>మలు | స | పాషాణతక్షణే<br>తండులాదిషుకోష్ఠా దిపృథక్కరణేచ | రాయిచెక్కుట<br>బియ్యము మొదలైనవానిని జేఁటలోఁ బోసికొని మంటిగడ్డలు మొదలైనవానిని విడఁజేయుట |
| మల్లాడు | అ | అన్యోన్యవేష్టనే | పెనఁగుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెలుఁగర్థము. |
|---|---|---|---|
| మల్లచఱి<br>మల్లచఱుచు<br>మల్లచఱు | స | భుజాద్యాస్ఫాలనే | భుజాద్యాస్ఫాలనము సేయుట |
| మల్లు | అ | పర్యావృత్తౌ | మరలుట |
| మళ్ళఁబడు | స | అభ్యుత్థానే | ఎదిరించుట |
| మళ్ళఁదోలు | స | పశ్వాదిపర్యావర్తనే<br>తృణకాష్ఠాదివృద్ధయే క్షేత్రస్యపశ్వాదిభ్యోరక్షణేచ | పశ్వాదులఁ దిరుగఁదోలుట<br>తృణకాష్ఠాదులు వృద్ధిపొందుటకై క్షేత్రమును బశ్వాదులవలన రక్షించుట |
| మసఁగు | అ | విజృంభణే | విజృంభించుట |
| మసలు<br>మసులు | అ | జలమదనే<br>ఆలస్యే<br>మదపారవశ్యే<br>సంచారేచ | నీళ్లుపొంగునట్లు కాఁగుట<br>ఆలస్యము సేయుట<br>మదముచేతఁ బరవశుఁడవుట<br>సంచరించుట |
| మాఁగు | అ | ఫలాదిపరిపాకే | ఫలాదులు పరిపక్వమవుట |
| మాటు | స | గోపనే | దాఁచుట |
| మాటుపడు | అ | అదృశ్యతాయాం | అదృశ్యమవుట |
| మాట్లాడు గ్రా | స | భాషణే | భాషించుట |
| మాడు | అ | విదాహే | అన్నాదులు దగ్ధమవుట |
| మాను | అ | పరిహారే<br>వ్రణాదిశాంతౌచ | పరిహరించుట<br>కురుపు మొదలైనది శమించుట |
| మానుకొను | స | బుద్ధిపూర్వత్యాగే | బుద్ధిపూర్వముగ విడుచుట |
| మ్రాన్పడు | అ | నిశ్చేష్టతాయాం | నిశ్చేష్టుండవుట |
| మాయు | అ | మలినీభావే<br>నాశేచ | మలినమవుట<br>నశించుట |
| మాఱుమసలు<br>మాఱుమసులు | అ | ప్రతివాదే | ప్రతివాదించుట |
| మాఱుపడు | అ | వ్యత్యాసే | వ్యత్యాసమవుట |

# పరిషత్కార్యాలయమున వెలకు దొరకు

# గ్రంథములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము-చదలువాడ మల్లయకవి | రు 0 | 8 | 0 |
| 2 | కవిజనాశ్రయము-వేములవాడ భీమకవి ... ... | 0 | 10 | 0 |
| 3 | చంపూరామాయణము-ఋగ్వేదికవి వేంకటాచలపతికవి ... | 1 | 0 | 0 |
| 4 | నీతిసీసపద్యశతకము-తాళ్లపాక పెదతిరుమలార్యుఁడు ... | 0 | 2 | 0 |
| 5 | జ్యోతిశ్శాస్త్రసారము-శ్రీమాన్ కపిస్థలం కృష్ణమాచార్యులుగారు బి. ఏ., యల్. టి. ... ... | 0 | 8 | 0 |
| 6 | జ్ఞానప్రసూనాంబికాశతకము-శిష్టు సర్వశాస్త్రికవి ... | 0 | 2 | 0 |
| 7 | సర్వేశ్వరశతకము-యథావాక్కుల అన్నమయ్యగారు ... | 0 | 3 | 0 |
| 8 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము-జ. రామయ్య పంతులు గారు, బి ఏ., బి ఎల్ ... ... | 0 | 8 | 0 |
| 9 | కావ్యాలంకారచూడామణి-విన్నకోట పెద్దయకవి | 0 | 8 | 0 |
| 10 | చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లనకవి ... | 1 | 0 | 0 |
| 11 | అకారాద్యముద్రిత గ్రంథసూచిక ... ... | 0 | 8 | 0 |
| 12 | ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ... ... | 0 | 12 | 0 |
| 3 | శివతత్త్వసారము-మల్లికార్జున పండితారాధ్యులు ... | 0 | 12 | 0 |
| 14 | Defence of Literary Telugu జయంతి రామయ్య పంతులుగారు బి ఏ., బి. ఎల్. ... ... | 0 | 8 | 0 |
| 15 | శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి ... ... | 0 | 12 | 0 |
| 16 | ఆర్యభాషావిభాగము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ... ... | 0 | 8 | 0 |
| 17 | Drawidian Lexicography ... ... | 0 | 4 | 0 |
| 18 | హాస్యరంగములు-కొత్తపల్లి సూర్యారావు ... ... | 0 | 8 | 0 |
| 19 | నారసింహపురాణము ఉత్తరభాగము-హరిభట్టు ... | 1 | 0 | 0 |
| 20 | మన్నారుదాస విలాసనాటకము—రంగాజమ్మ. ... | 0 | 8 | 0 |
| 21 | జైమినిభారతము-వచనము-వేంకటకృష్ణప్పనాయకుఁడు ... | 0 | 12 | 0 |

Printed by M. Rangiah at the Cocanada Printing Works, Cocanada.

శ్రీ

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy)**


సంపుటము ౧౭. { విభవనామసంవత్సరము. ఆశ్వయుజకార్తికమాసములు. } సంచిక ౪





కాకినాడ:

కొత్తపల్లి సూర్యారావుచేఁ బరిషత్కార్యాలయమునఁ
బ్రకటింపఁబడినది.

చందా { పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు. 3. } { విడిసంచిక రు ౦-౮-౦

1928

## ప్రతిష్ఠాపకులు

శ్రీ రాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరు వారు,
పిఠాపురము మహారాజావారు. పరిషద్యావజ్జీవాధ్యక్షులు.
కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు—ఉయ్యూరు జమీందారువారు.
శ్రీ రాణి వత్సవాయ వేంకట సుభద్రయ్యమ్మజగపతిబహద్దరుగారు—తుని రాణిగారు.
కీ. శే. శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

### అధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు బి.ఏ., బి.ఎల్.

### కార్యదర్శులు.

దర్భా వేంకటశివరామరాజుగారు బి.ఏ., బి.ఎల్.
కిడాంబి రాఘవాచార్యులుగారు ఎం.ఏ., బి.ఎల్.

### కార్యనిర్వాహకసభాసభ్యులు

దివాన్ బహాదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారు
డాక్టరు వేమూరి రామకృష్ణారావుగారు ఎం. ఏ. ఎల్. టి. PH. D.
(కోశాధ్యక్షులు)
శ్రీ త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారు
కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారు
అనంతపంతుల రామలింగస్వామిగారు
దగ్గిరాల వేంకటసూర్యప్రకాశరావుగారు బి.ఏ.
తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు.
ఆకెళ్ల వేంకట్రామయ్యగారు
కోటా వేంకటసుబ్బారావు నాయుడుగారు.
ఓలేటి వేంకటరామశాస్త్రిగారు.
పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు
చిల్లారిసెట్టి కంరబ్రహ్మారావు నాయుడుగారు

# విషయసూచిక.

# పరిషత్ప్రయోజనములు.



తెనుఁగుభాషను, వాఙ్మయమును, అభివృద్ధి నొందించుటయు, ఆవిషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసంగుటయు నీపరిషత్తుయొక్క ప్రయోజనములు. ఈపనిని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యీక్రింద బొందుపఱుపఁబడు చున్నవి —

I తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వాంకషమగు నిఘంటు వొకటి రచించి ప్రచురించుట,

II తెలుఁగుభాషకు సజాతీయేతర భాషలతోఁ గలసాదృశ్యములను సాకల్యముగ నిరూపించుచు నొకవ్యాకరణము రచించి ప్రచురించుట,

III ఆధునికశాస్త్ర గ్రంథరచనయందుఁ బ్రయోగించుటకునై పారిభాషికపదములను నిర్ణయించి వివరించు నొకశబ్దకోశమును సిద్ధముచేయుట,

IV ఆంధ్రదేశప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహ మొసంగుటయు, లభ్యములగు వానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుఁగు దేశముయొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్ర మొకటి రచించి ప్రచురించుటయు;

V సర్వవిషయములనుగుఱించి చేయఁదగు గ్రంథరచనకుఁ బ్రోత్సాహ మొసంగుట,

VI ఆంధ్రభాషలోని మంచిగ్రంథములఁ బండితపరిష్కారము చేయించి నిర్దుష్టముగఁ బ్రచురించుట,

VII తెలుఁగుభాషకును వాఙ్మయమునకును సంబంధించిన విషయములను జర్చించు నొక పత్రికను బ్రకటించుట,

VIII తెలుఁగువాఙ్మయమునకు సంబంధించిన విషయములను గుఱించి చర్చించుటకుఁ గాను సాంవత్సరికసభల నేర్పాటుచేయుట,

IX తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలఁ గావించి పారితోషికములను, సాహిత్య పటములను, యోగ్యతాపత్రికలను నొసంగుట,

X ఒక పుస్తకభాండాగారమును స్థాపించి సాగించుట. ఇందుఁ బ్రధానముగాఁ దెలుఁగు గ్రంథము లుండవలయును, వ్రాఁతప్రతులుఁగూడ నుండవలయును,

XI తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికి నుపచరించు నన్ని కార్యములను జేయుట

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

సంపుటము ౧౭. { విభవనామసంవత్సరము ఆశ్వయుజకార్తికమాసములు. } సంచిక ౪.

## తెలుఁగుపొలుపు.

—( కాశీభట్ట కృష్ణరాయశాస్త్రిగారు )—

(రెండవసంచిక శేషము)

'I beg your pardon' ఆంగ్లోదాహృతి, "దానికేఁలే, పోరే, పిల్చి నాపలక్కపోవడం నీకేమేనా, తగున్రా ? నీదగ్గిర అయుందా లేదా ? నావద్దలే నేపోతానయ్యా" అని సామాన్యుల ప్రసంగము. కేవలశిష్టు లెవ రనునది, యింకను దేలలేదు. వృద్ధాంధ్రసలక్షణపండితశిఖామణు లిర్వురు సంభాషింప "ఏవండీ తమదర్శన మేమో నున్నా చాలాదుర్లభంలా గయింది మరిగంటే నున్నా, ఒకనాఁడైనా వాఁడేదీ వచ్చి చచ్చిందివుందీ. అహాహా ఆమొక్క రామునిదే ఇదంతా ఏం పూరుకుంటారేఁ?" అని యందు రది ప్రయోగ్యమా? కాకున్న నేల ? సభలంగో మాటాడునది యెందురా ? ఆంధ్రభాషావిషయ సభలలో నాడినదే ప్రమాణ మందము. ఇంకొకవిషయ మైన "వైయాకరణాస్తృణవః" వంటి దగును. చక్కఁగ గమకించి పదముల నేఱిన గాని తెలియదు. ఊరక యిట్లు మాటాడుదు రని యూహింపవలవదు. "ఆర్యులారా ? మనం యావన్మంది యిప్పు డిక్కడెందుకు సమావేశమైనామో తమకెఱుకే నిరంతరపాఠ్యమానసద్గ్రంథజాల మ్మన్నీ యేనన్నయభాషలోనో వ్రాస్తే యేం లాభం జెప్పండి. పోనీ నేఁటిదానిలోనే వ్రాస్తామంటే తగినవేవీ లక్షణగ్రంథాలు ? దేశాని కది బోధయేటట్టూ లక్షణాల్లాగేటట్టూ భగవంతు

డనుగ్రహించుగాక. అప్పటివరకూ మనం చేతుల పిసుక్కుంటూ వుండలేం కాబట్టి యీలక్షణమే యాధారంచేసుకొని గ్రంథాలు రాయాలి" అని సభ యందుఁ బ్రయుక్తమయ్యె నది ప్రయోగ్యమా ? సమర్థు లింకను ద్వరితముగ నుచ్చరించుచుఁ బదావయవము శ్రుతిగోచరము గానీక యుపన్యసింతురు. అట్లుంగాక యాదర్శ మెట్లుండఁదగును? మఱియు సముఖసంభాషణము పరిమితము బోధ మపరిమితము. పదస్పష్టత యెట్లున్నను భావబోధార్థవినియుక్తకర చాలనాద్యభినయములను బునఃకథనమువలనను బోధ మగును, కాని యీ యీయర్థమున నీయీపద ముపయోగించె నని తెలియఁబడదు సంభాషణభాషలో నెన్నియో లోపము లున్నవి "త్రువ్వట బాబా" అను పద్యసందర్భమును మాటకు వ్రాతకు నై వచ్చెను. పెద్ద లెవ్వరును సమ్మతింపని దనియే తలంతును. తరువాతి వాక్య మరయుదము.

ఏదేశమున లేని యీగ్రాథికవైపరీత్య మేల ? అని ప్రశ్నింతురా ? ఒక్కొక్కదేశమున నొక్కొక్కవిధ మాచారము, వ్యాకరణవిషయమున వారు గొప్పవారు కారు. తరువాత గొప్పవారే యైరి దానికిఁ దోడుగఁ బాలనాసౌకర్యములు ధనము నధికారమును గల్గుట దేశ మంతట యోగ్యభాషను వ్యాపింపఁజేసిరి. అయినను భేదమున్నది మాటాడునట్లు వ్రాయుచున్నారా ? టాక్ Talk నో Know, ఇత్యాదులు లేవా ? మఱియు Tre language of prose often approaches very closely to that of ordinary conversation"-- Sweet's English Grammar. స్వీటుగారివాక్యములవలనఁ బద్యభాష కూఱినది ఇఁక గద్యభాష స భాషణభాష, యీషద్వైషమ్యమున సామ్య మనుట నదియుఁ గొంచెము భేదవంత మనియే యర్థ మగును. కొంచెమైన భేదముండును గదా ? వారిసాంప్రదాయ మట్టిది. అఱవమున "డంబాచారి" ని వ్రాయవలసివచ్చిన "టంపాచారి" అని వ్రాయుదురు సరే యనుటయే ప్రత్యుత్తరము. రసికులపలుకునను వ్రాతను రసము స్ఫురించు ననందురా ? అవును. కాని పలుకునప్పటిరసముకంటె వ్రాయునప్పటిరసము సమాస్వాదనీయమై యుండును. సంభాషణము సూత్రప్రాయముగ నుండును. వ్రాఁత వివరణరూపముగ నుండును. బహిరాకారముమాత్రము సంభాషణము.

"నిఘంటువులున్ను వ్యాకరణములున్ను వాడుకలోనున్న వ్యావహారిక భాషలకూ కావలెను" ఈవాక్య మన్నవారే వ్యాకరణ మక్కఱలే దనియు

నన్నారు. ఏది గ్రాహ్యము. భాష మార్పు నొందుననుటలో సంశయము లేదు. లక్షణములు మాఱవలయు ననుటయు నిష్టమే. వైల్డుపండితుఁ డన్నట్లు "మారినదేమో మారినదే. ఆమార్పు, అనివార్యము" మనయాంధ్రభాషయు మాఱినది గ్రాంధికమన్నారు. కలగూరగంపవలె నున్నదందురా? అవును, అయినదేదో అయినది

అందఱును వ్యావహారికభాషలోనే వ్రాసిరి కావున మనమట్లు కావింపవలయు నందురా? మంచిది. అధికసంఖ్య ప్రమాణముకదా? ఆంధ్రమునఁ బద్యము లించుమించు సలక్షణాంధ్రమున వ్రాసిరి గద్యముల వ్యావహారికమున వ్రాసిరి "పద్యకావ్యమువలెనే కేవలము కావ్యభాషలోనే రచించినవచన గ్రంథము నిజమయిన తెలుఁగుదేశములలో మాకు ఎక్కడనూ కనబడ లేదు." ఈ వాక్యము కావ్యభాష యని పేర్పఱుచు చున్నది కదా? వచనగ్రంథము లట్టిభాషలో నుండుటచేతనే వచనకర్తకు గౌరవము లేదు. పద్యము వ్రాసినంగాని కవికానేరఁ డను భావము జనసామాన్యమునఁ బుట్టుట కదియే కారణము. వ్యాఖ్యానములు మొదలగునవి వ్యావహారికభాషలో వ్రాయ బడినవి. అర్థవిషయమున నవి ప్రమాణములు కాని భాషావిషయమునఁ గావు. తప్పు లన్ని వైద్యములోను జ్యోతిషములోను శరణుపొచ్చినవి యనునానుడి లేదా? అట్లే పద్యములఁ దప్ప నితరమున వ్యావహారికభాష వసించెను. లేఖకప్రమాదములు, వచననిరాదరణము మున్నగునవియుఁ గారణములు. శాసనాదుల ప్రమాణములు, సంస్కృతవ్యాఖ్యానములఁ బ్రమాణముగ భాషావిషయమున శాసనములఁ గైకొనిరా, అసాంప్రదాయము. శాసనలేఖకులు సాధారణముగ మూఢులు. నన్నయచేవ్రాలు గలది కావచ్చును గాని నన్నయ్యయే శాసనాక్షరములఁ జెక్కెనా? లేదు. మొదటఁ బద్యగౌరవము తరువాత గద్యగౌరవము వచ్చును. సంస్కృతమున లేదా? ఆశ్వాసాంతగద్యములు వ్యావహారికమునఁ గలవా? వచనములు మాత్రమున్నవి. గద్యవచనము లాంధ్రంబున భిన్నలక్షణము లయ్యెను. పద్యములలోను గొన్నింట వ్యావహారిక మున్నది అది యౌచిత్యమునకు "రారానాన్నా" అను నప్పుడును "రారానాయనా" అను నప్పుడును భేదము లేదా? "నాన్నా" గ్రామ్యమో, గ్రాహ్యమో "నాన్నా" అనుటయే సొంపు. కొన్ని ప్రమాదములు. అన్నియును సలక్షణ మగు భాష నుంటయే మంచిది, అట్లుండుఁగాక.

ఇఁక వ్యావహారికభాషను విచారింతము. నేఁటివారివాదమును బట్టియు వ్రాఁతలఁబట్టియుఁ బ్రత్యయమాత్రవికారమె వ్యావహారికభాష యైనట్లు నాకుఁ దోఁచెను. నా యభిప్రాయమును వెలిఁబుత్తును.

శిష్టవ్యవహారభాషయనునప్పుడు చిక్కులెన్నియో సంభవించును. శిష్టులు కానివా రెవరు? ఎవనిమగ్గానికి వాఁడే సేనాపతి యన్నట్లు తర్కింప నందఱు శిష్టులే యొన్న నాంధ్రవిశ్వవిద్యాలయారంభదినోత్సవసందర్భమున వైసుచాన్సలరుగా రగు శ్రీరామలింగారెడ్డిగా రన్నట్లు "కులమున కొక్కొక్క ప్రతినిధిని నెన్నుకొనుచు వచ్చిన సినేటు జరుగ దనియుఁ గులములపూర్వచరిత్రముల నందఱు నుత్తమోత్తము లనియుఁ దెలిపిరి" శిష్టతానిర్వచన మెట్లు? బ్రాహ్మణులు శిష్టులా? ఎందఱో దద్దమ్మ లున్నారు సంకరు లని కూడ వారినిఁ దదితరు లన్నను దాము బ్రాహ్మణు లగుదురు క్షత్రియులు క్షాత్రబ్రాహ్మణులు, వైశ్యులు, శూద్రులు, మంగలి, చాకలి, చచ్చుట, చీమలు, దోమలు, కుక్కలు, నక్కలు, పందులు, చేఁపలు, చెట్లు సర్వము బ్రాహ్మమే యగును. వ్యాసులునట్లే "సర్వం బ్రాహ్మ మిదం జగత్" అన లేదా, వేదాలదేవులాట లేల? ప్రతివర్ణము నుత్తమోత్తమమే. నరుఁ డుత్తముఁడు. ఒకవేళ మాలవాండ్రను బ్రాహ్మణసమానులే యన్నఁ గోపము రావచ్చును. కాని ఖండాంతరు లెట్టివారు? వారు మనకు నీచు లన్న మనము వారికి నీచులము కామా! నీతిమంతుఁ డుత్తముఁడు నీతిహీనుఁడు నీచుఁడు చదివినవాఁడే శిష్టుఁడు ఇక నాంధ్రవిద్వత్త్వము గలయెవఁడైనను శిష్టుఁడని యందుము. అట్లన్నచో నట్టిశిష్టులందఱును నొక్కరీతిసంభాషింపరు ఒకశూద్రుఁడు శిష్టుఁ డయ్యుఁ బ్రసంగమున నపశబ్దములనే వాడును. ఇది యందఱకును విదితమే భాషావిషయమున శిష్టులఁ జేయవలయును. ఇంటనుండువారు సేవకులుఁ, దోడివారు, నిరుగుపొరుగువారు పరిసరము లన్నియు భాషావిషయమున శిష్టముగ నున్నఁగాని శిష్టులు బయల్పడరు. తర్కము ముదిరి చేఁదెక్కును. వ్యావహారికమే యన్నఁ బ్రమాదమేమి? "ఎందోలె, గుంతా నెగే, పల్లకనాకేళ్లేమని తొంగున్నావా ఎటే?" ఇత్యాదివాక్యములును జేర్చుకొనవలసివచ్చును ఇఁక నేదిశరణ్యము? "ఏమే ఒసే" అని కొందఱందురు 'ఎందోలె, భాషయా, ఏమే ఓసే, భాషయా శిష్టభాష? ఏది సాధువు. రెండును సాధువులే యందుమా? అసాధువే లేదు. అపౌరుషేయమే యంతయు. ఇఁకఁ బాతిశాఖల వ్రాయవలయును.

నియమమనఁగా 'వర్ణలోపాగమాదిమాత్రవిశదీకరణము' అను సూత్రము సార్థక మగును. ఆసంస్కారము మృతసంస్కారమే, లోపములఁ జూపి సరిచేసి యుంట సంస్కారము. వేదముల కాప్రాతిశాఖ్యసంస్కారమే తగును "సంస్కారో లోపాగమవర్ణవికారప్రకృతిభావలక్షణః" అనునది వేదవిషయమున నగును. లోకమున నట్లుగాదు. వేదమువంటిది లోకము కాదు. వేదమును లోకమును నిత్యములే కాని కొంచెము భేదము గలదు. ఇది యొకగొప్ప వేదాంతము. వేదము మాఱదు లోకము మాఱును. ఆమార్పునకుఁ గాలము పట్టును. ఆ కాలమునకే సురూఢత. ఆసురూఢత నెఱుఁగుటయే సంకేతితము. అది యొకప్రవాహము వంటిది. ప్రాఁత క్రొత్తయుఁ గాదు. ప్రాతయుఁ గ్రొత్తయు నైక్య మగుటయే రూఢత. అట్లుకాఁగ నదో కొంచెము ప్రాఁతవడినట్లు తోఁచును. క్రొత్త మిగిలిన దంతయు నగును. ఏపారిభాషికములో క్రొత్తగ నుండ వచ్చును. వేదవ్యాకరణలక్షణము లోకవ్యాకరణమునకు సరియగుట యెట్లు? "కథమనుశాసనమ్? ప్రకృత్యాదివిభాగకల్పనయా సామాన్యవిశేషవతా లక్షణేన" అని కాశికాకారుఁ డనెను. ప్రకృత్యాదివిభాగము లనుటచే శబ్దావయవము లన్నియు ననియర్థము. ఆదిశబ్దముచే గ్రహింపవచ్చును శబ్దము దాని యవయవముల దుష్టతయు శిష్టతయుఁ జూపును. సామాన్యలక్షణము విశేష లక్షణమును జెప్పును. అది శబ్దానుశాసనము. అట్టిపని చేయునది వ్యాకరణ శాస్త్రము.

సంస్కారరూప మనఁగా నున్నదానిని జన్నదానిని నరసి సంప్రదాయ మెఱింగి విధినిషేధములఁ జూపుట యగును. శాస్త్ర మనునామము సార్థక మగును. ఉదాహరణ మరయుఁడు.

వృక్షశాస్త్రము వృక్షజాతులను వానియభివృద్ధులను దత్కారణములను సల్లక్షణములను దుర్లక్షణములను జూపి, వెలఁగచెట్టునకు సమున్నతిలక్షణము, నీచత దుర్లక్షణము, దానిని దొలఁగింపవలయును, టెంకాయకుఁ గడుగునీరు వలదు. ఇట్లు శాసించును. వైద్యుఁడును నష్టి-ఫశాస్త్రమును విధినిషేధములఁ జూపుచునే యుండును ప్రసిద్ధమను గూర్చియే శాస్త్రము గల్గును. కళ క్రమముగ శాస్త్ర మగు ననువిద్వదుక్తి కదియ తాత్పర్యము.

వైయాకరణుని పని రాజకార్యమువంటిది కాదు. రాజశాసనము స్వచిత్తవృత్తి కనుకూల మనియు భాషాశాసనము లోకానుకూల మనియు భేద

మును జూపుదురు. ఒక యధ్యక్షుఁడు పాలకుఁడుగ నుండె ననుకొనుఁడతఁడు కావించు శాసనములన్నియుఁ బ్రజానుకూలములె- అట్లె వ్యాకరణశాసనమును. వైయాకరణుఁ సంస్కార మెట్టి దనఁగ లోకమునెఱిఁగి ప్రదర్శించుటయే- శబ్దప్రపంచమును జక్కగ నెఱిఁగి ప్రేక్షకులసంశయము నివారింపఁ బ్రదర్శించును. శాస్తీతి శాస్త్ర మనువ్యుత్పత్తియు నట్టిదే. పూర్వు లందఱు నట్టే యనిరి. వ్యాకరణము శాస్త్రమే కదా ? ఇఁక నరయుఁడు.

శాస్త్రమునుగూర్చి పూర్వు లేమనిరి ?

శ్లో॥ శాసనా చ్ఛంసనా చ్చైవ శాస్త్రమి త్యభిధీయతే।
శాసనం ద్వివిధం ప్రోక్తం శాస్త్రలక్షణవేదిభిః ।
తత్రైకం విధిరూపేణ తదన్య త్ప్రతిషేధతః ।
శంసనం భూతవస్త్వేకవిషయం నక్రియాపరమ్ ॥

అని పరాశరపురాణమునఁ గలదు. "సందేహవారకం శాస్త్రం" ఇత్యాద్యన్యోక్తులును గలవు. ఇకను బెక్కు లున్నవి. కాని ప్రసారవత్ప్రసరణ మక్కఱలేదు. "Science may be further described as meaning facts reduced to a system"—Charless Watts. ఇట్లని యాంగ్లు లనిరి. వీరు వారననేల యందఱును శాస్త్రమును సమానభావమున నిర్వచించిరి. తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవిని‍ర్ణయే" శాస్త్ర మాత్రము నాశ్రయించి యుక్తిహీన మగువానిఁ జేయకు మని బృహస్పతి యనెను. ఎవ రేమన్నను శాస్త్రము సందేహనివారక మనుటలో సందేహము లేదు. యుక్తికి ననుభూతికి విరుద్ధముగ శాస్త్రము శాసింపదు అనుభూతపరామర్శమే శాస్త్రము. శాసనమును శంసనమును జేయు నది శాస్త్రము. శంసనమాత్ర మొనరించునది శాస్త్ర మనంబడదు. వర్ణనము, సూచి, కోశము, మున్నగునామములఁ బిల్వఁదగును. భాషావిషయమున నెట్టిసంశయమును నివారించనో విచారింతము.

"వచ్చును, వస్తాఁడు, వస్తడు, వచ్చువాఁడు, వచ్చేవాఁడు, వచ్చెడువాఁడు, వచ్చేటివాఁడు, వచ్చెడివాఁడు ఈశబ్దము లన్నియుఁ దెలుఁగువారివి. ఈవిషయమున నాంధ్రప్రపంచమునఁ బైపదములే శాస్త్రకర్తకు లభించిన వనుకొనుండు. ఇఁక నేమిచేయును. ఒక్కొక్కపదము నొక్కొక్కదేశమున నొక్కొక్కజాతివారు వాడుదురు. ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః" అని శాంతిపాఠమును

చెప్పునా? అగుచోఁ బ్రయోజన మెట్టిది? కోశమువలననే యాపని కాఁగలదు కదా? రూపాంతరము లన్నఁ జాలునుగదా? ఈకంబరామాయణ మంతయేల? సందేహము గల్గును. అందఱు నాంధ్రులయి పల్కు లిట్లైనవేల? పూర్వమునుండియు నిట్లే మాటాడుచు వచ్చిరా? పూర్వము శాసనాదుల నిట్లే యున్నవని పెద్దలు చెప్పుచున్నారు కదా; కావ్యములలో మాత్రము కన్పట్టలేదే; కావ్యభాష యని యొకఁడుండెనా? ప్రజాభాషాలక్షణదూరమగుకావ్యము ప్రజాహితము నెట్లుపదేశించును? కాంతాసమ్మితోపదేశము కావించుకావ్యము విలక్షణభాషలో నుండుటయే లాభము? ఇప్పుడు కవులు కలరుగదా వారును మాటలాడునప్పుడు మావారేయై వ్రాయునప్పు డేనారో యగుచున్నారే; ఇత్యాదిసంశయపరశ్శత ముత్పన్నముగాఁగ నివారించుకొనవలదా? తన్నివారణమే శాస్త్రము. కాకున్న శస్త్ర మగును. శాస్త్రకర్త మూఁడువిధము లయినమార్గముల వ్యవస్థ నేర్పఱుచును. బహిరాకారము, నంతర్గుప్తాకారము, తదుభయమూలమును జూచును దీనికి నాంగ్లులు కొందఱు వ్యతిరేకు లయ్యును మనసంప్రదాయ మట్టిదని యెఱుంగుఁడు. ఆంగ్లులును గొందఱు సమ్మతించిరి. పోసిటివ్, మెటాఫిసికల్, ధియొలాజికల్, అను పేరిట బిల్తురు. శంసనమనునదియే బహిరాకారము శాసనము రెండువిధములు కావున గుప్తత తదుభయమూలములందున్నవి. శంసనము మొదటఁబడజాలమును బ్రదర్శించి తెలిపితిమి. ఇఁక శాసనమునకు వత్తము. వస్తాఁడు, వస్తుఁడులలోఁ దప్పఁ జాలపదములలో "వచ్చు" ప్రకృతియైనట్లు తోఁచును. ఇతరపదములఁ జూతము. ఇస్తాఁడ్వాకులఁ జూడ నట్లే తేలుచున్నది 'వచ్చు, అనునదియే ప్రకృతియగును ప్రత్యయ మెయ్యది? తాఁడు తుఁడు, ఏవాఁడ్వాకులు ప్రత్యయములుగ లోకము (సామాన్య) వలనఁ దెలియుచున్నది. విశేషలోకము (కావ్యాకులు) వలన "ఉన్వా" దులు ప్రత్యయములుగఁ దెలియుచున్నవి. దాటుతాఁడు, దాటేవాఁడు దాటుతుఁడు, దాటును ఇత్యాదిపదములఁ జూడ "తుఁడు" తుడువఁబడుచున్నది చాలభాగము న నీ"తుఁడు" ప్రత్యయము కానరాదు. కాని యీ"తాఁడు" ప్రత్యయ మన్నింటఁ జాలభాగమున నున్నది. "తుఁడు" చాలభాగమునఁ నేలలేదు. పారకాధమవజ్జనసముచ్చరితమై యుండనోపును. చూడఁజూడ నాతలఁచినది సిద్ధాంత మగుచున్నది. కావున "తుఁడు" ప్రత్యయము కాక వ్యత్యయ మగును. "తాఁడు" ను వ్యతస్తమై యుండరా

డా? ఉండుతాఁడు, వినుతాఁడు, కనుతాఁడు" "ఇత్యాదిశబ్దముల నీ "తాఁడు" పోయినది 'వండుతాఁడు' కుదురుచున్నది. కొన్నింటఁ బ్రవర్తింప దనవచ్చునుగడా? అయినను "ఉను" ప్రత్యయము సరయుదము. అన్నింటఁ గుదురుచున్నది. కావ్యభాషను మాత్రము విస్పష్టముగఁ గుదురుచున్నది. లోకములో నెట్టివాఁడును "ఉను' ప్రత్యయమును జేర్చి పలుకలేడు కవులకు వ్రాయునప్పుడు భ్రాంతి కల్గెనా? లోకమున నెవ్వనినోటను లేని యీ "ఉను" కవుల కెట్లు కల్గెను; ఎక్కడ నైన నుండవలయును "ఔను" అని లోకు లంగీకృతిఁ దెల్పుదురు ఇది యొకయభిప్రాయముకదా? "క్రియాపర్యవసాయి సర్వాభిప్రాయము"ను "ఔను" అనునది క్రియాపదము. "అవును" అనిరూపము. 'అవు' ప్రకృతి 'ఉను' ప్రత్యయ మేర్పడినది. ఈ "ఉను" కవులకు శరణ్యమైనది పద్యము గారవనేయ మనునభిప్రాయము లోకహృదయవిజృంభితము.

గౌరవస్థానమున ''ఉను'' గలదు. పూర్వులు సభలలోఁగూడఁ గావ్యభాష నుపయోగించిరా; ఈషద్వైషమ్యమునఁ గావ్యభాష నే యుపయోగించి యుండిరని చెప్పవచ్చును. సదస్యాచారము, సభాతాంబూలము, మున్నగు నాచారము లరసినను, సభ్యాభివర్ణనము, భాగవతనిర్మాణమునను, "బహుభాషితే నాపి కించి దపి నాఽపశబ్దితమ్" అనుటవలనను విభీషణుఁ డగ్రామ్యపదముల భాషించె ననుట వలనను సభ్యభాషను మాటలాడిరని యే చెప్పవలనుపడును, భారతీయులకు సరస్వతియట్టిది. కావున ''ఉను'' సర్వత్ర సమముగఁ బ్రయుక్తమగుటను బ్రథమక్రియాపదము "ఉను" గలదగుటను గావ్యముల నెల్లఁ గానవచ్చుటను శిష్టప్రయోగమై యుండుటను శిష్టప్రయోగము "ఉను" అగును. "తాఁడు" సంభాషణమున మాత్ర ముండుటను శిష్టత్వ హేత్వభావమున వాడుటను సంభాషణవశమున భ్రష్టమైన దష్టప్రయోగ మగును. మఱియు నీ "తాఁడు" ఉను, రూపాంతరము కాదు ఏరెండుశబ్దముల యపప్రయోగమో యై యుండును. వచ్చునతఁడు "వస్తాఁడు" అని ప్రక్రియామూఢతఁ బలుకఁబడినది యగును. క్రియార్థమున నట్టిపదములు గలవు వచ్చునది- వచ్చేది, ఇత్యాదులు, ఈభ్రష్టత్వమునకుఁ గారణములు గలవు. వచ్చు అతఁడు వచ్చుతఁడు "చు" దంత్యపూర్వముగ నున్నది. చససామీప్యమా భ్రమసాంప్రదాయ మగుటను "స్" వచ్చి "వస్తాఁడు" సిద్ధించెను ఉచ్చారణమున స్ఖాలిత్యము లుండును. కావుననే ''బహువ్యాహారతా తేన నకించి

దపశబ్దితం” అని కలదు. సుశిక్షితు లగుశిష్టులకే కలుగ నితరులమాట యెత్త నేల? ఇం దొకరహస్యము ను గలదు. ఉచ్చరించినది యపశబ్దమైనను హృదయమున స్ఫురించునది (స్ఫురించవచో) సుశబ్దమును నగును. అపశబ్ద మన్నను వ్రాయునప్పుడు సుశబ్దము వ్రాయును- దీనిని స్థిరీకరింప నాతరముగాదు, కాని సభ్యులు ప్రమాణము. కాకున్న గ్రామాఫోనుప్లేటులయంత్రమును నప్పటివ్రాఁతయుఁ బ్రమాణము వ్రాఁతలో నట్టిభేదము గలదా? అందు లేనివినుఁడు.

భీమయ్యగారిఁ జూచి “ఏమండీ భీమయ్యగారూ” అని యందుము. వ్రాయునప్పుడు “రాజశ్రీ భీమయ్యగారు” అని వ్రాయుదుము. ‘చేశి (చా) యంగల విన్నపములు, అనుదానిలోని “కల” అనుప్రత్యయము, శ్రీవేదమూర్తులైన; లో “అయిన” రూపమును ‘మాలో యెవరైనా యివ్వఁగలవారము, లోని “కలవారము” రూపమును, కేవలాంధ్ర మంత్రములలో నున్న కొన్నిరూపములను “గ్రహా లన్ని విడచును” అనురూపమును నాహ్వానసందర్భమునఁ బిలుచునప్పటి భాషారూపమును “అతనిమాట” అనురూపమును నరయనరయ గౌరవవిషయము లని భావించిన వాని గౌరవభాషలోఁ బల్కుట వ్రాయుటయుఁ గల్గినట్లు తెలియుచున్నది. అనుబంధమైన “కల” యెన్నఁడును వాడనివారు వ్రాఁతలోఁ గవితరులును వాడుటలేదా? ఇన్నివిషయముల వివేకింపఁ గావ్యభాషాసమానభాషయే శిష్టవ్యవహారమున నున్నట్లు తోఁచును.

కావ్యభాష యనుభాషయు జనులభాషయుఁ దొల్లియొక్కరీతిగనే యుండెను. నన్నయకాలమునను తిక్కన్నకాలమునను నెఱ్ఱాప్రగ్గడకాలమునను మఱి యితరకవులకాలమునను గూడ నుండెను. క్రమక్రమముగ నాయాచారము నశించినది. అయినను నేఁటికిని దల్లక్షణములు గలవు. సంస్కృతభాష కున్నంతగౌరవ మాంధ్రభాషకు లేకపోవుటచేతను మఱికొన్ని కారణములచేతను దెనుఁగు గౌరవింపఁబడకపోవుచు వచ్చెను అక్కారణముననే చేతనై నంతదాఁక సలక్షణముగ వ్రాయుట శేషమును యథోచ్చరితముగ వ్రాయుటయు సంభవించెను. శిక్షయుఁ బొందలేదు. భ్రంశములు సంభవించెను. ఇది ప్రజకు సామాన్యము. కవులును దదితరులును నిట్లే చేసిరి. “కవిప్రయోగము తప్పని మఱి వాదించకూడదు” అనువాదివాక్యము నమ్మనేరము. కవి సత్కవి కావలదా? కవిసత్త్వము నిర్వచింపవలయును. అదుష్టపరిష్కృతవాగర్థ

ములు గలకార్యకర్తయే కవికదా, కవికి లోకమెట్లు ప్రమాణమో కవీతరులకు నట్లేప్రమాణము. కవికిఁ బ్రమాదము రాదని యేమినిర్ణయము. "నానృషిః కురుతే కావ్యం" అని యందులేని యార్షప్రయోగము మనకది పనికిరాదని గౌరవముగ దుష్టశబ్దముందుము. ఆప్రమాదమే సంప్రదాయమగుచో నదియ నుకులమానికము. పదసిద్ధికి సంప్రదాయమే పరమశరణ్య మని నాయభిప్రాయము. కవిత్రయము వారిని విడువవలయును. ఆర్యు లగుటను శిష్టపరంపరాపూజితు లగుటను వారును వారిశాసనములును (వాగ్విషయమునమాత్రము) గౌరవపాత్రములు అందును బూర్వపూర్వులు ప్రమాణము * గీర్వాణభాషకు నట్లేయుక్తికినట్లేకుమరును ఆచారములలోఁ గూడ నట్లే. ఆభారతమున లభింపకున్నఁ దదితరులే శరణ్యులు "తద్విదాం చ స్మృతిశీలే" అని ధర్మప్రమాణ మున్నట్లు. కావున శిక్షాభావమున నిట్లయ్యెను.

శిక్షించుట యాచారము కదా? వేదకాలమునుండి స్పష్టముగ నుచ్చరింపవలయు ననెడిశాసనము గలదు. "అథ శిక్షాం వ్యాఖ్యాస్యామః" అనునవి. నేఁడును గొంచెముగనో గొప్పగనో యాయాచారము కలదు. "అమ్మా బువ్వ పెత్తే. అదేంతే, బజ్జుంతానే, బొబ్బుయియ్యే" ఇత్యాదులు పిల్లలతోఁ దల్లులును దండ్రులును నాడుదురు ఆక్షణమున నది వారికి వ్యవహారికభాష యగును. కొంతకాలము చన్నతరువాత నామాటలాపిల్లలతోఁ దల్లిదండ్రు లాడరు. కాని పిల్ల లాడుచోఁ దల్లిదండ్రులు విని యర్థబోధ మైనదికదా యని యూరకుండక దిద్ది చెప్పుదురు. గాడిదకు వచ్చిన ట్లేండ్లు వచ్చినవి యింకను ముద్దుముద్దులమాట లాడుచున్నావా? చాలు అని శిక్షింతురు. సవరించుకొందురు. అట్టిశిక్ష మనకు లేదు. విద్యాశాలలలోఁ గాని గృహములలోఁ గాని వీథులలోఁ గాని మనకాశిక్ష లభింపదు. ఎక్కడఁ జూచిన గత్తరతత్తర మాటలే. సభలలో నైన నెక్కడనైనఁ దమయిష్టము వచ్చినట్లు తెనుఁగును వాడవచ్చును. వీరికిని లక్ష్యము లేదు. ప్రమాదముగ నైన నుచ్చరింపవచ్చును. అస్ఫుటముగఁ గూడ నుచ్చరింపవచ్చును. ఇంకేమిచేయవచ్చునో యెరికెఱుక. ఆంగ్లమున నట్లొప్పుదురా? కొందఱాంధ్రమున నుపన్యసించినట్లు మామూఁడవఫారముబాలుఁ డాంగ్లమున నుపన్యసింపఁగలఁడు. అనుమతింతురా? వలనిది- అట్లయ్యు నొకమర్యాదమాత్రము గలదు. అది శుభాస్పదమే

* యథోత్తరం మునినామ్. అని యున్నది. వ్యాకరణకర్తల కన్నియము.

విషయగర్భితముగా నుండవలయును. అను నావాద మున్నది. ఇది యైన నుండుఁగాక.

మాటాడునట్లే వ్రాయవలయు ననుటమంచిదియే కావచ్చును గాని వ్యవస్థ సంప్రదాయము ప్రకారముగ నేర్పఱిచి సలక్షణమైన యాంధ్రభాషలో సులభశైల్యను గ్రంథములు రచించుచుఁ దత్ప్రకారము శుద్ధముగ నన్నివిషయముల మాటలాడునట్లు చేసినచో నైక్యము కల్గును గాని యెట్లు మాటాడిన నట్లు వ్రాయుటయే చాలునని సంస్కారసూత్రముతోఁ దృప్తిపడరాదు. ఆతృప్తిలో ననవస్థాదోషములు గలవు. వినుఁడు. 'పూడ్చెను (వెళ్ళెను) వచ్చెనిమిది, వచ్చేఁవు' ఇత్యాది పదముల యవయవము లుచ్చరించినవారికిఁ గూడఁ దెలియఁబడవు పూయిడ్చెనో, పోయిడ్చెనో, పోడ్చెనో, వచ్చెనిమిదో, వయిచెన్మిదో, వచ్చేడో, వచ్చాడో, వాచ్చేడో వక్తకే తెలియదు. ఇఁక నేమివ్యవస్థ, తమనోట వచ్చునది పలుకో గులకో యెఱుకపడవలదా? ఒకవ్యవస్థ చేయఁదలఁచుచో యథాపూర్వముగ "వచ్చును" అనురూపమే సిద్ధమగును. అని శాస్త్రకర్త యొకసిద్ధాంతమునకు వచ్చి పతంజలి యన్నట్లు ('శవతి, గతికర్మమునను వాడుదురు కాని యార్యాదృతము గాదన్నట్లు') "వస్తాఁడు" భాషణవశమున నుచ్చరింపఁబడుచున్నది కాని శిష్టత్వమునకు నింద్యముగనే యగునని యనును హాస్తాడ్వాదులు రూఢములు కాఁగ నవయవవిభాగ మేర్పడి రూపాంతరములు గావచ్చును.

పలుకులపాటే యింతటిది యీ యన నక్కఱలేదు. వ్రాఁతపాటును నట్లే యున్నది. అయినను దీని నేల విమర్శింపరు? పెరుమాళ్ళరహస్య మొండు గలదు. వ్రాఁతయు నన్నివిషయముల నొక్కవఱువున నున్నదా? తనకని యప్పటికి మాత్రము వ్రాయురీతి వేఱు. సమానులకు వ్రాయురీతి వేఱు శాశ్వతముగ నుండఁదగు నని వ్రాయునది వేఱు. ఒక్కొక్కచేతి కొక్కొక్కవ్రాఁత. అచ్చుకూటమున మార్పు పుట్టింతురా? ఇది కానేరదు. ఆంగ్లేయులు మనకంటెఁ జిత్రముగ వ్రాయుదురు. వారికి వ్రాఁత కొకమాల పోఁతకొకమాల కలదు. స్థిరలిపి గ్రాంథిక మనుట ఇది సులువుగనే యున్నది, మోళీమరాటీలవంటిది. ఆంగ్లమునఁ గలదు కావున విమర్శింపనైన నెంచరు. మానసికస్థితి యట్లాకచో నేర్పడును. కావుననే మనయుద్యమము లన్నియుఁ జగటివేసములఁ బోలి యాంధ్రవేషమున నున్నయాంగ్లోద్యమములే ఆంగ్లత్వ మధ్యాత్మము కాఁగా

డదు. ఆంధ్రత్వము కాపాడవలయును. కాకున్నఁ గీడుమూడును. భాషామూలముననే ధర్మార్థకామమోక్షచతుర్విధపురుషార్థములు సిద్ధించును. పాశ్చాత్యహృదయపరివర్తనమునకుఁ బ్రాచ్యహృదయ మనుకూలింపదు 'స్త్రీషు దుష్టాసువార్ష్ణేయ జాయతే వర్ణసంకరః' అన్నట్లు భాష దుష్టయగుడు వర్ణసాంకర్యమును హృదయప్రకాశమును సంభవించును. భాషను గౌరవింపకున్న దేశమున్మత్త మగును.

ప్రసిద్ధవస్తుప్రశంసనమే శాస్త్రము. సజాతీయాభ్యుదయహేతున్యాసమే సంస్కారము. సులభసాధనము కావలయు నని శాస్త్రములఁ దృణీకరింపరాదు. ప్రాతస్స్నానము నిత్య మవశ్యమగుట వధువులకేశఖండనము కార్య మనరాదు. నిరంతరకార్యరూపమునకు దీర్ఘాలోచనమున సాధన మరయవలయును. తలపుండ్లతో నిండినచో బోడిచేయింపవచ్చును. తరువాత పెరుగును. సంస్కరింపవచ్చును. అట్లే భాషాదేవియు నగును. భాషాదేవియొక్క శిరస్సు శబ్దము. ముఖ మర్థము. చూపు ధ్వని. వినఁజేయుఁ బల్కుట యే యలంకారము. ప్రేమవిహారమే కావ్యాదిసమూహము. ఆనడకలసొంపే యుద్యమము. ఆహంసవాహనము మనోనైర్మల్యము. సరస్వతీభర్త యగుచతురాననుఁ డనఁగఁ జాతుర్వర్ణ్యమే యగును. వారిరువురుదంపతు లగుట ప్రజకొఱకే. వారదుఁడు జ్ఞానరూపము. కింకరులు దేవతలందుఱు ఆంధ్రసరస్వతికిఁ దలనొప్పి యగుచున్నది పైపైసేవలవలన నివృత్తము కాలేదు. శిరస్సులోఁ మెదడున-(Brain) నేదో దోషము గలదు. దానిఁ దీసివైచినఁ జక్కఁబడును. పరధర్మాభిఘాతమే కారణము. పరధర్మములవలన నైనవానిని వైయాకరణుఁడు దొలఁగింప నెప్పటియట్ల యుండును. అట్లు కావింపుఁడు

భాషాదేవి బాల్యమునఁ గట్టిన మొలత్రాడే ప్రౌఢయైనప్పుడు నుండఁదగునా? అని యిఁక నంతయు రూపకాలంకారములో దిగును. ముదుసరియైనప్పు డేమిచేయవలయును? తరువాత నేమిచేయవలయును? ఆయుక్తి సరియైనది కాదు. కటిసూత్రము ధర్మసూత్రము మంగళసూత్రము వ్యాకరణసూత్రము దేవత కావున వృద్ధిగాదు. శాశ్వత త్రిదశ. మంగళసూత్రమును ద్రెంపరాదు తన్వికాని స్థూలాంగి కాదు.

ఇఁకఁ బూర్వమునఁ గావ్యమందుఁ దప్పఁ దదితరములనెల్లఁ గావ్యేతరవాణి యుంటకుఁ గారణ మేమిగుదురా? వినుఁడు. దేశభాషలరూప మట్లుం

డును. మఱియుఁ గావ్యభాషయే యించుమించు వాడఁబడుచు వచ్చెఁ గాని యట నట స్ఖాలిత్యములు సంభవించెను. నన్నయనాఁటి భాష యెట్లున్నదో తెలియదు. అయినప్పటికిని నాఁటి భారతమునుండి గ్రహింతమన్న సంస్కర్తృదూషిత మైనదందురా? శాసనములను జూతము నన్నయ్యకుఁ గొంచెము తరువాతనో పూర్వమునో లిఖితమైన బెజవాడశాసనమునఁ బద్యము లున్నవి. వానియందలి కొన్నిరూపములను దీసి విమర్శింతము. 'బృందంబు గొనియుండువారు, గుడియు మఠంబునున్' అనుపదములు గలవు. 'ఉండేవారు, గుడీ, మఠమూ, గుడిన్నీ మఠమున్ను' ఇత్యాదిరూపములు లేవు. కావునఁ గావ్యభాష సలక్షణముగ నుండె ననియే తేలును. వచనములు మున్నగునవి కావ్యసదృశభాషలో లేవు.

సమర్థు లయినలేఖకులు లేకపోవుట యొకగొప్ప కారణము. పదావయవము తెలియక వ్రాయుదురు. కర్త యే వ్రాసెనని చెప్పలేము. వ్రాసినవాఁడు కర్త యనుకొన్నను తనకొఱకు సంగ్రహముగ వ్రాసికొనె నందుము. వ్రాసిన దెట్లున్నను బలుకుట స్వచ్ఛముగఁ గొందఱ యెడలఁ గలదు. ఉచ్చారణమునకుఁ గాని యఱపున్నను నేరూపమునను వ్రాసి (న్, ణ్, ం, ౧, గ్) విడిచి పలుకుటయుఁ గలదు ఏత్వము వ్రాసి యేత్వముగఁ బలుకుటయుఁ గలదు. "ఇంత్తకు, దక్షిణము" ఇత్యాదులను వ్రాసి స్పష్టముగఁ బలుకుటయుఁ 'జ' వ్రాసి దంత్యతాలవ్యము లభేదమునఁ బలుకుటయు "రవ్నా" వ్రాసి "రవానా" అని పలుకుటయు 'గన్క వ్రాసి' 'గనుక' అనిపలుకుటయుఁ గలదు, క. "వ్రాయు తెలుఁగునఁ బలుకమి హాయిగఁ బలుకామనల్లె యంతట నాంధ్రముల్ వ్రాయమియుఁ గలదని వెలుఁగుడి యఖిలజనులు తెలిపెద నింక వినంగనూ" అని వ్రాసి "వినంగన్" అని చదువుదురు. ఇట్టి సంప్రదాయమే గీర్వాణమున గూడనుండి పిమ్మట శాస్త్రమయ్యె నేమో? పాదాంత్యము లఘువైనను గురువు వికల్పముగ నగుననుట యట్టిదే.

కావునఁ దమకొఱకు సంగ్రహము వ్రాసికొని కావ్యభాషాప్రకారముగ మాటలాడి రని చెప్పవచ్చును గదా? సంభాషణము వ్రాతయు నొక్కతెఱఁగుననే యన్నింట నుండుననుట యసంభవోక్తియా ఉన్నను సంప్రదాయమును బట్టియుఁ బ్రమాదమును బట్టియు నుండవచ్చును ఉదాహరణములఁ జూపి వివరింతును. "అఖండమున్ను" "వనమూను" అను నీరెండుపదములు క్రమ

ముగ 1108—1157 శకవత్సరములలో వాడఁబడినవి. "మున్ను మూను" లురూపాంతరములుగ నున్నవి. పైకాలమునరచితములగు కావ్యములభాషలో నట్లులేదు. ప్రమాదములే. శిష్టరూపము నెఱుంగకయుఁ దాన శిష్టుఁడగుటను 'మున్నుమూను'ల వ్రాసెను గ్రాహ్యమెట్లు; ఇట్టే మితిమీఱిన శబ్దములు (శ్రీ)రామమూర్తిపంతులుగారు చూపియున్నారు. "ఈభాష సంభాషణయందే కాని వ్రాతలయందు పూర్వులు వాడలేదని వాదించిన వారిమాటలసత్యమనుటకు ఈ ఒక్కప్రమాణమే చాలు" అనివ్రాసిరి పూర్వులును నేటివారును గూడ సాధ్యమైనంతవఱకె శిష్టభాషలో వ్రాసిరి వ్రాయుచున్నారు. పూర్వులు గాని నేఁటివారు గాని యందఱును శిష్టులగుదురా? శిష్టేతరులకు నక్షరజ్ఞానముగలుగవచ్చును. తమతమవ్యవహారములు లిఖితరూపమునఁ గావలయు నన్న నేమిగతి? ఎట్లో వ్రాసికొందురు. అదియును జేయరని యెవ్వరందురు? అట్టివాఙ్మయము యన్యము నో? సంభాషణమున నెప్పుడును వాడనివానిని (ప్రత్యయాదివిషయమున) వ్రాఁతలో వాడుటంబట్టి వ్రాతకుఁ గల గౌరవము తెలియఁబడును.

మహాపండితులైనపూర్వులు వ్యాఖ్యాతలు, శాస్త్రకారులు మున్నగువారేలయట్లు కావ్యేతరభాష నుపయోగించిరి? కావ్యములలోఁ గూడఁ గొన్నింటఁ బద్యములను గావ్యభాషను గద్యములఁ దదితరభాషను నేల వాడిరి? అను ప్రశ్నముల కుత్తరమును వినుఁడు

కొందఱాంధ్రంబున మూఢులు (ప్రక్రియావిషయమున) పురాణములకుఁ బ్రతిపదార్థముతోఁ జెప్పగలరు. కాని యాంధ్రభాషలోఁ జక్కఁగ వ్రాయలేరు. పూర్వమున నిప్పుడును గలరు. కొందఱకుఁ బద్యమే భాషాగౌరవము గద్యము కాదను మతి గలదు కొందఱ కాంధ్రభాష యొకపూజ్యభాష కా దనునభిప్రాయము కలదు. కొందఱకు "దేశభాషాద్యుపాయైశ్చ బోధయేత్" అను మర్యాద గలదు. దేశభాషలో నే శిష్యానురూపముగ నుపాయ మరయుదురు. మనము పిల్లలతో మాట్లాడునప్పుడు "ఏంచేస్తున్నావురా" అని యనక "ఏంటిచేత్తున్నారే" అని యందుముకదా; అట్లే "భ్రష్టభ్రష్టరూపములనైన బోధింపవలయును" అట్లు వ్రాయవలసివచ్చెఁ గాని భాషారూప మదికాదు. సంస్కృతమున నిట్టి సంప్రదాయము గలదు. ప్రత్యయవిషయమునఁ గాక వాక్యవిషయమునఁ గలదు. 'భవేతి' ఉక్త్వా, యథోక్త్వా, పీఠం, అంబరం,

యస్య, సః తేనరక్షితః—ఇత్యాదు లట్టివే. అ, ఇ, ఉణ్, ఇత్యాదిసూత్రములు నిట్లే, ఉపదేశబల మట్టిదె. వారియభిప్రాయమును గాదు. దేశభాషల నెక్కువ గౌరవింపమియు నొకకారణము. రైల్వేయింగ్లీషు టెలిగ్రాఫువారి యింగ్లీషు, ఫార్ములావారియింగ్లీషు, నిత్యాదుల గ్రాహ్యము లెట్లో శాసనాది భాషయు నగ్రాహ్యము. ఈకారణములు చాలును.

పాటలు, యక్షగానములు, నేలలుమున్నగువానిలోని భాష యప్రధానము. లాక్షణికు లెవ్వరును లక్ష్యములుగాఁ దీసికొనలేదు. అట్టివాఙ్మయము నుండుచు నన్నిభాషలలో నుండు నని వానమ్మకము “రామన్న చందునాలోం వోయి” పాటలు, “తందానతానతాన పాటలు’ గలవు. వ్రాయువలదన్నవా రెవరు? మానువా రెవరు? గౌరవింపరు. ఆదర్శము గాదు. అవియుఁ గొన్నిశిష్టభాషలలోనున్నవి అన్నియు నుండుట శ్రేయమే. అందఱును విద్వాంసు లగుట మహారాజులగుట శ్రేయమే. ప్రయత్నింపుఁడు. ఎట్లో సుఖమే పొందుదురు.

శతకములు కావ్యములలోఁ గూడ నటనట స్ఖాలిత్యములు గలవు. అవి ప్రమాదములు, రూఢములు కొన్నియై యున్నవి. ఔచిత్యముకొఱకు నై యున్నవి.

శ్రీనాథాదులును బ్రమాదంపడిరా? అని యందురు? శ్రీనాథులే కాని భూనాథులే కాని లక్షణకర్తయే కాని యెట్టివాఁడును బ్రమాదపడవచ్చును. ప్రమాదములు వాస్తవమునఁ గాకున్నను బ్రమాద మన్నంతదాఁక నగ్రాహ్యమే “అవర దౌర్బల్యాత్” అనున్యాయమును దీసికొనుఁడు. మఱియు దేశీయులలోఁ జాలమంది సుశిక్షితు లగుచో నిట్టిప్రమాదములు సంభవింపవు. “తనకలిమి యింద్రభోగ” మని సామెత గలదు కాని యది యసందర్భము. దేశైశ్వర్యము తనయైశ్వర్యము. దేశభాషాపండితబాహుళ్యము తన పాండిత్యము, నేను బండితుఁడనై యుండఁదలఁచిన సజాతీయులఁ బండితులఁ జేయవలయును. అప్పుడే నిజమైన పాండిత్యము ప్రాప్తమగును.

బడులలో సంగడులలో లేఖలలో స్వగృహములలో సంతత సాంప్రదాయిక దేశభాషాప్రచురణమే యగుఁగాక.

గ్రామ్యము హాస్యోక్తులుగాను నిందోక్తులుగా నున్నప్పుడు ప్రయోగింపవచ్చు ననుట కలదు. అట్లైనఁ జేయఁదగునా? అని సంశయింతము. ఆశాసన మరయుదము.

అప్పకవ్యాదులు వాక్రుచ్చిరి. రామమూర్తిపంతులుగారు తమవ్యాసమున నొకపద్యమును జూపిరి దాని నరసి సిద్ధాంతమునకు వత్తము.

క. పదముల శృంగారవధూమృదుమధురచనోజ్జ్వ వాక్యమిశ్రములైనన్
విదితార్థగ్రామ్యోక్తులు, పదిలముగాఁ బొంకమెఱిఁగి పలుకం జెల్లున్.

తా. అన్న.

పైపద్యభావ మౌచిత్యసందర్భమున నున్నది. ఈయభిప్రాయము సమంజసమే. గ్రామ్యోక్తు లనునప్పుడు స ధివిభాగము "గ్రామ్యాఉక్తులు" అనియగును దీనితరువాతఁ గూడఁ జూపినపద్య మౌచిత్యమునకు వ్రాయఁబడినది ఔచిత్య మెఱిఁగి తగినపలుకుఁ బ్రయోగించుటయే రమణీయము. రామమూర్తిపంతులుగారు వైచినప్రశ్నము లన్నియు నప్రస్తుతములైనవి. ఒక టున్నది. అదిగ్రాంధికము. గ్రాంధిక మనియందురు. దాని నిర్వచనమేమి, అని ప్రశ్నించిరి గ్రంథార్హభాష యని యర్థము. సద్గ్రంథములను వ్రాయుటకుఁ దగినభాష యని యర్థము. అయినను గ్రాంధికభాష యనుటయు వ్యావహారికభాష యనుటయుఁ జెల్లదు. తెలుఁగుభాష యనవలయును. దేశభాష యనియర్థము. త్రిలింగ (ఆంధ్ర) దేశభాషయనుటయే తగును. మాటాడుటకును వ్రాయుటకును నాభాషయ యుండవలయును. తెనుఁగొనరింతుఁ దెనుగున వ్రాయుదు నిత్యాదివాక్యములే వాఙ్మయమునఁ గలవు కాని గ్రాంధికంబున వ్రాయుదు వ్యావహారికంబున నందు నని లేవు.

'శ్రీరామమూర్తిపంతులుగారున్నూ ఎట్లా పలికేమో అట్లా వ్రాస్తున్నారేమో అంటులేదే' కొంతపలుకులపోలిక యింకొందు కబ్బముల కబ్బయునగును గాని ప్రత్యయమాత్రవికారము గలదు. అదియొక్కఁడే సంస్కారము 'వాఁడును వామనుఁడును వచ్చిరి' అన్నప్పుడు బోధపడక 'వాడున్నూ వామనుఁడున్నూ వచ్చేరు' అనిన బోధపడునా? ఇదినమ్మరానిది. ప్రత్యయములయు సంధులయు నెంతయెఱుకయున్నను భాషితముల వ్యత్యస్తమే సంభవించును. 'పల్కక్పోతే' 'పలుకకపోయినా' అనువాక్యములలో 'పలుకక' అనునది యుచ్చరించునప్పుడు 'పల్కక్'యగును. ఇట్టియవయవశైథిల్యము వారికంటెనా కెక్కుడు తెలియదు. కాని ప్రత్యయమాత్రమునకు నింతటిశ్రమయేల?

శేషవిషయము లంగీకార్యములే. కంసాలి కమసాలి, తీసికొనన్, తీసికోన్, ఇత్యాదులు సాధువులేయనవచ్చును. సాధుత్వాసాధుత్వముల నిర్ణయమెట్లు?

సాధువు లేవి:—చిన్నయసూరిగారిచేతికిఁ జిక్కినవిమాత్రము సాధువులనను. ఎవరిచేతఁ జిక్కినవి సాధువు లనరాదు. తెలుఁగుమాత్రమే ప్రమాణము. సంస్కృతమునకు వీరినిఁ బ్రమాణమనరాదు. “నీతదర్థము, ప్రయోగింపఁ దగదు. ఆంధ్రశబ్దవిషయమునఁ గవిత్రయమువారు నిరంకుశులు. అనఁగా “భారతము మాత్రమే, ఇతరకవులు లాక్షణికసంఖ్యను బట్టి పూజ్యులు ‘వీరభద్రవిజయము ప్రమాణమా? నేను “కృష్ణకవీయము” అని వ్రాసితిని. అది లాక్షణికమా? కాదు లాక్షణికు లన నెట్టివారు? వరికవిత్వము రసవంతమును వాగ్రచనసొంపుగను పదజాలమంతయుఁ బ్రసిద్ధముగను సంకేతితముగను భారతపథ్యముగను నుండునో వారే లాక్షణికులు, అట్టిలాక్షణికులలోఁ జాల మంది సమ్మతించిన ట్లుండియు వ్యవహారసమ్మక మగుచో సాధువే, వ్యవహారమున మాత్ర ముండి తదర్థమున లాక్షణికులు వాడ కూరకున్నచోఁ భారిభాషిక మగుచో లాక్షణికమే అది సంప్రదాయసిద్ధమై యుండవలయును. ‘అంచయాన, వంటిదిగ నుండవలయును. డాక్టర్గారు తెలుఁగుగాదు. డాకుదొరగారే తెలుఁగు, వ్యవహారమున నుండి తొలఁగించిన నగతికులమే యగుచో సాధువే ‘పోస్టుకార్డు’ వంటిది. ఇట్టి వ్యవస్థ యేర్పడవలయును.

సమాప్తము.

---

# పాత్రౌచిత్యవిచారము.

— కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు —

---

గ్రంథవిమర్శనపద్ధతికారులు మనుచరిత్రమునందలి పాత్రౌచిత్యపోషణముం గూర్చి యేమి వ్రాసిరో కనుఁగొందము. ఈవిమర్శనపద్ధతికారు లొక్క నియమమును గావించుకొనినట్లు తోఁచుచున్నది. నేనగు ననినదానిని దాము కాదనుట నేను గాదనినదానిని దా మగుననుట ముఖ్యముగఁ గావింపవలె నని వీరు నిశ్చయించుకొనినట్లు తోఁచుచున్నది. ఇది విమర్శనపద్ధతి యెన్నటికిని గానేరదు. ఉన్న దున్నట్లు చెప్పవలెనే కాని కవియం దభిమానము పెట్టుకొని తత్కావ్యమునం గులేనివిశేష మున్నదని చెప్పుట యున్నవిశేషము లేదని చెప్పుటవలెఁ గువిమర్శనమై సుజ్ఞానము నరికట్టునదిగా నుండును "అట్టి సద్గుణముల నాయాతావుల వర్ణించి కవి యీపాత్రమును జక్కఁగఁ బోషించెను" అని శ్రీవేంకటశాస్త్రిగారు వ్రాయించిరి. కవి యొకపాత్రము నెత్తుకొని మంచిగుణముల వర్ణించినంతన అయ్యది సరియగు పాత్రపోషణము కానేరదు. కవి పాత్రము నెట్టివానినిగఁ జిత్రించెనో యట్టివానికిఁ దగువేషాదులను సంభాషణాదులను జర్యాదులను సరిగ వర్ణించెనా లేదా యని విమర్శకుఁడు చూచుకొనవలెను.

ప్రవరపాత్రౌచిత్యవిచారము :— పైదాని కుదాహరణముగాఁ బ్రవరపాత్రమును దీసికొందము, కవి యీ ప్రవరు నెట్టిలక్షణములు గలవానినిగఁ జిత్రించెనో మొదటఁ గనుఁగొందము. ఈతఁడు "వివిధాధ్వరసర్మల ధర్మకర్మదీక్షాపరతంత్రుఁడు" అని చెప్పుటచే వైదికధర్మతత్పరుఁ డనియు "వానిచక్కఁదనము వైరాగ్యమునఁ జేసి కాంక్ష సేయుజారకామినులకు భోగబాహ్యమయ్యె" నని వర్ణించుటచే విరాగి యనియు "వరుణాతరంగిణీ................ వచ్చు నింటికిఁ బ్రజ తన్ను మెచ్చి చూడ" అనుటచేఁ బెద్దకర్మఠుఁ డనియు వరూథినితోఁ బ్రసంగించుటలో నామె తన్నుఁ గామింపు మనఁగా "వ్రతులై దినములు గడిపెడి విప్రులఁ జనునే కామింప మది విచారము లేదే" అనుటచేఁ దీవ్రమైన వ్రతము గలవాఁ డనియు "నీవు చెప్పినయర్థమెల్ల నిజము కాముకుఁడైన వానికి నకాముఁ డిది గణించునె" అని పలికినదానింబట్టి కామరహితుఁ డనియు "తరుణీ రేపును మాపు హవ్యములచేతఁ దృప్తుఁడౌ

వహ్ని సత్త్వగుణాదృష్టి నొసఁగు సౌఖ్యము లెఱుఁగఁ శక్యమే నీకు నాకరణుల్ దర్భలు వహ్నులుం బ్రియములై నట్లన్నముల్ గా వొడల్ తిరమే చెప్పఁడు మిట్టితుచ్ఛసుఖముల్ మీసాలపై దేనియల్" అనిచెప్పినదానింబట్టి యీతఁడు లౌకిక భోగము లన్నిటిని దుచ్ఛములుగా నెంచి వాని నసహ్యించుకొను వాఁడనియుఁ దేలుచున్నది ఇట్టిలక్షణములు గలవాఁడుగా జిత్రింపఁబడిన ప్రవరాఖ్యుని వేషము, భాష, చర్య తదనుగుణముగా నుండవలెను గదా అట్లుండెనో లేదో విచారించి చూచుకొందము

ప్రవరుని వేషము:—మనుచరిత్రము బట్టిచూడఁ బ్రవరుఁడు రత్నఖచితము లైన బంగరుబిళ్ళల మొలత్రాడును సరిలేని రాకట్టుజాళువా మొలకట్టు ధరించి ఎఱ్ఱనిజలతారు సన్నకండువా వలెవాటుగా వేసికొని (పసిఁడిఁ బ్రాతచెఱఁగు మిసిమిదోపఁ జెలంగు నరుణాంశుకోత్తరీయంబుతోడ) కాశికాముద్ర యిడిన బంగరుటుంగరమును వ్రేలఁదాల్చి (కాశికాముద్ర యిడినయుంగరముతోడ) పెద్దజుట్టుముడి ధరించి (అనితంబవిలంబికాలాహికల్ప ఘనకచగ్రంధి) చేత బంగరుకడియమును దొడిగికొని (పసిఁడికోరముతోడి బాహువు) మణులు చెక్కినకుండలములఁ జెవుల నలంకరించుకొని (రమణీయమణికుండలములతోడ) సంచరించుచున్నట్లు కాన్పించుచున్నది అరుణులు దర్భలు ప్రియము కాని భోగము లేమియుఁ దనకుఁ బ్రియములు కావనియు నవన్నియు దుచ్ఛము లనియు మీసాలపైఁ దేనియ లనియు నేవగించుకొను విరాగి యీరీతిని దంభపువేషమును వేయునా? ఆవేషమును శృంగారరసప్రధానులగు కాముకులు ధరింతురే కాని మనుచరిత్రమునందు వర్ణింపఁబడిన ప్రవరునివంటి విరాగులు ధరింపరు కావున మనుచరిత్రమునందున్న ప్రవరవేషవర్ణనము నందు నౌచిత్య మింతమాత్రమును లేదు. కర్మఠుఁడు చేతఁ బాత్రమును ధరించి యుండును. అది వర్ణింపకపోవుటచే నుచితమైన వేషవర్ణనమును జేయకయును పిఱుదులవరకు వ్రేలాడు పెద్దజుట్టుముడి మొదలగునవి వర్ణించుటచే ననుచిత వేషవర్ణనము గావించియును బెద్దనార్యుఁడు పాత్రౌచిత్యమును బాడుచేసె ననకతప్పదు.

భాష:—మనుచరిత్రము శ్రవ్యకావ్య మగుటచే నిందుఁ గవిచేఁ బాత్రోచితభాష వాడబడినదా లేదా యనువిచారమున కంతగా నవకాశము లేదు విరాగి యగు ప్రవరుఁడు వరూధినిని జూచినవెంటనే యాడెను "భీత

హారిణేక్షణ" అని సంబోధించుట యుచితముగ లేదు. హరు గాని విమర్శన మంతలోతునకుఁ బోదగినది కాదు.

ప్రవరుని చర్య:—పెద్దనార్యుఁడు ప్రవరుని నొకప్పుడు ధీరునిగను నింక నొకప్పుడు పేలగను దనపని కనుకూలించు రీతిగఁ జిత్రించుచు వచ్చినాఁడు. తుదకేతఁడా యచ్చరను ద్రోసిపుచ్చుట యరసికత్వముచేత నని తేల్చినాడు. మొత్తముమీఁద నీప్రవరుఁడు శృంగారవిషయమునఁ ముగ్ధుఁడని "కౌనసాగి కామినీగోష్ఠి" అనుపద్యములో దేల్చినాఁడు. ఇట్టి యరసికుఁడిట్టి ముగ్ధుఁడు వరూధినీ శృంగారచేష్టల చాతుర్యమును గ్రహింపలేక యామెను ద్రోసిపుచ్చుట యొక వింతగాదు అట్టిస్థితిలో నాతఁడు వరూధిని మాయలలో బడకుండుట ధీరత్వమని మనకవి చెప్పుట సరసముగ లేదు. న్యాయముచే బ్రవరుఁడు గృహస్థుఁడును రసజ్ఞుఁడునై యున్నవాడు కాని శృంగారరస మెట్టిదియో యెఱుంగనివాఁడు కాఁడు. శృంగారరస మనునది వేశ్యలంగూడి వారి శృంగార సంభాషణముల కనుకూల శృంగార సంభాషణమును గావించుచు దిరుగు విటకాండ్రకే గోచరమగు ననుకొనుట వెఱ్ఱి. సత్యమైన రసికత్వము సత్యమైన యేకపత్నీవ్రతము చేయువారియందే యుండును. ప్రవరుఁడు రసికుఁడు కావుననే మృగమదసౌరభవిభవద్విగుణిత ఘనసారసాంద్ర వీటీగంధస్థగితేతర పరిమళమై మగువపొలుపు దెలుపుఁ నొక్కమారుతము వీవఁగా నాప్రాంతమున నొకస్త్రీ కలదని తెలిసికొనినాఁడు ఇట్టివాని నరసికుఁ డనుట యనుచితము. రసికులే యైనను ధీరులగువార లెంతటిరసికురాండ్రగుపరస్త్రీలం లభింపనై యున్నను ద్రోసిపుత్తురు అందుకుఁ గారణము వారిధీరత్వమే కాని శృంగారరసజ్ఞతామూఢత్వము కాదు పెద్దనార్యుఁడు పాత్రౌచిత్యము చెడఁగొట్టినాఁడని రసజ్ఞులకుఁ దెలుపుటకు నింతకంటె దూరము వ్రాయ నవసరము లేదు

గంధర్వపాత్రము:—మనుచరిత్రమునందు వచ్చు కలియను గంధర్వుఁడు పరమనీచుఁడు రసికతావిహీనుఁడు. పశుప్రాయుఁడు కావుననే తనయందించుకయును బ్రేమ లేకపోవుటయేగాక తన్ను నిరసించివైచిన స్త్రీని నామె కెవని యందు వలపు కలదో వానివేషమును ధరించి కూడి ధన్యుఁడనైతినని యానందించె మృగములందుఁగూడ గానరాని యిట్టినీచకృత్యమును గావించిన యీ గంధర్వుని మన పెద్దనార్యుఁడు ఘనరసికునిగా వర్ణించినాఁడు. ఇదియును పాత్రౌచిత్యమును బాడుసేయుటయే యగును. "పెద్దనగారు మాయాప్రవరుని

పాత్రము నుండవలసినట్లు చిత్రించినారు. ఆగంధర్వుఁడు మంచివాఁడా చెడ్డవాఁడా యనువిషయముతో మనకుబనిలేదు." అని వేంకటశాస్త్రిగారు వ్రాయించిరి. ఆతఁడు మంచివాఁడా చెడ్డవాఁడా యను విషయముతో మనకు బనిలేదని విమర్శనపద్ధతి వారలేలవ్రాసిరో తెలియవచ్చుటలేదు. మనకవి యావిషయము నెత్తకుండిన మనకది యవసరము లేకపోవునేమో కాని యాతఁడద్దాని నెత్తికొనినప్పుడు మనకవసర ముండకపోదు. ఈవియచ్చరాధముని మనకవి వియచ్చరప్రవరునిగా వర్ణించినాఁడు. అంతటితో బోనీయలేదు. వరూథిని యను పచ్చిలంజెపొత్తును త్రోసిపుచ్చిన ప్రవరుని మహాపురాధమునిగా దెలిపినాఁడు. ఇంతకంటె వింత మఱొకటుండ నేరదు. విమర్శకులు పక్షపాతబుద్ధిని విడిచిపెట్టవలెను. దానిని విడువవఱకును సత్యము బయల్పడనేరదు. కలియను గంధర్వుఁడు మంచివాఁడా చెడ్డవాఁడాయను సంశయముతో నొకవేళ మనకు బనిలేకపోయెనను నాతఁడు రసికుఁడాయరసికుఁడాయను సంశయముతో మనకు బనిలేకపోలేదుకదా. ఈకలి రసికుఁడా యరసికుఁడా? ఈగంధర్వాధముఁడు తనయందింతయును ప్రేమలేకపోవుటయేకాక పైగా తనయందు రోతను బ్రకటించిన యొకభోగముతోత్తును నామెవలపుగాని వేషమువేసికొని వంచించి గూడె. ఈపశుకాముఁడు రసికుఁడు కాఁగలఁడా? రసికత్వమన నిట్టిదియా? ఈతనిని మనపెద్దనార్యుఁడు కామశాస్త్రపారఁగతునిగా వర్ణించె. రసాభాసపు చేష్టలుచేయు నీచకామకాధములా కామశాస్త్రపారంగతులు? ఏకత్రానురాగము వట్టిరసాభాసమని కామశాస్త్రము నిరసించుటలేదా? కావున నీచుఁడైన కలినామకగంధర్వుని వియచ్చరప్రవరునిగను సంగభవవిద్యాపారగునిగను వర్ణించుట తప్పుగాకపోదు. ఒకప్పుడు తన్ను నాదరింపని స్త్రీని మరియొకప్పుడు తన ప్రౌఢత్వముచే దరించునట్లు చేసికొనఁదలఁచువాఁడెవఁడో వాఁడొకప్పుడొల్లమి సేయుచు రొక్కొకవేళ బెన్నచ్చు నాదరింతురనిన సరసముగ నుండునుగాని మాయవేషమును వేసికొని వంచించువాఁడు దగఁదగినదికాదు. వరూథిని మొదట కలిని ద్రోసిపుచ్చినను దఱువాత నాతఁడు చూపుప్రేమ నో రసికత్వము నో ధనము నో ఆధారముగా దీసికొని యాతనిని వలచియుండలేదు. తనకెవనియందు వలపుకలదో యావేషమే యిచటగాన్పించుటచే యాతఁడే యనుకొని మాయలోబడిపోయినది. ఈవంచనను మొదటనే జరిగినను నిదిసాగియేయుండును. కానకలి "ఒక్కొకవేళ బద్దను ఖు లొల్లమిసేయుచు రొక్కొకవేళ బెన్నచ్చువనా

దరింతురు క్షణక్షణముల్ జవరాండ్రచిత్తముల్ పక్షునవేసరం జేదుపాయము
లందగు నిచ్చకంబులం జిక్కగఁజేసి డాసినతి చిత్తమువట్టి సుఖింపగాదగున్”
అనుటలో సారస్యములేదు.

స్వరోచి:— ఈపాత్రవిషయమై మన వేంకటశాస్త్రిగారిట్లు లిఖించిరి:- “ఉత్తమనాయకుని యందుండవలసిన యుత్తమగుణములన్నియు అనగా ధీరత్వము పరాక్రమము, పరదుఃఖాసహిష్ణుత, పరోపకారము స్వార్థత్యాగము, సాహసము యుద్ధచాతుర్యము మొదలగునవి కవిచక్కగా వర్ణించెను.” అని పద్ధతికారులు వ్రాసిరి. విషయమంతను సరిగవిమర్శింపక యేవో కొన్ని మెఱుగులు మాత్రముచూపి కావ్యమునందు దోషములేదనుట సద్విమర్శనపద్ధతి యెన్నటికిని గానేరదు. పద్ధతికారులు పెద్దనార్యుని స్వరోచిని వర్ణించుటలో సత్యమును మఱచిపోయి యతఁడు స్వార్థత్యాగము కలవాఁడని పొగడిరి ఈ యంశము గ్రంథమునుంబట్టి యేరీతిగా తేలునో తెలియవచ్చుటలేదు. గదిలోని వలపునోకింతనిలుపుట స్వార్థత్యాగమగునా యేమి? ఈతడు చూపిన స్వార్థత్యాగ మెచ్చటనున్నది ఏమైననేమి? మనపెద్దనార్యుఁడీ స్వరోచిని దుడుకొక వికారపురుషునిగా చిత్రించినైచె ఈస్వరోచి సుగుణాలంకృతుఁడాయెననియు శూరుఁడు వీరుఁడునై ప్రకాశించెననియు సరసముగనీక్రిందిపలుకులలో మారన వర్ణించెను.

“కళలభివృద్ధిఁ బొందు శశికైవడి దద్దయు సద్గుణంబుల
న్వెలుఁగుచు నాడునాటి కభివృద్ధి వహించి మనోజ్ఞయౌవనో
జ్జ్వలుఁడును శస్త్రవిద్యను విశారదుఁడు న్బలభాసితుండునై
పొలుపుగ మందరాద్రితట భూముల నాతఁడు గేలిసల్పుచున్.

మనపెద్దనార్యుఁ డీతని వర్ణించుటలో విపరీతాతిశయోక్తులను బెట్టి వైరస్య మిక్రిందిరీతిని గలిగించె

“ప్రగ్రుద్ధన్ గోత్రాచలంబుల్ గులగులలయి పోగోత్తముల్ గ్రద్దులీఁగన్
ఖడ్గిన్ జెండాడు వ్రాకుల్ కవుగిటికోలదల్ కర్తినోక్త్రాక్ష ఖాతం
బుద్దామక్రీడ వాతాద్భుతగతిబరచున్ భూమి జవ్వాడగాని
ట్లద్దేవీనందనుం డత్యనుపమబలుఁడై యావనారంభవేళన్ ”

ఈపద్యమునందు స్వారస్యమేదియును గాన్పింపదు. ప్రపంచాతీతమగు నతిశయోక్తులు మాత్ర మిందు గాన్పించుచున్నవి. ఇందు వర్ణింపబడిన స్వరోచికృత్యములు నిరర్థకము లగుటయే గాక వృథాలోకధ్వంసకరములుగా గూడ

నున్నవి ఈపద్యము నెత్తుకొని మన వేంకటశాస్త్రిగారీ క్రిందిరీతిన స్తోత్రపార ముసరించిరి. "ఈపద్యమునం దెట్టి లోపమును లేదు యౌవనారంభమందు స్వారోచిషీర కృత్యము లిందు వర్ణింపబడినవి ఈపద్యము వరూథిని శృంగార చేష్టావర్ణనములతో బోల్చి రసహీన మనవచ్చునా? అది కొందఱకు రుచించును, ఇది కొందఱకు రుచించును. ఇందు పెద్దన కవితాశక్తిలోపమేది?" అని యేమేమో వ్రాసిరి. వేంకటశాస్త్రిగా రిట్లేల వ్రాసిరో తెలియవచ్చుట లేదు. విమర్శకు లెవరును మనుచరిత్రము నందలి యుత్తరభాగమును పూర్వభాగము వలె శృంగార రసప్రధానముగా లేనందులకై నిందింపలేదు. ఉత్తరభాగము రసహీనముగా నుండుటచే పూర్వభాగమంత రసవంతముగా లేదనిరి. పద్ధతి కారు లీపద్యమునందు గల రసవిశేషమేమో దాని యతిశయమేమో తెల్ప లేదు. పర్వతములు వనములు మున్నగు వానిని ధ్వంసముచేయుట వీరలక్షణ మని బుద్ధిమంతు లెవరును జెప్ప సాహసింపజాలరు స్వారోచిచేసినవి దుండగ పుపను లగునేమో కాని మంచిపనులుగా నేరవు. అదియటుండ నీ స్వారోచి పాత్రమును బెద్దనార్యుఁడు కొంత పాడుచేసినాఁడు. స్వారోచి మొదట శృంగార ప్రియుఁడై బహుకాలము కామినీగోష్ఠితో వ్యర్థము కావించుకొనినను దఱు వాత హంసహంసీ సంవాదమును విని విరాగియై తపస్సొనరించి ముక్తినొంది నట్లుగా మూలమగు మార్కండేయ పురాణము చెప్పుచుండగా మన పెద్దనా ర్యుఁ డీవృత్తాంతమును దీసివేసి స్వారోచిని కేవల శృంగారరసాభాసప్రియు డగు పశుకామునిగా మార్చివైచె. ఇది పెద్దలోపము గాని సామాన్యమైనది కాదు. మఱియును మూలము స్వారోచియొక్క రుండె ఘోరరాక్షసునితో బోరి విజయము నంది వీరాగ్రేసరుఁడై ప్రకాశించి నట్లు తెలిపియుండగా మన పెద్దనార్యుఁ డాతనికి సహాయులను కల్పించి కొంత రసహీనత కలిగించె. ఈయం శములు నే నిదివఱకు వ్రాసియుండగా బద్ధతికారులు పెద్దనార్యుని గాపాడు టకై విపరీత వాక్యముల వ్రాసిరి. స్వారోచికిఁదోడైన వా రెల్లరును సామా న్యులు కారట! మంచి శూరులట! కాని యీశూరులు రక్కసుని రూప మును చూచినంత మాత్రముననే భయపడి పాఱిపోయిరట. శూరు లిట్టివా రయియుందురా? శత్రురూప దర్శన మాత్రముననే పాఱిపోవు వారు శూరు లగుదురా? మనయిచ్చ వచ్చిన పదముల వాడినంత మాత్రముననే పాత్రము న కౌత్కృష్ట్యము కలుగునని పద్ధతికారులు తలంచుట పెద్దవింతగ నున్నది.

శత్రువును జూడగనే యుద్ధభూమినుండి పాఱిపోవువారు పిఱికిపందలు అట్టి పిఱికిపందల సాహాయ్యమును స్వారోచికి గలిగించుట యెందులకు? పిఱికిపందలకంటె ఘనుఁడని చూపుటకా, అట్లు చూపుట స్వారోచియం దొకవిశేషమును బుట్టింపదు. తోడివారల ధైర్యముతో యుద్ధమునకు బురికొల్పుట కందురా, యొక్కని మీఁదికి బల్వురను బురికొల్పి ముట్టడిచేయువాఁడు ధర్మతత్పరుఁడెట్లు కాఁగలఁడు? ఏవిధమున జూచినను మూలమునందున్న విశేషముల దీసివైచియు లేని యంశములఁ జేర్చియు స్వారోచి పాత్రమును మన పెద్దనార్యుఁడు కొంతవఱకు బాడుచేసి యున్నాఁడనక తప్పదు ఈవిధముగా మన పెద్దనార్యునిచే పాత్రౌచిత్యము పలుతావుల బాడుచేయబడినది ఇది సత్యము. చదువరులు పక్షపాతబుద్ధిని విడిచి సత్యమును గనుగొన యత్నింతురు గాక విమర్శకులు నెట్టివారి గ్రంథములను విమర్శించుచుండినను పాక్షికబుద్ధిని విడచి సత్యమును బ్రకటింపఁ బ్రయత్నింతురు గాక! పెద్దనాది మహాకవుల గ్రంథములందు గల దోషముల నస్మదాదులము చూపుటకు గల కారణము వ్యుత్పత్తిజ్ఞానమును సంపాదించుకొను విద్యార్థుల యుపయోగము నిమిత్తమే కాని మహాకవుల నిందించుకొఱకు కాదని విమర్శన పద్ధతికారులు తెలిసికొందురు గాక!

కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు.

శ్లో. సంతాపం జగతాం విలుంపసి పున ర్ధారాభిరాసించసి
క్షేత్రా ణ్యంకురయ స్యమూన్పులకయ స్యహ్నాయ నీపద్రుమాన్
సారంగస్య నభోని వేశితదృశ శ్చంచూపుటాపూరణే
వైముఖ్యం వ్రజసి త్వ మంబుద యది ప్రత్యేతికో నామతత్.　　౭౩

చ. జగములఁ గప్పు తాపమును జక్కిఁతి వంబుద వారిధారలం
దగుగతి భూమిఁ గల్దళయుతంబుగఁ జేసితి వేగనీపముల్
వగఁ గొని పూయఁజేసితివి పాయక నిన్ననుచాతకంబునె
మ్మొగమున వారి నింపమిచిఁ బూర్వపుఁజేతలు విశ్వసింతురే

సముద్రుఁడు

శ్లో. ఉబ్ధీ రత్న వధో ధత్తే ధత్తే చ శిరసా తృణమ్
అబ్ధేరేవహి దోషోయం రత్నం రత్నం తృణం తృణమ్.　　౭౪

క. ఘనగుణమణి నాజలనిధి, దనయడుగున మాటుపఱుచుఁ దాల్చుశిరమునం
గొనితృణము నటులనైనన్, మణిమణియే తృణముతృణమెమహానీయుకడన్.

శ్లో. తరంగమాలికాభీల ధిక్తే సాగర గర్జితమ్
యస్యతీరే తృషాక్రాంతాః పాంథాః పృచ్ఛంతి వాపికామ్　　౭౫

గీ. కడకనేనీకుతట్టున నడచిబడలు, పాంథు లతితృష్ణమై డస్సి బావులడుగ
నలలపఙ్క్తులచే భీతి నడలఁజేయు, జలధివా! నీవు మొఱుగుట సఫలమొక్కొ!

శ్లో. సాకం గ్రావగణైర్లుఠంతి మణయ స్తీరే ర్కబింబోపమా
నీరే నీరచరైస్సమం సభగవా న్నిద్రాతి నారాయణః
ఏవం వీక్ష్య తవ వివేకమపి చ ప్రౌఢిం పరా మున్నతేః
కిం నిందా మ్యథవా స్తవాని కథయ క్షీరార్ణవత్వా మహమ్.　　౭౬

ఉ. తీరమునందు సూర్యకరదీప్తుల మీఱు మణుల్ నగాళితోఁ
జేరిక బొర్లుచుండె నల శ్రీహరి యాజలజంతురాజితో
నీరమునందు నిద్రగొనె నీయవివేకము నీసమున్నతిన్
క్షీరసముద్రుఁడా! దెలిసి కేరుదుఁ దిట్టుదునా! నుతింతునా!

శ్లో. కింఖలు రత్నై రేతైః కింపున రభ్రాయితేన తేవపుషా
సలిల మపి యన్న తావక మర్ణవ వదనం ప్రయాతి తృషితానామ్.　　౭౭

గీ. ఆకసమునంటుతనువుచే నలరుచున్న, మణులు మౌక్తికములు గల్గి మసలుచున్న
లేదు ఫల మింత జలనిధీ! నీదుజలము, దప్పిగొను వారిముఖముల డాయకుంట

శ్లో. స్వస్త్యస్తు విద్రుమవనాయ నమో మణిభ్యః
కల్యాణ మావహతు మౌక్తికశుక్తిమాలా।
ప్రాప్తం మయా సకలమేవ ధనం పయోధే
యద్వారుణై ర్జలచరై ర్న విదారితోఽస్మి ౨౭

చ. వననిధి! నీప్రవాళవనపంక్తి కిదే శుభ మొక్కదండ మా
మణులకు భద్ర మెల్లపుడు మానితమౌక్తికశుక్తిమాలకున్
మునుకొని నేఁడు సర్వధనముల్ గొనుకట తలంచి నెమ్మదిం
దనిసితి నీకు గర్భగతదారుణజంతుభయాప్తి లేమిచేన్.

శ్లో. పీయూషేణ సుర శ్శ్రియా మురరిపు ర్మర్యాదయా మేదినీ
శక్రః కల్పరుహై శ్శశాంకకలయా శ్రీశంకర స్తోషితః
మైనాకాదినగా నిజోదరగతా యత్నేన సంరక్షితా
మచ్చాన్యేకరణే ఘటోద్భవమునిః కేనాపి నో వారితః ౨౮

చ సుర లమృతంబుచేత మధుసూదనుఁడున్ సిరిచేత మేరచే
ధరణియు వజ్రి కల్పకవితానముచే శశిరేఖచేత శం
కరుఁడును మోదమెల్లతఱి గాంచఁగఁ జేసితిఁ గాక మామకో
దరమున నిల్పి ప్రోచితిఁగదా నగరాజుల నెల్ల నట్టిన
న్గరముఁ బట్టి మ్రింగెడునగస్త్యుని మాన్పరైరె దెవ్వరున్.

శ్లో. మహ్యాం శ్రీరితి శార్ఙ్గభృ త్త్రిదశరాట్చింతామణి ర్మహ్యమి
త్యబ్జో మహ్యమితీశ్వర స్సురగణో మహ్యం సుధా చాస్త్వితి
సర్వే సంత్యపహర్తుమేవ జలధే స్సర్వస్వమేనం రుషా
హంతా చామతి తాపసీ న గదితుం కోప్యస్తి తన్మాస్త్వితి. ౩౦

మ. సిరి నాకేశ్వరుఁడున్ శశిన్ గిరిశుఁడున్ జింతామణిన్ వజ్రియున్
గరిమన్ మీఁలుసురల్ సుధారసము వేడ్కన్ మాకు మాకంచు సా
గరు సర్వస్వము గొన్నవార లొకరున్ గాఢోద్ధతిన్ గుంభజుం
డటుచేతం గొనఁద్రావువేళ శరధిన్ సాటోపతం బ్రోచిరే.

—॥ సరస్సు ॥—

శ్లో. కాసారవర్య కవితాంబరుహావతంస, ముక్తాసమానజలబిందుతరంగభంగ
కింభూషణం తవ బకైః ప్లవహంసభిః కురరావై,ర్హంసైస్సినాకలరవైర్నరదేవపూజ్యైః

చ సరససరోవరోత్తమ! బిసప్రసవాళి శిరోమణీ! సుధా
కరకిరణౌఘమౌక్తికనికాయసమానపృషత్కదంబకా
వరవరపూజ్యము ల్గలనినాదములో నలరాజహంసముల్
దొరగుట నేమిభూషణము దుర్గమనస్స్థవద్బకాళిచేన్.

శ్లో భోభోః సర స్త్వముదరాంతరవర్తితస్య, త్వత్పూర్ణతాతిపరితోషితచిత్తవృత్తే
త్వజ్జీవనేన సహజీవనమస్య నశ్యే త్మీనః క్వజీవతి కమాశ్రయతే తిదీనః ౧౨

చ భవదమలాశయాంతరవివర్తనఁ గాంచి భవత్సమృద్ధిచే
నవిరళతృప్తచిత్తయుతమై తగు మీనము దీనవృత్తిని
దువిమలసారజీవనముతోఁ దనజీవనము న్నశింపఁగా
నెవనిని జేరు దా బ్రతుకు నెట్లగు హా! కమలాకరోత్తమా.

—। భృంగము ।—

శ్లో కుసుమాని లిఖంతు నామ చిత్రే కతిచిత్రాలవిశేషరూఢశిక్షాః
సురభిత్వ మమూని కిం లభంతే, కథ మేతేషు రసం పిబంతి భృంగాః ౧౩

క. శ్రమగొని చేర్చిన లేఖరు, లమితమతిం జిత్రపటము లమరఁగ సుమముల్
క్రమమున వ్రాతురు గాకటఁ, గొమరొందు నెతావిమధువుఁ గొను నెమధుపముల్

—। చెట్టు ।—

శ్లో ధత్సే మూర్ధని దుస్సహా దివమణే రుద్దామధామచ్ఛటా
శ్ఛాయాభిః పథికాన్ నిదాఘమథితాన్ ప్రీణాసి పుష్పైః ఫలైః
ధైర్యం ముంచసి నైవ నైవ భవత శ్శాఖాస్సువిస్ఫారితా
స్తే నాశాసు చ తన్వతే తవయశ స్తోమ స్సముజ్జృంభితః ౧౪

చ సురుచిరధామధాముఁ మగుసూర్యకరప్రకరాచ్ఛసచ్ఛటల్
శిరమునఁ దాల్తు వాతపముఁ జెంది కృశించెడి పాంథలోకముఁ
వరఫలపుష్పపల్లవసువాసనఁ ముద మొందఁజేయుదా
స్ఫురతరశాఖలఁ మిగులఁ బొల్చెదు ధైర్యముఁ గొందు గాన ని
ద్ధర దశదిక్కులన్ వెలసె తావకసద్యశ మోమహీజమా?

శ్లో ఛాయాభిః ప్రథమం తతశ్చ కుసుమైః పశ్చాత్ఫలైః స్స్వాదుభిః
ప్రీణాత్యేవ తరుస్మహానితి పథి శ్రాంతైః సమాగమ్యతే
కో జానాతి యదగ్రకోటరపుటే ప్రత్యగ్రహాలాహల
జ్వాలామాలకరాళఫాలఫలకః క్రూరః ఫణీ వర్తతే. ౧౫

ఉ. వాతముచేత మున్దు తరువాతను నీడలచే సుగంధవి
ఖ్యాతసుమంబులం బిదపఁ గమ్రఫలావళిచేత నొంతయున్
బ్రీతియొసంగు చూతమని వేడ్కవసింతురుగాక పాంథులా
భీతికరాగ్రకోటరనవీనహాలాహలహేతిమాలికా
జాతకరాళదుష్టఫణిసంగతి నెవ్వఁ డెఱుంగు నివ్వనిన్.

శ్లో. పరోపసర్పణానంతచింతానలశిఖాశతైః
అచుంబితాంతఃకరణా స్సాధు జీవంతి పాదపాః. ౮౬

క. పరకార్యాపేక్షాఘన, తరచింతానలశిఖాశతశతము నింతం
బొరయని నిర్మలమతితోఁ, ధరణిఁ జీవించు సాధుతరులు బళి బళీ

శ్లో. ధత్తే భరం కుసుమపత్రఫలావలీనాం, ఘర్మవ్యథాం వహతి శీతభవాం రుజం చ
యో దేహ మర్పయతి చాన్యసుఖస్య హేతోః, తస్మై వదాన్యగురవే తరవే
నమోస్తు. ౮౭

చ. పరులకు సౌఖ్యమిచ్చుటకు వాతము నాతపమున్ సహించు దు
ర్భరమగు శీతబాధఁ గొనెఁ బల్లవముల్ సుమముల్ ఫలంబులుం
బరఁగఁగ మేన నేతరువు బాగుగఁ దాల్చు వదాన్యకోటికిన్
గురువగునట్టి యాతరువుఁ గోరి భజించి నుతించి మ్రొక్కెదన్.

శ్లో. శాఖాశతశతవితతా స్సంతి కియంతో న కాననే తరవః
పరిమళభరమిళదళికులదలితదళా శ్శాఖినో ద్విత్రాః ౮౮

క. గురుశాఖాశతశతవిస్ఫురదవనీజంబు లెన్నొ పొల్చు వనానం
బరిమళభరమిళదళికుల, దరదళితదళంబులైన తరులరుదు ధరన్.

కల్పద్రుమము.

శ్లో. ఔదార్యం భువనత్రయేఽపి విదితం సంభూతి రంభోనిధే
ర్వాసో నందనకాననే పరిమళో గీర్వాణచేతోహరః
ఏవం దాతృగుణోత్తర స్సురతరోః సర్వోపి లోకోత్తరః
స్యా దర్థిప్రవరార్థితార్పణవిధా వేకో వివేకో యది ౮౯

చ. శరనిధియందు సంభవము స్వర్గ్గసంబున నున్కి దేవతల్
దరిఁగొనమీఱు సౌరభ ముదారతసర్వజగద్విరాజితం
బురుచిరదాతృరాజ ! సురభూజ భవద్గుణరాజి రాజిలున్
గురుతర కామితార్థములు గూర్చెడువేళ వివేక మున్నచోన్.

### మామిడిపండు.

శ్లో. దిఙ్మండలం పరిమళై స్సురభీకరోషి
సౌందర్యమావహసి లోచనలోభనీయమ్
భోభో రసాలఫలవర్య తథాపి మాయే
యద్గ్రంథిలం చ కఠినం హృదయం బిభర్షి ౯౦

ఉ. సారెకు నీకుసౌరభము చక్కగ దిక్కులఁబిక్కటిల్లె నెం
తో రుచిమీఱిలోకము నుతుల్ రచియించె జిహ్వపు రాల్చి తా
సారరసాలసాలఫలసత్తమ! నీవటులైన గ్రంథిలం
బై రుజుహీనమైన హృదయంబు వహింపుట చేఁ గలంగెదన్.

శ్లో. న తాదృక్కస్తూరే నచ మృగమదే నో మలయజే
ఫలే వా పుష్పే వా తవ భవతి యావత్పరిమళః
భవత్యేకో దోష స్త్వయి యది రసాలాపరిహృతః
పికే వా కాకే వా గురులఘువిశేషో నగణితః. ౯౧

ఉ. పొందుగఁ దావకీనఫలపుష్పములం దగునట్టిగంధమా
చందనగంధసారఘనసారమృగీమదబృందమందు నెం
పొందదు గాని దోషమొకఁ బొందితి వీవు రసాలమా! పికం
బందును గాకమందు నెద నారయవైతివి తారతమ్యముల్

శ్లో. త్రపాశ్యామా జంబూ ర్దళితహృదయం దాడిమఫలం
సశూలం సంధత్తే హృదయ మభిమానేన పనసః
భయా దంతస్తోమం తరుశిఖరజం లాంగలిఫలం
సముద్భూతే మాతే జగతి ఫలరాజే ప్రసరతి ౯౨

చ. నెలకొను మేన నల్పుగొని నేరెడుపండు భయంబుఁజెందె లాం
గలిఫల మెంతయుఁ జకితగాంచిన డెందమునొందె దాడిమీ
ఫలమువిసెన్ మది బనసపండు శిరస్స్పృతినొందలేక దా
నలజడి శూలయుక్తహృదయంబుగఁ గన్పడె ముజ్జగంబులన్
ఫలములతేఁడవందగిన భవ్యరసాలఫలంబు మీఱఁగన్.

శ్లో. యే౽మీ ఆముకుళోద్గమా త్ప్రతిదినం త్వా మాశ్రితా షట్పదా
స్తే భ్రామ్యంతి ఫలాద్భిహిః కథమహో దృష్ట్వాన సంభాషసే

యేకీటా స్తవ దృక్పథం నచగతా స్తే త్వత్ఫలాభ్యంతరే
ధిక్త్వాం చూత పరాపరావరపరిజ్ఞానానభిజ్ఞో భవాన్. ౯౩

చ. కొలుచుచు నెల్లప్రొద్దులును కుత్సితులౌ కలనాటనుండియున్
ఫలముల నిప్డు పైఁదిరుగఁ బట్టిన చూచియుఁ జూతవృక్షమా!
తొలిచి భవత్ఫలాంతరముఁ దూఱెడుఁబుర్వులు దృక్పథంబులై
వెలయవె హా! పరాపరవివేకవిహీనుని సన్దహింపనే.

కొబ్బరికాయ.

శ్లో. భోనారికేళ తవ మస్తకభేదనానాం సాధ్యం భవేత్తవజలం కరినస్వయాంవ
నాహం త్వదీయసలిలగ్రహణేసమర్థ, స్త్వత్కాంతభేదవిముఖ శ్శుకరాజబాలః.

చ. మరువిడునారికేళఫలమా! వినుమా భవదీయనీరముల్
దటిచుగసంభవించు నట తావకమస్తకభేదకాలికిన్
సురువిరకీరశాబకుఁడ సూటిగభేదమొనర్ప నేర నా
గురుతరదాహశాంతి సమకూరుటెటుల్ కరినస్వయాంపమా.

చందనము.

శ్లో. మూలం భుజంగై శ్శిఖరం విహంగై
శ్శాఖాః ప్లవంగైః కుసుమాని భృంగైః
పార్శ్వా మతంగైః కరణాః కురంగైః
స సేవ్యతే చందనపాదపోయమ్ ౯౪

చ. మొదలు భుజంగముల్ శిఖరమున్ ఘనసంగతిలో విహంగముల్
కదపడి రమ్యశాఖల ప్లవంగములున్ గుసుమాళి భృంగముల్
మదభవదన్తతంగములు మానుగఁ బార్శ్వములం గురంగముల్
సదమలభూరుహాన్ గొలువఁ జందనభూజనిరాజు రాజిలెన్.

శ్లో. పాటీర తవ పటీయాన్ కః పరిపాటీ మిమా మురీకర్తుమ్
యత్పింషతా మపి నృణాం పిష్టోపి తనోషి పరిమళైః పుష్టిమ్. ౯౫

క. పాటీరమ నీదగుహరి, పాటింగణియింప నేరివశముగుఁ గడఁకం
బాటించి నిన్ను నూరెడి, మోటులకైనన్ సుగంధమునె జూపె దిలన్.

శ్లో. జనక స్సానువిశేషో జాతిః కాష్ఠం భుజంగమై స్సంగః
స్వగుణై రేవ పటీరజ యాతోసి తథాపి మహిమానమ్ ౯౬

క. జననము కరివశిలాస్థలి, దన వైనపు మోటుజాతి వారు ఫణిభృ
నెనయుట గలదైనను జం, దనమా నీసుగుణములనె పాల్చితి మహిమన్.

శ్లో. అయి మలయజ మహిమాయం, కస్యగిరా మస్తు తేవిషయః
ఉద్గిరతో యద్గరళం ఫణినః పుష్ణాసి పరిమళోద్గారైః. ౯౮

క. మలయజమా నీమహిమను, దలఁగక వర్ణింప నేతర మగువిషమున్
బలిమిమీ గ్రక్కెడి ఫణులం బొలుపుగను సుగంధజాతములఁ బోషింతువహో

శ్లో. సౌరభ్యం భువనత్రయేపి విదితం శైత్యంచ లోకోత్తరమ్
కీర్తిః కించ దిగంగనాంగణగతా కింత్వేత దేకం శృణు
సర్వానేవ గుణాని యం నిగిరతి శ్రీఖండ తే సుందరా
నుజ్ఝంతీ ఖలు కోటరేషు గరళజ్వాలాం ద్విజిహ్వావళీ ౯౯

మ. ఘనసౌరభ్యము సర్వలోకముల విఖ్యాతంబె శైత్యంబు మీ
ఱను లోకోత్తరమౌఁ గీర్తి రహి మీఱె దిగ్దశాభోగమం
దనువైనైనను జందనద్రుమము! నీచాలింపుమా నీమన
ద్గుణరాశిం నిరసించె గోటరపకాకోలద్విజిహ్వావళుల్.

శ్లో. లోకానందన చందనద్రుమ సఖే నాస్మిన్వనే స్థీయతాం
దుర్వంశైః పరుషై రసారహృదయై రాక్రాంతమేతద్వనమ్
తేష్వ న్యోన్యనిఘర్ష జాతదహనజ్వాలావళీసంకులా
నస్వాన్యేవ కులాని కేవల మిమా సర్వం దహేయుర్వనమ్ ౧౦౦

చ. అలవడె సారహీన హృదయంబులునుం బరుషంబులైన నీ
ఖలతరవంశజాతములు కానను గానను నిల్వరా దిటన్
విలసితచందనద్రుమము! పేర్మి యనుంగ! సుగంధదాయకా!
కలితపరస్పరాంచితనిఘర్షజదావము కాచుగేవలం
బిల నిజవంశపాళినె దహింపవు సర్వవనంబుఁ గాల్చెడున్.

చంపకము

శ్లో. సకలగుణనిధానం మాం విహాయ ద్విరేఫాః
పరిమళపరిహీనం హంత చుంబంతి ధూర్తమ్
ఇతి మనసి విషాదం మాకృథాః చంపకోచ్చై
రిహ మధుపసమాజే కో వివేకావకాశః. ౧౦౧

చ. లలితగుణాళి యుక్తమగు లక్షితమై యలరారుచున్నసత్
దొలఁగి సుగంధహీన మగుధూర్తముఖంబును గ్రోలు నీయళుల్
వలనుగ నంచు దుఃఖ మెడఁబాయుము చంపకమా! మనంబులో
నిల మధుపాళియం దహహా! యించుక యైన వివేకమున్నదే.

పద్మము.

శ్లో. అంతశ్ఛిద్రాణి భూయాంసి, కంటకా బహవో బహిః
కథం కమలనాళస్య మాభూవన్ భంగురా గుణాః ౧౦౨

గీ. లోపల ననేకరంధ్రము ల్గొనుచు నిగిలె, వెలుపలనుకంటకావళి వెలసియుండె
గాన బిసనాళగుణగణగౌరవంబు, గడఁకతో నెట్లు భంగసంగతముగాదు.

శ్లో. రుచి రతిరుచిరా శుచిత్వ ముచ్చైశ్శిరసి ధృతస్త్వయమేవ శంకరేణ
కమలిని మలినీకరోషి కస్మాన్ముఖమిద మిందుముదీక్ష్య లోకకాంతమ్. ౧౦౩

క. అతిరుచిరమైన రుచియును, నతిశుచియును శివునిశిరమునందుండుట యీ
గతి లోకకాంతుఁడగు నిట్టుతిగని వైముఖ్య మేల పడసెదు బిసినీ.

శ్లో. యావత్త్వాం నఖలు హసంతి కైరవిణ్యో
యావత్త్వాం తరణికరాః పరామృశంతి
యావత్తే మధువిభవో నవో౽స్తి తావ
న్మాధ్వీకం వితర సరోజషట్పదేభ్యః. ౧౦౪

ఉ. ఎంతటిలోన రెచ్చి హసియింపవు కల్వలు నాసరోజినీ
కాంతల సత్కరావళియుఁ గ్రమ్మను గమ్మనుకమ్మతావి దా
నెంతయుఁ గ్రొత్తదై వెలయు నీమహి నీమకరందవైభవం
బంతటిలోనొసంగుము సదాళిపరంపరకున్ సరోజమా.

శ్లో. స్వచ్ఛందం దళదరవింద తే మరందం విందంతో విదధతు గుంజితం మిళిందాః
ఆమోదా నథ హరిదంతరాణి నేతుం నైవాన్యో జగతి సమీరణాత్ప్రవీణః

చ. దళదరవిందమా, భవదుదారమరందము నామిళిందముల్
గలుగుచు స్వేచ్ఛమై మెసవి గుంజితము న్రచియించుఁగాక స
ద్విలసితవాసనాలహరి దిక్కులనెక్కగ గమ్ముగమ్మనన్
మెలగఁగఁ జేయ జాలినసమీరుని కన్న ప్రవీణు లుందురే

# కవి—కవిత.

బులుసు వేంకటరమణయ్యగారు

---

ప్రస్తుతకాలమున వాఙ్మయాభివృద్ధి కనువగు ననేకసౌకర్యములు కలిగియుండుటచే దినదినమును వాఙ్మయము మితిలేని మార్పులను జెంది పెంపొందుచున్నది. అవధానదీక్షా దక్షులగు ననేకకవిశిఖామణులు గడియకు నూఱుపద్దెములం గూడ గంగాతరంగిణీఝరరీతి నాశుధారగాఁ జెప్పుచున్నారు. అనేకబాలకవులు బాలకవితనే గాక ప్రౌఢకవితం గూడఁ జెప్పుచు శ్రోతల నానందసాగరమునఁ దేలియాడించుచున్నారు అనేకులు భావకవులును, గవికుమారులును, గేయకవులును వాచామతీతములును, నూహాతీతములు నగుభావపల్లవములను లోకమంతటను వెదఁజల్లుచున్నారు. అనేకులు విమర్శనదక్షులగులక్షణవేత్తలును బండితప్రవరులును గవితావిమర్శనములం జేసి తఱచితఱచి మననముచేసి గుణదోషములను బజారునందలి పదార్థములరీతి నేటి వేలుపెట్టి చి, హితాహితములను, కృత్యాకృత్యములను లోకమునఁ జాటుచున్నారు. కాని, యిందఱిన్నివిధముల భాషాసేవ చేయుచున్నను బ్రాచీనకాలముకంటె (ననఁగాఁ బ్రస్తుత మీయిరువదవశతాబ్దముకంటెఁ బ్రాచీనకాలమని) నీకాలమున వాఙ్మయమునకుఁ గలిగినయభివృద్ధి కష్టమునకుఁ (ప్రయత్నమునకు) దగినంత కానరాకుండుటకుఁ గలకారణ మేమో యూహింపవలసియున్నది.

ఆలోచింపఁగా నందులకు మనయాధునికుల యసామర్థ్యమును, దానికిఁ దోడుగ నందనిమ్రానిపండ్లకట్టులు చాపురీతి సామర్థ్యము లేకున్నను మహాగ్రంథములను వ్రాయఁబూనుకొనుటయు, వాఙ్మయమున నూతనజాతీయతను నెలకొల్పి భాషకు నవ్యశోభ నాపాదింపఁజేయుచున్నామనుకొనుటయు ముఖ్యకారణములు.

ఇక్కాలమున మనవాఙ్మయమున కభివృద్ధి కొఱంతపడియున్నను గవిత్వాభివృద్ధికిం గాని కవులకుఁ గాని యేమియుఁ గొఱంత లేదు మనవాఙ్మయ మెపుడు శాఖోపశాఖలను గల్పించుకొని చీలికలై పలురీతుల విపరిణామములను బొంది పరస్పరభేదభావమును బొందినదో, యది మొదలు శాఖాభేదముల ననుసరించి కవితాభేదములును గలుగుచుండ ననేకవిధము లగుకవీశ్వరులసంఖ్యేయులు వెలయుచున్నారు.

నాల్గు గ్రంథభాగముల నొకపరి తిలకించి, నాల్గువృత్తముల లక్షణములు- (వృత్తములు కాదు గీతమాలికాలక్షణము లనవచ్చును-) తెలిసికొని నాల్గుముక్క లల్లఁగలప్రతివారు నిప్పుడు కవిశిఖామణులై యున్నారు. వారికి వ్యాకరణశాస్త్రాభ్యాసదక్షత గాని, మఱి యెవ్విధ మగుపాండిత్యము గాని, విమర్శనజ్ఞానముగాని యవసరము లేదు. కవిత్వమునకు రసపరత్వముకూడ ననావశ్యకము. సర్వజనసమాదరణీయమై యతిశయోక్తిరహితముగ స్వభావవిలసితమై శ్రోతలను రసతన్మయులను జేయురీతి నండఱికిని దేటతెల్ల మగుభాషను గీతమాలికలను రచియింపఁదలఁచు భావకవి సహృదయమానసములను గళవళపఱిచి భావనాతీతమును, నగోచరము నగు విషమావస్థ నాసహృదయుల ముంచుచున్నాఁడు. పదార్థసౌలభ్యము నిచ్చి సహృదయులను రంజించి వారి మెప్పుం బడయుద మని ప్రాచీనలక్షణములను బాటించి పద్యము లల్లు బాలకవి పటిమలేక నిస్సారమై పేలపిండిరీతిగ నుండుకవితామతల్లికను వెలయించి సహృదయస్తోత్రపాత్రుఁడు కాఁజాలకున్నాఁడు. అనన్యగ్రాహ్య మగునర్థపటిమను వెలిపుచ్చి ఘళఘళారావములతో బయలువెడలి చక్రవర్తులవలె దిగ్విజయముఁగొని శబ్దాడంబరములతో నిండి, దీర్ఘసమాసభూయిష్ఠ మగుకవితానాయికను గవితాసామ్రాజ్యేశ్వరిని గాఁ జేయఁగోరు ప్రౌఢకవి సహృదయమానససములను గ్లేశపఱిచి వారికిఁ దలనొప్పి నెత్తించి వారిని రసాస్వాదవిముఖులనుగా నొనర్చుచున్నాఁడు,

కాని భావమే లేనికవిత్వము కవిత్వమే కానేరనందున వాఙ్మయమున కపూర్వరీతి భావసంపర్కమును గలుగఁజేయుచున్నా మని యనుకొనుట పాడిగా దని భావకవియుఁ, బేలపిండివలె నర్థగాంభీర్య మొకింతయును లేక యర్థమంతయును వాచ్యవృత్తిచేతనే వచ్చునట్లు చెప్పినకవిత్వము సహృదయహృదయములను రసాస్వాదపరములఁ జేయఁజాల దని సామాన్యకవితం జెప్పు సామాన్యకవియు, నర్థమననమునందే యట్టిటు కొట్లాడు సహృదయునకుఁ దనంతటతా ననాలోచితముగ నేకలుగురసాస్వాదము దూర మగుటవలనను, వ్యంగ్యప్రధానమగునుత్తమకావ్యమున శబ్దాడంబరమును నీలించుట యనుచిత మగుటవలనను, కేవలము శబ్దాడంబరము సరసకవితయం దుపయోగింపఁ దగ దని ప్రౌఢకవియుఁ దెలిసికొనఁజాలకున్నారు.

సాఖ్యమునుబట్టి యప్రత్యక్షవిషయములను గన్నులకుఁ గట్టినట్లును,

సర్వజనానుభూయమానము లగుసామాన్యవిషయములనే యద్భుతసాదృశ్యములతో మేళవించి స్వభావపరిపోషణ మగునట్లును, రసమాస్వాదయోగ్యముగ నుండునట్లును, కేవల మగమ్యాగోచరభావమిళితమును, కేవలనిస్సారపదభూయిష్ఠమై యర్థమంతయు వాచ్యమే యగునట్లును, కేవలశబ్దాడంబరసమాసాడంబరములు కల్గి యర్థము కానిరీతి నుండి కర్ణములకు వినసొంపునింపనట్లుగాక చెప్పుకవిత్వమే కవిత్వ మనియు, నట్లొనరించుకవియే కవియనియు మన ము గీకరింపవలసియున్నది.

అట్లు చేయుసామర్థ్యము కవికి నాల్గుపద్యము లల్లుట నేర్చినను, గొలఁది లక్షణవ్యాకరణములఁ జదివికొన్నను, గలుగునది కాదు. మీఁదఁజెప్పినరీతి నొనరింపఁగలకవి పండితుఁడును గావలెను విమర్శకుఁడును గావలెను. లోకానుభవములను బాగుగ నెఱింగినవాఁడును గావలెను. మఱియు నతనికిఁ గల పాండిత్య మొక్కశాస్త్రమునఁ బే గాక యన్నిశాస్త్రములయందును గలుగవలెను. అట్లని యన్నిశాస్త్రములందును బరిపూర్ణత యుండవలె నని నియమము లేను అన్నింటియందును దగుమాత్రము పాండిత్య మవసరము. ఇట్లన్ని విషయములను దగురీతిని గుర్తెఱుంగనికవి తనకవితాసామర్థ్యమున జనులను మెప్పింపఁజాలఁడు. అతనికవిత కేవల నామమాత్రఫలకమై యుండును.

ఇక్కాలమునఁ గవికిని, బండితునకును విశేషతారతమ్య మగపడుచున్నది. పండితున కున్నంతగౌరవము కవీశ్వరునకు లేకుండఁబోయినది. ఒకప్పుడొకకవి యొకపండితునికంటె నన్నివిధములచేత నుత్కృష్టుఁడే యైనను, కొందఱుకుకవులవలన లోకమునఁ జాటఁబడిన యీవాడుకను బోఁగొట్టఁజాలకున్నాఁడు అందులకుఁ గలకారణము కవులయసమర్థత తప్ప వేఱేమున్నది ?

కాని ప్రాచీనకాలమున నిట్టిభేదము లున్నట్లగపడదు. ఇక్కాలమునఁ గవియుఁ, బండితుఁడును, విమర్శకుఁడును వేఱువేఱయిరి గాని యక్కాలమునఁ గవియు, విమర్శకుండును, బండితుఁడు నొక్కఁడే యై యుండెడివాఁడు. కాళిదాసాదిమహాకవులు రచించిన గ్రంథములను బరిశీలించినచో వారచ్చటచ్చట నిముడ్చుశాస్త్రమర్యాదలను, సిద్ధాంతములను బట్టి వారికిఁ గలయనేకశాస్త్రవిషయకపాండిత్యము విశదము కాఁగలదు. రాజశేఖరుఁడు, క్షేమేంద్రుఁడు మొదలగుప్రాచీనకవిసార్వభౌములు కావ్యనాటకాదులనే గాక యలంకారశాస్త్రమునందును మహాగ్రంథములను రచించిరి. నైషధమహాకావ్యకర్త

యగు శ్రీహర్షుఁడు తనమహాకావ్యమున న్యాయ, మీమాంసాదిశాస్త్రసిద్ధాంతములను దత్తత్సందర్భానుకూలముల ననువదించుటయే గాక ఖండనఖండఖాద్యాదివేదాంతగ్రంథములను రచించెను మనయాంధ్రవాఙ్మయమున నాదికవి యనిపరఁగుచున్న నన్నయభట్టారకకవిసార్వభౌముఁడు పంచమవేదమగు మహాభారతమును రచియించుటయే గాక, యాదివ్యాకరణ మగునాంధ్రశబ్దచింతామణిని గారికారూపమున వెలయించియున్నాఁడు. ఈమహాపురుషు లందఱును గేవలముకవులో, కేవలపండితులో భాషావేత్త లూహింతురుగాక!

మఱియునొక్కరే కావ్యమును శాస్త్రగ్రంథమును వ్రాయుట యట్లుండనిండు మనయాంధ్రవాఙ్మయమునకు సర్వవిధములను మూలము సంస్కృతవాఙ్మయమే యని చెప్పవలెనుగదా! మనప్రాచీను లనేకులు సంస్కృతగ్రంథములనే యాంధ్రములోనికి భాషాంతరీకరించి వాఙ్మయమును బోషించిరిగదా! స్వతంత్ర మగుగ్రంథమును వ్రాసి యం దిచ్చకువచ్చినట్లు స్వకీయభావములఁ గూర్చుట కూడఁ గష్టము. అట్టియెడ భాషాంతరముననున్న గ్రంథమును బరిశీలించి, మాతృకాకవిహృదయము నెఱిఁగి మాతృకలోనిభావములను సొగసు చెడకుండ భాషాంతరీకరించుట యెంతటికష్టతర మగుకార్యమో సహృదయు లూహింతురుగాక! ఇంకను గొన్నియెడల మాతృకయందుఁ గన్పట్టుదోసగులను బరిశీలించి విడనాడి, వింతసొబగు సొపాదింపఁజేయు నలవాటు మనప్రాచీనకవులకుఁ గల దనునంశము మనకుఁ గ్రొత్తది కాదు ఇట్లొనర్చు కవిశిఖామణులకుఁ గవితావిషయమునఁ బాండిత్య మక్కఱలే దని యనుట యుచితము కాదని తోఁచుచున్నది కవిత్రయమువారు సంస్కృతమహాభారతమునందలి విషయములను గొన్నింటిని జనసామాన్యమునకుఁ దెలియనివానిని విడిచిపుచ్చి సారమునంతటి నొకచోఁ బ్రోగుచేసిన ట్లాంధ్రమహాభారతమును రచించిరి. ఇప్పటిమనకవులలో ఇప్పటిరకపుకవులలోఁ జాలమందికి సంస్కృతభారతము నర్థముచేసికొనుటకు శక్తిలేము సరేగదా చదువుటకు నైన సామర్థ్యముండునో యుండదో యని సందేహించుచున్నాఁడను.

ప్రాచీనకాలమునఁ గవులును, బండితులు నొక్కరే యగుటవలనఁ గవులకుఁగూడ గౌరవ ముండెడిది. కృష్ణదేవరాయసార్వభౌముని యాస్థానమున నల్లసాని పెద్దనామాత్యుఁడు, నంది తిమ్మన్న మొదలగుమహాకవు లష్టదిగ్గజము లని ప్రసిద్ధినిబొందినవారు. వారు సర్వతోజయమును బొందెడివారు.

వారికవిత్వమున జీవము లేకుండు టున్నడును లేదు. వారిప్రతిభ యసామాన్యము. వియోమమును లనిర్వాచ్యములు. కావుననే వా రెట్లనిన సరస్వతి యట్లుండెడిది వారికి శాపానుగ్రహ సమర్థతలు తప్పక యుండెడివి. ప్రస్తుతకాలమున శపించుట తిరిగి మార్చుట మొదలగునవి గలవారెవ్వరును లేరని దృఢముగఁ జెప్పగలను. చాలప్రాచీనకాలమున భోజమహారాజు సంస్కృతవాఙ్మయమును బోషించి కవులకు మిక్కిలి గౌరవ మొసంగి యక్షరలక్షలం గూడఁ బ్రసాదించెడివాఁ డను ప్రతీతి కలదుగదా! ఆగౌరవ మిప్పు డేడనైనఁ గలదా? కవియందు గౌరవము తగ్గిపోవుటకుఁ గవిదౌర్బల్యమును, గవితాదౌర్బల్యమును మూలకారణము లని యిదివఱకే చెప్పియుంటిని

పండితకవుల కభేదభావం బుండుట బట్టియే మన ప్రాచీనగ్రంథములలోఁ బండితు లని వాడవలసినపదములకు మాఱుగాఁ గవు లని వాడఁబడియున్నది. పండితుఁడని యనిపించుకొనుట కొకశాస్త్రమును బూర్తిగాఁ జదివినఁ జాలును గాని కవి కావలయు నన్నచో ననేకశాస్త్రపరిజ్ఞానము ముఖ్యముగ నావశ్యక మగుచున్నది కావుననే కవికిఁ గేవలకవితవలననే గాక పాండిత్యమువలన మిక్కిలి గౌరవము కలుగుచుండును. ప్రాచీనకాలమునఁ గూడ నీయంశమును దెలియఁజేయు ప్రమాణములు కలవు

“ చతురో బ్రాహ్మణస్యాద్యాన్ ప్రశస్తాన్ కవయో విదుః”
రాక్షసం క్షత్రియస్యైక మాసురం వైశ్యశూద్రయోః॥
(మనుస్మృతి-అధ్యా 3 శ్లో. 24)

ఇందుఁ గవులకు ధర్మశాస్త్రములతో సంబంధమేమి? వారి విషయమునఁ బ్రమాణభూతు లగుటకుఁ బాండిత్య మవసరముండదా? ముఖ్యము కాదా? వ్యాఖ్యానము వ్రాసిన కుల్లూకభట్టును “కవయో జ్ఞాతారః” అని వ్రాసియున్నాఁడు ఈజ్ఞాతృత్వము కవికిఁ బాండిత్యము వలనఁ గాని కలుగఁజాలదు.

కానఁ గవిత్వమునఁ గీర్తిని గడింపఁ దలంచుకొనువారు కేవలము పద్యములల్లుటనే నేర్చుకొనుటకాక యన్నిటియందును దగుమాత్రము పాండిత్యము సంపాదించినచో వారు యథార్థకవు లగుదురు. వారికవితవలన లోకమున కొకకొంత యుపకారము కలుగును. కానిదేనియందును జ్ఞానములేక యెద్దియో వ్రాయుచుండువా రెంతమాత్రమును గవులు కారనియు, వారికవిత్వము వాఙ్మయమున కుపకరింపకపోవుటయే గాక, వారికవితవలన వాఙ్మయమున కమిత మగునపకారము కలుగు ననియుఁ దెలియఁజేయుచు నీవ్యాసమును విరమించుచున్నాను.

సమాప్తము.

# శీతము.

కరి నారాయణాచార్యులుగారు.

---

ఉ. శీతము భూరిసాంద్రహిమ శీకరజాలక స్మాతదుసం
జాతము పంచబాణగుణఝూంకృతికంపితభీతికాముక
వ్రాతము నవ్యకైరవ మరందవశంగతలోలభృంగసం
ఘాతము పద్మినీవనవిఘాతము వ్యాప్తిఁజెందె నంతటన్.

కం. కమలాఫలములు వెలసెను, నమలమ్ములై యుండెఁ బుడమి నబ్జాకరముల్
తములం బవసర మాయెను గమలాస్త్రునిగుణరవంబు ఘనమై యొప్పెన్.

మ. హరిదంభోరుహపత్రలోచన లనూనాసహ్యనీర ప్రధదు
ర్భరశీతవ్యథ నైఁపలేక ధవళ స్వచ్ఛాంబరవ్రాతమున్
సుగుచిప్రస్ఫురదాత్మదేహముల సన్తోకంబుగాఁగప్పి రా
హరిదంతంబుల నాక్రమించె బహునీహారంబు శీతంబునన్.

చ. హిమకణయుక్తశాద్వలమహీస్థలిఁ జూడఁగనొప్పు లోకసం
క్రమణపటుప్రతాపహిమ కాలజగన్మయురూపుఁడౌ త్రివి
క్రమమ్మృదులాఁఘ్రిపూజకు సురవ్రజ ముంచు ననర్ఘగణ్యహీ
రమణివిచిత్రమౌ పులుఁగుఁడౌ రతనంబుల పళ్ళెరం బనన్.

మ పదవీసంచరదధ్వనీనశకటోత్పన్నావనీధూళి త
త్పదవీపార్శ్వమహీజపత్రవిసత్ప్రాలేయనీరంబునం
బదునై యుంటఁగఁ దద్దశారుణిమ సంభావోన్నతిం జూచి నె
మ్మదులన్నాథవమానమంచు భయసభ్రాంతాత్ములై రధ్వగుల్.

మ స్మరకేళీతతిఁదేలుచుండె నిముఁడాఛాయూపయోజాస్యలోఁ
గరుణాధీనత దీర్ఘరాత్రులఁగటా కారుణ్య మొక్కింత లే
దరయ న్నావయి నంచుఁ బద్మిని విచారాక్రాంతయై చిక్కెనా
సరసీజాతసమూహ మెల్ల బహుకార్శ్యంబొందె శీతంబునన్.

ఉ. వారిజపత్రనేత్రలును వల్లభులుం బటుశీతబాధలం
దారు సహింపలేక కడదట్టపుసేల్వాల మేనఁ గప్పుచుం
జారుతరాలయస్థమృదుశయ్యలఁ జేరుచు సంభ్రమంబునన్
సోరణగండ్ల మూసికొని సుస్థిరసౌఖ్యము గాంతురెంతయున్.

పృథ్వీ. కరంబుఁ జలిబాధచే హుహుహుహాంచుఁ గంపించుచున్
జరావృతశరీరము ల్ముడిచి వృద్ధసందోహ మా
దరం బెసఁగ దుప్పటు ల్ముసుఁగువెట్టి దట్టంపుము
ర్మురంబులను మంచపు దిగువ నుంచి మూల్గుం జలిన్.

సుగంధి కాంతమై మరందవత్సు గంధపుంజయుక్తమా
బంతినామచారుపుష్పపంక్తియు న్నవీన చా
మంతిముఖ్యచిత్రపుష్పమంజరీసమూహమున్
వింతగా జగంబునందుఁ బ్రీతినించు సీతువన్.

చ. అతితరశీతలామలపయః పరిపూరితభూరిమృద్ఘట
ప్రతతి నురస్థలంబుల నవారితదీక్షను గాఁగిలించుచుం
ద్రుతగతి సుస్వరావళులతోడ న కారపరిశ్రమంబులం
దతమిహికా నిశీథములఁ దద్దయుఁ జేతురు గాయకోత్తముల్.

సీ. ఏప్రొద్దు వఱువాఁత నేఁ తానమాడెను
సోమాసి యుష్ణాంశుఁ జూడఁగోరె
మగనిఁ జేర్పానసిగ్గు మల్లాడుగోయు
బిగియారఁగౌఁగిటఁ బెనచె విభునిఁ
గంపితారాతిహృ త్కంజుఁడౌ భటుఁడైనఁ
గంపించె మిగులన క్కడిఁదిచలికి
నెవ్వారికిని నమ్రుఁ డించుకేనియుఁగాని
దిట్టయు వినమిత దేహుఁ డయ్యె

తే. గీ. శాస్త్రవిధిఁద్రోసి, పుయిలోటఁ జాఱఁజేసి
ధైర్యమును బాసి, గర్వవాదముల రోసి
పేరివము రేసి, జగము కంపించువేళ
నెడమకుపులయ్యె మనుజులయెడఁద లెల్ల.

సీ. చిత్రవర్ణంబులం జెన్నారుదట్టంపుఁ
గాశ్మీరసేల్వాలఁ గప్పుకొనుచు
వివిధరీతుల సొంపు వెలయించు నాడెంపుఁ
గంచుకంబుల ధరియించుకొనుచు

ప్రతతరాదరమునం ధూమశూన్యహసంతి
కల కాఁకలఁ గరంబుఁ గాచుకొనుచు

...  ...  ...  ...

...  ...  ...  ...

తే. గీ. మధురదుగ్ధాన్నభోజన విధులఁ గనుచు
హరివిటీప్రపూరితా స్యాబ్జు లగుచు
నిట్లు సుఖములఁ బడయుచు నింపుమీఱి
శీతమందునఁ బ్రజలు సంప్రీతిఁ గాంత్రు.

---

# గ్రంథవిమర్శనము.

---

ఆంధ్రవాఙ్మయచరిత్రము—పి. చెంచయ్య రాజామంత్రిప్రెగడ భుజంగ రావుగార్లచే రచియింపబడినది. (Telugu Literature—The Heritage of India Series.)

ఆంధ్రవాఙ్మయచరిత్రమును, ఆయాకాలము లందలి తెనుఁగు కవిత్వలక్షణములను సంగ్రహముగ దెలుపుటకు నాంగ్లమున రచియింపబడిన ప్రథమ గ్రంథము. దీనికి ఆంధ్రవిశ్వవిద్యాలయమున వైసుచాన్సలరుగా నున్న కట్టమంచి రామలింగారెడ్డిగారు లఘుపీఠిక నొకదానిని వ్రాసియున్నారు. నన్నయ భట్టారకుని కాలమునుండి నేటివరకు నాంధ్రవాఙ్మయ మెట్టి పరిణామముల బొందెనో వానిని జర్చించుటయే గ్రంథకర్తల ముఖ్యోద్దేశమై యున్నది. ఇది ప్రశంసనీయము గాని నేటి కవిత్వమునందు గ్రంథకర్తలకు గల యభిమానము వారి యుదారభావముల నడంచినటుల దోచుచున్నది సంస్కృతవాఙ్మయమును మాతృకగ గైకొనుటచే నాంధ్రవాఙ్మయ మిన్ని శతాబ్దములనుండియు నశించిన దని వీరి యభిప్రాయము సంస్కృతవాఙ్మయమును గూర్చి గ్రంథకర్తలచటనచట నుపయోగించిన పదములు శ్రవణకఠోరములని వేఱుగ జెప్ప నవసరములేదు. (The stagnating waters of Sanskrit Culture) నేటి భావగీతములు, యెల్లిపాటలు, లాలిపాటలు మొదలగు వానియందే సరియగు

నాంధ్రకవిత్వము గలదనుట సరికాదు. నన్నయకు బూర్వము దేశికవిత గలదనియు, నందు లాలిపాటలు, మేలుకొలుపులు, కీర్తనములు మొదలగునవి మాత్ర ముండెననియు, నన్నయతో మార్గ కవిత్వము ప్రారంభ మాయెననియు గ్రంథకర్తలు దెలిపియున్నారు. దేశికవిత, మార్గకవిత యను పదములు పైయర్థమున వాడబడినవా యను విషయము విమర్శనీయము. మార్గకవితయన సంస్కృతవాఙ్మయమును దేశికవిత యన దేశభాషావాఙ్మయము లనియు బండితులు గ్రహించుచున్నారు

ఆంధ్రాభ్యుదయమును దెలుపుటకు విజయనగర సామ్రాజ్య చాళుక్య చారిత్రములును, రెడ్డి పద్మనాయకుల పరిపాలనమును గూర్చియు ద్వితీయాధ్యాయమున దెలుపబడినది ఆంధ్రవాఙ్మయము నాల్గుయుగములుగ విభజింపబడినది

(1) పురాణయుగము.

(2) ప్రబంధయుగము.

(3) జీర్ణయుగము (Period of stagnation)

(4) ఆధునికయుగము.

1. ఆయాయుగముల యందలి కవులను గూర్చి వ్రాయుచు గ్రంథకర్తలు పెక్కుగాథలను బ్రమాణముగ గైకొనియున్నారు. నన్నయ పెద్దనాదులసూయాగ్రస్తులనియు, ధూర్జటియు శ్రీనాథుడును జారులనియు, జనసామాన్యమువచించు పుక్కిటి పురాణములను నిజమని విశ్వసింపరాదు. అట్టివాని నాధారముగ గైకొని వాఙ్మయచరిత్రమును వ్రాయుట సరికాదు.

2 నన్నయాది కవుల కవిత్వలక్షణములు విపులముగ విమర్శింపబడియుండలేదు ముఖ్యముగ నాంధ్రవాఙ్మయమున నగ్రస్థానము వహించు కవిత్రయము వారి విషయమై ప్రత్యేకముగ నొకయధ్యాయమున జర్చింపవలసియున్నది ప్రబంధయుగము నందలి కవులలో నగ్రగణ్యులగు పెద్దన, రామరాజభూషణుడు, పింగళి సూరనను గూర్చియు విపులముగ వ్రాసిన బాగుగనుండియుండును.

3. మూడవయుగమునకు గ్రంథకర్త లొసంగిన పేరు వారి యాగ్రహమును వెల్లడించుచున్నది. పదునేడు, పదునెనిమిదవ శతాబ్దములయందు తారాశశాంకాది గ్రంథములు కొన్ని వెలువడినమాట నిజము. సద్గ్రంథములు ననేక

ములుగ వెలువడియున్నవి. రఘునాథ భూపాలుని రామాయణ, వాల్మీకిచరిత్రములును, వేంకటకవి విజయవిలాస సారంగధర చరిత్రములును, కూచిమంచి తిమ్మకవి విరచితములగు రాజశేఖర విలాసాదిగ్రంథములును, అబ్బయామాత్యుని కవిరాజమనోరంజనము, మొదలగునవి పెద్దనాదుల కృతులతో సరిగాక పోయినను, ఆయాశతాబ్దములయందు నాంధ్రవాఙ్మయ మభివృద్ధిగాంచినటుల నొక్కి వక్కాణించుచున్నవి

4 వైదికసాంప్రదాయము ననుసరించి పురాణయుగమునందు భాషాంతరీకరణము లొనర్పబడెననుట సరికాదు సంస్కృతవాఙ్మయము నందలి రామాయణాది మహాగ్రంథముల యందలి గౌరవమే భాషాంతరీకరణమునకు హేతువనియునట్టి భాషాంతరీకరణములు ప్రతిభాషయందును గలవనియు మాకు దోచుచున్నది.

5. ఈగ్రంథమువలన గావ్యకళాప్రపంచమున బాశ్చాత్యుల యభిప్రాయముల నాదర్శముగ గైకొనినచో నెట్టి ప్రమాదములకు మనము లోనగుదుమో విశదమగును. కావ్యప్రయోజనములును, కావ్యసాంప్రదాయములును హైందవపాశ్చాత్య సారస్వతముల భిన్నములుగ నున్నవి సంస్కృత సారస్వతమునందలి యాలంకారిక గ్రంథముల ననుసరించి యాంధ్రకవులు తమగ్రంథములను రచించి యున్నారు. కావ్యకళాప్రపంచము ప్రకృతి ననుగుణ్యముగ నుండవలయునా యను విషయము పాశ్చాత్యు లింకను జర్చించుచున్నారు.

ఆ గ్లమున నిట్టి గ్రంథమును రచించి తెనుగుభాషకు మహోపకారమొనర్చిన గ్రంథకర్తల నభినందించుచు ద్వితీయముద్రణమున నైన సహృదయులై వారి యభిప్రాయముల సవరింతురని తలంచుచు నింతటితో నీవిమర్శనమును విరమించుచున్నాము.

---

# బాలవ్యాకరణము.

[జాస్తి శ్రీరాములు చౌదరిగారు]

---

గతమాసము నాంధ్రసాహిత్య పరిషత్పత్త్రికయందు శ్రీయుత చంద్రాభట్ల రామమూర్తిగారు బాలవ్యాకరణము సంజ్ఞాపరిచ్ఛేదములోని తుదిదగు

"ఆర్య వ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు" అన్న సూత్రమును గూర్చి చర్చించి యొకచిన్నవ్యాసమును గల్పించివ్రాసిరి. ఆవ్యాసమును జదివినపయి *పెద్దల నుండి వినికిచే నాకుఁ దోఁచిన యభిప్రాయభేదములనే తన్మూలకముగ నాంధ్రలోకమునకును రామమూర్తి శాస్త్రిగారికిని దెలియవ్రాసి కొనుచున్నాఁడను.

1 రామమూర్తిగారు వారి వ్యాసమున సూరిగారు నింద్యగ్రామ్యము లని యుదాహరణ మిచ్చిన "కలఁకఁరుఁ" మొదలగు శబ్దములు గ్రామ్యములు కావని సాధించుచు విమర్శింపక వానిని గ్రామ్యములనుగాఁ జెప్పి నన్నయ భట్టునకుఁ గళంకము తెచ్చి పెట్టెనని సూరినిపాధించిరి. సూరి కిది భావ్యము కాదనిరి.

కం. ఎఱుకని మొఱఁగక నిన్నున్
మఱకువ మాన్గొన్నతప్పు మఱవుము నాకుం
గఱకంఠా క్షమియింపుము
సఱి నెవ్వరి కెఱుఁగఁ దగునె నీచరితంబుల్.

అను నన్నయ భారతపద్యములోని ప్రయోగము "గరకంఠా" యని కాని "కఱకంఠా" యని కాదనియు నెవరో యిటీవల లఘ్వలఘువుల మైత్రి కూడ దనువారు దీనిని కఱకంఠశబ్దములోనికి మార్చి రనియు, సూరిగారు దీనిని విమర్శింపకొనక "కఱకఁరు"డని యునింద్యగ్రామ్యముగాఁ జెప్పిరనియు, సూరిగా రిట్లు చెప్పుటకు "యవలలు లఘ్వలఘువులు మైత్రిం బొరయు రేఫంబులు పొరయవు" అను తనసూత్రమున రేఫద్వయమునకు మైత్రిలేదని చెప్పుటయే కారణమనియు, వారువ్రాసిన వ్రాఁతల కభిప్రాయములు.

"యవలలు లఘ్వలఘువులు మైత్రింబొరయు, రేఫంబులుపొరయవు" అనుసూత్రము సూరిగారు క్రొత్తగాసృష్టించినదికాదు. బాలవ్యాకరణ మాంధ్రశబ్దచింతామణి, యధర్వణకారికలకును దెనుఁగువివరణము. చింతామణిలో "నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యంస్యాత్" అను కారిక యొకటి గలదు. దానినే సూరిగారు తెనుఁగుననువదించిరి. శబ్దచింతామణి నన్నయభట్టీయమేగదా? లఘ్వలఘువులకు రేఫములకు వైధర్మ్యమునిత్యమ

* నా వ్యాసకుసుమమునకు మద్గురువర్యులగు మహారాజశ్రీ వజ్ఝల చినసీతా రామశాస్త్రి గారి నోట్సు వృంతము నొసఁగెను.

ని సూత్రించుకొన్న నన్నపార్యుఁడు తనకవితయందు రేఫ ఱకారములొకప్రాసమునఁ జేరుపనిచ్చగించునా ?

మఱియు "లాక్షణికు లెవ్వరో లఘ్వలఘురేఫములకు మైత్రి కూడదను వారు దీనిని కఱకంఠశబ్దములోనికి మార్చి వాడుకలోనికిఁ దెచ్చియుందురు" అని యొకవాక్యము వ్రాసిరి. రేఫఱకారములకుఁ బ్రాసములంగీకరింపని లాక్షణికులీకందపద్యములోని గరకంఠశబ్దమును దిద్దిరని చెప్పినపుడు ముందు రామమూర్తిగా రుదాహరించు "అవసరజ్ఞుఁడయి వ్యాసుఁడేతెంచె ............ అనునక్కరపద్యమున ప, వ, ప్రాసము నంగీకరింపని లాక్షణికులు కపిలగడ్డము" మొదలగు రూపములను కవిలగడ్డముగా దిద్దియుందురని యేలచెప్పికొనఁగూడదు. వారివాదమునకుఁ దగినట్లు వారు గిడ్డఁబాటుల నూహించిరి అంతియ కాని ఛంధఃకర్తలేమియు నీపద్యమును సవరించియుండలేదు. రేఫఱకారముల మైత్రి నన్నపార్యునకే యిష్టముగాదు. "రయోస్తునిత్యంస్యాత్" ని రేఫద్వయమునకు మైత్రి నిత్యము గాదని వ్యాకరణమున విధించియున్నాఁడు గనుక రామమూర్తిగారు చింతామణి నన్నయకృతము కాదని వాదించువారైన నన్నయ భారతభాగమున రేఫఱకారములకు నొకప్రాసమున మైత్రిగలిపిన వేఱొండు పద్యమును జూపుబాధ్యత వారియందున్నది. కాఁగా ఱకారప్రాసముతోఁ బ్రారంభింపఁబడిన పై కందపద్యమునందలి ప్రయోగము "కఱకంఠా" యనియేగాని రామమూర్తిగారూహించినటుల "గరకంఠా" యని కాదనియు సూరిగారు దీనిననింద్యగ్రామ్యముక్రింద నుదహరించుటలోఁ బ్రమాదము లేదనియు నాయభిప్రాయము.

మిశ్ర బహువ్రీహిగనుక నియ్యది గ్రామ్యమని బాలవ్యాకరణము తద్భవమగు దీనియందు సంస్కృతవర్ణ రకార ముండుటను గ్రామ్యమని ప్రౌఢవ్యాకరణము.

2 అక్కర. "అవసరజ్ఞుఁడయి వ్యాసుఁడేతెంచె నంతన త్తపసి
కపిలగడ్డంబును, గపిలజడలును, గపిలకన్నులును,
తపసియున్నవ నల్లనైనదీర్ఘపుఁ దనువునుజూచి
యమునిదకన్నుంగవ మొగిచి తెఱవకయుండె భయమున"

ఈపద్యమునఁగల "కపిలగడ్డము" మొదలగు రూపములవిషయమై రామమూర్తిగారు ప్రౌఢవ్యాకరణము ప్రోక్షినతోవనడిచిరి. కాఁగా వారియభి

దుపమింపవచ్చుఁ గృతులం
దుపనిషదుచితార్థసూక్తి యొనరుటవలనన్.

అను పద్యమును ప, వ, ప్రాసను జూపెట్టి యీ యభిప్రాయమును దృఢపరచుచున్నది.

మఱియు పైయక్షరపద్యమందుఁ దృతీయచరణమున నీ ప, వ, ప్రాస మొప్పవలసివచ్చినందుననే కవిప్రయుక్తముగు "తపసియున్నవు" అను పాఠమును 'తలినయున్నవ' యనిదిద్దిరి. 'తలినయున్నవ' యను పాఠములో నర్థమున సారస్యము చెడినది. ఈపాఠము చెప్పుకొనువారు 'తగియున్న స్త్రీ' యని కాని తగియున్నట్టియు, నల్లనైనట్టియు' నని కాని రెండువిధములుగా నర్థము చెప్పుకొందురు కావచ్చును. వీనిలో మొదటిపక్షమందు "కపిలగడ్డమును గపిలజడలును, గపిలకన్నులును, నల్లనైన దీర్ఘపుఁదనువును" అని వరుసనసముచ్చయములుగాఁ జెప్పుకొనివచ్చుచున్న కర్మలనడుమ "తలినయున్నవ" యను కర్తృపదప్రయోగముండుట నన్నయరచనకుఁ గ్రమము కాఁదగదు. "తలిన" యను దానికర్థము లేదు.

తగినట్టియు, నల్లనైనట్టియు, ననునర్థము చెప్పుకొనినట్లయిన నీపద్యమున నన్నయచూపించిన వ్యాసముని యొక్క భయంకరాకారము పోనేపోయినది. వ్యాసమహర్షి తగనట్టి వికృతరూపములో నుండెనుగాని తగినట్లుండలేదు. శిరమునకుఁ దగని జెడలు, మొగమునకుమించిన గడ్డము, పొడవునకుఁదగని సన్నమును గలిగి బీఱనరాలుదేఱిన తాతయ్యగారు పెద్దబూచివలె నాయువిదకుఁ గన్పడెను. కనుకనే భీతచిత్తయగు నామె మోడ్చినకనుదమ్ములను విప్పఁజాలకపోయెను. ఈసందర్భమున విమర్శింపఁగా "తలినయున్నవ" యనుపాఠమున స్వారస్యముచెడియుండినట్లు గాన్పించును. కనుక 'తపసియున్నవు' యన్న పాఠమే నన్నయప్రయుక్తమై యుండవచ్చును. కాఁగా ప, వ, ప్రాసమీ పద్యమునందే యొప్పుకొనకతప్పదు. నన్నయ "కపిలకన్నులు" మొదలగు ప్రయోగములనే ప్రయుక్తించియుండును. విమర్శకాగ్రగణ్యులైన సూరిగారింత వట్టను విచారించియు పైయక్షరపద్యములోని "కపిలగడ్డము" మొదలగువాని ననింద్యగ్రామ్యములుగా నుదహరించియుండరు రామమూర్తిశాస్త్రిగారు, దీని విషయమై వివరముగావ్రాసిన మహారాజశ్రీ వఝ్ఝల చినసీతారామశాస్త్రిగారి

'అక్కరలు' అను వ్యాసమును (April 1924 The Maharajah's College Magazine, Vizianagaram) అను పత్త్రికలోఁ జూడవేఁడుచున్నాను.

3 ఏగ్రంథమునందు చెప్పుటయు గాపరాక వ్యవహారమాత్రస్థితమగు 'పాన' మనునొక శబ్దమును సంగ్రహించి పానగోష్ఠము చెప్పుటకంటె బహుజనపల్లి సీతారామాచార్యులుగారు చెప్పినట్లు ప్రాణశబ్దభవమే ప్రాణగోష్ఠమని చెప్పుకొనుట యుక్తియుక్తమై యున్నది. సూరిగారికి దీని ననింద్యగ్రామ్యములలోఁ జేర్పవలసినంత యావశ్యకమేల వచ్చెనో కారణము గ్రహింపఁజాలము.

4. "కఱకరుఁడు" మొదలగు వానివలెనే యేదో యొకవిధముగా "జీవగఱ్ఱ" యను దానిని గూడ సాధింప "సూరిచే వ్యాకరణమున ప్రమాదమున నుదాహరింపఁబడిన" వని సూరిగారిని సాధించుటకు వీలయినది కాదు కాఁబోలు. రామమూర్తిశాస్త్రిగారు జీవగఱ్ఱ యను దానిని జల్లగఁ జాఱవిడిచి యూరకుండిరి.

5. విమర్శింపగా నాంధ్రవ్యాకరణములు ప్రయోగైకశరణ్యములై యుండుటం జేసి యేవిధముననైన మహాకవి ప్రయుక్తములకు సాధుత్వమును సూత్రించుట యుక్తముగాని ముందుగ గ్రామ్యలక్షణము చెప్పి పిమ్మటఁ దమకిష్టములగు ప్రయోగములకు ననింద్యగ్రామ్యతను జెప్పుట యాంధ్రలాక్షణికులకుఁ దగనిపని. అదియేమో కాని యాంధ్రలాక్షణికు లందఱును సంస్కృతవ్యాకరణముల ననుసరించి "శాస్త్ర ప్రయోగవచసోశ్శాస్త్రం బలవదుచ్యతే" అన్న ప్రకారము తమ లక్షణముల నడిపించిరి. కవిప్రయుక్తములే తమ లక్షణములకు దిక్కని తెలియరైరి. ఆమార్గమునే సూరిగారును ననుసరించిరి అంతియ గాని చంద్రాభట్ల రామమూర్తిగారు వ్రాసినటుల నన్నయభట్టు మొదలగు కవీశ్వరులకు, గళంకము వాటిల్లఁజేయుటకై "ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు" అను సూత్రమును సూరిగారు వ్రాసియుండలేదు

"గుణదోష విచారాయ స్వయమేవ మనీషిభిః"

ఓం శాంతిశ్శాంతిః.

# గ్రంథస్వీకారము.

1. కుమారాస్వా—సాపడె పవల—తేకుమళ్ళ రామచంద్రరావు గారిచే రచియింపబడినది. ఆంధ్రప్రచారిణీ గ్రంథమాలయందు 44 వ కుసుమము. వెల రు 1-8-0 వలయువారు ఆంధ్రప్రచారిణీ గ్రంథాలయము, పిఠాపురము అని వ్రాయవలయును

2 శ్రీమన్మహాభారత తాత్పర్యనిర్ణయభావసంగ్రహదీపిక- ప్రొద్దుటూరి నరసింగరావుగారిచే శ్రీమదానంద తీర్థభగవత్పాదాచార్య విరచితమగు శ్రీమన్మహాభారత తాత్పర్య నిర్ణయమును ననుసరించి శ్రీమద్రాఘవేంద్ర తీర్థులచే రచియింపబడిన భావసంగ్రహమును సంప్రదించు శ్లోకముల గ్రంథమునకాంధ్రభాష వ్రాయబడినదీపిక. వెల 1-0-0.

3. శ్రీరాఘవేంద్రస్తోత్రము శ్రీఅప్పణాచార్య విరచితము. ప్రొద్దుటూరి నరసింగరావుగారి టీకతో బ్రకటింపబడినది. వెల 4 అణాలు.

4 శ్రీరాఘవేంద్ర తీర్థగురుస్తుతి కదంబము. వెల 1-0-0.

5 శ్రీరామచారిత్రమంజరి. వెల 0-1-0.

6 శ్రీకృష్ణచారిత్రమంజరి వెల 0-2-0

7. బళ్ళారి మండలమునందలి పావనప్రదేశములు.

8 శ్రీసత్యబోధ తీర్థుల చరిత్ర

9 శ్రీపురందరదాసుల చరిత్ర.

10. శ్రీజయతీర్థ గురుచరిత్ర.

11. శ్రీకనకదాసుల చరిత్ర.

12. శ్రీజగన్నాథదాసుల చరిత్ర. పై 7-12 గ్రంథములు కృష్ణా జిల్లా రిజస్ట్రారుగారగు ప్రొద్దుటూరి నరసింగరావుగారిచే రచియింపబడినవి.

13. గీతాతాత్పర్యము. శ్రీమదానంద తీర్థవిరచితమగు భగవద్గీతా తాత్పర్య నిర్ణయమను గ్రంథము మధ్వశ్రీ యలమర్తి శ్రీనివాసరావుగారి తెలుగు ద్విపదతో బ్రకటింపబడినది.

14. శ్రీమద్భాగవతసారము ఇందు భాగవతసారమని దెలుపు నరువది శ్లోకములు యెలమర్తి శ్రీనివాసరావుగారి భాషాంతరీకరణముతో బ్రకటింపబడినవి. వెల 0-4-0.

శ్రీ

# పూరుషముఖ్యశతకము.

(ఉత్పలమాలావృత్తములు, రేఫప్రాసములు)

—॥ మంచెళ్ల కృష్ణకవి ॥—

శ్రీరమ యైనరుక్మిణికిఁ జిత్త మిగుర్ప మనోభిరామవి
స్తారవిభాశుభాంచదవతారముఁ దాల్చి హరీ యటంచు వే
మాఱు భజించుదాసజనమండలికోర్కె ఫలింపఁజేయు నే
పూరుషముఖ్యుఁ డాభువనపూజ్యుఁడు నాకుఁ బ్రసన్నుఁ డయ్యెడిన్. ౧

భూనిజగంబు లెల్లఁ దనబొజ్జఁ జెలంగ మెలంగు ధారుణీ
భారము మాన్పఁగాఁ దలఁచి భవ్యగుణోత్తర యైనదేవకీ
నీరరుహాక్షిగర్భమున నేర్పునఁ జొచ్చి వసించి పుట్టె నే
పూరుషముఖ్యుఁ డాభువనపూజ్యుఁడు నాకుఁ బ్రసన్నుఁ డయ్యెడిన్. ౨

ఆఱనిదీప్తితో జనన మందినయప్పుడె తల్లి శ్రీసహ
స్రారగదాదిలక్షణవిరాజిత మై పొలుపొందు మైష్ణవా
కారముఁ జూచి కావు మనఁ గా వచుచుం గపిగందు నొయ్యనే- పూ- 3

శౌరికి దేవకీసరసిజాతముఖీమణికిన్ జనించి యా
శౌరి యొసంగ నందుఁడు వ్రజంబున భార్యయుఁ దానుఁ బెంచినన్
శౌరిసమాఖ్యుఁ గాంచి వ్యధజాలఁ బితృద్వయి నుద్ధరించె నే-పూరుష- ౪

మేరదొఱంగఁ బొంగి విషమేమరవత్సజ యై సురారి పు
త్త్రేరఁగ వచ్చు నాపాలను దిండిపొలంతుక చన్నుఁబాలు క్రొ
వ్వారఁగ నాని దానిఁ దెగటార్చిన కైతవడింభకాఖ్యుఁ డే-పూరుష- ౫

వారిలు వీరిలుం జొరకు వా దగునంచు యశోద మాన్పఁగా
సారెకుఁ బీలిదండ కడు జాఱఁగ నవ్వుచు వెన్నకై వ్రజా
గారములం జరించె నయగారపునల్లనిముద్దుబాలుఁ డే-పూరుష- ౬

కారుణికత్వముం దెలియఁగా నమృతాశనకోటికి న్సుధా
సారము లీల నిచ్చి యతిసక్తత ప్రేపలెలోన గోపికా
వారగృహంబు లొంటు వెసఁ బాలును వెన్నలు ముచ్చిలింప నే-పూ- ౭

వారిజగేహకౌఁగిలియు వాసిగ వేదసమూహము న్నధా
వారిధి నందగేహము సుపర్వమునీశ్వరసంఘసన్మనో
వారిజపత్రము ల్నిజనివాసముగా విహరించుఁ బాయ కే-పూ- ౮
తోరపుఁగాంతి ముంగురులతో నళికస్థలి రావిరేక చె
న్నార దిగంబరాకృతి నుదంచితనూపురమేఖలాదిభూ
షారవ మొప్ప నందనిలయంబున లేఁగలఁ గట్టు బాలుఁ డే-పూ- ౯
వీర కుమార గుంపులది యొప్పుడు రచ్చల రవ్వసేయుఁ బె
ర్వారలయిండ్ల కేగి బలువాదులు దెత్తు వటంచు దాది వే
సారక లోలఁగట్టి చనఁ జయ్యన ముద్దులఁ గూలనీడ్చె నే-పూ- ౧౦
హారధరుండు గోపలలనానుతజారుఁడు నందగోష్ఠవి
స్ఫారకరీషలిప్తమృదుపాదసరోజుఁడు రాధికాంఘ్రిలా
క్షారసయుక్తభాస్వదలికస్థలుఁడు న్నవనీతచోరుఁ డే-పూ- ౧౧
స్మేరపుమోముతోఁ దళుకుఁ జెక్కుడి కావిమెఱుంగుమోవితోఁ
దోరపుఁగాకపక్షములతోఁ బులిగోరుల పిల్లగ్రోవితోఁ
గూరిమిఁ గోపబాలకులఁ గూడి మెలంగు యశోదపట్టి యే-పూ- ౧౨
సారవయస్కలైనవ్రజసారసగంధులచీర లన్నియు
న్వారివిహారవేళఁ బులినస్థలి ముచ్చిలి వారిసత్త్రపా
భారము చూఱగాఁ గొని శుభంబు లొసంగిన ధూర్తదేవుఁ డే-పూ- ౧౩
మారవికారము ల్గనక మాటికిమాటికిఁ గన్నుదోయి నిం
డారఁగ జూచి చూచి మది నారసి వేడుక ముద్దులాడు రా
ధారమణీఘనాధరసుధారస మాని చెలంగు బాలుఁ డే-పూరుష- ౧౪
నీరజసంభవుండు తననేర్పునఁ గ్రేపుల గోపబాలురన్
దూరము వైపరీత్యముగఁ దోడ్కొని వేచని దాఁచఁ దాఁ దదా
కారములం జరించి విధిగర్వము ఖర్వము చేయుమేటి యే-పూ- ౧౫
నీరదయోజ్జ్వలచ్ఛల దనేకతరంగమ్మృద గనాదము
స్త్రీటఁగఁ గాళియస్ఫటల నృత్యముసల్పి వడి న్మరుత్త్రిర
స్ఫారము మాన్పు శ్రీఘనకుచస్థలి పచ్చలపైఁడితాళి యే-పూ- ౧౬
మీఱినభక్తి జన్నమున మీఁదగునన్నము బ్రాహ్మణీచయం
బారఁగ వంచితాత్మవరలై కొని వచ్చి యొసంగఁ దోడియా

భీరులఁ దానునుం గుడిచి పేరుగ వాఁకి మోకుమిచ్చె నే-పూ- ౧౭

భూరినగం బనంగ వనభూస్థలియం దహిన్మై మహాగ్రపూ
త్కారము లిచ్చుదానవుని కంఠబిలంబునఁ జొచ్చి వానిశా
రీరము రెండుపాయ లొనరించి దయం బశుపింపుఁ గాచె నే-పూ- ౧౮

శారపత్రపంక్తి జాతరలు సల్పఁగ నేల తలంప వేల్పుతె
వ్వారలు తేరటంచుఁ దమవారికిఁ జెల్పి తదర్చనంబు ల
వ్వారిగఁ దా గ్రహించి సురవల్లభుపబ్బము మాన్పు వేలుపే-పూ- ౧౯

నీరదవాహనుండు నవనీరదముల్ వెసఁబంచి ప్రస్తరా
సారము గుర్వఁజేయఁ వ్రజసంఘము లాపసిపిండు నిల్వ నా
ధారముగాఁగ నొక్కకరతామరసంబున శైల మెత్తె నే-పూరు- ౨౦

ఘోరపుశాకలాశ్వమయి క్రోధముతో జితపాళి కేశి దా
మారుకొనంగ శైలబిలమధ్యముఁ జొచ్చు భుజంగమట్లు కే
ల్నోరిలో చొన్పి యాతని విలుంఠితదేహునిఁ జేసి పుచ్చె నే-పూ- ౨౧

ఓరమొగంబుతో సిగ మయూరకలాపముఁ జేర్చి పాదముల్
మాఱుపడంగ రంతులు చెలంగఁ ద్రిభంగిగ నిల్చి మాధురీ
పూరితవంశనాదమున భూతచయంబులఁ జొక్కఁజేయు నే-పూ- ౨౨

కారుమెఱుంగులట్లు వ్రజకాంతలు గొల్వఁగ నవ్యనీరదా
కారత వేణునిస్వనము గర్జలుగాఁ జెలరేఁగి రాసలీ
లారతి నొప్పెఁ దాపసకలాపితతుల్ ముదమంద బృంద నే-పూ- ౨౩

(శ్రీ) రజనీవరాననకుఁ జిత్తమొసంగక నందనంద నా
భీరకులాంగనాళి వలపించి నిజాత్మఁ దదీయసంగతుల్
గోరుచు మీఱి యెల్లపనులం దనుదానె యొనర్చుచుండు నే-పూ- ౨౪

మారవిభిజ్జటాపటలమండనమై శ్రుతిశేఖరాంతసీం
దూరవిలాసమైనపదతోయజపాళి లసత్కరీష మొ
ప్పారఁగ నందగోపకగృహాంబు పవిత్రముగాఁ జరించు నే పూ- ౨౫

సీరియుఁ దాను భోజపురిఁ జేరఁగఁ బోవుచుఁ ద్రోవ భావజా
తారిసరస్వతీరమణులైన నెఱుంగని విశ్వరూప మ
క్రూరునకు న్బయల్పఱిచి రూఢిగ వానిఁ గృతార్థుఁ జేసె నే-పూ- ౨౬

సౌరభచందనద్రవ మొసంగినఁ గైకొని కుబ్జ వక్రముం
దీఱిచి యంద మిచ్చి సముదీర్ణత నొప్ప ననేకగోపభా
మారతులం జెలంగియును మానక దాని కభీష్ట మిచ్చె నే పూ- ౨౭
పౌరుషలీలఁ గంసునకు భారముగా మఘుపూజనాద్యలం
కారశరాసనం బచటి కావలిరాక్షసకోటి నాయుధా
గారముతోడఁ గూడఁ గడికండములై ధరరాలఁ జేసె నే-పూ- ౨౮
ఘోరవమున్ మహోగ్రహరి బిట్టుగఁ దా విదళించుమాడ్కిఁ జా
ణూరు విశాలకంటకతనూరుహబాహులఁ బట్టి వానిఁ జా
నూరులు నూఱుమాఱు లిరవొందఁగఁ ద్రిప్పి గతాసుఁ జేసె నే-పూ- ౨౯
పేరుగలట్టి మల్లులను బీడితగాత్రులఁ జేసి జెట్టినే
ర్పేరుపడంగఁ గంసుఁ జమునింటికిఁ జేరిచి యుగ్రసేను గో
త్రారమణీమణీశు మథురాపురిఁ బూజ్యునిఁ జేసి నిల్పె నే-పూ- ౩౦
సీరియుఁ దానునుం గురుఁడు చెప్పిన వొప్ప సమస్తసత్కళల్
నేరిచి తత్తనూజుఁడు వినిర్గతుఁడై సమవర్తిమందిర
ద్వారవిహారి యైన గురుదక్షిణగా నిడె వానిఁ దెచ్చి యే-పూ- ౩౧
చోరతఁ బాశికింకరుఁడు సువ్రతనిష్ఠమెయిం బయోనిధి
న్వారి మునుంగుచుండుతఱి నందుని నెత్తుక పోవ నీరపా
గారముఁ జొచ్చి తండ్రిఁ గడకం గొని చేర్చె నిజవ్రజంబు నే పూ- ౩౨
కేరుచు బాలురం గలసి క్రేపులఁ గాయఁగ డాయ యామునా
తీరవనాంతసంజనిత తీవ్రదవానల మాని యప్పుడా
భీరకుమారవత్సచయభీతి హరించిన గోపబాలుఁ డే-పూ- ౩౩
తీరగుమాటల న్వలపుఁ దెల్పెడి సీటుల నవ్వ్యటాలయొ
య్యారపుఁజూపుల న్మెఱుఁగుటందపురూపుల గోపికామన
స్సారసముల్ హరించి సుమసాయకకేలిని దేల్చు దేవుఁ డే-పూ- ౩౪
సూరసుతాధునీపులినసుస్థలుల న్మురళీరవంబుచే
సూరెల వల్లవాంగనలు సొక్కఁగ బంధురబంధుసజ్జలన్
వారలఁ బ్రీతిఁ దేల్చు యదువంశసుధాబ్ధిసుధామయూఖుఁ డే- పూ ౩౫
ఆరయ మాళికల్పితసుమాగతగాఢమదాళిపాళి ఝం
కారములం గలంగి పసిగాపునెలంతల జిగ్గుపయ్యెదల్

జాఱఁగఁ గౌఁగిలించినఁ గుచంబు లురంబున నొత్తుధూర్తుఁడే-పూ- ౩౬

సూరము కాంతకాంతిసొగసుం గని మోహమదాంధకారముం
గారుకొనంగ రాధ బిగికౌఁగిటఁ జేర్చినఁ దత్కుచాంతకా
శ్మీరరసాంకమైన యెదచేఁ గర మొప్పి తదిచ్ఛదీర్చు నే-పూ- ౩౭

నేరక రుక్మి రుక్మిణిని నిక్కము చైద్యుని కిత్తు నన్న న
వ్వారిజనేత్ర చెప్పి పనుప న్విని పోయి జరాసుతాదులం
బాఱఁగఁ దోలి రాక్షసవివాహమునం గొని తెచ్చి వచ్చె నే-పూ- ౩౮

నేరము లేమిఁ దన్నొదవు నిందల నీఁగఁగ జాంబవంతునిం
జేరి శమంతకంబుఁ గొని చెచ్చెర నాతని బాహుగర్వవి
స్ఫారము మాన్పి తత్తనయ జాంబవతీయువతి న్వరించె నే-పూ- ౩౯

ఊరక సత్యతండ్రి యహితోక్తులు పల్కి నిజాత్మజం బ్రభో
దారశమంతకంబు వరదక్షిణగా హితుఁడై యొసంగ స
త్యారమణిం గరగ్రహణమై మణిఁ గ్రమ్మఱ మామ కిచ్చె నే-పూ- ౪౦

వారువ మెక్కి ఫల్గునుఁడు వన్యరతిం జనుదేర యామునా
తీరముఁ జేరి తత్పులినదేశమున న్విహరించు మోహనా
కారఁ బతంగకన్యఁ గని కైకొని వచ్చి వివాహమయ్యె నే-పూ- ౪౧

వీఱిఁడి యైన విందుఁ డనువిందుఁడుఁ జెల్లెలి మిత్రవింద గాం
ధారితనూజుఁ డెంతయు ముదంబునఁ బొంద స్వయంవరంబు చే
కూరఁగఁ జేసినంత నృపకోటులు చూడ గ్రహించెఁ గన్య నే-పూ- ౪౨

కూరిమిఁ గూఁతునుద్వహము కోసలనాథుఁ డొనర్పఁ బూనఁ గా
ఘోరవృషంబు లేడిటిని గొంకక నొక్కటఁ గట్టి యాడ్చి నా
నారిపుసంఘము ల్బెగడ నాగ్నజితిం గొని పెండ్లియాడె నే-పూ- ౪౩

వైరులు తల్లడిల్ల సురవర్యముఖామరు లెల్లఁ జూచి వి
స్మేరమనస్కులై పొగడ మేనమఱందలి భద్ర సద్గుణో
దారసముద్ర భద్రనయతత్పరుఁడై యుపయామ మయ్యె నే-పూ- ౪౪

వీరికసాధ్యమై తనర నిచ్చ నొనర్చినమత్స్యయంత్రముం
జేరి పగిల్చి వైరులు నశింపుచుఁ బైకొనఁ బోరి పోరిలోఁ
బాఱఁగఁ జేసి మద్రపతిబాలిక లక్షణతోడఁ గూడె నే-పూ- ౪౫

వారనిపర్వతాస్త్రజనవహ్నిసమీరణదుర్గము ల్గదా
వారితశస్త్రచక్రముల వాలునఁ బాశముల౯ హరించి బ్రం
దారకబృందము ల్కదిని నందముఁ బొంద మురు న్వధించె నే-పూ- ౮౬
వీరరసోగ్రమైన పరవీరచమూచయముల్ శతఘ్నిచే
దారుణవేదనం బఱపి ధారుణిపుత్త్రు శిరంబు ద్రుంచి మే
లారసి కర్ణకుండలము లాయదితీసతి కిచ్చె భక్తి నే-పూ- ౮౭
శౌరగృహంబుల న్మరులు గందెడు నూఱుపదాఱువేలు శృం
గారవిలాస లైననృపకన్యల కందఱ కన్నిరూపులై
కోరిన యొక్క లగ్నమునఁ గూరిమి మీఱఁ బరిగ్రహించె నే-పూ- ౮౮
పారిషదాళితో హరుని భండనభూమి జయించి గర్వవి
స్తారగుఁ డైన బాణదనుజప్రభుఁ జంపఁగ రామిఁ జేసి రెం
డీరును దక్కఁ జేతులు వెయి దునుమాడి మదం బడంచె నే-పూ- ౮౯
భారపుగాండివంబుఁ గొని పాండుసుతుండును దోడుగా సునా
సీరునిఁ ద్రోలి ఖాండవమజీర్ణగదాతురుఁ డైన వహ్ని కా
హారము సేసి శార్ఙ్గకమయూహుల నాఱ్వురఁ గాచి పుచ్చె నే-పూ- ౯౦
నారదదత్త కల్పసుమనస్సును భోజతనూజ కిచ్చి దు
ర్వారజలాఢ్యులైన సురవారముతోడి సురేంద్రు నోర్చి మం
దారముఁ దెచ్చి సత్యకు ముదం బొదవ౯ గృహసీమ నాటె నే-పూ-౯౧
దూఱెడువేడ్కతో ననిన దుర్ణయభావల భోజకన్యక
న్నీ రొలుకంగ మూర్ఛిలిన నేర్పునఁ గౌఁగిటఁ గ్రుచ్చి పాన్పుపైఁ
జేరిచి సుప్రియోక్తులు వచించి ప్రియం బ్రమదాబ్ధిఁ దేల్చె నే-పూ- ౯౨
ద్వారకయందు నారతము వైదికలౌకికకర్మము ల్గరం
బారసి భోజకన్య మొదలైన పురంధ్రులయిండ్ల నిచ్చ నం
సారిబలెన్నటించె శితసర్వఖలప్రతివాది యాచు నే-పూ- ౯౩
ఉ. వారని సత్కళాప్తి దలఁప౯ ద్విజరాజన నొప్పి చండభే
నారచితార్తయాకువలయవ్యథమాన్పు రథాంగమత్తసం
హారి విధుండు నా యదుకులామృతకంధి జనించి చండభే
నారచితార్త యా కువలయవ్యథ మాన్చు విధుస్వరూపుఁ డే-పూ- ౯౪

వారివిహీనకూపమున వారక యూసరవెల్లి మేనితో
ఘోరవిపత్పరంపరలఁ గుందెడి యానృగరాజుపాపముల్
సీఱుగఁజేసి వానికి వినిర్మలనాకసుఖంబొసంగె నే-పూ- ౫౫
కోరి పదాఱువేల్పడుచుఁగొమ్మల నేలిన వింత చూడఁగా
నారదుఁ డేవధూటిసదనంబున కేగిన నచ్చటచ్చట
న్వారక నిత్యకృత్యముల వర్తిలి తద్విచికిత్సఁ దీర్చె నే-పూ- ౫౬
తేరుల నొంచి వాజుల వధించి గజావలిఁ ద్రుంచి సేనలం
జేరి శరాలి నించి తనచిహ్నల నొప్పెడి పౌండ్రభూపతిన్
సారథిరథ్యయుక్తముగఁ జక్రహతిం దలద్రెంచి మించె నే పూ- ౫౭
సారె జనించినప్పుడె వెస న్మృతినొంది వికుంరధామముం
జేరుకుశస్థలాగ్రభవశేఖరుసూనులఁ దెచ్చి యిచ్చి పెం
పార శతారధారిసుతుప్రాణము గాచినకీర్తిశాలి యే-పూ- ౫౮
మారుతదేవుఁ డగ్ని ననమానబలాఢ్యునిఁ జేసి కాననం
బేరుచులీల వాసవి నహీనపరాక్రమసత్త్వుఁ జేసి పెం
పారిన ధార్తరాష్ట్రకుల మంతయు నీఱయిపోవఁ జేసె నే-పూ- ౫౯
పౌరవపాండవేయులకుఁ బాటిగ సంధి యొనర్ప నేగి యా
సౌరనదీజరాజగురుసద్మమునందు భుజింపఁబోక స
త్కారమెలర్పఁగా విదురధామమునందుఁ గృపన్ భుజించె నే-పూ- ౬౦
ఘోరతరాజిఁ జాకడిచికుంభుని హంసుఁ డసాధ్యులైనచోఁ
గారులు చెప్పి పంచి మదిగందిభ్రమింపఁగఁ జేసి నేర్పుచే
వారల నిర్వురన్ యమనివాసనివాసులుగాఁగఁ జేసె నే-పూ- ౬౧
ఓరెపు నెవ్వ నెవ్వగల నొందుకుచేలుఁడు చేలకొంగునం
గూటిది తెచ్చినట్టి యడుకుల్పిడికెండు భుజించి వానినిం
డారిన భాగధేయమున యక్షసమానునిఁగాఁగఁ జేసె నే-పూ- ౬౨
ఘోరముపూని విఘ్నములు వాయఁగఁ జేసి తగం గరంబునన్
శ్రీరమణీయకంబు నయి చెల్వగు ధర్మజు సుప్రతంబునీ
డేఱఁగ రాజసూయము కడింది ప్రశస్తి సమాప్తిచేసె నే-పూ- ౩౬
మాగుతపాపదేశమున మాగధు గీటడఁగించి కోరికల్
దీరఁగ వానిపుత్త్రు సహదేవుని రాజ్యమునందు నిల్పి త

త్తారసనివేశబద్ధు లగు ధాత్రిపుల న్విడిపించి పుచ్చె నే-పూ- ౬౪
సైరణ మేనయత్త యగుసాత్వతి కిచ్చిన మాటఁ దీర్చి పెన్
దూఱులు వల్కి రాజసభఁ ద్రుళ్ళినచైద్యుని నోర్చి తత్తను
స్ఫారకతేజ మప్పుడు వెస న్నిజదేహము నందుఁ జేర్చె నే-పూ- ౬౫
కౌరవుఁ డల్పబుద్ధిఁ దనుఁగాజ్యవెట్టఁ దలంచు టాత్మము
న్నారసి విశ్వరూపము సభాంతరమందునఁ జూపి తత్సభా
సూరిజనాళి కెంతయును జూడ్కులపండువుగా నొనర్చె నే-పూ- ౬౬
గౌరవ మేది కౌరవులు కష్టపుఁబాటు లనేకభంగులన్
సారెకుఁ జేయఁ దత్తరిసంజ్ఞల నెప్పుడుఁ బాండవేయులం
జేరఁగనీక సౌఖ్యములఁ జేర్చిన దీనసుపర్వశాఖి యే పూ ౬౭
క్రూరమనస్కులై కురువరుల్ సభఁ బెట్టిన భంగపాటుచే
నారట మంది రక్షక దయాజలధీ యని యాజ్ఞసేని వే
చీరినఁ జీర లక్షయము చేసి సతీమణి మానమాఁగె నే-పూ- ౬౮
పోరునకుం గడంగునెడ బుద్ధిగలంగినకవ్వడి న్మహా
దారత సాంఖ్యసోపనిషదర్థసుయోగవిచారతత్త్వవి
ద్యారతచిత్తుఁ జేసి సమరావనికిం బురికొల్పెఁ దొల్త నే-పూ- ౬౯
భారతయుద్ధభూస్థలి సుపర్వనదీసుతుఁ డేయు సాయకా
సారము చేత నొచ్చి నిజచక్రముఁ గైకొని ధూర్తవృత్తిచేఁ
గేరుచు భీష్ముపై కుఱికెఁ గ్రీడి ప్రతిజ్ఞను నిల్ప నిల్వకే-పూ- ౭౦
పోరను సైంధవుం దునుమఁ బూనిన యానరుపూన్కిఁ దీర్పఁగాఁ
గోరి యతండు కట్టెదుటిగుంపులఁ గూలఁగ నేయు కోలల
వ్వారిగఁబోవుచో వెనుకవారలఁ దాఁక రథంబుఁదోలె నే-పూ- ౭౧
కౌరవసేనతోఁ బెనఁగి గాసిలుసాత్యకి సోమదత్తిచే
ధీరత వాసియుండ సొరిది న్మఱిఁదిం బురికొల్పి వైరిదో
స్సారమడంగఁజేసి యనుజన్ముని బాధ దొలంగఁద్రోచె నే-పూ- ౭౨
భారవి ద్రోణి యేయు శరభావ మెఱుంగక యర్జునాదులుం
బోరుటకై కడంగ హితబుద్ధులు సెప్పి దురంబు మాన్పి సా
యారిని దేరుడాసి ధరమీఁదికిఁ దీసి జితారిఁ జేసె నే
పూరుషముఖ్యుఁ డాభువనపూజ్యుఁడు నాకుఁ బ్రసన్నుఁ డయ్యెడిన్ ౭౩

సారికిఁ బోర నోడి యమశక్రసుతుల్ విపరీతభావలన్
వారిలో వారు పోరిన విపజ్జలధిం బడనీక నీతివా
గ్వారసుయానపాత్రమున బావమఱందుల నుద్ధరించె నే-పూ- ౨౪
నారసముల్వరు ల్తరువు నాటఁగ నేయు నటత్తురంగరిం
ఖారజ మెంతయుం బయిఁగప్ప జయంబు యశంబుఁ గ్రీడికిం
గూయుచుబుద్ధి సారె పురికొల్పుచుఁ బోరనుఁ దేరుదోలె నే-పూ- ౨౫
కేరళమాళవాధిపులు క్రీడిఁ దన్నోకపెట్టఁ గాలుఁ జే
యారుపనీక పైఁబడినయప్పుడు పేరెలుఁగిచ్చి వాసవిన్
ధీరునిఁజేసి తచ్ఛరతతిం బరవీరులఁ ద్రుంపఁ జేసె నే-పూ- ౨౬
ధారుణిపౌత్త్రుఁ డైనభగదత్తుఁడు వైచిన వైష్ణవాస్త్ర మే
తేర భరింపలేఁ డనెడితేకువఁ బార్థునిఁ దాఁకనీక తాఁ
బేరెద దానిఁదాల్చె వనభృద్భరచంచలలీల నాజి నే-పూ- ౨౭
వారిజబాంధవాత్మజుఁ డవారితసర్వశరంబుచే సునా
సీరజుఁ జంపఁగోరి గళసీమ పయిన్ గుఱిచేసి యేయఁ దాఁ
దే రయిదంగుళంబులు క్షితిం జొరఁజొన్పి మఱందిఁగాచె నే-పూ- ౨౮
ధీరత నాంబికేయు మది తెంపుఁ దలంచి యయోమయంబు గా
మారుతిరూపమర్చి ప్రతిమం గొని రాజుకు మ్రొక్కఁజేసి త
త్క్రూరత యెల్లలోకములకుం దెలియన్ దయ భీముఁ బ్రోచె నే-పూ- ౨౯
పాఱు డపాండవం బనుచు బ్రహ్మశిరశ్శర మేసి యుత్తరా
వారిజనేత్రగర్భగతబాలుఁ గలంపఁ దదీయవేదనా
భారము మాన్పి సత్కరుణఁ బాండవవంశము ధాత్రి నిల్పె నే-పూ- ౩౦
కూరలుఁ గాయలుం గుడిచి ఘోరమృగాటవిఁ గష్టదుర్దశం
గూరిన ధర్మనందనునకుం దయఁ గూర్చి రణంబునం జయ
శ్రీ రహినిచ్చి ధాత్రి కభిషిక్తునిఁ జేసిన సౌఖ్యదాయి యే-పూ- ౩౧
ఘోరము పోరిదన్ గునిసియాడ ముఖాబ్జమునన్ శ్రమాంబువుల్
జేఱఁగఁ గుండలంబులు చలింప మహాజి సురేంద్రసూతికిన్
సారథివై తురంగపటుసారగతిక్రియ లేర్పఱచె నే-పూ- ౩౨
శూరుఁడు ద్రోణసూతి పితృశోకమునం గర మల్గి రాఁ జమూ
వారము దండ రాత్రి నిలువం జననీయక గొంతి సంతతిన్

దారకవృష్ణివీరసహితంబుగఁ గాసి దోలంగఁజేసె నే-పూ- ౧౩

చేరి నరుం బెనంగునెడ జిష్ణునిశక్తిని దోఁపనీక ప
ల్మాఱును సూతసూతిమతి మందముచేసి తదుగ్రశక్తిచేఁ
దూఱి నిశిన్ ఘటోత్కచుని దున్మఁగఁ జేసి కిరీటిఁ బ్రోచె నే-పూ- ౧౪

దారుణమౌ కిరీటిశరధారల నంగము నొవ్వఁగా నిరా
ధారతలంబునందు శరతల్పగతుం డగు భీష్ముఁ జేరి యి
చ్చారతి ధర్మజాదులకు జ్ఞానము దెల్ప ననుగ్రహించె నే-పూ- ౧౫

కూరుతు పక్షపాతమున గొంతితనూజుల కంచుఁ జాలఁ దన్
దూఱిన యయ్యుదంకుని మనోవ్యథదీరఁగఁ దత్త్వబోధన
స్ఫారవచస్సమూహముల సన్మతిఁ జేర్చి వరం బొసంగె నే-పూ- ౧౬

తీరని ప్రేమ మౌనిఁ దమిదీర సపర్య లొనర్చి పాయసా
హారము పెట్టి యాతఁడు రయంబున భీష్మకపుత్త్రి వాజగాఁ
దేరికిఁ గట్టి తోలినట తీరు సహించినశాంతమూర్తి యే పూ- ౧౭

సారససంభవాద్యమరసంఘము వేడ్కొన దంతవక్త్రదు
ష్టారిని కాయమానసమహాగదయై తగునగ్గదాహతిం
బోర వధించి యాత్మతనువుం దగ నొందఁగఁ జేసెఁ దేజ మే పూ- ౧౮

పారిషదాధిపుం డిడినపాశుపతాదిశరాలిచేత జం
భారి కశక్యమైనయమరారుల నోర్చి తదీయపీరము
న్నేరిమినక్కి నట్టి నరు నీవుగజోడుగఁ గూడియుండు నే-పూ- ౧౯

చోరగతిన్ శ్రుతుల్ గొనుచు సోమకదానవనాథుఁ డమ్మహా
వారిధి డాగియుండఁ గని వారిచరాకృతిఁ బూని తా నసా
ధారణలీలఁ గూల్చి విధాతకు వేదచయంబొసంగె నే-పూ- ౨౦

గౌరవ మొప్ప మందరనగప్రభుఁ గవ్వముగాఁగ వాసుకిన్
ఖైరవలీల నావరణపాశముఁ జేసి సురాసురుల్ సుధా
వారినిధి న్మథింపఁగ నవార్యధరంబు ధరించకూర్మ మే-పూ- ౨౧

ధారుణి వార్ధిలోన నిడి దర్పితుఁడైనహిరణ్యనేత్రు భూ
దారవరాకృతిం దునిమి దక్షిణశృంగముచే మహీతలో
ద్ధారణకేళి సల్పె జగదంతరమాత్మయశంబు నిండ నే-పూ- ౨౨

సారపుధావి స్తంభమున సంభవమై పటువిస్ఫురన్నఖాం
కూరరుచిచ్ఛట ల్వెలుఁగఁ గోణపనాయకు నవ్యమర్త్యకం
ఠీరవలీలఁ ద్రుంచి ప్రకటించి తదాత్మజుఁ బ్రేమఁ బ్రోచె నే-పూ- ౯౩
బీరముమాని మున్నుగఁ ద్రివిష్టపరక్షణమూల మైనకేల్
బోరున సాఁచి వామనునిపోల్కి బలీ ద్రు రసాతలంబునం
జేరఁగఁజేసె వజ్రికి శ్రీకరరాజ్యరమావిలాస మే-పూ- ౯౪
నేరెఁడుదీవి గల్గు ధరణీవరరాజిఁ గుఠారధారచే
నీరుపదొక్కమాఱు వధియించి పితృవ్రజముం బ్రమోదవి
స్తారమునొంద విప్రులకు సర్వధరాస్థలి దానమిచ్చె నే-పూ- ౯౫
ఆరవివంశమం దుదయమంది ధరాత్మజఁ బొంది తండ్రికై
కారడవందుఁ గుంది యెడగల్గనిపొందు కడిందివృక్షసం
చారులఁ జెంది పంక్తిముఖుఁ జక్కఁగఁ గొంది యశంబునొందె నే- ౯౬
సీరముఁ బట్టి మై నసితచేలము గట్టి ప్రలంబముఖ్యదే
వారులఁ గొట్టి సూర్యతనయారభసం బెకవెట్టి రేవతీ
భీరువుఁ జెట్టవట్టి మురభేదికిఁ దోడయినట్టి జెట్టి యే-పూ- ౯౭
సారపుమాయచేఁ ద్రిపురసారసలోచనలన్ సతీతతిన్
స్వైరిణివర్తన ల్గఱపి వధ్యులుగాని తదీశపంక్తి నీ
హారమయూఖమాలినయనాగ్నికిఁ ద్రోచిన సత్ప్రబుద్ధుఁడే-పూ- ౯౮
ఏరుపరింపరానియఘవృత్తుల సంకరవర్ణ మైనయీ
ధారుణిలీలఁ గాంచి యసిదాల్చి ఘనాశ్వము నెక్కి సత్కృతా
చారజనాళికి న్సుధ యొసంగి మదాంధులఁ దుమ్మకల్చి యే-పూ- ౯౯
సారవరాళికి న్సుధయొసంగిన నాఁటిమనోజ్ఞసత్కళా
పూరిత మైనయాభువనమోహనవేషముఁ జూపి శంభుని
న్మారలసన్నిశాతసుమమార్గణసంహతిఁ గాసిచేసె నే-పూ- ౧౦౦
క్షీరసముద్రమధ్యమునఁ జేరి వటచ్ఛదశయ్య యోగని
ద్రారతిఁ బద్మజాదిసురరాజి కగోచరమై మనీషివం
దారుమృకండుసూనున కుదారమనోరథసిద్ధిఁ జేసె నే-పూ- ౧౦౧
తారకనామమంత్రము ముదంబున సంతతభక్తితో హృదం
భోరుహకర్ణికాంతమునఁ బాఁముగనిల్పి జపించి దోషని

స్తారకుతా విభీషణ రసాధరజేశుల నాదరించె నే
పూరుషముఖ్యుఁ డాభువనపూజ్యుఁడు నాకుఁ బ్రసన్నుఁ డయ్యెడిన్. ౧౦౨
కారియ మొప్ప యుద్ధపురిఁ గన్గొని దుర్భవభూరిసాగరో
త్తారణకారణంబు లయి ధన్యత నొప్పు నిజాంఘ్రిపద్మముల్
చేరెడుత్రోవఁ జూపె సవిశేషతరోక్తు లుపన్యసించి యేపూ- ౧౦౩
భారతవర్ష మెల్ల నిజభర్తనుగూడి చరించి మానసాం
భోరుహమందు భక్తిఁ దగఁ బూజ లొనర్చిన దేవహూతి కిం
పారజనించి మించి కపిలాభిధుఁ డైతలి ధన్యఁ జేసె నే-పూ- ౧౦౪
హారినిజాంఘ్రిపద్మనిరతాతిశయైకనివాసవాహినీ
వారిఁ ద్రివిష్టపంబులను బావనమొందఁగఁ జేసి యు న్నగం
భీరముగా మఘాపహుఁ బవిత్రచరిత్రుని గా నొనర్చె నే-పూ- ౧౦౫
వారణలోకనాయకుఁ డవారణవారిచరంబుబాధ వే
సారుచు రక్షణార్థముగ సంస్తుతిఁ జేసిన యంతలో సహ
స్రారముచే జలగ్రహశిరంబొగిఁ ద్రుంచి గజేంద్రుఁ గాచె నే-పూ- ౧౦౬
వైరముచేత మోహమున వారనిభక్తిని బాంధవంబున
స్థితిన చైద్యముఖ్యధరణీతలనాయకగోపకన్యకా
వారణపాండవేయులఁ గృపామతితో సరిగాఁ దలంచె నే-పూ- ౧౦౭
మేరుశరాసనుండు తనమెచ్చులె దాఁపయి వచ్చె నంచు న
క్రూరతఁ బాయుచుండ వటురూపముఁ దాల్చి వృకాసురారి వా
చారచనాచమత్కృతి వెసం దెగటార్చి పురారిఁ బ్రోచె నే
పూరుషముఖ్యుఁ డాభువనపూజ్యుఁడు నాకుఁ బ్రసన్నుఁ డయ్యెడిన్. ౧౦౮
కోరి కుచేలుచేతి యటుకుల్ గొని తెందు భుజించిన ట్లొగిం
బేరుకొనంగఁ గృష్ణసుకవిప్రవరుండు రచించి భక్తిఁ బూఁ
జేయగ నిచ్చినట్టి రసవిభ్రమితోత్పలవృత్తపద్యముల్
నూఱును నెన్నదిం గడు ననుగ్రహబుద్ధిఁ బరిగ్రహించె నే
పూరుషముఖ్యుఁ డాభువనపూజ్యుఁడు నాకుఁ బ్రసన్నుఁ డయ్యెడిన్.

---



# భర్తృహరిసుభాషితములు.

నరసింగకవిప్రణీతము.

(కందపద్యములు.)

శ్రీరమణీశ గదాధర, వారిజభవవినుతచరణ వరము లొసఁగి న
న్గారిమి నేలు సుధాబ్ధివి,హారా వెల్లూరి వేంకటాచలరమణా.

దిక్కాలాద్యనవచ్ఛిన్న- అను శ్లోకమునకుఁ దెనుఁగు.

వినుతించెద దిక్కాలా, ద్యనవచ్ఛిన్నంబు శాంత మనుభవమాన్యం
బు ననంతముఁ జిత్తేజము, నసిశము వెల్లూరి వేంకటాచలరమణా.

## 1. నీతిశతకము.

—: ౧. మూర్ఖపద్ధతి. :—

బోద్ధారో మత్సరగ్రస్తాః- అను శ్లోకమునకు-

నరపతులు విభవమత్తు లి,తరు లజ్ఞులు మత్సరగులు తద్జ్ఞులు వినరె
వ్వారు మేన ఖిల మగు సుభా,షగయుఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౨

అజ్ఞస్సుఖమారాధ్యః—

తెలియనివారికి జ్ఞానము,గలవారికిఁ జెప్పవచ్చుఁగా కల్పజ్ఞా
నులఁ దెల్ప బ్రహ్మవశమే, యలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. 3

ప్రసహ్యమణిముద్ధరేత్—

చలదూర్మిజలధి నీఁ దహిఁ, దల విరివలెఁ దాల్ప నక్రదంతమణిఁ గొన
న్నలవడు మూర్ఖుఁ దెలుపరా, దలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ర

లభేతసికతాసుతైలమ్—

కుందేటికొమ్ము గొన నిసుకం దైలము గన మరీచికజలము గ్రోలం
బొందగు మూర్ఖుఁ దెలుపరా,దందురు వెల్లూరి వేంకటాచలరమణా. ౫

వ్యాళంబాలమృణాళ—

కరి బిసతంతువఁగట్టను, దిరిసెనవిరి మణినిమెదుపఁ దేనెఁ గడలి మా
ధురినిడ నగు మూర్ఖుఁ దెలుప, నరుదగు వెల్లూరి వేంకటాచలరమణా. ౬

స్వాయత్తమేకాంత —

తనవశ మజ్ఞానాచ్ఛా, దన మేకాంతహిత మజకృతము బుధసభ మం
డనమై మౌనం బజ్ఞుల, కనువగు వెల్లూరి వేంకటాచలరమణా ౭

యదాకించిత్ —

కరివలె మదమున నాతో, సరిలే రను దొలుత ఖలుఁడు సత్సంగతి గ
ర్వరుజ తొలఁగ నీచుఁడ నను, నరుదుగ వెల్లూరి వేంకటాచలరమణా ౮

క్రిమికులచితమ్ —

పురుగు లురలు దుర్గంధపు, ఖరపలలము మెసఁగుకుక్క కన దింద్రునిఁ దా
వెఱచున తుద్రుం డవమతి, కరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౯

శిరశ్శార్వమ్ —

దివినుండి భవునిజడల న, వి వలిమల నవి వలికడలి వే పడు గంగాం
బువులు పలుగతులు మూర్ధు న, డవళ్ళ వెల్లూరి వేంకటాచలరమణా. ౧౦

—: ౨ విద్వత్పద్ధతి :—

శాస్త్రోపస్కృత —

ఘనవిద్యఁ జెప్పి శిష్యుల, మనుచు గురులు లేమిఁజెంద మహిపతికాదవే
మణిగొల్ల వానికప్పిన, యనువున వెల్లూరి వేంకటాచలరమణా. ౧౨

హర్తుర్యాతి —

అసిశముఁ బొందగు దొంగకుఁ, గనుపడదు ఖిలంబుగాదు కాంతు లొసఁగు వి
ద్యను ధనముగల బుధువ కలు, గనువా వెల్లూరి వేంకటాచలరమణా. ౧౩

అధిగతపరమార్థాన్ —

బలువిద్యవారి కలుగఁగ, వలదు సిరులు తృణమువలెనె వారికి మదదం
తులకు బిసము లక్షములా, యలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౧౪

అ-భోజినీ —

నలువకుఁ గోపమువచ్చిన, కలహంసలఁ గమలవనము కడఁద్రోచుఁ బయో
జలభేదపు నేర్పణఁచునె, యలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౧౫

కేయూరాణి నభూషయన్తి —

ఘనవిద్య భూషణము చం, దన కేశాలంకృతాంగదములు సరులు మ
జ్జన మలరులు సొమ్ములు గా, వనువుగ వెల్లూరి వేంకటాచలరమణా. ౧౬

---

౧౧ వ శ్లోకము శక్యోవారయితుం- అనుదానికిఁ బద్యము మూలములో లేదు.

విద్యానామనరస్య—

గురునృపపూజ్యము దైవము, సరిభోగము కీర్తి సుఖమొసఁగు గుప్తధనం
బురువిద్యఁ జనువకను బసు, వరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౧౭

క్షాంతిశ్చేత్—

క్షమ జోడు, క్రో తొడవు కు,ద్వేమతుఁడు, జ్ఞాతియనలుండు, విద్యధనము, స
ర్పము ఖలుఁడు, సుకవితయె రాజ్యము శ్రీవెల్లూరి వేంకటాచలరమణా.

దాక్షిణ్యంస్వజనే—

అరిసాధుభృత్యనృపఖల, గురువిద్వత్సతుల జయసుగుణదయనయుని
ష్ఠురశమహితధౌర్త్యమ్ముల, నరయును వెల్లూరి వేంకటాచలరమణా ౧౯

జాడ్యం ధియో హరతి—

దురితమతి జాడ్యమణఁగును, జిరకీర్తి బహుమతి నిజము చేకుఱు జేత
స్స్ఫురిత మగును సత్సంగతి, నరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా ౨౦

జయంతితేసుకృతినః—

ఇలఁ బుణ్యవంతు లగునర, సుకీర్తిశరీరములకుఁ జొప్పడదంగాఁ
గలుగదు జరామరణభయ, మరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౨౧

—: ౩ శౌర్యపద్ధతి :—

క్షుత్క్షామోపి—

కరికుంభపలముఁ దిను హరి, జర నాఁకలిఁ గష్టపడి రుజను శిథిలుఁడై
చరమదశనైనఁ బులు దిన, నరుగునె వెల్లూరి వేంకటాచలరమణా. ౨౨

స్వల్పస్నాయువసా—

హరి మెకము లుడిగి కరిఁ దిను, నరపతియగు పసరమొముక నన్నాసించున్
నరుఁ డనురూపఫలమె కో, రరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౨౩

లాంగూలచాలన—

ధరఁ బొరలుఁ దోఁకఁ ద్రిప్పును, దర మాస్యముఁ జూపుఁ గుక్క తనతిండికినై
కరి ప్రార్థించినఁ గైకొను, నరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౨౪

పరివర్తిని సంసారే—

ధరపై సంసారులు నెందఱు పుట్టరు చావ రెవఁడు తనవంశంబున్
నెఱిఁ బ్రోచునతఁడు సార్థకుఁ, డరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౨౫

కుసుమస్తబకః—
అలరులగుత్తికిఁ బుణ్యాత్ములకు వనము మానవేంద్రముకుటస్థలముల్
తలఁప నివి రెండు పూజ్యము, లలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౨౬

సౌత్యన్యోపి—
గురుముఖసద్గ్రహములు నం, బరమున నుండంగ శీర్షమాత్రుండై భా
స్కరవిధుల రాహు పట్టుట, కరుదగు వెల్లూరి వేంకటాచలరమణా. ౨౭

వహతి భువనశ్రేణీ—
లోకముల శేషుఁ డాను, శ్లోకుం గూర్మంబు, వతని సూకరపతి, యా
శ్రీకరు నబ్ధి వహించు శు, భాకర వెల్లూరి వేంకటాచలరమణా. ౨౮

వరం ప్రాణోచ్ఛేదః—
బలరిపుపవిచే జనకుఁడు, వలిముల కొట్టువడఁ గొడుకు వారిధి దాఁగెన్
అలమైనాకునిమృతి మే, లలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౨౯

యదచేతనోపి—
తనపై రవి పద ముంచం, గ నచేతనమైన సూర్యకాంతము దామం
డు నొకఁ డలుగ ఘనుఁ డూరక, యుణఁగునె వెల్లూరి వేంకటాచలరమణా.

సింహశ్శిశురపి—
హరిడింభము చిన్నదైనా, కరికుంభము మీఁదఁ బడును గద శూరుల కి
ద్ధరఁ బ్రాయము హేతువుగా, దరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా ౩౧

—: ౪ అర్థపద్ధతి :—

జాతిర్యాతు రసాతలమ్—
కులశీలసుగుణశౌర్యా, బలములు వ్యర్థములు నేమి పని సల్పిన రం
జిల దర్థహీనునకు శుభ, మలరదు వెల్లూరి వేంకటాచలరమణా. ౩౨

యస్యాస్తివిత్తమ్—
ధనికుఁడె వక్త కులీనుఁడు, గుణి రూపరి సర్వశాస్త్రకోవిదుఁ డవనీ
జను లర్థమాత్రముం జెద, రనువుగ వెల్లూరి వేంకటాచలరమణా. * ౩౩

పరిక్షీణఃకశ్చిత్—
తొలుత దరిద్రుఁడు కలమన్ములఁ జేరెఁడు గోరుఁ బిదప భువిఁ దృణముగఁ ద
ల్చు లఘులఘుత లర్థమె న, ల్పరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౩౪

*ఇక్కడ— దౌర్మంత్ర్యాన్నృపతిః— దానంభోగో నాశః అను శ్లోకములకుఁ బద్యములు లేవు.

| ధాతువు. | | సంస్కృతార్థము. | తెనుఁగర్థము |
|---|---|---|---|
| మాఱ్చు<br>మాఱ్పు | స | మారణే | చంపుట |
| మాఱు | అ | విజృంభణే | విజృంభించుట |
| మాఱుపడు | అ | అదృశ్యతాయాం | అదృశ్యమవుట |
| మాఱుకొను | స | అభ్యుత్థానే | ఎదిరించుట |
| మాలు | స | త్యాగే | త్యజించుట-సిగ్గుమాలెనని |
| మాలుగు | అ | అలసతాయాం | అలసుండవుట |
| మ్రింగు<br>మింగు | స | కబళనే | కబళించుట |
| మిగులు | అ | శేషే | శేషించుట |
| మించు | స | అతిశాయనే | అతిశయించుట |
| మిటకరించు | అ | అప్రతిపత్త్యాతూష్ణీమవస్థానే | ఏమియుందోఁపక యూరకయుండుట |
| మిటారించు | అ | శృంగారవికారే | కులుకుట |
| మిటమిటలాడు | అ | పునఃపునరుత్పతనే | మాటిమాటికి నెగయుట |
| మిట్టు<br>మిట్టిపడు<br>మిడియు<br>మిడిసిపడు | అ | హఠాదుత్పతనే | ప్రసభముగా నెగయుట |
| మిడుకు | అ | వ్యసనే | వ్యసనపడుట |
| మిడు | స | ద్రవద్రవ్యస్య ఈషత్పరివేషణే | నెయ్యిమొదలైనదానిఁ గొంచెముగా వడ్డించుట |
| మిణుకరించు | అ | అప్రతిపత్త్యాతూష్ణీమవస్థానే | ఏమియుఁదోఁపక యూరక యుండుట |
| మినమినలాడు<br>మిలమిలలాడు<br>మిసమిసలాడు | అ | మసృణకాంతౌ | మెఱుఁగుకాంతి గలదవుట |
| మీటు | స | నిరసనే | చిమ్ముట |
| | | వీణాగుణవాదనేచ | వీణతంతులవాయించుట |

| ధాతువు | | సంస్కృతార్థము. | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| మీఱు | స | అతిక్రమణే | అతిక్రమించుట |
| ముక్కు | అ | శ్వాసాధఃప్రాపణే | ఊపిరి క్రిందికిఁబోఁజేయుట |
| | | ధాన్యాదిషు ప్రాచీనతాదోషేచ | ధాన్యాదులు ప్రాఁతగిలి చెడిపోవుట |
| ముగ్గు | అ | ధాన్యాదిషు ప్రాచీనతాదోషే | ధాన్యాదులు ప్రాఁతగిలి చెడిపోవుట |
| ముగియు | అ | సమాప్తౌ | సమాప్తమగుట |
| ముచ్చిలు<br>ముచ్చిలించు | స | స్తేయే | దొంగిలించుట |
| ముంచుకొను | స | ఆవరణే | ఆవరించుట |
| | | ఉంభనేచ | బావి మొదలైన వానిలోఁ బాత్రను నీళ్ళతోఁ బూరించుట |
| ముట్టు | స | స్పర్శే | తాఁకుట |
| | | అవరోధనే | ముట్టడివేయుట |
| | | పరప్రేషితార్థలాభేచ | ఒకఁడు పంపిన సొమ్ము లబ్ధమవుట |
| ముట్టించు | స | స్పర్శే | స్పృశింపఁజేయుట |
| | | వహ్నిసంయోజనేచ | నిప్పు తగిలించుట |
| ముడు | స | గ్రంధికరణే | ముడివేయుట |
| | | ఆకుంచనే | ఆకుంచనము సేయుట |
| | | పుష్పాదిధారణేచ | పూలు మొదలైన వానిని ధరించుట |
| ముండమోయు | అ | వైధవ్యప్రాప్తౌ | వైధవ్యమును బొందుట |
| ముడుఁగు<br>ముణుఁగు | అ | మజ్జనే | మగ్నుండవుట |
| ముణుచు | స | ఆకుంచనే | ఆకుంచనముసేయుట |
| ముదియు | అ | జడపశ్వాదీనాం స్థవిరీభావే | చెట్లు, ఆవు మొదలైనవి ముదిమి పొందుట |
| ముదురు | అ | వృక్షాదీనాం స్థవిరీభావే | చెట్టు మొదలైనవి ముదిమిపొందుట |
| ముదలకించు | స | జ్ఞాపనే | ఎచ్చరించుట |

| ధాతువు. | | సంస్కృతార్థము. | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| మునుఁగు | అ | మజ్జనే | మగ్నుండవుట |
| మునుకొను | అ | ప్రథమభావే | ముందుమించుట |
| మువ్మడించు | అ | త్రిగుణీభావే | త్రిగుణమవుట |
| | స | త్రిగుణీకరణేచ | త్రిగుణము సేయుట |
| ముఱుగు | అ | ద్రవశైథిల్యే | కుళ్ళిపోవుట |
| ముఱముఱలాడు | అ | కోపవికారే | కోపవికారముగానుండుట |
| ముఱియు | అ | శృంగార చేష్టాయాం | కులుకుట |
| ముఱియు | స | శకలీకరణే | తునియలుసేయుట |
| ముసరు<br>ముసురు<br>మూఁగు | స | పరివేష్టనే | అంతటఁ జుట్టుకొనుట |
| ముసించు | అ | బుద్ధిమోహే | బుద్ధి మోసపోవుట |
| మూచూచు(గ్రా) | స | ఆఘ్రాణే | ఆఘ్రాణించుట |
| మూడు | అ | అంతకాలప్రాప్తౌ | అంతకాలము ప్రాప్తమౌట |
| మూదలించు | స | జ్ఞాపనే | ఎచ్చరించుట |
| మూయు | స | పిధానే | మూఁతవేయుట |
| మూర్కొను | స | ఆఘ్రాణే | ఆఘ్రాణించుట |
| మూలుగు | అ | కుంథనే | కుంథనము సేయుట |
| మెక్కు | స | భక్షణే | భక్షించుట |
| మెచ్చ్ | స | శ్లాఘాయాం | శ్లాఘించుట |
| మెట్టు | స | పాదఘాతే | కాళ్ళతోఁద్రొక్కుట |
| మెత్తు | స | సాంద్రలేపనే | దట్టముగ లేపనముసేయుట |
| మెదుగు | అ | అవఘాతేన నిస్తుషీభావే | వడ్లు దంగి పొట్టువిడుట |
| | | మృదితేచ | మర్దించుటచేత మెత్తనవుట |
| మెదలు<br>మెసలు | అ | చలనే | చలించుట |
| | | దర్శనవిషయేచ | అగపడుట |

| ధాతువు. | | సంస్కృతార్థము. | తెలుఁగర్థము. |
|---|---|---|---|
| మెయికొను | స | హస్తావలంబనే | చేపట్టుట |
| మెరమెరలాడు | అ | మనోన్యూనతాయాం | మనస్సునఁ దక్కువగానుండుట |
| మెఱయు<br>మెఱియు | అ | అతిప్రకాశే | మిక్కిలి ప్రకాశించుట |
| మెలఁగు<br>మెలుగు | అ | అన్యోన్యమేళనే | అన్యోన్యము కలియుట |
| | | ఉపాయేన ప్రవృత్తౌచ | ఉపాయముగఁ బ్రవర్తించుట |
| మెసఁగు<br>మెసవు | స | భక్షణే | భక్షించుట |
| మేకొను | స | హస్తావలంబనే | చేపట్టుట |
| మేయు | స | పశ్వాదిభక్షణే | పశ్వాదులు-భక్షించుట |
| మేలుకొను<br>మేల్కొను | అ | నిద్రాప్రబోధే | నిద్రవిడిచిలేచుట |
| మేల్లను | అ | ప్రమాదత్యాగే | ప్రమాదమును విడుచుట |
| మేళవించు | స | సయూథ్యకరణే | జతచేయుట |
| మైకొను | అ | సమ్మతౌ | సమ్మతించుట |
| మైగిఱుపు | అ | అంగభంగే | ఒడలువిఱుచుకొనుట |
| మ్రొక్కు<br>మొక్కు | స | నమస్కారే | నమస్కరించుట |
| మ్రొక్కుకొను<br>మొక్కుకొను | స | దేవప్రార్థనాయాం | తాఁగోరిన పనియైన దేవునికి పలానిపని చేయుదునని ప్రార్థించుట |
| మొక్కవోవు | అ | అగ్రభంగే | కొనవిఱిగిపడుట |
| మ్రొగ్గు<br>మొగ్గు | అ | భారాదేకతో వినమనే<br>కార్యోద్యమేచ | బరువుచేత నొకతట్టుగావంగుట<br>పూనుట |
| మొగుచు<br>మొగుడ్చు | స | ముకుళీకరణే | ముకుళించుట |
| మొట్టు | స | పర్యస్తాంగుళిపర్వప్రహారే | వ్రేళ్ల వెలికణుపునఁ గొట్టుట |

| ధాతువు | | సంస్కృతార్థము. | తెనుఁగర్థము. |
| --- | --- | --- | --- |
| మొత్తు | స | ముఖప్రహారే | ముఖమునఁగొట్టుట |
| మొనయు | అ | యుద్ధసన్నాహే | యుద్ధసన్నద్ధుండవుట |
| మొనదేలు | అ | కార్యప్రథమప్రవృత్తౌ | పనియందుదొదటిలోను ముందఱఁ బ్రవర్తించుట |
| | | వ్రణపరిపాకేచ | కురుపు మొనగట్టుట |
| మొరయు | అ | ధ్వానే | ధ్వనించుట |
| మొఱగు | అ | శ్వరవే | కుక్కగూయుట |
| మొఱఁగు | అ | శ్వరవే | కుక్కగూయుట |
| | | అదృశ్యతాయాంచ | అగపడకయుండుట |
| మొఱలాడు / మొఱమొఱలాడు | అ | కోపవికారే | కోపవికారమునొందుట |
| మొలచు | అ | ప్రరోహణే | అంకురించుట |
| మోకరిల్లు / మోకరించు / మోకాలించు | అ | జాన్వాకుంచనేనోపవేశనే | మోఁకాళ్లు ముణిచికూర్చుండుట |
| మ్రోగు | అ | ధ్వానే | ధ్వనించుట |
| మో | స | భారవహనే | బరువువహించుట |
| మోటుకొను | అ | కార్యోద్యమే | పనికిఁబూనుట |
| మోటించు | స | కార్యోద్యోజనే | కార్యోద్యుక్తునిఁజేయుట |
| | | కలహసన్నహనేచ | కలహసన్నద్ధునింజేయుట |
| మోటుపాఱు | అ | నిష్పల్లవీభావే | చిగుళ్ళులేనిదవుట |
| | | జడతాయాంచ | జడమవుట |
| మోత్రించు గ్రా | స | భగ్నస్తంభాదీనాం దార్వాదిభిరవష్టంభే | విఱిగిన గుంజ మొదలగువానిని కొయ్య మొదలైనవానిచేత నిలువఁబెట్టుట |
| మోటుపడు / మోడుపడు / మోడుచఱు | అ | నిశ్చేష్టతాయాం | నిశ్చేష్టుండవుట |
| మోదు | స | ప్రహారే | కొట్టుట |

| ధాతువు. | | సంస్కృతార్థము. | తెనుఁగర్థము |
|---|---|---|---|
| మోదుకట్టు | అ | రక్తబంధే | రక్తముకట్టుకొనుట |
| మోపు | స | భారారోపణే | ఒకనిమీఁదబరువుద్రోయుట |
| మోపెట్టు | స | ధనుషిగుణారోపణే | వింటనల్లెయెక్కుపెట్టుట |
| మోయు | స | వహనే | వహించుట |
| | | వైధవ్యప్రాప్తౌచ | వైధవ్యమునుబొందుట |
| మ్రోయు | అ | ధ్వానే | ధ్వనించుట |
| మోసపోవు | అ | వంచనాపరిజ్ఞానాభావే | వంచనఁదెలిసికొనలేకపోవుట |
| మోహరించు | అ | రణోద్యోగే | రణోద్యోగముసేయుట |

## ర

| | | | |
|---|---|---|---|
| రక్షరించు | స | రక్షణే | రక్షించుట |
| రక్కు | స | నఖతోదనే | గోళ్ళతోగిచ్చుట |
| రక్కొను | స | వ్యాప్తౌ | వ్యాపించుట |
| రప్పించు | స | ఆకర్షణే | ఆకర్షించుట |
| రవులు | అ | దాహే | కాలుట |
| రవులుకొను | అ | దాహారంభే | కాలమొదలుపెట్టుట |
| రవాళించు | అ | వృధోద్ఘోషే | వ్యర్థముగనుద్ఘోషించుట |
| రహించు | అ | ప్రకాశే | ప్రకాశించుట |
| రాచు | స | ఘర్షణే | ఘర్షణముసేయుట |
| | | లేపనేచ | లేపనముసేయుట |
| రాఁజు | అ | ధూమోత్పత్తౌ | పొగయుట |
| రాణించు | అ | ప్రకాశే | ప్రకాశించుట |
| రాపాడు | స | దోషానారోప్యగణనే | దోషములారోపించి లెక్కవెట్టుట |
| రాఁబట్టు | స | ధనాదేరుద్గ్రహణే | రావలసిన ధనాదులను రాఁజేయుట |
| ఱాయు గ్రా | స | ఘర్షణే | ఘర్షణముసేయుట |
| | | లేఖనేచ | వ్రాయుట |

| ధాతువు. | | సంస్కృతార్థము. | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| రాలు | స | దంతఫలాదీనాంపతనే | దంతములు ఫలములు మొదలైనవి పడుట |
| రావించు | స | ఆకర్షణే | ఆకర్షించుట |
| రిత్తవోవు | అ | వైయర్థ్యే | వ్యర్థమవుట |
| రుంజు | స | నాసయాకర్షణే | ముక్కునవాకర్షించుట |
| రుద్దు | స | సమ్యగ్ఘర్షణే ద్రవ్యలేపనే | తలను చమురు రుద్దుట - ఒకలు రుద్దెనని |
| రుబ్బు | స | ద్రవపిష్టాదిపేషణే | ద్రవమైనపిండి మొదలైనదానిఁ బేషణముసేయుట |
| రూపాణించు గ్రా | స | నిరూపణే | నిరూపించుట |
| రెచ్ | అ | గవాదీనాంమదే | గవాదులు మదించుట |
| రెట్టించు | స | ద్విగుణీకరణే | ద్విగుణముసేయుట |
| | అ | ద్విగుణీభావే | ద్విగుణమవుట |
| | స | పర్యనుయోగేచ | మాటకెదిరించుట |
| రెమ్ము | స | ఆచ్ఛేదనే | ఒడిసి తీసికొనుట |
| రేకెత్తు | అ | వృద్ధౌ | వృద్ధిపొందుట |
| రేఁగు | అ | విజృంభణే | విజృంభించుట |
| రోఁజు | అ | అత్యుచ్ఛ్వాసే | మిక్కిలినిట్టూర్పులువిడుచుట |
| రోయు | స | నిర్వేదే | విసుగుట |

ఱ

| | | | |
|---|---|---|---|
| ఱక్కొను | అ | పశుశాఖోత్పత్తౌ | ప్రక్కకొమ్మ పుట్టుట |
| ఱంపిల్లు | అ | ఉచ్చైరోదనే | గట్టిగానేడ్చుట |
| | | వృథాజల్పనేచ | వ్యర్థపుమాటలాడుట |
| ఱవఱవలాడు | అ | కోపవికారే | కోపవికారముఁబొందుట |
| ఱిచ్చవడు | అ | నిశ్చేష్టతాయాం | నిశ్చేష్టుండవుట |
| ఱువ్వు / ఱువ్వు | స | దూరక్షేపే | దూరముగఁబడునట్లు వేయుట |

| ధాతువు | | | సంస్కృతార్థము. | తెనుఁగర్థము. |
|---|---|---|---|---|
| ఱెక్కొను | | అ | పక్షశాఖోత్పత్తౌ | ప్రక్కకొమ్మలుపెట్టుట |
| ఱొప్పు | | స | హుంకారే | హుంకారము సేయుట |
| | | | శీఘ్రప్రాజనే | శీఘ్రముగాఁదోలుట |
| | | | ప్రహారేచ | కొట్టుట |
| ఱోయు | | స | మార్గణే | వెదకుట |
| | | | నిర్వేదేచ | విసుగుట |
| ఱోలు | | అ | ఉచ్చైరోదనే | గట్టిగా నేడ్చుట |

ల

| | | | | |
|---|---|---|---|---|
| లాగు | | స | కర్షణే | ఈడ్చుట |
| లాఁచు | | స | కాంక్షాయాం | కాంక్షించుట |
| లాయు | | అ | సన్నిధానే | సమీపించుట |
| లావఱు | | అ | బలహానౌ | బలముతగ్గుట |
| లుటాయించు | గ్రా | స | బలాదపహారే | కొల్లపెట్టుట |
| లెక్కించు | | స | గణనాయాం | లెక్కపెట్టుట |
| లే | | అ | ఉత్థానే | ఉత్థితుండవుట |
| లొగ్గు, లొంగు | | అ | నమ్రత్వే | నమ్రుఁడవుట |
| లొట్టవేయు | | స | అసత్యకరణే | అబద్ధము సెప్పుట |
| | | అ | ఆస్వాదనే జిహ్వాశబ్దేచ | చప్పరించునపుడు నాలుకతో ధ్వని సేయుట |
| లోడుపు, లోడపెట్టు | | స | లోడనే | కలియఁబెట్టుట |
| లోడుపుకొను | | స | పరధనస్య స్వయం సర్వగ్రహణే | ఒకనిసొమ్ము దానంతయుఁ దీసికొనుట |
| లోడాడించు | గ్రా | స | వృథోచ్చైర్బహుభాషణే | వ్యర్థముగా-గట్టిగా-నిండుగా మాటలాడుట |
| ళొళ్ళు | గ్రా | అ | శ్వరవే | కుక్కగూయుట |
| ళోగు | | అ | పరాగతౌ | వెనుకదీయుట |

| ధాతువు. | | | సంస్కృతార్థము. | తెనుఁగర్థము. |
|---|---|---|---|---|
| లోటు | గ్రా | స | గృహేసర్వకార్యకరణే | ఇంటిలోనన్నిపనులుసేయుట |
| లోడు | | స | లోడనే | లోడపెట్టుట |

## వ

| | | | | |
|---|---|---|---|---|
| వ్రక్కలించు | | స | విదళనే | బద్దలుసేయుట |
| వగ | | అ | మనోదుఃఖే | మనస్సునదుఃఖపడుట |
| వగు | | | ఆలోచనే | ఆలోచించుట |
| | | | మనోదుఃఖాభినయేచ | మనస్సున దుఃఖమున్న ట్లభినయించుట |
| వగియు | గ్రా | అ | మనోదుఃఖాభినయే | మనస్సున దుఃఖమున్న ట్లభినయించుట |
| వగలాడు | | అ | మనోదుఃఖాభినయే | మనస్సున దుఃఖమున్న ట్లభినయించుట |
| | | | శృంగారచేష్టాయాంచ | కులుకుట |
| వగదెగు | | అ | వివాదనిష్కర్షే | వ్యాజ్యముదీఱుట |
| | | | సమాప్తౌచ | సమాప్తమౌట |
| వగిరించు | | అ | వంచనయాజల్పనే | వంచనపుమాటలాడుట |
| | | | శునామత్యుచ్ఛ్వాసేచ | కుక్కగ్రోఁజుట |
| వంగు | | అ | నతౌ | నమ్రమవుట |
| వంచు | | స | నమనే | వంగఁజేయుట |
| | | | పాత్రానమనేనజలస్రావణేచ | పాత్రమువంచి నీళ్లుస్రవింపఁజేయుట |
| వంచివేయు | | స | పాత్రానమనేన నిశ్శేషజలస్రావణే | పాత్రమువంచి నిశ్శేషముగా నీళ్ళుస్రవింపఁజేయుట |
| వచ్ | | అ | ఆగమనే | చనుదెంచుట |
| వ్రచ్ | | స | విదళనే | బద్దలుసేయుట |
| వంచోడించు | గ్రా | స | దాక్షిణ్యేనదర్శనే | దాక్షిణ్యముచేతఁజూచుట |
| వట్టు | | అ | జలశోషణే | నీళ్ళుశోషించుట |
| వట్రిల్లు | | అ | శోభాయాం | శోభించుట |

| ధాతువు | | సంస్కృతార్థము. | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| వట్రపెట్టు | స | లక్ష్యీకరణే | లక్ష్యముసేయుట |
| వటించు | అ | దేహకార్శ్యే | దేహము కృశించుట |
| వండు | స | పచనే | పాకముసేయుట |
| వడ్డించు | స | పరివేషణే | అన్నాదులు భోజనార్థముగా విస్తరిలోఁబెట్టుట |
| వడలు | అ | పుష్పాదీనాంమ్లానౌ | పుష్పాదు వాడుట |
| వడియు | అ | స్రావే | స్రవించుట |
| | | నిశ్శేషీభవనే | నిశ్శేషమవుట |
| | | బలాద్గ్రహణేచ గ్రా | బలాత్కారముగా గ్రహించుట |
| వడివేయు | స | ప్రతివేష్టనే | మెలివేయుట |
| వడుకు | స | తంతునిర్మాణే | దారమునిర్మించుట |
| | | ఉపాలంభేచ | తిట్టుట గ్రా |
| వడఁకు<br>వణఁకు<br>వణుకు | అ | కంపే | కంపించుట |
| వంతవేయు | అ | లిప్సయాదృష్టిపాతే | లభింపవలయుననికన్ను వేయుట |
| వందు<br>వందురు | అ | చింతాయాం | చింతపడుట |
| వదరు<br>వదురు | స | వృథాజల్పనే | వ్యర్థపుమాటలాడుట |
| వదలు<br>వదులు | అ | విశ్లేషే | విడిపోవుట |
| | | గ్రంథేరుచ్ఛ్వసనే | ముడివిడుట |
| | స | వినాభావేచ | విడిచిపెట్టుట |
| వదవదలాడు | అ | శీతాళుతయాకంపనే | చలితాళలేక వణఁకుట |
| వనరు | అ | మనోదుఃఖే | మనస్సునదుఃఖపడుట |
| వ్రయ్యు | అ | విదళనే | బద్దలవుట |
| వరియు గ్రా | స | శాణోల్లేఖనే | సానపెట్టుట |
| వరగలించు<br>వరలు | అ | ప్రకాశే | ప్రకాశించుట |

| ధాతువు. | | సంస్కృతార్థము. | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| వలయు | స | ఇచ్ఛాయాం | ఇచ్ఛయించుట |
| వల్లించు | స | విద్యామ్రేడనే | రువ్వులు వేయుట |
| వల | స | అనురాగే | మోహించుట |
| | | పరిమళేచ | పరిమళించుట |
| వలు గ్రా | స | అనురాగే | మోహించుట |
| వలగొను | స | వేష్టనే | చుట్టుకొనుట |
| వలిగొను | అ | శీతాభితాయాం | చలిగొనుట |
| వలవలలాడు | అ | రోదనే | ఏడ్చుట |
| వాక్రుచ్ | స | ఉక్తౌ | చెప్పుట |
| వాకరించు | అ | వమనోద్యమనే | కక్కనుద్యుక్తుండవుట |
| వాఁగు | అ | శబ్దే | శబ్దించుట |
| వాచారు | అ-స | దీనవృత్తియాచనే | దీనవృత్తిగా యాచించుట |
| వాచు | అ | శ్వయథౌ | ఉబ్బుట |
| | | అతికాంతౌయాంచ | మిక్కిలి కాంతించుట |
| వాఁచు | స | వాదనే | వాయించుట |
| వాంచు | స | నమనే | వంచుట |
| వాచర | స | దీనవృత్తియాచనే | దీనవృత్తిగా యాచించుట |
| వాడు | అ | పుష్పాదీనాంమ్లానౌ | పుష్పాదులువడలుట |
| | స | కార్యోపయోజనే | పనికుపయోగింపఁజేయుట |
| | | వ్యవహారేచ | వ్యవహరించుట |
| వాడ్పు | స | అగ్నౌపర్ణాదితాపనే | నిప్పుమీఁద నాకులు మొదలైన వానిని దపింపఁజేయుట |
| వాను | స | సృష్టౌ | సృజించుట |
| వాపోవు | అ | ఉచ్చైరోదనే | గట్టిగా నేడ్చుట |
| | | వృథాజల్పనేచ | వ్యర్థపుమాటలాడుట |
| వ్రాయు | స | లేఖనే | లిఖించుట |

| ధాతువు. | | సంస్కృతార్థము. | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| వారు | స | సమూహనే | కుప్పచేయుట |
| | | తాళపత్రాదిషుఛురికయాకతకువిదారణె | తాటాకు మొదలైన వానియందు సురియచేతఁ బ్రక్కలుచీల్చుట |
| | అ | తృణపుంజాదావతుసమీకరణే | గడ్డిమోపు మొదలైనవానియందుఁ బ్రక్కలు చక్కఁజేయుట |
| | | జలోచ్ఛ్వేషణేనపాకేచ | వార్చుగాఁబక్వమవుట-పడిబియ్యము వారెనని |
| వారుకొను | స | సమూహ్యగ్రహణే | కుప్పచేసి యెత్తికొనిపోవుట |
| వారు<br>వార్చు | స | జలోచ్ఛ్వేషణేనపచనే | జలము మిగులునట్లు పాకముసేయుట-పడిబియ్యమువార్చెనని |
| | | జలస్రావణే | నీళ్ళుస్రవింపఁజేయుట |
| | | సంధ్యావందనాద్యనుష్ఠానే | సంధ్యావందనాద్యనుష్ఠానముసేయుట |
| | | ప్రతీక్షణేచ | కనిపెట్టుట |
| వారడు | స | విరామే | చాలించుట |
| వాలుచు | | | |
| వాలు | అ | ఆనతౌ | వంగుట |
| | | ఉపరిదేశాదాగత్యావస్థానేచ | మీఁదినుండివచ్చినిలుచుట-పక్షి చెట్టుమీఁదవాలెనని |
| వాలాడు<br>వాలలాడు | గ్రా అ | జలక్రీడాయాం | ఓలలాడుట |
| విక్కు | అ | అంగభంగే | ఒడలువిఱుచుకొనుట |
| | | హిక్కాయాంచ-గ్రా- | ఎక్కిలిపొందుట |
| వింగడించు | స | విభాగే | విభజించు |
| విచ్ | అ | విస్రంసే | వీడుట |
| | స | విస్రంసనేచ | వీడఁజేయుట |
| విచ్చేయు | అ | ఆగమనే | వచ్చుట |
| విడు<br>విడిపోవు | అ | స్వతోవిశ్లిష్టే | తనకుఁదానె విడిపోవుట |

| ధాతువు. | | సంస్కృతార్థము. | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| విడు<br>విడిచిపెట్టు | స | త్యాగే, మోచనేచ | త్యజించుట |
| విడియు | అ | వాసే | వసించుట |
| | | సేనావతరణేచ | సేనదిగుట |
| విచ్చుగు | అ | వికాసే | వికసించుట |
| విత్తు | స | బీజావాపే | విత్తులు మొలవనేయుట |
| విదలు<br>విదులు | అ | లఘుతయాతత్రతత్రాభ్రపతనే | లఘుత్వముచేనక్కడక్కడ రాలుట |
| విద్రు | స | విధూననే | విదిలించుట |
| విను<br>వినుచు | స | శ్రవణే | శ్రవణముసేయుట |
| | | శ్రావణే | వినఁజేయుట |
| వినిపించు<br>వినుపించు | అ<br>స | శ్రుతౌ<br>శ్రావణేచ | వినవచ్చుట<br>వినఁజేయుట |
| విన్నపించు<br>విన్నవించు | స | విజ్ఞాపనే | విజ్ఞాపనము సేయుట |
| విన్నఁబోవు | అ | ఖేదే | ఖేదమొందుట |
| విప్పు | స | విస్రంసనే | విడఁజేయుట |
| విడియు | అ | విశ్లేషే | విడిపోవుట |
| | | వికాసే | వికసించుట |
| | | వ్యాప్తౌచ | వ్యాపించుట |
| విరవిరవోవు | అ | పిష్టాదీనామపిండీభవనే | పిండిమొదలైనవి కలిసికొనకపోవుట |
| విరుగు<br>విఱుగు | అ | ద్వైధీభావే | కట్టె మొదలైనవి రెండవుట |
| | | క్షీరాదిసంవర్తనే | పాలువిఱిగిపోవుట |
| | | సేనాభంగేచ | దండుపాఱిపోవుట |
| విరిచికట్టు<br>విఱిచికట్టు | స | హస్తపాదమానమ్యబంధనే | చేతులుకాళ్లు వంచికట్టుట |

| ధాతువు. | | సంస్కృతార్థము. | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| విఱ్ఱవీఁగు | అ | అతిపీవరతాయాం | అతిపీవరుండగుట-మిక్కిలి బలిసెననుట |
| విలు | స | విక్రయణే | అమ్ముట |
| విలవిలలాడు | అ | విపదాస్వహస్తపాదాకర్షణే | విపత్తుచేతఁ దనచేతులు కాళ్ళు దన్నుకొనుట |
| విసుకు<br>విసువు | అ | నిర్వేదే | నిర్విణ్ణుండవుట |
| విసరు<br>విసురు | అ | వాయోర్వేగగతౌ | వాయువు వేగముగాఁ గదలుట |
| | | పరిభ్రామ్య దూరక్షేపణే | కత్తిమొ॥ త్రిప్పి దూరముగా వేయుట |
| | స | ఘరట్టాదిభ్రామణే | తిఱుగల్లు మొదలైనదానిం ద్రిప్పుట |
| | | తాళవృంతాదివీజనే | విసరుకఱ్ఱతోఁ గాలిగలుగఁ జేయుట |
| వీఁగు | అ | శ్వయథౌ | ఉబ్బుట-అనఁగా లావవుట |
| | | పరాగతౌచ | వెనుకఁదీయుట |
| వీ | అ | వాయుగతౌ | వాయువువిసరుట |
| | | ప్రతిపద మనిష్టాగమావేదనేచ | వేమాఱు అనిష్టము రాఁగలదని తెలియఁజేయుట |
| వీటిపుచ్చు- | | | |
| వీడు | అ | విశ్లేషే | విడిపోవుట |
| | | బంధశైథిల్యే | ముడివదలుట |
| | | త్యాగేచ | విడిచిపెట్టుట |
| వీడ్వడు | అ | వ్యత్యాసే | వ్యత్యాసమవుట |
| వీడ్కొను | స | త్యాగే | విడిచిపెట్టుట |
| వీడ్కొల్పు | స | ప్రస్థాపనే | పంపించుట |
| వీతెంచు | అ | వాయ్వాదేరాగమనే | వాయువు మొదలైనది వచ్చుట |
| వీల్వడు | అ | హస్తప్రాప్తౌ | చేకూరుట |
| వీలు | అ | విశ్లేషే | విడిపోవుట |
| | స | త్యాగేచ | విడిచిపెట్టుట |

| ధాతువు. | | సంస్కృతార్థము. | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| పీసరవోవు | అ | కించిద్భంగే | కించిద్భంగమవుట |
| వెక్కిరించు | స | అపహాసే | అపహాసముచేయుట |
| వెక్కు | అ | హిక్కాయాం | ఎక్కిలిపొందుట |
| వెచ్చల్లు | స | సర్వతోవికిరణే | అంతటఁజల్లుట |
| వెడలు | అ | నిర్గమనే | బయిలువెళ్ళుట |
| వెతకు<br>వెతుకు<br>వెదకు<br>వెమకు | స | అన్వేషణే | అన్వేషించుట |
| వెతుకులాడు<br>వెమకులాడు | స | అన్విష్యతస్సంచారే | అన్వేషించుచు నీవల నావలఁ దిరుగుట |
| వెన్నడు<br>వెన్నాడు | స | ధావతోనుధావనేన వేగజననే | తఱుముకపోవుట |
| వెంపరలాడు | స | అన్విష్యతస్సంచారే | నెమకులాడుట |
| వెంబడించు | స | అనుగమనే | అనుసరించిపోవుట |
| వెఱ<br>వెఱచఱ | అ | భయే | భయపడుట |
| వెలుఁగు | అ | దీప్తౌ | దీపించుట |
| వెలయు | అ | శోభాయాం | శోభించుట |
| వెలియు | అ | వృష్టేరపగమే | వానపోవుట |
| వెలవెలఁబోవు | అ | వైవర్ణ్యే | వివర్ణుండవుట |
| వెల్లచఱ | స | కుడ్యాదాసుధాలేపనే | గోడమొదలైనవానియందుఁ బాలగారచేయుట |
| వెల్లకిలు<br>వెల్లతిలు | అ | ఊర్ధ్వముఖశయనే | ఊర్ధ్వముఖముగాఁ బండుకొనుట |
| వెలార్చు | స | వ్యపనాశనే | పోఁగొట్టుట |
| వెలువడు<br>వెల్వడు | అ-స | నిర్గమనే | బయిలువెళ్లుట |

| ధాతువు. | | సంస్కృతార్థము. | తెనుఁగర్థము. |
| --- | --- | --- | --- |
| వెళ్లు | అ | ధావనే | పరుగెత్తుట |
| | | గతౌ | పోవుట |
| | | బహిర్నిర్గమనేచ | బైటికివచ్చుట |
| వెళ్లుకొను | అ | మృతౌ | చచ్చుట |
| | | బహిర్నిర్గమనేచ | బయిలువెళ్లుట |
| వేఁగు | అ | భ్రష్టే | భర్జనమవుట |
| | | నిశాత్యయేచ | రాత్రిగడచుట |
| వేఁగించు | స | జాగరణే | మేలుకొనియుండుట |
| | | శ్రమక్షమతాయాంచ | శ్రమమునకు శక్తుండై యుండుట |
| వేచు | స | పీడనే | పీడించుట |
| | | ఉద్రేకేచ | ఉద్రేకించుట |
| వేఁచు | స | భర్జనే | భర్జనముసేయుట |
| వేంచేయు | అ | గతౌ | పోవుట |
| | | ఆగతౌచ | వచ్చుట |
| వేఁడు | స | ప్రార్థనాయాం | ప్రార్థించుట |
| ప్రేయు / వేయు | స | పాతనే | క్రిందవేయుట |
| | | వేధనే | పక్షిని బాణమున వేయుట |
| | | కరణే | ;డ వేయుట |
| | | క్షేపణే | విసరివేయుట |
| | | నిర్మాణే | గోడవేయుట |
| | | మానేచ | మూరవేసెనని |
| వేయించు | స | భర్జనే | వేఁగునట్లుచేయుట |
| | | పాతనవేదనాది ప్రేరణాయాంచ | పడునట్లుచేయించుట- పక్షిని బాణముతోఁ బడునట్లుచేయించుట- ఇత్యాది |
| ప్రేలు / వేలు | అ | లంబనే | పయినొకదానింబట్టుకొని క్రింద నాలంబనము లేకయుండుట |

# పరిషత్కార్యాలయమున వెలకు దొరకు గ్రంథములు.

| | | రు | | |
|---|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము-చదలువాడ మల్లయకవి | 0 | 8 | 0 |
| 2 | కవిజనాశ్రయము-వేములవాడ భీమకవి ... | 0 | 10 | 0 |
| 3 | చంపూరామాయణము-ఋగ్వేదికవి వేంకటాచలపతికవి ... | 1 | 0 | 0 |
| 4 | నీతిసీసపద్యశతకము-తాళ్లపాక పెదతిరుమలార్యుఁడు ... | 0 | 2 | 0 |
| 5 | జ్యోతిశ్శాస్త్రసారము శ్రీమాన్ కపిస్థలం కృష్ణమాచార్యులుగారు బి ఏ., యల్. టి ... | 0 | 8 | 0 |
| 6 | జ్ఞానప్రసూనాంబికాశతకము-శిష్టు సర్వశాస్త్రికవి ... | 0 | 2 | 0 |
| 7 | సర్వేశ్వరశతకము-యథావాక్కుల అన్నమయ్యగారు ... | 0 | 3 | 0 |
| 8 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము-జ. రామయ్యపంతులు గారు, బి ఏ., బి ఎల్ ... | 0 | 8 | 0 |
| 9 | కావ్యాలంకారచూడామణి-విన్నకోట పెద్దయకవి | 0 | 8 | 0 |
| 10 | చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లనకవి ... | 1 | 0 | 0 |
| 11 | అకారాద్యముద్రిత గ్రంథసూచిక ... | 0 | 8 | 0 |
| 12 | ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులు గారు ... | 0 | 12 | 0 |
| 13 | శివతత్త్వసారము మల్లికార్జున పండితారాధ్యులు ... | 0 | 12 | 0 |
| 14 | Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు బి ఏ, బి. ఎల్. ... | 0 | 8 | 0 |
| 15 | శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి ... | 0 | 12 | 0 |
| 16 | ఆర్యభాషావిభాగము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ... | 0 | 8 | 0 |
| 17 | Dravidian Lexicography ... | 0 | 4 | 0 |
| 18 | ప్రహస్వరంగములు-కొత్తపల్లి సూర్యరావు ... | 0 | 8 | 0 |
| 19 | నారసింహపురాణము ఉత్తరభాగము-హరిభట్టు ... | 1 | 0 | 0 |
| 20 | మన్నారుదాస విలాసనాటకము—రంగాజమ్మ. ... | 0 | 8 | 0 |
| 21 | జైమినిభారతము-వచనము-వేంకటకృష్ణప్పనాయఁడుఁ ... | 0 | 12 | 0 |

# శాంతి.

(భక్తి జ్ఞాన వైరాగ్య విషయిక మాసపత్రిక)

సర్వమత సమ్మతములగు తెలుఁగు వ్యాసములతోడ నలరారుచు, విశ్వ సోదరభావమును బోధించును. సం॥ చందా రు 2.

## PEACE

'శాంతి' పత్రికవలెనే సర్వమత సమ్మతమును, విశ్వసోదర భావబోధకము నగు వ్యాసావళితో ఆంగ్లమున ప్రకటింపబడు మాసపత్రిక

చందా రు 3-0-0 రెండు పత్రికలకు సం॥ చందా 4-8-0 మాత్రమే.

## శ్రీ శాంతి ఆశ్రమము.

ఈ ఆశ్రమము చుట్టును కొండలుగలిగి కను విశాలమై యొప్పు సమ ప్రదేశమున, వివిధఫలవృక్షములతో నలరారు చక్కని తోటనడుమ నిర్మింపబడియున్నది. ఇది ప్రపంచమున గల మానవు లందఱకును శాంతికైవల్యమై సర్వమతములవారును తమతమ ధర్మముల ననుసరించు పరమార్థ సాధన చేసికొనుట కనువుగనున్నది.

హిందువులు, మహమ్మదీయులు క్రైస్తవులు, బౌద్ధులు మఱియితరులును దేశ జాతి మతవివక్షత లేక స్వేచ్ఛగా తమతమ యనుష్ఠానములను జఱుపుకొనవచ్చును ఎల్లఱకును ప్రీతిపూర్వకముగ స్వాగతము!

అమెరికా, డెన్మార్కు మున్నగు దేశములందును శాఖాసమాజములు కలవు

శ్రీ శాంతి ఆశ్రమము, తోటపల్లికొండలు శాంతి ఆశ్రమపోస్టు, పెద్దాపురం తాలూకా, తూర్పుగోదావరిజిల్లా

Printed by M. Rangiah at the Cocanada Printing Works, Cocanada.

శ్రీ

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్త్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy)**

సంపుటము ౧౭. { విభవనామసంవత్సరము. మార్గశీర్ష పుష్యమాసములు. } సంచిక ౫.



కాకినాడ:

కొత్తపల్లి సూర్యారావుచేఁ బరిషత్కార్యాలయమునఁ
బ్రకటింపఁబడినది.

చందా { పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు. ౩. } విడిసంచిక రు ౦-౮-౦

1929

## ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజావారు. పరిషత్సభాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు

## ఉద్ధారకులు

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు—ఉయ్యూరు జమీందారువారు

శ్రీరాణి వత్సవాయ వేంకట సుభద్రయ్యమ్మజగపతిబహద్దరుగారు—తుని రాణిగారు.

కీ. శే. శ్రీబొబ్బిలి మహారాజావారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

### అధ్యక్షుండు.

జయంతి రామయ్యపంతులుగారు బి.ఏ., బి.ఎల్.

### కార్యదర్శులు.

దర్భా వేంకటశివరామరాజుగారు బి.ఏ., బి.ఎల్.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం.ఏ., బి.ఎల్.

### కార్యనిర్వాహకసభాసభ్యులు

దివాన్ బహదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారు

డాక్టరు వేమూరి రామకృష్ణారావుగారు. ఎ. ఏ. ఎల్. టి. PH. D.

(కోశాధ్యక్షులు.)

శ్రీ త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారు.

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు

అనంతపంతుల రామలింగస్వామిగారు

దగ్గిరాల వేంకటసూర్యప్రకాశరావుగారు బి.ఏ.

తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు.

అళక్కి వేంకట్రామయ్యగారు

కోకా వేంకటసుబ్బారావు నాయుడుగారు

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు.

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.

పిల్లారిసెట్టి రంగబ్రహ్మారావు నాయుడుగారు.

# విషయసూచిక.







# పరిషత్ప్రయోజనములు.



తెనుఁగుభాషను, వాఙ్మయమును, అభివృద్ధి నొందించుటయు, ఆవిషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసంగుటయు నీపరిషత్తుయొక్క ప్రయోజనములు. ఈపనిని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యీక్రిందఁ బొందుపఱుపఁబడు చున్నవి :—

I తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వంకష మగునిఘంటు వొకటి రచించి ప్రచురించుట,

II తెలుఁగుభాషకు సజాతీయేతర భాషలతోఁ గలసాదృశ్యములను సాకల్యముగ నిరూపించుచు నొకవ్యాకరణము రచించి ప్రచురించుట,

III ఆధునిక శాస్త్ర గ్రంథరచనయందుఁ బ్రయోగించుటకునై పారిభాషికపదములను నిర్ణయించి వివరించు నొకశబ్దకోశమును సిద్ధముచేయుట,

IV ఆంధ్రదేశప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహ మొసంగుటయు, లభ్యములైన వానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుఁగు దేశముయొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్ర మొకటి రచించి ప్రచురించుటయు,

V సర్వవిషయములనుగుఱించి చేయఁదగు గ్రంథరచనకుఁ బ్రోత్సాహ మొసంగుట,

VI ఆంధ్రభాషలోని మంచిగ్రంథములఁ బండితపరిష్కారము చేయించి విస్పష్టముగఁ బ్రచురించుట,

VII తెలుఁగుభాషకును వాఙ్మయమునకును సంబంధించిన విషయములను జర్చించు నొక పత్రికను బ్రకటించుట ,

VIII తెలుఁగువాఙ్మయమునకు సంబంధించిన విషయములను గుఱించి చర్చించుటకుఁగాను సాంవత్సరికసభల నేర్పాటుచేయుట,

IX తెలుఁగు సాహిత్యవిషయములఁ బరీక్షలఁ గావించి పారితోషికములను, సాహిత్య పట్టములను, యోగ్యతాపత్రికలను నొసంగుట,

X ఒక పుస్తకభాండాగారమును స్థాపించి సాగించుట. ఇందుఁ బ్రధానముగాఁ దెలుఁగు గ్రంథము లుండవలయును; వ్రాఁతప్రతులుగూడ నుండవలయును;

XI తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికి నుపకరించు నన్ని కార్యములను జేయుట

# ఆంధ్రసాహిత్య

# పరిషత్పత్రిక.

| | | |
|---|---|---|
| సంపుటము ౧౭. | విభవనామసంవత్సరము<br>మార్గశీర్ష పుష్య మాసములు. | సంచిక ౫ |

## శివరాత్రిమాహాత్మ్యము.

—♦ (బండారు తమ్మయ్యగారు) ♦—

ఆంధ్రసాహిత్యపరిషత్తువారు పుస్తకరూపమునఁ బ్రకటించిన శ్రీనాథ కవిసార్వభౌముని శివరాత్రిమాహాత్మ్యమునకు బ్రహ్మశ్రీ కట్టి సాంబమూర్తి శాస్త్రిగారు వ్రాసినపీఠికలోని కొన్నివిషయములఁ గూర్చి నాయభిప్రాయభేదములను దెలుపుచు, ఆంధ్రపత్రికాక్రోధనసంవత్సరాదిసంచికలో నేనొకవిమర్శనము ప్రకటించియుంటిని. దానిపై శాస్త్రిగారు తమవాదములను సమర్థించుచు, అక్షయసంవత్సరాదిసంచికలోఁ బ్రతివిమర్శనముఁ బ్రకటించియున్నారు. పాఠకమహాశయులు దానిని జిత్తగించి యందలిసారమును గ్రహించియే యుందురు. కావున నుభయవ్యాసములందలి విషయములను గుర్తించి సత్యమును నిశ్చయించికొనవలసిన బాధ్యత వారిపయినే గలదు. అందుచే నిందుఁ గూర్చి నేను మరలవ్రాయుట కావశ్యక మంతగా లేకున్నను, శాస్త్రిగారు ప్రత్యుత్తరసాపేక్షముగ వ్రాసినకొన్నివాక్యములఁ బట్టి తిరిగి నే నించుక సమాధానములు చెప్పవలసినవాఁడ నయితిని. పాఠకులు వీనిని గూడ గుర్తించి తగువినిశ్చయ మొనర్తురుగాక !

శ్రీ శాస్త్రిగారు నావిమర్శనము యుక్తియుక్తముగ నుండి యుక్తిరత్నములనేకములతోఁ గూడి యున్నట్టు లభిప్రాయ మనుగ్రహించిరి. కాని యది వ్యక్త్యభిమానదూషిత మవుటచేఁ దమవినిశ్చయమును సడలింపఁజాలియుండ

లే దనియు నాయుక్తులు కొన్ని యప్రమాణము లవుటచే వానిని విమర్శించి తమపీఠికను సమర్థించితి మనియు సెలవిచ్చిరి కాని వారిదృష్టిలో నావిమర్శనమును దూషిత మొనర్చిన యావ్యక్త్యభిమాన మెట్టిదో యించుకయు వ్యక్తీకరింప రయిరి. అయినను "కృతిభర్త శాంతయ" అనుశీర్షికక్రింద వారు లిఖించిన యీక్రిందివాక్యరత్నములఁబట్టి వారిదృష్టిలో నా కీయభిమానమనునది యాశాంతయ్యనుగూర్చియే యై యుండు నేమో యని తోఁచుచున్నది.

"కృతిభర్త యగుశాంతయనుగూర్చిన నావాక్యములే ప్రస్తుతము తమ్మయ్యగారివ్యాసమునకు ప్రోత్సాహకములుగా నగపడుచున్నవి ఆకీర్తిశేషు నివిషయమయి యట్లు వ్రాయనిచో బహుశః తమ్మయ్యగారు నాపీఠికను సావకాశముగఁ జదువనైనఁ జదువకుందురేమో ? "

ఇవి వేగిరపాటుతోఁ గూడినవ్రాఁత లని మనవిచేయుట కెంతయుఁ జింతిల్లుచున్నాఁడను. శాంతయ యేనాఁటివాఁడో ? యెచ్చటివాఁడో ? యాతఁడు నాకు మూలచుట్టము కాఁడు, ఆతనిపై నాకుఁ బ్రత్యేకాభిమానము గాని పక్షపాతము గాని యుండుట కెట్టియవకాశములును లేవు. లోక మందఱవలెనే నాకుఁగూడ నాతఁ డీనాఁడు శ్రీనాథునిగ్రంథమూలముననే పరిచితుఁ డయినవాఁడు గాని వేఱుకాదు. శాస్త్రిగారు తమపీఠిక వ్యక్తిద్వేషప్రేరితముగా దని చెప్పికొనుచు నావిమర్శనముమాత్రము వ్యక్త్యభిమానదూషిత మనివ్రాయుట న్యాయముకాదు. శాంతయ్య వారి కెట్లు ద్వేష్యుఁడుగాఁడో యట్లే నా కభిమాన్యుఁడును గాఁడు. వారా తనియెడఁ దాము సత్యమని నమ్మినదాని నెట్లు ప్రకటించితి మనిరో యట్లే నేనును నాకుఁ దోఁచినవిషయములఁ బ్రకటించితిని. యథార్థనిర్ణయమునకు లోకమే ప్రమాణము ఈసందర్భమున నేఁజెప్పు ముఖ్యవిషయ మొక్కటియే. కీర్తిశేషు లగుపూర్వపురుషులఁగూర్చి మనము ప్రత్యక్షముగా నెఱుఁగనివిషయములలోఁ బ్రబలప్రమాణములు లేనిదే మనయూహల నాధారముచేసికొని వారి కపకీర్తిఘటించు సిద్ధాంతములొనర్చుట ధర్మవిరుద్ధము. ఇట్టిపట్టులఁ జరిత్రకారులుగూడఁ దాటస్థ్యము వహించుటయే సంభావ్య మని నాయభిప్రాయము. నేను నావిమర్శనము వ్రాసినదిట్టియాశయముతోఁడనే; శాస్త్రిగా రన్యథా తలంచి వృథావ్యక్త్యభిమానముల నాకారోపించుట శోచనీయము.

ఈ గ్రంథవిషయమున శాస్త్రిగారి పీఠికవలన నే నభిప్రాయభేదములఁ బ్రకటించినవిషయములు మూఁడు :—

I గ్రంథాంకితము. II గ్రంథమందలి కథకు మూలము. III గ్రంథముయొక్క సమగ్రతాసమగ్రతలు.

ఇందుఁగూర్చి శాస్త్రిగారివిమర్శనమందలి ప్రధానాంశముల కీక నాసమాధానములఁ గ్రమముగా వివరించెద.

1 గ్రంథాంకితము:—ఈ గ్రంథమును శ్రీనాథుఁ డెవరికి నంకిత మొనర్పక మునుపే మరణించి యుండు ననియు, గ్రంథమున కిప్పుడు కృతిపతిగాఁ గానవచ్చు ముమ్మయ శాంతయ్య శ్రీనాథుని యనంతర మగతికమై పడియున్న యాకృతి నెట్లో సంగ్రహించి తన కతికించికొని యవతారికాదులను స్వహస్తముననో పరహస్తముననో యవతరింపఁజేసె ననుట శాస్త్రిగారివాదము. ఇందులకు వారికుపబల మవతారికాభాగము దోషదూషితమును నప్రౌఢకల్పనాజల్పాకము నైయుండుట. ఈ గ్రంథము సాహిత్యపరిషత్తువారికి దొరకినది మొదలు శాస్త్రిగారిపీఠికతోఁ బుస్తకరూపమున వెలువడకపూర్వము గడచిన పదిసంవత్సరములలోను దానిని ముద్రితాముద్రితస్థితిలోఁ బలువురు పండితులు సవిమర్శనముగాఁ బరించి యందుఁగూర్చి యభిప్రాయములు ప్రకటించి యున్నారు. కాని వారెవరు మనశాస్త్రిగారివలె నీగ్రంథాంకితమునుగూర్చి విపరీతముగా వ్రాయక గ్రంథము శ్రీనాథునిచే శాంతయ్య కంకితము చేయఁబడినట్లే యభిప్రాయములను బ్రకటించిరి. అట్లు వా రొనర్చుటకుఁ బ్రధానకారణము ప్రత్యక్షవిషయములలోఁ బ్రబలప్రమాణములు లేనిదే, కానవచ్చుచున్న గ్రంథప్రమాణమునకు భిన్నముగా నూహ లొనర్చుట, అందునను మృతజీవి యగుపూర్వపురుషుని కీర్తి కలుషిత మగునట్లు వ్రాయుట, న్యాయసమ్మతము కాదనుధర్మసూత్రమునకు బద్ధులయి సాహసకృత్యమునకు వెఱచుటయే యని నాతలంపు. మఱియు శాస్త్రిగారిపీఠికతో నీగ్రంథము వెలువడినపిమ్మటఁగూడ శ్రీ నడకుదుటి వీరరాజుపంతులుగారు దీనియవతారికను శ్రీనాథీయముగానే గ్రహించి యందలి "సెట్టియమూరమ" (ప 25) అనుప్రయోగమును నన్నెచోడునిప్రయోగములకు సాధకముగా నుదాహరించిరి. (ఆం॥ సా॥ పరిషత్పత్రిక సం॥ 13 సం॥ 3-4 పుట 184) ఇట్లు పలువురు పండితు లీగ్రంథావతారికను శ్రీనాథీయముగా నెంచి వ్రాయుచుండినను, శ్రీశాస్త్రిగారు పీఠికలో

ఈవిషయమున వ్రాసినసంగతులు కొన్ని సత్య సమీపములు గా నాదృష్టికిఁ దోఁచుటచే, వారభిప్రాయపడినట్లు కేవలాభిమానాభినివేశముల నాలంబించువాఁడనుగాక సత్యగ్రహణమునం దాసక్తి కలవాఁడనవుటచేతనే శాస్త్రిగారి వాక్యములను బూర్తిగాఁ ద్రోసిపుచ్చక వానిని జాలవఱ కంగీకరించి యావిషయమున నాకుఁ దోఁచిన పక్షాంతరములను సూచించితిని. ముమ్మయశాంతయ్య శ్రీశైలమందలి భిక్షావృత్తిమఠస్థజంగముఁడు నిర్వివాదముగా శ్రీనాథకృత మని శాస్త్రిగా రంగీకరించు నీగ్రంథభాగములలో నచ్చటచ్చట శ్రీనాథునకు జంగములతోఁ గలసంబంధమును నాతనికి వారిపైఁ గలభక్తిగౌరవములను వెల్లడించు శబ్దప్రయోగము లున్నవి. వానిలోఁ గొన్నిటి నొసంగుచు మఱియు శ్రీనాథునకు శ్రీశైలముతోను, భిక్షావృత్తిమఠస్థజంగములతోను గలసంబంధమును సూచించు నాతనిగ్రంథాంతరప్రమాణములఁ గూడ నుదహరించుచు శ్రీనాథుఁడీ గ్రంథమును దనజీవితకాలమున శ్రీశైలములో శాంతభిక్షావృత్తియతీశ్వరుని యాజ్ఞానుసారముగ నాతనిమూలభృత్యుఁడగుముమ్మయశాంతయకు స్వీయముగా నంకిత మొసంగియుండుటకుఁ గలసాధ్యతాసంభావ్యతలను (probabilities and possibilities) నావ్యాసములో వివరించియుంటిని. శాస్త్రిగారు వీనిలో నేనికి నొక్కసమాధాన మైన వ్రాయరైరి. అవతారిక యనఁగాఁ గథారంభమునకు ముందు కృతిపతి వంశావతారవర్ణనాదులతోఁ గలకృత్యాదికే వ్యవహార మని సర్వసాధారణముగా నందఱెఱింగినది. అప్రౌఢకవిత్వము దోషము లవతారికయందే గానవయి గ్రంథమధ్యమునఁ గానరా వని శాస్త్రిగారు తమవాదమున కుపబలముగాఁ బీఠికలో వ్రాయఁగా నేను షష్ఠ్యంతములయు, ఆశ్వాసాద్యంతపద్యములయు మాట యెత్తి యవి శాస్త్రిగారి పైయూహను బోషింప వని దృష్టాంతసహితముగా వ్రాసియున్నాను. అందుపై శాస్త్రిగా రీపద్యములవిషయమయి తాము తమపీఠికలో జాఱవిడిచినను నవిగూడఁ దమదృష్టిలో నవతారికాకక్ష్యలోఁ జేరునవియే యనియు శ్రీనాథకృతములు గావనియు వ్రాసి యీవిషయమున నేను బొరపడిరో లోకమును వంచింపనెంచిరో యట్లు లిఖించితి నని లోకప్రతారణబుద్ధిని గూడ నాకారోపించిరి. నే నీవిషయమునఁ బొడిమాటలు వ్రాసి లోకమును వంచించిన దేదియు లేదు. పోలికలు గలవని నే నెంచిన యీగ్రంథమందలి యాశ్వాసాద్యంతపద్యములను, శ్రీనాథుని యితరగ్రంథములందలి యాశ్వాసాద్యంత

పద్యములను నావ్యాసములోఁ బాఠకుల కనులయెదుటఁ బెట్టియే యున్నాను. వానికిఁ బోలిక లున్నవి లేనిది యవి యేకకవికృతము లని తలంచుట కవకాశ మున్నది లేనిది నిర్ణయించుభారము పాఠకులదే. ఈసందర్భమున శాస్త్రిగారీగ్రంథమందలి షష్ఠ్యంతపద్యములకు నాశ్వాసాద్యంతపద్యములకు శ్రీనాథుని యితరగ్రంథములందలి పద్యములకువలె నర్థాన్వయవిచారము సేయవలసిపడ దనియు, గడబిడగా నుండుట కేమో పదము లమరియున్నవే కాని పరస్పరసంబంధము నర్థౌచిత్యము మొదలగున వెల్ల వీనిలోఁ బూజ్యమే యనియు నేను శైలి యనుపేరితోఁ బద్యముల నడకనుమాత్రము చూచి మోసపోతినే గాని నాయుదాహరించిన పద్యములకైన నర్థవిచారము సేయనైతి ననియు నేమేమియో వ్రాసిరి నేనుదాహరించిన పద్యములలోఁ దమకుఁ గలిగిన యర్థసందేహము లేవియో శాస్త్రిగారు చెప్పవలసియుండెను. వానిలోని యర్థరాహిత్యము నాకంతగా గోచరింపలేదు. షష్ఠ్యంత, ఆశ్వాసాద్యంతపద్యములలో నర్థాన్వయసౌలభ్యము కుదురనిచోట్లు కొన్ని కలవు. పరకల్పిత మని శాస్త్రిగారును (ఒకపక్షమున నేనుగూడ) నంగీకరించిన యవతారికలోని పద్యములు శైలివిషయమునఁ బేలవముగా నున్నను వానిలో నర్థాన్వయసౌలభ్యము లేకపోలేదు. అట్టిస్థితిలో శాస్త్రిగారిసిద్ధాంతము ప్రకార మవతారికాకర్తయే యీపద్యములుఁగూడ వ్రాసియున్నచో వీనిలోనే యీయర్థాన్వయవిచారము కుదురని తావు లేలకలుగవలెను. ఇంతకు ముఖ్యమయిన విషయము మన కీగ్రంథమునకు దొరకినవ్రాఁతప్రతి యొక్కటియే గదా! అది గూడ శిథిలాతిశిథిల మని శాస్త్రిగారే వ్రాసియున్నారు. వ్రాఁతప్రతులు పెక్కులు గాని మంచివిగాని దొరకవి కారణమునఁ గొన్నిపద్యములలో సరియైన కవిపాఠములను గుర్తించుట దుస్తరము. అర్థాన్వయసౌలభ్యము లేనివి, యతిస్థానములు తప్పినవి కూడఁ గొన్నిపద్యములు కథాభాగముననే కలవు. వానికి గతియేమి? శిథిలాతిశిథిల మయినయేకప్రతియొక్కయాధారముపై నిట్టివిషయములలో నేమిచెప్పుటకును గష్ట మనియే నామనవి. ఏమివ్రాసినను నవి యదృష్టనిర్ణయములే (hasty conclusions) యగును.

అవతారికలోని వని తాము చూపినదోషములు పదునొకండింటిలోను నెనిమిదింటిని మాత్రము దిద్దినే నవి తప్పులుగాక యొప్పులే యని వ్రాసితి ననియు నాసంస్కరణములు లోకమంగీకరింప దనియు, తమ కాపాటిజ్ఞానము

లేక విడిచిన తప్పులుగా నేను వానిని భావించుట ప్రమాదమనియు' వాదోష ములయినను దాము స్వయముగాఁ జేర్చినవి కాక యొకరుచూపఁగాఁ దా మనువదించిన వనియుఁ గూడ శాస్త్రిగారు సెలవిచ్చిరి. ఎవరు చూపినవయి నను వీనిని సంస్కరించుటలో నాయుద్దేశ్యము శాస్త్రిగారివాదమును ఖండిం చుటకుఁ గాని యాపద్యములు శ్రీనాథకృతములే యని నిరూపించుటకుఁ గాని, నాపాండిత్యమును బ్రదర్శించుటకుఁ గాని కాదు. విద్వద్విరుదాంకితు లగుశాస్త్రిగారు వీనిని సంస్కరించుపాటి పరిజ్ఞానము లేక వాని నట్లే విడిచి రని నేను భావింతునా? అవతారికాకారుఁ డెవఁడయినను నాతఁడు కేవలా ప్రౌఢుఁడుగా గణింపఁదగిన శుంఠ కా నేరఁ డని యందలిపద్యములఁ జదివిన వా రంగీకరింపకపో రని నానమ్మకము. శాస్త్రిగా రుదాహరించిన దోషము లలో నేను సవరించినవి స్వల్పపు మార్పులతో నిర్దుష్టము లగునవి కావున నే వాని నట్లు సవరించితిని. అట్టివానిని లేఖకదోషములుగాఁ గాక కవిపార ములుగా నేల గ్రహింపవలెనో నాకు బోధపడకున్నది. వానిని సవరించుట లో సాధ్య మయినంతవఱకుఁ గవ్యుద్దేశము ననుసరించితి ననియే నాయూహ. శాస్త్రిగారిసిద్ధాంతము ప్రకార మవతారిక నంతను నందలిపద్యములకంటె నెక్కుడుసమానపాటవాదులు గలిగినయాశ్వాసాద్యంతపద్యములను గూడ వ్రా సిన యాకవి యీపాటిస్వల్పదోషములఁ గూడ గుర్తెఱుంగనివాఁ డని భావిం చుట యుక్తమా? తా ముదాహరించినదోషములలోఁ దక్కినవాన్నింటి నేల యుపేక్షించితి ననియు వానినిగూడ సవరించిన బాగుండెడి దనియు, చిక్కయి నస్థలముల నట్లేవిడిచి గ్రంథమందుఁ జేయఁదగిన సంస్కరణముల ముందు ప్రక టింతు ననుటలో సారస్యము గలదా యని యు శాస్త్రిగారు ప్రశ్నించుచు న్నారు. నేను వీరు చూపినదోషము లన్నింటిని సవరించెద నని ప్రతిజ్ఞ పూన లేదు. ఈదోషము లనునవి యించుమించుగా లేఖకదోషములే గాని కవిదోష ము లయియుండ వని యెంచినవాఁడ నవుటచే నందుల కుదాహరణముగాఁ జిన్నిమార్పులతో నిర్దుష్టము లగుకొన్నింటిని మాత్రమే చూపియుంటిని. సం స్కార్త్యనైరంకుశ్య మీసవరణలలో లేదనియే నాతలంపు. మిగిలిన నాలుగు మాత్ర మేమంతచిక్కుస్థలములు? శాస్త్రిగారు వానిగూడవ యెత్తినా గనురు క యవి గూడఁ బరిశీలింతము.

(1) మల్లికార్జునకుత్పలం బర్థిబడసి :—ఇందులో నసలు కవిపాఠము "మల్లికార్జునకు" గాక "మల్లికార్జునుకు" అయియుండు నని నాయభిప్రాయము నుగాగము మిట్టితావులఁ బాక్షికం బని యాతనితలం పయియుండవచ్చును. కుమష్టికి ముందు నుగాగము ముంచనిప్రయోగములు ప్రామాణికకవుల కృతులలోఁ గూడ నెన్నిలేవు? కావున నిది యొకదోష మనుటకే వీలులేదు.

(2) పుణ్యఋషీశ్వరసప్తతుల్యులం బోలిన:—ఇచ్చటఁ బద్యమును బూర్తిగాఁ జూపుటయావశ్యకము.

ఉ. పోలయమున్మమాంబికలు పుణ్యచరిత్రుల భక్తియుక్తులం
బోలఁగఁ గాంచి రేమ్వరను బుణ్యఋషీశ్వరసప్తతుల్యులం
బోలిన పుత్రసప్తకము భూతహితార్థగుణప్రవృత్తికై
లాలితవిక్రమోన్నతుల లక్షణదివ్యవిచక్షణాత్ములన్.

ఇచ్చట మొదటిపాదములో "పుణ్య" శబ్ద మొకసారి వచ్చినది. కావున నాశబ్దమునే మరల రెండవపాదములో ఋషీశ్వరులకు విశేషణముగాఁ గవి ప్రయోగించియుండు నని తోఁచదు. "పోలిన" అని మూఁడవపాదము మొదటఁ బ్రయోగించినాఁడు గనుక "తుల్యులం" అని ద్వితీయపాదాంతమున వ్రాసి యుండఁడు. కవియొక్కపాఠము "పూర్వఋషీశ్వరసప్తకంబునుం బోలినపుత్రసప్తకము" అనినదై యుండునని నాయూహ. సహృదయు లాలోచింతురుగాక! మూఁడవపాదము చివర నున్న "ప్రకృతికై" కూడనపపాఠముగనే తోఁచుచున్నది. "ప్రవృత్తులన్" అనునది కవిపాఠము గానోపును.

(3) వైభవప్రఖ్యాతవరహరిశ్చంద్రుండు :— హరిశ్చంద్రుఁడు ప్రశస్తికెక్కినది సత్యమునకుఁ గాని వైభవమునకుఁ గా దని మూలల నున్నముసలమ్మలకుఁ గూడఁ దెలిసిన విఖ్యాతవిషయము. ఈపాటిజ్ఞానముకూడ మనయవతారికాకారునకు లేక యాతఁ డిట్లే యీవిశేషణము నుపయోగించె నని తలంచుట హాస్యాస్పదము. ఇచ్చటఁ గవిపాఠము మఱుగుపడి యెట్లో యపపాఠము నెలకొనిన దని నాయూహ. "వైభవప్రఖ్యాత వరనిర్జరేంద్రుండు" అనునదియో యట్టిది మఱొకటో కవిపాఠమై యుండు నేమో? లేక వైభవశబ్దస్థానముననే మఱియొకపదము ప్రయుక్తమ య్యుండెనో?

(4) ఘనుఁడు కొమరగిరింద్రుండు గలిగియుండు :—"కలిగియుండు" అనునది "కలితయశుఁడు" అనుదానికి మాఱుగ నెలకొనిన యపపాఠము కానోపును.

అవతారికయందలి దోషముల నిట్లు సవరించుటలో నాయుద్దేశ్య మా యవతారిక యంతయు శ్రీనాథకృతమే యని నిరూపించుటకుఁ గాదు. శాస్త్రిగా రట్లభిప్రాయపడుట ప్రమాదము. ఆపద్యములను వ్రాసిన దెవఁ డయిన నందలిదోషములు లేఖకదోషము లని నిరూపించుటయే నాయాశ యము. కావున "అవతారికాభాగ మితరపూరితమే యని త్రికరణశుద్ధిగ నంగీకరించుచుఁగూడ నాతప్పులు తప్పులు కావని సవరించుట వలని ప్రయో జన మేమియో కానరాకున్నది" అని వ్రాసినశాస్త్రిగారి కందలిప్రయోజన మిప్పుడయిన గోచరించు నని తలంచెదను. అవతారికాభాగములోఁ బరపూర ణము నే నంగీకరించుటకుఁ బ్రధానకారణ మందలి చాలపద్యము లప్రౌఢశైలి లో నుండుటయే ఈపరపూరణవిషయమున నేను సూచించినవి రెండుపక్ష ములు (1) పరిషత్తునకు దొరకినప్రతికి లేఖకుఁ డయినగుడిమెట్ల వెంకన గాని తత్పూర్వలేఖకులు గాని తమకుదొరకిన ప్రతిలో నవతారికాభాగము ఖిలమై యుండఁగా ఖిలభాగములను దమస్వంతకవిత్వముతోఁ బూరించుట. (2) శాం తయ్యకాలములోఁ గాని యాతనివంశీయుల కాలములోఁ గాని వారియజాగ్ర త్తచే నీయవతారికాభాగము శిథిలముకాఁగా వారు దానిని స్వహస్తముననో పరహస్తముననో పూరించుట. ఈవిషయమున శాస్త్రిగారు వ్రాసినఖండనోక్తు లలో సారస్య మగపడదు "ఒక్కయవతారికాభాగము మాత్రమే ఖిలమై మిగిలినభాగము గాకుండునా? అట్లు వాదించిన లోకము హర్షించునా?" అని శాస్త్రిగారు వ్రాసినారు. అవతారికాభాగము గ్రంథముయొక్క పైపత్త్ర ములలో నుండునది తాళపత్త్రగ్రంథములలో మొదటిపత్త్రములో చివరపత్త్ర ములో క్రిమిదష్టములై మధ్యపత్త్రములు నిల్చియున్న గ్రంథము లెన్నిలేవు? దీనిలో నసంభావ్య మేమియు లేదే శాస్త్రిగా రింతవిడ్డూరముగా వ్రాయుటకు! కీ॥ శే॥ శ్రీపోలవరము జమీందారుగారి కసలు దొరకిన హరవిలాసప్రతిలో నవతారికాభాగము లేనే లేదఁట. మఱియొకప్రతిలో నవతారికాభాగ ముండి చివరయాశ్వాసములు గలభాగము పోయియుండఁగా రెండుప్రతులను బట్టి యు గ్రంథము సమగ్రముగాఁ బ్రకటింపఁగల్గితి మని వారు వ్రాసియున్నారు.

శ్రీవారే ప్రకటించిన కదిరిపతిసుకనప్రతి కవతారికాభాగము దొరకనేలేదు గదా ! కావున నీగ్రంథముయొక్క యవతారిక ఖిలముకాఁగా నది పరపూరిత మయియుండు నని తలంచుటలో నబ్బుర మేమియు లేదు. పరిషత్తునకు దొరకినప్రతి శిథిలాతిశిథిల మనియు నందు గ్రంథపాతము లవతారికలోనే గాక కథాభాగములోఁ గూడఁ గలవనియు శాస్త్రిగారీపట్టున వ్రాసినవాక్యములకు సందర్భము లేదు. పరిషత్తునకు దొరకినప్రతియొక్క శిథిలస్థితి వెంకనాదులకు దొరకిన యసలు ప్రతిని గూర్చి నే నొనర్చిన యూహల కేమియు బాధకము కాఁజాలదు. మఱియు నవతారికయందలి కొన్నిపద్యములు శ్రీనాథకృతము లని యనుమానించుటకుఁ గూడఁ గొన్నియవకాశములు కాన్పించుచున్నవి. భీమఖండావతారికయందలి పద్యముం బోలిన పద్య మొకటి యీగ్రంథావతారికలోఁ గలదు. రెండింటిని జిత్తగింపుఁడు

సీ జగదేకసంస్తుత్య సౌభాగ్యసంపద రతిదేవిఁ బోలు నీరాజవదన
పరమపాతివ్రత్య భాగ్యగౌరవమున భూపుత్రిఁ బోలు నీపువ్వుఁబోఁడి
యక్షీణమహిమఁ గల్యాణవైభవమునఁ బార్వతిఁ బోలు నీపద్మగంధి
మృదుగభీరప్రౌఢమితభాషణంబుల భారతిఁ బోలు నీపరమసాధ్వి
యనుచు బంధులు వినుతింప నవసమించె, నధికశుభగాత్రి విశ్వనాయకునిపుత్రి
యన్నవిభుదేవమంత్రియర్ధాంగలక్ష్మి, రమ్యసద్గుణనికురుంబ రామమాంబ.
(భీమ ఆ 1 ప 56)

సీ పరమపాతివ్రత్య భావంబు తలఁపంగ గౌరి గాఁబోలు నీకాంత తలఁప
సకలసంపత్స్ఫూర్తి చాతుర్యమహిమల నిందిర గాఁబోలు నిందువదన
సకలవిద్యాప్రౌఢి నడిసన్నగరిమల భారతి గాఁబోలు భామయెపుడు
సర్వలక్షణగుణ సంపన్నతోన్నతి నింద్రాణి గాఁబోలు నిగురుఁబోఁణి
యనఁగ నిద్ధాత్రి నెప్పొద్దు నతిశయిల్లెఁ, బరఁగ ముమ్మడిదేవయ్య భామ జగతిఁ
గామితార్థకసంధానకల్పవల్లి, యుజ్జ్వలద్గుణనికురుంబ యొమ్మమాంబ.
(శివ ఆ 1 ప 34)

(ఈపద్యముఁ బరిషత్పత్రికలోఁ బ్రకటితమయినట్లే యుదాహరించితిని. ఇందలి లేఖకదోషములు సవరణ కావలసియుండును.)

ఇంక శ్రీనాథునికృతులందును, ఇతరకవులకృతులందును గృతిపతి కవిని గృతియిమ్మని ప్రార్థించినపిదపనే కృతిపతి వంశము వర్ణింపఁబడుట ప్రసిద్ధ

ము యుండఁగా నీగ్రంథములో నట్లులేక కృతిపతియే తనవంశమును వర్ణించుకొని పిదప కృతినర్థించి కొన్నట్లు గల దనియు నిది గూడ నవతారిక శ్రీనాథరచితము కా దనుట కొక ప్రమాణము కా జాలదా యనియు నవతారికాకారుఁడు హారవిలాసమార్గము నించుక యనుసరింప నెంచెను, గాని, కాలుజాఱిన దనియు శాస్త్రిగారు వ్రాసిరి. కాని యీవిషయములో శాస్త్రిగా రొకింత ప్రమాదమునకు లోనయి రనియే నామతము. వారీపట్టున వ్రాసినదంతయు వాస్తవము కాదు ముందే ప్రశంసయు లేకయే కృతిపతి వంశావతారవర్ణనానంతరమే యాతఁడు కృతి నిమ్మని కోరినట్లు గ్రంథములో లేదు. ఇష్టదేవతాప్రార్థనాద్యనంతరము శ్రీనాథు. డొక్క శైవకవితావిధానంబు రచింప నుద్యుక్తుఁ డయి యుండఁగా శ్రీశైలక్షేత్రమున నిండోలగం బున్న శాంతభిక్షావృత్తియతీశ్వరుండు తనమూలభృత్యుం డగు మల్లయ శాంతయ్యను శ్రీనాథునిఁ గూడఁ గనుంగొని యాగ్రంథమును శాంతయ్యపేర నుపన్యసింపు మని సెలవిచ్చె నను మొదలయిన సంగతులతో నీగ్రంథమున నాప్రార్థనాదికపద్యముల తరువాత నొకవచనభాగ మున్నది. దానిలోఁ జాల గ్రంథపాతము లుండుటచే దానియథార్థస్థితి పూర్తిగా నెఱుంగరా కున్నది. ఈవచనానంతరముననే శాంతయ్యయొక్క వంశావతారవర్ణన మున్నది. లుప్తమయిన వచనభాగములోఁ గవి యందుల కంగీకరించి కృతిపతివంశావతారం బభివర్ణించెద ననుమామూలు ప్రతిజ్ఞావాక్యములు పలికియుండవచ్చును. ఆవచనము మనకు సమగ్రముగా నిర్దుష్టముగా లభించినచో దానికిని వంశావతారవర్ణనానంతరము శాంతయ్య శ్రీనాథునితోఁ జెప్పినట్లున్న "వేడ్కఁ గవిసార్వభౌముని" అను పద్యమునకును దానితరువాతివచనమునకును సమన్వయమును జేసి యథార్థమును నిర్ణయింప వీలగునే కాని యదిలేనిది యిట్లు లవతారికాకారునిఁ గూర్చి హేళన మొనర్చుటయుక్తము కాదు.

దోషములు కథాభాగములోఁ గూడఁ గల వని చూపుటకయి నే నెక్కడనుండి శ్రీనాథునికవిత్వమో శాస్త్రిగారు స్పష్టముగాఁ బేర్కొనలే దని వ్రాసినా నని చెప్పుచుఁ గథారంభము 44 సంఖ్యలగల వచనమునుండి యని గ్రంథమే చెప్పుచుండఁ దామేల వ్రాయవలె నని సెలవిచ్చి యక్కడనుండి శ్రీనాథునికవితయే యని శ్రీనాథుఁడే కంఠరవమున వాక్రుచ్చుచున్నాఁ డని శాస్త్రిగా రావచనమునుండి కొంతభాగము నుదాహరించిరి. ఇట్లు వ్రాయుటకు ముందు శాస్త్రిగారు నావాక్యములను సరిగాఁ జదివి గ్రహించినట్లు కాన

రాదు. శాస్త్రిగారు తమపీఠికలో దోషములపట్టిక నుదాహరించి యట్లే గాక యింక ననేకదోషములును నప్రౌఢకవితాబంధమును నవతారికాభాగ ముననే యగపడుచున్న వని వ్రాసినారు. కాని యాదోషములలో రెండవతారికలోనివి గాక కథాభాగములోనివే యై యుండుటచే "మఱియు వీరుదాహరించిన దోషములలో "నల్వొబుచింత" (ఆ 1 ప 56) "కాకోదరగ్రామణికంఠగ్రైవేయము" (ఆ 1 ప 58) అను చివరవి రెండును నవతారికాభాగములోనివి గాక కథాభాగములోనివే యై యున్నవి గ్రంథము ప్రథమాశ్వాసములో నేపద్యమునుండి శ్రీనాథకృతమో వీరుతమ పీఠికలో వివరించియుండలేదు. కథాభాగము ఆ 1 ప 44 తోఁ బ్రారంభమయి యుండఁగా శాస్త్రిగా రుదాహరించిన పైరెండుదోషములకు గతియేమి?" అనియే నేను వ్రాసియున్నాను. అంతియే గాని కథారంభ మెచ్చటినుండియో తెలియక కాదు. కథారంభము 44 సంఖ్యగల వచనమునుండి యని నేనుగూడ నుదాహరించియే యుంటిని గదా! సరే దీనికేమి? ఈవచనారంభమునందు "అభ్యుదయపరంపరాభివృద్ధియు, నభిమతార్థసిద్ధియు, సత్యధర్మక్రియావృద్ధియు నగునట్లు..............." అనియున్నది గదా! శ్రీనాథుఁ డీగ్రంథము నెవరికి నంకిత మొసంగియుండనిచో నీయభ్యుదయాదు లుద్దేశింపఁబడిన దెవరికి? గ్రంథ మెవరి కంకితమిచ్చిన వారికే వర్తించు నను తలంపుతో ముందుగనే యిట్లు వ్రాసినాఁడని శాస్త్రిగా రనియెదరు కాఁబోలును

ఇఁక నీగ్రంథము శ్రీనాథునిచే శాంతయ్యకు స్వయముగా నంకిత మీయఁబడనిచో శ్రీనాథుని యాంత్యదశలో రాజమహేంద్రవరప్రాంతమున రచింపఁబడి యుండవలసిన యీకృతి శ్రీశైలమందలి శాంతయ్యకు లభించి యుండుట యసంభవ మని నేను వ్రాసినవాక్యమును మహాపూర్వపక్ష మని గేలిసేయుచు శాస్త్రిగారు నే సిట్టినిస్సార మయిన యుక్తి వ్రాయుట యాశ్చర్యముగా నున్న దని సెలవిచ్చి యీసందర్భమున నసంగతగ్రంథ మెంతయో వ్రాసియున్నారు.

"శ్రీనాథుఁడే యంకిత మిచ్చె ననుకొందము. అప్పుడే కవికృతిపతుల కెట్లు సమాగమము కలిగినది? శ్రీనాథుఁడు శాంతయ్య నెఱింగినపిమ్మట శ్రీశైలమున కేఁగినాఁడా? శ్రీశైలయాత్రయందే శాంతయ్య నెఱిఁగెనా? వీరిరువురకు నెట్లుసమావేశము కలిగిన దనుకొనుచున్నారో! గ్రంథము శాం

తయ్యకుఁ గూడ నట్లే లభించియుండును. అని శాస్త్రిగారు వ్రాసినది నాకుస
రిగా నర్థము కాలేదు. శ్రీనాథుఁడు శ్రీశైలమునకుఁ జిన్ననాఁటినుండియు
యాత్రలు సలుపుచు నచ్చటిభిక్షావృత్తిమఠజంగములతో స్నేహసంబంధము
ను గలిగియుండు ననుట కాతని శాసనగ్రంథములనుండి యుదాహరణములను
నేను నావ్యాసములోఁ జూపియే యున్నాను. శాంతయ్యయు శ్రీనాథుఁడు
నొకరినొక రెఱిఁగినస్నేహితు లయినప్పుడు వారిరువురకుఁ గవికృతిపతులసం
బంధ మేర్పడుట సర్వవిధముల సమంజసమే కాని యట్లు కానప్పుడు శ్రీనా
థుఁ డెచ్చటనో దూరదేశమందుఁ దనయంత్యదశలో నెవరికి నంకిత మీయ
కుండ రచించిన యీయేకలిఖితప్రతిని శ్రీశైలమందలి శాంతయ్య సంగ్రహిం
చి యుండుట యెట్లు పొసఁగునో నా కూహింపరాకున్నది. శ్రీనాథుఁ డంతకుఁ
బూర్వము శ్రీశైలమునకు రాకపోకలు సలుపువాఁడే యగుఁగాక! ఆవిషయ
ము పైసందర్భములో శాంతయ్య కీగ్రంథము లభించియుండుట కెట్లుసాధకము
కాఁగలదు? శాస్త్రిగా రీసందర్భమున సామ్యమునకుఁ గొనితెచ్చిన "ఎక్కడి
నన్నయభట్టు; ఎక్కడి తిక్కన; ఎక్కడి యెఱ్ఱన; వీరు మువ్వురు నొక్కకృతి నె
ట్లు పూరించిరి? ఎప్పటి రామభట్టు, ఎప్పటి తిక్కన నిర్వచనోత్తరరామాయ
ణము నెట్లు పూరించెను?" అను ప్రశ్నముల కిచ్చట బొత్తిగా సందర్భము లేదు.
నన్నయభారతము తిక్కననిర్వచనోత్తరరామాయణము ననమగ్రగ్రంథము
లయినను వ్రాసినంతవఱకు సమగ్రములే యయి యెవరో యొకరి కంకిత మయి
లోకమున బాహాటముగ వ్యాప్తము లయినగ్రంథములు. కావుననే కొన్నిశతా
బ్దులు గడచినను దరువాతికవులు వానిని బూరించుటకుఁ గారణ మయినది.
మనప్రస్తుతాంశ మట్టిది కాదు. శ్రీనాథుఁ డవతారికాదులే వ్రాయక గ్రంథ
మెవరికి నంకితమే యొసంగక దాని ననమగ్రస్థితిలో నే మూలనో పడవైచి
మరణించిన చో నది లోకములో వ్యాప్త మగుట కవకాశము చాలఁ దక్కు
వ. అట్టిస్థితిలో నాయేకలిఖితప్రతిని శాంతయ్య సంగ్రహించుటయు నసంభా
వ్యమే; మఱియు నీపట్టున శ్రీశాస్త్రిగారు శాంతభిక్షావృత్తి యొక్కఁడే శ్రీ
శైలవాసి గాని ముమ్మయశాంతయ్య గూడ నచ్చటివాఁడే యనుట కాధార
మేమున్న దనియు, గ్రంథావతారికలో శాంతయ్యపూర్వుఁడు పోలయ తూ
ర్పునాఁడు పాలించినట్లు చెప్పఁబడి చేవూరు, ఉత్పలము, లింగాల, చెరువాడు,
ఆతుకూరు, ఆముదాలపల్లి, ఆవ యనుగ్రామనామములు కూడ నుదాహృతము

లయిన వనియు, ఈతూర్పునాఁడు నీగ్రామములు నెచ్చటివో తెలిసిన శాంతయ్యనివాసస్థలాదులు తెలియవచ్చు ననియు సెలవిచ్చినారు. శాంతయపూర్వులెచ్చటివారైన నేమి? వా రార్జించినట్టియు, దాన మిప్పించినట్టియు గ్రామము లెచ్చటి వయిన నేమి? మమ్మముశాంతయ్య శాంతభిక్షావృత్తికాలువులో శ్రీశైలమందే యుండినట్లు మనగ్రంథావతారిక సాక్ష్య మిచ్చుచున్నది. నే విచారించినంతవఱకు శాంతయ్యకు సంబంధించిన యవతారికోదాహృతగ్రామములలో, చేవూరు నెల్లూరుజిల్లా కందుకూరుతాలూకా యందును, ఆతుకూరు (ఆత్మకూరు) ఆజిల్లాలోనే యాత్మకూరుతాలూకా యందును, అముదాలపల్లె యనుపేరు గల గ్రామములు కడపజిల్లా పొదిలితాలూకాలో నొకటియు, కృష్ణాజిల్లా నూజివీడుతాలూకాలో నొకటియు, లింగాలయను పేరు గలగ్రామములు కృష్ణాజిల్లా నందిగామతాలూకాలో నొకటియు, కయికలూరుతాలూకాలో నొకటియుఁ గానవచ్చుచున్నవి. ఈసంగతి సందర్భములఁ బట్టి శాంతయ్యపూర్వులు పాలించినతూర్పునాఁడు నెల్లూరుప్రాంతమై యుండు నేమో యని నేఁ దలంచుచున్నాను. ఏది యెట్లున్నను శాంతయ్య కాలము నాఁటి కాతఁడు భిక్షావృత్తికాలువులో శ్రీశైలమందే యుండినట్లు మనకు గ్రంథప్రమాణమే యుండ నీగోడవలతోఁ బనియేమి?

మఱియు శాంతయయు శ్రీనాథుఁడు సమకాలికు లని నిర్ణయించుటకు వివాదాస్పద మయినయీగ్రంథావతారికాభాగము తప్ప నిర్దుష్టమగు ప్రబలాధార మేదయిన నున్నదా యనియు, వా రిరువురు సమకాలమువారే యని నిర్ణయము గలిగినచోఁ దమ యభిప్రాయము తప్పక పొరపాటే యగుననియు, అట్టి ప్రమాణమునైన నేను జూప నయితి ననియు శ్రీశాస్త్రిగారు లిఖించిరి. ఇంతే గాక శాంతలింగ మనుభక్తుఁడు కృష్ణదేవరాయలకాలములో శ్రీశైలమునఁ గొన్నిధర్మకార్యము లొనర్చినట్లు శాసనములవలనఁ దెలియుచున్న దనియు (భారతి సం 1 సం 3 పుట 30) నాతఁడే మన మమ్మముశాంతయ్య కానోపు ననియుఁ గూడఁ దమయూహల కాధారముగా నీసందర్భమున సెలవిచ్చిరి! శాంతయ్య శ్రీనాథుని సమకాలీను లయినట్లు మనకు గ్రంథప్రమాణమే యున్నది దానినే సమర్థించి వాదించుచున్నవాఁడను నేను. కావున వారిసమకాలీనత్వమును నిర్ణయించు నితరప్రబలాధారములను జూపెడిభారము నాపయి నుండదు.

గ్రంథప్రమాణమును నిరాకరించెడి శాస్త్రిగారే శాంతయ్యయు శ్రీనాథుడు సమకాలికులు గారనుటకు శాసనాదిప్రబలాధారము లున్నచోఁ దమవాద సమర్థనమున కయి చూపవలసి యున్నది. శాస్త్రిగారు తమపయి నున్న భారము ను నాపైఁ ద్రోయుట న్యాయము కాదు. మఱియు వారుదాహరించిన శాంత లింగముయొక్క శ్రీశైలదానశాసనముకూడ నావాదమునకే యుపయోగిం చును గాని శాస్త్రిగారివాదమున కుపకరింపఁ జాలదు. భారతిలో శ్రీశైలక్షే త్రవర్ణనావసరమునఁ జేర్పఁబడిన యీశాసనము దొరతనమువారిచేఁ గాని యితరులచేఁ గాని యింతవఱకుఁ బ్రకటిత మయినట్లు కానరాదు చెన్నపురిలో నున్నమామిత్రులు శ్రీయుత మల్లంపల్లి సోమశేఖరశర్మగారికి వ్రాసి కనుఁగొనఁగా నీశాసనము కలియుగాబ్దములు 4611 అనఁగా శకాబ్దము 1433 (క్రీ॥శ॥ 1511) ప్రజోత్పత్తినామసంవత్సర మాఘ బ ౧౪ సోమవారమునాఁటి దనియు నిందలి దాత శాంతయ్యకొడుకు లింగయ్యగాని శాంతయ్య కాఁడనియుఁ దెలియఁ బఱిచిరి ఇందు దాతయొక్క వంశానుక్రమణిక యున్నదేమో తెలియ బఱుపుఁ డని కోరఁగాఁ దా మావిషయమును బరిశీలింప లేదనియు, త్వరలో శాసన పునకలును సంపాదించి పంపెద మనియు వారు సెలవిచ్చినారు. కాని కార్యాం తరప్రసక్తిచేఁ గాఁబోలు వారింతవఱకు దాని నాకుఁ బంపలేకపోయిరి. ఎట్లయినను నీశాసనమందలి శాంతలింగము శాస్త్రిగారూహించినట్లు ముమ్మయ శాంతయ్య కాఁజాలఁడు. శాంతలింగ మనఁగా శాంతయ్యకొడుకు లింగయ్య యైనట్లు శాసనమువలన నేర్పడినది కదా ! ఈలింగయ్య తండ్రి శాంతయ్య యే ముమ్మయశాంతయ్య యని యిదమిత్థముగా నిర్ణయింపలేము గాని యాతఁ డే యని యనుమానించుటకు మాత్రము ప్రబలావకాశము లున్నవి. శివరాత్రిమాహాత్మ్యగ్రంథావతారికలో "చటులజైనకోలాహలసమరబిరుదఘనుఁడు" అను విశేషణము శాంతయ్యకుఁ బ్రయుక్తమయి యుండఁగా శాసనములో శాంతయ్యకొడు కగు లింగయ్యకూడ శ్వేతాంబరజైనవధ గావించినట్టు లున్నదఁట. తండ్రికొడుకు లిరువురుఁగూడ జైనులతో సమరము లొనరించి యుండవచ్చును. లేదా యిట్టిది శాస్త్రిగారు సెలవిచ్చినట్టు లాకాలపు శైవ సామాన్యబిరుద మయినఁ గావచ్చును. తండ్రులబిరుదములు కొడుకులు ధరించుటగూడ నప్పటి సంప్రదాయమైనట్లు శాసనములు చదివినవారికెల్లఁ దెల్లమే. శాసనకాల మయిన క్రీ॥ శ॥ 1511 నాఁటికే సంగ్రామవిజయ, దానధర్మాది

కార్యములలో నాటితేటిన లింగయ్య కప్పటికి నలువది డెబ్బది సంవత్సరము ల వయస్సుండు ననుకొన్నచో నాతని జన్మకాలము క్రీ॥ శ॥ 1440, 1450 ప్రాంతము కాఁగలదు. శాస్త్రిగారును నేనును నిర్ణయించిన శివరాత్రిమాహాత్మ్యరచనాకాలముకూడ నిదియే గదా! కావున నీశాసనప్రమాణమును బట్టి కూడ లింగయ్య తండ్రియగు శాంతయ్య శ్రీనాథునకు సమకాలీనుఁడే యగుచున్నాఁడు ఇక్క డీప్రమాణమునుబట్టి యైనను శాస్త్రిగారు తా మిదివఱకు వ్రాసినమేరకుఁ దమయభిప్రాయము పొరపాటే యని యంగీకరింతురా?

శాంతభిక్షావృత్తియతీంద్రుని యాజ్ఞానుసారముగనే గౌరనమహాకవి నవనాథచరిత్రమును శ్రీశైలమల్లికార్జునస్వామి కంకితముగా రచించియున్నాఁడు. అందుచే శాంతభిక్షావృత్తి. గౌరన, శ్రీనాథుఁడు; ముమ్మయశాంతయ్యయు నొక్కకాలమువా రని బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తమ శృంగారశ్రీనాథములో వ్రాసియున్నారు శ్రీప్రభాకరశాస్త్రిగారు మన సాంబమూర్తిశాస్త్రిగారి కత్యంతశ్రేయోభిలాషులు నాచార్యవిశేషులు నంట. అయినను శాంతయ్య శ్రీనాథుల సమకాలీనతావిషయమున నాచార్యవచనములఁ గూడ విశ్వసింపఁజాలక, శ్రీప్రభాకరశాస్త్రిగా రిట్లు వ్రాయుటకు వారికిఁగూడ నీశివరాత్రిమాహాత్మ్యావతారిక తప్ప వే ఆధారము లేదనియు, ఆకాలమందే యీగ్రంథముకూడ శ్రీనాథునిచే శాంతయ్యకు స్వయముగా నంకిత మీయఁబడినచో గౌరన నవనాథచరిత్రాదులవలెను శ్రీనాథుని యితరకృతులవలెను నెన్నఁటికో యొకనాఁటికి శిధిలము గాకుండ, గ్రంథపాతములు లేకుండ లోకమును సంశయముపాల్సేయకుండనే లభింపక గ్రంథ మనాదరింపఁబడి కొంతభాగము శిధిలము కానేల యనియు దాని నెన్నఁడో యెవరో కవితాహీనులు పూరింపనేల యని యు దానిప్రారబ్ధమా యని యు శ్రీసాంబమూర్తిశాస్త్రిగారు ప్రశ్నించినారు. ఇందులకుఁ గారణము దానిప్రారబ్ధముగాక మనప్రారబ్ధ మని నాసమాధానము. ఎన్నిగ్రంథములు శిధిలములు గాలేదు. నామావశిష్టములు గాలేదు? అ దంతయు మనప్రారబ్ధముగాక మఱేమి? గౌరననవనాథచరిత్రముమాత్రము మనకు సమగ్రముగా లభించినదా? శ్రీనాథకృతములే యయిన మరుత్తరాట్చరిత్రము, శాలివాహనసప్తశతి, పండితారాధ్యచరిత్రము మున్నగునవి యీమాత్రమయిన దొరకక నామావశిష్టములయినవేమి?

నవనాథచరిత్రమున శాంతభిక్షావృత్తి యే యేవిశేషణములతో వర్ణింపఁబడెనో యావిశేషణములతోనే శివరాత్రిమాహాత్మ్యమున నాతనిభృత్యులగుశాంతయ్యయు నాతనితండ్రియు వర్ణింపఁబడి రనియు శాంతభిక్షావృత్తికాలముననే యీయవతారికా భాగము రచింపఁబడినచో గురుసన్నిధానమున వా రిట్లు వర్ణింపఁబడుట యసంభవ మనియు, కావున శ్రీనాథునకు సమకాలీనుఁ డయినశాంతభిక్షావృత్తికాలమున నది రచింపఁబడలే దనుట కిది కూడ నొకప్రమాణ మనియు, కనుక నది శ్రీనాథరచితము గా దని తేలుచున్న దనియు మఱియొకవాదమును గూడ శాస్త్రిగారు ప్రతిపాదించిరి. కాని యీయాక్షేపణము యథార్థము బలీయము గా దని మనవి సేయుచున్నాను. శాంతభిక్షావృత్తి యతీశ్వరుఁడు వీరశైవుల పంచసింహాసనములలో నొకటి యగు శ్రీశైలసింహాసనమున కధీశ్వరుఁ డయినను నాతఁడు గూడ జంగముఁడే జంగములలో నెవరో యొకరు సింహాసనాధీశ్వరు లయినను వారిశిష్యులు కొందఱు కారణమును (దీక్షాధికారాదులను) బడసి మఱొకమఠమున కధిపతు లగుటయు నామఠమునకుఁ జెందిన శిష్యవర్గమునకు గురుత్వము నెఱపుటయుఁ గలదు. ఈగురుస్వాములలో షట్స్థలమూర్తి, చరపట్టపుదేవర, కారణమూర్తి మున్నగునధికారిభేదములుకూడఁ గలవు కావున శాంతయ్యకుఁ గాని యాతనితండ్రికిఁ గాని గురుస్వాముల కుచితము లయినవిశేషణము లేమయిన మన గ్రంథావతారికలోఁ బ్రయుక్తము లయి యున్నను నవి శాంతభిక్షావృత్తియతీశ్వరునెడ నవినయమును బ్రకటించునవి కానేరవు ఇంతకు శాస్త్రిగారు వ్రాసినట్లు శాంతయ్యకు నాతనితండ్రికిఁ బ్రయుక్తము లయిన యట్టి విశేషణము లేవియు నా కీగ్రంథావతారికలోఁ గానవచ్చుట లేదు.

సీ. పంచాక్షరీమంత్రపారిజాతోద్భూతఫలము లేగురువుసంభాషణములు
వీరశైవాచారవిమలమార్గానూనశాశ్వతం బేగురుస్వామిమహిమ
నిఖిలదేశాధీశనివహాప్రమేయకపాత్ర మేగురుమూర్తిపాదయుగళి
శంకరపూజాప్రశస్తదీక్షాజనాహ్లాద మేగురుహస్తాంబుజాత

మనఁగఁ బండితచెనమల్లికార్జునునకుఁ(బాత్ర)రత్నంబు సెట్టియ ప్రభుసుతుండు
మారమాంబాతనూజుండు మహితయశుఁడు, వెలయు ముమ్మసిదేవయ్య

( ఆ 1 ప 28) వినుతకీర్తి.

అనుపద్యమును సరిగా నన్వయము చేసికొనకపోవుటయే శాస్త్రిగారిట్టి ప్రమాదసంకలిత వాక్యములను వ్రాయుటకుఁ గారణ మయిన దని తలంచుచు న్నాను. ఈపద్యమందలివిశేషణములు శాంతయ్యతండ్రియగు ముమ్మడిదేవయ్యకుఁగాకయాతనిపూర్వుఁడో గురుఁడోయగుపండిత చెనమల్లికార్జునునకు వర్తించునని నాయభిప్రాయము గీతపద్యారంభమున నున్న "అనఁగ" అనుపదమునకు సరియైన కవిపారము "అట్టి" యై యుండవలెను. సీసపాదములలో యచ్ఛబ్దము ప్రయుక్త మయినప్పుడే గీతారంభమునందుఁ దచ్ఛబ్దము ప్రయోగింపఁబడినప్పుడే సరియైన సమన్వయ మేర్పడునుగదా! మఱియు గీతపద్యద్వితీయపాదారంభమునఁ గ్రంథపాతమునకుఁగాఁబోలు, పరిషత్తువారు కుండలీకరణములోఁ జూపిన "పాత్ర" అను పూరణముకూడ సరియైనదిగఁ గాన్పింపదు. ఏల యనఁగా నవతారికయందలి వంశానుక్రమణికను బరికింపఁగా ముమ్మడి దేవయ్య తాత పోలిదేవయ్యయే గాని చెనమల్లికార్జునుఁడు గాఁ గాన్పింపఁడు. కావున దీనికి సరియగుపారము "భక్త" అనియో యట్టిది మఱొకటో యై యుండును. ఈపద్యమందలి విశేషణము లయినను శాంతభిక్షావృత్తికి నవనాథచరిత్రమున గౌరనయుపయోగించినవిశేషణములతోఁ బోలిక కలవి కావు. ఎటుచూచినను భిక్షావృత్తికిఁ గలవిశేషణములలో జైనమతవిధ్వంససూచక బిరుదములు మాత్రమే. శాంతయ్యకు నాతనిపూర్వులలోఁ గొందఱకుఁ గూడ నీగ్రంథావతారికలోఁ జేర్పఁబడినవి. ఇవి యాకాలమందలి వీరశైవులకు సామాన్యవిశేషణము లయియుండనోపు నని శాస్త్రిగారే సెలవిచ్చినారు కదా! కావున నీవిషయము శాస్త్రిగారివాదమున కేమియు నుపకరింపనేర దని నా మనవి.

II. కథకు మూల మేది?:—ఈకథ స్కాందపురాణమందలి శంకరసంహితలోని దని నావాదము. దీనికి మూలమే లే దనియుఁ గాశీఖండములోని గుణనిధిచరిత్రమందు వర్ణితమయిన శివరాత్రిమహత్త్వముతోఁ దనివిసెందక దానిని విస్తరించు తలంపుతోడను, బాణుని కాదంబరియందుఁ దనకుఁ గలయభిమానముచే నందలివర్ణనలఁ జాలవఱకుఁ గ్రహించి యిందుఁ జొనుపు నిచ్ఛతోడను పాత్రములపేరులు మార్చి శ్రీనాథుఁ డిట్టిగ్రంథమును వెలయించి శివరాత్రిని బూజించినాఁ డని శాస్త్రిగారివాదము శ్రీదేవిడీజమీందారుగారి శైవగ్రంథాలయమున లభించినశంకరసంహితను దీసి చదువఁగా నీ

కథ శాస్త్రిగారి కంటఁ గనిపించలేదఁట. అందుచే నిది శంకరసంహితలోని దన వీలు లేద ట. శంకరసంహితయం దేఖండమం దే కాండములో నీకథగలదో చూపెడిభారము నాయందే కల దఁట. అట్లు నేను జూపునంతవఱకుఁ దను వాదమున కెట్టిబాధకమును లేదఁట. కాని యీపట్టున శాస్త్రిగారు తమవా దము నెల్ల నొక్కపెట్టునఁ బటాపంచలొనర్చు నొక్కప్రబలవిషయమును జల్లఁ గా జాఱవిడిచి యందుఁగూర్చి తమదీర్ఘవ్యాసములో నెచ్చటను నేమియు ముచ్చటింపరయిరి ఈశివరాత్రిమాహాత్మ్యము శంకరసంహితలోని దని సూత ముఖమున ముక్తకంఠములో వాక్రుచ్చినవాఁడు శ్రీనాథుఁడు. ఆతనిపద్యము ను నాపూర్వవ్యాసములో నిచ్చియే యున్నాను మరల నుదాహరించు చున్నాను.

ఉ. తాపససార్వభౌములు సదా శివరాత్రిమహావ్రతంబు దో
పాపహ్యతిక్రమంబు వినుఁ డాదరణంబున నేను సద్గురు
శ్రీపదపద్మములఁ దలఁచి చెప్పెద శంకరసంహితాకథా
దీపితభవ్యమార్గమునఁ దేటపడఁగ మొదలింటినుండియున్.

శ్రీనాథవిరచితకథాభాగము ఆ 1 లో 44 సంఖ్యగల వచనమునుండి యని యు నాసంగతి "పరమేశ్వరప్రియంబై, పార్వతీమనోహరంబయి శ్రీనా థసేవితంబయి.........."అనుతద్వచనపు దలి వాక్యములచే శ్రీనాథుఁడే కంఠ రవంబునఁ జెప్పియుండ నెక్కడనుండి శ్రీనాథుని కవిత్వమో శాస్త్రిగారు గ్రం థపీఠికలో స్పష్టపఱుప లేదు నేనడుగనేల యనియు సెలవిచ్చిన శాస్త్రిగారు 49 సంఖ్యగల పయిపద్యము తప్పక శ్రీనాథునిదే యని యంగీకరింతురా లేక యిచ్చటఁగూడ నప్రౌఢుఁ డగునవతారికాకారుని హస్తకౌశలమును బ్రవేశపె ట్టెదరా? శ్రీనాథునికవిత్వ మెచ్చటనుండి యని నే నడిగినది శాస్త్రిగా రిట్టి దాఁటు వేయకుండుటకే. శ్రీనాథుఁడీగ్రంథమును శంకరసంహితాకథాదీపితభ వ్యమార్గమునఁ జెప్పుచుంటినని ఘోషించుచుండఁగా శాస్త్రిగారియుత్ప్రేక్షాల కవకాశ మెక్కడనున్నది. శాస్త్రిగారియూహలే సరియైనచో శ్రీనాథుఁడు నిజ మునే ప్రకటింపక యిట్టియబద్ధమును వ్రాసి లోకమును వంచింపనేల? కాశీఖం డములోని కథయే యిట్లు మార్చి పెంచి వ్రాయుచుంటి ననినచో గ్రంథ మనా దరింపఁబడు ననియు, కృతిభర్త సంభావింపఁ డనియు వెఱచి యిట్లొనర్చెనని శాస్త్రిగారు లోకప్రతారణబుద్ధిని నాకారోపించినట్లే శ్రీనాథునకుఁ గూడ

నారోపింప సాహసించెదరా ? శ్రీనాథుని స్వంతవాక్యములకే యప్రామాణ్యము నాపాదించి నూత్నసిద్ధాంతమును నెలకొల్పు శాస్త్రిగారిమీఁదనే వారివాదమును సమర్థించు ప్రబలప్రమాణములను జూపెడిభార ముండును గాని గ్రంథప్రమాణమునే యనుసరించు నాపయి నెట్టిభారము నుండనేరదు. కాశీఖండము సనత్కుమారసంహితలోనిది. ఆవిషయము శాస్త్రిగారే యంగీకరించిరి. (ఆం॥ సా॥ పరిషత్పత్త్రిక సం 15 సం 2 లోని "శ్రీస్కాందపురాణము" అను వారివ్యాసముచూడుఁడు) శ్రీనాథుఁడు గైకొన్నయీకథ శంకరసంహితలోనిదని యాతఁడే ఘంటాపథముగఁ జాటినాఁడు గదా! రెంటికిని బోలిక లున్నమాట నిజము ఇట్టికథయే వేదనిధిచరిత్ర మనుపేరితో శివపురాణము విద్యేశ్వరసంహితలోఁ గూడ సంగ్రహముగ నున్నది.

కావుననే, పురాణములలో సమానసామ్యము × కథలు వేర్వేఱుతావుల వర్ణింపఁబడుట యసామాన్యము కాదని యీ సందర్భమును మహార్ణవముతో నుపమింపఁబడిన స్కాందపురాణవిషయమునఁ జెప్పవలసినది లేదనియు నేను వ్రాసినది- అట్టిపట్టులఁ జూపకయే నేనిట్లు వ్రాయుటలోఁ బసలేదని శాస్త్రిగారొనర్చిన యవహేళన మనవసరము, గ్రంథవిస్తర మొనర్చుచు నేఁ జూపనేల? పురాణగ్రంథపఠన మొనర్చెడివారికెల్ల నిది తెల్లమే. స్కాందపురాణ మింతవఱకు యథారూపముగ సమగ్రముగ లోకమునకు లభింపనేలేదు. అందలి మహాపురాణోపపురాణసంహితాఖండాత్మకవిభాగాదికములఁగూర్చి వాదోపవాదములు జరుగుచునేయున్నవి. శ్రీనాథునికి లభించిన శంకరసంహితాప్రతియు శాస్త్రిగారు చిత్తగించినప్రతియు నొక్కటే యని యెట్లు చెప్పఁగలము కాదంబర్యనుసరణ మిందు హెచ్చుగా నున్నమాట వాస్తవమే. అది నేఁజెప్పినట్లు కాదంబరియందు శ్రీనాథునకుఁ గలయభిమానమునే సూచించును గాని యాతనివాక్యప్రమాణమునకే మూలచ్ఛేద మొనర్చు శాస్త్రిగారివింతవాదమున కెట్లు లుపకరించును? శ్రీనాథుఁడు తనగ్రంథములలో నొక్క కాదంబరినుండియే కాదు. మయూరుని సూర్యశతకము, మురారి యనర్ఘరాఘవము, కాళిదాసుని కావ్యనాటకములు, భవభూతియుత్తరరామచరిత్రము మున్నగు నుత్తమగ్రంథములనుండి యనుకరణములఁ గైకొని యాగీర్వాణకవీశ్వరులపయిఁ దనకుఁగల పూజ్యభావమును బ్రకటించియున్నాఁడు మఱియు బాణుఁడు తనకాదంబరీవర్ణనములఁ గూడఁ గొంతవఱకు స్కాందపురాణాదుల

నుండియే యనుకరించి యుండఁగూడదా! కవికులగురుఁ డనియాతనిచే నుతింపఁబడిన కాళిదాసుఁడు వ్యాసవాల్మీకుల కెంతదాసత్వము నెఱపెనో శాస్త్రిగారెఱుఁగరా? అట్టిచో బాణుఁడు కూడ నామార్గమునే యనుసరించి యుండఁగూడదా? ఎంతటివారి కయినను బూర్వకవీంద్రారాధన రూపకమగు నీయనుకరణము కొలఁదిగనో గొప్పగనో తప్పనిసరియే యగుచున్నది. కావున శివరాత్రిమాహాత్మ్యమందలి కాశీఖండాంతర్గత గుణనిధికథాసామ్యమును, కాదంబరీవర్ణనానుసరణమును శాస్త్రిగారి సిద్ధాంతమును నిలుపనేరవని నామనవి. ఈగ్రంథమందుఁ గాదంబరీవర్ణనముల తెలుఁగుసేఁతలు, కాశీఖండభీమఖండరచనముల పరివర్తనములు చేరుటకుఁ గారణమిది. శీఘ్రతరముగా నే పదియిర్వదిదినములలోనో శ్రీనాథునిచే శ్రీశైలమందు రచింపఁబడుటయేయని శ్రీప్రభాకరశాస్త్రిగారు శృంగారశ్రీనాథములో సెలవిచ్చియున్నారు. అంతకుఁ బూర్వ మిట్టియభిప్రాయమునే నేనుగూడ "శివరాత్రిమాహాత్మ్యరచనాకాల విమర్శనము" అను నావ్యాసములోఁ దెలిపియుంటిని. శ్రీసాంబమూర్తిశాస్త్రిగారి కాచార్యవచనములందయినఁ బ్రమాణబుద్ధి కుదరకుండుట శోచనీయము.

III గ్రంథముయొక్క సమగ్రతాసమగ్రతలు:—మన కుపలబ్ధమయినంతవఱ కీగ్రంథ మసమగ్రమని చతుర్థాశ్వాసాంతమున నున్న "గీ॥ పరమమునులు సూత్యాహసంభవుని సూతు । భక్తిఁ బూజించి యధికతాత్పర్యగరిమ । భటులు ప్రమథులచే భంగపడుట చూచి । చిన్నఁబోయి యముం డేమి చేసెఁ బిదప." అనుపద్యముచే నేనేకాదు పలువు రభిప్రాయపడుచున్నారు. కవి యవతారికలోఁ బ్రతిజ్ఞచేసిన యురులింగోద్భవంబు, శివరాత్రిమాహాత్మ్యము ననుకథ లింతటితోఁ బూర్తియైనవి గనుక గ్రంథముకూడ నింతతో సమాప్తమే యని శాస్త్రిగారివాదము. ఈవిషయమునఁగూడ వారు నావ్యాసాంశములను జాల విపులముగ విమర్శించి సమాధానములను వ్రాసినారు. కాని యవి తృప్తికరములుగ లేవని నామనవి. అవతారికాభాగమందలి "ఉరులింగోద్భవంబు శివరాత్రిమాహాత్మ్యంబు........కథాభిధానంబు" అనువాక్యములు శ్రీనాథకృతములయినను గాకపోయినను నందలి గ్రంథపాతములోని లుప్తభాగములో శాస్త్రిగారు సెలవిచ్చినట్లు "నను" అను రెండక్షరములు మాత్రమే యుండు ననుకొందము. శివరాత్రిమాహాత్మ్యకథలోనే సుకుమారుని శివ

సాయుజ్యానంతరము, యమభటులకుఁ బ్రమథులకు జరగినయుద్ధవిశేషాదులు వర్ణింపఁబడఁగూడదా ! శివకింకరులు సుకుమారుని శివలోకమునకుఁ గొనిపోకపూర్వము యముండు శివునితోఁ బోరాడి యపరమార్కండేయోపాఖ్యానము నావిర్భవింపఁ జేసినను గొంత బాగుండు నేమో గాని, కావలసిన పని (సుకుమారుని శివసాయుజ్యము) యై తనకు శృంగభంగము కలిగినప్పుడు యముఁడు చిన్నఁబోయి మాత్ర మేమి చేయును ? తెలివితక్కువగా గతజలసేతుబంధనమున కయి యహంకరించి శివునితోఁ బోరాడి పరాజయమందునా లేక యసహాయోద్యము నవలంబించి యుద్యోగవిసర్జన మొనరించునా యనెడి శాస్త్రిగారి సమాధానములు వారిరచనాచమత్కారప్రదర్శకము లయి చాల సొంపుసింపుచున్నవే గాని మనవాదాంశమున కంతగా నుపకరించునవి గావని నామనవి. కవి యుత్తరాశ్వాసములలోఁ గథనెట్లు విస్తరించి పరిణమింపఁజేసెనో యెవరుచెప్పఁగలరు. నిరంకుశు లగుకవులను శాసించువా రెవరు ? చతుర్థాశ్వాసాంతమందలి పయిగీతపద్యము తమ వాదమునకుఁ బ్రబలబాధకముగా నున్నదని శాస్త్రిగారు పూర్తిగా నెఱుంగుదురు దానిని ద్రోసిపుచ్చుటకు గత్యంతర మేమియు దొరకకపోవుటచే వారు పాప మిచ్చుటఁ గూడ నవతారికాకారునిసే యాశ్రయింపవలసివచ్చుట శోచనీయము. మొట్టమొదట గ్రంథపీఠికలో నవతారికాభాగమునకుమాత్రమే సంబంధింపఁజేసిన యీయప్రౌఢుని నవసరమునుబట్టి నావిమర్శనాంశములకు సమాధానములు వ్రాయుటకయి యాశ్వాసాద్యంతపద్యములలోనికిఁ గూడ నవతరింపఁజేసిరి. మరల నిప్పు డీయాశ్వాసాంతపద్యములనుండి యించుక పైకి వనఁగాఁ గథాభాగాంతపద్యములలోనికిఁ గూడ నెక్కించుచున్నారు మఱియు నవసరము వెంబడిని "తాః ససార్వభౌములు......" మున్నగు కథాభాగాంతర్గతపద్యములలోనికిఁ గూడఁ బ్రవేశింపఁజేయుదురు కాఁబోలు. విద్వత్కవీశ్వరు లగువీరు "నిరంకుశాః కవయః" యను నానుడిని సార్థక మొనర్పవలయునుగదా ! పయిపద్య మేవిషయమునను శ్రీనాథునిపద్యములకుఁ దీసిపోవునది కాదు అది శ్రీనాథకృతము కాదనుట కెట్టియాధారమును లేదు అవతారికాకారుఁ డప్రౌఢుం డగుటచే గతించన యాశ్వాసముల చివర నుత్తరకథాసూచకము లగుప్రశ్నాత్మకపద్యము లుండుటచే నిచ్చుటఁగూడ నిట్టిపద్య మొకటి యుండితీఱవలె నని యిట్టి యసందర్భపద్యములను వ్రాసెనఁట. ఇదియే

నాయాక్షేపమునకు సరియైన సమాధాన మని యట్లు తలంచినచో నిందలిచిక్కు విడిపోవు ననియు శాస్త్రిగారు సెలవిచ్చినారు. పాప మవతారికాకారుఁడు వీరిచేతిలో నెంతచులక నయిపోయినాఁడు! శాస్త్రిగా రాతని నెంతచిన్నచూపు చూచినను, అవతారికాశ్వాసాద్యంతపద్యములఁబట్టియైనను నాతఁడు కేవల మంతయర్థజ్ఞానసందర్భశుద్ధిశూన్యుఁడుగాఁ గాన్పింపఁడే! శాస్త్రిగారు సెలవిచ్చినట్లు ప్రశ్నార్థకపద్యములు పూర్వాశ్వాసము లన్నిటిచివరను లేవు. మూఁడవ యాశ్వాసము చివర నిట్టిపద్య మేదియుఁ గానరాదు. అనవసరశ్రమఁ దీసికొని యిట్టిపద్యమును రచించి చతుర్థాశ్వాసాంతమున నిలుపుట కవతారికాకారునకుఁ బని యేమి? ఆతనికిఁ గావలసినది శాస్త్రిగారి సిద్ధాంతముప్రకారము, అవతారికాశ్వాసాద్యంతపద్యముల నేతిప్పలు పడియో యేకల్లబొల్లిమాటలతోనో యల్లి గ్రంథము నెట్లయిన ముమ్మయశాంతయ్యకంటఁగట్టుట యేగదా! అట్టిచో నాతఁడు పయిపద్యము ననవసరముగా రచించు వృథాశ్రమనుగూడ నెత్తిపైఁబడవైచికొన నేల? ఈ తెలివిమాలినపనిచేత నీశ్రమ మంతతోఁ దీఱునా? ఉత్తరకథాసూచకముగ నిట్టియసందర్భపుఁబద్యము వ్రాయుచో దానితో నాతరువాతికథ (అది శాస్త్రిగారు సెలవిచ్చినట్లు సందర్భరహిత మయినదే కానిండు) నల్లెడిభారముగూడ నాతనిమీఁదనే పడునుగదా! కావున నీపద్యము శ్రీనాథేతరులు రచించియుండరని సహృదయులు సమ్మతింపరని నానమ్మకము. మఱియు నీపద్యమునకు ముందున్నవచనములో "పుణ్యవంతులభాగ్యమునకుఁ గొలంది కలదె" యనుసూతవాక్యముతో శివరాత్రిమాహాత్మ్యము ననుబంధించిన గ్రంథమెల్లఁ బూర్తినొందిన దనియు నందుచే నాపైని బ్రశ్నింపఁబడిన కథ శివరాత్రిమాహాత్మ్యమున కించుకంతయు నుపకరింపఁదనుట యెల్ల రంగీకరింపవలసినవిషయ మనియు సాంబమూర్తిశాస్త్రిగారు శాసించినారు కాని యాపయివచనమునందే "పుణ్యవంతుల భాగ్యమునకుఁ గొలందికలదె" యను మాటలతరువాతనే "యింక నెయ్యది (వినవలతు) రడుగుం డని సూతుండు నైమిశారణ్యవాసులగు మహామునులకు సవినయంబును సస్నేహంబును సగౌరవంబునుగా విన్నవించిన" అనుమాటలుకూడ నుండి యాతరువాతనే పయి గీతపద్య మున్నది. ఈవాక్యములకు గతియేమి? ఇవికూడ నవతారికాకారుఁడు రచించినవే యని శాస్త్రిగారు మరల నిప్పుడు చెప్పవత్తురుకాఁబోలును. ఇవి శ్రీనాథరచితములు గాక "పుణ్యవంతుల భాగ్యంబునకుఁ గొలందికలదె" అను

పలుకులతోనే యంతయర్థసౌష్ఠవవిహీనముగనే వాక్యావసానమయి శ్రీనాథునికవిత్వ మంతటితోనే యంతమయిన దని సహృదయులు సమ్మతింతురా? అట్లుగాక యీవాక్యములు మాత్రము శ్రీనాథరచితములే యని యంగీకరించినచో వాని ననుబంధించిన తరువాతిగీతపద్యములుగూడ నాతఁడే రచించె నని యంగీకరింపవలసియుండును దానినిబట్టి యుత్తరకథ యింకను గొంత యుండవలె నని తప్పక యేర్పడితీఱును "కవ్యుద్దేశము శివరాత్రివ్రతమాచరించుటవలన ననంతఫలము లభించు నని తెలియఁజేయుటయే కాని యేదో యొకనిర్దిష్టగ్రంథము నెల్ల నాంధ్రీకరించుట కాదని యీవఱకే వ్రాసియుంటిని" అని శాస్త్రిగారు వ్రాసినారు కాని యది వారియభిప్రాయమేగాని సత్యబద్ధమయిన సిద్ధాంతము కానేరదు. "సద్గురుశ్రీపదపద్మముల్ దలఁచి చెప్పెద శంకరసంహితార్థాదీపితభవ్యమార్గమునఁ దేటపడన్ మొదలింటినుండియున్" అని శ్రీనాథుఁడు స్వయముగా వ్రాసినదానినిబట్టి శంకరసంహితలోని కథ నెల్ల సాంతముగఁ దెలిఁగించుటయే యాతనియుద్దేశ మని స్పష్టపడుచున్నది.

మఱియు మనయుపలబ్ధగ్రంథ మసమగ్రమే యనుటకు నేను నాపూర్వవ్యాసములో వ్రాయ మఱచిన ముఖ్యకారణము లింకను నొండు రెండు గలవు. శ్రీనాథుఁడు సమగ్రముగా రచించిన గ్రంథము లన్నిటియందును జివర ఫలశ్రుతిని దప్పక చెప్పుచు వచ్చినాఁడు. కాని శివరాత్రిమాహాత్మ్య మని పేరిడిన యిట్టియుత్తమగ్రంథము చివర నట్టి దేదియుఁ గానరాదు. ఆశ్వాసాంతముల గద్యలను గూడ వ్రాసినప్పుడు గ్రంథ మింతటితోనే సమాప్తమయినచో నట్టి ఫలశ్రుతిని శ్రీనాథుఁడు చెప్పి యుండఁడా? మఱియు నాతనిసమగ్రగ్రంథములలోఁ గడపటియాశ్వాసాంతగద్యలలోఁ జివరను "సర్వము సంపూర్ణము" అని యుండియున్నది. ఈగ్రంథమం దట్టిది గానరాక "శివరాత్రిమాహాత్మ్యమునందుఁ జతుర్థాశ్వాసము" అని మాత్రమే యున్నది. కావున నీవిషయములుగూడ నుపలబ్ధగ్రంథ మసమగ్ర మనెడివావాదమునకే తోడువలుకుచున్నవి.

మహాశయులారా! శాస్త్రిగారివిమర్శనము ప్రకటితమయి యిప్పటికిఁ జాలకాల మయినది. ఇట్టివిషయములు త్వరలో వెలువడు దినపత్రికలలోఁ గాని మాసపత్రికలలోఁగాని చర్చింపఁబడుట యుపయోగముకాని యేఁడాదికొకసారి ప్రకటితమగు సంవత్సరాదిసంచికలో వ్రాయఁబడుట మేలుకా దని శాస్త్రిగారు తమవ్యాసాంతమున హెచ్చరించి యున్నారు. నామొదటివ్యాస

ము క్రోధనసంచికలోఁ బ్రకటిత మయినప్పుడు వయిన్యాయ మెఱింగిన శాస్త్రి గారు దానికి సమాధానము మరలఁ దరువాతియుగాదిసంచికలోఁగాక యంతకుముం దే యితరపత్రికలలో నయినఁ బ్రకటించిన బాగుండెడిది కాని వా రట్లొనర్చి యుండ లేదు. వారిచ్చిన యీ యెచ్చరికను బట్టి నే నయినను నీసమాధానము నింతకుఁ జాలఁ బూర్వమే ప్రకటించి యుండవలసినది కాని కొన్ని కారణములచే నట్లు గుదుర లేదు. ఇంతకుఁ బూర్వమే దీనిని భారతిలోనో యాంధ్రపత్రికాసంచికలోనో ప్రకటింప నెంచితిని గాని యాప్రయత్నములు వ్యర్థమయినవి ఆగొడవల నిచ్చటఁ దడవుటవలనఁ బ్రయోజనము లేదు కావున జరిగినకాలవిలంబమునకు మన్నించి మాపూర్వవ్యాసములను నీవ్యాసాంశములనుఁ గూడఁ జిత్తగించి వివాదాంశముల విషయమునఁ దగువినిశ్చయ మొనర్తురుగాక యని భాషాభిమానులను బ్రార్థించుచున్నాఁడను.

---

శ్లో. సముత్పత్తి స్స్వచ్ఛే సరసి హరిహస్తే నివసనం
నివాసః పద్మాయా స్సురహృదయహారీ పరిమళః
గుణై రేతై రన్యై రపి చ లలితస్యాంబుజ తవ
ద్విజోత్తంసే హంసే యది రతి రతీవోన్నతి రియమ్. ౧౦౭

చ. లలితసరోవరామలజలంబుల జన్మము నిత్యవాస మా
జలరుహనాభుహస్తమున సద్గృహ మావరలక్ష్మి కెల్లవే
ల్పులమదిమెచ్చుసౌరభము భూరిగుణమ్ముల మించుతమ్మి నీ
కలద్విజరాజసాదరత యానెడ నున్నతి వన్నెకెక్కెడున్.

శ్లో. ఏతావ త్సరసిజకుట్మలస్య కృత్యం భిత్వాంభ స్సరసి వినిర్గమో బహిర్యత్
ఆమోదో వికసన మిందిరానివాస స్తత్సర్వం దినకరకృత్య మామనంతి.

క. ఘనజలముఁ దెరలి యెదుటకు, మునికొనివచ్చుటయె తమ్మిమొగ్గపని సిరిం
బెరుచుట తావి నొనర్చుట, దినకరకృత్యం బటంచుఁదెలియుదురు భువిన్.

శ్లో. దళాని ముకుళీకృత్య ప్రవేశం నదదాతిచేత్
పద్మ భృంగస్య కాహానిః ఫుల్లేచూతే వసేస్థితే. ౧౦౮

క. సరసతగల సరసిజమా, సురుచిరదళములను ముడిచి చొరనీకున్నన్
ధర నళికి నేమిలోపము, వరపుష్పసమేతచూతవన మిట్లుండన్.

శ్లో. అయి దళదరవిందస్యందమానం మరందం
త్వయి కిమపి విహంతో మంజుగుంజంతుభృంగాః
దిశిదిశి నిరపేక్ష స్తావకీనం వివృణ్వన్
పరిమళమయమన్యో బాంధవో గంధవాహః. ౧౦౯

చ. విను వికచారవిందమ స్రవించెడు నీదుమరందమెంతయుం
గొని మదభృంగసంఘ మెగి గుంజతము ల్రచియించుఁగాక మే
దిని నిరపేక్షుఁడయ్యు భవదీయసువాసన లెల్లదిక్కులం
బనిచెడు గంధవాహకుఁడు బంధువు లందఱకన్న బంధువౌ.

—: బూరుగుచెట్టు :—

శ్లో. విశాలం శాల్మల్యా నయనసుభగం వీక్ష్యకుసుమం
శుకస్యాసీ ద్బుద్ధిః ఫలమపి భవే దస్య సదృశమ్
ఇతి ధ్యాయన్నాస్తే ఫలమపిచ దైవాత్పరిణతం
విపాకే తూలోంత స్సపది మరుతా సో ప్యపహృతః. ౧౧౦

ఉ. గారవముల్ సురూపమును గైకొనుబూరుగుపువ్వుఁ జూచియా
కీరము మీఱి కోరి తిలకించుచు దీనికి నింతపండగుం

దీరుగనంచు నిల్చుతటి దేవునిసత్కృపఁ బండియుండఁగా
మారుతమంతలోన ఫలమధ్యగతం బగుతూలము న్గొనెన్.

—: ఉన్మత్తచెట్టు :—

శ్లో. ధుత్తూర! ధూర్తతరుణేందునివాసయోగ్యస్థానే పిశాచపతినా వినివేశితోసి
కిం కైరవాణి వికసంతి తమః ప్రయాతి చంద్రోపల స్స్రవతి వార్ధిరుపైతి వృద్ధిమ్

గీ. భూతపతి నిన్ను నిజశిరోభూషణముగఁ
దుఱుముకొన్నను ధుత్తూర! ధూర్త! వినుము
తమ మణంగునె చంద్రకాంతము కరఁగునె
కలువ లలరునె తగువృద్ధిఁగనునె వార్ధి.

—: రత్నము :—

శ్లో. నార్ఘంతి రత్నాని సముద్రజాని పరీక్షకా యత్ర నసంతి దేశే
ఆభీరపల్ల్యాంచితపద్మరాగం త్రిభిర్వరాటైః ప్రపణంతి గోప్యః ౧౧౨

క. ధరనెచటఁ బరీక్షకగణ, మరయఁగ లేదచట మణు లనర్ఘము లగు నా
నెఱకొంపును వల్లవపురి, గరితలు వర్తైదరు మూఁడుగవ్వల కెనగాన్.

—: ముత్యములు :—

శ్లో. జన్మస్థలీ వారణరాజమూర్ధా మహీపతీనాం మకుటే నివాసః
అనాదరం చేత్కురుతే నభిజ్ఞో ముక్తాఫలానా మిహ కోపరాధః ౧౧౩

క. కరివరశిరములఁ బొడముట, నరపతిధృతమకుటకోటినటియించుటచే
మెరసెడుముత్తెముల ననా, దరత నభిజ్ఞుం డొనర్పఁ దదవజ్ఞగదా.

—: బంగారము :—

శ్లో. హేమ్నః ఖేదో న దాహేన చ్ఛేదేన కషణేనవా
తదేవహి పరం దుఃఖం యద్గుంజాసమతోలనమ్. ౧౧౪

గీ. తొలుత గుంజాసమేతమై తూఁచునెడలఁ
గ్రిందికిని మ్రొగ్గి మఱి గుంకుఁజెందుఁగాని
కాల్చి సాఁగించి తునియలుగా నొనర్చి
కర్షణ మొనర్చినను సేగిఁ గనదు పసిఁడి.

—: కాకాదులు :—

శ్లో. కాకా వృకా ఘూకబకాశ్చభేకాః ప్రణమ్య యుష్మా నిద మేవయాచే
కోలాహలం మాకురుత క్షణమధ్వం పుంస్కోకిలః కూజతి మంజురావమ్ ౧౧౫

క. భేకవృకఘూకబకముఖ, కాకము లగుపిఁకకు మ్రొక్కి కడుయాచింతుం
గేకలమాని సహింపుఁడు, కోకిలమంజురవమెసఁగఁ గూయుచునుండెన్.

—: ప ద్మి ని :—

శ్లో. నిరర్థకం జన్మ ఫలం నళిన్యా యయానదృష్ట స్తుహినాంశుబింబః
ఉత్పత్తి రిందో రపి నిష్ఫలాహి దృష్టా వినిద్రా నళినీ నయేన. ౧౧౬

గీ సుకచిరసుధాంశుబింబంబుఁ జూడకున్నఁ, బద్మినీజన్మ మటవ్యర్థభావమొందెఁ
బద్మిఏవినిద్రయైచూడఁబడదుగాన, నిందునుత్పత్తియును వ్యర్థమొందెనకట.

—: కమలము :—

శ్లో. కిం బాంధవేన రవిణా హరిణాచ కింవా లక్ష్మ్యాచ కిం సరసిజోదరజన్మనావా
ఏతస్యశుద్ధచరితస్య సరోరుహస్యనైపాతుపారజనితాశమితావిపత్తిః.౧౧౭

గీ. ఏల పద్మోద్భవుఁడు నల్వ యేలపద్మ, బాంధవుఁ [illegible] టికిఁ బద్మగేహ
యైనసిరి పద్మనాభుఁడౌ హరియునేల, నీవిశుద్ధాంబుజ బున కించుకైన
మంచునజనించువాపద మానదనిన—

—: చె ట్టు :—

శ్లో. భుక్తం స్వాదుఫలం కృతం చ శయనం శాఖాగ్రజైః పల్లవైః
త్వచ్ఛాయాపరిశీతలం సుసలిలం పీతం వ్యపేతశ్రమైః
విశ్రాంతా స్సుచిరం పరం సుమనసః ప్రీతిః కిమత్రోచ్యతే
త్వం సన్మార్గతరు ర్వయంచ పథికా యామః పునర్దర్శనమ్. ౧౧౮

ఉ. తియ్యనిపండ్లు మెక్కితి మతిప్రముదంబున నీప్రవాళముల్
శయ్యగఁ గూర్చి పండితిమి చల్లనినీడల విశ్రమించి నీ
రొయ్యనఁ ద్రావి నీసుమనసున్నతినాని ముదంబుఁగంటి మో
యయ్య ! సువృక్షమా ! చనుదుమా ! కనవచ్చుత నిన్నుఁగ్రమ్మఱన్.

—: మామిడిచెట్టు : —

శ్లో. యావత్ఫలోదయముఖ స్సహకారజాతః
ప్రాగేవ కంటకచయేన వృతోసితావత్
ఛాయాపి తే నసులభా ఫలమస్తు దూరే
తన్నిష్ఫలోపి హివరం సుఖసేవనీయః. ౧౧౯

క. ఫలమున కభిముఖమగుతఱి, నలముఁన్నినుఁగంచె ఫలము లటులుంచుము నీ
సులభ మగునీడ చెడ్డ ని, ష్ఫలమైతివయేని సుఖముపడమెరసాలా.

—: అరఁటిచెట్టు :—

శ్లో. కిం కేతకీ ఫలతి కిం పనసస్తు పుష్పం కిం నాగవల్లి రిహ పుష్పఫలే ప్రసూతే,
కస్యాపి కోఽప్యతిశయో౽స్తి న తేన సద్భిస్సంపూజ్యతే కదళి! యాసి తతః ప్రసిద్ధిమ్.

చ. మొగలి ఫలించునే! పనస పూయునె కాయునె లేకపూయునే
తగుగతి నాగవల్లి యొకదానికి నొక్కొకమేల్మి దానిచే
నగడదె గౌరవంబుఁ గననేర్చితె యిన్నియుఁగల్గి యంతకుఁ
మిగులఁ బ్రసిద్ధి! యో కదళి! మేలిగుణం బొకటున్నఁజాలదే.

—: చందనము :—

శ్లో. ఆమోదైస్తే దిశిదిశిగతై ర్దూర మాకృష్యమాణాః
సాక్షా ల్లక్ష్మీం తవ మలయజ ద్రష్టు మభ్యాగతా స్మః
కిం పశ్యామః సుభగ భవతః క్రీడతి క్రోడ ఏవ
వ్యాల స్తుభ్యం భవతు కుశలం ముంచ న స్సాధుయామః ౧౨౧

చ. మలయజమా దిగంతముల మాటికిఁ బర్వుభవత్సువాసనల్
పిలువఁగ నీసిరిం గనెదువేడ్కను వచ్చితి మేమిగందు మి
మ్ముల నిదె యాడుచుండెఁ బెనుభోగి భయంకరలీల మీకు మే
ల్వొలయుత పీడు మమ్ముఁ బదివేలిదె చాలును బోదుమింతటన్.

—: మేఘుఁడు :—

శ్లో. భోభో వారిద వారిణా మమ ముఖం సంపూరయ ప్రేమవాన్
దాతా త్వం జగదేకరక్షణపరో జానాసి మామప్యలమ్
త్వామేకం శరణాగతం నదనదీకూపేషు ముక్తస్పృహం
దీనం చాతకబాలకం నిజగృహం త్యక్త్వాంతరా శ్లేష్ఠితమ్. ౧౨౨

చ. ఘనఘన! జీవనం బొసఁగి గారమున న్ననుఁబ్రోచి పెంచుమా
కనఁగను నీవదాతవు జగంబులఁ బ్రోవఁగ నన్నెఱుంగవే
నిను శరణొంది బావిఁ దటినిఁ సరసిం దమిమాని దీనతఁ
మని యిలువీడి నట్టనడుమం జను చాతకబాలుఁడంజుమీ.

శ్లో. భ్రాత శ్చందన కిం బ్రవీమి విటపస్ఫూర్జత్ఫణాభీషణాః
గంధస్యాపి మహావిషాః ఫణభృతో గుప్త్యై యదేతే కృతాః
దైవా త్పుష్పఫలాన్వితో యది భవా నత్రాభవిష్యత్తదా
నో జానే కిమకల్పయిష్య దధికం రక్షార్థ మస్యాత్మభూః. ౧౨౩

ఉ. చందనవృక్షమా! బలువిషంబులఁ గ్రక్కుచునుండు భోగిరా
డ్బృందముఁ గాపువెట్టెను బరీమళమాత్రసురక్షకే శతా
నందుఁడు గాక నీకు సుమనఃఫలసంగతి గల్గియున్న నిం
కెందఱి నెట్టివారి ఘటియించునొ తత్పరిరక్షకుల్ వెసన్.

—: చంపకము :—

శ్లో. యన్మాదృతస్త్వమళినామలినాశయేన కిం తేన చంపక! విషాదమురీకరోషి
విశ్వాభిరామనవనీరదనీలవేషాః కేశాః కుశేశయదృశాం కుశలీభవంతు.

చ. మలినములౌ ద్విరేఫములు మన్ననఁ జేయ వటంచు నింత కొం
దలపడ దేల చంపకమ! తద్దయు విశ్వమనోభిరామముల్
జలధరజాలనీలములు సారసనేత్రల కేశపాశముల్
బలుకుశలంబు గాంచి చెలువం బలరారుచు మీఱుఁగావుతన్.

—: కస్తూరీమృగము :—

శ్లో. రోమంథమాచర చయ మందరమేత్య నిద్రాం
ముంచ శ్రమం తదను సంచర రే యథేచ్ఛమ్
దూరే సపామరజనో మునయః కిరాతే
నిష్కారణం హరిణపోత బిభేషి కస్మాత్. ౧౨౫

ఉ. లేరిటఁ బామరుల్ భయము లేదు మృగార్భకమా! యథేచ్ఛమైఁ
బేరిమి మీఱఁగా నెమరువేయుము నిద్దురఁగాంచి బల్ శ్రమం
దీరిచికొమ్ము లెమ్ము నలుదిక్కులఁ జక్కగ సంచరింపుమా
వీరలు సాధువర్తనులు మునులు వీరు మకారణభీతి యేటికిన్.

శ్లో. కస్తూరికాహరిణ ముంచ వనోపకంఠం మాసౌరభేణ కకుభస్సురభీ కురుష్వ
ఆస్తాం యశో ననుకిరాతశరాభిఘాతాత్త్రాతాపి హంత భవితా భవతో దురాపః

మ. నగమార్గంబులు వీడి వేగఁ జనుమా! నాముద్దుకస్తూరికా
మృగమా! దిక్కులసౌరభంబులను నెమ్మి జిమ్మఁగాఁ బోకుమా!
తగుసత్కీర్తి నటుంచుమా! ఖలకిరాతవ్రాతబాణోగ్రఘా
తగతిన్ మాన్పి నిన్నుఁ బ్రోవఁగలత్రాతల్ గానఁగా రారెటన్.

—: పిల్లి :—

శ్లో. రేరే బిడాల పరిగర్జసి మాం విలోక్య
కీరం మనోహరమిమం నిజపంజరస్థమ్
శ్వానం విలోక్య నహిదగ్ధముసి స్వవీక్ష్యం
త్వద్దేహపాటనపటుం దశనైః కరాళైః. ౧౨౭

చ. చెలువుగఁ బంజరస్థ మగుచిల్కను నన్గని యిట్టు లెంతొ గ
ర్జలు రచియింతుగాని స్వకరాళతరోన్నతదంతఘాతముల్
సలిపి భవచ్ఛరీరము వెస న్విదళించెదుకుక్కముందటన్
నిలిచి భవత్ప్రతాప మిటు నేర్పునఁ జూపవుగా బిడాలమా!

—: కప్ప :—

శ్లో. దివ్యచూతరసంపీత్వా గర్వం నాయాతి కోకిలః
పీత్వా కర్దమపానీయం భేకో బకబకాయతే. ౧౨౮

క. ఇలఁగల కలుషజలంబులు, వలనొప్పఁగఁ ద్రావి కప్ప బకబకలాడున్
లలిచూతరసముఁ గ్రోలియు, నలకలకంఠంబు గర్వమందదు బళిరా.

—: తుమ్మెద :—

శ్లో. పలాశకుసుమభ్రాంత్యా శుకతుండే పతత్యళిః
సోపి జంబూఫలభ్రాంత్యా తమళిం ధర్తు మిచ్ఛతి. ౧౨౯

గీ. అలరుమోదుగుపూవనునట్టిభ్రాంతిఁ, బూని తుమ్మెదపడుఁ జిల్కమోమునందు
నదియు నేరేడుపండనునట్టిభ్రాంతి, మించి యాభృంగమును నడ్డెమ్రింగఁ జూచు.

—: చిలుక :—

శ్లో. వాసః కాంచనపంజరే నృపకరాంభోజై స్తనూమార్జనం
భక్ష్యం స్వాదురసాలదాడిమఫలం పేయం సుధాభం పయః
పారస్సంసది రామనామ సతతం ధీరస్య కీరస్య మే
హాహా హంత తథాపి జన్మవిటపి క్రోడే మనో ధావతి. ౧౩౦

చ. మనికిపసిండిపంజరము మన్నియ మేల్చెయిదమ్మి మేనలా
లనమును జాతిదాడిమఫలంబులు తిండి సుధాభనీరముల్
గొనుటయు రామనామమునె కూరిమి మీఱఁగఁ బల్కు చిల్కనై
ననుఁ బరువెత్తు నయ్యయొ మనం బటఁ బుట్టిన చెట్టుతొఱ్ఱకున్.

—: చంద్రుఁడు :—

శ్లో. రాజానః కతివా న సంతి జగతి ఖ్యాతా నిజాభ్యాశగాన్
యే పుష్ణంతి బలీయసః పరిచితాం శ్చిత్రం నమన్యామహే
రాజా రాజతి కేవలం హిమకరః పుష్ణాతి దూరస్థితాన్
జ్యోత్స్నాభి ర్గ్లపితాన్ దినేశమహసా యోసౌ చకోరానిమాన్.

చ. పరిచితులన్ బలాన్వితులఁ బార్శ్వగులం గృపఁబ్రోచురాజు లీ
ధరణి ననేకులుందురు గదా! యది చిత్రముగాదు మొదలోఁ
దిరుగుచు దూరసంస్థితిని దిక్కరువట్టి చకోరపాళికిం
గిరణములిచ్చి ప్రోచుశశికే యలరాజనుపేరు రాజిలున్.

శ్లో. జన్మ క్షీరమహార్ణవే సహభువః శ్రీపారిజాతాదయో
బింబం యస్య సుధామయం త్రిభువనాధీశస్య మూర్ధ్ని స్థితిః
వృత్తిర్యస్య చరాచరప్రియతమా తస్యోదయే కేవలం
సంకోచః కమలస్య మస్తృతి రసౌ నిందో్యనతారాకరః. ౧౩౨

చ. జననము క్షీరవారిధిని శంభుశిరంబున సున్కి తోడఁబు
ట్టిన వలసంపదల్గనినటించురమాహరిచందనాదులున్
వినుతసుధానివాస మగుబింబము సర్వహితంబు వృత్తిగ
ల్గిన శశిరాక నెగ్గగుట కేవలపంకజదుష్కృతౌఘమే
యనఁదగుఁగాక శీతకరుఁడర్హుఁడె గర్హితుఁడంచు నెంచఁగాన్.

—: వసంతము :—

శ్లో. భోభో వసంత భవదభ్యుదయేన వృక్షాః
కేనామ పుష్పఫలపల్లవశాలినస్స్యుః
అస్మాకమల్పతపసాం బదరీతరూణాం
భ్రష్టం ఫలం చిరశిఖాపటలం ప్రలూనమ్ ౧౩౩

ఉ. ఓరివసంత నీ వుదయమొందఁగఁ బొందుగ నెన్నిచెట్టులీ
ధారుణిఁబత్రపుష్పఫలధన్యములై చిగురింపలేదు హా
సారెకుఁ దక్కువాతప మొసంగమెలంగెడి రేఁగులైన మా
కౌర! ఫలంబుఁ బో సరిగదా! మునుపొ చిగురాకులుంజెడెన్.

శ్లో. వహతి విషధరా న్పటీరవృక్షః శిరసి మషీపటలం దధాతిదీపః
విధురపి దధతే తథాకళంకం పిశునజనం ఖలు బిభ్రతి క్షితీంద్రాః. ౧౩౪

క. ఉరగముల ధరించును ఘన, తర చందనతరువు మసినిదాల్చును దీపం
బురుచిహ్నము గైకొను శశి, ధరణీశులు పిశునజనులఁ దాల్తురుకడకన్.

—: మయూరము :—

శ్లో. ఏతస్మి న్మలయాచలే బహువిధైః కిం తై రకించిత్కరైః
కాకోలూకకపోతకోకిలకులై రేకోపి పార్శ్వస్థితః

కేకీ కూజతి చే త్తదా విఘటితవ్యాళావళీబంధనః
సేవ్యస్స్యాదిహ సర్వలోకమనసా మానందనశ్చందనః ౧౩౫

ఉ. కాకకపోతకోకిల శుకప్రకరార్భటి నేమికార్య మా
ప్రాకటకూటమాలయపర్వతమం దొకపార్శ్వవర్తియా
కేకి చెలంగి పల్కునెడఁ గేవలసర్పవిముక్తిఁ గాంచి యా
శ్రీకరచందనంబు జనసేవితమై ముదమిచ్చునిచ్చలున్.

—: ఇష్టదేవతాప్రార్థనము :—

చ. తెలుఁగున మీఱునీకృతిని దీరుగఁ బండితరాట్పవిత్రుఁడ
నొచ్చెలువును దెల్పుబల్ బిరుదుఁ బూనఁగ నర్హుఁడవీవ యంచు నన్
బలుమఱు సత్కవుల్ బుధులుఁ బండితులుం గనిముచ్చటించుచుం
బలుకుట నీకు సత్కృపకుఁ బాత్రుఁడనౌటను గాదె శాంకరీ!

సంపూర్ణము.

---

# Narasarowpeta Stone Inscription
# of
# Manmaganda Gopaladeva.
# Saka 1219.

# మన్మగండగోపాలదేవుని
# నరసారావుపేట శిలాశాసనము.
# శ. స. ౧౨౧౯.

—: జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. యల్., :—

ఈశాసనము గుంటూరుమండలములోని నరసారావుపేటపట్టణమున శ్రీపట్టాభిరామస్వామివారి యాలయమునందు ధ్వజస్తంభమునకును ఆంజనేయ విగ్రహమునకును నడుమ స్థాపింపఁబడిన శిలాస్తంభముమీఁదఁ జెక్కఁబడియున్నది. రాతినిద్రవ్వించి పైకిఁదీసి ౧౯౧౯ సంవత్సరము ఆగస్టు ది ౨౫ తేదీని నేను శాసనమునకుఁ బ్రతిని వ్రాసినాను. అంతకుఁ బూర్వమే, యనఁగా ౧౯౧౨ వ సంవత్సరములో రాజకీయశాసనాధికారు లీశాసనమునకుఁ బ్రతిబింబము తీసికొని యిటీవల South Indian Inscriptions, Vol. IV అను గ్రంథములో ౬౬౧ వ సంఖ్యగాఁ బ్రకటించినారు. కాని రాయి పాఁతఁబడియుండఁగానే ప్రతిబింబము తీయుటచేత భూమిలోనున్న రాతిమీఁదిశాసనభాగము వారికి దొరకలేదు. శాసనములో ౧౫౭ పంక్తు లుండఁగా వారు ౧౦౮ పంక్తులుమాత్రమే ప్రకటించినారు.

శాసనస్తంభము తొలుత "కొట్యదొన" చెన్నకేశవస్వామి యాలయములో నుండినట్లును పిదప నరసారావుపేటకుఁ దేఁబడినట్లును కనఁబడుచున్నది. "కొట్యదొన" నిప్పుడు కొణిదెన యందురు. ఈగ్రామము నరసారావుపేటకుఁ దూర్పుగా ౧౩ మైళ్ల దూరమం దున్నది. మనుమగండగోపాలదేవచోడమహారాజు ౧౨౧౯ వ శకసంవత్సరమునకు సరియయిన హేమలంబిసంవత్సర చైత్ర శు ౧౫ సోమవారమునాఁడు చంద్రగ్రహణపుణ్యకాలమందు పదుమూవరగండసిద్ధాపుర మను పేరుపెట్టి యిరువదిపుట్ల మెట్టపొలము కొణిదెన

శ్రీ చెన్నకేశవదేవుని తిరునాళ్ళకై దానముచేసె నని తెలుపుట యీశాసనము ముఖ్యోద్దేశము. ఈరాజు సూర్యవంశశాఖలలో నొకటియగు చోళవంశము లో జన్మించె ననియు, నీతనివంశకర్త విక్రమసింహపట్టణపతియయిన తిక్కరాజ నియు, తిక్కమహీపతికొడుకు మన్మరాజనియు, మన్మరాజు ముగ్గురుకొడుకు లలో మధ్యముఁ డగు నల్లసిద్ధిరాజున కైదుగురు కొడుకు లనియు, వారిలో మన్మగండగోపాలదేవుఁ డు జ్యేష్ఠుఁడనియు నీశాసనమువలనఁ దెలియుచున్నది.

చోళవంశపురాజుల ప్రథమరాజధాని తిరుచనాపల్లికి సమీపమందున్న ఒఱియూరు. కొంతకాల మయినపిదప నీచోళులు పల్లవరాజుల జయించి వారిరాజధానియైన కాంచీపురమును సాధించి తమకు రాజధానిగాఁ జేసికొనిరి. ఈవంశమువారు కొందఱు తెలుఁగుదేశములో నచ్చటచ్చటఁ బ్రవేశించి రాజ్యముల సంపాదించి స్థిరపడిరి. వీరికిఁ దెలుఁగుచోడరాజు లని వ్యవహారనామము. వీరిలోనొకతెగవారు చిరకాలముక్రిందటనే యనఁగా, చాళుక్యరాజులు తెలుఁగుదేశమునకు రాకపూర్వమే కడపప్రాంతదేశము నాక్రమించి పాలించిరి. వారిశాసనము లాదేశమందుఁ గలవు. మఱియొకశాఖవారు పొత్తపి రాజధానిగా పాఁకనాఁడుదేశము నేలిరి. వీరికి పొత్తపిచోడులని సంజ్ఞ. ఈ శాఖలోనివారే కొందఱు విక్రమసింహపట్టణము రాజధానిగా నెల్లూరుప్రాంత దేశమును, మఱికొందఱు కొట్యదోన రాజధానిగా కమ్మనాఁడుదేశమును పాలించిరి. వీరిలో నొకతెగవారు కందుకూరురాజు లయిరి. ఈతెలుఁగుచోడుల కందఱకు మూలపురుషుఁడు బిజ్జన. ఇతనికి చోడబిజ్జన యనియు, తెలుఁగుబిజ్జన యనియుఁ బేళ్లుగలవు.

ప్రస్తుతశాసనకర్తయగు మన్మగండగోపాలదేవుఁడు విక్రమసింహపట్టణ శాఖలోనివాఁడు. శాసనాంతరములనుబట్టి చూడఁగా నీవంశమునకు బెట్టరాజాద్యుఁడనియు, బెట్టరాజుకొడుకు ఎరసిద్ధరాజు, ఎరసిద్ధరాజుకొడుకు మన్మసిద్ధరాజు, మన్మసిద్ధునికొడుకు తిక్కరాజు నయిన ట్లగపడుచున్నది. ఈతిక్కరాజే ప్రస్తుతశాసనములోఁ జేర్కొనఁబడిన మొదటితిక్కరాజు. ఈతనికొడు కగు మన్మకులూవల్లభుఁడే తిక్కనసోమయాజి ప్రభువయిన నెల్లూరి మన్మసిద్ధిరాజు. ఈ రాజున కంకిత మయిన నిర్వచనోత్తరరామాయణములో నితనివంశము కొంత వర్ణింపఁబడినది.

తిక్కనసోమయాజి కాలము నిర్ణయించుటకై యీశాసన ముపయోగిం

చును. సిద్ధేశ్వరచరిత్రమును ముఖ్యాధారముగాఁ జేసికొని వీరేశలింగముపంతులుగారు తిక్కన కాకతీయగణపతిదేవుని రాజ్యకాలమం దుండెననియు, కావ్యనన్నయభట్టుతరువాత నించుమించు రెండువందలయేండ్ల కాలమం దుండెననియు నిశ్చయించిరి. ప్రస్తుతశాసన మీ యభిప్రాయమును దృఢపఱుచుచున్నది గణపతిదేవరాజు శ స ౧౧౨౦ మొదలుకొని ౧౧౮౨ వఱకు రాజ్యముచేసెను. మన్మగండగోపాలదేవుఁడు మన్మసిద్ధిరాజునకు మనుమఁడు; తరమున కిరువదియైదుసంవత్సరము లనుకొన్నచో వీరిరువురకు నంతర మేఁబది సంవత్సరములుండును. శాసనకాలమునుబట్టి వెనుకకు లెక్కింపఁగా మన్మసిద్ధి శ స ౧౧౬౫ ప్రాంతమువాఁడగును కావున నీతని యాస్థానకవియగు తిక్కనసోమయాజి గణపతిదేవునికాలములో నుండిన ట్లూహించుట కేమియు బాధ లేదు. అతఁడు శ. స. ౧౧౬౦ ప్రాంతమునం దుండెనని నిశ్చయింపవచ్చును.

మన్మగండగోపాలదేవుఁడు ప్రతాపరుద్రదేవుని ప్రసాదముచేత నార్జింపఁబడిన వైభవముగలవాఁడని వర్ణింపఁబడినాఁడు. ప్రతాపరుద్రుఁడు గణపతిదేవుని కూఁతురగు రుద్రమదేవికి దౌహిత్రుఁడు. వరుసకు గణపతిదేవునికి మునిమనుమఁ డయినను రాజ్యకాలవిషయములో వీరిరువురకుఁ గల యంతరము మన్మసిద్ధి మన్మగండగోపాలదేవుల యంతరముకంటె నెక్కువ గాదు ౧౨౧౭ శకసంవత్సరము ప్రతాపరుద్రుని యొక్కయు మన్మగండగోపాలదేవునియొక్కయు రాజ్యకాలములలోఁ బ్రథమదశలోని దయినట్లు కనఁబడుచున్నది. గణపతిదేవునినాఁడే కాకతీయులు తెలుఁగుచోడరాజుల నడఁచి వశపఱచుకొని రనియు, ప్రతాపరుద్రునికాలమందుఁ గూడ చోళులు వారికి సామంతులుగా నేయుండి రనియు శాసనపరిశోధనమువలనఁ దెలుచున్నది

ఇఁక బిరుదగద్యములోని విశేషముల విచారింతము. "చరణసరోరుహవిహితవిలోచనత్రిలోచనప్రముఖాఖిలపృథివీశ్వరకారితకావేరీతీర"—చోళవంశకర్తయగు కరికాలచోళుఁడు కావేరీనదికిఁ బెద్దగట్లు వేయించి నదీజలము పొలములకుఁ బాఱునట్లు చేసెనని వాడుక కలదు ఆగట్లు వేయుటలో సామంతరాజులు వెట్టిపని చేసి రనియు వారిలోఁ ద్రిలోచనపల్లవరా జొకఁ డనియు, నీతఁడు వెట్టికి రానని తొలుత ధిక్కరించినందునఁ గరికాళుఁ డాతనినుదుట నున్నమూఁడవకంటిని గాలిలోఁ బొడిచివైచె ననియుఁ జోళుల ప్రగల్భ వాక్యములు. ఈవిషయము నిర్వచనోత్తరరామాయణములో నిట్లు వర్ణింపఁబడినది.

"......... ఉంగుటంబునహరించెం బల్లవోర్వీశును
ల్లాసం బొందఁగ ఫాలలోచనము లీలం గట్టెఁ గావేరి"

ఈవిషయమే కొణిదెనలోని మఱియొక శాసనములో నిట్లున్నది.

"క. కావేరి తరులు గట్టగ, వేవే పల్లవృందు దనకు వెట్టికిరామిఁ
దావాని నుదుటికనువోఁ, గావడిఁ గరికాల విభుఁడు గాలం దుడిచెన్."

అనియున్నది.

"ఒఱయూరిపురవరాధీశ్వర"—చోళుల ప్రథమరాజధాని ఒఱయూరగుటచేఁ దొలుత నీబిరుదము వారి కన్వర్థమై చెల్లెను. ఆపూర్వబిరుదము నిటీవలివారుకూడ వాడుకొనిరి గాని వీరి కది యన్వర్థము కాదు.

"కాంచీపుర త్రిపుర త్రినేత్ర"—పల్లవుల జయించుటచేతనే వీరి కీబిరుదు వచ్చినది.

"తేంకణాదిత్య" తేంకణ మనఁగా ద్రావిడభాషయందు దక్షిణదేశము. దక్షిణదేశమునకుఁ బ్రభువు లగుటచేతను, సూర్యవంశపురాజు లగుటచేతను గూడ వీరి కీపేరు వచ్చియుండును

"ప్రిథివీశ్వర శిరఃకందుక క్రీడావినోద"—మన్మగండగోపాలదేవునిముత్తాత యగు తిక్కరాజును వర్ణించుచుఁ దిక్కనసోమయాజి—

"శైశవలీలనాఁడు పటుశౌర్యధురంధర బాహుఁడై వసు
ధీశ్వర శేఖరోత్తమ మస్తకము నేడ్తెఱ గందుక కేలి సల్పె నే"

అని చెప్పెను తిక్కనకుఁబూర్వ మీబిరుద మెవ్వారికి నున్నట్లు కనుపడదు.

"ద్రవిళబలవార్ధిపరిశోషణబడబానల"—ఇదియుఁ బేర్కొనఁబడినద్రవిడుఁ డెవ్వఁడో తెలియదు మన్మసిద్ధి "ద్రవిడోర్వీపతిగర్వముం దునిమె" నని యుత్తరరామాయణమం దున్నది

మఱికొన్ని విశేషాంశములు :—

రాజు దానముచేసిన యిరువదిపుట్లభూమికిని "పదుమూవ్వురగండ సిద్ధాపుర" మను పేరు పెట్టెనఁట. బిజ్జనకుఁ "పదుమూవ్వురగండఁ" డను బిరుద ముండెను. దీనికిఁ గారణము—

"పరుషపరాక్రముం డగుచుఁ బల్లవువీట నుదగ్రులైన ప
న్నిరువురు నాతనిం గలయ నెన్ని యనర్గళ మత్సరంబు నై

మురరిపు సన్నిభుండు పదుమువ్వుర గండడఁగంగఁ జెట్టెఁదా
బిరుదు వెలుంగ బిజ్జఁ డరి భీకరభూరిభుజాబలంబునన్. ”

అని యుత్తరరామాయణమందును,

“ దండి జగదొబ్బగండఁడు, గండరగండండు వీరఖని బిజ్జన యు
ద్దండుఁడు దాఁ బదుమువ్వుర,గండం డను ధార నిలిపెఁ గటకములోనన్.

అని కోణిదెనశాసనపద్యమందునుఁ జెప్పఁబడినది.

ఈధర్మమును బాలించుటకై రాజు ముగ్గురు పురుషులను ఇద్దఱు స్త్రీలను ధర్మాధికారులుగా నేర్పఱిచెను. పురుషులు పూజారులును స్త్రీలు దేవునికిఁ బరిచర్య చేయు వేశ్యలు నై యున్నట్లు తోఁచుచున్నది. శాసనాంతరములందు వీరికి మానులు సానులు నను సంజ్ఞలు కలవు. పూర్వకాలమందు దేవాలయ పరిచారకులలో స్త్రీపురుషులు కలిసి యిట్టి ధర్మములను బరిపాలించుట వాడుకగా నున్నట్లు కనుపడుచున్నది. South Indian Inscriptions Vol VI అను గ్రంథములోఁ బ్రకటింపఁబడిన చేబ్రోలుశాసనములలో “ దీని మున్నూర్వ్వరు సానులు మున్నూర్వ్వరు అయ్యానులు మానులుం బ్రతిపాలింపం గలవారు.” అని ౧౦౧ వ శాసనమందును, “సేబ్రోలిస్థానపతియును మున్నూర్వ్వరుఅయ్యలు మున్నూర్వ్వరు సానులుం బ్రతిపాలింపంగలవా ”రని ౧౦౯ వ శాసనమందును గలదు. మఱి కొన్ని శాసనములందుఁ గూడ నిట్లే యున్నది.

“ వెలిసేను ” అనఁగా వర్షాధార మగు మెట్టపొలము. ఇతరజలాధారము గలభూమికి “ నీరునేల ” యని పూర్వపుసంజ్ఞ.

“ లెఖ్ఖాను ” లెక్కను అని యుండవలయును. లెక్కయనఁగా అంకె. “ ఇరువయిపు ” ట్లని ముందక్షరములతో వ్రాసి దానినే తిరిగి యంకెలతో వ్రాసినాఁడు. ముందంకెలతో వ్రాసినపిదప నక్షరములతో వ్రాయుట యిప్పటి యాచారము

# శాసనమూలము.

—: ఉత్తరపువైపు :—

౧. శుభమస్తు శ్రీ
౨. మత్యౌస్తుభలాంఛ
3. నోవిజయతేదేవః పు
౪. రాణోహరిస్తన్నాభి (౧)
౫. స్సరసీరుహాదాసర
౬. జనిర్విశ్వంవిధా
౭. తాసృజత్ । తస్మి
౮. న్స్వార్యసుధా
౯. ంశువంశజన
౧౦. నాభూపాళ్ళశా
౧౧. సుభువంతేషు
౧౨. ఖ్యాతికథావశేష
౧3. మయుతాంయా
౧౪. తేషుమన్వాదిషు ॥౧॥
౧౫. జాతోవిక్రమసి
౧౬. ంహాపట్టణపతిస్తి
౧౭. క్షితీశస్తతోభా
౧౮. స్వద్వంశపయోధిసీ
౧౯. తకిరణోవిశ్వం
౨౦. భరామన్వభూత్ ॥
౨౧. తత్పుత్రస్తదనంత
౨౨. రంమనునిభోమ
౨3. న్మకుమావల్లభః ప్రౌ
౨౪. ఢొదార్య (వి)రాజి
౨౫. తామరమహీ
౨౬. జాతోసిపద్మాభతలం ॥౨॥

(౧) శాఖే అనిచదువవలయును.

౨౭. తస్యానంతనయా (౧)
౨౮. త్త్రయః ప్రథమజ
౨౯. స్త్రిక్షత్రమానాయకః
౩౦. పశ్చాదావిరభూ
౩౧. త్పరా ధర్మ్యాజనన(శ్రీ) (౨)
౩౨. నల్లసిద్ధోనృపః । గోపీ
౩౩. నాథ........పతి స్త
౩౪. దనుసంజాత స్తిభిర్భూ
౩౫. భు...........నిశ్శా

—: పడమటివైపు :—

౩౬. త(౩) కృపాణఖం
౩౭. డితరిపుక్ష్మా
౩౮. పాలదోర్మ్మ
౩౯. స్తకః ॥౩॥ నల్లసిద్ధి
౪౦. కుమారనాథో తే
౪౧. షామ్మధ్యమజ
౪౨. స్మనః। వంశమం
౪౩. డనమాణిక్య ప్ర
౪౪. సూతం(౪) సుతపం
౪౫. చకం ॥ ౪ ॥ యేనదాన
౪౬. గుణాఢ్యేనశౌర్యో
౪౭. త్సేకశాలినా। న్య
౪౮. క్రితం(౫) సురభూ
౪౯. జానాంపాండ
౫౦. వానాంచపంచక
౫౧. ం॥ ౫॥ తత్రాగ్రజస్సు
౫౨. తోమస్తగండగో

(౧) స్తనయా అనియుండును. (౨) శ్రీ (౩) శ్యాతఅనియుండనోపు. (౪) కృః(ప్రానూత అనియుండనోపు (౫) కృతం.

౫౩. పాళభూపతిః।
౫౪. ప్రతాపరుద్రభూ
౫౫. పస్య ప్రసాదార్జిత
౫౬. వైభవః ॥ ౬ ॥
౫౭. స్వస్తిచరణసరో
౫౮. రుహావిహిత
౫౯. విలోచనత్రిలో
౬౦. చనప్రముఖాఖి
౬౧. లప్రిధివీశ్వర(౧) కా
౬౨. రితకావేరీతీర
౬౩. కరికాలకులరత్న
౬౪. ప్రదీపఅపరిమిత
౬౫. ప్రతాపసతతస
౬౬. మభ్యర్చితలక్ష్మీశ్వ
౬౭. ర ఒఱయూరిపుర
౬౮. వరాధీశ్వరకాం
౬౯. చ్చీపురత్రిపు
౭౦. రత్రినేత్రకాశ్యప
౭౧. గోత్ర అతివిమ
౭౨. మహాయారూ
౭౩. ఢప్రౌఢరేఖారే
౭౪. వంతవిజయ
౭౫. లక్ష్మీకాంతఅతి
౭౬. చతురకామి(నీ)
౭౭. జనజయంత్త
౭౮. వితరణవినోద
౭౯. విక్రమాదిత్యతే
౮౦. ౦కణాదిత్యఅరి

(౧) పృథివీశ్వర.

౮౧. బలతిమిరమా
౮౨. ర్తాండజగదా
౮౩. బ్బగండ్డగర్వితా
౮౪. రాతికుధరకులి
౮౫. శధరశరణాగత
౮౬. వజ్రపంజరదా
౮౭. యాదిమండళి
౮౮. కుధీసుపట్టపరి
౮౯. ఘురట్టకీర్తినా
౯౦. రాయణప్రిధిపీ(౧)

—: దక్షిణపువైపు :—

౯౧. శ్వరశిరఃకందుకక్రీ
౯౨. డావినోదనిత్యస
౯౩. త్యప్రదాతశేవణ
౯౪. కటకరేణుకబళన
౯౫. దావపావకోపమా
౯౬. నగంభీరాంభోఽధాన
౯౭. ద్రవిళబలవార్ధి
౯౮. పరిశోషణబ
౯౯. డబానల । రాయ
౧౦౦. గండగోపాలవి
౧౦౧. హితాహితమా
౧౦౨. నభంగ్గ । రాజవే
౧౦౩. శ్యాభుజంగ్గ । నా
౧౦౪. మాదిసమస్తప్రశ
౧౦౫. స్తిసహితం(౨) శ్రీమస్మ
౧౦౬. హామండలేశ్వరభుజ

(౧) పృథివీ (౨) సహిత.

౧౦౭. బళవీరమనుమగం
౧౦౮. డ్డగోపాలదేవచోడమహా
౧౦౯. రాజులుస్వస్తిశ్రీశక
౧౧౦. వరుషంబులు †
౧౧౧ ౧౨౦౯ । అగునేంటి
౧౧౨ హేమళంబిసంవత్సర
౧౧౩. చైత్రశుద్ధ ౧౫ సో॥ నాం
౧౧౪. టి సోమగ్రహణకా
౧౧౫ లమునంద్దమతల్లిదం
౧౧౬. డ్రులకనంతమైనపుణ్యా
౧౧౭. ముగానుకొల్యాదొనశ్రీ
౧౧౮. చన్నకేశవదేవరతిరునా
౧౧౯. ళ్లైపదుమూవరగ
౧౨౦. ౧డ్డసిద్ధాపురము
౧౨౧. అనిపేరఇరువయిపు
౧౨౨. ట్లువెలిసేరులెఖాలు
౧౨౩ ఖ ౨౦ ఆచంద్రార్కఁ
౧౨౪. ముగానుధారవో
౧౨౫. సియిచ్చెను యీధర్మ్మఁ
౧౨౬. వునంజేసివీరియు
౧౨౭. భయకులముల వా
౧౨౮. రుంబుణ్యక్రిత్యులు*
౧౨౯. అగుదురు యీరా
౧౩౦. జు అభివృద్ధింబొ
౧౩౧. ంద్దంగలవాండు॥
౧౩౨ (ఈ) ధర్మ్మవుకైకొని (ఈగు
౧౩౩. డి) శ్రీకార్యపరులు
౧౩౪. పెమ్మయూను తెలారి ఎ

†వత్సరంబులు. *కృత్యులు

౧౩౫. క్షయాచుమొట్టపల్లి
౧౩౬. పెమ్మయానుకొట్టా
౧౩౭. రికేసవదాసీనికొట్య
౧౩౮. డౌనకేసవదాసీనిఇయేవు
౧౩౯. రంగూడనాయూర
౧౪౦. ప్రతియేటనుగండగో

—: తూర్పువైపు :—

౧౪౧. పాలతిరునాళనం
౧౪౨ గానుచిత్రమాస
౧౪౩. మునంజేయుంగ
౧౪౪. లవారు.
౧౪౫. స్వదత్తంపరదత్తం
౧౪౬. పరదత్తంవా ఓహ
౧౪౭. రేతి(౧) వసుంధరాం।
౧౪౮. షష్టివర్షరుష(౨)
౧౪౯. సహస్రాణివి
౧౫౦. ష్టాయాంజాయ
౧౫౧. తేక్రిమి(ః)॥ స్వద
౧౫౨. త్తాద్విగుణంపు
౧౫౩. ణ్యంపరదత్తాను
౧౫౪ పాలనం। పరద
౧౫౫ త్తాపహారేణస్వ
౧౫౬. దత్తంనిఃఫలంభ (౩)
౧౫౭. వేత్॥

---

౧. యోహరేత. ౨. షష్టిర్వర్ష ౩. నిష్ఫలం. అని చదువవలయును.

# A Copper Plate Inscription of Vijayaranga Chokkanaik.
## Saka 1630.

# విజయరంగచొక్కనాథనాయకుని తామ్రశాసనము.
## శ. స. ౧౬౩౦.

—: జయంతి రామయ్యపంతులుగారు. బి ఏ, బి. యల్. :—

---

ఈశాసనము కుంభకోణమునఁ బ్రతిష్ఠితమైయున్న కంచికామకోటిపీఠమను శంకరాచార్యపీఠమున కధిపతులగు శంకరాచార్య భగవత్పాదులయొద్ద నున్నది. ప్రతిబింబముతోఁగూడ నీశాసనమును యశఃకాయులగు టి. ఏ. గోపినాథరావుగారు, "Copper plate inscription belonging to the Sri Sankaracharya of the Kamakoti Pitha" అను గ్రంథమునందుఁ బ్రకటించి యున్నారు. పిదప "Epigraphia Indica" అనుపత్రిక ౧౬ వ సంపుటములోఁగూడ నిది ప్రకటింపఁబడియున్నది. గోపినాథరావుగారు ప్రకటించిన శాసనప్రతిబింబములోని యక్షరములు స్పష్టముగానున్నవి ఈపాఠమునే నేను గ్రహించినాఁడను.

ఇంచుమించు ౧౦ అంగుళముల పొడవును ౬ అంగుళముల వెడల్పును గల యొకరాగిరేకు రెండుప్రక్కలను శాసనము తెనుఁగక్షరములతోఁ జెక్కఁబడియున్నది. మొదటిప్రక్క మీఁదిభాగమున సూర్యచంద్రులును వాని యడుగున నొక చెట్టుక్రింద నొకశివలింగమును నొక భక్తవిగ్రహమును లింగమునకుఁ గుడిభాగమున నొకయేనుఁగును దానిపైని నొకసాలెపురుగును, ఏనుఁగు కుడిభాగమున నొక్క స్త్రీవిగ్రహమును జెక్కఁబడియున్నవి. లింగము జంబుకేశ్వరలింగ మనియు, చెట్టు జంబూవృక్ష మనియు స్త్రీవిగ్రహము జంబుకేశ్వరుని దేవియైన యఖిలాండేశ్వరియనియు గోపినాథరావుగారియూహ. జంబూముని యనునొకముని తపస్సుచేయుచుండఁగా నాతని శిరస్సునుండి జంబూవృక్ష మొకటి మొలచె ననియు నాచెట్టుక్రింద జంబుకేశ్వరుఁ డావిర్భవించె ననియు నాదేవునిఁ బూర్వకాలమం దొక యేనుఁగును నొక సాలెపురుగును సేవించి ముక్తిఁ బొందె ననియు స్థలపురాణమం దున్నదఁట ఈక్షేత్రమునకు గజారణ్యక్షేత్ర మనిపేరు. జంబుకేశ్వరములో నుండిన శ్రీశంకరాచార్యమఠమునకు

భూదానము చేయఁబడినది గావున జంబుకేశ్వరవిగ్రహము లిఖింపఁబడినది. ఈవిగ్రహములయడుగున "శ్రీచంద్రమౌళీశ్వరస్వామి" యను నక్షరములు గలవు. తరువాత శాసనమారంభమైనది.

శాసన మంతయుఁ దెలుఁగు వచనరూపముగా నున్నది చివర నాలుగు సంస్కృతశ్లోకములు మాత్రము గలవు. చిట్టచివర "విజయరంగచొక్కనాథ నాయనయ్యవారు" అనియున్నది. ఆకాలమందు దక్షిణదేశములో వాడుకలో నున్న వ్యావహారికభాషతో శాసనము సమకూర్పఁబడినది. వర్ణక్రమములోఁ బెక్కులు తప్పులు గలవు. విజయరంగచొక్కనాథుఁడు పండితుఁడైనట్లును శ్రీ రంగమాహాత్మ్యము మొదలగు కొన్నియాంధ్రగ్రంథములుకూడ రచించినట్లును గనఁబడుచున్నది. అయినను, ఆయన దగు నీశాసనము వ్యవహారసంబంధమైన దగుటచే నాకాలపు మర్యాదనుబట్టి వ్యావహారికభాషయందే కూర్పఁబడినది. కృష్ణదేవరాయల దానములఁ బ్రకటించు శాసనములుకూడ వ్యావహారికాంధ్రమునందె కూర్పఁబడినవి.

కామకోటిపీఠము తొలుత, కంచిలో నుండెడిది. పిదప, ప్రతాపసింహ మహారాజురాజ్యకాలమందు, అనఁగా క్రీ శ ౧౭౬౬ ప్రాంతమందు తంజా వూరునకు మార్పఁబడి యక్కడనుండి తిరిగి కుంభకోణమునకు మార్పఁబడిన దఁట కుంభకోణములో నిప్పు డున్నమఠము శ. స. ౧౭౮౩ లో సర్ఫోజీ మహారాజు కట్టించినట్లు మఠములోనున్న యొకశాసనము తెలుపుచున్నది.

జంబుకేశ్వరము కావేరీగర్భమందు శ్రీరంగక్షేత్రమునకుఁ జేరియున్నది. ఇచ్చటఁ బూర్వము కామకోటిపీఠమునకు సంబంధించిన మఠమొకటి యుండెనఁట ఆమఠమునకే విజయరంగచొక్కనాయకుఁడు భూదానము చేసిన ట్లీశాసనములోఁ జెప్పఁబడింది శాసనకాలము క్రీ. స ౧౭౦౫ మెయి ౧౦ తేదికి సరిపోవుచు

రంగకృష్ణముద్దువీరపనాయకుఁడు క్రీ స ౧౬౮౯ లోఁ జనిపోయెను. అప్పు డాయనభార్య ముత్తమ్మ గర్భవతిగా నుండి కొలఁదికాలములోనె ప్రసవించి కొడుకునుగని చనిపోయెను. ఆకొడుకె విజయరంగచొక్కనాథుఁడు. ఈతఁడు పుట్టినప్పుడే తల్లిపోవుటచేత నతని తండ్రితల్లియు, చొక్కనాథనాయఁకుని భార్యయునగు మంగమాంబ సంరక్షణకర్త్రిగానుండి క్రీ. స. ౧౬౮౯ మొదలు ౧౭౦౪ వఱకు మిక్కిలి సమర్థతతో రాజ్యముచేసెను. విజయరంగ

చొక్కనాథుఁడు ౧౭౦౬ మొదలుకొని ౧౭౩౨ వఱకు రాజ్యము చేసి మరణించిన పిదప నాతనిభార్యయగు మీనాక్షి క్రీ స ౧౭౩౬ సంవత్సరమువఱకు రాజ్యముచేసి యామెయు మృతినొందెను. పిదప దేశ మన్యాక్రాంతమయ్యెను.

విజయరంగచొక్కనాథునకు రాజ్యపరిపాలనమునందుకంటె విద్యాగోష్ఠియందును దేవతారాధనమునందును శ్రద్ధ యధికమగుటచేత నాతనికాలమందే రాజ్యము క్షీణించి మీనాక్షికాలమునందు బూర్తిగాఁ బోయెనని చరిత్రజ్ఞులు చెప్పుదురు.

శాసనములోని, అరమాన్యులు, తారు, శెయి అనునవి క్షేత్రపరిమాణవాచకములగు ద్రావిడభాషాపదములు.

—: శాసనమూలము :—

శ్రీచంద్రమౌళీశ్వరస్వామి.

1 శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యవర్య శ్రీకాంచీపుర
2 పురస్తిత శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యస్వాములవారికి
3 స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకాబ్దములు
4 ౧౬౩౦ అగు నేటివికృతినామసంవత్సరం కార్తికశుద్ధ ౧౫ యిం
5 ద్దువాసరం రోహిణీనక్షత్రం యీకూడిన శుభదినమం
6 ద్దు శ్రీమద్రాజాధిరాజ పరమేశ్వర వీరప్రతాప శ్రీవేంకట
7 దేవ మహారాయలయ్యవారు ఘనగిరి నగరమంద్దు రత్నసిం
8 హాసనాసీనులై పృధ్విసాంబ్రాజ్యం శేయుచు నుండ్డగాను
9 పాండ్యధరా మండలేశ్వరులైన దక్షిణసింహ్వాసనాధ్యక్షు
10 లైన కాశ్యపగోత్రం విశ్వనాధనాయనివారి వంశకర్తలైన
11 చొక్కనాధనాయనయ్యవారి పౌత్రులైన రంగకృష్ణముద్దువీ
12 రప్పనాయనయ్యవారి పుత్రులైన విజయరంగచొక్కనాధనా
13 యనయ్యవారు లోకగురుస్వాములైన శ్రీమచ్ఛంకరాచార్యస్వా
14 ములవారికి గజారణ్యక్షేత్రమంద్దు పౌణ్వాశికొండ్డాం
15 వీధిలో పూర్వణం మొదలుకొని స్వాములవారికి స్వంత్తమ
16 రంపుండ్డేటంద్దున ఆమరాన నిరంత్తరముగా అంన్నదానం
17 ధర్మాదులు నడిపించ్చవలనని స్వాములవారు ఆజ్ఞాపించ్చి
18 నందున॥ ॥ప్రీతిగాను పూజనై వేద్యా అంన్నదానం బ్రాం

హ్మాణసంత్తర్పణ మొదలైనవి నడిచి వచ్చేటట్టుగా సర్వమా
న్యతాంబ్రశాసనం వ్రాసియిచ్చిన క్రమం తొట్టియం శీమ
లో మహీంద్రమంగలంల్లో భట్టవర్త్తి అరమావులు ౮౪ తా
రు ౧ గోపాలస్వామితోట ౧ కృష్ణాపురంలో అరమా
వులు ౮౪ తారు ౨ కారక్కాకులో అరమావులు ౮౪ తారు
౧ కొండయంపేటలోనంజశెయి ౨ తిరుచ్చందొర శీమ
లో మంగమాంబ్బాపురంల్లో నంజశెయి ౮ తింన్నంశీ

— ౹ రెండవప్రక్క ౹ —

మలో అరియూరులో నంజశెయి ౧౬ దక్షిణాం కోనా
టుశీమలో అరియమంగలంల్లో నంజశెయి ౬ జంబ్బుకేశ్వ
రంగుడలో(1) నిత్యకట్టుప డ్డిం ౧ కి బియ్యంపడి ౮ అంన్నంతళిగలు
౨ దోశలు ౨ అతిరసాలు ౨ సుగియ ౧ దీపంచమను పడి ౪ వుభ
యతీరంలోను శెయి ౧ కి తూముకు వడ్లువంత్తునానుంన్ను
సుక్కాన నిత్యకట్టడగ గ ౧ యీప్రకారం నడిచి వచ్చేటట్టుగా
దిట్టంచేసి వ్రాయించ్చివుంన్నాము కనక। తాముంన్ను పరపరం(2)
వ్వరలగా అనుభవించ్చుకొని ఆచంద్రార్కస్థాయిగా ధర్మ
పరిపాలనంచేసుకొనుచు ఆశీర్వాదం శాయుగలది॥ దాన
పాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం దానాత్స్వ
ర్గమవాప్నోతి పాలనాదచ్చుతం(3) పదం॥ స్వదత్తాద్విగుణాం
పుంణ్యం పరదత్తానుపాలనం। పరదత్తాపహారేణస్వద
త్తం నిష్ఫలంభవేత్॥ స్వదత్తాం పరదత్తాం వా యోహరే
తవసుంధరా(4) షష్టిర్వర్షసహస్రాణి విష్టాయాంజాయ
తేక్రిమిః॥ మద్వంశజాః పరమహీపతివంశజావాయే
భూమిపాః(5) స్సతత ము జ్జ్వలధర్మచిత్తాః। మద్ధర్మ మేవ
పరిపాలనమాచరంత్తి తత్పాదుకాద్వయమహం శిర
సావహామి॥

విజయరంగచొక్కనాథనాయనయ్య వ్రాలు.

(1) గుడిలో అని (2) పరంపరం అని (3) దచ్యుతం అని (4) సుంధరాం అని (5) భూమిపా అని చదువవలయును.

# త్యాగరాయ వంశము.

రామబ్రహ్మము.




త్యాగరాయల యింటిపేరు తొలుత కాకర్లవారు ఇపుడు చెఱకూరివారని వాడుక. మలికినాఁటివారు రామబ్రహ్మమునకుఁ బూర్వమీకుటుంబము వారు తంజావూరుమండలములోని తిరువాళూరిలోనుండినవారు. రామబ్రహ్మమే యక్కడనుండి తంజావూరికైదుమైళ్ళ దూరములోనున్న తిరువాడికి వచ్చినాఁడు. తంజావూరిలో మహారాష్ట్రరాజులలోఁ గడపటివాఁడగు శివాజీకాలములో (1833—5.) త్యాగరాజుండెను. ఈయన సన్న్యసించి 86 సం॥ల వయస్సులో (పరాభవనామసంవత్సర పుష్య బ ౫ నాఁడు) సిద్ధినొందెను. ఆసిద్ధిపొందిన దినమునఁ బ్రతిసంవత్సరము నిప్పటికిని తిరువాడిలో గొప్పయుత్సవము జరగును. ఈవిషయమంతయుఁ బైవంశవృక్షములోని కడపటివాఁడైన పట్టాభిరామబ్రహ్మముగారివలనఁ దెలిసినది.

త్యాగరాజు కూఁతునకుఁ గొడుకొక్కఁ డుండినట్లును, అతఁడు ముప్పది సంవత్సరములు బ్రదికి యీనడుమ మరణించినట్లును, అతఁడు తంజావూరిలోనున్న తమ సవతియక్కను బెండ్లియాడినట్లును ఆమెకూడ నీనడుమనే చనిపోయినట్లును, ఆమెవలనఁ ద్యాగరాజుపూజించిన శ్రీరామవిగ్రహము తమయింటికి వచ్చియున్నట్లును త్యాగరాయలమునుమనికి సంతానము లేనట్లును తంజావూరు నివాసులు వెల్లాల సుబ్రహ్మణ్యజోస్యులుగారు చెప్పుచున్నారు. జ॥ రా॥

# మనుచరిత్రము—కుతపకాల ప్రశంస.

—: కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు :—



స్వారోచిషమనుసంభవకారుఁడు మూలవిరుద్ధముగఁ దెచ్చిపెట్టిన మార్పులనుగూర్చి మన గ్రంథవిమర్శనపద్ధతికారు లేమివ్రాసిరో కనుఁగొందము.

ప్రవరునింటికి నౌషధసిద్ధుఁ డొకనాఁటి కుతపకాలమున వచ్చి పాదలేప మనుమందును కాళ్ళకుఁ బూయఁగాఁ దత్ప్రభావముచే నాకాశగమనమునఁ ద్రుటిలోఁ బ్రవరుఁడు హిమగిరి కేగి దానిరామణీయకమును జూచుచుండఁగా నచ్చట మధ్యాహ్నమైన దని పెద్దన చెప్పె; ఈరెండును, (కుతపకాల మధ్యాహ్నకాలనిరూపణములు) ఈకథకు మూల మగుమార్కండేయపురాణమునందు లేవు. ఇవి యాంధ్రకవితాపితామహుఁడు తనగ్రంథములోఁ దెచ్చిపెట్టిన మార్పులు. ఈమార్పు లొక పరస్పరవైరుధ్యమును గలిగించినవి.

కథాసందర్భముంబట్టి చూడ సిద్ధుఁడు మం దిచ్చిననాఁడే ప్రవరుఁడు హిమగిరి కేగినట్లు గాన్పించుచున్నది. కుతపకాలానంతరమున హిమగిరికి బయలువెడలిన ప్రవరుఁడ హిమగిరియం దుండఁగా నాఁడే మధ్యాహ్న మగుట యసంభవ మగుచున్నది. కాన పెద్దన కుతపకాలానంతరమున మధ్యాహ్నమును వర్ణించి మూలకథను సందర్భవిరహితమును గా నొనరించె నని యస్మదాదులము వ్రాసితిమి.

పెద్దనయం దభిమానము గలవార మనుకొనువా రీదోషము నెట్లైన సాధువుగా మార్చి పెద్దనను సమర్థింపవలె నని విశేషప్రయత్నము గావించి యనవసరగ్రంథమును బెంచుచున్నారు. ఎవ రెన్ని వ్రాసినను దప్పు తప్పే యగును గాని యొప్పెన్నఁటికిని గాదు సరికదా యొకదోషమును గప్పిపెట్టఁబోయిన మఱికొన్ని దోషములు వచ్చి పడును. మనుచరిత్రమునందలి కుతపకాలవిషయికదోష మొక్క ప్రమాదలేశము. ప్రమాదము లెంతటివారికైన నుండవచ్చును. అంతమాత్రమునఁ గవులకుఁ గాని, గ్రంథములకుఁ గాని లోప మింతయు రానేరదు. ఆయంశము నాలోచింపక పెద్దనార్యపక్షావలంబుల మనుకొనువారు వృథాగా లేనిపోని సమర్థనములఁ గావించి దోషమును మఱింత పెద్దదానిని జేయుచున్నారు. ఈసంగతు లన్నియు నాయొనర్చిన విమర్శనమును

జమవుకొనిన స్పష్టపడఁగలవు. ఇఁక మనవేంకటశాస్త్రిగా రన్ననో తోడిమను చరిత్రాభిమానులవలె నిందు దోషము లే దని తెలుపుటకుమాత్రమే ప్రయత్నముచేయక వారి నందఱిని మించి యిందు గుణవిశేషము గూడఁ గల దని చాటఁజొచ్చిరి. ముందు వీరు చెప్పినగుణవిశేష మేమో కనుఁగొందము.

పెద్దన కుతపకాలవర్ణన మేల చేసె? "అతిథిసత్కారార్హ మగు కాల విశేషమును దెల్పుటకై పెద్దనకవి, మూలములో లేని కుతపకాలమును వర్ణించినాఁడు" అని మనవేంకటశాస్త్రిగారు, తేవప్పెరుమాళ్ళయ్యగారి గమనిక ననుసరించి లిఖించిరి. ఇది సరి కాదు. కుతపకాల మనునది యతిథిసత్కారమునకై నియమింపఁబడిన కాలము కాదు. అయ్యది శ్రాద్ధమునకై నియమింపఁబడిన కాలము. "కుతప ప్రథమే భాగే ఏకోద్దిష్ట ముపక్రమేత్" (కాలమాధవము) "ఆరభ్య కుతపే శ్రాద్ధం కుర్యా దారోహిణం బుధః" (గౌతముఁడు) దివస స్యాష్టమే భాగే మన్దీభవతి భాస్కరః స కాలః కుతపో జ్ఞేయః పితౄణాం దత్త మక్షయమ్" (మత్స్యపురాణము) "త్రీణి శ్రాద్ధే ప్రశస్యన్తే దౌహిత్రః కుతప స్తిలాః" (మనువు.) ఈవిధముగా పితృశ్రాద్ధమునకుఁ గుతపకాలము ముఖ్య మని శాస్త్రములు బోధించుచున్నవి అంతియే కాని యతిథిపూజ కావించుటకుఁ గుతపము తగుకాల మని తెలుపుటలేదు. అతిథిపూజ శ్రాద్ధము కాదు. అయ్యది మధ్యాహ్నమునకు ముందును గావింపవచ్చును. తరువాతను గావింపవచ్చును. సాయాహ్నమునను గావింపవచ్చును. పెక్కల నడికిరే యయినఁ గావింపవచ్చును. "తస్యచ వైశ్వదేవబలేః ప్రాగేవ పూజ్యతా। పరత్ర ఆహారదానమాత్రం" అని వాచస్పత్యము తెలుపుచున్నది. "వైశ్వదేవ ఉపస్థిత మితి దివసాభిప్రాయం" అని మాధవవిద్యారణ్యస్వాములవారు పరాశరమాధవీయములో వ్రాసిరి. కావున వైశ్వదేవకాలమునందు వచ్చువాఁడు మాత్రమే అతిథికాఁడు. "సాయ మాగతో ప్యతిథి ర్నప్రత్యాఖ్యేయః । సాయ మాగతోతిథి స్సూర్యోఢ ఇత్యుచ్యతే" (శబ్దార్థసర్వస్వము.) ఇట్టిప్రమాణవాక్యములఁబట్టి అతిథి వైశ్వదేవమునకుఁ బూర్వమునందును రావచ్చును, బరమునందును రావచ్చును, సాయాహ్నమునను రావచ్చు నని తేలుచున్నది. మనపెద్దనార్యుఁడు ప్రవరునిభార్యను వర్ణించుచు "అతిథు లేతేర నడికిరే యైనఁ బెట్టు - వలయు భోజ్యంబు లింట నవ్వారిగాఁగ." అని చెప్పియున్నాఁడు. ఇంకఁ బ్రవరుఁ డెట్టివాఁ డన:- వైశ్వదేవాంతమున వీథిగుమ్మ

ముకడకుఁ బోయి యతిథు లెవ్వ రైనఁ గలరా యని తొంగి చూచువాఁడు మాత్రముఁగాడు. అతిథులు తనపురికి వచ్చుచున్నా రని విని యెంతదూర మైన నెదురుగ నేగి తనయింటికిఁ దీసికొని వచ్చి వారి కాతిథ్య మిచ్చు నని పెద్దన "తీర్థసంవాసు లేతెంచినా రని విన్న నెదురుగా నేగు ద వ్వెంత యైన, నేగి తత్పదముల కెఱఁగి యింటికిఁ దెచ్చుఁ దెచ్చి సద్భక్తి నాతిథ్య మిచ్చు" అనుపదములలో వర్ణించె. దీని నంతను బట్టి చూడఁ బ్రవరునింటికి నతిథులు సరిగ భోజనకాలమునందే వత్తు రని కూడ చెప్పుకొన నవసరము లేదు. ఇంకఁ గుతపకాలమున వత్తు రని చెప్ప నవసర మే మున్నది?

ఇతఁడు సిద్ధునకు నర్ఘ్యపాద్యాదు లిచ్చి పూజించి పిమ్మట నిష్టమృష్టాన్నకలన సంతుష్టుఁజేసినట్లు మనుచరిత్రయందు వర్ణింపఁబడినది. వైశ్వదేవమునకుఁ బూర్వమునందు వచ్చినయతిథికి మాత్ర మే యర్ఘ్యపాద్యాదిపూజన ముండును గాని తరువాత వచ్చినవాని కుండనేరదు. తరువాత వచ్చిన వానికి భోజనము పెట్టుట మాత్రమే కావింపవలయు నని వాచస్పత్యము చెప్పుచున్నది. కావున మనుచరిత్రమునందు నతిథిపూజ కూడ వర్ణింపఁబడి యుండుటంజేసి సిద్ధుఁడు వైశ్వదేవమునకుఁ బూర్వమునందే ప్రవరునింటికి వచ్చె నని చెప్పవలసియుండును. వీని నన్నిటినిబట్టి చూడ నతిథి కుతపకాలమునందు మాత్ర మే గృహస్థులయిండ్లకు రావలె నను విధి లే దనియు నట్లు చెప్పుట యవసరము కా దనియు నంతకు ముందే వచ్చి యుండవలసియుండు ననియుఁ దేలుచున్నది.

కాఁబట్టి మూలములో లేనికుతపకాలమును బెద్దనార్యుఁ డనవసరముగాఁ దెచ్చిపెట్టె నని చెప్పక తప్పదు.

వాదమునిమిత్త మతిథిపూజార్హ మగుకాలము కుతప మనియు నందు మూలముచే సిద్ధుఁడు కుతపకాలమున వచ్చె నని పెద్దన్న వర్ణించె ననియు భావింతము. అట్లు భావించినను దరువాతఁ గావింపఁబడిన మధ్యాహ్నకాల వర్ణనము సందర్భవిరోధము గల్గింపకపోదు. కాన నింక నీవైరుధ్యమును వేంకటశాస్త్రిగా రెట్లు సమర్థించిరో పరీక్షించి చూచుకొందము.

మనుచరిత్రమునందలి కథావిధానముంబట్టి చూడ నొకనాఁడే కుతపకాలానంతరమున మధ్యాహ్నము సంప్రాప్తమయ్యె ననుదోషమును నివారించుటకై మనవేంకటశాస్త్రిగారు కుతపకాలమున సిద్ధుఁడు వచ్చినదినమునఁ

గాక మఱునాఁ డుదయమునఁ బాదలేపమును బూయుటయుఁ బ్రవరుఁడు గిరి కేఁగుటయుఁ గలిగిన వనియుఁ, బెద్దన గావించిన మధ్యాహ్నవర్ణనము మఱునాఁటిదై యుండవలె ననియు నొక యపూర్వవాదమును దెచ్చిపెట్టిరి. తమ నూతనవాదమునకు బలము కలుగుటకై, మనుచరిత్రము నందలి పైసందర్భ విరోధముం గూర్చి పండితులకు భిన్నాభిప్రాయములు కలిగిన వని వ్రాసిరి కాని యిది యంతగా సరికాదు. పెద్దన్న పక్ష మవలంబించిన పూర్వవిమర్శకులు కూడఁ బెద్దన్న చెప్పినకథాసందర్భముంబట్టి 'నూఁడ మఱునాఁడు ప్రవరుఁడు హిమగిరి కేఁగె ననుట కంతగా నవకాశము గాన్పించుట లే దనియుఁ బెద్దన్న వ్రాఁతయం దేదో యొకలోప ముంకితీరిన దనియు నే వ్రాసిరి.

కీ॥ శే॥ తేవప్పెరుమాళ్ళయ్యగారు మనుచరిత్రమును మాత్రమే పరిశీలించునెడల సిద్ధుఁడు వచ్చిననాఁడే ప్రవరుఁడు పాదలేపమును బూయించుకొని హిమగిరి కేఁగె నని తలంపవలసి యుండు ననియు, నట్లు తలంచినఁ బరస్పరవైరుధ్యము మనుచరిత్రమునందుఁ గల దనవలయు ననియుఁ దేల్చిరి. ఇంక శ్రీమదెడ్లపాటి వేంకటసుబ్బారావుగా రనువారు సిద్ధుఁడు వచ్చిననాఁడు గాక మఱునాఁడు ప్రవరుఁడు గిరి కేఁగె నని పెద్దనార్యుఁడు చెప్పకపోవుట తప్పే గావచ్చు నని లిఖించిరి. అనఁగా వైరుధ్య మున్న దని యొకవిధముగా నొప్పుకొనితీరిరి. ఇఁక మన వేంకటశాస్త్రిగారి వాదమును స్వపక్షమువారే యంగీకరింపలే దని తేలుచున్నది కదా! స్వపక్షము వా రగు శ్రీబోడపాటి రాజన్న పంతులుగారు కూడ నీసందర్భవిరోధమును మార్కండేయపురాణోక్తకథాక్రమముంబట్టి నివారింపఁ జూచిరే కాని మనుచరిత్రమునందలి కథాసందర్భముంబట్టి నివారింప యత్నము చేయలేను.

పెద్దనార్యుని మనుచరిత్రమునందలి కథాప్రచారము క్రమముగ నున్నదా లేదా యనువిచారము మన కవసరము కాని మార్కండేయపురాణోక్త కథాక్రమము సరిగ నున్నదా లేదా యనునది మనకు విచార్యము కాదు. అది సరిగ నుండినను బెద్దనగ్రంథమునకు లాభము లేదు. ఇఁక సిద్ధప్రవరుల గమనము విషయము నన్ననో పెద్దనను సమర్థింపఁ జూచినవారు కూడ మన వేంకటశాస్త్రులుగారు తలంచినట్లుగాఁ దలంపలేకపోయిరి ఎడ్లపాటి సుబ్బారావుగారు, పాదలేపమును బూసి సిద్ధుఁడు మొదటిదినముననే యేగె ననియుఁ

బ్రవరుఁడు మాత్రము మఱునాఁడు హిమగిరి కేగె ననియు మనుచరిత్రముం బట్టి బోధపడుచున్న దని వ్రాసిరి. తేవప్పెరుమాళ్ళయ్యగారు కూడ సిద్ధుఁడు మొదటిదినమునఁ బాదలేపమును బూసె ననియు మఱునాఁడు ప్రవరుఁడు మంచుమలకుఁ జనె ననియుఁ దెల్పిరి. తమపక్ష మవలంబిపక మనుచరిత్రముం బట్టి సందర్భవిరోధము కల దని రూఢిచేసిన పండితవరు లగు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మున్నగువా రన్ననో పాదలేపముఁ బూయుటయు సిద్ధప్రవరు లేగుటయు మొదటిదినముననే జరిగిన వని స్థిరపఱిచిరి. పండితవరు లిట్లు సిద్ధప్రవరుల పోకంగూర్చి భిన్నాభిప్రాయములు గలవా రగుటకుఁ గలకారణము గ్రంథము సరిగ లేకపోవుటయే.

ఇఁక నెడ్లపాటి వేంకటసుబ్బారావుపంతులువారును వారిని మించి, మనపద్ధతికారులును మఱియొకలాగునఁ దలంచుటకుఁ గారణ మేమనఁగా- గ్రంథమాభావమును గల్గించుటచేతఁగాదు మఱేమన్న దోషమును నెట్లైన గప్పిపెట్టుటకు, పెద్దనాభిమానులు మొదటిదినమునఁ బాదలేపము ప్రవరునికాళ్ళకుఁ బూయఁబడినట్లును, మఱునాఁడు ప్రవరుఁడు హిమగిరి కేగినట్లును కుతపకాల మధ్యాహ్నకాలవైరుధ్యముఁ దొలగించుటకై గ్రంథమున లేనిభావమునుదెచ్చిపెట్టిరి. అట్లు చెప్పిన మఱియొక దోషము సంఘటిల్లె ప్రవరుఁడు కర్మఠుఁడు. తఱచుగాఁ బాదప్రక్షాళనమును, స్నానమును నొనరించువాఁడు; ఇట్టివానికాళ్ళకు వెనుకటిదినమునఁ బూసిన పసరు మఱునాఁటివఱకు నెట్లు నిల్చు నను శంక చేసితిమి ఈశంకనుండి కూడ తప్పించుకొనుటకై మనవేంకటశాస్త్రిగా రిటీవలఁ బాదలేపమును బూయుటయును బ్రవరుఁడును సిద్ధుఁడును వెడలి పోవుటయును మఱునాఁడే జరిగిన వని వ్రాసిరి. ఈరీతిగా దోషసమర్థనమును జేయఁ బోవుటలోఁ గలుగు చిక్కులనుండి తప్పించుకొనుటకై పెద్దనపక్షపాతులు ప్రవరుఁడు మఱునాఁడు హిమగిరి కేగె నని తలంచుస్థితికి వచ్చిరి కాని కథాసందర్భమట్టిభావమును దెల్పుచుండుటచేతఁ గాదు. శ్రీమదెడ్లపాటి సుబ్బారావుగారు మఱునాఁ డేగె నని పెద్దన చెప్పకపోవుట ప్రమాదమే కావచ్చు నని యంగీకరించియే యుండిరి కదా! మనవేంకటశాస్త్రిగారు మాత్రము కథాసందర్భముంబట్టి చూడఁ బాదలేపమును బూయుట, సిద్ధప్రవరు లేగుట మఱునాఁడే జరిగియుండవలె ననియు నయ్యది గ్రంథసందర్భముం బట్టియే స్ఫురించుచున్న దనియు లిఖించిరి.

పెద్దనకవి తాను జేసిన మధ్యాహ్నవర్ణనము సిద్ధుఁడు ప్రవరునింటికి వచ్చిననాఁటి దని తెల్పలేదనియుఁ గాన నయ్యది యానాఁటి దన నవసరము లేదనియు వేంకటశాస్త్రిగారు లిఖించిరి. ఇది సరి కాదు. ఒకనాఁటి కుతపకాలము నెత్తికొని కథ చెప్పట ప్రారంభించినపుడు నాఁటిసంగతులు దెలుపుట లోఁ బ్రతిసంగతియు నాఁడే జరిగిన దని తెలుపుచుండ నవసరము లేదు. అ ట్లెవరును దెలుపరు. ఆసంగతులలోఁ గొన్ని మఱునాఁటి వైన యెడల మఱు నాఁటి వని కవి తెలిపి తీరవలెను. అట్లు తెలుపుట కవులసాంప్రదాయము. కవి పాదలేపముఁ బూయుట మఱునాఁడు జరిగిన దని చెప్పకపోవుటచేత సి ద్ధుఁడు వచ్చిననాఁటిదే యని మనము భావింపవలెను, గాని, యానాఁటిదని తెల్పలేదు కావున మఱునాఁటి దని మనము భావించుట ధర్మము కాదు. సిద్ధుఁడు ఒకనాఁటి పగటిపూఁట ప్రవరునింటికి వచ్చినట్లు మనుచరిత్రమునఁ దెలుపఁబడియున్నది. తరువాత మధ్యాహ్నవర్ణనమును దానితరువాత సాయం కాలవర్ణనము గావింపఁబడినవి. ఇంతవఱకు జరిగిన వన్నియు నానాఁటిపగటి పూఁట జరిగినవే యనుకొనవలెను. పిమ్మట "ఉరుసంధ్యాతపశోణమృత్తలిత మై.........మార్తాండుండు దోఁచెన్ దివిన్" అనుపద్యము వఱకు జరిగినవ న్నియు నాఁటిరాత్రిపూఁట జరిగినవిగా భావించుకొనవలెను. ఈకాలమునకుఁ దరువాత జరిగిన వన్నియు మఱునాఁడు జరిగినవిగా భావించుకొనవలెను. ఇది న్యాయమగుపద్ధతి. ఇట్లుండఁగాఁ బ్రవరుఁడును సిద్ధుఁడును ప్రవరునింటనుండి తీర్థయాత్రలం గూర్చి కడపటి సంభాషణము గావించుకొనుట యుఁ, బాద లేపముఁ బ్రవరునిపాదములకుఁ బూయుట యు వారుభయులును బైలువెడలి యావలకుఁ బోవుట యు మఱునాఁడు జరిగిన వనుట యసంగతము. ప్రసంగ మధ్యమున (నాఁటి) సాయంకాల మగుట యటుతరువాత రాత్రి యగుట తటస్థిం చుట కలిగినచోఁ గవి వాని నాసందర్భమున వర్ణించియేయుండును. సిద్ధప్రవర ప్రసంగములలో నెంతవఱ కైనతరువాత సాయంకాల మైనదో పిమ్మట నెంత వఱ కైనతరువాత నుదయ మైనదో యెవరుచెప్పఁగలరు? అట్లు తెలుపుట కవ కాశ మెక్కడనున్నది? మనవేంకటశాస్త్రిగారు "మనుచరిత్రమునందలి యచ్చ టిఘట్టము చదివినచో వారుదీర్ఘప్రసంగము సలిపినట్లు తోఁచును గాని కొన్ని మాటలాడి విరమించినట్లు తోఁపదు, కావున, వా రది ప్రసంగించు చుండఁగనే సాయంకాలము కావచ్చును." అని లిఖించిరి వీరు తెలిపినరీతిగాఁ బ్రసంగమ ధ్యమున సాయంకాలమే యై యుండినయెడలఁ గవి యాసంగతిని దెలిపియే

యుండును. సాయంకాలవర్ణనము గావించియే యుండును. అట్లు వర్ణింపలేదు, కావునఁ, బ్రసంగమధ్యమున సాయంకాలమైన దని తలంచుట యనవకాశము. మనవేంకటశాస్త్రిగారు సిద్ధప్రవరుఁ ప్రసంగగమనికంగన నాప్రసంగ మతిదీర్ఘమై రెండు మూఁడుపూఁటలు పట్టినట్లు తోఁచు నని వ్రాసిరి. ఇది యసంగతము. ఇదివఱ కెవ్వరికిని నట్లు తోఁపలేదు. విమర్శకు లెల్లరును సిద్ధుఁడు నాఁడు వెళ్ళిపోయె ననియే తలంచిరి. అది యట్లుండ నప్పుడు సిద్ధప్రవరులు కావించినప్రసంగము పదియెనిమిది ఘడియలకాలమో, యట్లు గాకున్న నరగంటయో గంటయో జరుగవలసినదిగా నున్నది, గాని, యంతకన్న మించి జరుగవలసినదిగా లేదు. పదునెనిమిది యధ్యాయములు పట్టిన కృష్ణార్జునసంవాదము (భగవద్గీత) ఒకపూఁటలో నొక్కింత స్వల్పకాలములో జరిగిపోయినట్లుగా భారతములోఁ దెలుపఁబడియున్నది అట్లుండగాఁ బదినిమిషములలోఁ బరిసమాప్తి నొందఁదగిన సిద్ధప్రవర సంవాదమునకుఁ బెక్కు లగుపూఁటలు పట్టె ననుట యసంగతము కాదా? స్నానాదికమునకుఁ గొంతకాలమును, భోజనమునకుఁ గొంతకాలమును, బ్రసంగమునకుఁ గొంతకాలమును బట్టె నని చెప్ప నవసరము లేదు. అవి స్వల్పకాలములో జరిగిపోవునవి. ఇంక దేశాటనప్రసంగ విషయమున నన్ననో, దేశములు తిరుగుటకుఁ జాలకాలము పట్టును గాని దేశము తిరిగి వచ్చుటను దెల్పుట కెంతో కాలము పట్టదు. పండ్రెండుగంటలు దాఁటినపిమ్మట సిద్ధుఁడు ప్రవరునింటికి వచ్చె నని నను 1½ గంటలకు హిమగిరికి వెళ్ళె నని చెప్పుకొనుట కేవిధ మగుసందియము ను లేదు. సిద్ధప్రవరప్రసంగ మతిదీర్ఘముగా సాగిన దని కాని యిట్లనేకవిషయములం గూర్చి వారు ప్రసంగించి రని కాని కవి యెచ్చటను దెల్పియుండలేదు. సూచించియైన నుండలేదు. కావున గ్రంథమునందుఁ దెల్పఁబడియున్న విషయముకంటె నెక్కుడుగఁ బ్రసంగము జరిగిన దనుట కవకాశము లేదు. సిద్ధప్రవరులు ప్రసంగించిన ప్రసంగము నంతను గవి విపులముగా వర్ణించి చెప్పినాఁడు. మనుచరిత్రమందలి కథాభివర్ణనముం బట్టి చూడఁ గవి యింత లంతలు చేసి వర్ణించి చెప్పినట్లున్నది. కాని, తగ్గించి చెప్పినట్లు లేదు. మనవేంకటశాస్త్రిగారు పెద్దన గావించిన మధ్యాహ్నవర్ణనమును మఱునాఁడు జరిగినదానినిగాఁ జేయుటకై యొకగంటలోపల జరిగిపోయిన చర్యను నతిదీర్ఘమైనదానినిగా భావించి మఱునాఁటివఱకు సాగింప నెంచిరి. ఇది సమంజస మెట్లు కాఁగలదు.

అయినను వేంకటశాస్త్రిగారు తెలిపినరీతిగా మధ్యాహ్నము మఱునాఁడే సంభవించె నఁదము. దీనితరువాతఁ దటస్థించిన సాయంకాల మామఱునాఁటిదే యని మనవేంకటశాస్త్రిగారు లిఖించిరి. మనశాస్త్రిగారి వాదగమనిక ననుసరించి చూచిన, పెద్దన వర్ణించిన సాయంకాల మానాఁటి దని తెలుపుట కవకాశము గలుగుట లేదు. ఏమన నాఁటిమధ్యాహ్నమునఁ బాదలేపము గరఁగిపోయినట్లు ప్రవరుఁడు తెలిసికొనినాఁడు, పిమ్మటఁ గొంతసేపటివఱకుఁ గదలక యొక్కచో నిలిచి విచారించినాఁడు. విచారించి పర్వతముపై దిరిగి తిరిగి యొకలోయం గని దానిలో మెల్లగఁ బ్రవేశించి యచటి మేడలను జాడలను జూచి చూచి యటుపిమ్మట నొకవనములోఁ బ్రవేశించి యందు వరూధినిని గాంచి యామెతోఁ బ్రసంగించెను. ఈప్రసంగము ప్రారంభించు నప్పటి కాదినాపరార్ధములోఁ జాలభాగము గడచి యుండును. పిమ్మట వరూధిప్రవరులకు జరిగినప్రసంగము సిద్ధప్రవరప్రసంగముకంటెఁ జాలఁ బెద్దది. ఇందులకై 3, 4, పూఁటలు పట్టియుండును. ఆప్రసంగ మైపోయిన తరువాత ప్రవరుఁ డేటికిఁ బోయి వార్చి యగ్నిదేవుని కరుణచే నంతరిక్షగమనంబున నింటికిఁ బోయె. అతఁడు చనినపిమ్మట వరూధిని యరణ్యమునం దంతటను వానికై తిరిగి తిరిగి చెలులంగూడి యింటికి వచ్చి కానక చాలకాలము పరితపించె.

మనవేంకటశాస్త్రిగారు వేసినలెక్కనుబట్టి చూచిన నిదియంతయు జరుగునప్పటికి రెండుదినములకాలమునకుఁ దక్కువపట్టదు. అయినను మనవేంకటశాస్త్రిగారు ప్రవరుఁడు గిరి కేగినపూఁటనే నాఁటిసాయంకాల మగుటకుఁ బూర్వమే యిది యంతయు జరిగినట్లు భావించిరి. ఇది యెట్లు సంభవమగును, సంభవము కానేరదు. కాఁబట్టి మనవేంకటశాస్త్రిగారిలెక్క తప్పు-తక్కువది యగుసిద్ధప్రవరసంవాదమునకు నెక్కువకాలముపట్టిన దనియును నెక్కువది యగుప్రవరవరూధినీసంవాదమునకుఁ దక్కువకాలము పట్టిన దనియును వేంకటశాస్త్రిగారు తలంచిరి. ఇది యసంగతము. ప్రవరుఁడు గిరి కేగినతరువాత నచటఁ బెద్దనచే మధ్యాహ్నకాలవర్ణనమే పెట్టఁబడకుండిన సిద్ధప్రవరసంవాద మంతయు నొక్కపూఁటలో జరిగినదానిం గానే మనవేంకటశాస్త్రిగారును భావించియుందురు. సందర్భవిరుద్ధముగా వచ్చిపడిన కుతపకాలానంతరమున నగుమధ్యాహ్నవర్ణనమును సమర్థింప శ్రీశాస్త్రిగారివంటివారు ప్రయత్నించుటచే విరుద్ధాంశము లనేకములు బయలువెడలఁజొచ్చినవి.

మొదటిదినముననే భోజనానంతరమునఁ బ్రవరుఁడు గిరికేగె నని తలంపక శ్రీవేంకటశాస్త్రిగారు తలంచినరీతిగా మఱునాఁటియుదయమున బయలు వెడలి యాతఁడు గిరికేగె ననుచో మఱియొకయసందర్భవిషయము తటస్థించు చున్నది. ప్రవరుఁడు కర్మఠుఁడు, ఇట్టివాఁడు పావనమైన వియన్నది లోనగు పరమపుణ్యక్షేత్రములు గల హిమగిరికి నుదయముననే యేగియున్నచో నాతీర్థములలోఁ గ్రుంకులిడియే యుండును. కాని ప్రవరుఁ డట్లు పుణ్యనదీస్నానము చేసినట్లుగా మనుచరిత్రకారుఁడు చెప్పి యుండలేదు. ఎందుచేత ననఁగా నా ప్రవరుని మన పెద్దన భోజనానంతరమున హిమగిరికిఁ దీసికొనిపోయెనుగావున నే. దీనింబట్టి ప్రవరాఖ్యుఁడు మొదటినాఁటి మధ్యాహ్నమే మంచుమలకుఁ బోయెను గాని మఱునాఁటియుదయమునఁ గా దని తేలుచున్నది.

మఱియు ను మఱునాఁటి యుదయమునఁ గదా ప్రవరుఁడు గిరి కేగి యుండవచ్చు నని వేంకటశాస్త్రిగా రూహింతు మఱి. శ్రీశాస్త్రిగారు ప్రవరుఁడు కర్మఠుఁడనియు నమిత మగు కర్మశ్రద్ధ గలవాఁడనియు నంగీకరించిరి. ఇట్టివానికి నుదయకాలమున స్నానసంధ్యాద్యనుష్ఠానములు జపతపములు హోమాదికములు నతిథిపూజాదికములు, దేవతార్చనాదికములును మెండుగ నుండును. కావున మొదటిదినార్థమునందుఁ బ్రకృతివిశేషములఁ జూచుటకై పోవుట కవకాశము లేదు. ఇది యనుభవముచే నందఱు నెఱిఁగి యున్న విషయమే కావుననే పెద్దనార్యుఁడు గిరి కేఁగుటను భోజనానంతరమునఁ బెట్టినాఁడు. అదిసర్వవిధముల సమంజసముగ నున్నది. మొదటిదినార్థమునఁ బ్రవరునివంటి కర్మశ్రద్ధ కలవాఁడు ప్రకృతివైభవమును జూచుటకై యిలు విడిచి దవ్వుల కేఁగుట యసమంజసము

ఇంతయేల? మన వేంకటశాస్త్రిగారు తలంచినరీతిగాఁ బ్రసంగము మఱునాఁటివఱకును జరిగియున్నయెడల నాయంశమును గవి స్పష్టముగాఁ జెప్పి యుండవలెను. అట్లు చెప్పక పోవుట తప్పు. చెప్పఁ దగినదానిఁ జెప్పకుండుట చెప్పఁ దగనిదానిఁ జెప్పుట తప్పయితీరును.

వేంకటశాస్త్రిగారు "గ్రంథమునఁ జదువరు లూహించుకొనఁదగిన యంశములు పెక్కు లుండును గదా" అని లిఖించిరి. ఇది చదువరుల యూహకు విడిచిపెట్టఁదగిన యంశము కాదు. ఏ మనఁ గవి యొకదినమును, నందులో నొకకాలమును నిరేశించి కథ వర్ణించుటకుఁ బ్రారంభించినాఁడు. కావుననాఁ

టికథను మించి చెప్పునప్పు డద్దానినిఁ గూడ నిర్దేశింపవలయును. అట్లు చేయకుండుట తప్పు.

ఏవిధమునఁ జూచినను గవియందుఁ దప్పు లేదనుట కవకాశము గాన్పించుటలేదు. ప్రమాదములను గప్పఁబోయి యస్వాభావికము లైన లేనిపోని కల్పనముల నన్నింటిని జేసి యూహలపై నాకాశహర్మ్యముల నిర్మించుటకంటెఁ బ్రమాదములను న్యాయదృష్టితో నంగీకరించుటయే మేలని వేంకటశాస్త్రిగారికి విన్నవించుచున్నాఁడను.

---

# ఆంధ్రమహాభారతోద్యోగపర్వవివాద పద్యార్థ విమర్శనము.

—: చంద్రాభట్ట రామమూర్తిగారు :—

విజయనగరసంస్కృతకళాశాలాంధ్రపండితు లగు బ్రహ్మశ్రీ విద్వాన్ దూపి రామమూర్తిశాస్త్రిగారిచే వ్రాయఁబడిన "ఆంధ్రమహాభారతోద్యోగపర్వవివాద పద్యార్థము" లను శీర్షిక గలవ్యాసము విభవసంవత్సర ఆశ్వయుజ బ ౧౩ (ది 10-11-1928) తేది శనివారము ఆంధ్రపత్రికాసారస్వతానుబంధమునఁ బ్రకటింపఁబడినది.

అందుఁ దుదను "నాకుఁ దోఁచినరీతి నీపద్యముల కర్థాదులు వ్రాసితిని. ఇందలి గుణదోషముల సయుక్తికముగ విమర్శించి సిద్ధాంతీకరించు భారము విబుధులపై వైచితి" నని కలదు.

ఈ తుదివాక్యములు రెంటిఁ బట్టిచూడఁగా శ్రీశాస్త్రిగారు దమకుఁ దోఁచినరీతి నర్థాదులు వ్రాసి రనియు, నవి వారికి సంతుష్టినిఁ గలిగింపలే దనియు, నందుపై విమర్శించి సిద్ధాంతీకరించు భారము విబుధులపై వైచి రనియు స్పష్ట మగుచున్నది.

నేను శ్రీశాస్త్రిగారితాత్పర్యములోని విబుధుఁడను గాకపోయినను వేఱొకవిధముగా విబుధశబ్దార్థమున కర్హుఁడనై యుండుటచే నాకుఁ దోఁచినరీతిని శ్రీశాస్త్రిగారివ్యాసమును విమర్శించుచున్నాను.

వివాదపద్యార్థము లని శీర్షికలోఁ జెప్పివ్యాసముం దా వివాదాంశము లను స్పష్టపఱుపకుండ శ్రీశాస్త్రిగారు తమకుఁ దోఁచినరీతి నర్థాదులు వ్రాసిరి.

శ్రీశాస్త్రిగారివ్యాసమందుఁ బ్రథమమున నుదాహరించిన పద్యమును దంపూరి వెంకటసుబ్బశాస్త్రిగారిచేఁ బరిష్కరింపఁబడి 1861 సంవత్సరము ఏప్రియల్ నెల 24 తేదినిఁ బ్రకటింపఁబడిన భారతప్రతినిఁబట్టి యీక్రింద వ్రాయుచున్నాను.

చ. పగ యడఁగించు టెంతయు శుభం బది యెన్న యడంగునే పగం
బగ వగగొన్న మార్గ్గానక పల్లక యుండఁగవచ్చునే కడుం
దెగ మొదలెత్తి పోవఁ బగ తీర్పకయుండినఁ గ్రార్యమొందు నే
మిగతిఁ దలంచినం బగకు మేలిమిలేదు ధ్రువంబు కేశవా.

ఈపద్యమునకు శ్రీశాస్త్రిగారు వ్రాసినయర్థము లెల్ల వ్రాసి విమర్శనమునకు దొరకొనినచో గ్రంథబాహుళ్యమై చదువరులకు విసువు వచ్చును గావున ముందు నాకుఁ దోఁచినయర్థమును వ్రాసి పిదప స్థాలీపులాకన్యాయమున శ్రీశాస్త్రిగారి వ్రాఁతను విమర్శించెదను. పరకులు మన్నించెదరుగాక.

అర్థము—పగ-విరోధము. అడఁగించుట-ఉపశమిల్లునట్లుచేయుట ఎంతయును-అత్యంతమును. శుభంబు-క్షేమము. అది-అట్లుచేయుట. లెస్స-బాగు (కాని) పగన్-పగచేత. పగ-వైరము. అడంగునే-శాంతించునా ? (శాంతింపదు) పగగొన్నన్-విరోధముపూనినచో. మాఱ్కొనక ఎదుర్కొనక, పల్కక, ఉండఁగవచ్చునే-మాటలాడకుండవచ్చునా ? (ఊరకుండవచ్చునా యని భావము) కడున్-మిక్కిలి. తెగన్-చొరవచేసినయెడల (అనఁగా యుద్ధమునకుఁ దెగించినయెడల) మొదలెత్తిపోవన్-మూలచ్ఛేద మగునట్లుగా. పగ, తీర్పక, ఉండినన్-కోపము తీర్చుకొననియెడల క్రౌర్యము-క్రూరభావము. ఒందున్-పొందును (అనఁగాఁ జలమెక్కువగును) ఏమిగతిన్-ఏవిధముగా. తలంచినన్ - యోజించినను. పగకు - విరోధమునకు. మేలిమి-శుభము లేదు-కనఁబడదు. ధ్రువంబు-నిశ్చయము. కేశవా-కృష్ణా ?

పగ యడగించు టెంతయు శుభంబు అది లెస్స (పునరుక్తి నిశ్చయార్థము) పగచేత నెప్పుడును బగ యడంగదు. పగ కలిగిన నెదిరింపక యూరకుండవచ్చునా ? సాహసించి యుద్ధమునకు దిగినచో మూలచ్ఛేద మగునట్లు పగ తీర్పకయుండిన నుభయత్ర క్రూరభావము కల్గును. ఏవిధమునఁ జూచినను బగకు శుభంబులేదు. నిశ్చయము. అని తాత్పర్యము.

ఈపద్యమును శ్రీశాస్త్రిగారు పగ యడఁగించు టెంతయు శుభంబు, అది లెస్స యడఁగునే పగన్, పగవగగొన్న, అని విడఁదీసిరి.

'పగవగగొన్న' అనఁగా పగ-పగచేత వగ-పరితాపము (మనస్తాపము) కొన్నన్-నాటుకొనిన యని యర్థము వ్రాసిరి. పగచేత వగ నాటుకొన్న మాఱ్కొనునా ? పగగొన్న మాఱ్కొనునా ? పగ కలవాఁడు మాఱ్కొనును గాని వగగొనఁడు. పగచేత వగనాటుకొనుట, వగ గొన్న మాఱ్కొను ననుట యుక్తియుక్తములుగాఁ దోఁపవు. పగగొని మాఱ్కొనును గాని వగగొని మాఱ్కొనఁడు. శ్రీశాస్త్రిగారి యర్థము నాకు బాగుగా నున్నట్లు తోఁపదు.

"ప్రథమమీఁదిపరుషములకు గసడదవలు బహుళముగా నగు" ననెడు బాలవ్యాకరణసూత్రము ప్రకారము 'ప' 'వ' గా మాఱి పగగొన్నయను నది వగగొన్న యయ్యెను. పగగొన్న మార్గానక పల్కక యుండఁగవచ్చునే యని చక్కగా సంధించుచున్నది కావున పగ యడఁగించు నెంత యు శుభంబు, అది లెస్స, అడంగునే పగంబగ, పగగొన్నమార్గానక పల్కకయుండఁగవచ్చునే, యని యన్వయించి యర్థము చెప్పుటే తగి యున్న దని నాయుద్దేశము.

మఱియు, పగఁ దీర్పఁగ వచ్చినన్-వైరము చక్కఁజేసికొన నేతెంచిన, అనఁగా దండెత్తిన, క్రౌర్యము-క్రూరత్వము. ఒందన్-పొందును. అని శ్రీశాస్త్రిగారు వ్రాసిరి. దండెత్తినప్పుడు క్రౌర్య ముండి పగగలిగి యుండియును దండెత్తకపూర్వము క్రౌర్య ముండ దని చెప్పుట సరికాదు దండెత్తినను దండెత్తక పోయినను గూడఁ బగతోపాటు క్రౌర్య ముండియేతీరును, పగలేనిదే క్రౌర్యముండదు. క్రౌర్యము లేనిదే పగ యుండదు ఆరెంటికిని యవినాభావసంబంధము కలదు. పగ యెచ్చినఁ గ్రౌర్య మెచ్చును. పగ తగ్గినఁ గ్రౌర్యము తగ్గును. దండెత్తినప్పుడు క్రొత్తగాఁ గ్రౌర్యము ప్రారంభింపదు. అందువలన వైరము చక్కఁ జేసికొన నేతెంచిన యనునర్థము సరియైనది గాఁ గాన్పింపదు. మొదలెత్తిపోవక్-మూలచ్ఛేద మగునట్లు, పగతీర్పఁగవచ్చినక్-పగసాధింపవలసివచ్చినయెడల-క్రౌర్యము-క్రూరత్వము, ఒందుక్-పొందును. అని యర్థము చెప్పిన కొంత మేలు ఎట్లయినను, "పగ తీర్పక యుండినఁ గ్రౌర్య మొందు" ననెడు పాఠమే సరసమైనది గాఁ గాన్పించుచున్నది. కాన నింతటితో నీపద్యమును గూర్చి ముచ్చటించుట చాలించి రెండవపద్యమును జూతము

మ. తుది రాజ్యమ్ము సగమ్ము గొమ్ము దవియుందుం బేసు వంచించియుం
బదుమూఁడేఁడులు నీవునుం దిరిగిరాఁ బాలీకపోవచ్చునే
యదిగాదేఁ దెగి బంటవై యఱుము మాయుల్వన్ను నేర్పింకఁ జె
ల్లదుసూ నీకని మాసుయోధనునియుల్లం బుచ్చిపో నాడుమీ.

ఈపద్యమునకు శ్రీశాస్త్రిగారు పలురీతులఁ దమయభిప్రాయమును వివరించి యర్థాదులు వ్రాసిరి. అవి యేవియును యుక్తియుక్తములుగా నాకుఁ దోఁచుట లేదు.

" తుదిక్-అంతమందు. రాజ్యమ్ముసగమ్ము-అర్ధరాజ్యమును కొమ్ము-స్వీకరింపుము. ఇది ఫలితార్థప్రకాశికవాక్యము- తెగి బంటవై-పోరాడి జయము

గొన్న పిదప మాయర్ధరాజ్యమును సైతము స్వీకరింపు మని భావము” అని యొకచోటను “తెగి-సాహసించి. బంటవై-యోధవై. అఱుము-నశింపుము” అని మఱియొకచోటను వ్రాసిరి. ఇంకను ననేకవిధములఁ దరిచి వ్రాసిరి. కాని యవియు నంతసందర్భములుగాఁ గనఁబడలేదు. ప్రస్తుతము వారిముఖ్యభావమును గూర్చి మాత్రమే విమర్శించెదను.

సహదేవుఁడు దుర్యోధనునిగూడఁ బండ్రెండేండ్లు వనవాసమును ఒక యేఁడజ్ఞాతవాసమును జేసి వచ్చి తుదను రాజ్యమ్ము సగమ్ము గొమ్మనినట్లును అట్లు చేయనియెడల యుద్ధము చేసి నశింపు మని యున్న శ్లోకతాత్పర్యమును, తెగి బంటవై పోరాడి జయముగొన్న పిదప మాయర్ధరాజ్యమును సైతము స్వీకరింపు మని భావ మని మఱియొకచోటను శ్రీశాస్త్రిగారు తమభావములను దెల్పినారు.

ఈరెండుభావములును నసందర్భములుగానే తోఁచుచున్నవి. (1) దుర్యోధనునిఁగూడ నరణ్యాజ్ఞాతవాసములు చేయు మని చెప్పుటకు సహదేవున కధికారము లేదు (2) తమ్ముఁడు గెల్చినప్పుడు తమభాగమును గూడ స్వీకరింపు మని సహదేవుఁడు తనయనుమతి యిచ్చుట యనవసరము.

సహదేవునంతటి యుత్తమనాయకుఁడు తనయన్నలగుధర్మజభీమార్జుననకులులతోఁ గూడిన నిండోలగమున రాయబారి యైన శ్రీకృష్ణునితో జూదంబున గెలుపొంది రాజ్యంబు సేయుచున్న దుర్యోధనునిగూడఁ దమవలెనే పండ్రెండేండ్లు వనవాసము నొక యేఁడజ్ఞాతవాసమును జేసి వచ్చి తుదిరాజ్యమ్ము సగమ్ము గొమ్మనియు నట్లు కాదేని తెగి బంటవై యఱుము మనియుఁ జెప్పు మని సంభాషించునా? అది సాత్యకిప్రభృతిశూరలోకం బెల్ల మేలని మెచ్చుకొన్నారు గదా! వారంద ఱంత యుచితానుచితజ్ఞానశూన్యులా? పాండవులు జూదంబున నోడుటచే వనవాసాజ్ఞాతవాసములు చేయవలసిన యవసరము గల్గినది గాని లేకున్న వారట్లు చేయుదురా? సహదేవుఁడు తమ కర్ధరాజ్యము నీయకున్న దుర్యోధనునితో యుద్ధము చేసి గెల్చుకొందు నని చెప్పుట యుక్తియుక్తము.

మఱియు శ్రీశాస్త్రిగారు, అట్లు కాదేని యుద్ధము చేసి నశింపు మని యర్థము వ్రాయుట మిక్కిలి దూరదృష్టిలేని వ్రాఁతగాఁ గాన్పించుచున్నది. తనతో యుద్ధముచేసి నశింపు మని యెంతయవివేకి యైనను గోరునా? ఎట్టిభీరుఁడైనను దనను యుద్ధమున గెలువు మనును.

ఇంతకును నీవునుం దిరిగిరా యనుపాఠము యుక్తిరహితముగాఁ గాన్పించుచున్నది. కావున నాపద్య మీక్రిందిరీతిగానున్న సరిపోవునని తోఁచుచున్నది.

మ. తుది రాజ్యమ్ము సగమ్ము గొమ్మడవియందుం బేరువంచించియుం
బదుమూఁడేఁడులు నీవనం దిరిగిరాఁ బాలీకపోవచ్చునే?
యదిగాదేఁ దెగి బంటవై యలుము మాయల్వన్ను నేర్పింకఁ జె
ల్లదసూ నీకని యాసుయోధనునియుల్లం బుచ్చిపోనాడుమీ?

అర్థము అడవియందున్ - అరణ్యములోను, పేరు వంచించియున్- మాఱుపేరులు పెట్టుకొనియును. పదుమూఁడేఁడులు - పదుమూఁడుసంవత్సరములు ఉండి యనుక్త్వార్థక మధ్యాహారము తుదిన్ - చివరను, రాజ్యమ్మున సగమ్ము- అర్థరాజ్యమును, కొమ్ము- స్వీకరింపుము (అని) నీవు- నీవు (దుర్యోధనుఁడర్థము) అనన్- (ధర్మరాజుతో) అనఁగా (అట్లుచేసి) తిరిగిరాన్- తిరిగిరాఁగా. పాలీకపోవచ్చునే- భాగమీయకుండుట న్యాయమా? అది కాదేన్- అది నీయిష్టము కాకున్న, తెగి- సాహసించి; బంటవై- వీరుఁడవై; అలుము- ఆక్రమింపుము. (గెలువుము.) ఇక్కడ శ్రీశాస్త్రిగారు అలుము- అనఁగా నశింపుమని యర్థము వ్రాసిరి. అలుధాతువుమీఁద మువర్ణము వచ్చినదని కాఁబోలు వారి యభిప్రాయము. ఇక్కడ అలుధాతువును గ్రహింపఁగూడదు అలుము ధాతువును గ్రహింపవలెను. అలుము ధాతువునకు మధ్యమపురుషైకవచన మువర్ణకము రాఁగా అలుముము అను రూపము వచ్చును "మధ్యమపురుషమువర్ణమునకు హాలవసానంబులు పరంబు లగునపుడు లోపము విభాషనగు" ననెడు బాలవ్యాకరణసూత్రము ననుసరించి మువర్ణకము లోపించి అలుము అనుధాతురూప మిక్కడ నిలిచెను. మాయల్ పన్ను నేర్పు- మాయలను గల్పించు తెలివి. ఇంకన్- ఇఁకమీఁద, చెల్లదుసూ- పనికిరాదుసుమీ? నీకని ఆసుయోధనుని- ఆదుర్యోధనునియొక్క, ఉల్లంబు- డెందము. ఉచ్చిపోన్ - దుస్సిపోవునట్లుగా ఆడుమీ- పల్కుమా.

వనవాసాజ్ఞాతవాసములు రెండును బదుమూఁడేఁడులు సల్పి తుదిరాజ్యమ్ము సగమ్ముగొమ్మని నీవనఁగా ధర్మరాజు తిరిగి రా పాలీయకుండుట న్యాయమా? అట్లిష్టపడవేని సాహసించి వీరుఁడవై యుద్ధమున గెలువుము. మోసగించి సంపాదించు నేర్పింక నీకు సాగదు సుమా యని యాసుయోధనునియుల్లం బుచ్చిపోవునట్లు వచింపుమా యని సహదేవుఁడు కృష్ణునితోఁ జెప్పెనని తాత్పర్యము.

నీవనెం దిరిగి రా యని శ్రీశాస్త్రిగారికి సంబంధింపని పక్ష మొకటి కూడఁ గలదు. ఆపక్షమున అనెన్ అనుభూతక్రియకు దుర్యోధనుఁ డని కర్త నధ్యాహారము చేసికొనవలయును నీవనన్ అనినప్పుడు తుమున్నర్థకమునకీ యధ్యాహారము లేదు. అప్పుడు నీవు అను యుష్మదర్థకము దుర్యోధనునకిఁ జెందును. నీవనన్ అని యుండుటే మంచి దని తోఁచుచున్నది.

అది యటుండ నింక. ఉదిరాజ్యమ్ము సగమ్ము గొమ్మడవియందుం బేరు వంచించియుం బదుమూఁడేఁడులు నివసెన్ అని సహదేవుఁడు శ్రీకృష్ణునితోఁ జెప్పినమాట గాని దుర్యోధనునితో సహదేవుఁడు ముఖాముఖి జెప్పినమాట కాదు. ఇంకఁ దిరిగి రా పాలికపోవచ్చునే యనునది కృష్ణునితో ముఖాముఖి జెప్పినమాట.

ఇట్లుండ అదికాదేన్ అనువాక్య మెవరితో ననఁ దగినది? కృష్ణునితో ననఁదగినది కాదుగదా దుర్యోధనునితో ననవలసివచ్చును.

అది యనుసర్వనామము పూర్వోక్తవిషయమును దెల్పునదిగా నుండవలెను గదా? తిరిగి రా పాలికపోవచ్చునే యనుపూర్వవిషయము కృష్ణునితోఁ జెప్పినదికదా? అదికాదేన్ అని అది యనుసర్వనామముతోఁ జెప్పినవిషయము దుర్యోధనుని కెట్లన్వయించును? నీవనెన్ అని భూతార్థకక్రియ యుండవలెనను పక్షమున పద్యములోని పూర్వార్థ మంతయు సహదేవుఁడు కృష్ణునితోఁ జెప్పుకొన్నదే గాని దుర్యోధనునితోఁ జెప్పుమన్నది కాదు. ఉత్తరార్థమన్ననో దుర్యోధనునితోఁ జెప్పుమన్న సందేశము. అప్పుడు పూర్వార్థము స్మరింపఁజేయు "అది" యను సర్వనామము తెల్పువిషయ మేదో దుర్యోధనుని కెట్లు తెలియును?

సహదేవుఁడు కృష్ణుని దుర్యోధనునితోఁ జెప్పు మన్నవి రెండేవిషయములు (1) సమయము నెఱవేర్చికొని వచ్చినాము గనుక మాపాలు మా కిమ్ము. (2) అట్లిచ్చుట కిష్టము లేదేని యుద్ధమునకు రమ్ము.

మతాంతరార్థమును బట్టి మొదటివాక్యము కృష్ణునితోఁ జెప్పుకొన్నదియు రెండవవాక్యము దుర్యోధనునితోఁ జెప్పుమన్నదియును గా నుండును.

కనుక అనెన్ అనుభూతక్రియ యనన్వితము. ఎటు చూచినను అనన్ అను తుమున్నర్థకమో యుక్తియుక్తముగను నన్వయసౌలభ్యము గలదిగను గానఁబడుచున్నది.

ఈవిషయ మంతయు బ్ర॥ శ్రీ॥ విద్వాన్ దూసి రామమూర్తిశాస్త్రులుగారు పునర్విమర్శనము సేయుదురుగాక.

# గ్రంథాది స్వీకారము.



1. శాశ్వతదివదర్శిని :—లోకేగారి లక్ష్మణశర్మగారిచే రచియింపఁబడినది. వలయువారు మేనేజరు సుజాత హైదరాబాదు అనివ్రాయువలయును. వెల ౧ అ.

2 ప్రజారోగ్యరక్షణము:—దుగ్గిరాల వేంకటసూర్యప్రకాశరావుగారిచే శిశువారోత్సవసందర్భమున జరుపఁబడిన యుపన్యాసము. శిశువులయందు జననమరణములు, నందులకుఁ గారణములు వివిధదేశపరిస్థితులు, హిందూదేశమునందలి యార్థికసమస్య మున్నగువిషయములు చాలఁగలవు.

3. శ్రీసత్యాసత్యపురుషత్వము:—శ్రీవివేకానంద విరచిత మగు "The real and apparant man" అను గ్రంథమునకు మ॥ జములాపురపు వేంకటేశ్వరరావుగారి యనువాదము. శ్రీవివేకానందులవారి సుప్రసిద్ధోపన్యాసముల నాంధ్రీకరించుటకుఁ బ్రయత్నించిన గ్రంథకర్తగారి యుద్యమము ప్రశంసనీయము.

4 Kerala Society Papers published by the Kerala Society, Trivendrum- Price Rs 2—0—0.

ఈ గ్రంథము కేరళదేశములోని చారిత్రకపరిశోధకసంఘము వారిచేఁ బ్రకటింపఁబనది. చరిత్రవిషయికపరిశోధన లభివృద్ధిఁ గాంచు నిక్కాలములో, గేరళదేశమునందు నెలకొల్పఁబడిన యీసంఘమువారి ప్రయత్నము బహుప్రశంసనీయము. ఇందుఁ బ్రథమవ్యాసమునఁ దిరువాన్కూరువర్మవంశజరాజుల చరిత్రమును 16, 17 శతాబ్దములయందు వారిరాజ్యపరిపాలనాక్రమమునుఁ జర్చింపఁబడినది. ఈవ్యాసమునందలి ముఖ్యాంశములు నూతనముగఁ గేరళసంఘమువారికి లభించిన పనునాటుపత్రములపై నాధారపడియున్నవి. ద్వితీయవ్యాసమునఁ గులశేఖరాళ్వారుల కాలనిర్ణయాదికములు విమర్శింపఁబడియున్నవి. డాక్టరు యస్. కృష్ణస్వామిఅయ్యంగారు నిర్ణయించిన ఆఱవశతాబ్దమే సరియయిన దని యిందు నిరూపింపఁబడినది. ఇంకను దృప్పరప్పుగుహాలయము మొదలగువ్యాసములు గలవు.

5 శ్రీబుగ్గరామేశ్వరమాహాత్మ్యము. 6. బ్రహ్మగుండేశ్వరమాహాత్మ్యము. ఈ రెండుమాహాత్మ్యములును దత్తమండలములలోఁ బేరువడిన శివక్షేత్రము లమహిమం దెలుపుచిన్నపొత్తములు. ౧౦౦౮ శివక్షేత్రములలో నీరెం

డుక్షేత్రములం జేరినవి. ఇవి కర్నూలుమండలమునందలి దేవస్థానముకమిటీ లోని సభ్యులగు బ్రా॥ శ్రీ పుల్లావంతుల రామచంద్రయ్యగారిచేఁ బ్రకటింపఁబడినవి. వెల 1 కి రు 0—2—0.

7. శ్రీద్వారకామాహాత్మ్యము:— గూర్జరదేశములోఁ బ్రసిద్ధమైన శ్రీద్వారకాక్షేత్రమహిమముం దెల్పు చిన్నపుస్తకము. ఇదియును పైరామచంద్రయ్యగారే ప్రకటించిరి. వెల రు 0—2—0.

కావలసినవారికి ప్రత్తికొండలో ఐంద్రావతి కార్యస్థానమున దొరకును.

8. శ్రీవిజయరాయచరిత్ర:—(చిప్పగిరిమాహాత్మ్యము) గుంతకల్లునకు మూఁడుమైళ్ళదూరములోనున్న చిప్పగిరిం గూర్చి వ్రాయఁబడినది.

9. శ్రీభాగన్నదాసులచరిత్ర:— 9-10- 11-12 పుస్తకములు బళ్లారిజిల్లా రిజిస్ట్రారుగారు మాధ్వశ్రీ ప్రొద్దుటూరు నరసింగరావుపంతులుగా రిచ్చినవి. శ్రీభాగన్నదాసులు శ్రీవిజయరాయదాసుల ముఖ్యశిష్యులు అ. ౨.

10. సముద్రరోదనము—11. శ్రీరామచంద్రస్తవము:—ఈ రెండును శ్రీయుత యలమర్తి శ్రీనివాసరావుగారిచే రచియింపఁబడినవి ఇందు సముద్రరోదనమును శ్రీ శ్రీనివాసరావుగారు రామేశ్వరయాత్రకుఁ జని సేతుస్నానము చేయుచుఁ దీరమునసుండి"హోరు" పెట్టుచున్న సముద్రునిగూర్చి చెప్పిన పద్యములు. 28 పుటలగ్రంథము ఒక్కమస్పుపద్యము.

ఉ ఆఁకలిఁగొన్నపాంథునకు నన్న మిడ౦ గతిలేమి కేక్వనా
వ్యాకుల మొదదప్పి గొనువారికి దోసెడు నీళ్ళొసంగఁగా
లేకుని కొంచి నీపెనుగళేబర మింకను వింకరదంచు నా
నాకరిపోక్తులాడెక జనమ్ముఁ నోళ్ళకు భీతి జెందనా (బుద్ధిచెప్పనాయనఁదగు)
ఉ ఏటికిఁ బెట్టెదయ్య జలధీ యిటు పెన్మొర..... ........ ...

శ్రీరామచంద్రస్తవములో, రామ్యపీరకృష్ణస్తవము, జననీస్తవము, గురుస్తవమునుగలవు భయనివారకహనుమదష్టకము గూడఁ జేర్పంబడినది ఇది 26 పుటల పద్యగ్రంథము. వెల- సముద్రరోదనము రు 0—3—0. రెండవది రు 0—2—0. రామచంద్రపురములోఁ గవిగారియొద్ద దొరకును

12. శ్రీబాలగోపాలశతకము:—పుసులూరి సోమరాజామాత్యకవిరచించినది. ౧౦౮ సీసములు. కాత్యాయనీగ్రంథమాలికలోని తృతీయపుష్ప

ము. ఆంధ్రసాహిత్యపరిషత్పుస్తకభాండాగారములోని తాళపత్రప్రతినుండి పైమాలికాసంపాదకులు దివాకర్ల వేంకటావధానిగారు, తంగిరాల జగన్నాథశాస్త్రిగారును లేఖకప్రమాదాదులు సవరించి ప్రకటించిరి భక్తిరసభరితమైనది- ఒక్కపద్యము మచ్చు.

సీ. హరిదాసులకుఁ గాని యానతిసేయదు శిర మనురాగవశీకరణము
పరమభాగవతప్రభావంబుచే కాని రుచిగొన వినదు నా శ్రుతియుగంబు
హరిహరి యనుసుధాసరసిలోనే కాని యవగాహనముసేయ దలరి జిహ్వ
శార్ఙ్గిపదాబ్జపంజరమందునే కాని ప్రేమ నిల్వదు మన్మనోమరాళ
మహహారుచికరమయ్యె నాయాత్మకిపుడు,త్వన్మహత్త్వంబువర్ణింపఁదరమె నాకు
బాలగోపాల కరుణాలవాల ! నీల, శైలపాలావనీపాల ! చారులీల !

తణుకులో కాత్యాయనీగ్రంథమాలాకార్యస్థానమున దొరకును వెల చందాదారులకు రు 0—6—0 ఇతరులకు రు 0—8—0.

**13.** మిత్రభేదము (పంచతంత్రకథాంతర్గతము) వచనకావ్యము. ఇది వఱకున్న మిత్రభేదములలోనేమి తక్కినపంచతంత్రములలోనేమి, కథలన్నియుఁ దెనిఁగింపఁబడలేదని తెలిసికొని శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు సంక్షేపరూపముగ వ్రాయం దొడఁగినదానిలో మొదటిభాగము. తొల్లిటిగ్రంథముల శైలికంటె లలితముగ బాలురకుఁగూడఁ జిన్నతరగతులలో నుపయోగింపవలయు ననునూహతో వ్రాయఁబడినది, కావున, బాలురకమితోపయోగిగా నుండును. మచ్చునకై కొన్నిమాటలు

“ఒకనాఁడు నక్కలన్నియు దూరముగ నుండి యఱచుచుండెను రాజునక్క తనజాతిస్వభావమున నూరకొనఁజాలక గట్టిగ నఱచెను. ఆయఱపు విని తక్కినజంతువు లన్నియు నిదియు నక్కయే తమ్ము వంచించిన దని గ్రహించి దానిని ముక్కముక్కలుగఁ దెగఁగొట్టికి చంపినవి కాఁబట్టి స్వజనులను విడువరాదు.” (పండ్రెండవకథలోనిది.)

సలక్షణమైనవచనము. విద్యార్థు లుపాధ్యాయులును గవిగారికిఁ బ్రోత్సాహము గలిగింతు రని నమ్ముచున్నాము. వెల తెల్పఁబడి యుండలేదు. విజయనగరములోఁ గవిగారియొద్ద దొరకఁగలదు.

**14.** ఛత్రసాలుఁడు. (మొదటిభాగము) పిఠాపురములోని ఆంధ్రప్రచారిణీగ్రంథమాల ౫౩ కుసుమము. అనువాదకులు, శ్రీ ప్రతివాదిభయంకర

రం రంగాచార్యులుగారును, కొంపెల్ల జనార్దనరావుగారును. మూలలేఖకులు శ్రీయుత బాలచంద్ నానాచంద్ షాహా వకీలుగారు. వెల రు ౧-౮-౦

15 ఉద్యానపత్త్రికా—ఇదియొక సంస్కృతమాసపత్త్రిక—తంజావూరుజిల్లాలోని తిరువాదిలోఁ బ్రకటింపఁబడుచున్నది. ద్వితీయసంపుటము మూఁడవసంచిక మాకార్యాలయమునకుఁ జేరినది శ్రీమాన్ డి. టి తాతాచార్య శిరోమణి యం ఓ. యల్. గారిచే నిర్వహింపంబడుచున్నది. ఈసంచికలో ఋగుద్ధారః, భారతవర్షస్యవృత్తవర్తమానస్థితిః, సుభాషితలహరీ, పాఠశోధనమ్, మీమాంసాకావ్యసమ్బన్ధః, పత్త్రికాప్రశస్తిః, యాదవాభ్యుదయటిప్పణీ—అను ౮ విషయములు గలవు సంవత్సరమూల్యము రు 1-0-0. అనుబంధసహితముగానైనచో రు 2-0-0. కన్యామాసము మొదలు దీనిసంవత్సరప్రారంభము. పైవిలాసము లింగ్లీషులో వ్రాసినఁ బడయఁగలరు.

16. మంజుభాషిణీ—ఇది కంజివరములో 29 సంవత్సరములనుండి శ్రీమాన్ ప్రతివాదిభయంకరము అనంతాచార్యులవారిచేఁ బ్రకటింపఁబడుచున్న వారపత్రిక. ఫూలిస్కేపు 4 పుటలు కలిగియుండును. ఇది వృత్తాంతపత్రిక. సరళరీతిని లోకవ్యవహారములు సంస్కృతభాషలో వ్రాయఁబడుచుండును. సంస్కృతవిద్యార్థుల కిది లోకజ్ఞానమును గలిగించుటలో ముఖ్యమైనదిగా నున్నది. మనము వాఁడుకొను నింగ్లీషుమాటలకుఁ దగిన సంస్కృత ముండును. చందా సంవత్సరమునకు రు 3—౦—౦ ఆఱుమాసములకు రు ౨—౦—౦ అర్ధసంవత్సరముకంటెఁ దక్కువగాఁ గోరువారికిఁ బంపఁబడదు.

17. రెడ్డిరాణి:— ఈమాసపత్రిక, రామచంద్రపురముతాలూకా రాయవరములో మ॥ మల్లిడి సత్తిరెడ్డిగారిచే రెడ్లజ్ఞానాభివృద్ధికై ప్రకటింపఁబడుచున్నది. ఆఱవసంపుటము ప్రారంభమైనది. ముఖపత్రము మార్పుచెందినది. చక్కనియక్షరములు, చిక్కనికాగితములు, మనోహరము లగువ్యాసములుం గలది. శ్రీమునగాలరాజావారు శ్రీ సి. వి. రెడ్డి, బి. ఎ. బి. ఎల్. గారు, వీరియొక్కచాయాపటములు ముద్దులు మూటఁగట్టుచున్నవి. పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారి "ఇంద్రవర్మశాసనము" చదలువాడ నాగభూషణముచౌదరిగారి "ఎవరు నిజమైనసంఘోద్ధారకులు" యేజెళ్ల శ్రీరాములుచౌదరిగారి "పాడిపశువులు-పాలగుణములు" మొదలగువ్యాసములొక్కరెడ్లకేకాదు సర్వజనులకుఁ బనికివచ్చునవి. చందా రు 3—౦—౦.

ఉ. పెంచినదాన నీవు కదఁ బెక్కువమాఱఁగ శాస్త్ర మభ్యసిం
పించినదాన నీవు గద పెంపుగ నుత్తమశీలరీతి శి
క్షించినదాన నీవ కద చెప్పఁగ నేమిఁక నీదె భార మి
క్కాంచనదేహఁ గాచికొనఁ గాంచినవారికి భార మున్నదే. ౨౦౮

గీ. ఈమధురవాచ నెంతేని యింపుమీఱ, వాసిగాఁగ సలక్షణం జేసి తీవ
గానవైదుషి సఫలత గైకొనంగ, మేలుఁ ఫలమునఁ గూర్పవే నీలవేణి. ౨౦౯

గీ. నీలవేణితటంబఁట నెలవుకొనఁగ, నీలవేణి ధరింపంగ నేర్పరి యఁట
నీలవేణి యిది తపంబు నెఱిఁ గొనునఁట, యేల ఫలసిద్ధి గాకుండు జోలియేల.

వ. అని యనియమితప్రేమానుబంధ ంబునుం డైలోకబాంధవుండు సర్వ
సఖీసమేత యగు నీలవేణీపర్వేందుముఖికి నప్పగించి ఛాయామిళితుం డగు
తనకుం బ్రణమిల్లిన శ్రీవల్లభుం బ్రాణవల్లభుఁగఁ గొను మని యుల్లంబు
పల్లవింప దీవించి గ్రుచ్చి యెత్తి గుత్తపుఁగౌఁగిటం జేర్చి కార్యభారంబు
త్వరపఱుప నత్తరళాక్షిఁ దరలం బంచిన. ౨౧౧

క. మగువ దివినుండి భూమికి, దిగిరా నవ్వేళ మేనుదీఁగియ చూడన్
గగనతలఘర్షణోపల, నిగనిగితస్వర్ణరేఖ నీటు వహించెన్. ౨౧౨

ఉ. వచ్చెను మచ్చెకంటి నెఱవాదిసఖీజను లంటిరాఁగ వై
యచ్చరవీధినుండి ధర కర్యమసూతి సరిత్పయోభరం
బిచ్చ నవాంబుదం బిది యహీనమహాసితరోచి యంచుఁ దా
మెచ్చుచు దాయవచ్చు జిగిమించు చొకాటపుమించుకైవడిన్. ౨౧౩

ఉ. వచ్చి గృహంబు సొచ్చి పితృవాక్యనివేదితకార్యసాధనా
కచ్చరమార్గరీతిఁ గొని కాంత రమాధిపుఁ గొల్చుచుండెఁ దా
నొచ్చెము లేనిభక్తి విమలోజ్జ్వలమానసపద్మసీమయం
దిచ్చ బహిఃపదార్థముల నెంతయు రోయ నజస్రభావనన్. ౨౧౪

క. అకలంకయోగిమానస, సుకరామితదివ్యరూప శోభితనిర్హే
తుకదయమానకటాక్షా, నికటచరత్త్రకుబధీశనిర్జరవారా. ౨౧౫

గద్యము- ఇది శ్రీరామచంద్రచరణారవిందమిళిందాంతఃకరణ పోలూరిమాధవ
యజ్వ సముజ్జ్వలత్కృపోత్క్షితకటాక్షాసాదితపాండిత్యాభరణ ప్రభంజనవం
శాబ్ధిరాకాశశాంక నిరంతరారాధితవిచక్షణశశాంక అభినవనన్నయభట్టార
కాహోబలపత్యాహ్వాయకవిమహోపాధ్యాయభట్టారకప్రణీతం బైనకాళిం
దీకన్యాపరిణయంబను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

ప్రథమభాగము సమాప్తము.

---

శ్రీరస్తు

# కాళిందీకన్యాపరిణయము.

## పీఠిక.

ఈ గ్రంథము రచించిన విద్వత్కవీంద్రుఁడు ప్రభంజనకులతిలకుఁ డగు నహోబలపతి. ఈ గ్రంథము నాశ్వాసాంతగద్యముల "ఇది... ప్రభంజనవంశాబ్ధి రాకాశశాంక...అహోబలపత్యాహ్వాయప్రణీతంబు" అని యున్నది. మఱియు నీకవి రచించిన అహోబలపండితీయ మను కవిశిరోభూషణగ్రంథమున గద్యమందు "ప్రభంజనవంశముక్తామణినా.....అహోబలపత్యాచార్యేణ" అని యున్నది. దీనింబట్టి యింటిపేరు ప్రభంజనమువా రనియుఁ గవిపేరు అహోబలపతి యనియుఁ దేలుచున్నది. కాని, మహారాజశ్రీ జయంతి రామయ్యపంతులుగారు ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక ౧౯ వ సంపుటము ౨ వ సంచికలోఁ బ్రకటించిన అహోబలపండితీయపీఠికాశ్లోకములు ౭౯ లో "వాతూలవంశేవతతార భూయః" అని యు, ౭౮ లో "వాతూలవంశాగ్రణీః" అనియు నుండుటచే నీకవి యింటిపేరు "గాలివా" రని స్పష్టపడుచున్నది. ఈ విషయమై శ్రీ రామయ్య పంతులుగారు కూడ "ఇంటిపేరు గాలివారు" అనియు "కవికి మొదటిపేరు నరసరాజు" అనియు వ్రాసిరి. గ్రంథములందు, అహోబలపతి యనియే యున్నది గాని నృసింహనరసింహాదిపర్యాయపదములు కానరావు. నృసింహస్వామి యహోబలక్షేత్రాధిపతి కావున వా రట్లూహించుట సమంజసము. ఇంతియకాక ఈకవికుటుంబమువారు గుంటూరుమండలమున వినుకొండతాలూకాలోని ముమ్మడివరగ్రామమం దున్నా రని కూడ వ్రాసియున్నారు. కావున వ్యవహారమం దట్లు గాలి నరసరా జని యుండవచ్చును. ఈపుస్తకము నకుఁ గవివంశస్థులలో నొకరు ప్రతి వ్రాసినారు. చివర "స్వస్తి శ్రీవిజయాభ్యుదయశాలివాహనశకవర్షంబులు ౧౮౨౨ అగు నేటి శార్వరినామసంవత్సర ఆషాఢ బ ౨ భృగువారం వఱకు ప్రభంజనం వెంకటసుబ్బయ్యశాస్త్రిగారి కుమారుఁడు లక్ష్మీనారాయణ వ్రాసుకున్న కాళిందీకన్యాపరిణయము" అని వ్రాసినారు. వినుకొండతాలూకా కొమ్మాలపాడుపోస్టు పిట్టబండ గ్రామమునుండి కాళిందీకన్యాపరిణయమును గూర్చి గాలి లక్ష్మీనారాయణగారు పరిషత్తున కుత్తరములు వ్రాసిరి.

కవిబంధువులు, గురువు:—

ఇంక నీవిద్వత్కవి తలిదండ్రులను గుఱించి కాని గోత్రమును గుఱించి కాని తెలిసికొనుటకు రెండు గ్రంథములందును నాధారములు లేవు, కాని, మనకవి పోలూరి మాధవయజ్వకు మేనల్లుఁడును శిష్యుఁడు నై యున్న ట్లీక్రిందిశ్లోకములవలనఁ దెలియుచున్నది.

మన్మాతుర్భ్రాతరం తం సకలగుణనిధిం మాధవం భావయామః-పీఠి శ్లో. ౯౯
ప్రణౌమి సతతం మమ మాతులం తమ్ —శ్లో. ౯౨
ధ్యాయామి మన్మాతులమ్.
పైమాధవయజ్వయే గురువై నట్లు-
మద్గురు మాధవు నభినుతింతు, కాళిం. ౧-౩౦
మద్గురుం దలఁతు మాన్యుని మాధవయజ్వచంద్రముఁ-కాళిం. ౧-౩౧
మోహాంధకార హృదంబుజాంతరములో ముష్మాటికిం గొల్చెదన్
... ... సకలశాస్త్రజ్ఞుఁ గురు న్మాధవుఁ-కాళిం. ౧ ౩౩
తం పోలురీవంశపయోధిచంద్రం వందామహే మాధవవిద్వదింద్రమ్ ౪౨
వందేహం త మనింద్యసద్గుణగణాధారం గురుం మాధవమ్- ౪౯
శ్రీమత్పోలూరిమాధవార్యకరుణాప్రాప్తాష్టభాషాస్ఫురత్సాగః- ౭౯
అనువానివలనఁ దెలియుచున్నది

ఈకవికి మేనమామయు గురుఁడు నగు మాధవయజ్వ సకలశాస్త్రపాండిత్యము కలవాఁడును, అష్టభాషాపాండిత్యము కలవాఁడు నని యీక్రింది (కా. ౧-౩౦) వాక్యములవలనఁ దెలియఁగను.

గీ. ఏమహాత్ముని దర్శింప నెసఁగు నకు, పాదకణచరజైమినివ్యాసమౌని
కపిలఫణిరాజదర్శనఘటితమోద, మతని మద్గురు మాధవు నభినుతింతు

సీ. తర్కపాతంజలకర్కశప్రస్తరమండలంబున జర్జుబండ లాడి
గురుభట్టవాగ్గుంభగురుతరవనములో నింబుమీఱఁగ విహారంబు చేసె
యతులసాహిత్యవిద్యాచారుదీర్ఘిక లాలితప్రీతిచే నోలలాడి
కపిలసాత్వతేయఘనతంత్రవాక్సుధాధారలఁ గోంక లూరఁ గ్రోలి
చెలఁగుయద్రసనాభామయలఁతమౌని, యతని శ్రీరామచంద్రపాదాంబుజాళి
సుజనతల్లజసన్నుతసుగుణపాళి, నభినుతించెద మాధవయజ్వమౌళి ౧-౩౨

ఈభావమే పీఠికాశ్లోకములు ౪౦-౪౮ లలోనున్నది. మఱియు నీమా

ధవయజ్వ గొప్పపండితుఁడును దనపుత్త్రుఁడు నైనదక్షిణామూర్తికంటెఁ దనయం దెక్కువదయ కలవాఁడని పీఠిక ౯,౧౧ శ్లోకములలో నీకవి చెప్పుకొనినాఁడు.

ఈకవిరచించిన గ్రంథములు:—కాళిందీకన్యాపరిణయము, అహోబల పండితీయమను పేరుగల కవిశిరోభూషణము నీరెండే కనఁబడుచున్నవి. ఇతర గ్రంథములు ముందేవైన బైలువడునేమో. పైగ్రంథములలోఁ గాళిందీకన్యా పరిణయమునఁ ౧-౭ లో బ్రహ్మస్తవమును, కవిశిరోభూషణములో సరస్వతీ(వకులీ) స్తవమును "సంగీత మపి సాహిత్యం సరస్వత్యాః కుచద్వయం" అను శ్లోకము నను సరించి యొకభావముతో నున్నవి.

కవిపాండిత్యము:—ఈకవి తనపాండిత్యమునుగూర్చి కవిశిరోభూషణము లో నిట్లు చెప్పుకొనియెను.

శ్లో. యస్మార్త్యా కవితాకందమూలవాగనుశాసనా
జాగృతోఽహోబలపతీ రాజతే స విచక్షణః. ౭౮

శ్రీమత్పోలూరిమాధవార్యకరుణాప్రాప్తాష్టభాషాస్ఫురత్సారః శాస్త్రవిత్ - అని. మఱియుఁ గవిశిరోభూషణగ్రంథాంతమున "పోలూరి మాధవయజ్వన ముజ్జ్వలత్కృపాకటాక్షాసాదితపాండిత్యాభరణేన......అభినవనన్నయభట్టాచా ర్యేణాహోబలపత్యాచార్యేణ" అనియుఁ గాళిందీకన్యాపరిణయాశ్వాసాంత గద్యముల "పోలూరిమాధవయజ్వసముజ్జ్వలత్కృపాకటాక్షాసాదితపాండిత్యా భరణ......అభినవనన్నయభట్టారకాహోబలపత్యాహ్వయ కవిమహోపాధ్యా యభట్టారక" అనియుఁ గలదు. దీనిచే నీకవి కభినవనన్నయభట్టనియుఁ, గవి మహోపాధ్యాయభట్టారకుఁ డనియు బిరుదు లున్నట్లును, అనేకశాస్త్రము లందుఁ బాండిత్య మున్నట్లును, అష్టభాషాపాండిత్య మున్నట్లును స్పష్టమగుచు న్నది. అభినవనన్నయభట్టబిరుద మీరెండుగ్రంథములలో నుండుటచే గ్రంథ రచనకుఁ బూర్వమే యీబిరుద మీతనికి వచ్చినట్లును, ఆబిరుదమే తనరెండు గ్రంథములందును వ్రాసికొనినట్లును, దోఁచును, లేదా, కవిశిరోభూషణగ్రంథా రంభమం దైన వచ్చియుండును.

కవికాలము:—ఈకవికాల మెచ్చటను స్పష్టముగాఁ జెప్పఁబడియుండ లేదు. కాని, కవిశిరోభూషణమునందు "గ్రంథో ప్యప్పకవే ర్మదం దిశతు నో విద్వత్తపీనాం ఘనాం"—శ్లో. ౭౨ "కాకునూ ర్యప్పకవినా గృహీతం— శ్లోకము ౭౧ అని పీఠికయందున్న గ్రంథమం దక్కడక్కడను, అప్పకవి నుదా

హరించుటం జేసి మనకవి యప్పకవికిఁ దరువాతివాఁ డగును 1578 శకసంవత్సరమున అప్పకవీయము ప్రారంభింపఁబడిన ట్లుండుటచేత నతఁడు క్రీ. శ 1657 సం॥ కుఁదర్వాతివాఁ డనక తీఱదు.

కవిత్వము:— ఈవిద్వత్కవి కవిత్వము మంచి ధారతోను సర్వతోముఖ పాండిత్యముతోను జనువరులకానందముం గల్గించుచున్నది.

కృతిపతి:— ఈకవి తనగ్రంథములను మనుష్యులకుఁ గృతి యీయక శ్రీరామచంద్రునకుఁ గృతియిచ్చెను. దీనివలన నీకవి శ్రీరామునందు మిగులభక్తిగలవాఁ డని స్పష్ట మగుచున్నది.

కవిత్వములోనివిశేషములు:— ఈతనికవిత్వములోని విశేషము లీతని కత్యధిక మగుసంస్కృతాంధ్రభాషా పాండిత్యము కల దని చాటుచున్నవి. ఇంతే కాదు. సంస్కృతాంధ్ర వ్యాకరణములందుఁ గూడ, గొప్ప ప్రజ్ఞ కల దనియు, వేదమునందుఁ దర్కమీమాంసాదిశాస్త్రములందు విశేషపాండిత్యమున్న దనియుఁ గూడఁ జెప్పుచున్నవి. మఱియు నిందలిప్రథమాశ్వాసములోని ౧౭౬ వ గద్యములో శ్రీకృష్ణరూపవర్ణన మీతని కలంకారశాస్త్రంబున నసమానపాండిత్యము కల దని నుడువుచున్నది.

ఇతరానుకరణములు:— కవి సంస్కృతాంధ్రభాషలయందుఁ బాండిత్యము కలవాఁ డగుటచే నక్కడక్కడ సంస్కృతశ్లోకభావములను నితరాంధ్రమహాకవుల భావములను గొంచెము మార్పులతోఁ దనగ్రంథమందుఁ జొన్పినాఁడు, చూడుఁడు.

శ్లో. కన్యా వరయతే రూపం మాతా విత్తం పితా శ్రుతమ్
బాంధవాః కుల మిచ్ఛన్తి మృష్టాన్న మితరేజనాః- అనుదానికి-
ఉ. తల్లి ధనమ్ము నశ్రుతిని దండ్రియు బంధులు సత్కులీనుఁగా
నెల్లరు నోదనప్రదుని నెన్నఁగఁ గన్నియ రూపవంతుఁగా
నెల్లెడఁ గోరు నిన్నియును నేర్పడఁ గల్గినకృష్ణుఁ గూర్పలేరు... ౨ ౮౦
శ్లో. పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే
పుత్రో రక్షతి వార్ధక్యే న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి-అనుదానికి
గీ. బాల్యమున మాతృపితరులుఁ బ్రాయమునను
మగఁడు ముదిమిని దనయుండు మగువ కరయ
నధిపు లగుదురు తదధీన లగుటఁ గాన
మానవతులకుఁ దమయిచ్చ మెలయఁ జనదు. ౨-౯౬

"కస్తూరితిలకం లలాటఫలకే" అను సుప్రసిద్ధశ్లోకమునకుఁ జక్కని తెనుఁగు-

సీ. మృదులఫాలమునందు మృగమదంబు ధరించి యొమ్మునఁజాఱరత్నమ్ముఁబూని
నాసికాగ్రమునందు నవ్యమౌక్తిక మూని కరముల రత్నకంకణము లూని
కరతలంబున వేణుకాండంబు ధరియించి నెమ్మేన హరిచందనమ్ముఁ దాల్చి
కంఠదేశమున ముక్తాస్రజంబులు గూర్చి రాణించు పీతాంబరంబు గట్టి
కొంతతడవు సుఖింపదు గోపలాంగి, యాత్మనాయకకమలాసహాయవేష
సముచితాలంక్రియావస్తుసమితిఁ గొనుచు... ౨ ౯౬

మహాకవులపోకడలు, పోలికలు:—

సీ. నవనవసృష్టివైభవహేమగర్భమై సత్యలోకంబులో సరసను డు
నార్యాంగనామనోహరనీలకంఠమై కైలాసనగరిశైఖరి వహించు
సంతతశ్రీనివాసస్ఫూర్త్యుదారమై వైకుంఠపురముతో వన్నెకెక్కు-
సురుచిరాలంకారసుమనోనివాసమై సురరాజనిలయంబుసొంపుఁ గాంచు
సరససౌభాగ్యవిభవభాస్వద్విభూతు, లన్నియునుగూడి వర్ధిల్ల నమరి యుండు
సతతసేవాగతాష్టదిక్స్వామిపాలి, కాపురంబైన యలద్వారకాపురంబు.

కుమారధూర్జటి, ఇందుమతీపరిణయములోని ౧-౧౪౧

సీ...గీ. జగతి వైకుంఠకైలాససత్యలోక, దిగ్వరపురాధిరాజమందిరనిభప్ర
భావభాసితమగుచు సంపదలఁబొదలు, నఖిలవిద్యాకరంబయోధ్యాపురంబు.

సీ. కేళీరతకుమారికాళీకృతవిలాసపాళీరుచిరకుంజభాసురములు
సంగీకృతస్వానసంగీతమత్తసారంగీయుతసరోవిరాజితములు
నానామణిప్రభానూనాభ్రమణిపదాధీనామితాద్రిసమ్మానితములు
గంగానదీకీర్తిభంగానుగతమహాభంగాపగావళీసంగతములు
సురుచిరామరభూరుహసుమవిరచిత, గర్భితవిరాగసురసతీకరపయోజ
లగ్నశాఖమహీరుహాగ్రగసుమములు, రివిఁ జెలువొందునచటి లీలావనములు.

కాళ-౧-౧౦౦

సీ. లలనాజనాపాంగవలనావసదనంగతులనాభికాభంగదోఃప్రసంగ
మలసానిలవిలోలదళసానవరసాలఫలసాదరశుకాలపనవిశాల
మలినీగరుదనీకమలినీకృతధునీకమలినీసుఖితకోకకులవధూక
మతికాంతసలతాంతలతికాంతరనితాంతరతికాంతరణతాంతసుతనుకాంత
మకృతకామోదకురవకావికలవకుల, ముకులసకలవనాంతప్రమోదచలిత

కలితకలకంఠకులకంఠకాకలీవి, భాసురము వొల్చు మధుమాసవాసరంబు.
వసుచరిత్రము ౧-౧౩౬

ఇటువంటివిచాలఁగలవు.

ఇందున్న వేదసంప్రదాయము:—

(1) మోహాంధకార హృదంబుజాంతరములో......
"సాహి శ్రీరమృతాసతా" మితివచస్సంపాదితశ్రీయుతుర్... ౧ ౩౨

(2) సీ...శ్రౌతవాక్యున నహః కేతుమఖ్య, భేదకముల నుపపదించు సూర్యునిఁ
జంద్రమః కద మని చదువు లేదె. ౩ ౯౭

వేదాంతసంప్రదాయము :— ౩- ౨౧

సీ నే ననిర్వచనీయనిజరూప మగు చనాదిత మెలంగుచుఁ దత్త్వధీ నడఁచి
వెలయు నవిద్యమై మెలఁగెద మచ్ఛబలతఁ గాంచియే యాత్మ బ్రహ్మమయ్యె
నటుగాన నాయందు నమరు కారణలక్షణం బతివ్యాప్తి దుష్టంబు గాదు
బ్రహ్మవిద్య యటండ్రు బలవత్ప్రమాణంబు మఱి గుహాశయత బ్రహ్మంబు నేన
యఖిలమును నాదురూపంబున ననుసరించి, విలుచునో లేదొ చూడుఁడీనిఖిలజనము
లనెడి వైఖరి రోదసులాక్రమించి, యంధతమసంబువరఁగెభయంబు వెరుఁగ.

పరతత్త్వసాధనము:— ౧- ౨౭౯

సీ. తత్స్వరూపావాప్తి దనరు జ్ఞానంబున జ్ఞానంబు భక్తిచే సంభవించు
వేదాంతవిద్యచే వెలయును సద్భక్తి యవ్విద్య గురుసేవ నందవలయు
సద్గురుసేవ నిష్కామత్వమున నబ్బు నది చిత్తశుద్ధిచే నమరు నద్ది
కాలుష్య మణఁగినఁ గలుగుఁ దద్రాహిత్య మలవడుఁ బాపక్షయంబుగాఁగ
నట్టిపాపక్షయంబు మేలానవచ్చు, దాన యాగాది సత్క్రియ లూనఁగలుగు
నవియుఁ దన్నాశకరశక్తిఁ దవులుటరిది, కర్త నిష్కామమూనసుఁ గాంచకున్న.

వ్యాకరణసంప్రదాయములు:—

1. అందుసంస్కృతవ్యాకరణము.

ఉ. వాచకశబ్దము ల్పరనిపాతముచే విలసిల్లు వాచ్యతల్
రోచిలుమాకుఁ దాదృశత రుచ్యముగా కితరార్థరీతిగా
నాచితిగా దటంచు మదినారసియో పరపాతనక్రియ
ల్చోచి వసించు నప్పురి నమోఘుబలాన్వితము ల్కరీంద్రముల్. ౧-౧-౨౩

శా. ఊకారంబు సవర్ణదీర్ఘయుగళీ యుక్తంబు గావింపుచున్
జోకన్ హ్రస్వముఖస్వరాంకములఁ దా సూత్రంబున న్మాటిఁగా

వ్యాకర్త్రాముని మద్వచస్సరణి నుత్వాం బచ్చట స్థానమం
చూకారాకృతి త్రిప్రకారముగ మ్రోయుం గాలవిద్యాంసముల్. 3-౧3౨

2. ప్రాకృతవ్యాకరణము:—

సీ................

సిద్ధసాధ్యవిశేషబుద్ధస్వరూపతఁ బ్రాకృతవ్యాకృత (ఫక్కియనఁగ)౧-౨౫౦

గీ. ప్రకృతి ననుసరించి పరఁగును జగతిలో, వికృతి యిద్ది వింత వెలఁదియందుఁ
బ్రకృతి నడచి వికృతి ప్రబలమై కనుపట్టె, నఖిలగుణసనాథ యబ్జనాథ.
3 ౧౬౨

3 తెలుఁగు వ్యాకరణము,

సీ. ... ... ... ...

సరళస్థిరకళాప్రశస్తిసద్భావత సరసాంధ్రశబ్దశాసనమనంగ... ౧-౨౫౦

క. గుణవృద్ధు లగుచు రాజిలు, ఫణిరాజశయానుబాములు పరికించును గా
గణిగణము వక్రమే యిది, గణుతింపఁగ వక్రతమమె కా యిది యనుచున్.
౧-3౧౪

ఛందశ్శాస్త్రసంప్రదాయములు:— ౧-౧౦౧

సీ. మత్తమయూరసన్మత్తకోకిలహంసపదభృంగవిలసితభ్రాజితంబు
హరిణీగణోత్సాహకురరీరుతస్ఫీత ముత్పలమాలికాయోజితంబు
బంధురజాతిచంపకమాలికోపేత మురుమణిగణనికరోర్జితంబు
జలధరమాలికాచారుమత్తేభవిక్రీడితరభససంకీలితంబు
మంజులసుగంధిమాలినీరంజితంబు, ననమశార్దూలవిక్రీడితాంచితంబు
లలితసుమగుచ్ఛపరిమళరాజితంబు, సుకవికవనంబు నాఁబురిసొబగుఁగాంచు.

క. అమరెడుకీల్జడ స్రగ్ధర, కొమరుమిగులుపిఱుఁదు దలఁప గొనబగు విపులే
కమనీయతనువు చపలే, రమణీమణి యాకార వృత్తరత్నాకరమే ౧-౨౧౯

ఉ. భవ్యతరంబుగా భరణభారవలాంఛితవృత్తియుక్తమై
నవ్యపయోజజాతయమనం బయి యుత్పలమాలికాకృతి
స్తవ్యము గాంచి రాజిలును దైత్యవిరోధిశుభేక్షణాలి త
ద్దివ్యదుదారవైఖరులు తెల్పఁగ నా కగునే విభాకరా. ౧-3౦౯

జ్యోతిశ్శాస్త్రము:—

చ. కవిబుధచంద్రలోకహితకారకమంగళజీవకేతువై
భవతరిపూత్కరంబు గెడపం గదుఁ గూడిన ''కాలసర్పయో

గవిధిఁ" బ్రకాశ మందెడి సప్తాండలసద్భుజదండ కాండమై
భవముల నొప్పు మాధవునిఁ బ్రస్తుతిసేయఁ దరంబె భాస్కరా. ౧-౨౯౮
క. కరము సుఖం బొనరు బుధ, స్ఫురణంబున జగతి నీకుఁ బొడమిన బుధని
స్ఫురణంబు జగదుపద్రవ,కరణం బని యెన్నవయ్యెఁగా భువిఁ జంద్రా 3-౮౨
తర్క శాస్త్రము, ఇతర శాస్త్రములును:—
సీ మానాదిషోడశమహితపదార్థశోధనవృత్తి గల దను మునివరేణ్యు
సామాన్యముఖములౌ షట్పదార్థంబులు దెలియంగ నది యని పలుకు వాని
గర్మవిజ్ఞానము ల్గలిగించు రెండును నిశ్శ్రేయసం బను నేర్పులాని
గర్మంబు జ్ఞానాంగగతి దాల్చు జ్ఞానంబు తారకంబనియెడు తాపసేంద్రుఁ
బ్రకృతిమహదాదితత్త్వసంపద్వివేక
మమర నిర్వాణ మని తెల్పినట్టివానిఁ
జిత్తసంశుద్ధి యుల(రారఁ జేయు)వాక్య
పటిమయలవడహృద్వీథిఁ బ్రస్తుతింతు. ౧-౧౮
సీ. తర్కపాతఁ జలకర్కశప్రస్తరమండలంబున జిక్కుబడలాడి... ౧-౩౧
సీ. గౌతమముని భావకలనచే నొకవేళ నొకతఱికణచరానూనమహిమ
సురగేంద్రవృత్తిచే నొకమాటు నొకతేపఁ గపిలవాదంయమోత్కటవిభూతి
వ్యాసవిజ్ఞానసంపత్తిచే నొకపరి నొకతూరి జైమినిప్రకటవృత్తి
వల్మీకసంభవవ్యాహృతి నొకయెడ నొకసారె భరతవాగ్వ్యక్తిమహిమఁ
బ్రొద్దుపుచ్చును యువజనమోద మమర, మేటియుప్పరిగె మెడలమేలుకత్తె
పంజరంబుల నెలకొని ప్రతియెలుఁగక, గణనమించిన శుకశారికాగణములు.
౧-౬౪

కావ్యము, కావ్యలక్షణము:—
క నవరసభరరుచితోషిత, కవిరాజము సుప్రసాదఘటితము నగుచున్
ధవళాక్షి సమ్మతం బగు,కవిసత్కృతిఁ బోలు కేళికావన మొందెన్. ౨-౧౪౦
సీ క్లిష్టకల్పన లేక కష్టతాదూరమై యసమర్థత నెఱుంగ కప్రతీత
తనుమాని యప్రయుక్తతను రోసి పతత్ప్రకర్ష నైరర్థ్యకఘటన గనక
దృఢపదబంధసంధిస్థితమై సుప్రసాదకాంత్యోజ్జ్వల్యసమత లలర
వస్త్వలంకృత్యభివ్యక్తులు పొసఁగంగఁ జిత్రవిన్యాసంబు చెలువు గనఁగ
నతులకవిరాజరచితకావ్యము లనంగఁ
జెన్నుదైవాటి చూడ్కి కచ్చెరువు మీఱఁ

బుష్యరథము లసంఖ్యము లొప్పెలుపుమిగులఁ
బురవతంసంబు ద్వారకాపురములోన. ౧-౧౨౫

నాటకము:—

సీ. రమణీయనాయకరత్నబంధురంబు నవవిధవస్తువైభవయుతంబు
శ్రీకరాంకాంచత్పతాకాభిరామంబు సురుమంగళార్థపదోజ్జ్వలంబు
దివ్యప్రపంచసంధిప్రౌఢిలసితంబు సీహామృగభిదావగాహితంబు
గగనావలంబివాక్యస్ఫూర్తిమహితంబు మధురవాక్యవిజాలమానితంబు
చిత్రసదలంక్రియాగణోజ్జీవితంబు, నద్భుతరసాఢ్యపాత్రంబు నాత్తదోష
పాటనంబును నగు చొప్పి నాటకంబు
క్రియఁ బ్రకాశించు నొకదివ్యగృహ మొనర్చి. ౩-౧౯౩

మఱియు సీతనికవిత్వము నందు సంస్కృతాంధ్రపదములు సమముగ నుండి మిగులఁ గర్ణరంజకములుగా నుండును.

సంస్కృతపదములకు:—

చ. పలికి గళన్మరందరసబంధురగంధరసాంధబంభరా
కలితరవంబులం బ్రసవకమ్రవినమ్రరసాప్రతామ్రకో
మలనవపల్లవగ్రసన మంజుకషాయితకంఠకాకలీ
కలకలకంఠనాదములఁ గల్గి తటాలున నుల్గి యుల్గియున్. ౨-౨౩౬

కేవలసంస్కృతశ్లోకము:—

శా. నేత్రమ్మీలన మశ్రుచైత్యవిరతం నిష్కంపతాం స్విన్నతాం
గాత్రం యాతిచ హృష్టరోమచయతాం కంపైకసంపన్నతామ్
పాత్రం దుశ్ఛవిసంగతే ర్భవతి సద్వక్త్రం చ తైశ్వర్యభా
జైత్రాత్మప్రభవామణే స్సుమజని ర్గ్రీవా హృయోగక్రమాత్. ౨-౫౬

అచ్చతెనుఁగు:—

క. దుగదచ్చి లెక్క కిక్కగు
మొగములరాకాసిజేనిముద్దుంజెలిమే
ల్మిగనిగలు మిగులు మొగమున
సొగసులనగువగలునిల్వ సొగయనిదొరకున్. ౧-౮౮

సీ. ప్రామిన్నుగమితమ్మిపట్టు పట్టగునంచ యంచ తేజీజేనిఁ గాంచువేల్పు
వేల్పురాతాచాయ వెలయుచక్కనితండ్రి తండ్రినెఱుంగకతనరుప్రోడ

ప్రోడచేయువకాండ్రఁ బ్రోచుమీఁదటిగిడ్డి గిడ్డియుండలనుండ దొడ్డజంత
జంతరక్కసికానదొంతు లేర్చుడుచిచ్చు చిచ్చుకన్గలవాని నచ్చుజోడు
జోడుకన్నుల సెకఁ జల్వఁ జూపుమేటి, మేటిసుడివాలుదాల్చిన మేలుబంతి
బంతివలె వ్రేల బలుకొండఁ బట్టిదిట్ట, దిట్టముగ నేలు నవ్వేడు తెలివిమీఱ
౧-౮౧

ఉ. తావులమోకమూవిగమి తావుల గొజ్జఁగనీరుయంత్రముల్
ద్రేవలఁ జిల్కఁగాఁ జిగురుఁగేదఁగి పూదడిగట్టి వట్టివేర్
పైవఱలారు చెంగలువపందిరి చెందొవరేకనంటి క్రొ
మ్మావులచందువా పొగడమొగ్గలఁగ్గల పప్పరంబులోఁ ౨ ౨౩౮

ఇందు యంత్రముల్ అనచోట జంత్రముల్ అనఁదగును.

శ్లేషకవిత్వము.

గీ. అగు మహాపద్మపద్మశంఖాదినిధులు
కొలఁకు లిరవొంద నీలముకుందనిధులు
సౌధములు గుదనిధులను జారువనులు
వరనిధి యనంగఁ బురమంత వఱలుచుండు ౧ ౮౨

సీ. గుణవృద్ధిపదవృద్ధగోత్రవిఖ్యాతమై పాణినిగ్రంథంబుపటిమ గాంచి
నానాత్మజీవవిజ్ఞానకారణ మాను నక్షపాదీయంబు ననుకరించి
కర్మజన్యాపూర్వధర్మప్రకాశమై జైమినివ్యాహృతిచ్ఛాయఁ బూని
సద్వీక్షణాక్షీణసమ్మోదహేతువై వ్యాసవాచార్భటి వన్నెకెక్కి
కవిత నవరసఫలకమై ఘటితమత్త, శిఖిఘనధ్వ్రతవిలసితస్ఫీత మగుచు
వసమకవిరాజకావ్యంబు ననుకరించి, చూడనింపొందు నచటియాక్రీడవనులు
౧-౯౭

చ. సరసులపొంత హంసగణసంగతి సేయుచుఁ బద్మగహ్వరాం
తరముల నుంచుచుం దనుపు దాళుట్టకై భువిలో నదర్శన
స్ఫురణగఁ బువ్వునీరు పలుచోటుల భిక్షుయొనర్చు నీకు ని
వ్వాకహులమీఁద నెట్లొదవె బెట్టుగఁ గ్రోధరసంబు భృంగమా ౩ ౧౨౭

సీ. జారసంకల్పంబు దూలింపఁగాఁ జేసి చోరుల మూలకుఁ జేరఁగఁ జేసి
సన్మార్గమెల్లను సత్ప్రకాశము చేసి పంకజావళిఁ బటాపంచ చేసి
యరిజాలములనెల్ల నండవాయఁగఁ జేసి యాశ్రితద్విజరాజి నలరఁ జేసి

పరతమోగ్రాంధుల గిరిగుహల్ సొరఁజేసి ధర్మసంస్థాపన దవరఁజేసి
ఖరకరుఁడు మున్ను చేసిన కాకఁ బాసి, యలరి సర్వజ్ఞ మెల్లను మెలఁగఁజేసి
కువలయానంద మొనరించెఁ గూర్మిఁజేసి, యౌర చల్లనిరాజు దివ్యత్ప్రకాశి.

యమకమునకు:—౧- ౧౧౩ ౩-౫౮

సీ. నగరాజు నైనఁ బన్నగరాజు నైనను ధైర్యవాక్పటిమలఁ దఱుమఁగలరు
రుద్రుని నైన సముద్రుని నైనను శౌర్యగాంభీర్యాప్తి జయపఁగలరు
ఇంద్రుతో నైన నుపేంద్రుతో నైనను భోగభాగ్యస్ఫూర్తిఁ బోరఁగలరు
అజునితో నైనఁ జిత్తజునితో నైనను నిర్మాణరూపము ల్నెఱపఁగలరు
ఘనులు సర్వక్రవిక్రమక్రమమదారి, చక్రదళచక్రియావక్రజయపరాక్ర
మక్రియాముద్రనిర్నిద్రమద్రయశులు, శూద్రు లప్పురిఁ గలరు విశుద్ధమతులు.

క. మృదుపదమై మాధుర్యాస్పదమై చెలిజంఘ రసము చాలఁగఁ జిలుకున్
మృదుపదమై మాధుర్యాస్పదమై యలరారు రచనవధువు దలిర్పన్.

అనుప్రాసము:—౧- ౯. ౧- ౧౭౨

సీ వెలిమబ్బు బలునుబ్బు వడిగొబ్బు రుచి నబ్బురంబొసంగెడు వసనంబుతోడఁ
దెలిచెట్టు వలిగట్టు వెలిపట్టు వెలివెట్టు మేలిచాయలతోడి మేనితోడ
బలుమేనితోవజేనిచెలువేఁ దెగఁ బూనినగఁబూను చిఱునవ్వుమొగముతోడ
నునువంకగల పొంకమునఁ గొంక కకలంకకాంతు లీనెడు పువ్వుఁగబరితోడ
వీడని యపారకారుణ్యవృష్టితోడ, సింపుగ వసింపు సౌహృదయంపుమేడఁ
దొంటిచదువులగమిఁగావి యుంటిగరిత, గరితరతనంబ నాయంబ గురునితంబ.

లోకోక్తులు స్థానాంతరన్యాసములు:—

అభ్యాగతః స్వయం విష్ణుః
లుబ్ధులకు సౌఖ్యం బబ్బునే స్వమ్మతిన్. ౪-౯౨
జడమతులైన వారలకుఁ జక్కఁగఁ జిక్కునె సద్విచారముల్. ౧-౧౭౦
ఉచితస్థితిఁగాంచ జడుండు నేర్చునే. ౪-౧౦౭
పూబోఁడు లధికసాహసులు గారె. ౨ ౧౪౭
జడునకు విజ్ఞాన మబ్బునెట్లు. ౩-౧౦౫
విధాతృఁడు విధించిన కార్యము రిత్తవోవునే. ౩-౧౧౫
తొలఁగ దెచట బాధ రాగదోషత గొన్నన్. ౧-౩౦౭

వర్ణనలు:—అక్కడక్కడఁ గావ్యములలో నుండఁదగిన యష్టాదశవర్ణనములును జూపెను.

కథాంశము:—శ్రీకృష్ణుఁడు కాళిందీకన్యను వివాహము చేసికొనిన చరిత్రము

కవి తా నాంధ్రవ్యాకరణమునకుఁ గొప్పవ్యాఖ్యానము చేసియుఁ గవిత్రయప్రయోగములకు మించిన దారులు కొన్ని ద్రొక్కినాఁడు. వానిలోని గొన్నిటినిఁ దనవ్యాఖ్యానమున సమర్థించెను. అందు విసంధికిఁ గొన్నియుదాహరణములు:— 3-౭ లో, నీవు-అరసి; ౧ ౨౨౫ లో, మంజుపదము-అలభుజంగప్రయాతము; ౧-౧౧౬ లో, పోరగలరు-అజునితోనైన, ౧ ౧౮౭ లో, గుబ్బల్-అప్రకృత; ఇట్టివిమటికొన్ని గలవు. ఈవిషయమై తాను దనకావ్యమందు

౧-౯౮ లో "అసిద్ధోపమత విసంధితయు గణతఁ బరఁగె నరిదిగణ.

౧-౧౮౮ లో "మానదువో విసంధితణ-" అనియుఁ జమ్ముత్తరించినాఁడు.

అహోబలపండితీయము 187 పుటలో ''సంధ్యభావోపి నదోషాయ'' "సంధి లేకుండుటయుఁ దప్పు గాదు" అని సమర్థించెను. ఆప్రకరణముం బట్టి చూడ నీవిసంధి వాక్యాంతపాదాంతంబులందు దోషము కా దని భావ మయినట్లు తోఁచుచున్నది

తత్సమాచ్చులకు సంధి:—

౧-౧౭3 సరసతెకకల, ౨-౨౧౨ ఆపదెడసి, ౨-౧33 మననీలవేణిదె, 3-౧3౨ వ్యాకర్తాముని, ఇత్యాదులు చాలఁ గలవు. దీనివిషయమై అహోబల పండితీయము 189 పుటలో ''సంస్కృతసమాంతస్థిత స్యాచోపి క్వచి త్సంధిః- (తత్సమపదాంతములందున్న యచ్చునకును గొన్నిచోట్ల సంధి రావచ్చును) "గంగనుకాసె- శ్రీరంగభర్తంచు-శౌరిచ్చుశుభములు. "ఇత్యాదికవిప్రయోగాత్-'' అని యున్నది.

ఉత్తమపురుషైకవచననకారసంధి:—

౧-3౨3 ఉదయమంది తనంతపదంబుగంటి, అందితిన్ + అనంతపదంబు.

౨-౨3౦ నిల్పితింతవడి. నిల్పితిన్ + ఇంతవడి.

3-౧౬౯ పోయితప్పుడు- పోయితిన్ + అప్పుడు.

దీనివిషయము, అహోబలపండితీయము 190-194 పుటలలో నిట్లున్నది.

ఉత్తమపురుషేతు "ప్రాయస్తు స్యాత్కిమాదిక స్యేతః" ఇతి సూత్రేణ

సంధిః. చేసితినచ్యుతార్చనము=చేసితచ్యుతార్చనము "(పైసూత్రమున ప్రాయః అనుపదముచే) "కొలిచితినబ్జిజ-కొలిచి తబ్జిజ. ఇత్యాదౌ విభాషేతి ప్రయోగతో వగంతవ్యమ్"

ఇంతియుకాక, యీవిషయమునఁ గవిబ్రహ్మ తిక్కనసోమయాజి భారతము విరాటపర్వములో "సైరించి తీవుగాన (5-250) అని ప్రయోగించెను. దీనికి సంస్కృతభారతములో విరాటపర్వము ౭౦-౨౩ శ్లో 'అపరాధ మిమం క్షమే' అని యున్నది తిక్కనసోమయాజికిఁ గృతియిచ్చిన కేతన దశకుమారచరిత్రములో ఆ 7 పద్యము 52. (నేను) "పొందఁజేసితింక......ఎకయాడ గఁజొచ్చెద" అనియును-పిదపఁ బ్రామాణికకవులలో నగ్రగణ్యుఁడగు నెఱ్ఱాప్రెగ్గడ- హరివంశము, ద్వితీయభాగము ఆ ౮-౧౬౯ లో "నేను దొడరితిపుడు" అనియుఁ బ్రయోగించిరి.

కూఁతురి:—౧ ౧౦ సొంపులకూఁతురీ; 3 ౧౯-౨, 3-౧౯౪ లో, కూఁతుః అనియే యున్నది.

మువర్ణకలోపము:—౧-౨౧ శయ్యోపకరణసంసర్గ నిలిపి. ౧-౨౭3 స్పర్శ. ఇత్యాదులు గలవు.

వులోపము:—౨-౮ శ్రమాంబు.

మఱికొన్ని:—౨-౧౭౮ మూాయునకు, ముయు (పీరులుముయ వచ్చి) ౨-౧౦౪ కొప్పున నున్నగా నియను ౨-౩౨౦ నెట్లయినఁ గానిము. ౧-౨౩౮, 3-౧౭౬ మతల్లికి, మత్తల్లి- 3-౮౬ చలఱకు-"చలఱ కగువింటిచల్మిఁ గొని సారము జాఱఁగ"-చేరు,చారు మొదలగువానివలె రూపాంతరమున్నదా. కుమారసంభవము రెండవభాగము ౧౦-౪౮౬ అ-చ్చరువు అని యతియందున్నది. ఇద్దాన లక్ష్యలక్షణగ్రంథముల నొక్కకవి రచించినప్పుడు రెండిఁటికిఁ బరస్పరవిరోధ మున్నంతమాత్రమున నా గ్రంథము లొక్కరు రచియింప లేదనునూహ నిరాకరము.

౧౭౯౧"బృంగితపించి తత్తనువు పీడిన" అనియున్నది. ఈగ్రంథమునందే షష్ఠాశ్వాసమున "బ్రుంగి...భూధరము" అనియే యున్నది. కావున "బ్రుంగి తపించి తత్తనువుఁ బోవిడి" యనుట సరళపద్ధతి.

౨-౧౧౯ గీ...దోసమేమి,యవతెయేనియు వెన్నుని యవ్వనాఢ్య" అని యున్నది. "యెవ్వతేనియు వెన్నుని యవ్వనాఢ్య" అని తోఁపవచ్చును గాని

యవ్వనపదము సంస్కృతసమాసమం దుపయోగించుట యశాస్త్రీయము కావున "అతివ యేడియు వెన్నుని యావనాఢ్య" అని కాని "అతివ యెవ తెయు వెన్నుని యావనాఢ్య" అని కాని, లేదా "ఏవనితయేని వెన్నుని యావనాఢ్య" అని కాని యనినచో సరిపోవును.

౨-౭౬ మాత్రపితరులు అనుచోటఁ మాతరపితలు అనఁదగును.

ఛందోవిశేషములు:—

౨-౩౫ కాంతకు- తలపోఁతలు- బల్కుంతలు- రోఁతలు- అని దీర్ఘ పూర్వబిందుప్రాస మిందుఁ గలదు. కాని యట "కాంతకు" అనుచోట మొదటిపాదమునఁ "నాతికి" అని సవరించినచో సర్ఘబిందుపూర్వకప్రాస మగును. మాతృకలోఁ "గాంత" కనియే కలదు దీనింబట్టి దీర్ఘపూర్వకబిందుప్రాసము ప్రాచీనతమకావ్యలక్షణ మనువాదము ప్రశస్తము.

రలయతి:—౧-౧౦౧ లో- గీ లలితసుమగుచ్ఛ పరిమళ రాజితంబు ౧-౨౩౬ లో- రాణగాంచిన నాయింటిలక్ష్మి రావె ౧-౨౭౭ లెక్కింపఁగరాదు మాధురీగుణమనుచున్. ౨-౧౮౭ లలితవైఖరిగనియు నబ్రంబుగాఁగ.

ఈవిషయము- అహోబలపండితీయము 137-38 పుటలలో సాధించుచు, "ఏతేన రాయంచకాళ్ళఁ దాలకయుమున్న" ఇత్యాదికవిప్రయోగానాం న కించిద ప్యసామంజస్య మితి ధ్యేయం" అని తనభావమును సోదాహరణముగఁ బ్రకటించినాఁడు.

మువర్ణయతి:—

౨-౧౦ గగు। ర్పుష్మేయి పైఁడిదువ్వలువ మూఁత దలిర్పగ-

౨-౫౭ క. ముదమున లోకంబులెల్లఁ బొగడుట నిజమై-

౨ ౨౧౦ ఇ। మ్ముదితకుఁ దత్పదానుగత భూరిభుజంగ విషాగ్నికీల-

మొదలగునవి కలవు.

ఈకవి తనశృంగారప్రధాన మగుమహాకావ్యమునందు శ్రీమహావిష్ణువు పరతత్త్వ మనియును (1-278) అదిసాధింప జ్ఞానభక్తులు సాధన మనియును (1-281) జెప్పి విష్ణుభక్తినిగుఱించి యిట్లు చెప్పెను.

సీ. బహుసంభవార్జితబహుపాతకవ్రాతవిపినమహావహ్ని విష్ణుభక్తి
మానసరాగాదిమాలిన్యపరిహారవిమలాంబుపూరంబు విష్ణుభక్తి
తాపత్రయోదారదావవైశ్వానరవిపులధారావృష్టి విష్ణుభక్తి

చతురర్థనిక్షేపసంపాదనక్రియావిదితాంజనంబు శ్రీవిష్ణుభక్తి
సకలసత్కర్మసాద్గుణ్యసంపదలకు, వేల్పుమొదవులమేల్బంతి విష్ణుభక్తి
సంకరుకటాక్షసముపాత్తసాధుబోధ,విద్యలకునెల్లఫలము శ్రీవిష్ణుభక్తి 3-౨౦౨

ఈమహాకావ్యమునకుఁ బరిషత్తువారెంతప్రయత్నించినను రెండవప్రతి దొరకలేదు. దొరకినప్రతిలో లుప్తభాగము లున్నతావులఁ గొన్ని పూరించి వానికి గుండలాకారచిహ్నము లుంచినాఁడను. లేఖకదోషము లధికముగా నున్నవి కేవలము దుష్టము లని తోఁచిన వానిని దిద్ది మిగిలినవానికి మాతృకలోని స్వరూపములు క్రిందఁ జూపితిని. ఇది యాఱాశ్వాసముల గ్రంథము. ఈప్రథమభాగమందు మూఁడాశ్వాసములు మాత్రమే యున్నవి మిగిలిన మూఁడాశ్వాసములును రెండవభాగముగాఁ బ్రకటింపఁబడును.

ఇందుఁగల మఱికొన్ని విశేషములును, ఉత్తరభాగవిశేషములును, ద్వితీయభాగపీఠికయందు వివరింపఁబడును. గ్రంథసంస్కరణమందును, పీఠికయందును గల గుణదోషములగుఱించి వేఱె మనవిచేయ నక్కఱలేకుండ నీమహాకవి పద్యము నే యిందుఁ బొందుపఱుచుచున్నాను.

ఉ. తప్పనిచోటఁ దప్పనుచుఁ దప్పనియీరస మూనఁబోకుఁడీ
తప్పినఁ దప్పు గల్గెనని తప్పనిసత్కృప మీరు దిద్దుఁడీ
యొప్పు టొకింత గల్గ మది నుబ్బఁడు పండితులార మీకు నేఁ
దప్పనిశిష్యుఁడన్ గురులఁ దప్పని శిష్యునకీర్తి కీర్తియున్. ౧-౩౯

ఇట్లు, భాషాసేవకుఁడు,
శ్రీపాద పాపయ్యశాస్త్రి,
శ్రీసూర్యరాయాంధ్రనిఘంటుకార్యస్థానపండితుఁడు,
పీఠికాపురము.

## —: విజ్ఞాపనము :—



ఈకాళిందీకన్యాపరిణయము మాతృక పరిషత్కార్యనిర్వాహక సభాధ్యక్షులగు మ॥ రా॥ జయంతి రామయ్యపంతులుగారు తాము డిప్యూటీకలెక్టరుగా నున్నపుడు వినుకొండతాలూకాలో సంపాదించినారు కాగితపుఁబ్రతి, ప్రాఁతగిలినది నడుమ నడుమఁ గొన్ని పత్రములు లేవు, పద్యములు లేవు, పద్యములలోఁ గొన్నితావుల వాక్యములు లేవు, వాక్యములలోఁ బదములు లేవు. కొన్నిపదము లర్థముకాని విధమున లేఖకప్రమాదమున వైరూప్యముం బొందినవి చూ పుట ౮౩ పద్యము ౩౫ "సంకుసకసద్గృహగ్రాహసంకులంబు." ౩౧ పుట ౧౯౬ పద్యము " యతుయుగ్గుగుణస్ఫూర్తి" – ఇత్యాదులు. రెండవ ప్రతికై యత్నించితిమి, గాని, దొరకలేదు. ఉన్నదానితోనె యీప్రథమభాగ మతికష్టముపైఁ బుస్తకరూపమున నింతమాత్రము ప్రకటింపఁగలిగితిమి. తక్కినమూఁడాశ్వాసములను గ్రమముగ ద్వితీయభాగముగఁ బ్రకటింప యత్నించుచున్నారము.

ఈమాతృక శార్వరినామసంవత్సరము (శక ౧౮౪౨) ఆషాఢ బ ౨ భృగువారము వఱకు ప్రభంజనము వేంకటసుబ్బయ్యశాస్త్రిగారి కుమారుఁడు లక్ష్మీనారాయణగారు వ్రాసినది. రామయ్యపంతులుగారు వినుకొండ తాలూకాలోని ముప్పడివరమున సంపాదించిరి, కాని, ప్రాఁతకాఁడు చివర——

సీసమాలిక. శ్రీమించుచుతూర్పునసిరులకుఁబట్టైనకులిశాయుధునివీడుగొట్టెపాడు
ఆగ్నేయదిశయందు నఖిలవేదాంతార్థమహిమకునిలయంబు మైలవరము
దక్షిణదిశయందుఁ దనరోలఁగూలంగఁ బెద్దజమ్ములమడక సౌజన్యమడక
నైరుతిపార్శ్వాన నరులసర్థులపట్ల పురుహూతుపురమెట్ల పూరిమెట్ల
రాజిల్లుకొండలరాయనిపాలెంబు భోజనానకుఁ గల్పభూరుహంబు
వాయవ్యదిశయందు వనర గోకనకొండ నీరతార్థిజనులకు సిరులునిండ
ఉత్తరభాగాన నున్నతస్థితిఁగాంచె నాగులవరము భూనాగపురము
ఈశాన్యదిశయందు భాసిల్లుకీర్తిచేఁ గవికల్పవల్లి కూకట్లపల్లి
అష్టపురపద్మమంతరస్థాయియైన, శాశ్వతైశ్వర్యములకెల్ల సదనమైన
ప్రబలినారాయణపురంబు పాలకడలి,పట్టిమెడనున్న నవరత్నపథకమనఁగ.

సీ. జానకీపతి లేఁతసజ్జరొట్టెలపాలు కొంపలకప్పిల్ల గోడ్లపాలు
సంవాసములు దొంగజాగిలంబులపాలు నయనముల్ జాగరణంబుపాలు
గట్టిపాత్రపుఁద్రాళ్ళు కట్టెమోపులపాలు మృదువైనచేతులు ముండ్లపాలు
భూరిసంధ్యావిధుల్ బురదసీళులపాలు నాలుక దీనోక్తిమేనుపాలు
ఘనతరస్నేహ మది ధూర్తజనముపాలు, చిత్తమే వేళ నతిదీర్ఘచింతపాలు
హరిహరీ దేహమంతయు నలఁతపాలు, మైదవోలున నుండుట మాకుఁ జాలు.

అను రెండుపద్యములను వ్రాసియుంచెను. ఇందు ముమ్మశివరము కనఁబడదు. పైగ్రామములలో నక్కాలమునఁ బండితులు భాషాభిమానులు నుండెడివారేమో, కవివంశమువారెవ్వరైనఁ గాని యితరులు గాని యీపుస్తకప్రతిని సంగ్రహించి యుండిరేమో యనునాశ కలుగుచున్నది లక్ష్మీనారాయణగారు వ్రాసినప్రతికి మాతృక యేమై యుండును. ఎవ్వరైన నాప్రాంతములవారీపుస్తకమునకై యత్నించి సంపాదించి మాకుఁ బంపి యీపనిలోఁ దోడ్పడుదురని కోరుచున్నాము. ఇక్కవి పండితుఁడు, బహుశాస్త్రవేత్త, అట్టియతనిగ్రంథమును యథామతిఁ బరిష్కరించుట సాహసమగును. మేము రెండవభాగము ముద్రింపఁబోవునప్పటికి దీనిప్రత్యంతర మెవ్వరైనఁ బంపినచోఁ గృతజ్ఞులమై యుందుమని విన్నవించుచున్నారము.

కార్యదర్శి,
ఆం॥ సా॥ పరిషత్తు, కాకినాడ.

# విషయసూచిక.

---



---

# పరిషత్కార్యాలయమున వెలకు దొరకు గ్రంథములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము - చదలువాడ మల్లయకవి | రు 0 | 8 | 0 |
| 2 | కవిజనాశ్రయము - వేములవాడ భీమకవి ... ... | 0 | 10 | 0 |
| 3 | చంపూరామాయణము - ఋగ్వేదికవి వేంకటాచలపతికవి ... | 1 | 0 | 0 |
| 4 | నీతిసీసపద్యశతకము - తాళ్లపాక పెదతిరుమలార్యుఁడు ... | 0 | 2 | 0 |
| 5 | జ్యోతిశ్శాస్త్రసారము - శ్రీమాన్ కపిస్థలం కృష్ణమాచార్యులుగారు బి. ఏ., యల్. టి. ... ... | 0 | 8 | 0 |
| 6 | జ్ఞానప్రసూనాంబికాశతకము - శిష్టు సర్వశాస్త్రికవి ... | 0 | 2 | 0 |
| 7 | సర్వేశ్వరశతకము - యథావాక్కుల అన్నమయ్యగారు ... | 0 | 3 | 0 |
| 8 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము - జ. రామయ్యపంతులు గారు, బి ఏ., బి ఎల్. ... ... | 0 | 8 | 0 |
| 9 | కావ్యాలంకారచూడామణి - విన్నకోట పెద్దయకవి | 0 | 8 | 0 |
| 10 | చంద్రభానుచరిత్రము - తరిగొప్పుల మల్లనకవి ... | 1 | 0 | 0 |
| 11 | అకారాద్యముద్రిత గ్రంథసూచిక ... ... | 0 | 8 | 0 |
| 12 | ప్రాకృతభాషోత్పత్తి - శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ... ... | 0 | 12 | 0 |
| 13 | శివతత్త్వసారము - మల్లికార్జున పండితారాధ్యులు ... | 0 | 12 | 0 |
| 14 | Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు బి ఏ., బి. ఎల్. ... ... | 0 | 8 | 0 |
| 15 | శివరాత్రిమాహాత్మ్యము - శ్రీనాథమహాకవి ... ... | 0 | 12 | 0 |
| 16 | ఆర్యభాషావిభాగము - శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ... ... | 0 | 8 | 0 |
| 17 | Dravidian Lexicography ... ... | 0 | 4 | 0 |
| 18 | ప్రహస్వరంగములు - క్రొత్తపల్లి సూర్యారావు ... .. | 0 | 8 | 0 |
| 19 | నారసింహపురాణము ఉత్తరభాగము - హరిభట్టు ... | 1 | 0 | 0 |
| 20 | మన్నారుదాస విలాసనాటకము — రంగాజమ్మ. .. | 0 | 8 | 0 |
| 21 | జైమినిభారతము - వచనము - వేంకటకృష్ణప్పనాయఁకుఁడు ... | 0 | 12 | 0 |
| 22 | [illegible] వ్యాకరణము అహోబలపతి ... ... | 1 | 0 | 0 |

Printed by M. Rangiah at the Cocanada Printing Works, Cocanada.

శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

## (Journal of the Telugu Academy)


సంపుటము ౧౭. { విభవనామసంవత్సరము. మాఘఫాల్గునమాసములు. } సంచిక ౬.





కాకినాడ:

కొత్తపల్లి సూర్యారావుచేఁ బరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది

చందా { పోష్టువ్యయములతో సాంవత్సరమునకు రు. 3. } { విడిసంచిక రు ౦-౮-౧

1929

## ప్రతిష్ఠాపకులు

శ్రీ రాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజావారు. పరిషత్స్థాపకులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు - ఉయ్యూరు జమీందారువారు.

శ్రీ రాణి వత్సవాయి వేంకట సుభద్రయ్యమ్మ జగపతి బహద్దరుగారు - తుని రాణిగారు

కీ. శే. శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

### అధ్యక్షుడు.

జయంతి రామయ్యపంతులుగారు బి.ఏ., బి.ఎల్.

### కార్యదర్శులు.

దర్భా వేంకటశివరామశర్మగారు బి. ఏ., బి. ఎల్.

కిడాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.

### కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహాదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారు.

డాక్టరు వేమూరి రామకృష్ణారావుగారు ఎం. ఏ. ఎల్. టి. PH D

(కోశాధ్యక్షులు)

శ్రీ త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారు.

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు

అనంతపంతుల రామలింగస్వామిగారు.

దుగ్గిరాల వేంకటసూర్యప్రకాశరావుగారు బి. ఏ.

తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు.

అకెళ్ల వేంకట్రామయ్యగారు

కోటా వెంకటసుబ్బారావు నాయుడుగారు.

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు.

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు

పిల్లారిసెట్టి రంగబ్రహ్మారావు నాయుడుగారు.

# విషయసూచిక.







# పరిషత్ప్రయోజనములు.



తెనుఁగుభాషను, వాఙ్మయమును, అభివృద్ధి నొందించుటయు, ఆవిషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసంగుటయు నీపరిషత్తుయొక్క ప్రయోజనములు ఈపనిని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యీక్రిందఁ బొందుపఱుపఁబడు చున్నవి —

I తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వాంకష నిఘంటు వొకటి రచించి ప్రచురించుట,

II తెలుఁగుభాషకు సజాతీయేతరభాషలతోఁ గలసాదృశ్యములను సాకల్యముగ నిరూపించుచు నొకవ్యాకరణము రచించి ప్రచురించుట;

III ఆధునికశాస్త్ర గ్రంథరచనయందుఁ బ్రయోగించుటకునై పారిభాషికపదములను నిర్ణయించి వివరించు నొకశబ్దకోశమును సిద్ధముచేయుట,

IV ఆంధ్రదేశప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహ మొసంగుటయు, లభ్యములైన వానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుఁగు దేశముయొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్ర మొకటి రచించి ప్రచురించుటయు,

V సర్వవిషయములనుగుఱించి చేయఁదగు గ్రంథరచనకుఁ బ్రోత్సాహ మొసంగుట,

VI ఆంధ్రభాషలోని మంచిగ్రంథములఁ బండితపరిష్కారము చేయించి నిర్దుష్టముగఁ బ్రచురించుట,

VII తెలుఁగుభాషను వాఙ్మయమును సంబంధించిన విషయములను జర్చించు నొక పత్రికను బ్రకటించుట,

VIII తెలుఁగువాఙ్మయమునకు సంబంధించిన విషయములను గుఱించి చర్చించుటకుఁగాను సాంవత్సరికసభల నేర్పాటుచేయుట,

IX తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలఁ గావించి పారితోషికములను సాహిత్యపట్టములను, యోగ్యతాపత్రికలను నొసంగుట,

X ఒక పుస్తకభాండాగారమును స్థాపించి సాగించుట. ఇందు బ్రధానముగాఁ దెలుఁగు గ్రంథము లుండవలయును; వ్రాతప్రతులుగూడ నుండవలయును,

XI తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికి నుపకరించు నన్ని కార్యములను జేయుట

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

సంపుటము ౧౩. { విభవనామసంవత్సరము మాఘఫాల్గునమాసములు. } సంచిక ౬.


## పెద్దన మనుచరిత్రమునందుఁ బెట్టిన యనుచితపుమార్పు.


—( కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు. )—


పెద్దన మనుచరిత్రమునందుఁ దెచ్చిపెట్టిన యసంగతపుమార్పులంగూర్చి యిదివఱకు ముచ్చటించుకొనియున్నాము. ఇఁక నాతఁడు తెచ్చిపెట్టినయనుచితపుమార్పుంగూర్చి ప్రసంగించుకొందము.

మనోరమ తననెచ్చెలులబాధల వెల్లడించి వానిందీర్పించుకొనుటకుం దగుతఱియెద్ది? అడవియందు సంచరించుచున్న స్వరోచి యిందీవరాక్షుఁడనుగంధర్వరాజు శాపవశమునఁ బొందిన నీచరాక్షసత్వమునకు విమోచనమును గలిగించియు, ఆతనికూఁతు రగు మనోరమకుఁ బూర్వస్మృతిలేని యాయిందీవరాక్షుని రాక్షసత్వమువలనఁ గలిగిన ప్రాణభీతిని దొలఁగించి ప్రాణదాన మొసంగియు నమితానందమును గూర్చె. ఇట్లుపకారి యైనస్వరోచికి మరలఁ దనశక్తికొలఁదిని బ్రత్యుపకారము సేయ నెంచి యిందీవరాక్షుఁడు తనకడ నున్నయాయుర్వేదవిద్య నాతని కుపదేశించి తనకూఁతు నాతని కిచ్చి పెండ్లిసేయుదునని పలికె. ఆమాటలను విని మనోరమ స్వరోచిని బెండ్లియాడుటకుఁ దనకు సర్వవిధముల నంగీకారమే యనియు, నైనను తననిమిత్తమై శాపవశగతలై తీరనిరాజయక్ష్మాదిరోగములపాలై తనచెలికత్తియలు విభావసీకళావతు లడవులలో నిడుమలఁ గుడుచుచుండఁగాఁ దాను సౌఖ్యములఁ బొందు టెట్లని

పలికినది. ఆమాటలు విని స్వరోచి తా ని దీవరాక్షునుండి గ్రహించిన యాయుర్వేదప్రభావముచే నీచెలికత్తియలయార్తిని వివాహానంతరమున నివారింతు నని చెప్పి యొప్పింప వారికుభయులకు వెంటనే పెండ్లి కావింపఁబడిన దనియుఁ, బెండ్లి యైనవెంటనే స్వరోచి తనయాయుర్వేదప్రజ్ఞను వినియోగించి తగుమందు లిచ్చి మనోరమాసఖురోగములు నివారించి వారినిగూడఁ బెండ్లియాడె ననియు మార్కండేయపురాణమున నున్నది. ఆసందర్భము నిస్సార మని యెంచి పెద్దనార్యుఁడు తనమనుచరిత్రములోఁ గొన్నిమార్పులు పెట్టెను. తనతండ్రి తన్ను స్వరోచి కిచ్చి వివాహము చేయుచు ననినప్పుడు తనచెలికత్తియల యవస్థలంగూర్చి పెద్దనగారిమనోరమ తలపెట్టలేదు. మహావైభవముతో వివాహసౌఖ్యముల నన్నిటి ననుభవించినది. పెండ్లి యైనతరువాత గర్భాధానపుగదిలోనికి నాథుఁడును దానును జేరినపిమ్మట, భర్త బహువిధశృంగారచేష్ట లొనరించి యొనరించి రాగాతిశయము నొంది కవయఁ దమకింప నత్తఱి తనకోర్కె లాతనిచేఁ దీర్పించుకొనుటకుఁ దను వగు సమయ మని యెంచి ముందుగ నేడ్వఁ బ్రారంభించినది. ఇ దేమి ? అకుటా నందము నందవలసిన మంచిసమయమున నేడ్వ మొదలిడితి వని నాథుఁడు ప్రశ్నింప, నప్పుడు తనచెలికత్తియ లడవులలో రోగపీడితలై వనటఁ గుందుచున్నా రనియు, "వారిరోగములు నీవు నివారింపవేని నా కెక్కడిసౌఖ్యము" లనియు ఖండితముగాఁ జెప్పివేసినది. అంతట వెంటనే స్వరోచి తనయుద్యమ ముడిగి యారాత్రిపూఁటనే మనోరమను వెంటఁబెట్టుకొని యరణ్యములకుఁ బోయి విభావసీకళావతులరోగముల మాన్చి పిమ్మట భోగముల ననుభవించె నని మనుచరిత్రమునందుఁ గలదు. తననెచ్చెలులరోగబాధల నివారించినంగాని తాను బెండ్లిభోగముల ననుభవింపఁజాల నని పెండ్లికిఁ బూర్వమునందే జనకునికడను, గాఁబోవునాథునికడను, మనోరమ తెల్పుట, గర్భాధానపుగదిలో నాథుఁడు కవయ నుంకించుసమయమునకుఁ బెద్దనచే మార్పఁబడినది. ఈమార్పు కడురసవంతమనియుఁ బెండ్లికూఁతు రగుమనోరమ పెండ్లికొడుకగుస్వరోచితోఁ దనతండ్రియెదుర మాటలాడె ననుట యొప్ప దని తలఁచి గర్భాధానపుగదిలోఁ బెట్టినాఁ డనియు కీ. శే. తేవప్పెరుమాళ్లయ్యగారు లిఖించిరి. తేవప్పెరుమాళ్లయ్యగారు చెప్పినది సరికా దనియు మనోరమ తనచెలికత్తెలు వనటం గుందుచుండఁ దాను భోగముల ననుభవింపఁజాల నని

పెండ్లికొడుకుతోఁ బలుకలే దనియుఁ దనతండ్రితో ముచ్చటించె ననియు నట్లు తండ్రితో సంభాషించుటకు సిగ్గుపడ నవసరము లే దనియు గర్భాధానపుఁగదిలో నాథుఁడు పాన్పునఁ జేర్చి కౌఁగిలించుకొని ముద్దిడి మోహోద్రేకము నంది కవయఁ దమకించుచున్నసమయమున నదియే తనయభీష్టమును బ్రియునిచేఁ దీర్పించుకొనుటకుఁ దగుతఱి యని భావించి సంభోగము నరికట్టె ననుట నవోఢయుఁ గులసతియు నగు మనోరమకుఁ దగ దనియు నయ్యది వేశ్యాకృత్యము లనియు నేను నావిమర్శనములో వ్రాసితిని. అందులకుఁ దగుకారణములనువిపులముగా వ్యక్తీకరించితిని. ఐనను మరల మనవేంకటశాస్త్రిగారీవిషయము నెత్తికొని పెద్దనార్యుఁడు పెట్టినమార్పే బహుసరసముగా నున్న దని తెలుపుటకు విచిత్రప్రయత్నములను గావించిరి. వీరు వ్రాసినదానికి మరల సమాధానము నిచ్చుట కొంతవఱకుఁ జర్వితచర్వణమే యగును గాని శ్రీశాస్త్రిగారివంటి పండితులు చేయఁబోవుసమర్థనమునకు సమాధాన మిచ్చుటయే మంచి దని యెంచి మరల నిందు సమాధాన మిచ్చుచున్నాను.

మనోరమ తనచెలికత్తెల వనటం గూర్చి వివాహమునకు ముందు తండ్రితో నేల పలుకరాదు ?

తేవప్పెరుమాళ్లయ్యగారికిక్రొత్తపెండ్లికూఁతురు క్రొత్తపెండ్లికొడుకుతో ముచ్చటించుట తగ దని తోఁచినది కాని తండ్రితో ముచ్చటించుట తగదని తోఁచలేదు. మన వేంకటశాస్త్రిగారి కన్ననో కాఁబోవుభర్త యెదుట నుండఁగాఁ గన్యక తనతండ్రితో ముచ్చటించుటకూడఁ దగదని తోఁచినది ! ఇది పెద్దవింత. ఈముచ్చటించినవిషయము సతీపతుల భోగ రహస్యములతో సంబంధించినది కాదు. ఒకతనిని వివాహ మగుటకుఁ దనకుఁ గలయనుమతిని దెలుపుట. ఇది సతీపతులు రహస్యముగా ముచ్చటించుకొనఁ దగినయంశము గాదు. బహిరంగముగా నలుగురిలోను ముచ్చటించుటకు జంక నవసరము లేనిది. "కాఁబోవుభర్త చెంత నుండఁగాఁ దనతండ్రితో నీరీతిగాఁ బల్కుటచే మనోరమ ఆగతనము వెల్లడి యగుచున్నది. మఱియు నిది కేవలము కన్యాజనస్వభావమునకు విరుద్ధము. పతిచెంతఁ బెండ్లికూఁతురంతప్రౌఢత్వము చూపె ననుట యౌచిత్యమునకుఁ గూడ భంగము కలుగక మానదు. తండ్రితో మాటాడనేమి యనఁ బతిచెంత నున్నప్పుడు కన్యక లందునను మొనయలేరు." అని వేంకటశాస్త్రిగారు లిఖించిరి. ఈయది యా

పాతరమణీయముగాఁ గాన్పించుచున్నది. తనమనోగత మైనయాందోళనము దీఱువఱకుఁ దాను వివాహభోగముల ననుభవింపఁజాల నని తండ్రికిఁ దనమనోగతదుఃఖమును గూఁతురు వెల్లడించుట యాఁగతన మెట్లు కాఁగలదు? ఇందు ప్రౌఢత్వ మేమి యున్నది? మనదేశపు పెండ్లికూఁతుండ్రను మనవేంకటశాస్త్రిగారు పట్టిబొమ్మలను జేసివేసిరి. కాఁబోవుపతిచెంత వారు నోరెత్తుటయే సంభవింపనేర దని లిఖించిరి. ఇది సత్యమునకుఁ జాలదూరము. మన కావ్యములు పరికించి చూచినను మనదేశస్థితుల నారసి చూచినను "ఇది కేవలము కన్యాజనస్వభావమునకు విరుద్ధము. పతిచెంతఁ బెండ్లికూఁతు రంత ప్రౌఢత్వము చూపె ననుట యౌచిత్యమునకుఁ గూడ భంగము కల్గకమానదు" అని వేంకటశాస్త్రిగారు వ్రాయుట యసంగత మని చదువరులు గ్రహించుకొనకపో రని తలంచెదను. కన్యకలు కాఁబోవుపతులతోడనే తమకలయికకనువగు సమయాసమయాదులం గూర్చి వివేకముతోఁ గూడిన బోధానులఁ గావించినట్లు కాన్పించుచున్నది. ఇందులకుఁ దగునుదాహరణములఁ గొన్నిటి మనయుత్తమకావ్యరత్నములనుండి యిచ్చుచున్నాఁడను.

(1) విజయవిలాసములో సన్న్యాసివేషము దాల్చియున్న యర్జునున కుపచారముచేయుచున్న సుభద్ర తానువివాహమాడఁ గోరుచున్న యర్జునుఁడాసన్న్యాసియే యని తెలిసికొనినపిమ్మట సిగ్గుపడి మునుపటివలె మాటలాడుట మానఁగా యర్జునుఁ డామెచేతనున్నచిలుక నుద్దేశించి తమకలయికంగూర్చి యేమేమో పలుకఁ గాఁబోవుపెండ్లికొడుకుతోఁ గాఁబోవుపెండ్లికూఁతు రగు సుభద్ర యిట్లు నుడివినది.

"మేరలా యివి మీయంతవారలకును బెద్ద లున్నారు వారెఱ్ఱి పెండ్లిసేయఁ
గలరు వేగిరపాటెంత వల దటంచు విన్నపము సేయరాదె యో చిన్నిచిలుక."

ఇది తనపెండ్లినిగూర్చిన ప్రసంగమే. పెండ్లినిగూర్చిన దననేల దాని తరువాతిశుభకార్యముం గూర్చిన ముచ్చటయే. చిలుకతోఁ బలుకుమిషతోఁ దనకాఁబోవుభర్తతోఁ బలికినదే ఇది మీకుఁ దగదు. పెద్దలున్నారు, వారెఱిఁగి పెండ్లిసేయుదురు. ఈలోపల మీ పుట్టినవారికిఁ దొందరపడుట తగదు. పెండ్లిసేయువఱకు నాఁగుఁ డని కన్యక యగుసుభద్రపలికినది కాఁబోవుభర్త యెదుట నుండఁగా "నాచెలికత్తెలు బాయిలు నందుచుండ నేను వివాహభోగముల నెట్లనుభవింపను తండ్రీ" యనుటయే యాఁగతనముం దెలుపుచోఁ

గాఁబోవు భర్తయాశయముల నివారించి చిలుకతోఁ బలుకుమిషమీఁదఁ బె
ద్దలు పెండ్లిసేయువఱకు నాఁగుట మర్యాద అట్లుచేయకుండుట యనుచిత
మని సాహసించి నుడువుట యేమగునో కదా! సుభద్ర యాఁగను మించిన చె
నఁటియా యేమి? ఈసందర్భమున విజయవిలాసకారుఁడు సుభద్రచేసినసం
భాషణము నెట్లువర్ణించినాఁడో కనుఁడు.

“అని యుచితరీతి వెలయఁగ నాడు నాతిరసికముద్రకు మిగులమానసము గరఁగ
బయిని బ్రేమయు నగ్గలంబై పెరుఁగఁగ నవ్వధూటి కౌఁడంబడ ననుఁ గిరీటి.”

ఇట సుభద్ర పలికినపలుకు లుచితరీతి నున్న వనియు, రసికముద్రను వెలయించుచున్న వనియుఁ గవి వర్ణించె. ఇట్లు కన్యలు తమ కాఁబోవుభర్తలతో శయనాగారపుముచ్చటలం గూర్చియే ముచ్చటించుటయుఁ దొందరపడవల దని చీవాట్లు పెట్టుటయు నుచితములై రసికముద్రను దెలుపునవై యుండఁగా మనోరమ తండ్రితో తనమనోవ్యథ తీఱువఱకు బెండ్లిభోగముల నెట్లనుభవింపఁగల ననుట యనుచిత మగు ననుటకంటె వింతయుండఁగలదా? పైరీతిగా సుభద్రచర్యలు కన్యాస్వభావవిరుద్ధములు కానియప్పుడు మనోరమ చర్యలు కన్యాస్వభావవిరుద్ధము లెట్లు కాఁగలవు?

(2) శాకుంతలములో. కాళిదాసమహాకవి శకుంతల యనుకన్యకను నామె నెచ్చెలులతోఁ గూడియున్నతఱి నచటికి విచ్చేసియున్న కాఁబోవుభర్త యగుదుష్యంతునకును జరిగినశృంగారసంభాషణ మీక్రిందిరీతిని వర్ణించె.

“ప్రియంవద:—అట్లయిన మా ప్రియసఖి నిన్ను గుఱించి కామదేవునిచే నిటువంటి యవస్థ పొందింపఁబడినది. కాఁబట్టి యనుగ్రహించి దీని బ్రతుకు నిలుపందగును

రాజు:—ఓశుభాంగీ! యీప్రార్థన మాయిరువురకును సామాన్యము సర్వవిధముల నాకిది యనుగ్రహము.

శకుంతల:—(ప్రియంవదనుజూచి) చెలీ! అంతఃపుర విరహముచేత సంతాపించుచున్న రాజశ్రేష్ఠునినేల నిర్బంధించెదవు? (వీరేశలింగముగారి తెనుఁగు)

ఋషికులమున నరణ్యములలోఁ బెరుఁగుచున్న శకుంతల నూతనముగాఁ దానున్నయాశ్రమమునకు వచ్చి యించుక సంభాషించిన దుష్యంతమహారాజును నింతలోనే తనకుఁ గాఁబోవుపతినిగా భావించుకొని యాతనియంతఃపురస్త్రీలయందు (సవతులయందు) నసూయ వహించి కాఁబోవుపతి కడనే

"ఉ. ఓరజనీకరాన్వయపయోధినిశాకర యేఁబతివ్రతం
గూరిమిమీఱ నొక్కరుని గోరి వరింపఁగ నున్నవారి కె
వ్వారికి నెగ్గుగాఁ దలఁప వచ్చునె ? నిన్ను వరింతు నెల్లి బృం
దారకులున్ నృపాలురును దక్కినవారును జూచుచుండఁగన్".

కాఁబోవుపతి చెంత నున్నప్పుడు కన్యక యగు దమయంతి యెంతయో ప్రౌఢముగ మాటాడినది గదా ! అట్టి ప్రసంగము కన్యాస్వభావవిరుద్ధ మనియు ఱాఁగతనముం దెలుపునది యనియు నెవ్వరును భావించుట లేదు కదా. ఇఁక మనోరమపలుకుల నధిక్షేపించుట యెట్లు ?

(4) రుక్మిణీకల్యాణములో:—రుక్మిణి తాను వరించిన శ్రీకృష్ణునకుఁ దన్నుం బెండ్లియాడు మని దూతల నంపినది. ఇది ఱాఁగతనమును మించిన పని కావలసియున్నది గదా కాని మనలోఁ బ్రాజ్ఞు లగువా రెవ్వరును నట్లు తలంచుట లేదు. పైవారియం దింకనొక విశేషము కలదు పై దమయంతీ, రుక్మిణీ, సుభద్రలను కన్యలు తా మెవరిని మనసార భర్తలు కావలె నని కోరుకొనుచున్నారో వారు తటస్థించినప్పుడే పైరీతిని బ్రవర్తించిరి. మనోరమ విషయ మట్టిది కాదు. ఈకన్య స్వరోచియం దిదివఱ కేవిధ మగుమోహమును బెట్టుకొనియుండ లేదు. తండ్రి స్వరోచికిఁ దన్ను నిచ్చెద ననినపిమ్మటఁ దా నందుల కంగీకరించినది కావున ముందుగనే యెక్కుడు సిగ్గుపాలు గావలసిన యవసరమే లేదు.

మనదేశకన్యలు కాఁబోవుభర్తలతో తమహృదయము తేటపడునట్లు మాటలాడుటయే గాక తమ్మును వారు సంపాదించుకొనుటకుఁ దగునుపాయములనుఁ గూడఁ దెలుపుచు వచ్చిరి. దమయంతికడకు దూతగా వచ్చినభావిభర్త యగు నలుండు దమయంతితో నింద్ర, ధనద, యమ, వరుణులను దిక్పాలురు తమలో నొక్కని వరింపు మని నీకడకు నన్ను దూతగా నంపి రనఁగా నిన్నే గాని మఱియొకని నేను బెండ్లియాడ నని యామె రూఢిగాఁ దెల్పె. ఈ యంశమును దేవతలతోఁ దాను జెప్పిన వారు తనప్రవర్తనమువిషయమై సందేహింతు రేమో యను జంకును బొంది నలుఁడు తొట్రుపడుచుండ దమయంతి యది గని "హృదయేశ్వర! నీవు జంకనవసరము లేదు. రేపు బహిరంగసభలో నానల్వురుదిక్పాలురయెదుట నిన్ను నేను వరింతును. అందుపై వారు నీవిషయమై సందేహింప నవసర ముండ" దని, యుపాయము చెప్పినది. మఱునాటి

సభలో దమయంతి నలునే గాని వరింపదఁట! అది యేమో చూత మని యాదిక్పాలురు నలరూపములతో వచ్చి సభలో నిలువంబడఁగా నామె సభలో నైదుగురు నలరూపు లుండుటఁ గని యది దేవమాయ యని గ్రహించి మనస్సునందు దిక్పాలురకు మ్రొక్కి "దేవతలారా! నేను నలుని వరునిగా నిశ్చయించుకొనియున్నాను, గాన, నాతని నేను దెలిసికొనునట్లు చేయుఁడు" అని ప్రార్థించె. అంతటపై వారు ప్రసన్నులై నిజరూపములతో నిలువఁగా నలు నాసాధ్వీమణి వరియించె. ఇంకను రుక్మిణి తనసోదరుఁ డగు రుక్మికి విరోధి యగు కృష్ణుని వరించుటయే గాక యాతనికిఁ దాను పంపినసందేశములోఁ దన్నెట్టితటి వచ్చి నిరపాయముగాఁ జేకొనవచ్చునో విస్పష్టముగాఁ దెల్పినది.

పెక్కేల? ఇంచుమించుగా మన గ్రంథము లన్నియు మనదేశకన్యకలం కాఁబోవుపతులు తమసమీపమున నున్నప్పుడు గూడఁ బలుకదగినయంశము ల నిస్సంశయముగను, సరసముగను బలికినట్లే తెలుపుచున్నవి కాని మనవేం కటశాస్త్రిగారు తలంచినట్లుగాఁ గొయ్యబొమ్మలై నిలచినట్లు తెల్పుట లేదు. గ్రంథవిస్తరభీతిచేఁ గొన్నిప్రాఘకావ్యములనుండి మాత్రమే యుదాహరణముల నిచ్చితిని.

ఇంత యేల? కన్యకలు పెద్దపెద్దరాజసభల నేర్పాటు చేసి నప్పుడు వానిలోఁ బ్రవేశించి తమమనస్సునకు నచ్చినవానికడకుఁ జని యాతఁడే నా వరుఁ డని యాతనిఁబూలమాలతో లజ్జలేకుండ నలంకరించుట కలదని మన గ్రంథము లన్నియుఁ జెప్పుచున్నవి. సభలలోఁ గన్యలు చేయు నిట్టివ్యాపార ములే ఆఁగతనమును వెల్లడింపనియెడలఁ గాఁబోవుభర్త యెదుటనుండగాఁ గన్యక దననెచ్చెలులబాధలంగూర్చి తనతండ్రితో ముచ్చటించుట ఆఁగతన మగునా? అట్లనుట యనుచితము గాదా?

మఱియును గాఁబోవుభర్తల యెదుట నవనాగరకులు వ్రాసిన గ్రంథ ములలోని కన్య లెట్లు ప్రసంగించిరో యది తెలుపుటకై యొక్కయుదాహర ణ మిచ్చెద. కీ. శే. కందుకూరి వీరేశలింగంపంతులువారి శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచననైషధములోఁ గన్య యగు దమయంతి కాఁబోవుభర్త యగునలుని తోఁ దననెచ్చెలుల సన్నిధి నీరీతిఁ బ్రసంగించినది.

"క. నిన్నుఁ గని నంతనుండియు, నన్నెంతయు నేచదొడఁగె నలనెలయల్లుం
డెన్నఁడు నిను గని యెలుఁగను, జెన్నగు నీతెలఁగె లుంగఁ జేయఁగఁగదే."

కన్య లీరీతి సంభాషణము గావించుటయు, నుచితమైయుండ మనోరమ పల్కినపల్కులందు నౌచిత్య మూంపకుండునా?

ఇంకను బూర్వకాలపుఁ బెండ్లికూఁతులమాట యటుండనిండు. ఇప్పటి కాలపుఁ బెండ్లికూఁతులమాట నాలోచింపుఁడు. చరిత్రకాలమునాఁటి యొక పండితుఁడు విద్యావతి యగుతనకూఁతునకు విద్యాగంధము లేనియొకధనిక సుందరబాలుని దీసికొనివచ్చి చూపి వానిఁ బెండ్లియాడు మనఁగ నామె కాఁబోవువరుని విద్యావైశద్యమును కనుఁగొనఁదలఁచి 'విహాస్య' యేవిభక్తి యగు నని యడిగినది. అది యవ్యయ మనియు విభక్తిలేనిదనియు గ్రహింపఁజాలక 'రామస్య' వలె నుండుటచే షష్ఠీవిభక్తియగునని వరుఁడు సమాధాన మిచ్చెఁ. మఱల 'విహాయ' యేవిభక్తి యని యడిగినది. అదియు నవ్యయ మని గ్రహింపఁజాలక "రామాయ" వలె నుండుటచే, చతుర్థి యని పలికెను. అటు పిమ్మట "అహం, కథం" ఏవిభక్తు లని యడిగినది వానిలో మొదటిది యస్మచ్ఛబ్దముయొక్క ప్రథమావిభక్తి యనియు రెండవది యవ్యయ మనియు తెలిసికొనఁజాలక రామం కృష్ణం గోవిందం లవలె నుండుటచే ద్వితీయావిభక్తు లని పలికినాఁడు. అప్పు డాతనిసమక్షముననే తనతండ్రి నుద్దేశించి యాకన్య "యస్యషష్ఠీ చతుర్థీస్యాత్ విహాస్యచ విహాయచ, అహం కథం ద్వితీయాస్యాత్ ద్వితీయాస్యా మహం కథమ్" అని పలికినది. విభక్తులే తెలియని వానికి నేనెట్లు ద్వితీయను (భార్యను) కాఁగలను. అని తండ్రితోఁ గాఁబోవు వరునియెదుట నుడివినయాకన్యను మనవా రెవరును జాఁగనుగా భావించుట లేదు. ఇట్టియుదాహరణములు పెక్కులు గలవు.

ఒకవేళ నీకాలమునఁ గాఁబోవుభర్తలయెదుటఁ గాఁబోవుభార్య లేమియుఁ బెదవియెత్తి మాటలాడలేక యుందు రనినను నిప్పటిపెండ్లికూఁతుల యవస్థనుబట్టి పూర్వకాలపుపెండ్లికూతుఁలు కూడ నట్లేయుందు రని భావించుట న్యాయము కాదుగదా. పురాణకాలమునందలి పెండ్లికూఁతులు సర్వవిధముల విశారదలై యుండెడివా రనికదా చరిత్రాభిజ్ఞుల మనుకొనువారు తెలుపుదురు. పూర్వకాలపుసంగతుల నిప్పటికాలపుస్థితులను బట్టి విమర్శింపరా దని కదా మన గ్రంథవిమర్శనపద్ధతికారులు లిఖించిరి. అట్టివారు తాము చెప్పిన పద్ధతులకే విరుద్ధముగాఁ దమవ్యాసమును వ్రాయుట యుచిత మగునా?

ఎట్లు చూచినను గాఁబోవుభర్త యెదుట నుండఁగా మనోరమ తనతం

త్రితోఁ దనసఖులు దుఃఖాక్రాంతలై యుండఁగాఁ దాను బెండ్లిభోగముల ననుభవింపఁజాల నని తెలుపుట కన్యాస్వభావవిరుద్ధ మనియు ఆఁగతనమును దెలుపునది యనియు భావించుట యుచితముగఁ గాన్పించుటలేదు.

ఇంకను "కన్యక సౌఖ్యముల ననుభవింపలే నని తం డ్రితో జెప్పుట మఱియు నీచముగాఁ గానవచ్చుచున్నది." అని వేంకటశాస్త్రిగారు లిఖించిరి. ఇం దేమినైచ్య మున్నదో బోధపడుటలేదు. వివాహాదికము లన్నియు మనసిజభోగములే కావున వేదములు వివాహమునఁ గాముఁడే దాత యనియుఁ గాముఁడే ప్రతిగ్రహీత యనియుఁ జెప్పుచున్నవి. అది యట్లుండ సంస్కృతమూల మిటభోగము లని తెలిపినది కాని మనసిజభోగము లని తెలుపలేదు. భోగము లనుభవింపఁజాల ననినంతమాత్రమున నాభోగములు శయ్యాగారరహస్యభోగము లని భావించుకొన నవసరములేదు. వివాహమును భోగమే. ఈసంగతిని సరిగ గ్రహించుకొనక శ్రీవేంకటశాస్త్రిగారు సౌఖ్య మని మనోరమ యనినదానికి వ్యవాయకర్మ మనునవసరార్థమును జేసికొని మార్కండేయపురాణము నధిక్షేపించిరి. అంతియే కాని యౌచిత్య మెంతమాత్రమును బాటింపనివాఁడు మనపెద్దనార్యుఁడే యని తెలిసికొనలేకపోయిరి తన్ను నిదివఱ కెన్నఁడు నెఱుంగనివాఁడును దేశప్రభువును యువకుఁడును నైన స్వరోచితో మనోరమాసఖి యగుకళావతి తనవృత్తాంతముం దెలుపుచుఁ దనతండ్రి పుంజికస్థల యనునచ్చరతో మదనకేళిం దేలినట్లుగా నీక్రిందిరీతిని బెద్దన చెప్పించె.

తే. చెయ్యి పట్టినమాత్రాన శిరసు వంచి, యవశచందానఁ బైవ్రాలునవ్వధూటి
బర్ణశాలాంతరము సేర్చి బ్రాహ్మణుండు, కెరలుగోర్కులఁ గందర్పకేళిఁ దేలెఁ.

"క. తపమంతయుఁ బోలివోవఁగ, నపుడన్నియు నుజ్జగించి యయ్యంగనతోఁ
దపసిమనోజక్రీడా, విపులైశ్వర్యంబు లనుభవించుచునుండెన్."

కళావతి యనుకన్యక పెరకాంతలయెదుటఁ దా నెన్నఁ డెఱుంగని యువకునితోఁ బైరీతిఁ బచ్చిశృంగారవాక్యములు పలుకునట్లు చేసిన పెద్దనగ్రంథ ముచితరీతి నున్నట్లే మనవేంకటశాస్త్రిగారికిఁ దోఁచినది కాని మార్కండేయపురాణములోని మనోరమావాక్యములు పచ్చిశృంగారము లేనివైనను నీచమైనవిగా వీరికిఁ గాన్పించినవి. ఇట్టిదారుణపక్షపాతబుద్ధితో వీరిచే వ్రాయఁబడిన గ్రంథవిమర్శనపద్ధతి యెంతశ్లాఘనీయమో కదా! వీరు 'విమర్శకుఁడు నిష్ప

తుపాతబుద్ధితో నిరూపించిన గుణదోషపరిశీలనము మాత్రమే విమర్శన మని పించుకొనును.' అని వ్రాసియున్నారు కాని వీరు తాముజెప్పినవిధులను తమ విమర్శనపద్ధతియందే పాటింపలేరు.

దాని కేమి ? మనము పైనిజర్చించినదానింబట్టి మనోరమ కాఁబోవు పతిచెంతఁ దనజనకునితోఁ దననెచ్చెలులు రోగపీడితలై యుండగాఁ దాను వివాహభోగముల ననుభవింపఁజాల నని జెప్పుట నీచముకాదనికూడ గ్రహించుకొనియున్నాము ఇఁకఁ బెద్దనార్యుఁడు పెట్టినమార్పునం దేమయిన నౌచిత్య మున్నదేమో విచారించుకొందము. మనోరమ తనతండ్రి తన్నునుపకారి యగు స్వరోచి కిచ్చి వివాహముచేయుదు ననినప్పుడు తననెచ్చెలులబాములం గూర్చి ముచ్చటింపక వివాహసౌఖ్యముల ననుభవించి యనుభవించి తుదకు గర్భాధానపుగదిలో నాథుఁడు మోహపరవశుఁడై రతికేళిం దేల నుద్యమించునమయమున తనకోర్కె ప్రియునిచేఁ దీర్పించుకొనుటకు మంచితఱిగాఁ దీసికొని సంభోగము నటకట్టిన దనుట పరమనీచము నింద్యమునై యున్నది.

వాదమునిమిత్తము మనవేంకటశాస్త్రిగారు చెప్పినరీతిగాఁ దండ్రిమెదుటఁ దననెచ్చెలులబాధలంగూర్చి మనోరమ ముచ్చటించుట యుచితము గాదనియు నయ్యది గర్భాధానపుగదిలో నాథుఁడును దానును నేకాంతముగా నున్నపుడు మాత్రమే చెప్పఁదగిన దనియు భావింతము. అట్లు చెప్పుకొనినను పెద్దనవ్రాతయందలి దోషము తొలఁగిపోనేరదు. ఏమన పెద్దన మనోరమాస్వరోచులు గర్భాధానపుగదిలోఁ జేరినప్పుడు కూడ వెంటనే చెప్పింపలేదు. స్వరోచి సురతక్రీడకు వేగిరపడువఱకు నాఁపియుంచెను. ఇది తప్పుకాదా ? మనవేంకటశాస్త్రిగారు "పెద్దన యేకాంతమున నున్నపుడు మనోరమచే భర్తకుఁ జెప్పించెను." అని వ్రాసిరి. ఏకాంతమున నున్నపుడు చెప్పుటయే యవసర మగుచో శయ్యాగారమునఁ జేరినతఱువాత నాథుఁడును దానునుమాత్రమే మూయఁబడిన గదిలో నున్నతఱువాత ప్రసన్నహృదయుఁడై తనకడకు వచ్చి నాథుఁడు తనచేయిపట్టుకొని నపు డేలచెప్పలేదు. అటుపిమ్మట బుజ్జగించి కౌఁగిలించినపు డేలచెప్పలేదు ? అవి యేకాంతసమయములు కావా ? అయ్యవి పెండ్లివేళలవంటి యసందర్భసమయములు కావుగదా ? అప్పుడును జెప్పక నాథునకుఁ గ్రమక్రమముగ మోహాతిశయమును గలిగించి తుద కాతఁడు కవయఁ దమకించి త్రస్తరుల గుస్తరింప నది తఱి యని భావించి మనో

రమ యప్పుడు తనభావమును, విద్యననుపానముగాఁ బెట్టి సంభోగము నతి కట్టి యాపై బ్రతిమాలించుకొని చెప్పె. ఇదియే ఆఁగతనమును వెల్లడించుచున్నది.

ఎట్టిసమయమునఁ బ్రియురాలు ప్రియునిచేఁ దనకోర్కి చెల్లింపించుకొనవలెను ?

సంతోషసమయమునఁ బ్రియురాలు ప్రియునితోఁ జెప్పి తనకోర్కి చెల్లింపించుకొనవలె నని వేంకటశాస్త్రిగారు తెల్పిరి. సంతోషమే. అది యెవరును గా దనరు. కాని మార్కండేయపురాణమునందలి మనోరమ తనకోర్కె ను సంతోషసమయమునఁ దెలుపలేదా ? మంచిసంతోషసమయమునసే తెల్పినది. తనతండ్రి యగు నిందీవరాక్షుఁడు హేయమును దుర్భరమును నగు క్రూరరాక్షసత్వమునుండి విముక్తుఁడై పరమాహ్లాదకర మగు నైజగంధర్వరూపమును దాల్చి తన్నుఁ గూఁతునుగా గ్రహించి తగినవరున కిచ్చి పెండ్లిచేయఁదలఁచుకొనినసమయము తనకు రాక్షసునివలని ప్రాణభీతి తొలఁగి తనప్రాణదాతకుఁ దాను భార్య యగుటకు ననువగుసమయము స్వరోచికి నమూల్యమగు నాయుర్వేదవిద్య లభించుటయే గాక ఘోరరాక్షసు నేకభుజబలముచే జయించి విజయలక్ష్మితోడి పాటుగా దివ్యసుందరరూప యగుతన్ను గృహలక్ష్మిగా గ్రహించుసమయము. ఇదియందఱకును బరమసంతోషసమయము కాదా? ఇట్టిసంతోషసమయమున దాను రక్షింపఁబడినట్లే తనచెలికత్తియలను రక్షింపఁబడవలె నని మనోరమ పలుకుట సమంజస మేల కాదో వేంకటశాస్త్రిగారు తెలుపలేదు. సంతోషసమయము లనేకములు గల వని యంగీకరించియును గూడ సంభోగసమయ మన్నిటినిమించిన సమయ మనియు గాన నప్పుడు చెప్పింపవలె ననియు లిఖించిరి. అందులో "యౌవనవంతుఁ డగుపురుషునికి యువతీప్రథమసంగమముకంటె నధికసంతోషసమయ ముండదుకదా ? తాదృశసంతోషావస్థయం దున్నపు డెట్టివాఁడును బ్రియురాలికోర్కిఁ దీర్పక మానగలఁడా ? కార్యార్థులు, అట్టిసమయమునకు వేచియుండుట సహజము కదా!" అనియు వీరు వ్రాసిరి.

శ్రీశాస్త్రిగారివంటివా రిట్లువ్రాయుట వింతను బుట్టించుచున్నది. సాధ్వీమణులు తమకోర్కెల బ్రియులచేఁ దీర్పించుకొనుటకుఁ బ్రథమ సురతసమయమే తరి యనుటకంటె వింత యుండఁగలదా ? తమ యింద్రియ సుఖమున కడ్డులేకుండుటకా ధీరోదాత్తతాది లక్షణములు గల మహాపురుషులు

సాధ్వీమణులగు తమ యర్ధాంగలక్ష్ముల కోర్కెలదీర్చుట ? అట్లు తలంచుట యనుచితము. సీతామహాదేవి తనకుఁ గాంచనమృగము కావలె నని కోర శ్రీరామచంద్రుఁ డామె కోర్కెఁ జెల్లింప యత్నించె. అది యేసమయమునఁ గోరినకోరిక ? ద్రౌపది తనకు దుర్ఘటస్థలస్థ సౌగంధికపుష్పములు కావలె నని కోరఁగా భీముఁ డాకోర్కెఁ దీర్చె. ఇదిసంభోగసమయమునఁ గోరిన కోరికయా ? కుచేలపత్ని తనభర్తను శ్రీకృష్ణుని దర్శించి యాతనియనుగ్రహమున సిరులుసంపాదించుకొనిరాఁ బ్రార్థించినది. అతఁ డామెకోర్కె నంగీకరించె. ఇది సంభోగము సరికట్టుటచే సంప్రాప్తమైనదా ? ఇతరసంతోషసమయములఁ బతులచే సతులు కోర్కెలు దీర్పించుకొని రనుట కుదాహరణములనేకములు గలవు. తనకోర్కెను బ్రథమసురతదినమునఁ జెప్పి తీర్పించుకొనిన సతీలలామ మిద్దివఱకుఁ గాన్పింపదు. సురతసమయము సంతోషసమయము కాదా యని శ్రీశాస్త్రిగారు ప్రశ్నించిరి. అది సంతోషసమయము కాదని యెవ్వరును జెప్పలేదు. ఇతరసంతోషసమయములఁ దమకోర్కెలఁ దీర్పించుకొన సతులు యత్నించుటకంటెఁ బ్రథమసురతదినమునఁ గావింపించుకొనుట మంచి దని తాము పెద్దన్నతోఁ గలిసి పలికిన పలుకులు సరసముగా లేవని యస్మదాదులము చెప్పుచున్నాము.

### పెద్దన్న సంతోషసమయమునఁ జెప్పించెనా ?

మనవేంకటశాస్త్రిగారు సంభోగసమయమే మిక్కిలి సంతోషదాయకమగుసమయ మనియు నట్టితఱిని బ్రియురాండ్రు తమప్రియులచేఁ దమకోర్కెలు దీర్పించుకొనవలె ననియు వ్రాసిరిగదా ! సంతోషమే. ఇట్టిసంతుష్టసమయమున సతులు నాథులకుఁ దమమనవుల విన్నవించుకొనుట తగియుండు నని భావించుకొనువారు మనలోఁ గలరు భక్తుఁ డగురామదాసు "ప్రక్కను జేర్చుక చెక్కిలినొక్కుచు చక్కగ మరుకేళిఁ జొక్కియుండెడువేళ ననుఁ బ్రోవ మని చెప్పవే సీతమ్మ" యని లిఖించినాఁడు. ఇట్లు వ్రాసినకవులు కలరు, కాని యీ వ్రాఁత లన్నియు మరుకేళిఁ జొక్కియున్నతఱి మంచిదని చెప్పుచున్నవి కాని మనపెద్దనార్యుఁడు చెప్పినరీతిగా మరుకేళి కుద్యమించు నాథునితలంపు నరికట్టితద్ద్వారముగాఁ గోర్కెలు చెల్లింపించుకొనుట మంచిదని చెప్పియుండలేదు. మరుకేళిం జొక్కియున్నసమయము మంచిసంతోషసమయము గావచ్చును గాని దాని కుద్యమించుసమయ మట్టిది కాదు. అది యాతురపాటును దెల్పు

సమయము. కావున నట్టిసమయమున సంభోగము నరికట్టి తమకార్యములు కొనసాగించుకొన సాధ్వీమణి యైన దెవ్వతెయుఁ బ్రయత్నింపదు. ప్రయత్నించిన నది సాధ్వి కాదు. మనుచరిత్రలోని మనోరమ గర్భాధానపుగదిలో నేద్వ మొదలిడినప్పుడు అనఁగా నాథునికోర్కె కాతంకము గలిగించినపు డాతని మన స్స్థితిలోనికి వచ్చినదో పెద్దనయే వర్ణించినాఁడు. కనుడు:—"ఊరక యున్నం గనుగొని యవనిపతిపుంగవుం డంతరంగంబున జెంగలించు కౌతుకాంకురంబు కరఁగుపడ వెఱఁగుపడి యుద్వేగసమన్వితుండై సంభ్రమించుచు" దీనింబట్టి చూడ స్వరోచిహృదయమునం దంతవఱకు జనించిన సంతోషాంకురము నశించిపోయి యుద్వేగముపుట్టి యున్న సమయమునందు మనోరమ తుదకుఁ దనచెలికత్తియల బాధలు వారింపఁబడ వలె నని నాథునితోఁ జెప్పినది కాని సంతోషమునఁ జొక్కియున్న తఱిఁ దెలుపలే దని తేలుచున్నది. ఇది యెట్లు సరిపడును ? ఇది సరిపడనేరదు కావున సంభోగేచ్ఛ గలప్రియుని కోర్కె నరికట్టి వానిని బాధించి తనకోర్కెను దీర్పించుకొన మనోరమ యత్నించిన దనవలెను గాని సంతోష సమయమునఁ జెప్పిన దన వలనుపడదు. సంభోగము నరికట్టి కామోద్రేకపూరితు లగువారిచేఁ దమకార్యముల నెరవేర్పించుకొనఁ జూచువారు వేశ్యలు. సంభోగానంతరమున విటుఁడు దనకోర్కెల నన్నిటిని జెల్లించునో చెల్లింపఁడో యను సంశయముచే నాతని కామపీడితత్వము నాధారముగాఁ దీసికొని ముందే తమకోర్కెలఁ దీర్పించుకొనఁ జూతురు.

మఱియుఁ బైకీర్తనములో రామదాసు "అద్రిజవినుతుఁడు భద్రగిరీశుఁడు నిద్రమేల్కొను వేళ నెలఁతరో బోధించి ననుఁబ్రోవు మనిచెప్పవే సీతమ్మ" అనిమఱి యొకచరణము వ్రాసినాఁడు. దీనింబట్టి సంతోషసమయము లనేకము లుండు ననియు, నేసంతోషసమయమునం దైనను గార్యసిద్ధికై ప్రయత్నింపవచ్చు ననియుఁ దేలుచున్నది. కాబట్టి మార్కండేయమునందలి మనోరమ దనకోర్కెం దెలిపినసమయము మంచిసమయమే యని తేలుచున్నది. పాత్రముల ఘనతను వెల్లడించుచున్నది. కావున, పెద్దన పెట్టినమార్పనుచితము. ఈయంశము మన వేంకటశాస్త్రిగారి హృదయమునకు బోధపడకపోలేదు. కావుననే వారు పెండ్లికి ముందుగాఁ దనచెచ్చెలులంగూర్చి మనోరమ ముచ్చటించిన ముచ్చటను బెద్దనవివాహానంతరమునఁ బెట్టించుటకును వివా

హాదిసౌఖ్యముల నామె, తనచెలులు బాధపడుచున్నను, ననుభవించుటకును గలకారణము లీక్రిందిరీతిని గల్పించిరి. ఆయుర్వేద మెఱింగినస్వారోచిచేఁ దన యభిమతమును దీర్చుకొననెంచియే మనోరమ వివాహమున కంగీకరించినది." మనోరమామనోగత మైనయీ భావమును మనశాస్త్రిగా రెట్లుగ్రహించిరో ? ఎట్లుగ్రహించినను నిది తప్పే, ఆయుర్వేద మొక్క స్వారోచికి మాత్రమే తెలిసి యున్న యెడల శాస్త్రిగారు చెప్పినది కొంతవఱకు సరిపడి యుండును గాని ప్రస్తుతసందర్భ మట్టిదిగాదు శాస్త్రులవారు చెప్పినయాయుర్వేద విద్యలో మనోరమాజనకుం డగు నిందీవరాక్షుడు కడు దక్షుడు అతనినుండియే స్వారోచి యీ విద్యను నేర్చికొనినాఁడు. కాఁబట్టి మనోరమకు నాయుర్వేదప్రభావముచేఁ దన నెచ్చెలుల బాములు తొలఁగింపించుకొను నిచ్ఛయున్న యెడలఁ దనయందమిత వాత్సల్యము గలతనతండ్రిచే నాపని చేయించుకొనవచ్చును. అందులకై స్వారోచి నాశ్రయింపఁ బనిలేదు. కాన శ్రీశాస్త్రులవారు వ్రాసినది యసంగతము. మనోరమ యాత్మానందార్థమై పెండ్లియందలి ముచ్చటచే నందుల కంగీకరించినది కాని సఖులనిమిత్తము కాదు. నెచ్చెలుల విషయ మైనదుఃఖములు పెట్టికొనక పెండ్లిసుఖముల నన్నిటిని హాయిగ ననుభవించినది. "మజ్జనములు మంచిగంధపుఁబూఁతలు తూర్యనాదములు వివాహవిధు లగుతలఁబ్రాలు మొదలగునవియుఁ జేయుచున్నంతమాత్రమున నామెకు మనసునందు దుఃఖము లేదనఁగలమా ? దుఃఖము మనోగతము. ఇవి బాహ్యములు. బాహ్యవ్యాపారమును బట్టి మనోవృత్తిని నిర్ణయింపలేము." అని మనవేంకటశాస్త్రిగారు వ్రాయించిరి. ఇది సరి కాదు. ప్రాజ్ఞు లగువారు మనుజులు చేయుచేష్టలు మనోగతభావముల వ్యాఖ్యానములని చెప్పుదురు. అది యటుండ మనపెద్దనార్యుఁడు వ్రాసినవ్రాఁత మనోరమ యత్యుత్సాహపూరితయై వివాహవైభవములలో మనఃపూర్వకముగాఁ బాల్గొనిన దని చెప్పుచున్నది. ఎట్లన,

"ఆ. రాజుచూడ్కి కపుడు రాజీవముఖి చూడ్కు లెదురుకొనియె లజ్జ కొదిఁగి యొదిఁగి
జడిసి జడిసి జహ్నుసంభవాంభోవేణిఁ గెదురుటెక్కు మీలకొదమ లనఁగ."

దీనిం బట్టి మనోరమ యత్యుత్సాహపూరితయై నాథునానందపూర్వకముగాఁ జూచిన దని తేలుచున్నది.

ఇంకను,

"మ. తనుమధ్యత్రివళుల్ నటింప నిలమీఁదన్ మట్టియల్ మ్రోవఁగాఁ
గనుపాపల్ పయిఱెప్పలం గదియ నుత్కంఠాగ్రయై నిక్కి నా
థునిమౌళిం దలఁబ్రాలు వోసె నవలాదోర్మూలకూలంకష
స్తనవిస్ఫూర్తికి సందిదండ ధవళుల్ సాహానినాదం బిడన్."

ఇదియు మనోరమ పరమోత్సాహముతో నిక్కి తలఁబ్రాలు పోసిన దని తేల్పుచున్నది. మఱియును,

"చ. మూఁడివడుగంకణప్రభల ముత్తెపుసేసలు దోయిలించి యె
త్తెడుతఱి బాహుమూలకుచదీప్తులపైఁ బతిదృష్టిపర్వఁగం
బొడమినలజ్జఁ బాణియుగమున్ వెసవంచియు మౌళిమీఁదికై
పొడవునఁ జల్లె లేనగవు పొల్తుకఱెప్పల నప్పళించుచున్."

ఇదియును పరమానందపూరితయై మనోరమ వివాహములోఁ బాల్గొనిన దని తెలుపుచున్నది. ఇట్టి వనేకములు గలవు. సాధారణముగాఁ గన్యకలు పెండ్లివేళలందును దాముపతులతో బంతులాడుట, గంధములుపూసికొనుట మున్నగుసంతోషసమయములందు ముఖ్యముగాఁ దమచెలికత్తియలు తమకడ నుండి యీవైభవము చూచుచుండవలె నని కోరుచుందురు. అట్టిసమయములందు మనోరమ యడవులలోఁ దననిమిత్తమై బాములఁబడుచున్న నెచ్చెలులు తనకడ లేమికి విచారమునందనే లేదనియు గర్భాధానపుగదిలో నాథుఁడు తన్నుఁ గవయనున్నతఱి వారిబాధలంగూర్చి విచారింపఁ జొచ్చిన దనియుఁ జెప్పుటలో స్వారస్య మిసుమంతయును లేదు. మనోరమ మనస్సు నెచ్చెలుల విషయమై దుఃఖించుచున్నదే యగునెడల యామె వివాహములో నిట్లుత్సాహమును జూపనేరదు. ఏమన "దుఃఖితే మనసి సర్వ మసహ్య మన న్నెఱుంగవే" యని మనపెద్దనార్యుఁడు మనుచరిత్రమునందే వ్రాసియున్నాఁడు. నిజముగా మనోరమ మనస్సునందు నెచ్చెలులంగూర్చిన దుఃఖమే యున్నయెడల నామెకు వివాహప్రక్రియయంతయు నసహ్యముగ నుండఁదగినది. కాని మనోరమ మనస్సట్టిస్థితియందు లే దని పెద్దనార్యుని వ్రాఁతలే తెల్పుచున్నవి. ఇంత యేల నాథుఁడు కవయఁ దమకించినప్పుడుఁ గూడ నామె కుత్సాహము పుట్టకపోలేదు. "అట్లు గవయం దమకించి త్రస్తరులఁ గుస్తరింప నింపు గలిగియు మున్ను మనంబునం బొడమియుండు నడలప్పుడు తలంపునం బాఱిన" అను

వాక్యములంబట్టి నాథుఁడు కవయఁ దమకించినప్పుడుఁ గూడ నామెమనస్సున నింపే గలిగిన దనియుఁ దరువాత నెచ్చెలులం గూర్చినయడలు మనస్సునం దగిలిన దనియు విస్పష్టముగ బోధపడుచున్నది. ఇంక నీమె నాథుఁడు చేయఁ బోవు సురతక్రీడ నేల యాఁపిన దన నాథునియుత్సాహోద్రేకమునకు నాతటి నాతంకము గలిగించిన నాతఁడు తనచేతిలోని బంమై తిరుగుచుగదా యను నూహతోఁ జేసినపని యని తేలుచున్నది. కాన నిది కులకాంత చేయుపని కాదు. అందునను నవోఢ చేయునది బొత్తిగఁ గాదు.

ఉత్తమనాయకునియందుండవలసినయుత్తమగుణము లన్నియు స్వారోచియందుఁగల వనియు నాతఁడు పరదుఃఖాసహిష్ణుత, పరోపకారము, స్వార్థత్యాగము మున్నగు నుత్తమగుణములు గలవాఁ డనియు మన వేంకటశాస్త్రిగారే వ్రాసిరి. ఇట్టి మహాపురుషునిచేఁ దననెచ్చెలుల రోగబాధలఁ దొలఁగింపించుకొనుటకై మనోరమ సంభోగము నరికట్టవలెనా ? తాను స్వారోచిని నుత్తమమగులోకోపకారకార్యము చేయు మనుచున్నదే కాని స్వార్థపరత్వముచేఁ దనకు నగలో నాణెములో చేయించిపెట్టు మని కోరుట లేదు గదా! కీర్తిప్రదమగుసత్కార్యమును జేసి ఆర్తురాండ్రగుకన్యకలను గాపాడు మని దయామయుండును సమర్థుండును నగునాథుని ప్రాణప్రియ కోరుటకు సంభోగము నరికట్టవలసి యుండునా ? అట్లు తలంచుట యెంతమాత్రము నుచితము కాదు. కావునఁ బెద్దనార్యుఁడు పెట్టినమార్పనుచితము. మనోరమ నెచ్చెలుల రాజయక్ష్మాదిరోగములు స్వల్పకాలములోఁ బోవునవి కావు. అట్టివాని నివారణార్థమై సంభోగేచ్ఛ నాథునిహృదయమునందును, తనహృదయమునందును మిక్కుటమై యున్న ప్రథమసురత సమయముననే యరికట్టి తొందరపడి యారాత్రిపూఁటనే సఖు లున్నమహారణ్యములోనికి నాథునిఁ దీసికొనిపోవుట రసాభాసహేతు వగును గాని మఱి యొకటి గానేరదు.

"మార్కండేయపురాణమునందుఁ గూడ మనోరమావివాహమైనతరువాతనే యామెనెచ్చెలులబాధలు తొలఁగింపఁబడినట్లున్నది గదా. మూలగ్రంథమునందలి మనోరమసఖులకు శాపవిముక్తి కాకుండ నెట్లు వివాహభోగము లనుభవింపఁగల్గెను. కావున మనుచరిత్రయందు శాస్త్రిగారు చూపిన దోషము మూలగ్రంథమునఁ గూడ లేకపో లేదు." అని వెంకటశాస్త్రిగారు లిఖించిరి. ఇది గ్రంథమును సరిగఁ జూచుకొనక వ్రాసినవ్రాఁత. ఏమన వివాహ

మునకుఁ బూర్వమే తనమనస్సున నున్నయడలును మనోరమ వ్యక్తముచే యఁగా నందుపై స్వరోచి యందుల కడల నక్కఱలే దనియుఁ దాను నేర్చికొనిన యాయుర్వేదప్రభావముచే వివాహానంతరమునఁ దాను విభావసీకళావతులరోగములకుఁ దగుచికిత్స చేసి తప్పక కుదిర్చెద ననియు రూఢిగ వాగ్దానముచేయుటచే నామె యంకులకు సంతృప్తయై యంగీకరించె. కావున నామె దుఃఖార్త కాదు. ఇట్లు మనస్సునం దున్నయడలు తీర్చి వేయఁబడిన తరువాత వివాహ మైనట్లు మార్కండేయపురాణమునందుఁ గలదు. కావున నందు మనుచరిత్రమునందలి దోషము లేదు. విమర్శించుపుస్తకములఁ బలుసారులు చదివి చూచుకొని యాపై విమర్శనము వ్రాయవలయు నని తమ గ్రంథవిమర్శనపద్ధతిలో మన వేంకటశాస్త్రిగారు వ్రాసిరే కాని యావ్రాఁతను తామే తమపద్ధతియందే పాటింపలేదు.

మొత్తముమీఁద శ్రీ వేంకటశాస్త్రిగారు నావిమర్శనముపై చేసిన ప్రతివిమర్శనమున కంతకును సమాధానమును నీవ్యాసమున నిచ్చియున్నాను. వేంకటశాస్త్రిగా రెత్తికొనిన గ్రంథచౌర్యమను విషయమునకు వివరఅకే బ్రహ్మశ్రీ సోమంచి సూర్యనారాయణశర్మగారు తగుసమాధానము నిచ్చిరి. అది యీపరిషత్పత్త్రికయందే ప్రకటింపఁబడియున్నది. కావునఁ దద్విషయమై నే నిప్పుడు వేఱుగ సమాధాన మీయనవసరము లేదు.

మనుచరిత్ర నీతిదాయకమా :— ఈశీర్షిక క్రింద నేను గావించినచర్చను గని నవనాగరకులవలెనే నేనును శృంగారరసమును ముట్టడించినట్లుగా మన వేంకటశాస్త్రిగారు భ్రమసి మిడిమిడిజ్ఞానముగల నవనాగరకులు మనగ్రంథరాజములమీఁదికి దాడి వెడలి దౌరతనమువారిచే శృంగారగ్రంథములపై బహిష్కారశాసనములు పుట్టించి మనసారస్వతమునకు హానినిగలిగించుచున్న యిక్కాలమున నిట్టివ్రాఁతలు వ్రాయుట యుచితముకా దని నన్ను మందలించిరి. అందులకు వారికి నేను ఋమార్పణము గావించుకొనుచున్నాఁడను. ఏమన, నేనును మననవనాగరకులచర్య లిప్పట్టున మనసారస్వతమున కమిత మగుహానిని గలిగించుచున్న వని తలంచువాఁడనే. ఇప్పట్టున నవనాగరకమతవైరస్యమును జూపుటకయి యే మూఁడువంతు లీచర్చను గావించినవాఁడను.

నవనాగరకులు మన ప్రబంధములందుఁ గలయే యేవర్ణనాదికంబులను నింద్యంచినవైచుచున్నారో యట్టివర్ణనాదికములఁ దమగ్రంథములందు వ్రాసి

వానిని బలుసారు లచ్చొత్తించి లోకములో విడుచుటయే గాక వానిని విద్యార్థులకుఁ బఠనీయగ్రంథములుగాఁ గూడఁ గావింపించుచున్నారు. ఇతరులచేఁ బ్రకటింపఁబడినప్పుడు దుష్టగ్రంథము లైన వైజయంతీవిలాసాదులు తమచే నిటీవలఁ బ్రచురింపఁబడి పవిత్రము లగుచున్నవి. తమచే నిషేధింపఁబడిన శశాంకవిజయాదు లందలి వర్ణనములవంటి వర్ణనములు తమచేఁ బొగడఁబడు సద్గ్రంథములం దుండిన నవి దోషములుగా భావింపఁబడుట లేదు వానిపై నేవిమర్శనములును బుట్టుట లేదు. ఈవిధముగాఁ బక్షపాతముతోఁ గూడిన లఘుదృష్టిగలనవనాగరకులు దమనూతనఫక్కిక ననుసరించి పరిశీలించినఁ దాము విశేషముగా గౌరవించు మనుచరిత్రాదులుకూడ దుర్నీతిదాయకము లగుగ్రంథములై పోవు నను తలంపుగలుగుటకై యీచర్చను గావించితిని. ఈఘట్టమును ముఖ్యముగా నవనాగరకుల నుద్దేశించి వ్రాసితిని. ఆసంగతి నావిమర్శనమున విస్పష్టముగాఁ దెలియఁజేసితిని. ఇందు మొదటఁ గచకుచసంభోగాదివర్ణనములు గలకావ్యములు నింద్యము లనునవనాగరకమతము ననుసరించి చూచిన మనుచరిత్రమును దుష్టగ్రంథమే యగు నని నిరూపించి పిమ్మటఁ దన్మతమును నిరసించి కచకుచసంభోగాదివర్ణనములున్నంతమాత్రమునఁ గావ్యములు నింద్యములు గావను నామతమును విస్పష్టము చేయుచు "కచకుచసంభోగవర్ణనముల నొక్క పెద్దనార్యుఁడే చేయలేదు. సంస్కృతమహాకావ్యములలో నీవర్ణనము లమితముగాఁ గలవు. వాల్మీకి కాళిదాసు మున్నగు మహాకవులును గావించిరి. ఇంగ్లీషున షేక్స్పియరు మున్నగుమహాకవులు నట్లే గావించిరి. పెద్దనయు నొనరించెను. అందులకై యతనిఁ బ్రత్యేకముగా నిందింపవలసిన దేదియు లేదు" అని నాయభిప్రాయమును దేల్చితిని.

"వెలిఁబెట్టిరే బాడబు"లను మనుచరిత్రపద్యముం గూర్చి:—తారాశశాంకమునందు మనుచరిత్రమునందుఁ గల "వెలిఁబెట్టిరే బాడబు"లను పద్యమునందలి భావమువంటి భావముగల పద్యమొకటి యుండ నయ్యది దుర్నీతికి మూల మనియుఁ గడు నింద్య మని యుఁ బెద్దపెద్దనవనాగరకులే యాక్షేపించిరి. ఆక్రమమును బట్టి చూచిన మనుచరిత్రమునందలి పద్యమును నింద్యమే యగు నని నేను నావిమర్శనములోఁ దెలిపి యుండ వేంకటశాస్త్రిగారు మిక్కిలివి తను బుట్టించు విమర్శనమును గావించిరి. మనుచరిత్రమునం దేమియుండిన దాని నంతను సమర్థించుటయే విమర్శనపద్ధతి యని వీరు భావించిరి కాఁబోలు.

న్యాయముచే మనుచరిత్రమునందలి "వలిఁబెట్టిరే బాడబు"లను పద్యము హానికర మైనది కా దని నేనును నంగీకరించితిని. ఏమన నయ్యది కామాంధు లగు వారియాహా లె ట్లుండునో తెలుపునది కాని ధర్మనిర్ణయము చేయునది కాదు. అట్లు చెప్పినఁ జాలును. శశాంకవిజయమునందలి పద్యమును నిట్లు సమర్థింపఁ దగినదియే కాని నవనాగరకు లట్లు భావించుకొనక యసంగత మగునాక్షేపణమును శశాంకవిజయపద్యముపై మాత్రమే పెట్టిరి. ఆహేతువుచే మనుచరిత్రపద్యమునకుఁ గూడ వారియాక్షేపణము తగిలి తీరు నని నేను తెల్పితిని. కావుననే "ఇప్పుడైన నిది దుర్నీతికి మూల మగు గ్రంథ మని నవనాగరకు లంగీకరింతురా ?" యని నవనాగరకుల నుద్దేశించి నేఁ బ్రశ్నించితిని. వేంకటశాస్త్రిగారీసంగతిని గ్రహించుకొనక పెద్దనార్యునిపద్యము నామూలాగ్రముగా యోగ్యమైన దని సమర్థింప నెంచి లోని చరిత్రాంశము లగుమాందకర్ణి మున్నగువారిచర్యలు యోగ్యములే యని సిద్ధాంతీకరింపఁ బ్రయత్నించుటయే గాక వేశ్యను గూడుట అంకే గా దని యు నది తప్పే గా దని యుఁ గూడ విపరీతపు సిద్ధాంతముగావింప సాహసించిరి.

వేశ్యాసంభోగము అంకుగాదా ?—మనపెద్దనార్యుఁడు మనుచరిత్రములో ననేకధర్మములంగూర్చి చక్కనిపద్యముల రచించియున్నాఁడు, కాని, వేశ్యాసంపర్కవిషయ మిూతఁ డపసిద్ధాంతములఁ గావించినాఁడు. అవి మన సునం బట్టుటచేతనే మనవేంకటశాస్త్రిగారును వేశ్యను గూడుట అంకు గా దనియుఁ దప్పు గా దనియుఁ జెప్ప మొదలిడిరి, గాని, మనశాస్త్రములు కాని పెద్దలు కాని యట్లు తెలుపుట లేదు.

వేశ్యనుగూడుట అంకే యగును. అహల్యను గూడినయింద్రుఁ డహల్యాజారుఁ డైనట్లే రంభను గూడిననలకూబరుఁడు రంభాజారుఁ డైనాఁడు. వేశ్యలు "లంజ" లని పిలువఁబడుచున్నారు "మంజులాస్యలు పురిఁగల్గు లంజ లౌర" అని చంద్రమతీపరిణయకారుఁడు వ్రాసియున్నాఁడు లంజతనము అంకుగాక యొండగునా ? "అగడుపడి పడిచి పడసిన యట్టి పసిఁడి, కటకటా యేమిటికి" అని విప్రనారాయణచరిత్రమునందు వేశ్యావృత్తింగూర్చి వ్రాయఁబడియున్నది. ఇట 'పడుచుట' యనఁగా అంకుతనముచేయుట యనియర్థము. పడుచుఁజేత అనఁగా జారత్వ మని శబ్దరత్నాకరమున వ్రాయఁబడియున్నది.

ఇంతయేల, వేశ్యతోడి సంగమము జారత్వమే యగు నని పెద్దనార్యుఁడే సూచించియున్నాఁడు. ఈమహాకవి ప్రవరాఖ్యుని సౌందర్యవర్ణనము చేయుసందర్భమున "ఆ. వె. వానిచక్కఁదనము వైరాగ్యమునఁ జేసి, కాంతుసేయుజారకామినులకు, భోగబాహ్యమయ్యెఁ బూచినసంపెంగ పోలుపు మధుకరాంగనలకుఁ బోలె." అని లిఖించె ఈపద్యరాజము వైరాగ్యవంతుఁ డగుప్రవరుని సౌందర్యము జారకామిని యగువరూథినికి భోగబాహ్యమైన దని సూచించుటకై వ్రాయఁబడినది. ఇట్లే వ్యాఖ్యాతలును వ్రాసియున్నారు. కావున వేశ్యలతోడిపొత్తు జారత్వము కాకపోలేదు.

వాసిరెడ్డి వేంకటాద్రినాయుఁడుగారి యాస్థానమందు బుచ్చివెంకను వేశ్యాకులజుఁ డగుకవి యుండెడివాఁడు. ఆతని నొకప్పుడు వేంకటాద్రినాయుఁడుగారు "బుధజనాటవ్యటన్యక్షంకు బుచ్చివెంకు" అని స్తుతించి యుండఁగా నాస్థానమునందలివారు న్యంకని మూరుమూలపదము వాడు టెందులకు, వాని కులమునను న్నరంకే ప్రయోగింపరాదా యని పలికిన ట్లు వాడుక కలదు. దీనింబట్టి వేశ్యలవిషయమునఁ గూడ లోకము అంకనుపదము వాడు నని స్పష్టమగుచున్నది. కాఁబట్టి వేశ్యలతోడి సంబంధము అంకు కాకపోలేదు. వేశ్యలసంపర్కము సర్వవిధములఁ నింద్య మని మనగ్రంథములు ఘోషించుచున్నవి. వీనిమాటయు వానిమాటయు నెందుకు. మార్కండేయపురాణమునందే ప్రవరవరూథినీసంవాదమునందే ప్రవరవాక్యములలో నిట్లు తెల్పఁబడి యున్నది.

కం. పరవనితారతి కీడని, గురులెఱిఁగింతు రటుగానఁ గోమలి మదినా
  కు రతి జనింపదు నీదెస, నిరతము నాదెస భజింపు నీవును విరతిన్.

శ్లో. పరస్త్రియం నాభిలషే దిత్యాచు ర్గురవో మమ
  ఇత్యాదిగా సంస్కృతమూలమున నున్నది.

ఈవిధముగా మార్కండేయపురాణమునందలి ప్రవరాఖ్యచరిత్రము వేశ్యతోడి భోగము పరస్త్రీభోగమే యని యు హానికర మని యు ఘోషించుచుండఁగా నాభావమును, పెద్దనార్యుఁడు తనమనుచరిత్రమునుండి తీసిపాఱవైచుటయే గాక వేశ్య యనన్యకాంత గావున దానిని గూడవచ్చు ననియు విశేషించి యది తరుణియు, వలపుగలదియు నగుచో దానికోర్కెను దీర్చి తీరవలె ననియు నీక్రిందిపద్యద్వారముగా లోకమునకు బోధగావించినాఁడు.

చ. "తరుణి ననన్యకాంత నతిదారుణపుష్పశిలీముఖవ్యథా
భరవివశాంగి నంగభవుబారికి నగ్గముఁజేసి క్రూరుఁడై
యరిగె మహీసురాధముఁ డహంకృతితో నని రోషభీషణ
స్ఫురణ వహించెనో యన నభోమణి దాల్చెఁ గషాయదీధితిన్."

మఱియును, తరుణియు ననన్యకాంతయు నగువరూథిని త్రోసిపుచ్చిన ప్రవరుని మహీసురాధముఁ డని, రసజ్ఞత లేనిమూర్ఖు డని యు నిందించినాఁడు. మోసముచేసి యామెను గూడిన నీచుఁ డగుకలిగానిని విశేషముగ స్తుతించుట యేగాక యంగభవవిద్యాపారగుఁ డని నుతించినాఁడు. మనశాస్త్రములు వచ్చి వేశ్యను నుత్తమకావ్యములందుఁ గథానాయికగాఁ జేయఁగూడ దని శాసించుచుండఁగా నట్టివరూథినిని గథానాయికగాఁ దీసికొనినాఁడు. ఈతనికి వేశ్యలచర్యలు చాల నాగరకత గలిగి ప్రౌఢముగా నుండు నను తలంపుగలదు కాఁబోలు. కావుననే వేశ్యఁజిత్తులను కులసతి యగుమనోరమయందుఁ బెట్టినాఁడు. ఇంకను నీతనికిఁ బచ్చిశృంగారము నచ్చిన ట్లితరము నచ్చదు. మార్కండేయమున హంసమిథునప్రసంగమును విని స్వారోచి బుద్ధితెచ్చుకొని కామపరతంత్రతను విడిచి యడవులకుఁ బోయి తపం బొనరించి యుత్తమలోకములకుఁ జనినట్లు తెల్పఁబడి యుండ నాకథను తనగ్రంథమునుండి తీసివాఱవైచినాఁడు. ఇట్టివి నీతిబాహ్యము లని కోవిదు లందురు ఇట్టివే పెద్దనార్యుని పెద్దతప్పులు. వేంకటశాస్త్రిగారు వీనిని తప్పు లని గ్రహించుకొనలేకపోవుట వింతను బుట్టించుచున్నది. వేశ్యనుగూడుట తప్పనుట స్త్రీపురుషసంబంధమే కూడదనుట వంటి దని శ్రీ వేంకటశాస్త్రిగారు వ్రాసియున్నారు. ఇ తకంటె విషాదజనక మగువాక్య ముండఁగలదా? శాస్త్రిగారు బాగుగ నాలోచించుకొందురు గాక.

ఇంకను నహల్యతో జారత్వము సల్పిన యింద్రున కేమిలోపము వచ్చినది కాన జారత్వము చేయవచ్చు నని వరూథిని వాదించినవాదమును గూడ మనవేంకటశాస్త్రిగారు నీతిదాయక మని సమర్థింపఁజూచుట మఱింతవింతను బుట్టించుచున్నది. జారత్వముఁ జేసినందులకై యింద్రునకు నష్టము కలిగిన దని పద్యము చెప్పుచుండిన మనవేంకటశాస్త్రిగారు చెప్పునది సరిపోవును. మను చరిత్రమునందలి పద్య మట్లు తెల్పుటలేదు. అహల్యను గూడినందులకై యింద్రున కేమిలోపము వచ్చిన దని యడుగుచున్నది. కావున శాస్త్రిగారి సమర్థన

మసమంజసము. తారాశశాంకులసంబంధ మెట్టిదో ప్రవరవరూథినుల సంబంధ మట్టి దని నేను దెల్పియుండలేదు. ఆవిచార మిట ననవసరము. మొత్తము మీఁద మనుచరిత్రము నీతికి విరుద్ధము లగునంశములను బోధించుచున్న దని చెప్పుట కవకాశము చాలఁ గలదు. గ్రంథవిస్తరభీతిచే నిప్పటి కీవిషయ మింతటితోఁ గట్టిపెట్టుచున్నాను.

గ్రంథవిమర్శనపద్ధతి యను నీవ్యాసము నిజముగా గ్రంథవిమర్శనపద్ధతుల లోకమునకుఁ దెలుపుటకై వ్రాసినదిగాఁ గాన్పింపదు. పెద్దనార్యునియందుఁ గలభక్తి మితిమించుటచే నౌనన్న దానిని కా దనుటకును కా దనినదానిని నౌ ననుటకును వ్రాసిన వ్యాసముగాఁ గాన్పించుచున్నది. శ్రీ కేతవరపు వేంకటశాస్త్రిగారు మంచిపండితులు. వీరు సరసను లగునవలలను, ప్రసిద్ధము లగునుద్గ్రంథవ్యాఖ్యానములను వ్రాసియున్నారు ఇట్టిపండితగ్రామణులు విశాల హృదయముతో గ్రంథవిమర్శనపద్ధతింగూర్చి విపుల మగువ్యాసమును వ్రాసిన నెంతయో లోకోపకారకమై యుండియుండును

# గ్రంథస్వీకారము.

## ఆంధ్రకవిచరిత్రము—ప్రథమభాగము.

**(History of Telugu Poetry vol 1. Vijianagaram Maharajah's College Publication, Price Rs. 2-0-0)**

ఈగ్రంథము విజయనగరసంస్థానపండితులగు భోగరాజు నారాయణమూర్తిగారిచే రచియింపఁబడినది. కందుకూరి వీరేశలింగముపంతులుగారు గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారు మొదలగువారు రచియించిన కవిజీవితములవలెఁగాక నీగ్రంథ మొకనూతనమార్గము నవలంబించినది. నన్నయ మొదలు నేటివఱకును గలకవిశ్వరులను గూర్చియు వారిగ్రంథములను గూర్చియు నీగ్రంథమునఁ దెలుపఁబడలేదు. గ్రంథకర్తయే దీని నుపోద్ఘాతసంపుటం బనియుఁ గవిత్రయయుగము, పోతనశ్రీనాథయుగము, పెద్దనయుగ మను మూఁడుభాగముల నింకను రచింపఁదలంచితి ననియు నవతారికయందుఁ దెలిపియున్నాఁడు. ఈసంపుటమున నయిదు ప్రకరణములు గలవు 1 కవి—కవిత్వము 2. ఆంధ్రకవుల కవితామతములు 3 ఆంధ్రలాక్షణికులు—కవిత్వతత్త్వము 4. యుగవిభాగము 5. ఆంధ్రకవితాపోషకులు.

ఇందుఁ బ్రథమప్రకరణమునఁ గవికిని గవిత్వమునకును గల సంబంధము, పాశ్చాత్యపద్ధతుల ననుసరించి వివరింపఁబడినది- కవిత్వస్వరూపము, భావనాశక్తి, రసపోషణము మొదలగునవి నిరూపింపఁబడినవి. కీట్సు, జాన్సను, మేద్యూ ఆర్నాల్డు, కోలిరిడ్జి మొదలగు నాంగ్లకవుల మతములు దెలుపఁబడినవి. ఈప్రకరణము కవిత్వచరిత్రమునుఁ జర్చించునదికాదు. ఆంగ్లమున (Rhetoric) కవిత్వతత్త్వవిచారమను భాషావిభాగమునకుఁ జెందియున్నది. ఈగ్రంథము కవిత్వచరిత్రమునఁ బ్రథమభాగ మగుటచేఁ గవి దీని నిటఁ జేర్చియుండవచ్చును. మఱియు నాంధ్రకవిత్వచరిత్రమును వ్రాయుచుఁ బాశ్చాత్యభావముల ననుకరించుటకంటె గ్రంథకర్త కవిత్వతత్త్వలక్షణముల నాంధ్రభాషకు మార్గదర్శినియగు సంస్కృతభాషనుండి కైకొని రచియించిన బాగుగ నుండియుండు నని తోఁచుచున్నది. ఆంధ్రగ్రంథములు సంస్కృతమందలి యలంకారగ్రంథముల ననుకరించుచున్నవి. కవికిని, గవితకును గలయవినాభావసంబంధమును, గవిత్వప్రయోజనములను ముందు వివరించి తరువాతఁ గవిత్వప్రధానము లగు శబ్దార్థములు, అలంకారములు, శైలి, రీతి, పాకము, ధ్వని, గుణదోషములు సోదాహరణముగ నీప్రకరణమునఁ జర్చింపనగును.

ద్వితీయప్రకరణమున నాంధ్రకవుల కవితామతములు నిరూపింపఁబడినవి. పాశ్చాత్యకవులవలెఁ గాక యాంధ్రకవులు తమతమగ్రంథములయందు సుకవిప్రశంస, కుకవినిందయు నొనర్చి కవిత్వతత్త్వమును వివరించియున్నారు. ఈప్రకరణ మింకను విపులముగ నుండి నన్నయాదులకాలమునుండియుఁ గవిత్వస్వరూప మెట్టిమార్పులఁ జెందినదియుఁ దెలుపవలయును ఏయేకవు లేయేగుణముల మెచ్చిరో వానిని స్థాలీపులాకన్యాయముగఁ జర్చింపవలయును. ఈప్రకరణము పింగళి సూరనార్యుని కవితాలక్షణముతో సమాప్తము నొందుచున్నది. తరువాతి కవులప్రశంస గానరాదు.

తృతీయప్రకరణమున లాక్షణికులకుఁ గవులపైఁ గలగౌరవభావములు, వా రొనర్చినకవిత్వలక్షణ నిరూపణము, సప్తవిధకవి స్వరూపము వర్ణింపఁబడియున్నవి. చతుర్థప్రకరణమున యుగవిభాగ మొనర్పఁబడినది. గ్రంథకర్త యాంధ్రకవిత్వము నజ్ఞాతయుగము, నన్నయయుగము, తిక్కనయుగము, ఎఱ్ఱనయుగము, పోతనశ్రీనాథయుగము, పెద్దనయుగము, వీరేశలింగయుగము నని విభజించియున్నాఁడు. కవులను వారికాలమును యుగవిభాగమునం దాధారముగఁ గైకొనక రాజులంబట్టియే యుగముల నేర్పఱుచుట సరి కా దని గ్రంథకర్త తెలిపియున్నాఁడు. పెద్దనను మార్గదర్శకునిగఁ గైకొని ప్రబంధములఁ దరువాతికవులు రచియించినను, పెద్దన మొదలు వీరేశలింగయుగము వఱకుఁ గలయంతరమునింకను (వేర్వేఱు) యుగములుగ విభజన మొనరింపవలయును.

పంచమప్రకరణమున గ్రంథకర్త యాంధ్రకవితాపోషకులను గూర్చి వ్రాసియున్నాఁడు. కవిత్వచరిత్రమున యుగవిభజన మొనర్చి, యేయుగచరిత్రమున నాయుగమునందలి కవిత్వపోషకులజీవితమును వివరించినచో సమంజసముగ నుండును. ప్రతియుగచరిత్రమునందును (1) కవులు వారిగ్రంథములు. (2) కవిత్వపోషకులు (3) కవితాలక్షణములు మొదలగువిషయముల వేర్వేఱు ప్రకరణములఁ జర్చింపవలయును.

ఈగ్రంథమును రచించుటయందు గ్రంథకర్తకుఁ గలయాశయము కవులను వారిగ్రంథములను మాత్రము పేర్కొనిన కవులచరిత్రములయందలి కొఱంత దీర్చుటయే. కవిత్వలక్షణము లెట్టిమార్పులను బొందినవి యు, వాని గుణదోషములును నిష్పక్షపాతబుద్ధితో వివరింపఁ గడంగుటయే విమర్శకుని పని. అట్టియుదారస్వభావముతో గ్రంథకర్తగారు మిగిలినభాగములరచియించియా

ధ్రకవిత్వచరిత్రమును బూర్తిచేయుదు రని విశ్వసించుచున్నారము. ఆంధ్రకవిత్వ చరిత్రమును నూతనాదర్శములతోఁ వ్రాయుటకు యత్నించిన గ్రంథకర్తగారి యుద్యమ మెంతయుఁ బ్రశంసనీయము.

---

కాళిదాసుని జన్మస్థానము:—లక్ష్మీధరపండిత విరచితము. (The Birth place of Kalidasa by Pandit Laksmidhar, Lecturer St. Stephen's College—Delhi—Delhi University Publication No. 1)

సంస్కృతవాఙ్మయాభివృద్ధికరులలో నగ్రగణ్యుఁ డగు కాళిదాసమహాకవి దేశకాలాదికము లింకను నిదమిత్థ మని నిర్ణయింపఁబడి యుండలేదు. పాశ్చాత్యులు సంస్కృతవాఙ్మయమును బాగుగఁ బరిశీలించి సంస్కృతకవుల దేశకాలాదులను దాము రచించిన వాఙ్మయచరిత్రములందును వ్యాసములందును జర్చించియున్నారు. ప్రాచ్యపాశ్చాత్యపండితు లీవిషయముల నింకను విమర్శించుచున్నారు. అట్టిసందర్భమున నీగ్రంథము సంస్కృతవాఙ్మయపరిశోధకుల కవశ్య మాదరణీయ మనుటకు సందియము లేదు. ఢిల్లీవిశ్వవిద్యాలయమునఁ దామిచ్చిన యుపన్యాసమును లక్ష్మీధరపండితు లీగ్రంథరూపమున సప్రమాణములతోఁ బ్రకటించియున్నారు. మహాకవికాళిదాసు కాశ్మీరదేశమునఁ బ్రస్తుతము మణిగా మనఁబడు మణిగ్రామమున జన్మించియుండనోపు నని నిర్ణయ మొనర్చియున్నారు. గ్రంథకర్తయొక్క యభిప్రాయము లిచట సంగ్రహముగ నిరూపింపఁబడినవి. ఈక్రిందివిషయములు సప్రమాణముగఁ జర్చింపఁబడినవి.

(1) కాళిదాసునిగ్రంథముల హిమాలయపర్వతములును, ఉత్తరకాశ్మీరమును, సింధునదీప్రాంతభూములును విశేషముగ వర్ణింపఁబడినవి. కుమారసంభవమునందలి శివునియాశ్రమము (ప్రాంతేషు సంసక్తనమేరుశాఖం ధ్యానాస్పదం భూతపతే ర్వివేశ- కు. సం. 3-43) ను కాశ్మీరమునందలి భూతేశ్వరతీర్థమనియు, దేవదారువనముతోడను గంగాప్రపాతముతోడను నొప్పు వసిష్ఠాశ్రమమును భూతేశ్వరతీర్థమునకు రెండుమైళ్ళదూరమునఁ బ్రస్తుతము 'వంగత్' అనుగ్రామ మనియు, హారముకుటపర్వతమే హిమాలయప్రస్థ మని వర్ణింపఁబడిన దనియు, కనకవాహినియే గంగ యనియు, గ్రంథకర్త యీభాగమున నిర్ధారణ మొనర్చియున్నాఁడు. ఇందులకు నీలమతపురాణ, విక్రమాంకదేవచరిత, రాజతరంగిణ్యాదిగ్రంథములనుండి ప్రమాణములు గైకొనఁబడినవి.

మఱియు నభిజ్ఞానశాకుంతలమున సప్తమాంకమున వర్ణింపఁబడిన కాశ్యపాశ్రమము కాశ్మీర మని యు, కాశ్మీరదేశమునకుఁ గశ్యపప్రజాపతియే సృష్టికర్త యనియుఁ దెలుపఁబడినది. మూలమున లేని కాశ్యపాశ్రమమును కవి వర్ణించియుండుటచే గవియొక్క దేశభక్తి విదిత మగుచున్న దని యు, 'స్వర్గా దధికతరం నిర్వృతిస్థానం అమృతహ్రదమివ అవగాఢోస్మి' యనుచోఁ బ్రథమమునఁ గాశ్మీర మొకసరస్సుగ నుండె ననుస్థలపురాణవిషయము దెలుపఁబడినదనియు, "కతమో యం పూర్వాపరసముద్రావగాఢః కనకరసనిస్యందీ సాంధ్యయివ మేఘపరిఘః సానుమా నవలోక్యతే" యనుచో హారముకుట పర్వతకనకవాహినీ నదులు వర్ణింపఁబడిన వనియు గ్రంథకర్త యభిప్రాయము.

(2) కాళిదాసు వర్ణించిన మాలినీసింధునదులును శచీసోమశక్రావతార తీర్థములును గాశ్మీరదేశమునందలి వని నిశ్చయ మొనర్పఁబడినది. రఘువంశమున వర్ణింపఁబడిన కుముదనాగమును, నికుంభవృత్తాంతమును (కుంభోదరం నామనికుంభమిత్రమ్—రఘు 2-35) నీలమతపురాణాదులయందుఁ గానవగు చున్నవి- రఘువంశమున (4-67; 4-73) వర్ణితము లగుసింధుగంగానదులును మేఘసందేశమునందలి (ఉత్తరమేఘ- 4) మందాకినియుఁ, గాశ్మీరదేశమునందలి కృష్ణగంగయే యని గ్రంథకర్త నిరూపించియున్నాఁడు.

(3) a 'వధూముఖక్లాంత యవావతంస ఆచారధూమగ్రహణాదభూవ' అని కు. సం. (VII-82) నందును, వధూముఖం పాటలగండలేఖ మాచారధూమగ్రహణాదభూవ' అని రఘువంశమునందును (VII-27) వర్ణింపఁబడినతావులఁ గాశ్మీరదేశమున లాజహోమానంతరము ధూమము నాఘ్రాణించు నాచారము వివరింపఁబడిన దని గ్రంథకర్త యుద్దేశించియున్నాఁడు.

(b) ఇందుమతీ స్వయంవరఘట్టమునందు (రఘు. 6-83) మంగళపుష్ప మాలను దాధాత్రిచే నిందుమతి యజునికంఠమున వేయించినటులు గాన వచ్చుచున్నది కాశ్మీరదేశమునందు, వివాహసమయమున, వధువుయొక్క తల్లిగాని మఱి యొకరు గాని వధూవరుల శిరస్సులయందు మంగళమాలను గట్టుట యాచారమైయున్నది. అదియే యిటవర్ణింపఁబడినదని గ్రంథకర్త యభి ప్రాయము.

(c) మాళవికాగ్నిమిత్రమునందు మాళవికయొక్క నాట్యకళాకౌశల

ము వర్ణింపఁబడినది. కుమారసంభవమునం దప్సరఃస్త్రీల నాట్యప్రయోగము సూచింపఁబడినది.

అపశ్యతా మప్సరసాం ముహూర్తం ప్రయోగమాద్యం లలితాంగహారమ్. (కు. సం. 7-91.)

బిల్హణమహాకవియు విక్రమాంకదేవచరితమున స్త్రీల నాట్యకౌశలమును వర్ణించియున్నాఁడు. ప్రాచీనకాలమునఁ గాశ్మీరమున స్త్రీలు నాట్యకళాదులఁ గుశల లనియు, వారు సంస్కృతప్రాకృతముల నేర్చియుండిరనియుఁ జరిత్రకారులు వ్రాయుచున్నారు.

"ద్విధాప్రయుక్తేన చ వాఙ్మయేన సరస్వతీ తన్మిథునం నినాయ" అని కుమారసంభవమునందును (7-90)

యత్ర స్త్రీణామపి కిమపరం జన్మభాషావ దేవ
ప్రత్యావాసం విలసతి వచః సంస్కృతం ప్రాకృతంచ

అని విక్రమాంకదేవచరితమునందును (18-6) వర్ణింపఁబడిన తావులఁ గాశ్మీరదేశస్త్రీల సంస్కృతప్రాకృతభాషాజ్ఞానము నిరూపింపఁబడిన దని గ్రంథకర్త తెలిపియున్నాఁడు.

(d) మఱియు శాకుంతలనాటకములో షష్ఠాంకమున ధీవరవృత్తి నిందింపఁబడినది.

ధీవరః—అహం శక్రావతారాభ్యంతరవాసధీవరః—జాలోద్గాలాదిభి ర్మత్స్యబంధనోపాయైః కుటుంబభరణం కరోమి—

శ్యాలః—విశుద్ధ ఇదానీం ఆజీవః—

ధీవరః—సహజం కిల య ద్వినిందితం నఖు త త్కర్మ వివర్జనీయమ్
పశుమారణకర్మదారుణః అనుకంపామృదు రేవ శ్రోత్రియః

కాశ్మీరదేశమున ధీవరవృత్తి నీచకను మని గర్హింపఁబడుచున్నది. ఈశ్వరప్రత్యభిజ్ఞానవిమర్శిని యనుగ్రంథమున లోకముఖపారమ్పర్యప్రతిష్ఠితంబులైన కొన్నియాచారములు గల వని తెలుపుసందర్భమున "యథా కాశ్మీరే ధీవరస్య పరిహారః ప్రసిద్ధః తస్య జీవితస్య మత్స్యమారణాభ్యాసేన పాపిష్ఠత్వాత్" అని స్పష్టముగఁ దెలుపఁబడినది—

(e) కాశ్మీరమునందుఁ గల సూర్యోపాసనను కాళిదాసుని గ్రంథములందు సూచింపఁబడినది.

సూర్యనివిష్టదృష్టిః—(ర. వం. 14-66.)

అనన్యదృష్టిః సవితార మైక్షత (కు. సం. 5-20 )

యత్రస్థాణురి వాచలో మునిరసా వభ్యర్కబింబం స్థితః (శా. 7-11.)

ఇహ భగవతః సూర్యస్య పాదమూలోపస్థానం వర్తతే—(విక్రమో. అంక 4 )

(f) కాళిదాసు తనగ్రంథములఁ గాశ్మీరాంగరాగమును వర్ణించుటచే తను స్త్రీలు హేమంత, శిశిరవసంతర్తువులయందుఁ దమస్తనప్రదేశములఁ గుంకుమలేపనమును గావింతు రని వర్ణించుటచేతను, గాశ్మీరదేశము సూచింపఁబడి నదని గ్రంథకర్త యభిప్రాయము.

మనోహరైః కుంకుమరాగరక్తైః—(ఋ. సం. 4-2)

పయోధరైః కుంకుమరాగపింజరైః—(5-9)

రక్తాంశుకైః కుంకుమరాగగౌరైః —(6 5)

ప్రియంగు కాలీయకకుంకుమాక్తం—(6-13.)

బిల్హణుఁడును విక్రమాంకదేవచరితమున (18-10) 'స్నానక్రీడావ్యసన సమయే కుంకుమం కామినీనాం' అనుశ్లోకము నీవిషయమునే సూచించియున్నాఁడు. మఱియు,

'సహోదరాః కుంకుమకేసరాణాం భవన్తి నూనం కవితావిలాసాః నశారదాదేశ మపాస్య దృష్ట స్తేషాం యదన్యత్ర మయా ప్రరోహః—(విక్రమాంక. 1-21.) అని కాశ్మీరదేశప్రశస్తిని గావించి యున్నాఁడు.

రఘువంశమున రఘుమహారాజు జైత్రయాత్రాసదర్భమున నాతని హయమును "లగ్నకుంకుమకేసరాన్" అని కవి వర్ణించియున్నాఁడు. కాశ్మీరదేశమునఁ దక్క మఱియెచట నిది సంభవింప దని గ్రంథకర్త యభిప్రాయము.

కాళిదాసునిమతము- కాశ్మీరప్రత్యభిజ్ఞానశైవము.

జగద్గురుశంకరాచార్యులకుఁ బూర్వమే కాశ్మీరదేశమున శైవము ప్రబలియుండెను. కాశ్మీరశైవమునందు ఆగమ, స్పంద, ప్రత్యభిజ్ఞానశాస్త్రములను విభాగములు కలవు. అందుఁ బ్రత్యభిజ్ఞానతత్త్వము క్రీ. శ. 9 వ శతాబ్దమున సోమానందునిచే బాగుగ వివరింపఁబడినను, ప్రథమమునుండియుఁ గాశ్మీరశైవమునఁ బ్రత్యభిజ్ఞానవాదము గానవచ్చుచున్నది.

సర్వభూతాంతరాత్మ యగుమహేశ్వరుం డొక్కఁడే యనియు, (నశివః

శక్తిరహితో వశక్తి ర్వ్యతిరేకిణీ' యనినటులు ఆతనిశక్తిచే నిచ్ఛామాత్రమున నీచరాచరప్రపంచము సృష్టింపఁబడిన దనియు, మహేశ్వరుఁడే జీవస్వరూపమును బొంది యుంటచే నాతని శక్తి తిరోధానమును జెందిన దని యు, సంసారనాట్య ప్రవర్తితుఁడగు పరమేశ్వరుఁడు విస్మృతిచే ప్రత్యభిజ్ఞానమును పొందు ననియు నీమతము దెల్పుచున్నది. పరమార్థసారగ్రంథవ్యాఖ్యాత యగు యోగరాజు ప్రత్యభిజ్ఞానశైవమును సంగ్రహముగ నిటులు దెలిపియున్నాఁడు.

యేకేనాపి ఆశయవశేన శాపాదినానా మూఢః సంతోపి, ప్రాగభ్య
స్తస్వాత్మజ్ఞానవాసనా ప్రబోధానుగృహీతాః స్వాత్మస్థితించ లభంతే-
సర్వేస్వాత్మమహేశ్వర ప్రత్యభిజ్ఞానాత్ తన్మయా భవంతి-

ఈసిద్ధాంతమునే శాకుంతలమునఁ, గాళిదాసు సూచించె నని గ్రంథకర్త విపులముగఁ జర్చించియున్నాఁడు. "ఆత్మని సతతం భాత్యపి, మోహాదావృతే ఇవ పునరాభిముఖ్యేన జ్ఞానమ్ ప్రత్యభిజ్ఞానం" అని ఈశ్వరప్రత్యభిజ్ఞానవిమర్శనియందుఁ దెలుఁపబడియున్నది.

శాకుంతలమునఁ బ్రత్యభిజ్ఞాన మనుపద మనేకపర్యాయము లుపయోగింపఁబడినది. అభిజ్ఞానశాకుంతల మనుగ్రంథనామమే ప్రత్యభిజ్ఞానవాదమును స్ఫురింపఁజేయుచున్నది.

కింతు ప్రత్యభిజ్ఞానాదర్శనేన శాపోనివర్తిష్యతే-
సఖి యది నామ స రాజా ప్రత్యభిజ్ఞానమంథరో భవేత్"
తతస్త్వాం భర్తా అభిజ్ఞాస్యతి............
అథవా ఈదృశోనురాగోభిజ్ఞాన మపేక్షతే
త్వయా ప్రత్యభిజ్ఞాత మాత్మానం పశ్యామి.

గ్రంథకర్త (పు 26-39) విపులముగఁ బ్రత్యభిజ్ఞానసిద్ధాంతములను దెలిపి కవిశిరోమణి యగుకాళిదాసు తనమతమును నీగ్రంథమున మనకు సూచించె నని సోదాహరణముగను, సప్రమాణముగను జర్చించియున్నాఁడు.

(5.) కాళిదాసు - మేఘసందేశము.

మేఘసందేశమునందు, కాళిదాసు తనయనుభవమునే వర్ణించె ననియు, కథానాయకుఁ డగుయక్షుఁడే కాళిదా సని యుఁ, గాశ్మీరదేశము ప్రథమము నుండియు యక్షులకు నివాసస్థాన మని ప్రతీతి యని యు, యక్షధార, యక్షగ్రామము మొదలగు ప్రదేశము లింకను గాశ్మీరమునఁ గల వని యు, నీప్రకర

ణమున గ్రంథకర్తచేఁ దెలుపఁబడినది. బిల్హణకవి వర్ణించినటులు కాశ్మీరమునం దలి యభ్రంలిహాగ్రము లగు సౌధములను, వాతాయనములను, వాపీకూపాదులను, క్రీడానగములను కాళిదాసు వర్ణించియున్నాఁడు. గాళిదాసు కాశ్మీరదేశస్థుం డని యిట్టివర్ణనములు సూచించుచున్నవి. ఉత్తరమేఘమునఁ గాళిదాసు తనగృహమును వర్ణించియున్నాఁ డనియు, కైలాసమును, గంగానదియు, హారముకుటపర్వతము కాశ్మీరగంగయు ననియు, గ్రంథకర్త యభిప్రాయము.

పూర్వోదాహృతవిషయములను సప్రమాణముగఁ జర్చించి గ్రంథకర్త కాళిదాసుని జన్మస్థానమును స్థిరపఱిచియున్నాఁడు. ఈగ్రంథమునఁ బ్రథమభాగమున విషయసిద్ధాంతీకరణమును, అనుబంధమునఁ గాళిదాసకృతగ్రంథములనుండియు నితరగ్రంథములనుండియు నుదాహరణాదికములు నొసంగఁబడినవి. విశేషపరిశ్రమ మొనర్చి రచించిన యీగ్రంథము సంస్కృతవాఙ్మయపరిశోధనమునకు నూతనమార్గమును జూపించుచున్నది గ్రంథకర్తయభిప్రాయములతో మనము సంపూర్ణముగ నేకీభవింపక పోయినను, గ్రంథ మమూల్యమనుటకు సందియము లేదు. సంస్కృతభాషాభిమాను లెల్లరును నీగ్రంథమును జదివి యందలివిషయములను సవిమర్శముగఁ గైకొనఁగోరుచున్నాము.

---

ప్రతాపరుద్రచరిత్రము—ఒకవచనము—ఏకామ్రనాథవిరచితము—దీనిని గొంతకాలముక్రిందట పరిషత్పత్రికలోఁ బ్రకటించితిమి. కాని ప్రత్యేకప్రతులు తీయలేదు. ఆగ్రంథమే వరంగలు శైవప్రచారిణీగ్రంథమాలయందు మూఁడవయనుబంధముగాఁ బ్రకటింపంబడినది సంపాదకులు శ్రీకొడిమేల రాజలింగారాధ్యులవారు-పరిషత్పత్రికలోకంటె నిందు విషయసూచిక కథావివరణము చేర్పఁబడినది. మ॥ రా॥ బొల్లం నాగలింగముగారి ప్రతినిబట్టి మొదటిదానిలో లేని విశేషములు, అనుబంధముగా 4 పుటలు చివరఁ జేర్పంబడియున్నవి. కూచిమంచి జగ్గకవిగారి సోమదేవరాజీయ మీకథకే పద్యరూపకము. అది పూర్తిగా దొరకుటలేదు.　　　దీనివెల రు 0—12—0

---

ఛత్రసాలుఁడు—(రెండవభాగము) అనువాదకులు ప్రతివాదిభయంకరం రంగాచార్యులుగారు, కొంపెల్ల జనార్దనరావుగారును- శ్రీయుత బాలచంద్ నానాచంద్ షాహావకీలుగారు మూలలేఖకులు- పిఠాపురము, ఆంధ్రప్రచారిణీగ్రంథమాలలో నిది 57 వ పుష్పము-　　　వెల రు 1—8—0

---

ప్రసవములలోఁ బ్రథమసహాయము:— గా॥ డాక్టరు యం. రామారావుగారు రచించినది. 223 తంబుచెట్టివీధి, మదరాసు శ్రీకృష్ణా బ్రదర్సువారు ప్రకాశకులు. వెల రు 0-6-0 ప్రసవములను గూర్చిన విషయములను మామూలుమాటలలో సులభముగా స్త్రీలకు బోధపడురీతిని ముఖ్యముగా స్త్రీలకు వివరించుటకే యీగ్రంథము వ్రాయఁబడెను. అవసరముగా ప్రసవము గలిగినపుడు డాక్టరుగాని మంత్రసానిగాని వచ్చులోఁగా చేయవలసినపని మాత్రమే దీనియందు వివరింపఁబడెను. ఈగ్రంథ మనేకభాషలలో ముద్రింపఁబడినది. ఇట్టిపుస్తకమును గృహస్థులు సంగ్రహించి యుంచుకొనుటమంచిది.

---

శ్రీహనుమచ్ఛతకము—ఎఱ్ఱమిల్లి సూర్యప్రకాశకవివిరచితము. కవిగారిమునిమనుమఁ డగు మ॥ సుబ్బారాయఁడుగారు ప్రచురించిరి. సీసపద్యములు. వాడ్రేవు కృష్ణయాఖ్యవిభున కీశతకము కృతి యిచ్చి కొన్నిపద్యములలో "కృతిపతి యగువాడ్రేవుకృష్ణయాఖ్యవిభునకు భవద్దయఁ బ్రశస్తి వెలయుఁ గాక, వార్ధిలంఘనసంరంభ వాయుడింభ" అనియు, వాడరేవుకులాబ్ధి జైవాతృకుఁడగు, కృష్ణయాభిఖ్యు దయను రక్షింతుగాక, "వార్ధిలంఘన సంరంభ వాయుడింభ" అని యు నిట్లుగడించినాఁడు. "వాయుడింభ" యని మకుట మున్నను హనుమచ్ఛతక మని పేరు సర్వత్ర వాడినారు. వాడరేవా ఓడరేవా? "వాడరేవునకును వడ్లమన్నాటికి- అని వసురాయకవిగారు" ఓడరేవును వాడరేవనుట యర్థభేదములో సరిపుచ్చుకొనవచ్చును- ఈవాడ్రేవు కృష్ణయామాత్యుఁడు "రాజమహేంద్రవరంబు సన్నిధానసీతానగరావనికిని, బ్రభువై యచటనుండు" నని 9 వ పద్యము చెప్పుచున్నది. ఇక్కవి శ్రీవత్ససగోత్రుఁడు, సుబ్బయ్యకు సూరమాంబకుఁ బుత్త్రుఁడైనట్లు 15 వపద్యము చెప్పుచున్నది. ఒక్కపద్యము శైలికై చిత్తగింపుఁడు.

సీ. ఘోటీభవచ్చరణాటీ నోచ్చత్కోటీరభాభ్యదిక్కోటికంబు
రోషానలస్ఫురత్ప్రేపార్భటీరణదాభపాబ్ధఘోషకంబు
హుంకారసంకరాహంకార విస్ఫారటంకారవికలితాటంకకంబు
చాపధికోజ్జ్వలద్రోపాగ్ని హేతివిక్షేపభియాతిహృత్తాపదంబు
నైన రామానుజోద్ధతయానమునఁగి, పీనులను గూర్చి వచ్చి యాతనికి మొక్కి-
సాత్త్వికుని జేసితివి మైత్రిసరణి దనర, వార్ధిలంఘనసంరంభ వాయుడింభ.

దీనివెల రు 0—2—0

# సాహిత్యరత్నాకరము, నౌకామన్దరములు.

—యీయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులుగారు—

---

ఆలంకారికసార్వభౌముఁడు మహామహోపాధ్యాయ* బిరుదాభిరాముఁడు, పదవాక్యప్రమాణపారావారపారీణుఁడు, విద్వత్కవికంఠీరవుఁడు నగు వారణాసి ధర్మసూరిమహాకవింగూర్చియుఁ దత్కృత''సాహిత్యరత్నాకరముం" గూర్చియు మామిత్రు లగు శ్రీరంగము సోమేశ్వరశాస్త్రిగారు (Member—Telugu-Sanskrit Academy—Vizianagaram) జయసంవత్సరాంధ్రపత్రికాసంవత్సరాదిసంచికలో (March 1926—Pages —102) నొకవ్యాసముం బ్రచురించియుండిరి వా రందు సాహిత్యరత్నాకరవ్యాఖ్య యగు "మందరము"ను మాత్రము సూచించిరి; కాని తదితరవ్యాఖ్యానములంగూర్చియు వ్యాఖ్యాతలంగూర్చియు నేమియు వ్రాయలేదు. కావున నిట నేను సాహిత్యరత్నాకరవ్యాఖ్యాతలను, దద్వ్యాఖ్యానములను గుఱించి వ్రాసెదను. చెరుకూరి కొండుభట్టసూనుఁడును, అలంకారరాఘవము, అలంకారసూర్యోదయమును రచించినవాఁడు నగు యజ్ఞేశ్వరదీక్షితుఁడు కూడ "సాహిత్యరత్నాక"రాభిధాన మగు నొకయలంకారగ్రంథమును రచించె నని యెఱుంగునది.

ధర్మసూరికాలము:—ఇట ధర్మసూరికాలము దిఙ్మాత్రము సూచించెద. ఇతఁడు క్రీ. శ. 1400—1700 కు నడుమను జీవించి యుండె ననుటకంటెఁ బ్రకృత మాధారములు లేవు. దాక్షిణాత్యాలంకారికుఁడును, "కృష్ణరాజయశోడిండిమ" ప్రణేతయు నగు ననన్తార్యుఁడు తన "కవిసమయకల్లోలము"లో, విద్యానాథుని ''ప్రతాపరుద్రయశోభూషణము"నుండి యు, ధర్మసూరి "సాహిత్యరత్నాకరము" నుండి యు, నరసింహకవి "నఞ్జరాజయశోభూషణము" నుండి యుఁ గొన్నియుదాహరణములఁ గైకొనెను. (Vide A Descriptive catalogue of Skt. M. S. S. In the Govt. Oriental M. S. S. Library Madras. Vol. XXII. Rhetoric, & Poetics Music & Dancing & Silpasastra. 1918, Ref. No. 12808) శివరామసుధీమణిసూనుఁ డగునీ నరసింహకవి కోకిలము నంజరాజకల్పమహీరుహము నాశ్రయించి తత్ప్రభుయశోఘనసారసురభితంబుగ "నంజరాజయశోభూషణ" మను నలంకారగ్రంథము

---

* చూ. సాగర(బ్రహ్మ)ప్రతి పుట, ౩౨౦.

రచించెను. ఈయలంకారనాయకుఁ డగునంజరాజు క్రీ. శ. 17 వ-శతాబ్దారంభమున విలసిల్లి యుండెను. కావున నరసింహాకవి యు నాకాలముననే జీవించియుండె ననుట యంత సత్యదూరము గాదు. ఈ గ్రంథమును దన "కవిసమయకల్లోలము"లో నుదాహరించికొనియుండుటచే ననన్తార్యుఁడు నరసింహాకవి కంటె నర్వాచీనుఁ డని తెలియుచున్నది.

ధర్మసూరి "సాహిత్యరత్నాకరము"లో

"శ్లో. అలంక్రియాః పూర్వతరైః ప్రణీతా నయోజితాః కాశ్చన నాయకేన
కైశ్చిత్తు కుక్షింభరిభి ర్నిబద్ధాః క్షోదీయసా కాశ్చన నాయకేన." 1-16

అనుశ్లోకమును నరాంకితముగఁ "బ్రతాపరుద్రీయము"ను రచించినవిద్యానాథుని నిందించి స్వగ్రంథవైశిష్ట్యముం బరిహరించికొనెను. పిమ్మట స్వగ్రంథవైలక్షణ్యము నిట్లు చెప్పికొనెను.

"శ్లో. దివ్యే నోత్తమనాయకేన ఘటితా సేయం మమాలంకృతి
స్సద్వృత్తాకృతినా విదేహతనయాః క్షోరుహాస్థాయినా
తత్తాదృగ్దశకంఠకీర్తిపయసో వైల్యావహశ్రీజుషా
నిస్త్రాసీన మహేన్ద్రనీలమణినోదారేణ సంశోభతే" 1 త. 17 పుట.

శ్రీరామచన్ద్రయశోఘనసారసురభీకృత మగుటఁ దన గ్రంథము సర్వసహృదయహృదయాహ్లాదముం గలుగఁజేయు నని కవి వ్రాయుచున్నాఁడు;

"శ్లో. కావ్యామృతాకలనయా మృదుశీతలాని
శ్రీరామదివ్యయశసా సురభీకృతాని
యేషాం మనాంసి ఘనసారసమాని తేషా
మేషాకృతి ర్వితనుతాం కమపి ప్రహర్షమ్." 1 త. 18 పుట.

ధర్మసూరి నరాంకితదూషితమగు "ప్రతాపరుద్రీయము"ను దత్ప్రణేతను నిరసించియుండుటచే ధర్మసూరి, క్రీ. శ 13 వ-శతాబ్దాంతిమభాగమునను, 14 వ-శతాబ్దారంభమున జీవించియుండిన విద్యానాథునికంటె (Dr. S. K. De's "History of Sanskrit Poetics." Vol. I P. 230.) నవీనుఁ డని తెలియుచున్నది. "ప్రతాపరుద్రీయము" క్రీ. శ. 14 వ-శతాబ్దము— ప్రథమపాదమున—క్రీ. శ. 1400—1425) రచింపఁబడెను. (Vide Prof. Panduranga Vamana Kane's "History of Sanskrit Poetics." Page CXIX కావున ధర్మసూరి క్రీ. శ. 1425—1700 లో జీవించియుండె ననుటకంటెఁ

ప్రకృత మేమియు నిదమిత్థ మని చెప్పఁజాలము.

'సాహిత్యరత్నాకరము' 10 తరఙ్గములుగా విభజింపఁబడియున్నది. తద్విమర్శనమును సోమేశ్వరశాస్త్రిగారి వ్యాసమునం గనఁదగు.

ధరస్మూరి:—1. నరకాసురవిజయవ్యాయోగము, 2. కంసవధనాటకము, 3 శ్రీకృష్ణ(ష్ణా) స్తుతి, 4 రవిశతకము, 5 ప్రాకృతహంససందేశము, 6 బాలభాగవత కావ్యము, ఈకావ్యమందారదామముచే గీర్వాణవాణీగ్రీవము నలంకరించెను. పైగ్రంథములలో "నరకాసురవిజయము" వావిళ్ల రామస్వామిశాస్త్రిగారిచే మొట్టమొదట 1864 వ-సంవత్సరములోను, పిమ్మట 1835 వ-సంవత్సరములోను ముద్రిపఁబడెను. దీనినే స్వర్గత మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నకవిగా రాంధ్రీకరించిరి. బాలభాగవత కావ్యము, నరకాసురవిజయములో నుదాహరింపఁబడెను. తక్కిన నాలుగు గ్రంథములు, వ్యాయోగము కూడ "సాహిత్యరత్నాకరము"లో నుద్ధరింపఁబడినవి. స్వర్గీయ శ్రీసరస్వతి తిరువేంగడాచార్యసూరి, ధరస్మూరి "సాహిత్యరత్నాకరము" ను మల్లాది లక్ష్మణసూరినిర్మిత "మందర" వ్యాఖ్యాయుతముగ నాంధ్రలిపిలో, క్రీ. శ. 1871 వ-సంవత్సరము, ఏప్రిల్ నెలలోఁ జెన్నపురసరస్వతీనిలయముద్రాక్షరశాలయందును, క్రీ. శ. 1885 సంవత్సరమున మరల దానినే నెల్లూరుపురమునను ముద్రించిప్రకటించియున్నారు. క్రీ శ. 1901 లో 'బమ్రా' (Bamra in Orissa) సంస్థానాధీశులు ధరస్మూరి "సాహిత్యరత్నాకరము"ను దమరాజసభాసదు లగు పండిత శ్రీ మధుసూదనమిశ్రశర్మగారు రచించిన "నౌకా" టీకాన్వితముగ 'సుధల' (Sudhal Press) యన్త్రాలయమున నాగరలిపిలో ముద్రింపించి ప్రకటించిరి.

"సాహిత్యరత్నాకరము"నకు మూఁడువ్యాఖ్యలు గలవు. 1. నౌకాటీక. చర్ల వేంకటసూరినిర్మితము. (అముద్రితము) 2. నౌకాటీక. మధుసూదనమిశ్రకృతము (ముద్రితము) 3. మందరవ్యాఖ్యానము:-మల్లాది లక్ష్మణసూరిరచితము. (ముద్రితము.)

ఈవ్యాఖ్యాకారులను దత్కృతులను గూర్చి యించుక యరయుదము. ఈవ్యాఖ్యలలో వేంకటసూరికృత 'నౌకా" వ్యాఖ్య ప్రాచీనతమము. దీనితరువాత లక్ష్మణసూరి "మందరము"ను సృజించెను. మధుసూధనమిశ్రకృత "నౌకా" టీక "మందరము"కంటె నవీనము.

చర్ల వేంకటసూరి: "నౌకా" వ్యాఖ్యా.

ఈయముద్రితవ్యాఖ్యయొక్క వ్రాఁతప్రతులు మద్రపురప్రాచ్యలిఖితగ్రంథాలయమునఁ గలవు. (Vide: "Triennial Catalogue of Mss." 1910—13. Vol. I Part 1 Skt. B., No. 444, page 649, and Ibid 1913—16 Vol. II Part 1, Skt. A., No. 814; page 1089—Madras Oriental Mss. Library, as well as the "Descriptive Catalogue of Skt. Mss. in the Madras Oriental Mss. Library Vol. XXII.

వేంకటసూరి చర్లవంశోత్పన్నుఁడు, బ్రహ్మానన్తార్యాణికిఁ బౌత్త్రుఁడు; లక్ష్మణసూరికి సూరమాంబకును బుత్త్రుఁడు; వేంకటాచార్యశిష్యుఁడు. వేంకటసూరి లబ్ధాశేషకళావిశేషవిభవుఁ డగుకవిగ్రామణి యని యీక్రింద నుటంకించు శ్లోకములవలనఁ దెలియఁగలదు.

"నౌకా" టీకాప్రారంభశ్లోకములు:—

శ్లో. శ్రీచర్లాన్వయలక్ష్మణాఖ్యవిబుధః శ్రీసూరమాంబాపతేః
జాతః సర్వబుధేన్ద్రమాన్యమహిమః శ్రీవేఙ్కటార్యాద్గురోః
లబ్ధాశేషకలావిశేషవిభవః శ్రీవేఙ్కటాఖ్యో బుధః
సంతుష్ట్యై వివృణో మ్యహం సుమనసాం సాహిత్యరత్నాకరః.

శ్లో. అస్మాకీనజనోఽయమి త్యతికృపాం విన్యస్య నిత్యం మయి
వ్యాలంబ్యేతది(ంబైవమి) మాం మయా విరచితాం నౌకాభిధాం వ్యాకృతిమ్.
సౌజన్యామృతసిన్ధవః సహృదయాః సర్వే గుణగ్రాహిణో
నిర్వ్యాజం విహరన్తు భఙ్గభరితే సాహిత్యరత్నాకరే. 2

శ్లో. లోకోత్తారకరామనామఘటితోదారప్రబన్ధోత్తమం
కుర్వన్ కృత్యరతిం స్వకీయకవితా మత్యుజ్జ్వలాం లంభయన్
ధన్యో ధర్మసుధీవరః సుమనసా మగ్రేసర స్తద్వచో
వ్యాఖ్యానౌకకృతిః కృతీ యది తథా కిం నో భవేయం త్వహమ్. 3

అథ తత్రభవాన్ ధర్మభట్టాఖ్యో మహాకవిః మోక్షోపయోగినో రామవాసుదేవాదయోమతాః, రామం మోక్షాయ చిన్తయే దిత్యాదివిధేః శ్రీరామమీమాంసాయా మోక్షసాధనతాం శ్రవణవిధే రివ శారీరకమీమాంసాయాః ప్రతీత్య అలంకారశాస్త్రప్రణయనాపదేశేన శ్రీరామచన్ద్రగుణ

వర్ణనమేవ కర్తుకామః * * * * * గణపతిప్రార్థనరూపం మఙ్గళ మన్తే వాస్యానుగ్రహార్థం గ్రన్థతో నిబధ్నాతి."

పఞ్చమతరఙ్గోపసంహారకశ్లోకము: —

శ్లో. శ్రీచర్లాన్వయలక్ష్మణాఖ్యవిబుధః శ్రీసూరమాంబాపతిః
శ్రీమద్వేఙ్కటనాథసూరిణ మముం ప్రాసూత సూరిం చ యః
నౌకైషా మహతీచ తస్యవివృతిః సాహిత్యరత్నాకరే
ప్రోచ్చైః పఞ్చతరఙ్గరిఙ్గణధియా మాలంబనం స్యాచ్చిరమ్" 4

దశమతరఙ్గోపసంహారకగద్యపద్యములు: —

"ఇతి శ్రీమత్త్రిభువనపవిత్రచరిత్ర చర్లాన్వవాయసుధాసిన్ధుసుధామయూఖాయమాన శ్రీమద్రబ్రహ్మాన్తర్వాణివర్యస్యపౌత్రస్య శ్రీసూరమాంబాసహచరశ్రీలక్ష్మణసూరిసూనోః శ్రీవేంకటసూరిణఃకృతే సాహిత్యరత్నాకరవ్యాఖ్యానే నౌకాఖ్యానే రసనిరూపణం నామ దశమస్తరంగః

శ్లో. శ్రీమల్లోహితగోత్రలక్ష్మణసతీ శ్రీసూరమాంబాసుత
శ్రీమద్వేంకటసూరిణా విజయతాం నౌకాత్వియం నిర్మితా
కించైనా మవలమ్బ్య వీచిభరితే సాహిత్యరత్నాకరే
గృహ్ణన్త్వద్య రసం యథామతి బుధాః సర్వే గుణగ్రాహిణః 5

శ్లో. కేచిత్తర్కశతర్కవక్రభణితి క్షుణ్ణప్రచారాః పరే
దాక్షీకుక్షీభవాతిమార్గమగవీ కాన్తారహేలాపరాః
అన్యేశాంకరవాక్సుధాతిసుహితా స్తన్త్రస్వతన్త్రాః కతి
ధ్వన్యధ్వప్రవిశృంఖలభ్రమణనిష్ణాగరిష్ఠాః పరే. 6

శ్లో. అమీషు నహికోఽప్యహం తదపి మామకీనోఽయమి
త్యతీవ కరుణాలతాం మయి నివేశ్య సన్తో బుధాః
ప్రమాల్పరచనా మిమాం వివృతి మద్య గృహ్ణన్త్వమీ
సతాం ప్రకృతి రీదృశీ యదగుణా బహూకుర్వతే."

మల్లాదిలక్ష్మణసూరి: "మందర" వ్యాఖ్య.

ఈటీకతో "సాహిత్యరత్నాకరము"ను శ్రీమాన్ సరస్వతితిరువేంగడాచార్యులవారు చెన్నపురములో సరస్వతీవిలయముద్రాక్షరశాలయందు క్రీ.శ. 1871 లోను, నెల్లూరిలో 1885 లోను తెనుఁగులిపిలో ముద్రించిప్రచురించిరి. ఇంకను నీవ్యాఖ్య నాగరలిపిలో ముద్రింపఁబడలేదు. ఈలక్ష్మణసూరి గోదావరీ

మండల వాసి*యనియు, 19 వ శతాబ్దాంతిమభాగమున స్వర్గస్థుఁ డయ్యె నని యు నాపండితవర్యుని దర్శించిన శ్రీమహోపాధ్యాయ ఆచంట వేంకటరాయ సాంఖ్యాయనశర్మగారివలనఁ దెలియుచున్నది కొన్నిమాసములక్రిందట కీర్తికాయమును ధరించినట్టి మహామహోపాధ్యాయ లక్ష్మణసూరి (మురారియనర్ఘరాఘవమునకు వ్యాఖ్యాకారుఁడు) తంజాపురునివాసి యనియు, సాహిత్యరత్నాకరవ్యాఖ్యాతకంటె భిన్నుఁడు నని యెఱుఁగునది మల్లాది లక్ష్మణసూరి మమ్మటుని కావ్యప్రకాశిక”కు “బుధమనోరంజని” యనువ్యాఖ్యను రచించెను. ఇది వావిళ్ల రామస్వామిశాస్త్రిగారిచేఁ జెన్నపురిలో 1891 వ సంవత్సరమున ముద్రింపఁబడి ప్రకటింపఁబడెను. మఱియు నీవ్యాఖ్యాత యనన్తభట్టవిరచిత “చంపూభారతము”నకుఁ గూడవ్యాఖ్య వ్రాసినట్లు నది ముద్రిత మైనట్లు విని యున్నాను.

లక్ష్మణసూరి, వేంకటసూరినిర్మిత “నౌకా” టీక నీక్రిందిశ్లోకములచే నిరసించి పిమ్మటఁ దనటీకనుగూడ బరిశీలింప సహృదయుల నభ్యర్థించుచున్నాఁడు.

“శ్లో. సాహిత్యరత్నాకరతత్త్వబోధే నాలంహి నౌకేతి విరేము రేకే
కేచి ద్విమోహా స్తృగతృష్ణికాయాం వాతాయువ త్తత్ర ముథాభ్రమన్తి

శ్లో. ఆద్యత్వబుద్ధిం పరిహృత్య “నౌకా” మేతాంచటీకాం కలయన్తుకల్యాః
లోకః కరేణో రవలోకకాలే కర్ణాదివత్పశ్యతిదన్తయుగ్మమ్. 2

శ్లో. వ్యాఖ్యాహ్యసావద్యతనప్రణేతేత్యుగ్ర ప్రజ్యమాత్సర్యమనార్యవర్యమ్
సంత స్సచిత్తా స్సదయా శ్శ్రమజ్ఞా నంద తునిందంతు మమప్రమోదః”

ఇట్లు నిరస్త మగు వేంకటసూరి “నౌక”కును, లక్ష్మణసూరి “మందరము”నకును గల తారతమ్యమును ముందుదాహరింపఁబడు వ్యాఖ్యాభాగముల నవలోకించి పండితవర్యులే నిర్ణయింతురుగాక. ప్రస్తుతోపయుక్తము లగు వ్యాఖ్యాప్రారంభశ్లోకముల నుదాహరించెద.—

“శ్లో. కల్యాణం కలయన్తు కల్యకమలప్రాంతోత్పతద్భృంభర
ప్రాయాః కేపి సమస్తసారదయసత్ప్రత్యగ్రకల్పద్రుమాః
కామాల్యః పద్మభవాదిభి స్సకుతుకాః కాలవ్యవిధ్వంసనే
కారుణ్యామృతవర్షకాలజలదాః కల్యాః కటాక్షశ్రియః. 4

*కాకినాడనివాసి, ఈయనకుమారుఁడు వేంకటశాస్త్రిగారు కాకినాడలో కళాశాలలోఁ బండితుఁడుగానుండిరి వేంకటశాస్త్రిగారికుమారుఁడు కాకినాడలోనే యిపుడు స్వగృహములో నున్నారు. ప అ

శ్లో. మల్లాదివంశే మహితే మనీషీ, మాన్యో మనోజ్ఞో ఽజనిలక్ష్మణో ఽసౌ
సాహిత్యరత్నాకరతత్త్వదోగ్ధ్రీం తాం మన్దరాఖ్యాం వివృతిం విధత్తే.
శ్లో. దుర్వ్యాఖ్యావిషదూషితాం భగవతీం శ్రీధర్మసూరేర్గిరం
భావాలంకృతిసంగతిప్రకటనవ్యావృత్తకౌతూహలామ్
దర్శం దర్శ మచేతసాం సుమనసాం సంప్రీతయే సాదరం
వ్యాఖ్యాం మందరసంజ్ఞికాం వితనుతే సల్లక్షణాం లక్ష్మణః. 6
శ్లో. ధర్మాభిఖ్యకవేర్గిరాం వివరణే కోఽస్యాః కృతీ గౌతమా
చ్ఛేషాహేర్హయవక్త్రతోఽప్యబ్జభవా ద్వాచస్పతే ర్వాయుజాత్
ఇత్యేవం ప్రతిభాతి మే తదపి తద్వ్యాఖ్యాకర్తృతా విశ్రుతా
జాతా విశ్వపతిప్రసాదమహిమప్రోద్యద్వచోవైభవాత్. 7
శ్లో. సాహిత్యరత్నాకరమన్థనోద్యత్ప్రాంతాయుతానాం విబుధవ్రజానామ్
సంప్రీణనాయైవ సలక్ష్మణాఖ్యః ప్రస్థోజ్జ్వలం మందర మాతనోతి"

వ్యాఖ్యోపసంహారక శ్లోకములు.

"శ్లో. సాహిత్యరత్నాకరమన్థనార్థం, ప్రశస్తైర్మహద్భిస్సహితో లసద్భిః
మయాకృతో మందర ఏష యత్నా త్తనోతు నిత్యం సుమనఃప్రమోదమ్.

వ్యాఖ్యాత యీక్రిందిశ్లోకములలో స్వనైచ్యానుసన్ధానము చేసికొనుచు, స్వవ్యాఖ్యామృత మరసికజనుల కనాస్వాద్య మైనను రసికాళి యాస్వాదించు నని నుడువుచున్నాఁడు.

శ్లో. నశబ్దశాస్త్రేఽపి నచార్థశాస్త్రే న కావ్యభేదేషు పరిశ్రమోఽపి
తథాపి టీకావ్యరచీహ యేయం గురుప్రసాదో హి న మేనుభావః.
శ్లో. మదీయే వ్యాఖ్యానే సరసజనసంతోషసదనే
నవిన్ద న్త్యానన్దం యది కుటిలచిత్తాః కతిపయే
నమే సన్దేహోఽత్ర త్రిజగదఖిలప్రాణిసుభగా
శరజ్జ్యోత్స్నా హర్షం కలయతి కి మూలూకవితతేః.
శ్లో. ధర్మసూరివచోగుంభశుంభద్గాంభీర్యభేదిని
వ్యాఖ్యేయం మన్దరాభిఖ్యా భూయా దాభాస్కరం భువి"

ధర్మసూరి ''సాహిత్యరత్నాకరము''న కనుగుణముగఁ బ్రకరణములకుఁ దరంగములని పేరిడెను. ఈచమత్కారము నౌకాటీకాకారు లిరువురుఁ జూపఁ జాలరైరి లక్ష్మణసూరి తన "మందరము''న కనుగుణముగ నాయా భాగము

లకుఁ బ్రస్థము లని నామకరణము చేసెను. ఇట్లు గ్రంథనామములలోఁగూడఁ జమత్కృతిం జూపుట యనేకశతాబ్దములనుండి వచ్చుచున్నది. కొన్ని చమత్కారోదాహరణములం జూపెద:—1. పతంజలి "వ్యాకరణమహాభాష్యము" నకుఁ డీక కైయటుని "భాష్యప్రదీపము" దీనికి వివరణము, నాగోజీభట్టకృత "ప్రదీపోద్యోతము" "ఉద్ద్యోతము" నకుఁడీక పాయగుండే కృతమగు "ఛాయ"

2. జయదేవుని 'చన్ద్రాలోకము' లోని ప్రకరణములు మయూఖనామకములు. చన్ద్రాలోకవ్యాఖ్య ప్రద్యోతనమహాచార్యుని "శరదాగమము" దీనికి వ్యాఖ్యారూప మప్పయదీక్షితుని 'కువలయానన్దము'. దీనికి వ్యాఖ్య వైద్యనాథతత్సదంతర్వాణికృత మగు "నలంకారచన్ద్రిక"

3. శంకరభగవత్పాదులవారి 'బ్రహ్మసూత్రభాష్యము' నకు వ్యాఖ్య, వాచస్పతిమిశ్రుని 'భామతి' దీనికి వివృతి, అమలానన్దుని "కల్పతరువు" దీనికిఁ డీక అప్పయదీక్షితుని "పరిమళము"

4. 'శాస్త్రదీపిక' యనుమీమాంసాగ్రంథమునకు వ్యాఖ్యలు, 'యుక్తిస్నేహప్రపూరణి' 'మయూఖమాలిక'

5. పుష్పబాణవిలాసమునకు 'శృఙ్గారచన్ద్రిక' వ్యాఖ్య

6. మేఘసన్దేశమునకు వ్యాఖ్య, పూర్ణసరస్వతినిర్మిత 'విద్యుల్లత'

7. వేదాన్తదేశికులవారి "శతదూషణి"ని 'వేదాన్తదీపము'ను నద్వైత గ్రంథము నిరసింప, దొడ్డయాచార్యులవారు "వేదాన్తదీపము" నార్పుటకై 'శతదూషణి'కి వ్యాఖ్యాన మగు "చండమారుతము"ను సృష్టించెను.

8 జగన్నాథపండితరాయల "మనోరమాకుచమర్దనము" భట్టోజీదీక్షితుని "ప్రౌఢమనోరమాఖండనము."

మధుసూదనమిశ్రశర్మ నాకాటీక.

ఇది 28 సంవత్సరముల క్రిందట ముద్రింపఁబడె నని ముందు వ్రాసియుంటిని. ఈనాగరప్రతివిషయము నాకు "విద్యామహోదధి" బిరుదాభిధాను లగు శ్రీమత్పండితకాశీప్రసాదజయస్వాల్ Barrister, "Vidyamahodadhi" K P. Jayaswal M. A., of Patna) మహాశయునివలనఁ దెలిసినది. మధుసూదనసూరి ప్రకృతము శ్రీజగన్నాథములో వసించియున్నాఁడు. ఈతఁడు వ్యాఖ్యాపీఠికను ?4 శ్లోకములలో రచించెను. 32 వ శ్లోకమువలన నితఁడు మాయాశబరీవిలాసము, హనుమత్సందేశతారావళి యను కావ్యముల నిర్మిం

చినట్లు తెలియుచున్నది. ప్రకృతోపయోగము లగుపీఠికాశ్లోకముల నుటంకించెద—

శ్లో. యస్సాధారణవేద్యతాం గమయితుం దుర్వేదవేదస్తుతిం
శాస్త్రజ్ఞోఽన్వవద చ్చకారచ ముదాలంకారబోధోదయమ్
బామణ్డాకృతినామునా నృపతినా తేనాహ ముత్సాహితో
నౌకానామక టిప్పణీం వ్యరచయం రత్నాకరోద్బోధినీమ్.

శ్లో. వీరశ్రీబలభద్రపూర్వకపురే యోజాతు విశ్రామ్యతి
బామణ్డాధిపతేః సదస్యపదవీ యస్మింశ్చ విశ్రామ్యతి
శ్రీమాయాశబరీవిలాసహనుమత్సందేశతారాభిధ
గ్రన్థానాం మధుసూదనో రచయితాఽహం సోఽపి సోఽహం ద్విజః

శ్లో. ఆదర్శః శుద్ధ్యమర్షీ, లిపిరతికృశణా, ఘాటికానాటికాభుక్
తత్రాప్యే కోఽరవిన్దాసనహృదయహారీ ధర్మసూరేః ప్రబన్ధః
ఏవం నానాన్తరాయే నృపతికులమణేజాగరూకేఽపి యత్నా
చ్చేతస్మద్రావిధానేఽకలయ దిహ భవాన్ యత్తుసాహాయకత్వమ్.

వ్యాఖ్యారంభశ్లోకములు:—

శ్లో. వన్దే బృన్దారికాబృన్దతున్దిలానన్దదాయకమ్
జగతీకణ్టకోద్ధారిసాయకం రఘునాయకమ్.

శ్లో. రత్నాకరే ప్రవిశతాం సుధియాం సుధాయాం
బోధ స్సుఖేన నభవేదితి భావయిత్వా
ఆజ్ఞాపితః సుఘలదేవనృపేణ నౌకా
టీకాం కరోతి మధుసూదనమిశ్రశర్మా"

వ్యాఖ్యోపసంహారకపద్యగద్యములు:—

శ్లో. ఛిద్రాణి ప్రథమం కుమాజతురసైః క్షుద్రాణి ముద్రాపయన్
శైలీ షేపణికానుశీలనపరీపాటీ మవాటీకయన్
స్వాధ్యాయాంతరసన్తరేణమతిమాన్ స్వైరం తరే న్నౌకయా
గమ్భీరార్థభరభ్రమిభ్రమకరం సాహిత్యరత్నాకరమ్.

శ్లో. గురుజనద్విజదేవసమర్చన స్ఫురదయాద్యమిఃప్రసహాసనః
సుఘలదేవనరేశసభాజకః కృతి మిమా మకరో న్మధుసూదనః

ఇతి శ్రీమదుత్కలమాళిమాలాయమాన- మానసవభావసార్థక- పురుషోత్తమధామసాన్నిధ్యాభిధానేశాసనశతవేష్టితే భార్గవీసరిన్మార్జితపరిసరశాలిని గజ్జవంశావతంసాయితవదాన్యచక్రవర్తి వీరశ్రీబలభద్రదేవమహారాజవిశ్రాణితే వీరబలభద్రపురశాసనే నివాసినా శ్రీమధుసూదనమిశ్రశర్మణా విరచితాయాం నౌకాభిధటీకాయాం దశమస్తరఙ్గః"

ఇట్టి దద్వ్యాఖ్యాతారతమ్యవైశద్యమునకై, స్థాలీపులాకన్యాయమున మూలవ్యాఖ్యానముల నుదాహరించెద:—

సాహిత్యరత్నాకరము: 10 (రసనిరూపణ) తరంగము:—

"యత్ర బహూనాం భావానా మన్యోన్యసమ్మర్దితయా నిబన్ధః క్రియతే తత్ర భావశబలతా. యథా:

శ్లో॥ ఆయాతో న మమాన్తికం రఘుపతిః కిం తేచ జాతాగసా
యాస్యామి స్వయమేవ తస్యనవిధం కింవా వదేన్మాం సఖి
**ఆయాతు** స్వయమేవ, నన్విహపున ర్ద్రక్ష్యామి నైతన్ముఖం
తూర్ణం తద్ఘటనం భవేన్మమ పునః కావాభవిత్రీ కథా. 93

అత్ర చిన్తామర్షస్మృతి (దైన్య) శంకావహిత్థౌత్సుక్యవిషాదానాం శబలతా.

శ్లో॥ ధర్మానర్వాణిపర్య త్రిభువనవిదితే వారణాస్యన్వయేయ
స్సఞ్జాతో యల్లమాంబాకృతసుకృతఫలం పర్వతేశస్య భాగ్యమ్
వ్యాఖ్యావిఖ్యాతకీర్తే ర్వివరణగురువాక్యాఖ్యముఖ్యాగమానాం
తస్యాలంకారశాస్త్రే విలసతి దశమో రామవర్ణ్యే తరంగః 94

శ్లో॥ ఆస్తా మిన్దిరమన్దిరాప్రణయినో దేవస్య రామాత్మనః
స్వంగత్తుంగతరంగరింగణవిధోజ్జీవన్మహోద్యత్కవిః
తాదృఙ్నిర్మలధర్మసూరికవితాసోల్లాసకల్లోలినీ
పూర్ణః కర్ణమనోహరో విజయతే సాహిత్యరత్నాకరః. 95

శ్లో॥ ప్రాచీనాభినవప్రబన్ధవిహితగ్రన్థానుసన్ధాయినా
సోఽయం సాహసికేన సంప్రతి మయా నూత్నః ప్రబన్ధః కృతః
కస్తుష్యే దమునాధునా హ్యసుఖో బోద్ధాచ నిర్మత్సర
స్సర్వజ్ఞో గతమత్సరోఽస్తి హి రమారామః సనస్తుష్యతు. 96

శ్లో॥ భోమాతః కవితే హితం మమ వచః కిఞ్చిత్సమాకర్ణయ
శ్రీమద్రామగుణస్తవామృతవతీ మర్త్యస్తుతిం మాకృథాః

కస్తూరీఘనసారచన్దనరసన్యాసోత్సవాస్వాదవి
త్తో వా విస్రవసాస్రపూయపిశితాలేపాభిలాషీ భవేత్. 97

శ్లో. సఞ్జాతో హారితాన్వయే మహతియః శ్రీపర్వతేశః సుధీః
షణ్ణాం దర్శనకారిణాం కృతిమతా మైకాత్మ్యలీలాకృతిః
ధర్మాఖ్యేన మనీషిణా విరచితః తత్సూనునా తాదృశా
సోఽయం యావదిలాతలంవిజయతాం సాహిత్యరత్నాకరః 98

ఇతి శ్రీమత్త్రిభువనపవిత్ర హారితగోత్రావతంస వారాణసీవంశపద్మాకరప్రభాతభానునా పదవాక్యప్రమాణపారావారపారీణ శ్రీమన్మహామహోపాధ్యాయ పర్వతనాథసూరి పణ్డితమండలేశ్వరసూను యల్లమామ్బాగర్భరత్నాకరపారిజాతనిర్మలాచారపూత చతుర్దశవిద్యాస్థానసిద్ధాన్తరహస్యవిజ్ఞానవతా శ్రీధర్మసంఖ్యావద్విరచితే శ్రీమద్రఘుతిలకయశోఘనసారసురభీకృతే సాహిత్యరత్నాకరనామ న్యలంకారశాస్త్రే రసనిరూపణం నామ దశమస్తరంగః”-నాగరప్రతి-

I. వేఙ్కటసూరినిర్మిత “నౌకా” వ్యాఖ్యనుండి:—

“భావశబలతాం లక్షయతి:—యత్రేతి. ఉదాహరతి: ఆయాతఇతి. స్పష్టమ్. అత్రభావానాం శాబల్య ముపపాదయతి—అత్ర చిన్తేత్యాదినా. ప్రకరణ ముపసంహరతి—ఇతి శ్రీమదితి. స్వగ్రన్థం ప్రస్తౌతి: ఆస్తామిన్దిరమితి- వ్యాఖ్యాతం ప్రాక్ అస్మిన్ స్వగ్రన్థే మత్సరిణాం సంతోషాభావేఽపి ‘యత్కరోషి యదశ్నాసి’ ఇత్యాది గీతావచనానురోధే నాస్య భగవదర్పణబుద్ధ్యా కృతత్వాత్ సఏవ సంతోషో భవేదిత్యాహ—ప్రాచీనేతి; కవితాం ప్రార్థయతే: భోమాతరితి. విస్రవసా ఆమగన్ధవన్మేదః అస్రం రుధిరం పూయపిశితం దుర్గన్ధిమాంస మేతేషాం లేపే అభిలాషోఽస్యాస్తీతి తాదృశః అథకవిః స్వకీర్త్యనువృత్తయే స్వగ్రన్థస్య ప్రచయగమనాయచ స్వమహత్తా వర్ణనపూర్వకం స్వగ్రన్థ మాశాస్తే—సంజాతేతి దర్శనకారిణాం శాస్త్రకృతాం షణ్ణాం షట్సంఖ్యానాం సుమనసాం పాణిన్యాదిమహర్షీణా మైకాత్మ్యలీలాయితః ఏకాత్మ్యలీలే వాచరితః, ఏకాత్మ్యం గతఇత్యర్థః, తత్సదృశ ఇతిభావః. పాణినే ర్జైమినే శ్చైవ వ్యాసస్య కపిలస్యచ, కణాద స్యాక్షపాదస్య దర్శనాని షడేవహి” ఇతి పాణిన్యాదయః షడ్దర్శనకృత ఇతి వేద్యమ్. అన్యత్ సుగ(మ)మితి సర్వం రమణీయమ్.”

II. మధుసూదనమిశ్రుని "నౌకా"టీకయండి: —

"సఙ్కేతసమయోపగమా ద్విరహవిధురాయాః శ్రీమత్యా విరోధినానా భావసమావేశాత్మికాం భావశబలతా ముదాహరతి నాయాత ఇతి. సీతాయా ఉక్తి రియం జాతాగసా అపరాధినా మామేవం కదర్థయతేతి యావత్. ఆయాత్వితి: ఇహ మత్పార్శ్వే స్వయమేవ ఆయాతు రామ ఇతిశేషః మమ తద్ఘటనం శ్రీరామసఙ్గః తూర్ణం శీఘ్రం భవేత్ ? పునః (ఈదృశవిరోధానన్తరం) కావా కథా భవిత్రీ నజానే అత్ర క్రమా దేషాం చింతాదీనాం యథాయథం వ్యంజనం సీతోక్తితో భావ్యం సుగమ మన్యత్" ధన్యేత- ఆస్తామిన్దిరేతి చ వ్యాఖ్యాతచరత్వా దిహాపేక్షితం. విద్వద్భ్యః స్వగ్రన్థావమాననా మాశఙ్కమానః తేషాం మాత్సర్యదూషితాత్మతాం ప్రదర్శ్య స్వగ్రన్థం భక్త్యా రమయార్పయతి ప్రాచీనాదినూతనకవీనాం ప్రబన్ధైః వాక్యవిన్యాసై ర్విహిత స్య రచితస్య గ్రన్థస్య సన్దర్భస్య అనుసన్ధాయినా మయా సాహసికేన సతా సోఽయం నూత్నః ప్రబన్ధః సంప్రతి కృతః ఈదృశమహత్తరగ్రన్థనిర్మాణ మస్మాదృశామసాధ్య మిత్యాశయోఽస్య సాహసికత్వవిశేషణా ద్వ్యక్తి ర్భవతి. తేన చాస్యసన్దర్భస్య ప్రౌఢి రుద్యోతతే అమునా గ్రన్థేన యస్తుష్యేత్ నిర్మత్సరః సబోద్ధా విద్వా నధునా మదధికరణకాలే మజ్జీవితావధీత్యర్థః దుర్లభః మయా దుష్ప్రాపః సమసామయికవికషా మహమహమికా దత్తహస్తావలమ్బమాత్సర్యదోషదూషితాత్మతయా మహాగ్నిభాణామివ పరస్పరవిరుద్ధవ్యవహృతిదర్శనాత్ భావినామే వాత్ర పరమామోదః స్యా దిత్యాశయోఽధునాపదో వ్యజ్యతే దుర్లభపదశ్చ సుదూరతరవిదేశవర్తినా మపీహానురాగః సంభవతీతి సూచ్యతే. అన్యథా నాస్తీ త్యుక్తం స్యాత్. ప్రాచీనా దితి స్వవిశేషణమహిమ్నా గ్రన్థస్య నవ్యప్రాచీనోభయమతసారభూయస్త్వం ద్యోతితం సర్వప్రబన్ధశ్రేష్ఠతాం ప్రకటయతి. నను తదలం పరానన్దఫలకగ్రన్థరచనాపరిశ్రమభరై రిత్యాశంక్యాహ సర్వజ్ఞేతి, రమా లక్ష్మీ స్తయోపలక్షితో రామః సీతారామ ఇత్యర్థః సన్తుష్యతి. తథాచ సర్వజ్ఞసన్తోషకస్య కించిజ్జ్ఞకృతావమాననా నవైయర్థ్యజననీ ప్రత్యుతావజానతాం మౌఢ్యసమ్పాదికా ఇతిభావః.

స్వప్రౌఢివైలక్షణ్యం ప్రకటయితుం శ్రీరామస్యపరమేశ్వరత్వం చాభియుక్తం స్వస్య మనుష్యస్తుతి పరాఙ్ముఖతాం సూచయతి భో మాత ఇతి:—
తథాచ మృగమదకర్పూరవాసిత చన్దనచర్చాసుఖాస్వాదినాం రక్తపూయ

ప్రభృతిదుర్గన్ధద్రవలేప ఇవ శ్రీరామగుణవర్ణనామృతపూర్ణమానసానాం న శా పురుషస్తుతిపారాయణాడంబరవిడమ్బనా విధేయా ఇతిభావః. ఏతేన అస్మాకీనాః కిల సకలసన్దర్భాః సార్థకాః వయం చ రాగాదిశూన్యా అపరాధీనా శ్చేతి ఫలితం.

చౌరేభ్యః సాశఙ్క ఆఢ్యజనో రత్నమఞ్జూషికాయాం సంరోధనీ చక్రచక్రమివ ధూర్తజనా నాశఙ్క్య పునః స్వనామ నిబధ్నాతి, సంజాతఇతి— షణ్ణాం దర్శనకారిణాం షడ్దర్శనాచార్యాణాం కపిలజైమినిపాతఞ్జలవ్యాసగౌతమకణాదానాం, ఐకాత్మ్యలీలాకృతిః సమష్టిస్వరూపః ప్రణేతౄణాం కపిలాదీనాం స్వస్వదర్శన ఇవ సకలదర్శనేషు వివేకశాలీత్యర్థః. యావదిలాతలం భూతలావస్థితిపర్యన్తం తథా చాత్ర భూరిశః శ్రీరామగుణగణోత్కర్ష స్మరణవశాదివ ధూతసకలాఘః స్వర్గముపైతా పారక ఇతి యావదిలాతలపదా త్సూచ్యతే, ఏతద్గ్రన్థవృత్తే ర్వ్యాఖ్యాతలస్పర్శ్యధికత్వాత్ స్పష్టమేవ మన్యత్"

III. లక్ష్మణసూరికృత "మందర" టీకనుండి—

"భావశబలతాం లక్షయతి: యత్రేతి—తా ముదాహరతి. ఆయాత ఇతి, స్వయం స్వతఏ వాయత్తోఽధీనః సులభ ఇతియావత్. అత్ర బహవో భావాః పూర్వపూర్వోపమర్దేన నిబద్ధా ఇత్యాశయే నాహ. అత్రేతి:

ఇతీత్యాది: సంప్రతి కవి స్వస్య నిఖిలగ్రంథనిష్ణాతత్వా దర్శయం త్స్వహంకారపరిహారపూర్వకం కృతినాయకం ప్రార్థయతే.

ప్రాచీనేతి—హి యస్మాత్ బోద్ధా నిర్మత్సరశ్చ పుమా నసులభః "బోద్ధారో మత్సరగ్రస్తా" ఇత్యుక్తత్వా దితి భావః రమా రామా యస్య తథోక్తః సః శ్రీరామరూపః శ్రీహరిః 93

సంప్రతి స్వకవితాం ప్రార్థయతే. భోమాత రితి—విస్రాణా మామగంధినాం వసాస్రపూయపిశితానాం లేపే చర్చా యామభిలాషీ ఔత్సుక్యవాన్ 94

ఇదానీ మాశీః పూర్వకం గ్రన్థసమాప్తి మాహ. సంజాత ఇతి: విజయతాం సర్వోత్కర్షేణ వర్తతాం.

ఇతి శ్రీమల్లాది లక్ష్మణసూరివిరచితే సాహిత్యరత్నాకరవ్యాఖ్యానే మన్దరాఖ్యానే దశమః ప్రస్థః"  పుటలు 374-76

అలంకారశాస్త్రమహోదధిని మథించి "అలంకారశాస్త్ర చరితామృతము" ను విబుధలోకమునకుఁ బ్రసాదించిన "సుశీలకుమారడే" పండితుఁడు.

(Dr. Sushil Kumar De, M. A, D. Litt., Author of "Studies in the History of Sanskrit poetics" in 2 Volumes) నేఁటివఱకు ముద్రితములైన సాహిత్యరత్నాకరప్రతులు మూఁడింటిలో నొకదానినైనను జూచి యుండలే దని వ్రాయుట కెంతయుఁ జింతిల్లుచున్నాను తన "యలంకారశాస్త్రచరిత్ర (1923) కంటె 22 సంవత్సరములకుఁ బూర్వము ప్రకటింపఁబడిన నాగరప్రతి నీతఁడు చూడకపోవుట శోచనీయము; ఆతఁడు తనకుఁ దెలిసిన సాహిత్యరత్నాకరప్రతులంగూర్చి యిట్లు వ్రాసెను.

"Dharmasudhi or Dharmasuri S. R ed. by Tiruwenkatacharya with commentary. Madras, 1871, ed. Nellore 1885" "Sanskrit poetics" Vol 1 P. 298. సాహిత్యరత్నాకరమునకు "మందరము"ను నొకవ్యాఖ్య యున్నదని కాని, యది తా నుదాహరించికొనిన రెండాంధ్రప్రతులలోను ముద్రింపఁబడిన దని కాని సుశీలకుమారసూరికిఁ దెలియదు. నాగరప్రతి ముద్రితమైనట్లు తెలియమిచే నాతఁడు నాగరప్రతిని జూచుట తటస్థింపలేదు; తా నాంధ్రలిప్యనభిజ్ఞుఁ డగుటచేఁ దాను సూచించిన యాంధ్రప్రతులనైనఁ జూచియుండలేదు.

సాహిత్యాచార్య లగు శ్రీమత్పండిత రామావతారశర్మ (M A) మహోదయులు "విహారోత్కళగవేషణసంఘము" వారి పత్త్రిక (Journal of the Bihar & Orissa Research Society Vol. XIV Part ii, Page 313, Foot note- June 1928) లో నాలంకారికశిరోమణు లగు శ్రీ మత్పండిత పాండురంగవామనకాణే (M A, L L M) మహాశయుని "గీర్వాణాలంకారశాస్త్రచరిత్ర" ("A History of Sanskrit Poetics"—Reprinted from the introduction to his edition of the 'Sahityadarpana') ను విమర్శింపుచు

"Some useful works like the साहित्यरत्नाकर of धर्मसूरि and the अलङ्कारकौस्तुभ of कर्णपूर ought to have been described at some length by the outher, for they have been avaible to the public"

అని వ్రాసియున్నారు. ఈ వాక్యమువలన "సాహిత్యరత్నాకరము"న కాంధ్రేతరరాష్ట్రములఁ గూడఁ బ్రచారము గల దనియు నాగ్రంథప్రతులు సర్వసులభము లనియు విశద మగుచున్నది. రామావతారశర్మగారి వాక్యములవలన "సాహిత్యరత్నాకరము" నాగరాక్షరాంకిత మైనట్లు మనమూహింపవచ్చును.

సుశీలకుమారసూరి సాహిత్యరత్నాకర ప్రతుల నొక్కదానినైనఁ జూచియుండలే దనుటకు నిదర్శనముం జూపెద.

(1) ధర్మసూరి, "సాహిత్యరత్నాకరము" న (గ్రంథారంభసమర్థనతరఙ్గము) దన వంశావళిని విపులముగ వర్ణించికొని యుండ, సుశీలకుమారసూరి ధర్మసూరివంశవృక్షమును Hultzsch పండితుఁడు వ్రాసినదానింబట్టి వ్రాసియుండెను.

(2) ధర్మసూరికృతము లగు నితరగ్రంథములం జెప్పునవసరమున సుశీలకుమారుఁడు 'ధర్మసూరి' "నరకాసురవిజయ" మను వ్యాయోగమును రచించినట్లును, నది చెన్నపురిలో 1884 వ సంవత్సరమున ముద్రిత మైనట్లును వ్రాసియున్నాఁడు. కాని యీపుస్తకముగూడ నాతని కటాక్షలాభముం బడయలే దనుటకు సిగ్గగుచున్నది. ఆ తఁడీ వ్యాయోగమును జూచియే యుండినచో నిందలినటీసూత్రధారసంభాషణమువలన ధర్మసూరి "బాలభాగవత కావ్యము ను నిర్మించినట్లు తెలియుచున్న" దని వ్రాసియుండును, మఱియు ధర్మసూరి సాహిత్యరత్నాకరములోఁ దాను రచించిన 'కంసవధ, ప్రాకృతహంససందేశ, నరక సురవిజయ, కృష్ణాస్తుతులనుండి కొన్ని శ్లోకముల నుదాహరించుకొనియె. ధర్మసూరి "రవిశతకము" ను గూడ రచించినట్లు సాహిత్యరత్నాకరములోని పంచమతరఙ్గాన్తిమ శ్లోకమువలనఁ దెలియుచున్నది. సుశీలకుమారసుధి సాహిత్యరత్నాకరప్రతింజూచి యుండినచోఁ దదుద్ధృతము లగు ధర్మసూరికృతిపంచకములో నొకదానినైనం బేర్కొనియుండఁడా?

(3) సుశీలకుమారసూరి సాహిత్యరత్నాకరవ్యాఖ్యలలో ముద్రితములగు మధుసూదనుని 'నౌకా' టీకంగూర్చి కాని, లక్ష్మణసూరి మందరముం గూర్చి కాని యేమియు స్మరింపక, యముద్రితమును, జెన్నపురప్రాచ్యలిఖిత గ్రంథాలయపట్టికలలో నుద్ధృతము నగు వేంకటసూరివ్యాఖ్యం గూర్చియే యించుక వ్రాసెను. రెండుసారులు "సూర్యాలోకముం" బడసిన "మందర" వ్యాఖ్యను గుఱించి కాని, యొకసారి నాగరాక్షరముద్రిత మగుమధుసూదనుని "నౌకను" గుఱించికాని సుశీలసూరి మూకీభావము వహించుట యీరెండుగ్రంథముల నాతఁ డవలోకింపలే దని చెప్పకయె చెప్పుచున్నది.

అతఁడు "సాహిత్యరత్నాకరము" లోని "అలంక్రియేత్యాది' శ్లోకమును బ్రాచ్యలిఖితగ్రంథాలయ పట్టికనుండియే యుదాహరించియుండును.

ఇట్లు నేను రంధ్రాన్వేషణ తత్పరుఁడనై, సుశీలకుమారసూరిపై దోషారోపణ చేయుచుంటి నని గుణదోషజ్ఞులగు నంతర్వాణు లెంచకుందురుగాక. ఇట్లు నేను వ్రాయుట మహాకృతికర్త యగు నాతని కొకలోటుగాదు. ఏకో హి దోషో గుణసన్నిపాతే నిమజ్జతి.

‘ఆంధ్రగీర్వాణసాహిత్యపరిషత్తు’ వారు ధర్మసూరి నరకాసురవిజయమును “నౌకా’ (వేంకటసూరికృతము) “మందర” (లక్ష్మణసూరికృతము) సహితముగ“సాహిత్యరత్నాకరము”ను ముద్రింపఁ దలఁచుచున్నారు. మద్రపుర ప్రాచ్యలిఖితగ్రంథాలయములో వేంకటసూరి “నౌకా” టీక సమగ్రముగా లే దని తెలిసినది కావున నాటీకకుఁ బ్రతి యెవరియొద్దనైన నున్నచో వారి నీప్రతి కామఖమునఁ దెలిపి సారస్వతసేవాసమయమున సాహాయ్యముఁ జేయఁ బాఁకఃపున్యంబుగ నభ్యర్థించుచున్నాఁడ.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు.

ఈ 1929 సంవత్సరము మార్చి నెల ది 30-31 తేదులలో, తూర్పుగోదావరిజిల్లా, అమలాపురముతాలూకా ముక్తేశ్వరములో, శ్రీముక్తేశ్వరస్వామివారి యాలయావరణములో జరగిన పదునేడవ పరిషద్వార్షికసభయొక్క వృత్తాంతము.

—౹ సభ్యులు ౹—

| | | | |
|---|---|---|---|
| 1 | బ్ర॥ శ్రీ కావ్యస్మృతితీర్థ జనమంచి శేషాద్రిశర్మగారు. | | కడప |
| 2 | కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు | | రాజమహేంద్రవరము. |
| 3 | రాళ్ళబండి సుబ్బారావుగారు | ఎం. ఏ. ఎల్. టి | ,, |
| 4 | జయంతి సోమశేఖరరావుగారు | బి. ఎ. బి. ఎల్. | ,, |
| 5 | వడలి లింగన్నశాస్త్రిగారు | | ,, |
| 6 | కూచిమంచిగోపాలకృష్ణమ్మగారు | ఎం. ఏ | ,, |
| 7 | పుల్యాల శ్రీరామశాస్త్రిగారు | | ,, |
| 8 | పి. అన్నాజీశర్మగారు | | ,, |
| 9 | అమరవాది హనుమచ్ఛాస్త్రిగారు | ఎం. ఏ. | కొవ్వూరు. |
| 10 | అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు | | ,, |
| 11 | దేవగుప్తపు విశ్వేశ్వరశర్మగారు | | ,, |
| 12 | వైద్యరత్న పండ్రంగి సుబ్బారావుగారు | డాక్టరు | పెద్దాపురము |
| 13 | ఆమ్నాయార్థవాచస్పతి వడలి లక్ష్మీనారాయణశాస్త్రిగారు | | పిఠాపురము. |
| 14 | శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు | | ,, |
| 15 | శ్రీకవిరాజు వత్సవాయి వేంకటనీలాద్రిరాజుగారు | | తుని. |
| 16 | మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | | విజయనగరము |
| 17 | కిళాంబి రాఘవాచార్యులుగారు | ఎం. ఏ. బి. ఎల్ | కాకినాడ |
| 18 | సవితాల సుబ్రహ్మణ్యంగారు | ,, | ,, |
| 19 | అడ్డాల రామమూర్తిగారు | బి. ఎ, బి. ఎల్ | ,, |
| 20 | నేత్రగంటి శ్రీనివాసకోనేటిరావుగారు | ,, | ,, |
| 21 | వేమూరి శ్రీనివాసరావుగారు | ,, | ,, |
| 22 | దర్భా వెంకయ్యగారు | బి ఏ. | ,, |

| | | | |
|---|---|---|---|
| 23 | కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు | | కాకినాడ |
| 24 | కూచిమంచి సుబ్బారావుగారు | | ,, |
| 25 | జయంతి రామయ్యపంతులుగారు | బి ఎ. బి ఎల్ | ముక్తేశ్వరము. |
| 26 | కప్పగంతు రామశాస్త్రిగారు | | ,, |
| 27 | చావలి లక్ష్మీనారాయణగారు | | ,, |
| 28 | నిట్టల కామయ్యగారు | | ,, |
| 29 | జొన్నలగడ్డ వేంకటరామయ్యగారు | | ,, |
| 30 | జొన్నలగడ్డ బుల్లివెంకయ్యగారు | | ,, |
| 31 | జొన్నలగడ్డ మందేశ్వరశాస్త్రిగారు | | ,, |
| 32 | వేటూరి శాస్త్రులుగారు | | ,, |
| 33 | కొంపెల్ల సుబ్బారాయశాస్త్రిగారు | | మోడేకుర్రు. |
| 34 | దవ్వూరి బాలకృష్ణమూర్తిగారు | | ముక్కామల. |
| 35 | దువ్వూరి వేంకటేశ్వర్లుగారు | | ,, |
| 36 | జయంతి బాలకృష్ణమూర్తిగారు | బి ఏ. బి. ఎల్. | అమలాపురము. |
| 37 | చేబ్రోలు అచ్యుతరామయ్యగారు | ,, | ,, |
| 38 | కాళే వీరరాఘవులుగారు | ,, | ,, |
| 39 | గూడా సత్యహరిశ్చంద్రుడుగారు | ,, | ,, |
| 40 | చావలి లక్ష్మీనృసింహశర్మగారు | ,, | ,, |
| 41 | చాగంటి సుబ్బారావుగారు | బి. ఏ. సబ్ రిజిష్ట్రారు | ,, |
| 42 | తట్టా రాజగోపాలాచార్యులుగారు | ,, | ,, |
| 43 | పాలెపు వేంకటసూర్యగోపాలముగారు | | ,, |
| 44 | ఇవటూరి సుందరయ్యగారు | | ,, |
| 45 | పుల్య ఉమామహేశ్వరశాస్త్రిగారు | | గంగలకుర్రుఅగ్రహారము. |
| 46 | శ్రీపాద విశ్వనాథశాస్త్రిగారు | | ,, |
| 47 | చొప్పెల్ల సుబ్బారావుగారు | | ,, |
| 48 | చొప్పెల్ల శేషగిరిరావుగారు | | ,, |
| 49 | మంగిపూడి చినగవరప్పగారు | | వ్యాఘ్రేశ్వరము. |
| 50 | గొర్తి విశ్వనాథశాస్త్రిగారు | | భట్నవిల్లి. |
| 51 | పారుపూడి చలమయ్యశాస్త్రిగారు | | మాగాం. |
| 52 | కూచిమంచి సాంబశివరావుగారు | | పలివెల. |

శ్రీపిఠాపురము మహారాజావారు కార్యాంతరములచే రాఁజాలమనియు సభ జయప్రదముగా జరుగుఁగాక యనియుం దంత్రీవార్తను బంపిరి. దివాన్ బహద్దరు వి. రామభద్రనాయఁడుగారు మధురజిల్లా పెరియకొళమునుండియు శ్రీయుతులు కట్టమంచి రామలింగారెడ్డి ఎం. ఏ గారును కొత్తా సూర్యనారాయణరావుగారు (బెజవాడ) మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు (రాజమహేంద్రవరము) మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యముగారు (నంద్యాల) తుమ్మల సీతారామమూర్తిచౌదరిగారు (కావూరు) పెద్దిభట్ల వీరయ్యపంతులు బి. ఎ. బి. ఎల్. గారు (బెజవాడ) మైసూరు మహారాజావారి సంస్కృతకళాశాలాధ్యక్షులు మొదలగు పలువురు సభకు రాఁజాలమనియు సభ జయప్రదముగా జరుగునుగాక యనియు వ్రాసినయుత్తరములు చదువఁబడినవి.

ఆహ్వానసంఘాధ్యక్షులు స్వాగతోపన్యాసము గావించిరి. అనంతరము సభాధ్యక్షులగు బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు ప్రారంభోపన్యాసము నొనర్చిరి. పిమ్మట బ్ర॥ జయంతి రామయ్యపంతులుగారు ప్రథమావిభక్తిప్రత్యయ మగు ఁడువర్ణకము పూర్వరూపము, శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు ఆముక్తమాల్యద; మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు హర్షవర్ధనుని చరిత్రము; అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు లక్షణగ్రంథములు అనువ్యాసములం జదివిరి.

౩౧ తేదీ ఉదయమునఁ గార్యనిర్వాహక సభ జరిగినది. వార్షికసభలో నీక్రింది తీర్మానములు చేయఁబడినవి.

1 వ తీర్మానము:— ఆంధ్రసాహిత్యపరిషత్తునకుఁ బ్రధానోద్ధారకులును విద్యాపోషకులును, ఆంధ్రభాషాభిమానులును అగు శ్రీరాజాసాహెబ్ శ్రీరావు శ్వేతాచలపతి వేంకటరంగారావు బహద్దరు జి. సి. ఐ ఇ. సి బి. ఇ. బొబ్బిలి మహారాజావారు కాలధర్మము నొందినందులకీసభవారు మిక్కిలివిషాదము నొందుచున్నారు.

2 వ తీర్మానము:— ఈపరిషత్తునకు యావజ్జీవసభ్యులును విద్యావంతులును అగు దివాన్ బహద్దరు డాక్టరు కిళాంబి రామానుజాచార్యులు ఎం. ఏ. బి. ఎల్. D. Lt. గారు కాలధర్మము నొందినందులకీసభవారు మిగుల విషాదమునొందుచున్నారు.

3 వ తీర్మానము:—ఆరంభమునం దీపరిషత్తును స్థాపించుటలో సహాయభూతులై యుపకారము గావించినట్టియు, ఉభయభాషా ప్రవీణులును, ఆంధ్ర భాషాభిమానులును నైనట్టియు శ్రీరాజా సర్ పానుగంటి రామారాయణంగారు ఎ. వి. కే. సి. యస్. ఐ. గారు కాలధర్మము నొందినందుల కీసభవారు మిగుల విషాదము నొందుచున్నారు.

4 వ తీర్మానము:—ఉభయభాషా ప్రవీణులును, పరిషద్గౌరవసభ్యులు నగు కల్లూరి వేంకటరామశాస్త్రులుగారు కాలధర్మము నొందినందుల కీసభవారు మిగుల విషాదము నొందుచున్నారు.

5 వ తీర్మానము:—తగినంత సంస్కృతభాషాపరిచయము లేనిదే ఆంధ్రభాషాప్రావీణ్యముగాని యుభయభాషాప్రావీణ్యము గాని కుదుర దనియు ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారిపుడు జరుపుచున్న యుభయ భాషాపరీక్షలలో (C) కక్ష్యపరీక్షలో సంస్కృతము లేనే లేదు గనుకను (B) కక్ష్యపరీక్షలో సంస్కృతభాగ మత్యల్పముగా నున్నది గనుకను (A) కక్ష్యపరీక్షలో తెలుగు భాగ మత్యల్ప మగుటచేతను-ఈమూఁడు కక్ష్యలపరీక్షల నిలిపివైచి యిప్పటి (A) కక్ష్యలోని సంస్కృతమును (B) కక్ష్యలోని తెనుఁగును గూడియుండునట్లు వేఱొకయుభయభాషా ప్రవీణపరీక్ష విశ్వకళాపరిషత్తువా రేర్పాటు చేయవలయు నని యు నీపరిషత్తువారియభిప్రాయము.

తరువాత ఆంధ్రభారతకవితారీతి యనువ్యాసమునకు బదులుగ సూర్యరాయాంధ్రనిఘంటునిర్మాణముం గూర్చి జయంతి రామయ్యపంతులు గారుపన్యసించిరి. కప్పగంతు రామశాస్త్రిగారాంధ్రభాషా ప్రశంసచేసిరి. ఆమ్నాయార్థవాచస్పతి వడలి లక్ష్మీనారాయణశాస్త్రిగారు వేదములంగూర్చి యుపన్యసించిరి. ఇవటూరి సుందయ్యగారు నైషధరచనాతత్త్వము, బండారు తమ్మయ్యగారు మాదయగారిమల్లన రాజశేఖరచరిత్రము, రాళ్ళబండి సుబ్బారావు ఎం.ఏ.ఎల్.టి. గారు ఆంధ్రభాషాలిపిపరిణామము, అనువ్యాసములం జదివిరి.

దువ్వూరి కామేశ్వరరావుగారు, జయంతి స్వామినాయనగారు, పండితారాధ్యుల నాగభూషణముగారు, పరిషత్ప్రశంసాపద్యములను జదివిరి. కావ్యకలానిధి శతావధాని చిదంబరశాస్త్రిగారు జయాశీర్వాదమనియు, క్రొత్తపల్లి సుందరరామయ్యగారు భాషాఘోషాసౌష్ఠవ మనియు, పద్యములంజదివిరి.

శ్రీవఝుల చినసీతారామస్వామిశాస్త్రి గారు విరూపాక్షరాయ లెవ్వరు? శ్రీపాద పాపయ్యశాస్త్రి గారు ప్రబోధచంద్రోదయము తెలుఁగు సంస్కృతము, పప్పూ మల్లికార్జునరావు బి. ఏ. గారు సాహిత్యపరిషత్తులకృత్యములు, అను వ్యాసములం బంపిరి. ఈవ్యాసాదులన్నియుఁ బరిషత్పత్రికలోఁ గ్రమముగ వెలువడును.

బెజవాడ, శ్రీ. కోతా సూర్యనారాయణరావుగారు సంస్కృతపదమును గూడఁ జేర్చి "సంస్కృతాంధ్రసాహిత్యపరిష" త్తని పేరు పెట్టుట మంచిదని వ్రాసిరి అది సభవారాలోచించి ఆంధ్రసాహిత్యపరిషత్తు- ఉన్నదియున్నట్లే యుండవలయు ననియు సంస్కృతమునకు వేఱే పరిషత్తుండవలయు ననియు నభిప్రాయపడిరి

---

# పరిషత్స్వాగతోపన్యాసము—ముక్త్యీశ్వరము.

ఆహ్వానసంఘాధ్యక్షులు, కప్పగంతు రామశాస్త్రిగారు.



ఆర్యులారా! నవరసభరితకవితారసాస్వాదనసహృదయులారా! సదయులారా! పరిషదలంకారీకరణాకాంక్షిణులారా!

మీ రందఱును మాయాహ్వానపత్రికాలోకనక్షణప్రభృతి యత్యంతకౌతూహలసంభ్రమాయత్తచిత్తులరై పరిషత్ప్రయాణైకప్రవణాంతఃకరణులరై యావశ్యకకార్యంబు లెన్నెన్ని యున్నను, వానిని బాటింపక మార్గాయాసప్రశంసను మానసవీధిం జొటిడక పరదేశవాసంబు శయనాసనభోజనవిహారాదిదేహయాత్రాకృత్యవ్యత్యాసమును మాట నాటించికొనక పరిషత్సమావేశౌత్సుక్యసముద్భూతానందహల్లోహలమానసు లగుటచే

"పూర్ణే మనసి సమ్పూర్ణం జగత్సర్వం సుధాసైః
ఉపానద్గూఢపాదస్య సర్వా చర్మావృతేవ భూః."

అనుపసిద్ధోక్తిరీతిని సకలేంద్రియవిషయంబుల నానందసదనంబులుగ భావించుచు మాయుద్యమంబును నిరవద్యహృద్యంబుగ సఫలంబు సేయు దయతో విచ్చేసినందున నే నత్యంత వినయవిధేయతలతో మీ కిట్లు స్వాగతంబు సమర్పించుచున్నాఁడను. స్వాగతార్థ మే మనఁగా: —

౧. తమతావునకు విచ్చేసినమహనీయులను సుఖాగమప్రశ్నతో నాదరించుట. సు ఆగతం=స్వాగత మని దానికివ్యుత్పత్తి- ఇంకను స్వాగతార్థములు గలవు:—

౨. స్వం=సోత్సాహప్రధాన మగు ఆగతం=వచ్చుట; అనియు స్వాగత శబ్దార్థము:—

"స్వయమేవ సమాయాన్తి సన్త స్సన్తోషభూమయః
పరోపకారవేళాయాం పరమేశ్వరసేవనే."

అని యున్నందున నాంధ్రభారతీసేవాధురీణు లగు మీరాకడ సహజప్రయత్నాధీనము గాని పరప్రేరితము గాదు. మాయాహ్వానపత్త్రికయో సమయజ్ఞాపకము గాని ప్రేరకము గాదు కాన నట్టిస్వాగతము నొకటిని మనవి చేయుచున్నాఁడను. ఇంతియె కాక-

3. స్వస్యాః ఆగతం స్వాగతం—అనఁగా నభీష్టదేవత యగు నాంధ్రభారతీసమాగమనమే మీరాకడ.

"అహత్యేభ్యోపి మద్భక్తా రక్షణీయా విశేషతః
తనూత్వన్నా న్యపత్యాని మద్భక్తా స్తనవో మమ"

అని భగవద్వాక్యానుసారముగ నాంధ్రభారతీమహాభక్తులగు మీర లాంధ్రభారతీస్వరూపులు కారా! కావున నీరీతిస్వాగతమును విన్నవించితిని.

౪. స్వాన్ ప్రత్యాగతం స్వాగతం- మీవారియొద్దికి మీరు వచ్చుట-
ఈశ్వరే తదధీనేషు బాలిశేషు ద్విషత్సుచ
ప్రేమమైత్రీకృపోపేక్షా యః పశ్యతి స ఉత్తమః."

అను శ్రీభాగవతోక్తి ననుసరించి యుత్తము లగుమీకును నాంధ్రభారతీవార్షికోత్సవము గావించుమేము మిత్రులమే గావున మీవారలమే. అని యీవిధమగు స్వాగత మొకటి విజ్ఞాపనచేయుచున్నాఁడను. మఱియొకటి:—

స్వం ప్రతి ఆగతం స్వాగతం— స్వం—ఆంధ్రభారతీజన్మస్థానమును గూర్చి ఆగతం—వచ్చుట-ఇది యెట్లనిన:—రాజరాజనరేంద్రరాష్ట్రము, ఆంధ్రభారతీజన్మస్థానము గదా. రాజ రాజ నరేంద్రాస్థాన పండితవర్యు లగు నన్నయభట్టారకు లారంభోద్ధారకులు కాన నీరాష్ట్రి మాయెకు జన్మస్థానము. మఱియు నీముక్తీశ్వరగ్రామము ఆంధ్రభారతీదేవి కశ్రుతాదృష్టపూర్వావై భవనిర్మాణనిర్వాహకస్థానము. అది యె మనఁగా:—పూర్వకాలంబున రాః

రాజనరేంద్ర కృష్ణదేవరాయాది మహారాజు లెందఱెందఱో తమతమయాస్థానములం బండితవర్యు లగు మహాకవులను నిల్పి యు మఱికొందఱు మహాకవులకు వార్షికపారితోషికము లొసంగియుం గవితారసాస్వాదనలోలమానసులై యాంధ్రభారతీసేవ గావించినవారు. వారివారికాలములయం దాయాసంస్థానములయం దాంధ్రభారతి పెంపొంది యుండె నంట. అంతియె కాని, సకలాంధ్రదేశస్థు లగు మహారాజులు గొప్పగృహస్థులు మొదలగువా రందఱును నీరీతి నాంధ్రభారతి నిరవచ్ఛిన్నవృద్ధినిర్వాహభారనిర్వాహకమహోత్సాహ మ ద్భవించున ట్లెవ్వరును సంకల్పించి యుండలేదు. ప్రస్తుతము త ద్భృశోత్సాహజనకపరిషద్రూపోపాయ నిర్మితిసంకల్పారంభకులు మహారాజశ్రీ జయంతి రామయ్యపంతులుగారు- వారియుద్యమశుద్ధిచేతనే నిరవద్యనిరంకుశమహౌదార్యధుర్యులు కవితారసాస్వాదనాధీనసరససహృదయులును సమారబ్ధకార్యసంపూర్తిబద్ధకంకణాగ్రగణ్యులు నగు శ్రీపిఠాపురము మహారాజావారి దృఢాలంబనమబ్బెను. అట్లే మఱికొందఱు శ్రీమంతులు సహృదయులు సరసులు నుదారులు సంస్థాపకులు గాను పోషకులుగాను సభ్యులుగాను నిలిచి యున్నందున నీ యాంధ్రభారతీకల్పవల్లి క్రమక్రమముగ దినదినప్రవర్ధమాన మై యావదాంధ్రదేశవేల్లిత మైనది.

పూర్వమున నత్రివసిష్ఠాదిమహర్షులు గౌతములవారిని గోరి గౌతమీప్రవాహమునుండి తమతమనామాంకితము లగు ప్రవాహముల నొక్కొక్కమార్గముగాం దీసికొని వెడలి నదీపతిని జేర్చినారు. అందులోం గౌశికమహర్షి స్వదేశాభిమాన మెక్కుడు గలవాం డగుటచేం దాను దెచ్చిన కౌశికీప్రవాహమును దనయాశ్రమగ్రామము లన్నింటికిని రెండుమూండుప్రక్కలు దిరిగి వచ్చునట్లు త్రిప్పిత్రిప్పి యాదట నదీనాథుని జేర్చెను. ఈజయంతి రామయ్యపంతులుగా రా కౌశికవంశస్థు లగుటచే స్వదేశాభిమానప్రౌఢిమం జూపి యీయాంధ్రభారతీమహాప్రవాహమును, ఆంధ్రదేశమంతయును జుట్టిత్రిప్పి నిరవిచ్ఛిన్నవైభవముతో నందున ట్లొనర్చుచున్నారు. అట్టిరామయ్యపంతులుగారిజన్మభూమి, నివాసస్థానమును నగు నీముక్తీశ్వరము మన యాంధ్రభారతీదేవికిం బెంపుటిల్లుగాం దలంపం దగి యున్నది. ఆంధ్రగీర్వాణాశుకవితాప్రబంధకవితాసంగీతసాహితీశాస్త్రపాండితీవిరాజమానులై కీర్తిశేషులైన శిష్టు కృష్ణమూర్తి విద్వత్కవివరుల కీముక్తీశ్వరము జన్మస్థానము. బహుకాలము నివాసస్థాన

ము. ఈకారణములచేత నీముక్తీశ్వరము గూడ నాంధ్రభారతీస్థానమే అట్టి స్వస్థానమునకు మీయందఱియాగమనమునను మఱియొక స్వాగతశబ్దార్థమును నివేదించుచున్నాఁడను.

౬. అంతియకాక, నాలాభమును బ్రతిపాదించుస్వాగత మొకటి-స్వస్మై=నాకొఱకు 'అనఁగా నాలాభముకొఱకు, ఆగతం=వచ్చుట. ఇరువదియైదువత్సరములనుండి యత్నించి మహారాజశ్రీ దివాన్ బహద్దరు దుర్సేటి శేషగిరిరావుపంతులుగారి యౌదార్యనిధిలాభముచేతను, జయంతి రామయ్యపంతులుగారి సర్వకార్యానుబంధి నిత్యకరావలంబనశక్తిచేతను మఱికొందఱు బంధుమిత్రశిష్యసాహాయ్యముచేతను నాచే నిర్మింపఁబడినట్టి యీరాజరాజేశ్వరీముక్తీశ్వరదేవస్థాన మీపరిషత్పండితవర్యనయనకమలమాలికాలంకృత మైనందున నింతకాలమువఱకు నేను గావించిన ధనాయుర్వ్యయము సంపూర్ణఫలిత మైనది యని యానందించుచున్నాఁడను. వేయివేలుగా నప్పుడప్పుడు పెద్దలసమావేశ మిచ్చుటఁ గలిగినను ఏకదా యిందఱుమహాజనుల సమావేశము గలుగుట దుర్ఘటము. కాన, నిట్టిలాభ మీపరిషదాగమమున నాకు లభించినది. కావున నీరీతి యగుస్వాగతమును గూడ విజ్ఞాపనము చేయుచున్నాఁడను.

ఇఁక మీరలిచ్చటను మాయుపచారము లత్యల్పము లైనను మే మత్యంతశ్రద్ధాభక్తులతో మీపరిచర్య చేయుదుము గాన—

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
అశ్నామి భక్త్యుపహృతం
యద్యత్ప్రదీయతే భక్తైః స్పృష్టం తత్సర్వమేవ మే
భక్తిస్తు నమయా స్పృష్టా సాతుసత్సఙ్గసమ్భవా.

అని యీరీతిని భగవదభిప్రాయము గాన మాయత్యల్పోపచారములను మహోపచారములుగఁ దలఁచి మమ్మానందింపఁజేసి కృతకృత్యులుగఁ జేయఁగోరుచు నిప్పు డింతటితో విరమించుచున్నాఁడను.

| ధాతువు. | | సంస్కృతార్థము. | తెనుఁగర్థము |
|---|---|---|---|
| వ్రేలుకాడు | | | |
| వేలుకాడు | అ | ముహుర్లంబనే | వేమా అులంబితమవుట |
| వ్రేలాడు | | | |
| వేలాడు | | | |
| వేలు | | | |
| వేల్చు | స | హోమే | హోమముసేయుట |
| వ్రేలు | | | |
| వ్రేల్చు | | | |
| వేవు | అ | నిశాత్యయే | తెల్లవాఱుట |
| వేసఱు | అ | నిర్వేదే | విసుకుట |
| వేసాఱు | | | |
| వై | స | పాతనాదా | వేయుట |

## స

| ధాతువు. | | సంస్కృతార్థము. | తెనుఁగర్థము |
|---|---|---|---|
| సకిలించు | అ | అశ్వశబ్దే | అశ్వముశబ్దించుట |
| సగ్గు | అ | ద్రవశైథిల్యే | క్రుళ్లుట |
| | అ | హాన్యేచ | తగ్గుట |
| స్రగ్గు | అ | హాన్యే | తగ్గుట |
| సడించు | స | తాడనే | కొట్టుట |
| | | తండులాదిషూపలాపన | బియ్యము మొదలైన వాని |
| | | యనేఫలీకరణావఘా | యందు ఊలుపోఁగొట్టుట |
| | | తేచ | తవుకుపోవునట్లు దంచుట |
| సడలు | అ | హాన్యే | తగ్గుట |
| | | విశ్లేషేచ | విడిపోవుట |
| సతపోరు | అ | అవిముచ్యకలహే | విడువకకలహించుట |
| సాతరించు | స | భయసంత్రాణే | భయమువలనరక్షించుట |
| సంతసించు | అ | సంతోషే | సంతోషించుట |
| సంతసిలు | | | |
| సదించు | స | అయశ్శిలాకరణే | ఇనుముగడ్డగాఁజేయుట |
| సాదడించు | అ | విస్తృతౌ | విస్తరించుట |
| సన్నగించు | | | |
| సన్నగిల్లు | అ | కార్శ్యే | కృశించుట |
| సన్నగిలు | | | |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| సమాళించు | అ | అనుపహాతీకరణే | చెడకుండంజేయుట |
| | | మనఃప్రణిధానేచ | మనస్సును సావధానముగఁ జేయుట |
| సమయు | అ | నాశే | నశించుట |
| సముకట్టు | అ | ఉద్యోగే | ఉద్యుక్తుండవుట |
| | స | ఉద్యోజనేచ | ఉద్యోగింపంజేయుట |
| సమర్తాడు | అ | ప్రథమరజోదర్శనే | ప్రథమముగ రజస్వలయగుట |
| సమకూడు<br>సమకూరు | అ | అనుకూల్యే | అనుకూలమవుట |
| సఱచు | | | |
| సరబడించు | అ | స్నేహే | స్నేహమవుట |
| సరియు<br>సరుదు<br>సరుసు | స<br>గ్రా | అపర్యాప్తస్యపర్యాప్తస్యవా వస్తునస్సద్వేషాంవిభజనే | చాలని వస్తువునైనను చాలిన వస్తువునైనను అందఱకుసరిగాఁ బంచిపెట్టుట |
| సరిపోవు | అ | సమీభావే | సమమవుట |
| | | కాలక్షేపే | కాలముగడచుట |
| | | అసందిగ్ధీభవనేచ | సందేహము పోయినదగుట |
| సరిపుచ్<br>సరిచేయు | స | సమీకరణే | సమముగాఁజేయుట |
| | | కాలనయనే | కాలముగడపుట |
| | | అసందిగ్ధీకరణేచ | సందేహము పోయినదానిగాఁ జేయుట |
| సరివచ్<br>సరిపడు | అ | సామ్యే | సమమవుట |
| | | అసందిగ్ధీభవనే | సందేహముపోయినదవుట |
| | | అనురూపతాయాంచ | తగినదవుట |
| సరితీయు | స | రజ్జుస్వర్ణలతాదేర్దీర్ఘీభవనాయకర్షణే | త్రాడు- బంగారుతీఁగె- మొదలయినవానిని బొడుగుచేయుటకై లాగుట |
| సలుపు | స | కరణే | చేయుట |
| | | నయనే | గడపుట- మాటలుసలిపినని |
| | | వేదనావిశేషేచ | తీపులుతీయుట గ్రా. |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము |
|---|---|---|---|
| సలపరించు గ్రా. | అ | జ్వరారంభే | జ్వరము వచ్చుటకారంభించుట |
| | | పులకోద్గమేచ | రోమాంచితమవుట |
| సళ్లు | అ | శైథిల్యే | శిథిలమవుట |
| | | గతౌచ | పోవుట |
| సవరించు | స | యథాస్థాననివేశనే | యథాస్థానముగా నుంచుట |
| | | సమ్యక్కరణేచ | బాగుచేయుట |
| సాఁకు | స | పోషణే | పోషించుట |
| సాఁగు | అ | గతౌ | పోవుట |
| | | నిర్వృత్తౌ | నెఱవేఱుట |
| | | ప్రసరణేచ | ప్రసరించుట-అనఁగాఁ బొడుగయ్యెననుట |
| సాఁగించు | స | యాపనే | పోవునట్లుచేయుట |
| | | నిర్వర్తనేచ | నెఱవేఱఁజేయుట |
| సాఁచు | స | ప్రసారణే | ప్రసరింపఁజేయుట |
| సాతాళించు | స | మృదుబీజాదీనాం స్వల్పస్నేహేనపచనే | మెత్తనివిత్తులు మొదలైనవానిని జమురు కొంచెముగా వేసి పక్వముసేయుట |
| సాఁపు | స | ప్రసారణే | ప్రసరింపఁజేయుట |
| సాపడు, సాపాడు, సాబడు | స | భోజనే | భోజనముచేయుట |
| సిగ్గుపడు | | | |
| స్రక్కు | అ | బలహానౌ | బలహీనుఁడవుట |
| | | హైన్యేచ | తగ్గుట |
| సుడియు, సుఁసుసు(గ్రా) | అ | అగ్రోవస్థానే | ఎగసటనిలుచుట |
| | | భస్మీభూతే | కాలుట |
| | | వేష్టనేచ | చుట్టుకొనుట |
| సుడిగొను | అ | వేష్టనే | చుట్టుకొనుట |

| ధాతువు | | సంస్కృతార్థము. | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| సుడివడు | అ | మనఃకాలుష్యేణసంభ్రమే | మనస్సునఁ గలఁతచేతఁ దొట్రుపడుట |
| సునాయించు | స | వస్త్రాదిసజ్జీకరణే | దోవతి మొదలైనదాని నాయత్తముగఁ జేయుట |
| సుగాళించు | స | అలక్ష్మీకరణే | అలక్ష్యముసేయుట |
| | | విధూననేచ | విదిలించుట |
| సురగు | అ | పలాయనే | పలాయితుండవుట |
| సుఱసుఱలాడు | అ | శుష్కపర్ణాదీనాందాహే | ఎండాకులు మొదలైనవి కాలుట |
| సెగ్గించు | అ | అసహనే | అసహ్యపడుట |
| సెలయు | అ | అత్యుద్ధతౌ | చెలరేఁగుట |
| సెలఁగు | స | అవతిక్షణే | క్రిందుగాఁ జెక్కుట |
| సైఁచు / సైరించు | స | సహనే | సహించు |
| సొక్కు / సొగయు | అ | మత్తతాయాం / శ్రాంతౌ | మతుకొనుట గ్రాఁ / బడలుట |
| సొంపిల్లు / సొంపారు | స | శోభాయాం | శోభించుట |
| సొమ్మసిల్లు / సొమ్మసిలు | అ | మూర్ఛాయాం | మూర్ఛపోవుట |
| సొలయు / సొలియు | అ | నిస్సత్వతాయాం | నిస్సత్త్వుండవుట |
| సోఁకు | స | స్పర్శే | స్పృశించుట |
| | | ప్రాప్తౌచ | పొందుట |
| సోలు | అ | పిత్తాదివైవశ్యే | పిత్తాదులచేత వివశుండవుట |
| | | పరాజయేచ | ఓఁడుట |

## హ

| | | | |
|---|---|---|---|
| హత్తు | స | అవలంబనే | అవలంబించుట |
| | | సన్నిధానేచ | దాపునం జేరియుండుట |
| హెచ్చు | అ | విజృంభణే | విజృంభించుట |
| | స | అతిశాయనేచ | అతిశయించుట |

మణిశ్శాణోల్లీఢః—

*తఱిమెన మణి దానచ్యుతిఁ, గరి యోఁగి ధని రతి బాల కార్తికి సరసుల్
ధరఁ గొంచెమైన భాసిలు, నరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౩౫

రాజన్ దుధుక్షసి—

ఇల గోవుగ దూడలు లో, కులుగా నేల్నృపతి యేమి గోరి పితుక న
య్యిల యిచ్చుఁ గల్పలతవలె, నలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౩౬

సత్యానృతాచ—

పరుషప్రియసత్యానృత, కరుణాహింసవ్యయార్థగౌరవలీలల్
సరి వేశ్యకు నృపనీతికి, నరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౩౭

ఆజ్ఞాకీర్తిః—

దానము ద్విజమిత్రపరి, త్రాణము భోగంబు నాజ్ఞ తతకీర్తియు నుం
డే నృపతిఁ గొల్వఁజను నా, ర్యానుత వెల్లూరి వేంకటాచలరమణా. ౩౮

యద్ధాత్రానిజఫాల—

సురగిరి వని విధిలిఖిగతి, సిరి వచ్చును వగవనేల సింధున బావిన్
సరి జలము కడవ ముంచిన, నరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౩౯

—: ౫ దర్జనపద్ధతి :—

అకరుణత్వం—

పరధనయోషిత్స్పృహ ని, ష్కరుణ యకారణకలహము ఘనబంధువిరో
ధరతి యివి దుష్టునిగుణము, లరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౪౦

దుర్జనః పరిహర్తవ్యః—

ఘనవిద్య గల్గినను దు, ర్జనుఁ డొప్పఁడు ఫణములందు రత్నౌఘము లుం
డిన ముట్టఁ దగునె సర్పం, బనువుగ వెల్లూరి వేంకటాచలరమణా. ౪౧

†శశీదివసధూసరః—

పగటినెల ముసలిచెలి లు, బ్ధగుదౌర చదువని సురూపుఁ డగుబుధుఁ డకజం
బగుకోలను సభ ఖలుఁడు సౌం, పగుదురె వెల్లూరి వేంకటాచలరమణా.

నకశ్చిచ్ఛిద్రకోపానాం—

కినుక గలవేళఁ దనవా, రని చూడరు నృపులు వేల్చునప్పుడు స్పృశియిం
చిన హోతనయిన విహువం, డనలుఁడు వెల్లూరి వేంకటాచలరమణా. ౪౩

---

* తరిపన—మూ. †దీనికిమీఁద "బాద్యంహీః, లోభశ్చేదనలేన" అను రెండుశ్లోకములకుఁ బద్యములు లేవు.

మౌనాన్మూకః—

కినియఁగ గయాళి మానం, బున నుండిన మూఁగ శాంతమున భీరువు చెం
త నిలువ గర్వి కడను *సను, వనెదరు వెల్లూరి వేంకటాచలరమణా. ౪౪

ఉద్భాసితాఖిలఖలస్య—

ఖలులు గొలువ నసుమంత్రము, కలిమి గలిగితొంటిపాట్లు గనుఁగొననివిశ్వం
ఖలనృపుకడ నెవరికి సుఖ, మలరును వెల్లూరి వేంకటాచలరమణా. ౪౫

ఆరమ్భగుర్వీ—

ఖలుమైత్రి తొలుత దీర్ఘ మ్ము, వలఁ గృశ మగు సుజనుమైత్రి వరుస నధికమా
నిల దినపూర్వాపరచ్ఛా, యలవలె వెల్లూరి వేంకటాచలరమణా. ౪౬

మృగమీనసజ్జనానాం—

జలతృణచిత్సుఖములఁ జేఁ, పలు మెకములు సుజను లుండ వ్యర్థ మణఁతురా
నిల ధీవరలుబ్ధకఖలు, లలవడ వెల్లూరి వేంకటాచలరమణా. ౪౭

—: ౬ సుజనపద్ధతి :—

వాఞ్ఛా సజ్జనసఙ్గతౌ—

హారగురునతి స్వవధూరతి, పరగుణనుతి శమ మనింద ప్రాజ్ఞత గలస
త్పురుషులు భూమి కలంకృతు, లరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా.

విపది ధైర్యం—

అని శౌర్య మాపదను ధృతి, ఘనసభ వాక్పటిమ కీర్తికాంక్ష నిగమచిం
తన సంపద క్షమ సుజనున, కనువగు వెల్లూరి వేంకటాచలరమణా. ౪౯

కరే శ్లాఘ్యస్త్యాగః—

గురునతి తల నోట నిజము, కరముల నీవి మదిఁ దిరము కర్ణముల శ్రుతం
బురుదోర్జయము గలుగ సిరు, లరుదా వెల్లూరి వేంకటాచలరమణా. ౫౦

ప్రాణాఘాతాత్—

గురునతి దయ నిజ మాశా, పరధనవనితావిరక్తి ప్రాజ్ఞత యార్తా
దర మీవి నియతసుపథము, లరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౫౧

సమ్పత్సు మహతాం—

సిరులు గలవేళ నింద్రీ, వర మృదువులు చిత్తములు విపత్కాలమునన్
గిరిసదృశములు మహాత్ముల, కరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౫౨

* సనువు=సాహువు.

ప్రియాన్న్యాయ్యావృత్తిః—

తను లేమి నొందఁ జెలి నై, నను నడుగఁ డభుమనఁ జొరఁడు నయ మెచ్చటనే
ర్చెనొ బుధుఁ డసిధారావధ, మన నది వెల్లూరి వేంకటాచలరమణా. ౫౩

ప్రదానం ప్రచ్ఛన్నం—

పరుఁ డెగడ కర్థి నేలును, బరుమేల్పొగడుఁ దన మేలు పలుకఁ డెచట నే
ర్చె రసికుఁ డసిధారావధ, మరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౫౪

సన్తప్తాయసి—

ఖలమధ్యమోత్తములకుం, జలిపెనుమే ల్తప్తలోహజలరుహదళశు
క్తులఁ బహుజలకణములవలె, నలరును వెల్లూరి వేంకటాచలరమణా ౫౫

యః ప్రీణయేత్సుచరితైః—

జనకునిఁ బ్రోచినవాఁడే, తనయుఁడు పతిభక్తి గలదె తరుణియుఁ గష్టం
బున గోర్చువాఁడె మిత్రుం, డనఁ దగు వెల్లూరి వేంకటాచలరమణా. ౫౬

పద్యద్వయనిరూపణము—

పతిభక్తి గలదె సతిపితృహితుఁడె సుతుఁడు సుఖములందు నిడుములనమము
న్నతఁడె చెలిసుకృతికివి తగు, యతినుత వెల్లూరి వేంకటాచలరమణా.* ౫౭

—: ౭ పరోపకారపద్ధతి :—

భవన్తినమ్రాః—

ఫలియించి తరులు నమ్రమ్ము లగుజలము గలిగి దూరముగ మొగు లుండుం
గలిమి గలిగి బుధుఁ డణఁకువ, నలరును వెల్లూరి వేంకటాచలరమణా. ౫౮

శ్రోత్రంశ్రుతేనైవ—

వలయములు కరములకుఁ గుం, డలము చెవికి మొయికిఁ జందన మలంకృతిగా
దిల దానము శ్రుత ముపకృతి, యలరును వెల్లూరి వేంకటాచలరమణా. ౫౯

పద్మాకరం దినకరః—

నెలఁ గలువ లర్క నబ్జమ్ములు వేఁడెనె జనులలంచములఁ గురియునె వా
నలు లోకహితము పుణ్యుల, కలరును వెల్లూరి వేంకటాచలరమణా. ౬౦

ఏ తేసత్పురుషాః—

తనమేలు విడిచి పరుమేలొనరించు త్తముఁడు మధ్యుఁ డుభయముఁ జేయుం
దనుఁ బ్రోచెదముఁ డుభయ మెవఁడణఁచునొ వెల్లూరి వేంకటాచలరమణా

* ఈక్రింద "నమ్రత్వేనోన్నమన్తః" అనుదానికిఁ బద్యములేదు.

పాపాన్నివారయతి—

కలుషము డఁచు విషువఁడు మే, ల్దెలుపుఁ దజినోసఁగు గుణము నుతించుఁ గళంకం
బిల బాఁచు మిత్రగుణమిది, యలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా.

క్షీరేణాత్మగతోదకాయ—

తనగుణము నీళ్ల కిడుపా, లనకం బెను మున్న నీరు తపియింపఁగఁ బా
లనలమునఁ బడఁ జెలిమి జల, మణఁచును వెల్లూరి వేంకటాచలరమణా.

ఇతః స్వపితి కేశవః—

హరి యొకచో వసియించు గిరులు ఘనము లసురు లగ్ని నిలుతు రొక్కొకచో
శరనిధి భారసహనమెం, చరు దగు వెల్లూరి వేంకటాచలరమణా. ౬౪

జాతః కూర్మః—

ఇలఁ దాల్చుఁ గచ్ఛపము గ్రహ
ములఁ దాలుచు ధ్రువుఁ డిరువురు ముఖ్యులు నన్యుల్
నలజాండోదుంబర క్రిము
లలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౬౫

తృష్ణాం ఛిన్ది భజ క్షమాం—

కలుషము దాశ లుడిగి పె, ద్దలసేవ దయాసుశీలతథ్యతు మతీ
ర్థుల బుధహితముల ఘనుఁ, డలరును వెల్లూరి వేంకటాచలరమణా. ౬౬

మనసి వచసి కాయే—

పరుల గుణలేశ మెంచుఁ ద్రి, కరణసుకృతపూర్ణుఁడై జగముల కుపకృతిం
దిరముగ నొనర్చు పుణ్యుం, డరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౬౭

—: ౮ ధైర్యపద్ధతి :—

రత్నైర్మహార్ఘైః—

వనధి మణులు విషము జనిం, చిన ముదము స్థితి సురలఁ జెందదు సుధపు
ట్టినఁ గని క్రియ యాడేఁ బుదు, ననువుగ వెల్లూరి వేంకటాచలరమణా. ౬౮

ప్రారభ్యతే నఖలు—

పనిఁ బూనఁడు నీచుఁడు నడు, మను విఘ్నము చెంద విడుచు మధ్యముఁ డెన్నై
నను విడనాడం డుత్తముఁ, డనఘా వెల్లూరి వేంకటాచలరమణా. ౬౯

క్వచిత్పృథ్వీశయ్యః—

ఇల శయ్య సరిగఁ బండును, గలమాన్నముఁ గూరసమును గాఁ దిను బొంతఁ
వలువ సరి గప్పు ధీరుం, డలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. 20

నిన్దన్తునీతినిపుణా—

ఘనులు నుతింపని తిట్టని, తను వుండని పోని సిరి ముదంబున రానీ
చననీ నాయము *విడువం, డనఘుఁడు వెల్లూరి వేంకటాచలరమణా. 21

కాంతాకటాక్షవిశిఖా—

లలనాదృగస్త్రములు రు, డ్జ్వలనము విషయములు లోభపాశము నెవనిం
గలఁప వతఁడె జగములగెలు, చలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా 22

కదర్థితస్యాపి—

ధీరుల కాకవే శాపద, చేరిన ధృతి విడువ రగ్నిశిఖ తలక్రిందా
తీరునఁ బట్ట నధోగతి, యౌరా వెల్లూరి వేంకటాచలరమణా. 23

వరంశృఙ్గోత్సఙ్గాత్—

తనధర్మ ముడుగుకంటెను, వనలములోఁ బడుట కేలు నహినోట నిడఁ
ఘనగిరి నెక్కి లఁబడ మే, లనఁదగు వెల్లూరి వేంకటాచలరమణా 24

వహ్నిస్తస్యజలాయతే—

చిలువలు నరు లబ్ధులు కాల్వలు నగములు శిలలు వహ్ని వారి హారల్ జిం
కలు విషము సుధ సుశీలున, కలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. 25

ఛిన్నోఽపి రోహతితరుః—

నెలకుఁ గళ తిరిగి రాదే, కలుగదె తరుశాఖఁ దునుమఁ గ్రమ్మఱ సిరులుం
దొలఁగు మఱి చేరు నని బుధు, లళుకరు వెల్లూరి వేంకటాచలరమణా† 26

—: దైవపద్ధతి :—

నేతా యస్యబృహస్పతిః—

హరి ప్రాపసి పవి సితకరి, తురగము గురు డొజ్జ వేల్పుతుటుము గలిగినం
బఱచె హరి పౌరుషము వృథ, యరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా 27

భగ్నాశస్య—

ఎలుక తుఘఁ బెట్టెఁ గొఱుకం, జిలువ వెడలి దానిఁ దిని చనె న్సుఖదుఃఖం
బులను దైవంబె కర్త్రై, యలవడు వెల్లూరి వేంకటాచలరమణా 28

* విడువరు। నలఘులు - మూ

† ఇక్కడ "ఐశ్వర్యస్యవిభూషణం" అను శ్లోకమునకుఁ బద్యములేదు.

యథాకన్దుకపాతేన—

ఘనుఁ డొక వేళను బడి గ్ర, క్కున నెగయు విధాన లేమఁ గుజనుఁడు పడినం
తనె మంటిముద్దవలెనే, యణఁగును వెల్లూరి వేంకటాచలరమణా. ౭౯

*గజభుజఙ్గవిహఙ్గమబన్ధనం—

ఫణి కరి విహగములకు బం, ధన మర్కేందులకు రాహువలి లేమి సుధీ
జనుల కొనరించె విధి బలుఁ, డనఁదగు వెల్లూరి వేంకటాచలరమణా. ౮౦

సృజతి తావదశేషగుణాకరం—

ఇలకుం దొడవై సుగుణం, బులకిమ్మగుపురుషు నజుఁడు పుట్టించి ధర
న్నిలుపవియెడ హాహా యే, మన నలవడు వెల్లూరి వేంకటాచలరమణా. ౮౧

అయ మమృతనిధానం—

శశిభిషగంచితుఁ డోషధి, పతి యమృతశరీరి శివుని ప్రాపు గలశశి
శితయక్ష్మ విడదు విధిదాఁ, టతరమె వెల్లూరి వేంకటాచలరమణా.† ౮౨

విరమ విరమాయాసాత్—

ఘనునకు విధి హృత్తాపం, బున నాశద వెట్ట ధైర్య ముడుగునె కల్పం
బున నైన శైలజలధుల, యనువుగ వెల్లూరి వేంకటాచలరమణా. ౮౩

దైవేన ప్రభుణా స్వయం—

ఇల దైవకృతము గతి మే, ల్గలుగదు బలువాన గురియఁగాఁ జాతకప
క్షుల కుదకణములు నాల్గై, దలవడు వెల్లూరి వేంకటాచలరమణా. ౮౪

‡యేనైవామ్బరఖణ్డేన—

తరణి శశిభుక్తశేషాం, బరఖండము పగలు గొను తుషారకరుఁడె క్ర
మ్మరఁ గొను నిసి మాలిన్యం, బరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౮౫

—: ౧౦ § కర్మపద్ధతి :—

బ్రహ్మా యేన—

హరికి దశాకృతి భిక్షము, హరునకు భ్రమణంబు రవికి నజునకు జగముల్
విరచింపఁ జేసెఁ గర్మమె, యరసా వెల్లూరి వేంకటాచలరమణా ౮౬

---

* దీనికి పిమ్మట "ఖల్వాటో దివసేశ్వరస్య" అను దానికిఁ బద్యము లేదు † "ప్రియసఖి" యను దాని పద్యము లేదు. ‡ ఈశ్లోకము ముద్రితప్రతులలోఁ గనఁబడదు. § ఈపద్ధతి మొదటి "నమస్యామో" అను దానికిఁ బద్యము లేదు.

యాసాధూంశ్చ—

ఘను నీచు వివేకి జడు న, ఖుని రిపు విషమును సుధఁ జెంతకుని దవ్వఁగఁజే
యును గర్మము కోర్కి వృథా, యనవలె వెల్లూరి వేంకటాచలరమణా ౮౭

శుభ్రంసద్మ సవిభ్రమా—

చెలులు ధనము గొడుగులు మేడలు శుభకర్మముల నవి నెడల రతిసూత్రం
బులు దెగినముత్తెములవలె, నలరును వెల్లూరి వేంకటాచలరమణా. ౮౮

గుణవదగుణవద్వా—

గుణమేని యగుణమేని యు, జనుఁడొకకార్యంబు సేయఁ జన నదియుదియ
బ్బిన దాఁకఁ జిత్తశల్యం, బనఁ జను వెల్లూరి వేంకటాచలరమణా. ౮౯

* నైవాకృతిః—

కులశీలరూపనృపసే, వలఁ జదువుల రావు కాలఫలితావనిజం
బులక్రియఁ దొలుతపమున సిరు, లలవడు వెల్లూరి వేంకటాచలరమణా ౯౦

మజ్జత్వమ్భసి—

జలధి మునుఁగఁ జదువ సురాచల మెక్క విరోధిగెల్వఁ జదలఁ జనఁ గ్రయం
బులు సేయ దున్నఁగా హెచ్చలరునె వెల్లూరి వేంకటాచలరమణా. ౯౧

వనేరణే—

అని నరి విషభువి వని న, బ్ధిని గిరి శిఖవలన సుప్త విషమస్థితు మ
త్తునయినఁ దొలుసుకృతము ప్రోచనిశము వెల్లూరి వేంకటాచలరమణా ౯౨

భీమం వనం భవతి—

తొలుమేను పుణ్యమున భూ
వలయము మణియుతము భీమవనముపురము లో
కులు మిత్రులగుచు నుండుదు
రలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౯౩

---

* స్థాల్యాం వైదూర్యమయ్యా అను దానికిఁ బద్యము లేదు.

# 2. శృంగారశతకము.

## ౧ స్త్రీప్రశంస.

శంభుస్స్వయంభుహరయః—

హరవిధివిధుల వధూమా, దిరఘుటదాసులుగఁ జేయు దేవుఁ డవాఙ్గో
చరిచరితుఁ డతనుఁ డచ్చితుఁ, డరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౧

స్మితేనభావేనచ—

అలుక నగవు భయ మరచూ, పులు సిగ్గును బ్రౌఢవాక్యములఁ బురుషులకుఁ
లలనలు బంధనములు ధర, నలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౨

క్వచిత్సభ్రూభఙ్గైః—

బెళుకుచు సిగ్గున వ్రాలుచు, నలుక బొమలు గదల లీల నలరెడు చెలిచూ
పులు కలువలు చల్లినగతి, నలరును వెల్లూరి వేంకటాచలరమణా. ౩

భ్రూచాతుర్యాత్—

మందగతి ప్రౌఢవాక్యములఁ, బొందుగ సిగ్గుగలనవ్వు బొమలఁ గడలుచూ
పుం దరుణి కంద మాయుధ, మందురు వెల్లూరివేంకటాచలరమణా. ౪

వక్త్రంచన్ద్రవికాసి—

అళి నెల మధు వసు గురు ఘట, నలమూలుకురులు మొగము వచనము జిగికటిచ
న్నులుఁ గనులె తోడవు లగుఁదొ, య్యలులకు వెల్లూరి వేంకటాచలరమణా. ౫

స్మితం కించిన్ముగ్ధం—

పలుకుల సొగసు బెళుకుఁ జూ, పులు నగవుల మౌగ్ధ్యము నడపుల వింతలరం
గులు గలుగుఁ జెలికిఁ బాయం, బలరిన వెల్లూరివేంకటాచలరమణా. ౬

ద్రష్టవ్యేషుకిముత్తమం—

వినఁ జెలి పలుకులు మైఁ జేర్పను మెయి కనమోము తలఁపఁ బాయము మోవా
ననుమూర్కొన నూర్పుసుకృతి, కనువగు వెల్లూరి వేంకటాచలరమణా. ౭

వీతాశ్చలద్వలయసంహతి—

మొలనూల్గంటలుఁ గరపద, ములఁ గంకణనూపురములు మ్రోయ బెళుకుఁజూ
పుల వశులఁ జేయరే తొ, య్యలు లిల వెల్లూరివేంకటాచలరమణా. ౮

కుఙ్కుమపఙ్కకళఙ్కితదేహా—

చిఱుగజ్జెలు పదముల వర, పరిమళ మంగమున సరులు పాలిండ్లఁ దగం
బరఁగుచెలు లెవరి వశుఁ జే, యరు శ్రీవెల్లూరివేంకటాచలరమణా. ౯

నూనంహి తేకవివరాః —

కవు లబల లంచుఁ గాంతలఁ,దవి లెంతురు చూపులనె శతక్రతుముఖులన్
స్వవశులఁ జేయ నబల లె, ట్లవుదురు వెల్లూరి వేంకటాచలరమణా. ౧౦

నూనమాజ్ఞాకరః—

మగువలకు బంటు మదనుం, డగుఁ గాకున్నడవు దక్షటాక్షంబులకున్
జగ మెల్ల వశము సేయునె, యగధర వెల్లూరి వేంకటాచలరమణా. ౧౧

కేశాస్సంయమినః—

శ్రుతిగములు కనులుద్విజసం, యుతమాస్యము కురులు సంయములుధరముక్తా
*శ్రితములు కుచములు రాగా, యతనతి వెల్లూరి వేంకటాచలరమణా. ౧౨

ముగ్ధేధానుష్కతాసేయం —

విలువిద్య లెచట నేర్చిరొ, నెలఁతలు విశిఖములు లేకనే గుణముల మ
ర్త్యులమనసులు భేదించెద, రలఘులు వెల్లూరి వేంకటాచలరమణా. ౧౩

సతిప్రదీపే సత్యగ్నౌ—

నెల మణులు దీపములుఁ జు, క్కలు భాస్కరుఁ డున్నఁ గాని కాముకుచెంతం
జెలి లేకుండినఁ దమమై, యలరును వెల్లూరి వేంకటాచలరమణా. ౧౪

ఉద్వృత్తస్తనభార—

చలములు బొమలు కనుఁగవచ,పల ముద్వృత్తములు చనులు వాతెఱరాగో
జ్జ్వల మయి మధ్యగుణము నా, రళుకగు వెల్లూరి వేంకటాచలరమణా.౧౫

ముఖేనచంద్రకాన్తేన—

జలజాతరాగములు కర, ములు హరినీలములు కురులు ముఖములు శశికాం
తులు రత్నపుబొమ్మలు తొ, య్యలు లగు వెల్లూరి వేంకటాచలరమణా.

పక్షద్వయనిరూపణము—

హరినీలము లలకలు సిత,కరరాగము లాననములు కజరాగంబుల్
కరము లగుటఁ జెలి మణిబొ, మ్మరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా.

గురుణా స్తనభారేణ—

గురుభావము చనులు శనై,శ్చరభావ మడుగులు ముఖము శశిభావము సుం
దరుల కగుఁగాన గ్రహమయ, మరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా.

---

* శ్రితకుచములయి నెలఁతి రాగాయతయగు.-మూ. శ్రితకుచయయిసతిరాగా, యతయగు.- అనియుఁ బఠింపవచ్చును.

తస్యాః స్తనౌ యది ఘనౌ—

చను వారా ముఖ మహాహా,ఘనజఘనం బదిక యనుచుఁ గొంతెంపఁగ నే
లను మనసు పుణ్యముల సుఖ, మనువగు వెల్లూరి వేంకటాచలరమణా.

ఇమే తారుణ్యశ్రీః—

సురతాటోపాంచితములు, తరుణులలీల లతనుజయదానచణమనో
హరములు వికారదీపను, లరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౨౦

ప్రణయమధురాః—

ప్రమదలమృదూక్తు లతిమధు,రములు సుభగములుమనోహరములతనువికా
సము లనురాగార్ద్రములై, యమరును వెల్లూరి వేంకటాచలరమణా. ౨౧

—। ౨. సంభోగవర్ణన ।—

విశ్రమ్యవిశ్రమ్య—

చెలువయొకతె శశికిరణ,మ్ములమాటుగఁ బైటఁ హస్తమునఁ బట్టి కుచ
మ్ముల నీడ నిలుచు విహరిం,చలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౨౨

అదర్శనే దర్శనమాత్రకామా—

కనఁగోరుఁ జూడ నుపగూ, హనమును గోరది లభింప నతివతనువు మే
నునఁ జేర్పఁ గోరుఁ బురుషుం, డనువుగ వెల్లూరి వేంకటాచలరమణా. ౨౩

మాలతీ శిరసి జృమ్భణాం—

తనువునఁ గుంకుమ గంధము, ఘనసుమములదండ శిఖను గాంత యెదను గ
ల్గిన స్వర్గ మేల పురుషున, కనువుగ వెల్లూరి వేంకటాచలరమణా. ౨౪

ప్రాఙ్మేతి—

వల దను సిగ్గువఁ బడు ధృతి, నలరు నభిలషించుఁ బ్రియుని నంగజతంత్రం
బుల మెప్పించును గులసతి, యలవడ వెల్లూరి వేంకటాచలరమణా. ౨౫

ఉరసి నిపతితానాం—

అరమోడ్పుఁగనులఁ జెమటం,దొరఁగెడుచెక్కులనుజాఱుతుఱుమున నెదవ్రాల్
తరుణుల ముద్దిడు భాగ్యం, బరుదగు వెల్లూరి వేంకటాచలరమణా. ౨౬

ఆమీలితనయనానాం—

ప్రమదలుఁ గాముకు లేకాం,తము విడువని తమి నిమీలితాంబకులగుచుం
దమిఁ జల్పుకేళికలె బ్రహ్మాము లగు వెల్లూరి వేంకటాచలరమణా. ౨౭

ఇద మనుచిత మక్రమ శ్చ పుంసాం—

జర రతి మానని పురుషు, డురుకుచములు వ్రాలి సురత ముడుగనిచెలి యి
ర్వ్వరినడక లనుచితంబులు, హరనుత వెల్లూరి వేంకటాచలరమణా. ౨౮

రాజం స్త్రప్లాంబురాశేః—

జతఁ డాశ విడఁడు పాయము, చన నర్థం బేల వనిత జర గల్గక యుం
డినదనుక నిల్లు సొరఁ దగు, ననవలె వెల్లూరి వేంకటాచలరమణా. ౨౯

రాగస్యాకార మేకం —

ఇల దోషరాగమోహా, ఖ్యుల కతనుసఖుడు చిదబ్జమదిరము నరక
ఖ్యుల కిరవు కొమరుఁబాయుం, బలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౩౦

శృఙ్గారద్రుమనీరదే —

వనితాక్షిచకోరశశి యు, తనుసఖుడు విలాసరసప్రదకు శృంగారా
వనిజఘనము పాయ మెవరి, కణఁకువ వెల్లూరి వేంకటాచలరమణా ౩౧

సంసారేస్మిన్నసారే—

నెలతలకుం బకాంచికటుల్, కులుకుఁజనులుఁగలుగుచెలువకోఅకుబుధులురా
జులఁ గొల్తురు సంసార్లు, యులరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౩౨

సిద్ధాధ్యాసితకన్దరే —

హారవృషము గంగ *సిద్ధపుఁ, జటులు గలహిమాద్రి యుండ జను లితరతలం
బరయుట స్త్రీకొఱకే కద, హరనుత వెల్లూరి వేంకటాచలరమణా. ౩౩

సంసారతవపర్యన్తపదవీ —

†తరుణి తరంగాంతరదు, స్తర మని సంసారజలధి దాఁటరు గాకీ
నరుల కది యెంతద వ్వగు, నరయుఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౩౪

దిశ వనహారిణేభ్యః—

మలలో లేళ్ళకు నందియు, వలె దర్భలు కాకయున్న వనితల కెపుడుం
జెలనాకులు మడఁచియువలె, నలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౩౫

అసారాస్సర్వే తే—

లలనలు దూష్య లనేనుడి, గల దైనను బరహితంబుకంటె సుకృతముం
జెలికంటెను రమ్యము లే, దలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౩౬

* సిద్ధము చరలు-మూ †తరుణితరంగమువలె నం। తరమని సంసారజలధి-అని పదద్వయ నిరూపణము-

మాత్సర్యముత్సార్య—

చల ముడిగి బుధు ల పలుకుదు, రలజనముల కాశ్రయింప నద్రినితంబం
బులు * గాఁగఁ జెలినితంబము, లలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా ౩౭

సంసారేస్వప్నసారే—

చలనసంసారమున భా, సిలు బుధులకుఁ జిత్సుఖసుధసేవయ కాదేఁ
జెలిమోవిస్పర్శవదగు, నలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౩౮

ఆవాసః క్రియతాం—

నరుఁ డాశ్రయింపఁదగు భవ, హరగంగాతటమునైన హారాళిలస
త్తరుణీకుచముల నైనన్, హరసఖ వెల్లూరి వేంకటాచలరమణా. ౩౯

కిమిహబహుభిరుక్తైః—

జనులకు వ్యర్థోక్తులచేఁ, బనియేమిల నాశ్రయింప భామామణియౌ
వనమైన వ్వనమైన, న్ననిశము వెల్లూరి వేంకటాచలరమణా. ౪౦

సత్యం జనావచ్మి—

పలికెద నిజము త్రిలోక, మ్ముల సుఖదుఃఖములకెల్ల మూలమ్ములు నిం
తులె కా కితరము గలదే, యలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౪౧

కాన్తేత్యుత్పలలోచనే—

కనులుబొమలు పిఱుఁదులు మొగ, మునుజన్నులు జూచియశుచిబొమ్మను మోహిం
చినుతించు జ్ఞానిసహిత, మ్మనిశము వెల్లూరి వేంకటాచలరమణా. ౪౨

స్మృతా భవతి తాపాయ—

వినినహృత్తాపమును గనుఁ, గొనఁ జిత్తోన్మాదముచు నిగూహనమున మ
త్తునిఁ జేయుఁ జేరి ప్రియ యె, ట్లనవలె వెల్లూరి వేంకటాచలరమణా. ౪౩

తావదేవామృతమయీ—

వనితయె యమృతము విషము, ట్లన దగ్గఱ నుండె నేని యమృతము నటుగా
కను దూర మున్న విష మగు, ననిశము వెల్లూరి వేంకటాచలరమణా. ౪౪

నామృతం నవిషం కించిత్—

చెలికంటె విషము సుధ లే, దలరంగా రక్తిచేత నమృతము తమిలే
కిల విషలతయై కనఁగా, నలవడు వెల్లూరి వేంకటాచలరమణా. ౪౫

* గాడె చెలినితంబ.

ఆవర్తస్సంశయానాం—

నరకముఖ మస్వర్గేఘ్నము, గరువ మవిశ్వాస మఘము కపటము గలసుం
దరియం త్ర మెవఁడు చేసెను, నరునిగ వెల్లూరి వేంకటాచల రమణా. ౪౬

నోసత్యేన మృగాజ్యా వేషవదనీ —

ఘనతర్కాంసాస్థిమయపు, దనుపు ముఖము కనులు వసుసుధాంశుకజములం
చని కవు లన వలతురు ఖలు, లనిశము వెల్లూరి వేంకటాచలరమణా. ౪౭

లీలావతీనాం సహజావిలాసాః—

అళి రాగంబున వారిజ, ములఁ దిరిగెడు చందమునను మూఢులు తముదా
లలనలకు భ్రమసి వలచెద, రలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా ౪౮

యదేతత్పూర్ణేన్దుద్యుతిహారం —

నెలఁత మొగముపున్నమనెల, వలెఁ దొలుత నమృతముఁ జిలుకవలెఁ గింపాక
మ్ములఫలములవలె విషమగు, నలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౪౯

ఉన్మీలత్త్రివళీతరఙ్గనిలయా —

స్తనకోక ధైర్యకుజలుం,రనవళివీచి యగు మదితనది సంసారా
బ్ధిని మునుఁగని వారలు సార, రనుపుగ వెల్లూరి వేంకటాచలరమణా ౫౦

జల్పన్తిసార్ధమన్యేన—

ఒకనిఁ గనుఁగొందు రలుకుకు, రొకనికి మదిఁలుపు చుంచు రొకనికి వనితల్
ఇఁక నెవ్వరు వారికిఁ బ్రియు, లకటా వెల్లూరి వేంకటాచలరమణా ౫౧

అపసర సఖే దూరాత్ —

చెలిచూపు విషము తను వే,చిలువయ దిఋ మూరుకొనిన క్షితివైద్యము లే
దిలఁ బాముకు మందులు గల, వలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౫౨

విస్తారితం మకరకేతనధీవరేణ—

స్మరకైవర్తుఁడు వనితా, ధరవలలోలజనమీనతతి భవజలధిం
దరుఁణి యనుగాలమునఁ దిగు,చరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౫౩

కామినీకాయకాన్తారే—

స్తనగిరి దుర్గము వనితా,తను వని మదనుఁ డను దొంగ తాపుకొని మనం
బనువిత్తము గొని చనుచుం, డనుపుగ వెల్లూరి వేంకటాచలరమణా ౫౪

వ్యాదీర్ఘేణచ లేన —

నలుపుగు వక్రముఁదేజముఁ, జలముఁ గులుకు భీరునేత్రసర్పములకు మం

దులు తే వహిమాదులు గల, వలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౫౫
ఇహహి మధురగీతం—
చెలి నృత్తగీతచుంబన, ములను గుచాలింగనముల మోహాపటు చని
శ్చలులం బంచేంద్రియముల, నలవడ వెల్లూరి వేంకటాచలరమణా. ౫౽
నగమ్యో మన్త్రాణాం—
మదనోన్మాదంబున భ్రమ, మదికిఁబొసమనుఁ గనులు ద్రిప్ప మై వణఁకును మా
నదు మంత్రౌషధశాంతుల, నదియును వెల్లూరి వేంకటాచలరమణా. ౫౭
జాత్యన్ధాయచ—
కులహీనుఁ జీకుఁ బంగు ను, సలి దుష్టవక ధనలవ మెుసఁగఁ గలియుభరం
గ లట వివేకలతాఖ, డ్గలలిన్ వెల్లూరి వేంకటాచలరమణా ౫౮
వేశ్యాసౌ మదనజ్వాలా—
ఇల వేశ్యలు మదనజ్వా, లలు తాపేంధనవివర్ధలై విటులధనం
బుల వయసుల వేల్పఁగ నుం, డ్రలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా.
కశ్చుమ్బతికులపురుషో—
పలువురు విటు లానినమెం, గిలిబోటులు వారసతుల కెమ్మోవులు ము
ద్దులు గొనఁ గోరునె సత్కులు, డలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా.
మధుతిష్ఠతి వాచి యోషితాః—
పలుకుల సుధ యెద గరమిం, తుల కుండుంగాన మోవి నొక్కి యురోజం
బుల మర్దించెదరు రసికు, లలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౬౧

—: 3 దుర్విరక్తపద్ధతి :—

ధన్యాస్త ఏవ ధవళాయతలోచనానాం—
అలప్రాయపుఁజెలి త్రివళీ, కలితతనోదరము సోగకనులు బటువు గు
బ్బలుఁ గని కంపింపనివా, డలఘుఁడు వెల్లూరి వేంకటాచలరమణా. ౬౨
బాలే లీలాముకుళితం—
చెలిచూపు రోఁతగాఁ దలఁ, చిలఁ దృణముగఁ జూచు కోర్కె నివనివమతల్
దొలఁగు విరక్తుఁడు వేరై, యలవడు వెల్లూరి వేంకటాచలరమణా. ౬౩
ఇయం బాలామాం—
చెలిచూడ నేల మరుశర, ములతాపము శాంతమయ్యె మోహ ముడిగె న్యా
కులమేల యని విరక్తుం, డలరున్ వెల్లూరి వేంకటాచలరమణా. ౬౪

కిం కన్దర్పశరం—

హారభక్తులు కంపింతురె, తరుణులచూపులకుఁ బికరుతములకు మరుతా
మరములుకుల కళిటంకృతి, కరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా ౬౫

విరహాశోషిసజ్జనః ఖలు—

మనసుమనసుఁ గలసిన దృ,ష్ట్వన నుండిన విరహ మగునె పొందైనమనం
బెనయక యుండిన విరహం,బనవలె వెల్లూరి వేంకటాచలరమణా. ౬౬

కింగతేన యది సానజీవతి—

ఘనమును గని పాంథుఁ డచట, వనిత మరుశరహతనైన బ్రదికిన నిలయం
బున కరుగనేలయని యుం,డనుపుగ వెల్లూరి వేంకటాచలరమణా. ౬౭

విరమత బుధా యోషిత్సఙ్గాత్—

చెలిమి దయ సిగ్గునను స్త్రీ,ల్గలుగఁ దిరము గానిచెలి వలతురు తుదిన్వా
రలకటికుచములు గాచునె, యలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౬౮

యదా యోగాభ్యాసః—

మునులకు యోగాభ్యాసం, బునమనసాత్త్వగలయ సకిముచ్చట కుచమ
ర్దనచుంబనరతులేమిటి, కనుపుగ వెల్లూరి వేంకటాచలరమణా. ౬౯

యదాసీ దజ్ఞానం—

స్మరతమము గప్ప లోకము, తరుణీమయ మదె వివేకతత్త్వాంజనగో
చర మైనఁ బ్రహ్మమయం, బరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౭౦

తావదేవకృతినాం—

చెలి చూచినంతనే ని,ర్మలమైనవివేక మడిగి ప్రాజ్ఞుండైనం
జలియింపక పోవునె మన, సలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౭౧

వచసిభవతి సఙ్గత్యాగం—

వల దందురు సంగము స్త్రీ, ష్టలు మణికాంచికలాపశోభితజఘన
స్థలు లగుకాంతలఁ జూయగ, నలవియె వెల్లూరి వేంకటాచలరమణా. ౭౨

సపరప్రతారకోసా—

లలనల నిందింతురె కే, వలపండితు లధ్వరముల ఫలములమూలం
బులు దివ్యాంగనలే కద, యలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౭౩

మత్తేభకుమ్భదళనే—

మారిని మదకరిని గెలుతురు, స్మరగర్వం బణఁచువారు జగతిఁగలరె వ

ల్లజు శూరులు వినఁ జెప్పెద, నరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౨౪

సన్మార్గే తావదాస్తే—

లలనాభ్రూచాపచ్యుత, ములయిన దృక్శరము లంటఁ బోవు మనోని
శ్చలము తపము శీలము నయ, మలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౨౫

ఉన్మత్తప్రేమసంరమ్భాః—

ఇల నున్మత్తప్రేముల, నలరుచెలు లొనర్చు క్రియల నబ్జజుఁడైనం
దొలఁగింపఁ డనిన నితరుల, కలవియె వెల్లూరి వేంకటాచలరమణా. ౨౬

తావన్మహత్త్వం పాణ్డిత్యం—

మనసిజశిఖి తను వెనసిన, దనుక వివేకము కులీనతయుఁ బాండిత్యం
బును మాహాత్మ్య మవలతే, దనవలె వెల్లూరి వేంకటాచలరమణా. ౨౭

శాస్త్రజ్ఞోపి ప్రగణితనయోపి—

నరకద్వారము తెలియఁగ, గఱితల కనుబొమలు కుంచికలని బుధులు కొం
దఱు పలికిరి సుగతివిధం, బరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౨౮

కృశః కాణః ఖఞ్జః—

వాలముఁ జెవులుఁ దెగి గళిక, పాలము ఖంజంబు చీకు వ్రణియగు శునము
లోలత రతికై తిరుగు ను, నాలక వెల్లూరి వేంకటాచలరమణా. ౨౯

స్త్రీముద్రాం కుసుమాయుధస్య—

సకలార్థదల స్త్రీముద్రల, సకియుల విడచిన జనులను స్మరుఁడు జటిలన
గ్నక కాపాలికులుగఁ జ, ల్పకటా వెల్లూరి వేంకటాచలరమణా. ౩౦

విశ్వామిత్ర పరాశర ప్రభృతయః—

మరుదంబుదళాశ పరా, శరము ఖ లతివలకు బ్రమయ శాల్యోదనభు
జ్నరు లెంత వనధిఁ దేలునె, హరగిరి వెల్లూరి వేంకటాచలరమణా. ౩౧

—॥ ఋతువర్ణనపద్ధతి ॥—

పరిమళభృతోవాతాః—

అలరులఁ బికరుతములఁ గుజ, ములు వలపుల గాడుపులను బూఁబోణుల మో
ములుఁ గని వసంతమును మద, మలరును వెల్లూరి వేంకటాచలరమణా.

మధు రయం మధురైః—

విరహులఁ గలఁచు వసంతపు, పరభృతరుతములు మలయపవనమాపదల
నరులకు సుధ గరళం బగు, హరసఖ వెల్లూరి వేంకటాచలరమణా. ౩౩

# కాకినాడ పరిషత్కార్యాలయమున వెలకు దొరకు గ్రంథములు

| | | | | |
|---|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము - చదలువాడ మల్లయకవి | రు 0 | 8 | 0 |
| 2 | కవిజనాశ్రయము - వేములవాడ భీమకవి ... | 0 | 10 | 0 |
| 3 | చంపూరామాయణము - ఋగ్వేదికవి వేంకటాచలపతికవి ... | 1 | 0 | 0 |
| 4 | నీతిసీసపద్యశతకము - తాళ్లపాక పెదతిరుమలార్యుడు ... | 0 | 2 | 0 |
| 5 | జ్యోతిశ్శాస్త్రసారము శ్రీమాన్ కపిస్థలం కృష్ణమాచార్యులుగారు బి ఏ., యల్. టి ... | 0 | 8 | 0 |
| 6 | జ్ఞానప్రసూనాంబికాశతకము - శిష్టు సర్వశాస్త్రికవి ... | 0 | 2 | 0 |
| 7 | సర్వేశ్వరశతకము - యథావాక్కుల అన్నమయ్యగారు ... | 0 | 3 | 0 |
| 8 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము - జ. రామయ్యపంతులు గారు, బి ఏ, బి ఎల్. ... | 0 | 8 | 0 |
| 9 | కావ్యాలంకారచూడామణి - విన్నకోట పెద్దయకవి | 0 | 8 | 0 |
| 10 | చంద్రభానుచరిత్రము - తరిగొప్పుల మల్లనకవి ... | 1 | 0 | 0 |
| 11 | అకారాద్యముద్రిత గ్రంథసూచిక ... | 0 | 8 | 0 |
| 12 | ప్రాకృతభాషోత్పత్తి - శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ... | 0 | 12 | 0 |
| 13 | శివతత్త్వసారము - మల్లికార్జున పండితారాధ్యులు . | 0 | 12 | 0 |
| 14 | Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు బి ఏ, బి. ఎల్. ... | 0 | 8 | 0 |
| 15 | శివరాత్రిమాహాత్మ్యము - శ్రీనాథమహాకవి ... | 0 | 12 | 0 |
| 16 | ఆర్యభాషావిభాగము - శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ... | 0 | 8 | 0 |
| 17 | Dravidian Lexicography .. | 0 | 4 | 0 |
| 18 | హాస్యరంగములు - కొత్తపల్లి సూర్యరావు .. | 0 | 8 | 0 |
| 19 | నారసింహపురాణము ఉత్తరభాగము - హరిభట్టు .. | 1 | 0 | 0 |
| 20 | మన్నారుదాస విలాసనాటకము — రంగాజమ్మ. .. | 0 | 8 | 0 |
| 21 | జైమినిభారతము - వచనము - వేంకటకృష్ణప్పనాయకుడు ... | 0 | 12 | 0 |
| 2 | శాలి దీకవ్యాకరణము (మొదటిభాగము) ఉపహారోబలకవి | 1 | 0 | 0 |

Printed by M. Rangiah at the Cocanada Printing Works, Cocanada